# విజ్ఞాపనము

---

ఈగ్రంథరచనము శ్రీ విక్రమనామ సంవత్సర [illegible] దశమినాటికిఁ బూర్తియయ్యెను. తర్వాతఁ గొన్నినెలలలోనే వ్రాతప్రతిని ముద్రణార్థము శ్రీవాయునందన ప్రెస్సువారి చేతికందించితిని.

ఘోరసంగ్రామ ఫలముగాఁ కాగితములుగాని, ముద్రణసామగ్రిగాని, దొరుకుట మహాదుర్లభమాయెను. ప్రెస్సువారు ఎట్లో శ్రమపడి కాగితములు మున్నగువానిని కొంతకుఁ గొంత సంపాదించుచు ముద్రణంబును గొనసాగించుచు తే 7-12-46 ది నాటికి 500 ప్రతులను మాత్రమే ముద్రింపఁ గలిగిరి.

ఈముద్రణమునందుఁ బెక్కుస్ఖాలిత్యంబులు గానవచ్చుచున్నవి. వాని సవరణపట్టిని ముద్రించుటకై కాగితములు దొరకనందున సవరణపట్టిని ముద్రింపక వదలవలసివచ్చెను.

గ్రంథ ముద్రణ భారమునేగాక ప్రూఫ్ చూచు భారమునుగూడా శ్రీ వాయునందన ప్రెస్సువారే వహించి యీగ్రంథము వెలువడఁజేసినందులకు వారికిఁ గృతజ్ఞతాభివందనములను సమర్పించుచున్నాను.

కావలి,
25-4-1947.

ఇట్లు,
దొడ్లా వేంకటరామరెడ్డి.

సీ. అర్ధాంగి యనుమాట యందదుకులటంచు
సామేనుగూడ నొసంగినావు
అమృతంపు జీవులై యాత్మజుల్ వెలయంగ
తఱిపాలతో భక్తిఁ ద్రాపినావు
కారుణ్యచిత్తంబె కడకేలఁ బెరవంచుఁ
గ్రించుఁదనంబుఁ ద్యజించినావు
పార్వతీ పరమేశ పాదాబ్జసేవచే
యుడిగొని కల్మిగాఁ బడసినావు.

గీ. సహన సంపత్తి మీఱ సంసారభరము
ముప్పదియు నాలువర్షముల్ మోసినావు
పతికృతజ్ఞతా ప్రేమ కల్పక ఫలంబు
ఆదిలక్ష్మాంబ! యీకృతినందికొమ్ము.

---

గీతాంశము.

ధర్మస్థాపన ఖండము

## ఉపదేశ ఖండము.

సమాప్తము.



## శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

సత్యం జ్ఞాన మనంత మేక మజరం నిత్యం విభుం శాశ్వతం,
ప్రత్యగ్బ్రహ్మగణాయనం సుఖఘనం పూర్ణం పరంపావనమ్,
స్వాత్మజ్యోతి రనాదిమధ్యనిధనం మాయావిలాసై ర్మహు,
ర్విశ్వాకార మపాస్తమాయ మద్వయం వందే విశుద్ధం పరమ్.

యం శైవా స్సముపాసతే శివఇతి, బ్రహ్మేతి వేదాంతినః,
బౌద్ధాః బుద్ధఇతి ప్రమాణపటవః, కర్తేతి నైయాయికాః,
అర్హన్నిత్యథ జైనశాసనరతాః, కర్మేతి మీమాంసకాః,
సోఽయం నో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో హరిః॥

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ,
రుచీనాం వైచిత్ర్యా దృజు కుటిలనానాపథజుషాం,
నృణామేకో గమ్య స్త్వమసి పయసా మర్ణవ ఇవ॥

నమో నేదిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయ చ నమో,
నమః క్షోదిష్ఠాయ స్మరహర మహిష్ఠాయ చ నమః,
నమో వర్షిష్ఠాయ త్రినయన యవిష్ఠాయ చ నమః,
నమః సర్వస్మై తే తదిదమితి సర్వాయం చ నమః॥

బహుళరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమః,
ప్రబలతమసే తత్సంహారే హరాయ నమోనమః,
జనసుఖకృతే సత్త్వోద్రిక్తౌ మృడాయ నమోనమః,
ప్రమహసిపదే నిస్త్రైగుణ్యే శివాయ నమోనమః॥

# అవతారిక

శ్రీకృష్ణభగవానుఁడు కలియుగారంభమునకుఁ బూర్వము నూఁటయిరువదియెనిమిదేండ్లనాఁడు జనించి కలియుగారంభమున శరీరత్యాగముఁ గావించినట్లు పురాణంబులు తెలుపుచున్నది. ఈ పురాణవచనంబును బట్టి శ్రీకృష్ణజననము నేటికి 5168 సంవత్సరంబులనాఁడని యేర్పడును. అయినను వానిజనసంబంధులఁ గూర్చి నానామతంబులు నాఁడెట్లో నేఁడునట్లే గలవు. శ్రీకృష్ణుఁడు లోకసంగ్రహార్థమై యవతరించిన భగవానుఁడని కొందఱును, మహాయోగేశ్వరుఁడని కొందఱును, అలౌకికప్రతిభాశాలి యైనరాజమాత్రుండని కొందఱును బల్కుదురు. మహేంద్రజాలకుండనియు కేవల కల్పితమూర్తి యనియు వానిని మఱికొందఱు భావింతురు. ఇట్లు నానామతంబులకు మూలమై లోకంబునెల్లఁ దీఱనిభ్రాంతిలో ముంచుచున్న యీమూర్తిసంగతి యేమో యెఱుంగుకుతూహలము జనింపక మానదు.

శ్రీకృష్ణచరిత్రనుగూర్చిన ప్రత్యేక గ్రంథము గానరాదు. వాని జీవితంబును బురాణంబులనుండియు, ఇతిహాసంబులనుండియు నుద్ధరింపనగు. అవియు సమగ్రంబులు గావు. పురాణంబులలో విష్ణుపురాణంబు మొదటిదనియుఁ బ్రమాణభూతమనియు నంగీకరించిరి. అది విష్ణ్వవతారంబులనెల్ల సంగ్రహంబుగా సూచించుచున్నది. ఏయవతారచరిత్రయు సమగ్రంబుగా దానివలన దెలియరాదు. హరివంశంబునట్టిదిగానే యున్నది. శ్రీకృష్ణచరిత్రను గొంతకు గొంత యెఱుంగవలయునన్న భాగవత భారతంబులే శరణంబులు.

అందు భాగవతంబు శ్రీకృష్ణలీలాఖండంబును భారతంబు ధర్మస్థాపనఖండంబును బ్రతిపాదించును.

శ్రీకృష్ణలీలలనుగూర్చి భాగవతంబు చెప్పినట్లుగా నితర గ్రంథంబులు చెప్పవు. ఇట్టి పరస్పరవిరుద్ధాంశంబుల నాధారంబుగాఁగొని భాగవతంబు ప్రమాణగ్రంథము గాదని కొందఱు వాదింతురు. అంతియగాదు. భాగవతము వ్యాసరచితమే గాదనియు, దానిని బోపదేవుఁడు పదమూఁడవ శతాబ్దమందు, అనఁగా నిప్పటికి 700 సంవత్సరంబులనాఁడు రచించెననియు, సత్యమునకన్న కవితాచాతుర్యమే ప్రధానముగా నతఁడు గ్రహించి యీ గ్రంథంబును వ్రాసెననియు, ఆకారణంబున శ్రీకృష్ణచరిత్ర యథారూపము మాఱి యౌచిత్యదూరమై యసంభావనావిపరీతభావంబులకు నాస్పదమగుచు భగవదవతారంబునకే కళంకముఁ గలిగించుచున్నదనియు నవనాగరకులు వాదించుచున్నారు. భాగవతమందలి రాసక్రీడలు 16 వ శతాబ్దంబునఁ బ్రక్షిప్తంబులయ్యెనని మఱికొందఱు ఊహింతురు.

వ్యాసమహర్షి శ్రీనారదోపదేశప్రకారము భాగవతంబున దనజీవితసాఫల్యగ్రంథముగా రచించితినని ఘంటాపథంబుగా సూచించెను. వ్యాసుఁడు శ్రీకృష్ణునకు సమకాలికుఁడు. శ్రీకృష్ణనిర్యాణముతోడఁ గలియుగంబు ప్రారంభమయ్యెను. భాగవతంబునందు శ్రీకృష్ణనిర్యాయణప్రశంసయుఁ గలదు గావున నద్గ్రంథమును వ్యాసుఁడు కృష్ణనిర్యాణానంతరమే రచించెననక తప్పదు. వ్యాసుఁడు భారతంబును గూడ రచించెను గాని, అందు శ్రీకృష్ణశైశవప్రశంసాదులకు నవకాశము గలుగమింజేసి తత్పూరణార్థము భాగవతంబు ప్రణీతమయ్యెను.

వ్యాసుఁడు మహర్షియు, బహు[illegible]థకర్తయు గావున నౌచిత్య మెట్టిదో వానికి స్పష్టము. మఱియు శ్రీకృష్ణుని మర్త్యమాత్రునిగా వర్ణింపక లోకోద్ధారణార్థమై యవతరించిన పరమాత్ముని గా వర్ణించెను. అట్టివానిని వ్యాసుఁడంతటివాఁడు ఔచిత్యభంగనిదర్శనప్రాయునిగా వర్ణింపఁడు. కాఁబట్టి సామాన్యదృష్టికి హేయంబులుగాఁ దోఁచు రాసక్రీడాదులు భావగర్భితంబులుగా నున్నవని గ్రహింపఁదగును.

వ్యాసుఁడు భాగవతంబును రచించి తనపుత్రుఁడైన శుకునకు గఱపెను. శుకమహర్షి పరిక్షిన్మహారాజునకు సమకాలికుఁడు. పరిక్షిత్తు కలియుగారంభంబున రాజుగానుండి ఋషిశాపహతుఁడై చావునిరీక్షించుచు మహావ్యాకులముతో నుండగా వానికి మనశ్శాంతిఁ గూర్చుటకై శుకమహర్షి భాగవతంబును వినిపించెను. కావున భాగవతంబు కొందఱుభావించునట్లుగా 13 వ శతాబ్దిదిగాదనియు, అది బోపదేవునికృతము గాదనియు స్పష్టము. మఱియు భాగవతంబు 13 వ శతాబ్దిగాదనుటకు మఱికొన్ని ప్రమాణంబులు గలవు.

(1) కలియుగానంతరము ముప్పదిసంవత్సరంబులకు భాద్రపద నవమి మొదలు భాగవతంబును బరిక్షిత్తునకు శుకమహర్షి బోధించెననియు,

(2) కలియుగానంతరము 230 సంవత్సరంబులనాఁడు ఆషాఢ శుద్ధనవమి మొదలు సప్తాహకాలంబున దుంధుకలికి గోకర్ణుఁడు భాగవతంబును బోధించెననియు,

(3) కలియుగంబారంభమైన తర్వాత 260 సంవత్సరంబులకు సనత్కుమారుఁడు నారదునకు భాగవతంబును విని

పించెననియుఁ బద్మపురాణము తెలుపుచున్నది. 5040 సంవత్సరంబులనాటి కలియుగప్రారంభమెక్కడనో నేటికి నేఁడు వందల సంవత్సరంబులనాటి బోపదేవుఁడెక్కడనో యూహింపనగును.

ఇఁక బోపదేవునిసంగతి విచారింతము. మహాదేవుఁడను పేరి యాదవరాజు దేవగిరిని క్రీస్తు. వెనుక 1260 మొదలు 1271 వఱకుఁ బరిపాలించెను. వాని తర్వాత రామచంద్రుఁడను యాదవరాజు 1271 మొదలు 1309 వఱకు దేవగిరి నేలెను. ఆరాజులిద్దఱకు హేమాద్రి మంత్రిగానుండెను. హేమాద్రికిఁ బ్రియముఁ గూర్చువాడై బోపదేవుఁడు పెక్కు గ్రంథములు రచించెను. అందు భాగవతతత్త్వంబును గూర్చిన గ్రంథములు "పరమహంసప్రియము, హరిలీలామృతము, ముక్తాఫలము" అనునవి మూఁడు గలవు. ముక్తాఫలంబునకు హేమాద్రి వ్యాఖ్య రచించెను.

హరిలీలామృతంబునకు భాగవతానుక్రమణిక అను నామాంతరము గలదు. శ్రీధరస్వామి తానురచించిన భాగవతమంజిరియందు భాగవతసారంబు నెట్లు గూర్చెనో, అట్లే బోపదేవుఁడు గూడ హరిలీలామృతమనుపేర భాగవతసారంబును రచించెను. ఆగ్రంథమును గాంచి, అది భాగవతకథకు నొకవిధమైన యనుక్రమణికగా నుండుట చేతను దానిని బోపదేవుఁడు రచించుటచేతను, అతఁడే భాగవతంబును రచించెనని యూహింతురు.

ద్వైతమతప్రతిష్ఠాపకులైన శ్రీ మధ్వాచార్యులవారు భాగవతంబునకు 'తాత్పర్యనిర్ణయ' మనువ్యాఖ్యను రచించిరి. వారు క్రీసు. వె. 1118 మొదలు 1198 వఱకు నుండినట్లు

వారిజీవితచరిత్రవలన నేర్పడుచున్నది. అనఁగా (శ్రీ)మధ్వా చార్యులు 12వ శతాబ్ది వాఁడు. ఆయన 13వ శతాబ్ద ప్రారంభ మునకుఁ బూర్వమే పరమపదమొందెను. బోపదేవుఁడు 13 వ శతాబ్దము సగముచన్నతర్వాతఁ బుట్టెను. 13 వ శతాబ్దిలోని బోపదేవుఁడు భాగవతంబును రచించియున్నచో తత్పూర్వమే గతించిన మధ్వాచార్యులు దానికి వ్యాఖ్య వ్రాయుట యెట్లు సంభవించును? మఱియు భాగవతంబునకు వ్యాఖ్యలను శ్రీ హనుమానుఁడు, శంకరాచార్యుఁడు, చిత్సుఖాచార్యుఁడు రచించియున్నట్లు మధ్వాచార్యులు తనవ్యాఖ్యలోఁ బల్కరించెను. మధ్వాచార్యునకుఁ దర్వాతివాఁడైన బోపదేవుఁడు భాగవతకర్తయైనచో మధ్వాచార్యునకుఁ బూర్వులైన హనుమానుఁడు మున్నగువారు దానికి వ్యాఖ్యలు రచింప నెట్లు సాధ్యమగును? ఇదియునుగాక మధ్వాచార్యులు తనగీతా భాష్యమందు భాగవతంబును బంచమవేదంబుగా సూచించుచు నందలి నారాయణాష్టకాక్షరకల్పమునుండి ప్రమాణంబు గ్రహించెను. భాగవతకర్త బోపదేవుఁడగునేని ఇది యెట్లు పొసఁగు?

శ్రీరామానుజాచార్యులవారు మధ్వాచార్యులకన్న 250 సంవత్సరములు పూర్వముండిరి. వారు తనవేదాంతసారతత్త్వ మను గ్రంథమందు భాగవతంబునుండి విరివిగాఁ బ్రమాణం బుల గ్రహించిరి.

భాగవతవ్యాఖ్యాతలలో శ్రీధరస్వామి యొకఁడని తన భాగవతవ్యాఖ్యలో హేమాద్రి పల్కరించెను. శ్రీధర స్వామి తనవిష్ణుపురాణవ్యాఖ్యలో చిత్సుఖాచార్యుని పేర్కొనెను. దీనింబట్టి బోపదేవునికన్న శ్రీధరుఁడను వానికన్న చిత్సుఖాచార్యులును బూర్వులని స్పష్టము.

చిత్సుఖాచార్యులు శంకరునకుఁదర్వాత మూఁడవ యాచార్యుఁడనిరి. శంకరాచార్యులు క్రీ. వె. 5 వ శతాబ్ది వాఁడని నవీనులు కొందఱు నిర్ణయించిరి. శంకరుఁడు క్రీస్తువు నకుఁ బూర్వము వాఁడగునట్లు వాని గ్రంథములు తెలుపుచున్న వని కొందఱు వచింతురు. నవీనుల మతము నంగీకరించినను శంకరుఁడు 5 వ శతాబ్దివాఁడగును. శంకరునకు శ్రీ గోవింద పాదులవారు గురువులు. వారికి శ్రీగౌడపాదాచార్యులవారు గురువులు. కాఁబట్టి శ్రీ గౌడపాదాచార్యులవారు నాల్గవ శతాబ్దివాఁడనుట నిర్వివాదాంశము.

శ్రీ గౌడపాదాచార్యులు వారి 'పంచీకరణ' మందును 'ఉత్తరగీతావ్యాఖ్య'లోను భాగవతశ్లోకంబుల నుదాహరించిరి. మఱియువారు రచించిన మాండూక్యోపనిషత్కారికలను భాగవతంబు నాధారంబుగాఁగొనియే రచించిరి. అప్పటికే భాగవతంబు ప్రచారంబులోనున్నదని యిందువలన స్పష్టము.

పైవివరంబులను బట్టిభాగవతంబు 13 వ శతాబ్దివాఁడైన బోపదేవుఁడు రచించెననుట ప్రమాదమనియు, దానినివ్యాస మహర్షి కలియుగారంభమున రచించెననియుస్పష్టమగును.

శ్రీ కృష్ణజీవితరచనకు సాధనసంపత్తి యిట్టిదైయున్నది. అసమగ్రంబులైన యిట్టి యుపకరణంబులతో లోకపూజ్యుఁడైన శ్రీకృష్ణుని చరిత్రను స్వస్వరూపంబునఁ దెలుపుటగాని తెలియుటగాని దురాశయగు. అయినను గన్నంత విన్నంత శాస్త్రదృష్టిచేతను విచారదృష్టిచేతను విమర్శించి తేలిన నిగ్గునకు రూపంబుఁదీర్చి యాంధ్రలోకంబునకు సమర్పింపఁద లంచితిని. నా యీ సాహసంబును మన్నింతురుగాక.

---



# శ్రీ కృష్ణ చరితము

## లీ లా ఖ ం డ ము.

### భూదేవి విలాపము.

ద్వాపరయుగాంతము సమీపించెను. రాజులు దంభమానవశులై నీతినియమంబులు వదలి విచ్చలవిడి వ్యవహరింపసాగిరి. ఆజ్ఞలేమింజేసి ప్రవృత్తినివృత్తులు హద్దుమీఱెను. ధర్మము సన్నగిల్లెను, అధర్మము దేశమెల్ల నాక్రమించెను. తత్ఫలముగా భూభారము మోయరాని దయ్యెను.

భూదేవి యాదురవస్థ నోర్వలేక బ్రహ్మయొద్దకుఁ జని 'మహాత్మా! రాజు లహంకారపూరితులై స్వార్థభోగలాలసులైరి. సత్య మందందుఁ దారాడుచున్నది. దయాదాక్షిణ్యంబులు స్రుక్కెను. బలవంతులదే లోకమయ్యెను. బీదసాదలు గోడుగోడుమనుచున్నారు. ఈదుష్టులభారము నాకు దుర్భరమగుచున్నది. యుగయుగాంతరంబుల నాకిట్టి దుర్వ్యసనంబు దాపరించుచున్నదేగాని యొకనాటికిఁ దీఱునట్లు దోఁచదు. లోకకర్తవు నీవుండియు నీసృష్టి యిట్లగుటకుఁ గారణంబూహింపరాదు. దీనవత్సలా! నాయెడఁ గరుణింపవేని నేను నిలువఁజాల' నని దుఃఖాలాపంబులు గావించెను.

పరమేష్ఠి యవ్వార్తాలాపంబులు విని 'దేవీ! వగవ వలదు. ప్రకృతలోకగతికి నాయుపేక్షయే కారణంబని నీవు తలంచుచున్నావు. అదినిజముగాదు. సృష్టియెల్లఁ ద్రిగుణ కార్యమైయున్నది. గుణంబు లప్పుడప్పుడు స్వధర్మనిబద్ధంబు లుగాక విజృంభించుచుండును. అది వానిస్వభావము. ఎల్ల యనర్థంబులకు రజస్తమస్సుల విజృంభణము కారణమగును. వానికిఁ గట్టుఁబాట్లు గలుగదా యని యందువుగాఁబోలు. కట్టుఁబాట్లుగలవు. కాలవశంబున నవి సడలుచుండు. అవి సడలినంతనే కామాంధకారంబు లోకంబును గప్పివైచును. ఆ పెంజీఁకటఁబడి జనులు యథార్థజ్ఞానహీనులై యహితంబును హితంబుగా భావించి తదభీప్సిత సిద్ధికై ప్రాకులాడుదురు. ఇట్టిముప్పుగలిగినప్పుడు శ్రీమన్నారాయణుఁడు అవతరించి సంస్కరించుచుండు. సృష్టిచక్రము తిరుగుపర్యంతము లోపసంస్కారంబులు తప్పవు. సృష్టికి నదినైజము గావున దీనిని నీవు సహింపవలయును. ఇందులకు వగచియు ఫలములేదు.' అని పలికి యామెను వెంటఁగొని నిర్జరాదులతోడ క్షీరసాగరంబు నకుఁజని శ్రీమహావిష్ణువును బురుషసూక్తంబున స్తుతించి తద్ధ్యానైకచిత్తుఁడై సమాధ్యవస్థఁ గాంచెను.

విష్ణువును బ్రహ్మకుఁ బ్రసన్నుఁడై 'పరమేష్ఠీ! మీ వచ్చినకార్యము నేను మున్నె యెఱుఁగుదు. భూభారంబు నుడుపుటకై నేను గోకులమందు వసుదేవునకు జనింపనున్నాను. సురలు వారి యంశంబుల యాదవులై పుట్టనగు. దేవకన్యకలు గోపికలై జనించి నాకుఁ దోడ్పడనగు' నని తెలిపెను. పితామహుఁ డంతట ప్ర్యత్థానుఁడై భగవదాజ్ఞను వారికిఁ దెలిపి

జూగునవలదనెను. అంతట వారు విష్ణువుకు శ్రేనోళ్లనుగ్గడించి స్వస్థానంబులకుఁ జనిరి.

### ఆర్యావర్తము.

హిమాచల వింధ్యపర్వతంబులకును దూర్పు పడమటి సముద్రంబులకును మధ్యనున్న దేశంబును ఆర్యావర్తమందురు. ఆర్యు లాక్రమించిన దేశంబుకావున దానికట్టి పేరుగలిగెను. ఆర్యులెవరో ఎందుండివచ్చిరో యను సంశయంబుల గూర్చి భిన్న భిన్న మతములు గలవు.

ఆర్యులందందుఁ జిఱురాజ్యంబులు స్థాపించి పరిపాలింప సాగిరి. అట్టిరాజులలోఁ గొందఱను సూర్యవంశరాజులనియుఁ గొందఱను చంద్రవంశరాజులనియుఁ బేర్కొనిరి. ఆవంశంబులకు సూర్యచంద్రులు మూలపురుషులగుటంజేసి యాపేర్లు వచ్చెనందురు.

### యదువంశము.

చంద్రవంశరాజులకుఁ జంద్రుఁడు మూలపురుషుఁడు. వానికి బుధుఁడును, వానికి ఇలుఁడును, వానికిఁ బురూరవుఁడును, వానికి ఆయువును, వానికి నహుషుఁడును, వానికి యయాతియు జనించిరి. యయాతికి దేవయానివలన యదువు, తుర్వసుఁడును, శర్మిష్ఠవలన ద్రుహ్యువు, అనుఁడు, పూరువు అనువారును గల్గిరి.

యదువునకు సహస్రజిత్తు మున్నగు కొడుకులు నల్గురు గలిగిరి. సహస్రజిత్తునకు శతజిత్తు, వానికి హేహయాదులు గల్గిరి. హేహయునకు ధర్ముఁడు, వానికిఁ గుంతి, వానికి సౌభంజి, వానికి మహిష్మంతుఁడు, వానికి భద్రసేనుఁడు, వానికి

దుర్మదుఁడు, వానికి ధనకుఁడు, ధనికునకు కృతవీర్యాదులు నల్గురు గల్గిరి. అందు కృతవీర్యునకు అర్జునుఁడు (కార్తవీర్యార్జునుఁడు,) గలిగెను. వానికి వేయిమందిసుతులు జనించిరి. వారిలోఁ బెక్కండ్రుగురు పరశురామునివలన హతులైరి. జయధ్వజాదులేవురుమాత్రము శేషించిరి. జయధ్వజునకుఁ దాళజంఘుఁడు జనించెను. వానికి వేయిమందితనయులు గల్గిరి. వారిలో జ్యేష్ఠుఁడైన వీతిహోత్రునకు వృష్ణుఁడును, వానికి మధువును జనించెను. మధువునకు వృష్ణి మొదలైనవారు నూర్గురు పుట్టిరి. మధుసంతానమగుటంజేసి వారిని మాధవులనియు, మూల పూరుషుఁడైన యదువునుబట్టి యాదవులనియుఁ బేర్కొనిరి. వృష్ణివంశజాతులను వృష్ణులనిరి.

మధువునకునఱువదియైదవ తరమువాఁడు శూరసేనుఁడు ద్వాపరయుగాంతంబున యమునాతీరంబుల నాక్రమించి రాజ్యముస్థాపించెను. శూరసేనస్థాపితంబగుటఁజేసి యారాజ్యంబును శూరసేనకమనిరి. దానికి మధుర ముఖ్యపట్టణమయ్యెను. ఆకారణంబునఁ దద్రాజ్యంబునకు మధురరాజ్యంబనియు నామాంతరము గలిగెను.

## మధురరాజ్యము.

మధురరాజ్యమందు యదుభోజాంధక కురర సాత్వత దశార్హ వృష్ణివంశ్యులు ప్రాయకముగా వసించుచుండిరి. వారికి గోవులే ధనముగా గోరక్షణమే వృత్తిగా గోక్షీరాదులే రసవత్తరమైన యాహారంబుగా నుండెను. ఆహారము రసవత్తరంబగుటవలన వారెల్లరు బలోన్నతులైయుండిరి. వారినిబట్టి యారాజ్యము బలపరాక్రమోన్నతులఁ బ్రసిద్ధికెక్కెను.

మథురనగరంబునంటి యమునానది ప్రవహించుచుఁ దన్నగరలక్ష్మీపాద పద్మంబులఁ గడుగుచున్నదో యననుండును. ఆనగరంబు నలువైపులఁ బచ్చికబయళ్లు చూపుమేరదూరము వఱచి తన్నగరలక్ష్మి కట్టుపచ్చపట్టుపుట్టంబు నాఱవైచిరో యన నొప్పారెను. ఆబయళ్లలో నందందు వెలయు చిఱుపల్లెలును శృంగార వనంబులును నేత్రోత్సవంబుఁ గూర్చుచుండెను. మఱియు మథురనుండి నాల్గుదెసలకు నాల్గురాజమార్గంబులు వఱచి యుద్ధవీరరథంబుల రాకపోకలతో నడగొండలఁబోనిగజంబులతో లొట్టియబిడారములతోఁ గ్రిక్కిరిసి పట్టణశ్రీవిలాసంబును బ్రకటించుచుండెను.

## బృందావనము.

మథురనగరంబునకుఁ బశ్చిమభాగంబున బృందావనము గలదు. ఆవనము వకుళ కదంబ తమాలాది మహోన్నత వృక్షంబులతో వివిధలతాగృహంబులతోఁ బూఁబొదలతో మనోహరమై శుకపికాదిమధుర రుతంబుల వీనులకు విందుచేయుచు నుండెను. బృందావనమధ్యదేశంబున గోవర్ధనపర్వతంబు తద్వనలక్ష్మికిఁగా నెత్తినగొడుగో యన విరాజిల్లుచుండును. అంచలి వనవాటికలు దట్టంబులై యిరులుగప్పుచుండుటఁ జేసి హరిణద్వీపాదిమృగసంచార శోభితంబులయ్యెను. అయినను బృందావనము శూరసేనదేశమందలి యన్యవనంబులవలెఁ గీకారణ్యమయము గాదుగావున నయ్యది ఘోరమృగభయరహితమై విహారయోగ్యమై ప్రసిద్ధిఁ గాంచెను.

## నాగులు.

శూరసేనరాజ్యస్థాపనంబునకుఁ బూర్వము బృందావనా

రణ్యంబునందు నాగులనువారుండిరి. వా రార్యులంత నాగరి కులు గాకున్నను కేవలవన్యప్రాయులుగాక యథోచితంబుగా రాజ్యాంగవిధానంబును సాంఘికమతసబంధనంబులును గలిగి యుండిరి. వారు నాగసర్పంబులఁ బూజింతురనియు, ఆకార ణంబున వారిని నాగులనిరనియుఁ జెప్పుదురు. నాగపూజ వారియందేగాక యార్యజాతులందుఁ నేటిదనుక గలదనియు, నగశబ్దము వృక్షపర్వతంబులకుఁ గూడ నన్వయించు ననియు, వారు నగమయప్రదేశంబులందు వసించుటఁజేసి వారిని నాగు లనిరనియుఁ గొందఱూహింతురు. నగమయప్రదేశంబులందు వసించుజాతులు పెక్కుగలవనియు, వారినెల్ల నాగులనుట లేదనియు ప్రధానపూరుషునిఁబట్టి సంయుతము వంశనామము గలుగుచుండుట సాంప్రదాయము గావున నాగుఁడను ప్రధాన వ్యక్తినిఁ బట్టి వారికి నాగులను పేరువచ్చెననియు మఱికొందఱు భావింతురు.

శూరసేనకరాజ్యస్థాపనకాలంబున నాగులకును వృష్ణి రాజులకును బెనుపోరాటంబులు జరిగెను. నాగులు తుదకు విజితులై స్వాతంత్ర్యముఁ గోల్పోయి వలసవచ్చి బృందావనా రణ్యంబులు పట్టి కాలగతికిఁ గట్టుపడి వృష్ణిరాజులకుఁ గప్పం బులు చెల్లించుచు వారిరాజ్యంబులతోడ బేరసారంబులు సాగించుచునుండిరి. అయినను బగచిచ్చు వారిమెదఁ జల్లార దయ్యెను.

### గోపులు.

నాగులువలె గోపులనుజాతి మఱియొకటి యుండెను. గోరక్షణమే వృత్తి యగుటంజేసి వారికట్టి పేరువచ్చెను.

గోపులుగూడ స్వస్థానంబునుండి తరుమఁబడి వనాంతరంబులు పట్టి, పసభుగనగరపరిసర ప్రదేశంబులు పచ్చికబయళ్లతోఁ బల్లసనీవన్యవృక్షంబులతో నిండువాటినిసెలయేళ్లతో నిండి తమ గోగణంబునకు నివాసయోగ్యములగుటంజేసి యందుఁ జేరిరి. గోపులను ప్రజలనుటయుఁ గలదు. ఆకారణంబున వారు నివసించిన దేశము వ్రజపుదంబయ్యెను.

గోపులు సంసర్గబలపరాక్రమవంతులును బహుసంఖ్యా కులునై యుండియు సహజశాంతస్వభావులగుటంజేసి తమ వనాంతరగతికిఁ గారకులైన మధురరాజులతో వైరంబును పెంచక తలయొగ్గి వారికిఁ గప్పంబులు చెల్లించుచు తదాజ్ఞాబద్ధులై నెమ్మదిగాఁ గాలముఁ గడపసాగిరి.

### దేవకీజననము.

శూరసేనునియనంతరము వానివంశ్యులు పెక్కురు క్రమానుసారంబుగా మధురరాజ్యంబును బాలించిరి. వారిలో ఆహుకుఁడనువాఁ డొకడుండెను. వానికి నుగ్రసేనుఁడు, దేవకుఁడు అను పుత్త్రు లిద్దఱు గలిగిరి. ఉగ్రసేనుఁడు జ్యేష్ఠుఁ డగుట వానికి రాజ్యముఁగట్టిరి. వానికిఁ దొమ్మండ్రు గురు సుతులు నొకసుతయుఁ గలిగెను. ఆసుతులలోఁ గంసుఁడు జ్యేష్ఠుఁడు.

ఉగ్రసేనునకుఁ గంసుఁ డంగజాతుఁడు గాఁడనియు, ఉగ్రసేనుని భార్య కొండొకనాఁడు విహారార్థము వనాంతరం బునకుఁ జనెననియు, అచ్చట శౌభరాజు ద్రుమిళుఁడనువాఁ డామెను గామించెననియుఁ దత్ఫలంబుగాఁ గంసుఁడు పుట్టె ననియుఁ జెప్పుదురు.

దేవకునకు నల్వురు పుత్త్రులు ఏడ్వురు పుత్త్రికలు గలిగిరి. ఆపుత్త్రికలలోఁ గనిష్ఠను దేవకి యనిరి.

### వసుదేవజననము.

మధురరాజ్యమందు అంధకవంశ మొకటి యుండెనని చెప్పితిమి. అంధకునకు నల్వురుకుమారులు గలిగిరి. వారిలో భజమానుఁడు పెద్దవాఁడు. వానికి విదూరథుండును, వానికి శినియు, వానికి భోజుండును, వానికి హృదీకుండును, బుట్టిరి. హృదీకుఁడు ముగ్గురుకొడుకులఁ గాంచెను. అందు దేవమీఢుఁడు జ్యేష్ఠుఁడు: వానిని శూరుఁడనియు ననిరి. శూరునకు మారీషయను భార్యయందు బదుగురు కొడుకులును ఏవురు కూఁతులును జనియించిరి. పుత్త్రులలో వసుదేవుఁడు పెద్దవాఁడు; పుత్త్రికలలోఁ బృథయనునది జ్యేష్ఠురాలు.

### సంబంధ బాంధవ్యములు.

శూరునకుఁ గుంతియను మిత్త్రుండుండెను. వానికి సంతానము గలుగదు. అతఁడు తనయనపత్యదుఃఖంబునుండి వాయఁదలంచి శూరునిఁ గోరి పృథను తనపుత్త్రికనుగా స్వీకరించెను. కుంతిని గుంతిభోజుఁడనియు నందురు.

ఆకాలంబున మగధరాజ్యంబును జరాసంధుఁడనువాఁడు పరిపాలించుచుండెను. వానికి అస్తి, ప్రాప్తి, యను పుత్త్రికలిద్దఱు కలిగిరి. వారినిద్దఱను గంసుఁడు పెండ్లాడెను. పృథను కురుజాంగలరాజయిన పాండురాజు వివాహమయ్యెను. వసుదేవుని నాల్గవతోఁబుట్టువు (శ్రుతశ్రవ) యను దానిని చేదిరాజు

దముఘోషుఁడు పరిగ్రహించెను. ఆచేదిపట్టణమే యిప్పటి అలహాబాదు.

మధురరాజ్యం బంతపెద్దదిగాకున్నను దద్రాజులకును అనంతి మగధ కురు కరూశ కాకేయ విదర్భ విదేహ కోసలాది రాజులకును సంబంధ బాంధవ్యంబులు గలుగుటంజేసి యది మహాప్రశస్తిఁ గాంచెను.

### దేవకీవసుదేవుల వివాహము.

దేవకికిఁ బెండ్లియీడు వచ్చెను. ఆమెను వసుదేవుని కిచ్చి వివాహముచేయ నిశ్చయించిరి. అప్పటికి వసుదేవునకుఁ బౌరవి, రోహిణి, భద్ర, మదిర, ఇళ, మున్నగుభార్యలుండిరి. అట్లున్నను దేవకికిఁ దగువరుఁడు దొరకనందుననో మఱియేకారణంబుననో వసుదేవునకే యామెనిచ్చి పెండ్లిగావించిరి.

పెండ్లిపండుగలు యథావిధిఁ గడచెను. దేవకిని భర్తయింటికిఁ దరలించిరి. వధూవరులు సముచితసత్కారంబులంది రథంబు నారోహించిరి. భేరీనినదంబులును మురజధ్వనులును శంఖపటహనాదంబులును జడిగొని మ్రోసెను. అరణంబులైన రథంబులును మత్తమాతంగంబులును నానాజాతితురంగంబులును దాసీదాసజనంబును వస్త్రాభరణశకటంబులును బారులు తీఱెను. పురవీధు లిమ్ముచాలవయ్యెను. చెలియలిని మఱఁదిని సంతోషపెట్టుటకై కంసుఁడు సారథ్యము వహించి వాగెలు సడలించెను. జనసమ్మర్దమున రథము మెల్ల మెల్లగాఁ గదలెను. ఎల్లరు సంతోషపరవశులై యుండిరి.

### ఆకాశవాణి.

అంతలోన మేఘంబులు మింటఁ దటాలునఁ బఱచి రవి మండలంబుఁ గప్పెను; కాఱుచీఁకటు లావరించెను; ప్రలయ ఝంఝామారుతము వీఁచెను; మెంఢగాళిపరంపరలు లేచెను; పక్షులు వికృతారావంబులు గావించెను. ఎల్లరు నివ్వెఱఁగంది నిలిచిరి. రోదసీకుహరంబునుండి 'మందమతీ! కంసా! దేవకి యష్టమగర్భంబు నిన్ను హరించు' నను ధ్వని యుప్పతిల్లెను.

ఆధ్వనితోడ నెల్లరగుండియలు ఝల్లుమనెను; ఎచ్చటి వారచ్చట ఔచ్చపడి నిలిచిరి. కంసుఁడు క్రోధమూర్ఛితుఁడై వాగెలు బిగించి రథంబునిలిపి కత్తిగూసి కుప్పించి యెగసి దేవకిని శిరోజంబులఁబట్టి యీడ్చి యామెతలఁ దెగవేయ నుంకించెను. జనులు హాహాకారంబు లొనర్చిరి.

వసుదేవుఁ డది గాంచి తత్తఱమంది క్షణములోఁ దెటి 'రాజకుమారా! భోజవంశమునకు యశోబింబమవై శూరజన శ్లాఘ్యగుణసంపన్నుడవుగా నలరితివి. అట్టి నీవిట్టి శుభ సమయంబున నాడుదానిని దోఁబుట్టువును జంపఁదగునా? కంసా! చావుపుట్టువులు ప్రాణికోటికి సహజంబులు. అందులకు వెఱచి యిట్లు పలుకుట గాదు. నీయీయాయకార్యము నిన్ను పాపకూపంబునఁ ద్రోయనున్నది. నీభావిశుభంబును గోరుదుఁ గాన నిట్లు చెప్పుచున్నాను. కర్మంబునకు ఫలంబు తప్పదు. ఇఁకఁ గ్రూరకర్మము సంగతి చెప్పవలయునా? నామాట విని క్రౌర్యము మాని దయాదాక్షిణ్యపరుడవై యీయబలను రక్షింపుము' అని ప్రణయమధురంబుగాఁ బలికెను.

దేవకియు నంతలోనఁ జెప్పఁజెల్లి,

“ఉ:— అన్నవు నీవు చెల్లెలికి నక్కట! మాడలు సీరలిచ్చుటో,
మన్నన సేయుటో, మధురమంజులభాషల నాదరించుటో,
మిన్నుల మ్రోఁతలే నిజము మేలని చంపకు మన్న! నాఁడిగా
వన్న! సహింపు మన్న! తగదన్న! వధింపకుమన్న! వేఁడెదన్”

“మ:— చెలియల్ గన్నియ ముద్దరా లబల నీ సేమంబు చింతించుని
గ్మల, దీని బయలాడఁ మాటపనై మర్యాదఁ బోఁదట్టి స
త్కుల జాతుండవు పుణ్యమూర్తి వకటా! క్రోపంబు, పాపంబు, నె
చ్చెలి నోవహో! తెగ వ్రేయఁ బాడియగునే చింతింపు భోజశ్వరా!”

అని సామపూర్వకంబుగా బ్రణయంబులు పలికి వాని చరణంబుల వ్రాలెను. జనులెలుగెత్తి ‘కంసా! వలదు వలదు, పాపకార్యము వల’ దని మొఱలిడిరి. ఎవరెంత ప్రార్థించినను గంసుఁడు నిజోద్యమంబును మానునట్లు తోఁపకుండెను.

కంసునిమతము మాఱకుండుట వసుదేవుఁడు గ్రహించి ‘ముప్పును దప్పించుకొనుట యుక్తము. బ్రతికియున్న శుభముఁ బడయవచ్చు.’ నాకు దేవకీవలన బిడ్డలెప్పుడు గల్గుదురో చెప్పరాదు. అందాకఁ గంసుఁడు జీవించునని నిశ్చయమేమి? ఈశ్వరేచ్ఛ దురూహ్యము. మృత్యుముఖ గ్రస్తులెందరో బ్రతికిరి. చావుదప్పినన్నవారు తటాలునఁ జచ్చిరి. మహారణ్యమందు దవాగ్నిపుట్టినప్పు డేచెట్టు దగ్ధ మగునో యేచెట్టు నిల్చునో చెప్పఁ దరమా? చేరువనున్న చెట్టు చెక్కుచెదరకుండనగు, దవ్వుననున్న దరువు దగ్ధము కావచ్చు. అట్లే జీవులలో నెవ్వరు సాంతముందురో నట్ట నడుమనే నశింతురో తెలియనేరగు’. అని తలపోసి కృతనిశ్చ

యుఁడై 'కంసా! ఆకాశవాణిని వింటివిగదా? అది నమ్మితివి గదా? ఆపలుకును బట్టి నీకు దేవకివలన నపాయము లేదు గదా? దేవకీదేవియెనిమిదవ కాన్పు నిన్ను హరించునని యాకాశవాణి పల్కెనుగదా? దేవకినిఁ జంపుటేల? ఆమెకు జనించు బిడ్డలనెల్ల నీచేతనుంతు. నీయిచ్ఛ యొనర్పుము" అని జాలిగలుగ నుడివెను. వసుదేవుఁడు సత్యముఁజెప్పుఁడనుట కంసునకు స్పష్టము. వానివచనంబులు యుక్తియుక్తంబులుగాఁ దోఁచెను. కంసుని మనస్సు కొంచెము మెత్తపడెను. అతఁడు తనపూనికఁ జాలించి రథంబునుండి దుమికి నిజమందిర మార్గము పట్టెను.

అంతలోన మేఘంబులు విచ్చెను; సుడిగాడ్పులు శమించెను; రవికాంతి ప్రసరించెను. జనులు స్వస్థచిత్తులై వధూవరులను దీవించి మరలిరి. దేవకీవసుదేవులు నాటికిఁ జావు తప్పుటకు భగవంతుని గీర్తించి పయనము సాగించిరి.

* ఆకాశవాణింగూర్చి మనపురాణంబులే గాక యన్యదేశ గ్రంథంబులుగూడఁ దెలుపుచున్నవి. ఇట్టివి యద్భుతంబులగునే గాని యతిశయోక్తులుగావు. ఇంద్రియాతీతములైన రహస్యం బులు సృష్టిలో నెన్నోగలవు. పెద్ద లూహించియేసియెఱుం గనివి నేఁడునేఁడు మనకు స్వానుభవసిద్ధము లగుచున్నవి. వేయేల? ఇప్పుడింటింటనున్న 'రేడియో' యనునది యాకాశ వాణిగాక మఱేమగు?

ఆకాశము సర్వవ్యాపి; అదికలుగనిచోటు నింగినైనను భూగర్భములోనైనను దుదకు సముద్రాంతరమందైనను లేదు.

ధ్వని యేమూలఁబుట్టినను ఆకాశగతమగును. ఆకాశము సర్వ వ్యాపిగావున, అట్లాకాశగతమైన ధ్వని యాకాశమెల్ల వ్యాపించును. యోగులు తమయోగప్రభావంబున దానిని గ్రహింప నేర్తురు. పూర్వము యోగసాధ్యమైన దూరశ్రవణము నేఁడు యంత్రసాధ్యమై మాఱుమూలలుగూడ వ్యాపించెను.

శ్రీకృష్ణచరిత్రమం దెన్నోవింతలు గలవు. అవి మన యల్పబుద్ధికి నందనిమాత్రానే కల్పితంబులనియు ముక్కుఁడి పురాణవచనంబులనియుఁ ద్రోసివేయుట సమంజసముగాదు. శూన్యమునుండి భావము పుట్టదు. భాగవతమైనది యాకృతి నొందక మానదు. ఈతత్త్వరహస్యంబును గ్రహించి, భగవన్మహిమాతిశయంబును దలపోసి, నిజమును నిల్కడమీఁద నెఱుంగు టొప్పు.

### కంసుని మనోవ్యాకులము.

కంసునిచెవిలో నాకాశవాణిపల్కులు నిరంతరము మాఱుమ్రోయసాగెను. వానిహృదయము తదేకచింతామయమై యొందుఁ దలంపుకుండెను. ఊహాలు పరంపరలుగా లేచి వానిని గలంపఁ జొచ్చెను. వానికి నిద్రాహారంబులు దూరమయ్యెను. దినములు యుగాయతంబులుగాఁ దోఁచెను.

### కంసుడు—దేవకీ సంతానము.

దేవకి కొన్నాళ్లకు గర్భవతియై కాలక్రమంబునఁ గీర్తిమంతుఁడను బుత్త్రుని గాంచెను. వసుదేవుఁడు సత్యవాది గావున నాటితనబాసనుదలంచి యాశిశువును దెచ్చి కంసుని మ్రోలనుంచెను. పుణ్యాత్ములు సత్యమునకై ప్రాణంబులఁ గూడ నిత్తురుగదా. వసుదేవుఁ డట్లు గావించి శిశువిషయక

చింత యేమంతయు లేక భగవంతునందు మది నిల్పి నిస్తరంగ సముద్రమువలెఁ దనయెదుట నుండఁగాఁ గంసుఁడు గాంచి తదీయసత్యవాక్యపరిపాలనబుద్ధికిని వానినిబ్బరంబునకును మెచ్చి 'వసుదేవా ! దేవకియెనిమిదవకాన్పువలన నాకు ముప్పు గల్గునని యాకాశవాణి పల్కెను. కాఁబట్టి యీశిశువువలన నాకు నెట్టి యపాయములేదు. ఈబిడ్డను గొని పొమ్మ' నెను. వసుదేవుఁ డంతట నాబిడ్డను గొని యింటికిఁ బోయెను.

కంస నారదులు

ఒకనాఁడు నారదమహర్షి కంసునొద్దకు వచ్చి యేకాంతంబునఁ గొంతవడి వానితో సంప్రతించి 'కంసా ! నందుఁడును వ్రజపురమందలి గోపికాగోపకులును, వసుదేవాది వృష్ణివంశ్యులును, దేవకిమున్నగు యాదవాంగనలును, వారివారి బంధువులును వీరెల్లరు మనుష్యమాత్రులని నీవు భావించితివి. వారెల్లరు నమరులుగాని వేఱుగారు. అంతియగాదు, నిన్ను గొల్చుచున్నవారిలోఁ బెక్కురు నిర్జరులని గ్రహింపుము. భూదేవి యసురబాధనోర్వలేక గోడుగోడుమనుచు విష్ణువు పాదంబుల వ్రాలెను. అసురసంహారనిమిత్తము సురాంశంబు లిట్లు జనించెను. కంసా ! నీ సంగతి యెఱుంగుదువా ? తొలి జన్మంబున నీవు కాలనేమి యను రాక్షసుండవు. శ్రీమన్నారాయణుండు దేవకీదేవిగర్భంబున జనించి నిన్ను హరింపనున్నాఁడ'ని చెప్పి చనెను.

నారదుని మాటలు కంసునెద సూదులై నాటెను. అతఁడు వెనువెంటనే దేవకీవసుదేవులను బట్టి తెచ్చి బందిచేసి వానిసంతానంబు నప్పటికున్నవారినెల్లఁ జంపించి యాదవకుల

నాశనంబు సంకల్పించి తనతండ్రియైన యుగ్రసేనునిఁ జెఱనుంచి తాను రాజ్యాధిపత్యము వహించి శూరసేనంబులను మహా కఠోరంబులఁ బాలింపసాగెను. తగదన్నవారి తలలు తెగెను. వలదన్నవారు వాడిచచ్చిరి.

కంసుఁడంతటితోఁ దనివి నొందక యసపత్నరాజ్యముఁ గోరి ప్రలంబ, బక, చాణూర, తృణావర్త, అఘ, ముష్టిక, అరిష్ట, ద్వివిధ కేశి, ధేనుక, బాణ, భౌమాది, రాజులతో రాక్షస తత్త్వాత్ములతో మైత్రి యొనర్చెను. కంసునిబాములకు నోర్వ నోపక యాదవులు కురు, పాంచాల, కేకయ, సాల్వ, విదర్భ, నైషధ, విదేహ, కోసలాది రాజ్యంబులకు వలసపోయిరి. అక్రూరాదులు కొందఱు గత్యంతరము గానక కంసుని యాజ్ఞకు లోఁబడి యాడే యుండిరి.

### బలరామ జననము.

దేవకీదేవి యనంతరము సుషేణ, భద్రసేన, ఋజు, సమదన, భద్రులను పుత్త్రుల నేపురఁ గాంచెను. వారినెల్లఁ గంసుఁడు గావుగొనెను. ఆమె మఱల చూలు దాల్చెను. వసుదేవాదులు దిగులు పడసాగిరి. భగవంతుఁడు యోగ మాయను రప్పించి 'నాయంశమైన యనంతుఁడు దేవకీగర్భముఁ జొచ్చెను. ఆమె కంసునిచెఱలో నున్నది. నీవు చని దేవకీ గర్భంబు నాకర్షించి కొనిపోయి నందగోకులమందున్న వసు దేవునిభార్య రోహిణిగర్భంబునఁ జేర్చిరమ్ము. అనంతరము నేను దేవకి గర్భంబున జనింతును. అప్పుడు నీవు నందుని భార్యయైన యశోదకుఁ బుత్త్రివై పుట్టుము. నీకు వరప్రదాన శక్తి గలుగును. జనులు నీకుగా నాలయంబులు నిర్మించి నిన్నుఁ

బూజింతురు. దుర్గా, భద్ర, కాళీ, విజయా, వైష్ణవీ, కుముదా, చండికా, కృష్ణా, మాధవీ, కన్యా, మాయా, నారాయణీ, ఈశానీ, శారదాంబికాది నామంబుల నీవు సమారాధ్యవై వెలయుదువు. అనంతుఁడు దేవకీగర్భంబునుండి యాకర్షింపఁ బడినందున వానిని సంకర్షణుఁడనియుఁ జెప్పుదురు. వానిని రాముఁడనియు బలరాముఁడనియు గూడవచింతురు' అని పలికెను.

యోగమాయ వెనువెంటనే వచ్చి దేవకీగర్భస్థపిండంబు నాకర్షించి కొనిపోయి రోహిణీగర్భంబునఁ బ్రవేశపెట్టెను. దేవకికి గర్భస్రావమయ్యెనని ప్రజలు తలంచిరి. కంసుఁడు సంతోషించెను. రోహిణికి కాలక్రమంబునఁ బుత్రోదయ మయ్యెను.

* యోగమాయ యననేమని శంకింపవచ్చు. భగవత్సంకల్పమే యోగమనియు తచ్ఛక్తియే మాయయనియు అంతర్లీనమైయున్న శక్తి భగవత్సంకల్పంబుతోడ రూపుదాల్చి వ్యవహరించుననియు, దీనినే యోగమాయా వ్యవహారమని యనియు గ్రహింపనగు.

## రాజ్యక్షోభము

కంసుని దుండగంబులు మితిమీరెను. రాజ్యమెల్ల నుడ్డుడకసాగెను. ప్రజలు క్రోధమూర్ఛితులైరి. దేశమెల్ల వానికి నోడి లోలోన నుగ్గుచు నాకాశవాణిని నమ్మి యప్పరమ భాగ్యంబును నిరీక్షించుచు, దేవకియష్టమగర్భంబును సంరక్షించుటకై వివిధోపాయంబు లూహించుచు దినమొక యుగంబుగాఁ బుచ్చనైరి. మధురరాజ్యంబెల్ల నొక్కభావముతో నేకదీక్షాపరమై వర్తించెను.

కంసుని యాందోళనము.

దేవకి మఱల చూలుదాల్చెను. ఆమెమేనిమెఱుంగును ముఖముతెల్వియు నపూర్వశోభను వహించెను. ఆమె నిరంతరము భగవద్ధ్యానచిత్తయై తానెందున్నదియుఁ దన గర్భమునగతి యేమికానున్నదియు మఱచెను. ఆమె యంతఃకళ క్షణక్షణంబునకు నూత్నకాంతిఁ దాల్చుచుఁ దద్వదన మండలంబునఁ దొలఁకాడసాగెను.

దేవకి యట్లు మఱల గర్భవతి యగుట కంసుఁడు విని 'కటా! ఇది యెనిమిదవకాన్పు. ఆకాశవాణి పల్కినను నారదమహర్షి యూర్జితపఱచెను. ఈకాన్పు నాకుఁ బ్రాణగొడ్డమగుట నిజము. ఎప్పుడు శిశువుదయించునో యేమి యగునో తెలియరాదు. నాకు దినంబొక గండముగా నున్నది. నిద్రాహారంబులకుఁ బగవైతిని. ఒకనాటికిని మనశ్శాంతి గలుగదు. ఎనిమిదేండ్లుగా భయంబు నన్ను వెన్నాడి తఱుము చున్నది. ఇఁక సహింపరాదు. దేవకినిఁ గడతేర్తునేని నా యెదలెల్లఁ దీఱును. సుఖపడుదు!' నని నిశ్చయించి వాఁడి ఖడ్గంబును జేతఁబూని చెఱసాలకుఁ బోయి దేవకియెదుట నిలిచెను.

దేవకి లేచి 'అన్నా! రమ్మ'నెను. ఆమాటతోడ వానిక్రౌర్యము జాఱెను. చిఱునగవుదేటలతో నపూర్వశోభతోఁ బసలారుచున్న యామెముఖమండలంబును గాంచినంతనే వానితలంపులు మాఱెను. అతఁడట్టె నిలిచి 'కటా! నాచెల్లెలిని జంపఁదలంచితి. ఆమె మీఁదుమిక్కిలి గర్భవతిగా నున్నది. ఈమెను జంపుట యపకీర్తికరమేగాక మహాపాత

కమునగు. పాపాత్ములకు సిగిదక్కదు; వారిజీవితకాలమును దఱిగిపోవును. ఇహపరంబులకు వారు దూరులగుదు' రని తలపోసి మరలి పోయెను.

బ్రహ్మాదిదేవతలు.

దేవకికిఁ బ్రొద్దులు నిండెను. బ్రహ్మాదిదేవతలు వచ్చి నింగి నిలిచి 'దేవదేవా! లోకరక్షకా! నీసంకల్పంబు లమోఘంబులు; నీమహిమ లచింత్యంబులు. నీకుఁ బుట్టువు లేదు; సమస్తముఁ నీవలన జనించును. సృష్టినెల్ల నీవు చూతువు; నిన్నెవ్వరుఁగానరు. నీతత్త్వంబు నెఱుంగని యజ్ఞానులు మాయామోహితులై భేదబుద్ధికిఁజిక్కి పరిపరివిధంబులఁ బరిభ్రమింతురు. నీవు సర్వమయుండవు; నీవులేని చోటు లేదు. నీయవతారాదులు లీలామాత్రంబులును స్వేచ్ఛాకృతంబులునై యుండు. లోకసంగ్రహార్థము మూర్తీభవింతువు.

"మ॥ గురుపాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీనృకే,
సరివై భిక్షుఁడవై హయాననుఁడవై క్ష్మాదేవతాభర్గనై,
ధరణీనాథుఁడవై దయాగుణగణోదారుండవై లోకముల్,
పరిరక్షించిన నీకు మ్రొక్కెద మిలాభారంబు వారింపవే?"

అని ప్రార్థించి, దేవకీదేవితో 'అమ్మా! నీగర్భంబునఁ బ్రధానపూరుషుఁడున్నవాఁడు. రేపు శిశూదయమగు. కంసునకు వెఱవవలదు. నీకడుపు చల్లఁగా యాదవులకును లోకంబునకును మాకును శుభంబగు' నని దీవించి చనిరి.

శ్రీకృష్ణావతారము.

దేవకికి నొప్పులు పొడసూపెను. సప్తజలనిధులు స్వచ్ఛంబులై పొంగెను; నభోభాగము గ్రహతారాభిరామమై విరా

జిల్లెను. దిక్కులు తెలివొందెను ; మందమారుతము వీచెను ; పుష్పవృష్టి గురిసెను ; హోమాగ్నులు ప్రజ్వరిల్లెను.

కమలాకరంబులు ప్రఫుల్లకమలాకరంబులై చెన్నారెను. కాంతారంబులును వృక్షవాటికలును బూచి కమ్మనితావుల వెదచల్లెను. పక్షుల మధురాలాపంబులును భ్రమరంబుల ఝంకారంబులును జెలరేగెను. అకారణంబ సత్పురుషుల హృదయంబులు సంతోషపరవశంబులయ్యెను.

దేవకీప్రసవవేదనవార్త వినవచ్చినంతనే జనులు తహతహపడుచు 'ఆకాశవాణికిఁ దఱియయ్యె ; దేవకీవసుదేవులు కంసుని కోటలో భూగర్భంబున బందివై యున్నారు. చలి చీమయు నచ్చోటు జొరఁజాలదు. ఏమిసేయనగు' నని తలపోయుచు, బందికాపులకు లంచంబు లిత్తమనియుఁ గంసుని యాంతరంగజనులను వశపఱచుకొందమనియుఁ దలకొక యూహఁగాఁ బల్కసాగిరి.

చెఱకాపరులు చని కంసునకు సంగతి తెలిపిరి. ఆ మాటతోడ భయము రూపుదాల్చి వానికట్టెదుట నిలిచెను. వానికి ధైర్యము విలోలమయ్యెను ; బుద్ధి నిలుకడ మానెను; ఊహలు పెచ్చుపెఱిగెను ; నోట మాట వెలువడదయ్యెను. ఎట్టకేలకుఁ గంసుఁడు సుంత తాల్మిఁదాల్చి శిశువుజనించుటే తడవుగావచ్చి తెలుపుమని వారినాజ్ఞాపించి, బోనులోని పులి వలె మందిరాంతరమెల్లఁ దిరుగుచు గిల్లింతచప్పుడునకు దిగ్గున నుల్కిపడుచు సారెసారెకు ద్వారమునొద్దకు బరుగెత్తుచుఁ దొంగిచూచుచు నున్మత్తునిక్రియ వర్తింపసాగెను.

నేటికి దాదాపుగా 5167 సంవత్సరముల క్రిందట శ్రీముఖసంవత్సర భద్రమాస కృష్ణాష్టమినాఁడు నడిరేయి నిర్జరమంగళవాద్యంబులును గిన్నరగంధర్వగానంబులును సిద్ధ చారణస్తుతులును మాఱుమ్రోయఁగా నప్సరోవిద్యాధర నృత్యంబులతో దివియెల్లఁ బరమానందోత్సవంబున బొంగారు చుండగా, రోహిణీనక్షత్రంబున వృషభలగ్నమందు నీలమేఘ చ్ఛాయతో నాజానుచతుర్బాహువులతో శంఖచక్రపద్మ గదాహస్తంబులతోఁ గౌస్తుభమణిసమలంకృతకంఠదేశంబుతో శ్రీవత్సలాంఛనవిరాజమానవిశాలవక్షంబుతో నొప్పారుచున్న శిశువునుఁ బరమతేజఃపుంజమోయననున్న దానిని దేవకీదేవి ప్రసవించెను.

శిశూదయంబుతోడఁ గారాగృహమెల్ల దేదీప్యమాన ముగా శోభిల్లెను. దేవకీవసుదేవులనయనంబులు మిఱుమిట్లు గొంచెను. బాహ్యజ్ఞానము తొలఁగి వారు తదేకమతులైరి. అప్పుడు శ్రీభగవానుఁడు వారి నామంత్రించి,

'అమ్మా! స్వాయంభువమన్వంతరమం దీవసుదేవుఁడు సుతపుండను బ్రజాపతిగానుండెను. నీవు పృశ్ని యనుపేర వాని భార్యవై యుంటివి. మిమ్మిరువురను బ్రజాసర్గంబునకు బ్రహ్మనియమించెను. ఐహికసుఖంబులెట్టివో యెఱుంగని మీరు మీయింద్రియంబుల నియమించి వాతాతపవర్షశీతంబుల నోర్చి పర్ణవాయుభక్షణవ్రతంబుఁ బూని ద్వాదశదివ్యవర్షం బులు నన్నుఁ గూర్చి దుష్కరతపం బాచరించితిరి. మీతపంబు నకు మెచ్చి యీరూపంబున మీకుఁ బ్రత్యక్షుండనై వరం బులఁ గోరుమంటిని. నాయట్టికుమారుని ముమ్మాఱును కోరి

తిరి. అట్లే యని యప్పుడు మీగర్భంబున నవతరించితిని. నన్నుఁ బృశ్నిగర్భుఁడనిరి.

"మీరు రెండవజన్మంబున అదితియుఁ గశ్యపుఁడునై పుట్టితిరి. అప్పుడు నేను ఉపేంద్రుఁడను పేర మీగర్భంబున జనించితిని. నన్ను వామనుఁడనియుఁ బల్కిరి. ఇది మీ మూఁడవజన్మము. ఇప్పు డీరూపంబున మీకు జనించితిని. మీరు ముమ్మాఱు కోరుటం జేసి నేను ముమ్మాఱు మీగర్భం బున నవతరించుటయ్యెను. మీవరంబులు మూఁడును దీఱెను; మీరు సద్గతిఁ బడయుదురు. మీకుఁ బూర్వజన్మస్మరణంబు గల్గుటకై యీరహస్యంబుఁ దెలిపితి. అంతియగాదు. తొలు దొల్త నన్నే రూపంబునఁ గాంచితిరో యదేరూపంబును నన్నుఁ మీరు గుర్తించుటకుగా గ్రహించితిని."

'వసుదేవా ! నాయీయవతారంబున మీకోర్కి దీఱు టయే గాక దేవకార్యముగూడ సిద్ధింపనై యున్నది. నన్ను గొనిపోయి గోకులమందున్న యశోదయొద్దఁ జేర్చి, యామెకుఁ బుత్త్రికయై యిప్పుడే జనింపనున్న నామాయను గొనివచ్చి యిటఁ జేర్పుము. చెఱద్వారములు తమంతనఁ దెఱచును. యమునయు నీకు సుఖముగా దాఁటనగు. భయంబింతయు వలదు." అని చెప్పెను.

దేవకీవసుదేవు లాదివ్యమంగళవిగ్రహంబును గాంచి యావచనంబులు విని పరమానందవివశులై 'స్వామీ ! నీవు పరమాత్ముండవనియు, అఖండజ్ఞానానందస్వరూపుఁడవనియు, జగదంతర్యామివనియు, సర్వసాక్షివనియుఁ, బ్రహ్మలికి నాశ,

యుండవనియు, స్వప్రకృతి నధిష్ఠించి సంకల్పమాత్రంబునఁ త్రిగుణాత్మికమైన సృష్టినిఁ గలిగింతువనియు, నీ సృష్టి మాయామాత్రమేగాని వేఱుగాదనియుఁ, దూర్వముఖంబునఁ జంద్రోదయంబట్లు నీయవతారంబులగుననియు, సర్వము నీవయగుటం జేసి భవదన్యంబుగలుగదనియు, ఈరహస్యం బింద్రియాతీత మగుట యజ్ఞులెఱుంగఁజాలక నిన్నును నీయవతారంబులను బలువిధంబుల నూహింతురనియు, నీవకర్తవును గుణాతీతుండవును వికారరహితుఁడవునై యున్నను సృష్టిస్థితి లయంబులు నీవలన సాగుచున్నవనియు, ఈనీయైశ్వర్యప్రభావము నిర్వికల్ప యోగబుద్ధికి మాత్రమే గోచరించుననియు, భ్రాంతింజేసి సర్పత్వంబును రజ్జువునందువలె గుణకార్యంబులను నీయెడ నారోపించి యదే సత్యమని లోకమెల్ల విభ్రాంతివశమై యున్నదనియు, వేదవేదాంగంబులు ఘోషించునట్టి నీతత్త్వంబును నేఁడు గంటిమి ; కృతకృత్యులమైతిమి. దేవదేవా ! ఈ నీదివ్యమంగళాకారము మాకు నిరంతరధ్యేయమై తనరుఁగాక.' అని ప్రార్థించిరి.

అంతలోన యోగమాయ వారిని గప్పెను. వారు సమాధ్యవస్థనుండి బహిర్గతులై ప్రాకృతస్థితిఁ దాల్చిరి. భగవంతుఁడును మర్త్యశిశురూపంబును వహించెను.

రోదసీకుహరము కాటుకరాశియయ్యెను. మేఘగర్జంబులకు భూతలంబెల్ల నుట్టూఁతలూగెను ; ప్రళయఝంఝూనిలము వీచెను ; కుంభవృష్టి కురిసెను. వసుదేవుఁడు శిశువును గైకొని చెఱవాకిటకు వచ్చెను. తలుపులు తమంతటఁ విచ్చెను ; చెఱకాపరులు నిద్రావశులై మైమఱచి యుండిరి.

వసుదేవుఁడు చెఱనుండి వెడలెను. కుంభవృష్టి కురియుచున్నను వానిపైఁ జినుకరాలదయ్యెను. ఆవింతకు నతఁడాశ్చర్యపడుచు హుటాహుటి యమునాతీరము జేరెను. ఆనది రెండుదరులు గవిసి పాఱుచు దాటరాకుండెను. వసుదేవుఁడదిగాంచి దిక్కు-తోఁపక యేమిచేయనగునా యని చింతించి భగవదాజ్ఞను స్మరించి యేటిలోదిగెను. నదీజలంబులు పాయలై వానికి దారినిచ్చెను. వసుదేవుఁడు వడివడి నేఱుదాఁటి గోకులము చేరి నందునియిల్లు చొచ్చి యప్పుడే యశోద ప్రసవించిన పుత్త్రికను గైకొని తనశిశువు నామెప్రక్క-లో నుంచి వేవేగమవచ్చి యాబిడ్డను దేవకిప్రక్క-లోనుంచెను. యోగమాయాప్రభావంబున యశోదకు నిదియెల్లఁ దెలియదయ్యెను.

మేఘ గీంకారంబులు శమించెను; వాన నిలిచెను; దిక్కు-లును విశదంబులయ్యెను. బందికాపరులు మేల్కా-ంచి శిశురోదనంబులు విని పరుగెత్తి పోయి కంసునకు సంగతి విన్నవించిరి. ఆమాటతోడ మృత్యువు వానియెదుట నిల్చినట్లయ్యెను. అతఁడు తటాలునఁ బాన్పునుండి దుమికి కత్తిదూసి విఱిసిన కేశజాలంబుతోఁ దడఁబడునడకతోఁ జెఱసాలకుఁ బరుగెత్తెను. వానినిఁ గాంచి దేవకి మహాభయశోకంబులంది శిశువును జేతులలో దాచి 'అన్నా ! నీకుఁ గోడలు పుట్టెను. ఆడుపాపవలన నీకు భయంబు లేదు. ఆకాశవాణిని దలంపుము. అన్నా ! ఏడ్గురుబిడ్డలను జేతులార నీకు నర్పించితిమి. దైవయోగం బట్లుండెను. నిన్ను నిందించుట లేదు. పుత్త్రశోకంబునకుఁ జిక్కి- కృశించుచున్న యీ నీ చెలియలకుఁ గడపటి బిడ్డయైన యీ యాడుకూసను దక్కి-ంపుము. ఈ

పాటిభాగ్యంబును నీచెల్లెలకుఁ గృపసేయఁ దగదా ? ' యని దుఃఖదీనస్వరంబున వేడెను.

కంసుఁడామె ప్రణయాంబులఁ జెవిఁబెట్టక యాబుడుతే నొడిసి యడుగులఁబట్టి తిగిచి గిఱగిఱఁద్రిప్పి ఱాతిపై మోదెను. ఆశిశువు మింటికి నెగసి సాయుధంబులైన యష్టభుజంబులతో మహాభయంకరాకారయై తోఁచుచు 'దురాత్మా ! స్వార్థపరత్వము నీయెదలోని దయారసంబు నింకించెను. మహాఘోరకర్ముండవైతివి. మందమతీ ! నన్నుఁ జంపిన ఫలమేమి ? నిన్ను హరించువాఁడు పుట్టియే యున్నాఁడు. నోరులేని నిసువులఁ జంపి కడలేని పాతకంబు నొడిగట్టుకు' మని యంతర్ధానమయ్యెను.

ఆవింతకుఁ గంసుఁడు ఱిచ్చపడి కొండొక తడవునకుఁ దేఱి 'సోదరీ ! ఆకాశవాణిని నమ్మి నోరులేని నీ నిసువులఁజంపి మహాపాతకి నైతిని. నాపాపంబునకుఁ బ్రాయశ్చిత్తము గలుగదు. ఏనరకకూపంబు నాకు శరణమగునో యూహింపరాదు. ఆత్మరక్షణార్థము కఠోరకార్యంబు లొనర్చితిని. నాసేఁత లేవగించి బంధుమిత్రులు నాకు దూరమైరి. మర్త్యులు బొంకుట గలదు. దైవము గూడ బొంకి నన్నేమరించెఁగదా ! దేవకీవసుదేవులారా ! ఈపాపాత్మునిఁ గనికరింపఁదగు. చిన్నబిడ్డలకై వగవవలదు.' అని వారిపాదంబులకు నమస్కరించి వారికి బంధముక్తిఁ గావించెను.

కంసుని పరితాపంబును బరికించి దేవకీదేవి వానికై యనుతాపమొందెను. వసుదేవుఁడు చిఱునవ్వు నవ్వుచు 'కంసా ! ప్రాణులు కర్మవశులు. ప్రారబ్ధంబెవ్వరికిని దప్పదు.

జననమరణంబులు దేహంబులకేగాని దేహాంతర్గతమైన యాత్మ కెన్నఁడును గలుగవు. అట్లుండియు జీవునకుఁ బ్రారబ్ధకర్మ ఫలంబుగా దేహాత్మబుద్ధి కలుగుచున్నది. దానితోడ నహంకారమమకారంబులు జనించును. వాని నంటి రాగద్వేషంబులును సుఖదుఃఖంబులును వచ్చును. ఆద్వంద్వంబులకుఁ జిక్కి నిక్కముఁ గానలేక తానే కర్తనని భావించును. ఇదంతయు నజ్ఞానజనితము గాని వేఱుగాదు. కంసా! ఈతత్త్వరహస్యంబును గ్రహించి చింతమాని శాంతినొందు' మనెను. కంసుఁడు కొంతశాంతిఁ బడసి తనమందిరంబునకుఁ జనెను.

## శ్రీకృష్ణజననకాల విచారము.

శ్రీకృష్ణుని జననకాలనిర్ణయంబును గూర్చి నానామతములు గలవు. పాఠకుల వినోదార్థము కొన్నింటి వివరింతు.

1. శ్రీకృష్ణుఁడు భారతయుద్ధమందుఁ బ్రధానపురుషుఁడై వర్తించెను. కాఁబట్టి భారతయుద్ధకాలమును నిర్ణయించినచో శ్రీకృష్ణజననకాలము స్వతస్సిద్ధమగుచున్నది. శ్రీకృష్ణుఁడు 128 సంవత్సరంబులు జీవించెననియు, వాని నిర్యాణముతోడఁ గలియుగంబు ప్రారంభమయ్యెననియు భారతమే తెలుపుచున్నది. కలియుగము క్రీస్తుశకమునకుఁ బూర్వము 3102 సంవత్సరములనాఁడు ఫిబ్రవరినెల తే 17 ది గురువారము రాత్రి ప్రారంభమయ్యెను. క్రీస్తుశకము ప్రారంభించి యిప్పటికి 1940 సంవత్సరంబులగుచున్నవి. కాఁబట్టి కలియుగప్రారంభము 1940+3102=5042 సంవత్సరములగును. కృష్ణజీవితకాలము 128 సంవత్సరములు. కాబట్టి కృష్ణజననకాలము

5042+128=5170 సంవత్సరములు క్రిందట యగును. ఇది యొకమతము.

2. కలియుగారంభమునఁ బరిక్షిత్తునకుఁ బట్టాభిషేక మొనర్చిరని భారతము. పరిక్షిత్తు షుమారు 60 సంవత్సరంబులు రాజ్యంబేలియుండును. పరిక్షిత్తుని యనంతరము 1115 సంవత్సరంబులకు నందుని పట్టాభిషేకము జరిగెను. కాఁబట్టి నందపట్టాభిషేకమునాటికిఁ గలియుగప్రారంభము 60+1115 =1175 సంవత్సరములగును. ఈనందుఁడే మహాపద్మనందుఁడు. ఇతనితోడ నవనందులు రాజ్యమేలిరి. వారికాలమెల్ల 100 సంవత్సరములు. తర్వాత చంద్రగుప్తుఁడు రాజ్యమునకు వచ్చెను. కాఁబట్టి చంద్రగుప్త పట్టాభిషేకము నాఁటికిఁ గలియుగారంభము 1175+100=1275 సంవత్సరంబులు. చంద్రగుప్తుఁడు అలెగ్జాండరునకు సమకాలికుఁడు. అలెగ్జాండరు క్రీస్తుపూర్వము 327 సంవత్సరముల నాఁడుండెను. కాఁబట్టి కలియుగారంభము క్రీస్తుశకమునాటికి 1275+327=1602 సంవత్సరంబు లగును. క్రీస్తుశకమిప్పటికి 1940 సంవత్సరములు. కాఁబట్టి కలియుగారంభమిప్పటికి 1602+1940=3542. దీనికిఁ గృష్ణుని జీవితకాలము 128 సంవత్సరములు చేర్పఁగా శ్రీకృష్ణజననము నేటికి 3542+128=3670 సంవత్సరంబులని యేర్పడును. ఇది యొక మతము.

3. పరిక్షిజ్జననకాలంబున సప్తర్షులు మఖలోనుండిరి. మహాపద్మనందుని పట్టాభిషేకకాలంబున వారు పూర్వాషాఢలో నుండిరి. సప్తర్షులు ఒకనక్షత్రంబునుండి మఱియొకనక్షత్రంబునకు వచ్చుటకు 100 సంవత్సరంబులు పట్టును. కాఁబట్టి

వారు మఖనుండి పూర్వాషాఢకు వచ్చుటకు 14×100=1400 సంవత్సరంబులు పట్టును. నవనందుల రాజ్యకాలము 100 సంవత్సరము. తర్వాత చంద్రగుప్తుఁడు వచ్చెను. కాఁబట్టి చంద్రగుప్త పట్టాభిషేకకాలమునకుఁ బరిక్షిజ్జననకాలము 1400+100=1500 సంవత్సరములు. చంద్రగుప్తుఁడు అలెగ్జాండరునకు సమకాలికుఁడు. అలెగ్జాండరు క్రీస్తునకుఁ బూర్వము 327 సంవత్సరములనాఁడుండెను. కాఁబట్టి పరిక్షిజ్జననకాలము క్రీస్తునకుఁ బూర్వము 1500+327=1827 సంవత్సరంబులగు. క్రీస్తుశకము నేటికి 1940 సంవత్సరములు. కావునఁ బరిక్షిజ్జననము నేటికి 1827+1940=3767 సంవత్సరములు. పరిక్షిజ్జననము భారతయుద్ధాంతమున జరిగెను ; కలియుగప్రారంభమునాటికి నతఁడిరువది యేఁడుల ప్రాయమువాఁడై యుండును. కావునఁగా కలియుగము నేటికి 3767+20= 3787 సంవత్సరంబులనాఁడు ప్రారంభమై యుండును. దీనికిఁ గృష్ణజీవితకాలంబును 128 సంవత్సరములను జేర్పఁగా శ్రీకృష్ణజననకాలము నేటికి 3787+128=3915 సంవత్సరములయ్యెనని నేర్పడును. ఇది యొక మతము.

4. యుగంబులు జ్యోతిశ్శాస్త్రీయంబులనియుఁ జారిత్రకంబులనియు రెండువిధంబులనుండుననియు, జీవితకాలంబును జారిత్రకయుగప్రమాణంబున నిర్ణయింపవలయుననియు, శ్రీకృష్ణజననకాలంబును జారిత్రకయుగప్రమాణంబున నిర్ణయించిన చో, అది నేటికి 3600 సంవత్సరంబులకు లోపుగానే యుండుననియు మఱి యొక మతము.

* మథురలో శ్రీకృష్ణుఁడు జన్మించిన చోట దేవాలయం

బును గట్టి యందు శ్రీకృష్ణవిగ్రహంబును బ్రతిష్ఠించిరి. దానికి సమీపంబునఁ బాతాళకూపమను బావిగలదు. అందలి నీటితో శ్రీకృష్ణునకుఁ బుట్టినస్నానము చేసిరందురు.

### కంసుని మంత్రులయుపదేశము.

కంసుఁడట్లు దేవకీవసుదేవులను బంధవిముక్తులఁజేసి స్వమందిరంబునకుఁ బోయి పరుండెను. వానికి నిదురరాదు. తలంపులు వేనవేలుగాఁబుట్టి వానిని గలంప సాగెను.

తెల్లవాఱినంతటఁ గంసుఁడు తనమంత్రులను రప్పించి నాఁటిరాత్రి సంగతి వారికిఁ దెలిపెను. మంత్రులాసురప్రవృత్తులగుటఁ గంసుని విన్నంతనే రజోగుణంబుప్పొంగి బుద్ధిని వారిహితాహితవిమర్శనంబునకు దూరముచేసెను. వారు దీర్ఘమాలోచించి 'దేవా! ఇదంతయు సురసన్నాహము. వారు మనకెల్ల నాగర్భశత్రువులగుట మీకు స్పష్టము. పిఱికిపందలు గావున నెదయిచ్చి వారు నిన్నుఁ బోరలేక కపటోపాయంబులఁ బన్నుదురు. ధైర్యసాహసంబులు వారికిఁ గలుగవు. ఎదిరి లేనిచోఁ దమంతటివీరులు లేరని వారు ప్రగల్భంబులాడుదురు. ఇటీవలననే వారు దురహంకారప్రేరితులై నిన్నెదిర్చి నీ ప్రేటులకు నోడి భయాక్రాంతులై నీపాదంబులవ్రాలిరి. శరణన్నవానిని జంపుట శూరధర్మముగాదు గావున వారిని మన్నించితివి. వారు మనకు హితశత్రువులు గావున నిన్నటి మాట యింతలోనే మఱచి నీకుఁ గీడు రోయుచున్నారు. తమకు విష్ణువుగలఁడని వారు విఱ్ఱవీగుదురు. అతఁడు నీకు వెఱచి యెందో దాగియున్నాఁడు. వెదకించినను గానరాఁడు. శంకరుఁడు నీదాడికినోడి వనాంతరగతుఁడయ్యెను. ఇంద్రుని

సంగతి చెప్పనేల ? బ్రహ్మయన్ననో నిరంతరతపోవ్రతుఁడై యుండు. ఒందు తలంచుటకుఁగూడ వానికి వ్యవధి గలుగదు. దేవా ! దేవతలట్టి యుపేక్షణీయులైనను వారికి మనయెడఁ బగ చల్లారదు. ఋణశేషము నగ్నిశేషమును శత్రుశేషము నుంచ రాదు. ఈపందలదొంగయేడ్పులు విని నిన్ను సంహరించుటకై విష్ణు నవతరింపనున్నాఁడని నాఁడు నారదమహర్షి చెప్పెను. నిన్ను హరించువాఁడు పుట్టియే యున్నాఁడని యోగమాయ రాత్రి తెలిపెను. ఇఁక నాలోచనము లేల? పెఱతలపోతలేల ? మునువెనుకలు చూడఁ దడవు లేదు. తగవుతగములు విచారింప వలదు. నీరాజ్యమందలి పల్లెలు పట్టణంబులు వెదకివెదకి బాలురను బురుడుగడచినవారిని గడువనివారిని నొక్కుమ్మడిఁ దెగటార్పనగు. ఒందుచొప్పుదోఁపదు. ఎల్లరఁ జంపనేలయందు వా ? నీప్రాణహారుఁడెవఁడో తెలియరాదు. చానంజేసి బాలురనెల్లఁ జంపుట మనకు విధియగు. ఇది ఘోరకార్యమందు వా ? ఆత్మరక్షణార్థమై యేపనియైనను ధర్మమేయగు. ఇంతియ గాదు. విష్ణువు తపశ్శాలులందును సత్యవ్రతులందును వైదిక యాగకర్తలందును వేదవిదులైన బ్రాహ్మణులయందు నుండు నందురు. ఈధర్మంబులెల్ల ఋషులయందు వర్తించును. విష్ణువునకు నిల్కడయైన నివాసము లేదు గావునను, అతఁడు ఋషుల నాశ్రయించియుండును గావునను, ఋషులను బరిమార్తుమేని యాశ్రయస్థానహీనుఁడై యతఁడు మనచేతఁబడు. అప్పుడు వానిమాయలెట్టివో చూత' మని యేకగ్రీవముగఁ బల్కిరి.

కంసుని రజోగుణసర్పము హృదయబిలస్థమై యుండినది మంత్రిజనదుర్మంత్రతమోగుణతాడితమై చెలరేగి వెలికిఁ బ్రాఁ

కి దీర్ఘోచ్ఛ్వాసంబులు గావింప సాగెను. వానియెదలోఁ బొరాడుచుండిన భూతదయానుతాపంబులు వలసపోయెను. అతఁడు తోడ్తోడఁ దనయనుచరులైన రాక్షసులను వివిధమాయాసంపన్నులను రావించి మంత్రిజననిశ్చయంబును దననిశ్చయంబుగా వారికి నాజ్ఞాపించెను. రక్కసులకు దౌష్ట్యంబులు దినక్రియలగు. వారికి రాజాజ్ఞతోడ్పడినప్పుడు చెప్పవలయునా ?

### జాతకోత్సవము.

అట నందుఁడు తనకుఁ బుత్త్రుఁడు కలుగుటకెంతయు సంతసించి వఱువాతనే స్నానమొనర్చి వస్త్రాభరణంబులు ధరించి వేదవేత్తలైన బ్రాహ్మణోత్తముల రప్పించి నిగమోక్తుల శిశువునకు జాతకక్రియలు చేయించి 'మహాత్ములారా! జననము కాలవశంబునను, దేహము స్నానమువలనను, మలినవస్తువులు శుద్ధిక్రియవలనను, గర్భము జాతకకర్మములవలనను, ఇంద్రియంబులు తపంబువలనను, ద్విజులు యజ్ఞాదులవలనను, ధనము దానంబువలనను, హృదయము సంతృప్తివలనను, జీవుఁడాత్మజ్ఞానంబునను బరిశుద్ధిగాంచునందురు. వేదమూర్తులైన మీరు జాతకకర్మంబులొనర్చి నాపట్టినిఁ బునీతునిగా నొనర్చిరి. మీ కెంతయుఁ గృతకృత్యుఁడనైతిని. అపరిగ్రహము మీ వ్రతమగుట యెఱుంగుదు. మహాత్ములను సన్మానించుట మాబోంట్లకు నాత్మకళ్యాణార్థమగు. నా ప్రణయంబు నొప్పరికింపవల'దని వినయపురస్సరంబుగాఁ బలికి యథోచితవిధి వారిని సత్కరించెను. విప్రోత్తములును నందునకెంతయుఁ బ్రీతులై యోగమోక్తుల వానిని వాసిపట్టిని నాశీర్వదించి చనిరి. నందుని పుత్త్రోదయంబునకు వ్రజపురంబెల్ల నానందమందిరి.

మ్యెను. గోపకులు వివిధోత్సవంబులు గావించిరి. గోపికలు వస్త్రాభరణసమలంకృతలై ఫలపుష్పనవనీతఖండంబులు గొనిపోయి యశోదకు నిచ్చి యామె పట్టిని ముద్దాడి దీవించి వచ్చిరి.

నామకరణము.

దేవకీసుతుఁడు నందునియిల్లు చొచ్చినదాదిగా వ్రజపురంబు నూతనశోభఁ దాల్చెను. పచ్చికలు తలిరుగవు; ఆవులు కుండలఁబిదికెను; దధిక్షీరఘృతవాసనలు పిచ్చిల్లెను; లేగలు క్రేళ్ళు దాటుటయ్యెను; వృషభంబుల ఱంకెలు మెండయ్యెను. శిశువృద్ధియుఁ బశువృద్ధియుఁ బాడిపంటల సమృద్ధియుఁ గలుగుట గోకులం బాబాలవృద్ధము నిరతిశయసంతోషసుఖంబుల నోలలాడసాగెను. రోహిణీయశోదా పుత్రకులు గోకులంబునకు మహాప్రియులైరి. అందు యశోదాసుతుఁ డెల్లరకు నల్లారుముద్దయ్యెను. వానిని ముద్దాడనినాఁడు గోపాంగనలకు దుర్దినముగానుండెను.

"ఉ:—వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరిహారరేఖ ల
ల్లాడఁ గపోలమాలికల హాటకపత్త్రరుచుల్ దనోదరం
బాడఁ బటాంచలంబు లవియాడఁగఁజేరి యశోదయింటికిం
జేడియలేఁగి యబ్బడుతఁజేకొని ముద్దిడి గూర్తురెంతయుక్॥"

రోహిణీసుతుఁడు జనించి యప్పటికి నేడాదియైనను, వసుదేవుఁడు చెఱనుండుటచేతనో మఱియేకారణంబుననో వానికి నామకరణాదులు జరుగకుండెను. నందుడు తనసుతుని తోడ రోహిణీతనయునకుఁగూడ నామకరణంబు జరుప నిశ్చయించెను.

అంతలోనఁ గంసుని దుర్మాత్రము దేశమెల్లఁ బ్రాకెను. అందులకు రాజ్యమెల్ల నుడ్డుడికెను. కంసునాజ్ఞకు నోడి నందుఁడు తనసంకల్పంబును బహిరంగముగా జరుప వెఱచి వృష్ణికులగురువైన గర్గాచార్యునివలన శిశువుల నామకరణంబును రహస్యంబుగా జరిపించెను. ఆబాలకుల రూపరేఖావిలాసంబులను గర్గాచార్యుడు పరీక్షించి రోహిణీసుతునకు రాముఁడనియు, యశోదాపుత్రునకుఁ గృష్ణుడనియుఁ బేరిడి 'నందా! వీరిరువురు నలౌకికపురుషులు. అందు నీసుతుని వలన లోకకళ్యాణమగు' నని పలికి సత్కృతులంది వానిని వీడ్కొనెను.

నందవసుదేవుల సందర్శనము

వసుదేవునకు బంధవిముక్తియైనను అతఁడు మధురను దాఁటరాకుండెను. వానిముద్దుపట్టి నందునింటనున్న వాఁడు వానికన్నుల మ్రోలఁగాన్పింపసాగెను. ఆబుడుతను గన్నారఁ జూచుకల్మి వానికి దూరమయ్యెను. వాని యోగక్షేమంబులు విచారించుదమన్ననో గుట్టు రట్టగునోయని యతఁడు నోరు కుట్టుకొనవలసివచ్చెను.

వ్రజపురము కంసునకు నేఁటేట కప్పము చెల్లించుచుండెను. ఆయేడు దానికి దఱియయ్యెను. నందుఁడు మల్లెఁగొని మధురకుఁబోయి దానిని జెల్లించి యొకయింట బసచేసెను. వసుదేవుఁడు నందునిరాక విని వానిని జూడ నువ్విళ్లూరుచు నతఁడున్నయింటికిఁ బోయెను. నందుఁడు వసుదేవునిగాంచి నంతనే పెన్నిధిఁగన్నపేదచందాన సంతోషమంది యెదురేగి కవుంగిటఁగూర్చి మర్యాదలతోడ వానిని లోనికిఁ దోడితెచ్చి

సుఖాసీనుని గావించి యోగక్షేమంబులు విచారించెను. వసుదేవుఁడును నందునకై యెంతయు సంతసమంది 'అయ్యా ! మిమ్ముఁజూచుట నాకుఁ బునర్జన్మమట్లయ్యెను. నా పూర్వ పుణ్యవిశేషంబున నేఁడు మిమ్ముఁ జూడఁగంటిని. ఆత్మీయుల సందర్శనంబునజనించు సుఖసంతోషంబు లన్యంబులఁగలుగవు. నదీప్రవాహములోని దారువులక్రియ జీవులు కూడుచుఁ బాయుచునుందురు. సంబంధంబులు శాశ్వతంబులుగావు. వారి వారికర్మంబులు వారివారినిఁ బెక్కుగతుల నీడ్చుచుండును. అయ్యా ! లేక లేక ముదిమిమాపునఁ బుత్త్రునిఁ బడయ నోచితివి. ఆబిడ్డఁడు సుఖమేగదా ? మనవారెల్లరు సేమమేగదా? బృందావనమునందలి శాద్వలప్రదేశంబులును, వనంబులును, సేలయేఱులును మనగోగణంబునకుఁ దనివిఁ గూర్చునుగదా ? అన్నా ! ఆ కూనకు నీవే తండ్రివి యశోదయే తల్లి' యని తన పుత్త్రవాత్సల్యంబును భావగర్భితముగాఁ దెలిపెను.

నందుఁడు వాసి భావంబును గ్రహింపలేక మాట సామెతకుగా నతఁడట్లనియెనని తలంచి 'వసుదేవా ! బిడ్డఁడు సేమముగానున్నాఁడు. రోహిణీసుతుఁడును కుశలము. దురాత్ముఁడైన కంసుఁడు దేవకీసుతులనెల్ల బలిగొన్న శోకంబున నీవు వనరుదువు. నీకుఁగా నాకెంతయుఁజింతయగు. ఏమి సేయుదము ? ఇట్టి నష్టము నీకేలఁగల్గెనో యూహింపరాదు. ప్రాణులజీవితంబు లదృష్టంబులుగానున్నవి. అదృష్టంబునకైన ప్రాకులాటలతోఁ గాలమెల్లఁ గడచుచున్నది. ఈభ్రాంతి యెంతకాలముండునో యందాఁక శాంతిగూర' దనెను.

అట్లు వారు కొంతతడవు పుచ్చిరి. అంత వసుదేవుఁడు

నందునితో 'అయ్యా! నిన్నుఁ జూడనోచితి; నీముఖంబున నెల్లరసేమము వింటి. ఇఁక జాగువలదు; గోకులంబునకుఁ దరలుము. అచ్చట నుత్పాతంబులు తోఁచుచున్న' వని పలికి వానిని వీడుకొని తనయింటికిఁ బోయెను.

### పూతన

నందుఁడు వెంటనే మధురనుండి తరలి గోకులమార్గముఁ బట్టి 'వసుదేవుఁడేమో శంకించెను. సజ్జనులకు శంకలు నిష్కారణంబుగా జనింపవు. ఏమిరానున్నదో తెలియదు. సర్వము దైవాయత్తము. భగవంతుఁడే శరణ' మనుచు హుటాహుటి రాసాగెను.

అత్తఱి నొకానొకసుందరీరత్నము మల్లెవిరులుముడిచిన కేశబంధంబుతోఁ గుచభారంబున నసియాడుచున్న మధ్యదేశంబుతో, రత్నకుండలకాంతికీలితంబులైన కపోలతలంబులతో, లలితదరహాసచంద్రికలుగురియుచున్న ముఖమండలంబుతో, వలిపంపుమేలిపుట్టంబుతో, హస్తాగ్రగత లీలాకమలంబుతో సొబగారుచు వ్రజపురంబునకు వచ్చి నందుని యిల్లు చొచ్చెను. ఆశృంగారవతిని గాంచి సిరివచ్చెనోయని గోపీగోపకులు భావించిరి.

ఆయింతి యట్లు నందునియిల్లుచొచ్చి యుయ్యెలలో నిద్రించుచున్న చిన్నికృష్ణుని గాంచి చన్నులు చేపుటనోయన నబ్బాలకు నెత్తి కుఱువెక్కించుకొని కాలకూటవిషనిర్భరమైన దనఱొమ్ము నబ్బుడుతకుఁ గుడువఁ బెట్టెను. ముద్దుబిడ్డలఁ జూచినప్పుడు స్త్రీలకుఁ బాలుపొంగుట సహజముగావున

రోహిణీయశోద లాయింతికై లోలోన నగవుచు మిన్నకుండిరి.

కృష్ణుఁడు దానిచన్ను రెండుచేతులఁబట్టి యొత్తి గట్టి గాఁ బీల్చెను. ఆయింతి బిట్టఱచి గిజగిజలాడి నేలఁగూలి యసువులుతొలంగెను. ఆకేకలకు గోకులము తత్తఱిల్లి యెత్తి వచ్చి నందునియిల్లుముట్టిగి, యట మహావికృతరూపముతోఁ జచ్చిపడియున్న స్త్రీని, దాని చంకలోనున్న కృష్ణునిఁ గాంచి విభ్రాంతిచెందెను. యశోదాదేవియుఁ దెలివొంది కృష్ణునెడిచి యెత్తి చంకనిడి గోపుచ్ఛభ్రమణాదులవలన రక్షగావించి గోమూత్రంబున జలకంబొనర్చి గోరజంబు బొట్టుపెట్టి గోమయంబున దృష్టితీసి స్తన్యమిచ్చి పాన్పుపైఁ బరుండఁబెట్టెను.

అంతలోన నందుఁ డిల్లుచేరి యందున్న జనంబునుజూచి మహోత్తరంబుం బొట్టపలదూఱి స్త్రీశవంబునుగాంచి సంగతివిని 'కటా ! మహామాయావిని బూతనయనురాక్షసిని బాలహారణార్థము కంసుఁడు పంపెననియు, అది రాజ్యమెల్లఁ దిరుగుచుఁ గన్నబిడ్డలను విషలిప్తములైన తన స్తన్యంబులిచ్చి చంపుచున్న దనియుఁ జెప్పిరి. ఇది యదేకాఁబోలు. వసుదేవుఁడు వ్రజపురమందు నుత్పాతంబులు శంకించి త్వరపెట్టి నన్నుఁబంపెను. అతఁడు మహాయోగి యననలయు'నని తలపోసి యాశవంబును దహింప నాజ్ఞాపించెను.

## కంసపరితాపము.

పూతనచావువార్త కంసునికిఁ దెలిపిరి. అతఁడు దాని మృత్యువెవ్వరైనదియు నెందున్నదియు గ్రహించెను. అతఁ డక్కాంక్షిగిరియు బాహాటముగా వానిసి వధించిన రాజ్యవిప్లవం

బగునని శంకించి తనకూర్చుమిత్రులగు తృణావర్తాదిరాక్షసు లను రావించి రహస్యంబుగా వారితో మంతనంబులు సలిపి జాగరూకులై కార్యము సాధింపుమని వారికిఁ గట్టడిగావించెను.

రాక్షసతత్త్వవిచారము.

రాక్షసులు గలరా ? యని నవనాగరకులు శంకింప వచ్చును. స్వభావమును బట్టి మనుష్యులో రాక్షసులో యగుదురు. మనుష్యులు సుకృతులనియు దుష్కృతులనియు రెండు తెగలుగానుందురు. దుష్కృతులు మూఢులనియు, నరాధములనియు, మాయాపహృతజ్ఞానులనియు, అసురులని యు మఱల నాల్గువిధములగుదురు.

భగవంతుని స్వరూపజ్ఞానము బొత్తుగా లేనివారిని మూ ఢులనిరి. భగవంతుని స్వరూపజ్ఞానంబుండియు భగవంతునకు సుముఖులుగానివారిని నరాధములనిరి. భగవంతుని స్వరూప జ్ఞానముండియు భగవంతునకు సుముఖులుగాకపోవుటయేగాక కూటయుక్తులు పల్కుచు విపరీతభావమునకుఁ జిక్కియున్నవా రిని మాయాపహృతజ్ఞానులనిరి. భగవత్స్వరూపజ్ఞానము దృ ఢముగాఁ గల్గియు భగవంతుని ద్వేషించువారు అసురులనిరి.

అసురులకు రాజసీప్రకృతి ప్రధానమైయుండును. అందువలన వారు కేవల స్వార్థభోగైకపరులై తదర్థము శాస్త్ర గర్హితవిషయంబుల నాచరించుచు అదేజీవితావధిగా భావించు చుందురు. రాజసీప్రకృతికన్నఁ దామసీప్రకృతి ప్రధాన మైనచో వారినే రాక్షసులందురు. తామసీప్రకృతికి హింసా ద్వేషములు నైసర్గికములు. దానంజేసి రాక్షసులకుఁ బర హింసలు క్రీడలగును.

యోగశక్తులు అణిమాదులు గలవు. యోగాభ్యాసంబున నవి సిద్ధించును. యోగాభ్యాసంబునకు సుకృతులును దుష్కృతులును రెండుతెగలవారు తగుదురు. ఏతెగవారు యోగంబు నభ్యసించినను అణిమాదిసిద్ధులు వారివారి ప్రయత్నదార్ఢ్యంబునుబట్టి కలుగుచుండును. సుకృతులకు మోక్షము ప్రధానముగావున యోగఫలంబుగా అణిమాదిసిద్ధులు లభించినను, అవి మోక్షమునకు సహకారులుగానందున వారు వానిని మన్నింపనేమన్నింపరు. ఎప్పుడైనను వారట్టిశక్తులఁ జూపనైనప్పుడు అవి పరోపకారార్థమగునేగాని యపకారార్థముకానేరవు. దుష్కృతులు తమకులభించిన పైశక్తులను స్వార్థముపయోగింతురు. దుష్కృతులలో అసురులట్టిశక్తులను స్వార్థముఁ బరహింసార్థము రెంట నుపయోగింతురు. రాక్షసులన్ననో పరహింసయే వారికిఁ గ్రీడకావున నట్టిశక్తులను దదర్థమై వినియోగింతురు.

మఱియు దుష్కృతులు వారిమహోత్కట పాపకార్యఫలముగా భూతప్రేతపిశాచాదులై యుందురు. ఈ సంగతిని మనశాస్త్రమేగాక మహమ్మదీయ క్రైస్తవశాస్త్రంబులు సయితమంగీకరించుచున్నవి. అంతియగాదు. భూతప్రేతపిశాచంబులు బాధించుట నేఁడును మన మందందు వినుచున్నాము. ఇవియెల్ల మంత్రశక్తికి లోఁబడివర్తించును. ఇట్టిమంత్రంబులను క్షుద్రవిద్యలందురు. తామసప్రకృతులట్టి క్షుద్రవిద్యలఁగఱచి తన్మూలకంబుగాఁగూడ లోకంబునకు బాధకలిగించుట గలదు.

కంసునియందు అసురప్రకృతి ప్రధానమైయున్నందున

అతఁడు స్వకార్యార్థమై రాక్షసాదులను జేరఁదీసి వారిమూలకంబున నిజకార్యంబును సాధింప యత్నించెను. భగవంతుఁడు సర్వశక్తులకు మూలము. వానియెడలఁ బరశక్తులు సాగవు. కృష్ణుఁడు భగవదవతారము. ఈరహస్యము కంసుఁ డెఱుఁగును. అయినను వానిప్రకృతి వానికిఁ గన్నులుగప్పెను. అతఁడు మోహగ్రస్తుఁడై వర్తింపసాగెను. స్వభావము దురత్యయముగదా.

యోగశక్తివలనఁగలుగు కామరూపము నిద్రాకాలంబునను సంగమసమయంబునను ప్రాణనాశమునను నిలువదు. ఎంతకాలము బుద్ధి యోగశక్తియందే నిలుచునో అంతకాలము మాత్రమే యాశక్తి వర్తించును. పైనఁ జెప్పిన మూఁడు కాలములందు బుద్ధికిఁ బతనము గలుగుచున్నది. ఆకారణంబున నప్పుడు యోగశక్తి నశించుచున్నది. ఆశక్తి నశించినంతనే తత్ఫలమైన కామరూపముగూడ నశించును. నైజరూపము స్వతస్సిద్ధముగును.

పూతన యోగశక్తి నాశ్రయించి మహాసౌందర్యవతియై వచ్చెను. కృష్ణుఁడు దాని ప్రాణంబులను హరించినంతనే యది స్వరూపంబును దాల్చుటయ్యెను. రాక్షసులకును మర్త్యులకును యోగప్రత్యాగవిధానంబున భేదంబును బట్టి రాక్షసులయునికియుఁ జూపునను భయంకరముగాఁ గ్రూరముగానుండును.

### శకటభగ్నము.

మూఁడు నెలలు నిండినతర్వాత బిడ్డలను బోర్లఁబండఁ వేయుదురు. నాఁడు పండువు చేయుదురు. కృష్ణుఁడు మూఁడు

నెలలఁబుడుతయయ్యెను. నాఁడు వానిజనన నక్షత్రమగుట యుఁ తటస్థించెను. యశోదాదేవి యాదినము వేడుకలు చేయఁ దలంచి గోపకాంతలను విందునకుఁ బిలిచి పుత్త్రునకు మంగళ స్నానము గావించి స్వస్తివాచకంబులిప్పించి బ్రాహ్మణోత్తము లను యథార్హసత్కారంబుల వీడ్కొలిపి, సుతునకుఁ బాలిచ్చి యుయ్యెలతొట్టెఁ బరుండఁబెట్టి జోలపాడి నిదురపుచ్చి వింద లకు మర్యాదలు గావించుచునుండెను.

కొంతవడికిఁ గృష్ణుఁడు మేల్కాంచి పాలకై యేడ్చెను. యశోదాదేవి కార్యాంతరతత్పరయై యుండి సుతునియేడ్పు వినదయ్యెను. ఎంతసేపటికిఁ దల్లిరామికిఁ గృష్ణుడుకినిసి కాళ్లు చిమ్మెను. ఆతన్నువడికి నుయ్యెల యుబ్బ్రాఁగి చేరువనున్న శకటంబును దాఁకెను ఉయ్యెలతాఁకువేగంబునకు శకటంబు తలక్రిందయ్యెను. ఆబండినిండుగాఁ బాలకడవలుండెను. అవి యెల్లదొర్లి యిల్లు పాలవెల్లిగాఁ దోఁచెను.

ఆసడికి రోహిణీయశోదలు పరువెత్తి వచ్చి యందాట లాడుచున్న గోపబాలకులవలన సంగతియెల్ల విని వింతపడిరి. యశోద తనపట్టిని జంకనిడి చుంచువులు దువ్వి కాళ్ళుచమిరి చన్నిచ్చి యేడ్పుమాన్పి నిదురపుచ్చి తనపనికిఁ బోయెను.

మూఁడునెలల బుడుతయేడ ? కాళ్ళాచుటయేడ ? ఉయ్యెల యుబ్బ్రాఁగి శకటంబును దాఁకుటేడ ? అది దొర్లు టేడ ? అని శంకింపవచ్చు. భగవన్మహిమలకు మేరగలుగ దనియు, కృష్ణావతారము భగవన్మహిమావతారమనియు నమ్మినచో నిట్టి శంకలకు నవకాశముగలుగదు. భగవన్మహి

మలు అలౌకికంబులై యూహాతుమించియుండును. ప్రతి మహిమకు నేదేనొకప్రయోజనముండును. ఆఫలము తాత్కాలికదురూహ్యమైనను గాలాంతరమున స్పష్టపడుచుండును.

## తృణావర్తుఁడు.

కృష్ణుఁ డేడాదిబాలకుఁడయ్యెను. ఒకనాఁడు యశోద గోపికలతోఁడఁ దనయింటిముందున్న పచ్చికబయలులోఁ గూర్చుండి కృష్ణుని వారిమ్రోలఁ బరుండబెట్టి ముచ్చటలాడుచుండెను. తటాలున సుడిగాలి వీచి కెంధూళిచీఁకట్లు గప్పెను. కన్నులు మూఁతపడెను. గాలివడికిఁ గొందఱు దవ్వునఁబడిరి.

కొంతవడికి గాలి నిలిచెను; దుమ్ముచీకట్లు విరిసెను. యశోదాదులు తెప్పఱిల్లి కనువిచ్చి చూచిరి. కృష్ణుఁడు గానరాడయ్యెను. గాలికిఁ దవ్వువిసరఁబడెనోయని నలువంకలు వెదకిరి. ఎందును బాలుఁడు గానరాఁడు. యశోద గుండియలు మోఁదుకొనుచు నేలఁబొర్లాడుచు దూడచన్న గోవుచందాన రోదనముచేయసాగెను. ఆమెతోడ గోపికలును బెనురొదగావించిరి. వారియేడ్పులకు గోకులమెల్ల నొక్కటనెత్తి వచ్చెను. బాలకునికై వెదకనైనచోట్లెల్ల వెదకిరి. శోకార్తిధ్వనులు పెల్లయ్యెను.

అట్లు వారు శోకనిహతలై రొదసేయుచుండఁగా వారిమ్రోల దబ్బునఁ బెనుబండ పడినట్లాయెను. ఎల్లరు ఉలిచ్చిపడిరి. వారిభయభ్రాంతులు కొంతవడికిఁ దీఱెను; కనువిచ్చి చూచిరి. వారిమ్రోలఁ బెనుభూతమునంటివాఁడు పడియుండెను. కృష్ణుఁడు రెండుచేతుల నమ్మహాసిక్కృతా కాయుని

కుత్తుకఁబట్టి వానియురంబున వ్రాలియుండెను.

గోపికలెగచి కృష్ణునొడిచి లేవనెత్తి చూచిరి. ఆ కూన కసుగందక చిఱునవ్వులు నవ్వుచుండెను. ఆబుడుతను గొనిపోయి మూర్ఛాక్రాంతయైపడియున్న యశోదయొడిలో నుంచిరి. ఆమె మెల్లఁగాఁ దేఱి ముద్దుపట్టినిగూర్చి ముద్దాడి హర్షాశ్రులు వర్షించెను. ఆవింతకు నెల్లరు నచ్చెరువందుచు,

'మ॥ గతజన్మంబుల నేమి నోచితిమొ ? యాగశ్రేణులేమేమి సే,
సితిమో ? యెవ్వరికేమిపెట్టితిమొ ! యేచింతారతిం బ్రొద్దు పు,
చ్చితిమో? సత్యము లేమి పల్కితిమొ ? యేసిద్ధప్రదేశంబుఁ ద్రొ,
క్కితిమో? యిప్పుడు దక్కఁగంటిమిసుమా కృష్ణార్భకున్ నిర్భయున్॥'

అనుచుఁ బరమసంతోషపరవశలైరి. అంతలోన నందాదిగోపవృద్ధులచ్చటకు వచ్చి చచ్చిపడియున్నవానిం గాంచి వాఁడు కంసునియనుచరుఁడైన తృణావర్తుఁడను రాక్షసుఁడగుట గుర్తించి 'కటా! ఈపాపాత్ముఁడు కృష్ణుని హరింపవచ్చెఁగాఁబోలు' ననుచు నోటితీఁటవోవ వానినిదిట్టి బుడుతనెత్తికొని యింటికిఁ బోయిరి. నాఁటి ముచ్చటలతో వ్రేపల్లెకుఁ దెల్లవాఱెను.

* రాక్షసమాయలను యోగసిద్ధులను నమ్మనికొందఱు మాంసాశనియైన యొకపెద్దపక్షిని గవి యట్లు చమత్కరించెనని పల్కుదురు. క్రీస్తువును మహమ్మదును యోగసిద్ధిప్రభావంబులను మహాద్భుతంబులైనవానిని జూపినట్లు వారినిగూర్చిన గ్రంథములు తెలుపుచున్నవి. శ్రీశంకరభగవత్పాదులవారు గూడఁగొన్నిఁటిఁ బ్రదర్శించినట్లు వారిజీవితచరిత్ర తెలుపును. ఇవియెల్లఁ బ్రాఁతపురాణంబులన్నను, ఇటీవలివఱకునుండిన

సాయిబాబాగారి సంగతినైన నమ్మరా ? వారిమహిమలు కన్నారఁగాంచిన నిన్నటిమొన్నటివారు తమయనుభవంబులను లోకోపకారార్థము గ్రంథరూపంబున వెలువరించిరి. వారిని గూడ విశ్వసింపరా ?

వేయేల ? స్వానుభవంబును వినుఁడు. నాస్వస్థానమైన కాపలిగ్రామంబునకు నుత్తరదిశయందు 30 మైళ్ళదూరమున కందుకూరుగ్రామము గలదు. అచ్చట నామిత్రుఁడు శ్రీ కంఠం కృష్ణరావుగారు బోర్డుపాఠశాలలో 1931 వ సంవత్సరంబున సహోపాధ్యాయులుగానుండిరి. అప్పుడచ్చట నొకమహాత్ముఁడుండెను. వారినిసందర్శించుటకై నన్నును నాచిరమిత్రమును బ్రకృతము కీర్తిమూర్తియునైన శ్రీరావు సాహెబు వెన్నెలకంటి కృష్ణస్వామిరావుగారిని శ్రీకృష్ణరావుగారు ఆహ్వానించిరి. మేమిరువురము గందుకూరునకుఁబోయి రెండుదినములు మామిత్రమునకు విందలమై యుండి యా మహాత్ముని సందర్శించితిమి.

ఆమహనీయుఁడు పాంచాలదేశీయుఁడుగాఁ దోచెను. ఆయన యొకచోట నిలువఁడు; పెక్కుమాటాడఁడు. హిందూస్థానిభాషలో నన్యాపదేశముగా నొండురెండుమాటలు పల్కును. పిడికెడు వేఱుసెనగకాయలు వానియాహారము. ప్రతిదినము ఏపూటనో యొకపూట యాయన శ్రీకృష్ణరావుగారి యింటికి వచ్చువాఁడట. ఆయనను సందర్శించితిమి. ఆయన చర్యలు కొన్నివింటిమి ; స్వగ్రామముచేరితిమి.

తర్వాత రెండుమాసములకు నేను చెన్నపట్టణము చనుటయ్యెను. ఒకనాఁడు సాయంకాలము హైకోర్టువెంబడి వచ్చు

చుంటిని. ఆమహాత్ముఁడు నాకచ్చట నెదురయ్యెను; నమస్క-
రించితిని. వానిదృష్టి యొందో యుండెను. నిస్సంగుఁడైన
యాం... పట్టణమునకు నేలవచ్చెనో యనుకుతూహలము
నాకు జనించెను. వెంటనే నేను మరలి హైకోర్టులోని తంతె
యాఫీసునకుఁ బోయి 'స్వాములవారు కందుకూరులోనున్నా
రా ?' అని నామిత్రుఁడు శ్రీకృష్ణరావునకు అర్జెంటు తంతె
యిచ్చితిని. అప్పుడు తనయింటనే యున్నాఁడని నామిత్రము
బదులు తెలిపెను. నాకు మహాశ్చర్యమయ్యెను. తర్వాత
విచారింపఁగా స్వాములవారట్లు ప్రత్యక్షమగుట కందుకూరు
ప్రాంతమందు సామాన్యవిషయమే యని తెలిపిరి. శ్రీస్వా
ములవారు తర్వాత కందుకూరులోనే సిద్ధిగాంచిరి. అచ్చట
వారికిప్పుడు పూజాదులు జరుగుచున్నవని విందుము.

### కృష్ణుఁడు—వ్రజపురవాసులు.

కృష్ణుఁడలౌకికలావణ్యశాలియగుటయేగాక పుట్టుపు
దొట్టి యసదృశపరాక్రమవంతుఁడును నిరంతరానందపరవశుఁ
డునై ముద్దుసగుఁదేటల నెల్లరనాకర్షించుచుండెను. గోప
బాలికాబాలకులు వానితోడియాటలకు మఱగి తలిదండ్రులను
గూడ మఱచిరి. తెల్లవాఱిలేచుట నందునియింటికిఁ బరుగెత్తుట
కృష్ణుని మేల్కొలుపుట వానితో నాడుచుండుట, ఇవి యా
పిల్లలకు దినచర్య యయ్యెను.

గోపవృద్ధులును గృష్ణునిఁ దమకన్నబిడ్డలకన్న మిన్న
గాఁ బ్రేమించిరి. కృష్ణుని దినమొకసారియైనను జూడకున్న
వారికి మనశ్శాంతి కలుగకుండెను. వానియెడ నట్టినిష్కారణ
వాత్సల్యంబేలకలుగుచున్నదో వారికే యూహింపరాదయ్యెను.

మఱియుఁ గృష్ణుఁడు పెద్దయగుకొలఁది గోపకులంబున నపూర్వమైనమార్పు గలుగసాగెను. అంతఃకలహాగ్నులు చల్లా రెను ; పరస్పర ప్రేమానురాగంబులు పఱచెను ; ఇంటింట సంతోషదేవత వెలిసెను.

## శైశవలీలలు.

కృష్ణుఁ డందునిందునెందునుండును. ఒకపరి గోవులను దోఁకబట్టి యీడ్చును ; ఒకపరి వృక్షాగ్రమెక్కి విహగ ధ్వనులు గావించును ; ఒకపరి పచ్చికయెడారుల నృత్యమాడి గోపబాలికల నాకర్షించును ; ఒకపరి ఎల్లరఁగనుఁబ్రామి శ్మశానవాటికల సంచరించును ; ఒకపరి గోపికలయిండ్లుమాటి వెన్నముద్దలు మ్రుచ్చిలి తోడివారికి గుడువఁబెట్టును. ఉట్ల మీఁదినేతిదుత్తలకుఁ దూట్లుపొడిచి నవ్వుచుఁ బాఱిపోవును ; అకాలంబునఁ గ్రేపుల విడుచును ; అదలించిన బెదరించును ; పట్టుకొనఁబోయినఁ బఱచును.

## యశోద—గోపికలు.

కృష్ణుని దుడుకులు గోపికలకు సహింపరావయ్యెను. ఒకనాఁడు వారు గుమిగూడి యశోదయొద్దకుఁ బోయి,

‘కం॥ ఓయమ్మ ! నీకుమారుఁడు
మాయిండ్లను బాలు పెఱుఁగు మననీఁడమ్మా !
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన, మంజులవాణీ ॥’’

అని మొఱపెట్టిరి. యశోద వారిని విని ‘అమ్మలారా ! కృష్ణుఁడు నన్ను విడిచి చనఁడు. ఏపాపంబెఱుంగనిపాప నిట్లు ఱవ్వసేయనగునా ? మీమాట నిజమేని దొంగను బట్టితెండు’

అనెను. గోపికలు తలవ్రాల్చి యట్లేకానిమ్మని పలికి చనిరి.

మాయాకృష్ణులు.

ఒకనాఁడు కృష్ణుఁడు పెక్కుకృష్ణరూపంబులు దాల్చి గోపికలయిండ్లలో నేకకాలంబున దూఱి వెన్నదొంగిలింపసాగెను. గోపికలొక్కొక్కరు నొక్కొక్కకృష్ణుని బట్టుకొని దొంగజిక్కెననుచు యశోదయొద్దకు వానినిఁగొని వచ్చిరి. కృష్ణుఁడు యశోదయొద్దఁ గూర్చుండి యాటలాడుచుండెను. గోపికలు పట్టితెచ్చినకృష్ణులు వారిచేతులలోనే మాయమయిరి. ఆవింతకు నాశ్చర్యంబుగాంచుచు దమయత్నభంగంబునకు సిగ్గునొందుచు నేమియుఁబలుకనోపక వారు వచ్చినదారిఁ బట్టిరి.

విశ్వరూపదర్శనము.

ఒకనాఁడు కృష్ణుఁడు బలరామగోపబాలకులతోఁగూడి యాటలాడుచు మన్ను తినెను. తోడిబాలకులు వానినిఁబట్టి యశోదయొద్దకుఁదెచ్చి 'అమ్మా! నీకొడుకు మన్ను తిన్నా' డనిరి. యశోద యందులకు మిక్కిలి విసివి కృష్ణునిఁ గేలఁ బట్టి

"కం॥ మన్నేలభక్షించెదు?
మన్నియమములేల నీవు మన్నింపవు? మీ
యన్నయుం సఖులును జెప్పెద
రన్నా? మన్నేల? మఱిపదార్థములేదే?"

అని గద్దించెను. కృష్ణుడు తల్లికిఁ భయపడినవాఁడువోలె గడగడవడఁకుచుఁ గన్నీరు నించుచు 'అమ్మా! మన్ను తిన లేదు; వీరు బొంకుచున్నారు. ఇదిగో చూడు' మని నోరు

తెఱచెను. వానివక్త్రాంతంబున సమస్తలోకంబులును చరాచరభూతజాలంబును గోపికాగోపకులును దానును వ్రజపురంబును గాన్పించెను. అదిగాంచి యశోదాదేవి మహాశంకాకులయై,

"మ॥ కలగో, వైష్ణవమాయయో, యితరసంకల్పార్థమో, సత్యమో,
తలఁపన్నేరకయున్నదానఁ, యశోదాదేవిఁగానో, పర
స్థలమో, బాలకుఁడెంత? యీతనిముఖస్థంబైన యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమిహేతువో? మహాశ్చర్యంబు చింతింపఁగన్॥"

అనితలంచుచుఁ దదేకచిత్తయై మైమఱచెను. కృష్ణుఁడది గాంచి 'నాతత్త్వంబు నొకకొంత యీమెకుఁ జూపితి. ఈయవస్థ స్థిరమయ్యేనేని బుత్త్రవాత్సల్యానందంబునకు నీమె దూరమగు. ఇఁకఁ జాలు' నని భావించి వైష్ణవమాయను గప్పెను. యశోదాదేవి బహిర్ముఖయై తాఁగన్నదెల్ల స్వప్నముగా భావించి పుత్త్రునిఁ దొడపై నిడి బుజ్జగించెను.

కృష్ణునియెడ యశోదానందులకుఁగల ప్రేమానురాగంబులు దేవకీవసుదేవుల ప్రేమానురాగంబులకన్న విలక్షణంబులనుట స్పష్టము. కన్నవారికన్న నియ్యిరువురకుఁ గృష్ణునెడ నిట్టిభావంబుగలుగుటకుఁ గారణము గలదు. నందుఁడు పూర్వజన్మంబున నష్టవసువులలో నొకఁడైన ద్రోణుఁడుగా నుండెను. యశోద యప్పుడు ధరయనుపేర వానికి భార్యయై యుండెను. బ్రహ్మదేవుఁడు వారిరువురను బ్రజాసర్గంబునకు నియమించెను. వారు పరమేష్ఠియాజ్ఞఁదలదాల్చి 'స్వామీ! భూలోకమందు మేము జన్మించినప్పుడు మాకు భగవంతునెడ నిష్కళంకనిరుపాధికభక్తి యుండునట్లుగా నను

గ్రహింపనగు' నని వేడిరి. పితామహుఁడు వల్లెయనెను. పర మేష్ఠివచనంబును జెల్లించుటకై భగవంతుఁడు కృష్ణావతార మెత్తి యశోదానందులకుఁ బుత్త్రుఁడై నటించెను. ఎల్లవాత్స ల్యంబులలోఁ బుత్త్రవాత్సల్యం బత్యధికంబు గావునను, బుత్త్ర నందువలె నన్యంబులందుఁ దల్లిదండ్రులమనంబు లీనముగాదు గావునను, భగవంతుఁడట్లు గావించెను. ఆకారణంబున య శోదానందుల ప్రేమానురాగంబులు కృష్ణునెడ నట్లత్యంత గా ఢంబులయ్యెను.

కృష్ణుని ఱోటికిఁ గట్టివైచుట.

ఒకనాఁడు యశోదాదేవి వఱువాతలేచి పనివాండ్రను వారివారిపనులకు నియమించి పాలయిల్లు చొచ్చి కృష్ణునిలీలలు పాడుచుఁ బెరుగు చిలుకుచుండెను. దధిమథనశ్రమకు జనిం చిన చెమ్మట బిందువులు ముఖమండలంబునకు నూత్నశోభఁ గూర్పఁగాఁ, జిలుకువడికిఁ గొప్పులోనిమల్లెపువ్వు లొక్కొకటి జాఱి పడుచుండఁగాఁ, గవ్వపుఁద్రాటితోడ నటునిటు నసి యాడుచున్న పిడికెడునడుము కుచకుంభభారంబునకు నూఁగు చున్నదోయను భ్రాంతిఁ గలిగించుచుండఁగా యశోదాదేవి యపూర్వశోభాతిశయంబున విరాజిల్లుచుఁ దదేకచిత్తయై యుం డెను.

అత్తఱిఁ గృష్ణుఁడు 'అమ్మా! పాలు' అనుచు దగ్గఱకు వచ్చి కవ్వపుఁద్రాడు పట్టుకొనెను. ఆమె చిలుకుట మాని పట్టిని జంకఁ గూర్చి ఱొమ్ముఁగుడువ పెట్టెను. అంతలోనఁ బ్రక్కగదిలోని పొయ్యిమీఁదిపాలు పొంగిపొరలుట విన

వచ్చెను. ఆసడి విని యశోద పట్టెని డించి గబగబ ప్రొయ్యి వంకఁబోయెను. కృష్ణుఁడలిగి యేడ్చుచు గుండ్రాతితోఁ బెరుగుబానను బగులవైచి యందలివెన్నముద్దను గైకొని బిఱబిఱఁజని దొడ్డిలోనున్న ఱోటిపయినిలిచి కొంచెకొంచెముగాఁ దాను వెన్న దినుచుఁ గోఁతులకు వైచుచు వానితో నాడుచుండెను

యశోదాదేవి ప్రొయ్యిమీఁది పాలబానదింపి వచ్చెను. గదియెల్లఁ బెఱుగుచిందియుండెను ; బాన పగిలియుండెను ; కృష్ణుఁడునుఁగానరాఁడు. ఆమె సంగతియెల్ల క్షణములో గ్రహించి బెత్తము చేతఁబూని కృష్ణుని వెదకుచుఁ బోయెను. ఆమె వచ్చుట కృష్ణుఁడు చూచి వెఱచినవాఁడువోలెఁ దటాలున ఱోలునుండి దుమికి పరుగెత్తసాగెను. యశోదాదేవి వానిని వెన్నాడి తఱిమెను కృష్ణుఁడు గృహస్తంభముల చాటుచేసి పట్టువడక తప్పించుకొనుచు నేడ్చుచుఁ గొండొక తడవామె నాడించి యెట్టకేలకుఁ బట్టుపడెను.

యశోదాదేవి వానినిఁచేతఁబట్టుకొని 'నాయనా! నిన్ను నాపను వ్రాల్పను నాతరముగాదు. ఏటిలో నీదులాడవలదంటిని ; మానవైతివి. పొరుగిండ్లకుఁ బోవలదంటిని ; వదలవైతివి. పులుగువేటలు కూడదంటిని ; వినవైతివి. చెప్పి చెప్పి నానోరు కాయగాసెను. నీమతమింతయు నఱలదు. నీవలసి అచ్చొయింతనరాదు.' అనుచు వానినిఁ గొనివచ్చి పగ్గముతో ఱోటికిఁ గట్ట యత్నించెను. ఆపగ్గము బెత్తెడు తక్కువయ్యెను ; వేఱొకతుంట తెచ్చి ముడివైచి మరలఁగట్టనుంకించెను ; అదియు బెత్తెడు తక్కువయ్యెను. ఎన్నితుంటలు ముడిపెట్టి

నను యథాపూర్వము బెత్తెడు తక్కువయగుచునే యుండెను. యశోద యలసి సొలసెను ; ఆమెమోమునఁ జిఱుచెమ్మటలు గ్రమ్మెను. ఆమెకై గోపాంగనలు నవ్వసాగిరి. ఆమెయు ముసిముసినవ్వులు నవ్వుచు నేమిచేయుటకుఁ దోఁపక బిచ్చపడి నిలిచెను. కృష్ణుఁడదిగాంచి తనమాయను మానెను. ఆమె యాత్రాటితోనే వానిని ఱోటికిఁ గట్టివైచి పాలుచిలుక బోయెను.

### నలకూబర మణిగ్రీవులు.

యశోద యట్లుచన్నంతటఁ గృష్ణుఁడు ఱోటిని మెల్ల మెల్లగాఁ జేరువనున్న జంటమద్దివృక్షంబులమధ్యకు నీడ్చి యందిరికించి గుంజెను. ఆవృక్షంబులు రెండును ఫెళఫెళ విఱిగి నేలఁగూలెను.

అందుండి దివ్యపురుషులిద్దఱు వెలువడి ‘దేవదేవా ! లోకనాయకా ! కుబేరకుమారులు నలకూబరమణిగ్రీవులిదే నీకు నమస్కరించుచున్నారు. మాతండ్రి ధనపతియగుట మమ్ము ధనమదము పైకొనెను ; రుద్రునిసిద్ధగణములలోనివార మగుట నధికారమదము మాకన్నుగప్పెను. మైమఱచుటకు నివి రెండేచాలును. ఇవిచాలవోయన మేము కొండొక నాఁడు వారుణీమద్యముఁ గ్రోలి యక్షాంగనల వెంటఁగొని కైలాసగిరియందు మందాకినీతీరంబునందలియుపవనంబులవి చ్చలవిడి విహరించి గంగానీరంబుల జలక్రీడలకు దొడంగితిమి. నారదమహర్షి యాదారివచ్చెను. వానినిజూచి యక్షాంగనలు తమదిగంబరత్వంబునకు ఋషిశపించునోయని వెఱచి నీరు వెడలి

వలువలు ధరించిరి. మేమిరువురము మధుపానవివశులము గాన ఋషిని లెక్కింపమైతిమి.

నారదమహర్షి మాకు నాగ్రహపడి 'యువకులారా ! అభిజనగర్వము, విద్యాహంకారము. ధనమదము—ఒండొండే పతనమునకుఁ జాలు. ఇవిమూఁడు మీయెడఁ గూడెను. ఇవి చాలవోయనఁ బదవీగర్వముగూడ మీకు సిద్ధించెను. రజోగుణము మిమ్ము మ్రింగుట వింతగాదు. రజోగ్రస్తులకు దేహభోగమే సర్వమగును. వారొండుగానరు. దేహంబనశ్వరముగా శాశ్వతంబుగా వారికిఁ దోఁచు. దానికిఁ బతననాశంబులు కలలోఁగూడ వారు తలంపరు. బ్రాహ్మణదేహమగుఁగాక ; రాజదేహమగుఁగాక ; మఱియెట్టిదైననగుఁగాక. దాని యంత్యగతియేమి ? దేహమును బూడ్చిరేని కుళ్ళిచదలు పట్టి నశించును ; కాల్చిరేని బూదియైపోవును ; పాఱవైచిరేని మృగపక్షులకు నాహారమగు. ఈపాటిదానిని మూఢులెంతో మక్కువచేయుదురు. దానిపోషణార్థము నానాప్రాణుల సిలువున జంపుదురు. ఈ క్రూరకర్మఫలముగా నరకాదిక ఘోర దుఃఖంబులు గలుగుట యెఱుంగరు.

ఆసంగతి యట్లుండనిమ్ము. శరీరంబెవ్వరిసొమ్ము ? అది కన్నవారి సొమ్మా ? పోషించినవారిసొమ్మా ? పనిగొనువాని సొమ్మా ? కొనువారిసొమ్మా ? అది యెవరిసొమ్మునుగాదు ; ప్రకృతివలనఁబుట్టి ప్రకృతియందే లయించును. దానికెన్నడును నిల్కడలేదు. ఈరహస్యంబును మీరుమఱచితిరి ; దాని లాలనార్థము విశృంఖలవృత్తిఁ దొక్కితిరి. ఇందులకు మీ రజోగుణమే కారణము. ఆగుణవృద్ధికి ధనాధికారాభిజనం

బులు మూఁడును బ్రాపులయ్యెను. దారిద్ర్యంబున ధన మదంబుడుగు; అధికారగర్వంబునకు సేవావృత్తి ప్రాయశ్చిత్తమగు ; అభిజనాహంకారంబు నీచజననంబున నివృత్తిఁగాంచు. మీరు కుబేరపుత్త్రులగుట తీవ్రశాపంబు నీయనైతి. మీరు భూలోకంబున వ్రజపురమందు యమళార్జునవృక్షంబులై పుట్టి నూఱుదివ్యవర్షంబులుండి శ్రీకృష్ణపాదస్పర్శచేతఁ బునీతులరై యథాపూపము నొందుదురుగాక' అని శపించి పోయెను.

దేవా! నారదశాపహతులమై వృక్షరూపంబుల నిందుఁ బుట్టి నూఱుదివ్యవర్షంబులుగా భవత్పాదతాడనార్థము వేచి యుంటిమి. నేటికి మాపాపము తీఱెను. నీదివ్యపాదంబులశోకు కల్మిఁ గననోచితిమి. లోకరక్షకా! ఏనీపాదదర్శనార్థము ఋషులును రాజర్షులును దేవగంధర్వసిద్ధచారణాదులును నిరంతరము పరితపింతురో ఆనీదివ్యపాదసందర్శనము మాకు నేఁడు చేకూఱెను. ఇదియెల్ల మహర్షియనుగ్రహాఫలమని భావింతుము.' అని పునఃపునర్నమస్కారంబు లాచరించిరి. కృష్ణుండును లోలోననవ్వుచు 'శుభమగుఁ బొమ్ము' అనెను. అంత వారు కేల్దోయి గూర్చి 'మాస్మృతి నీకళ్యాణగుణస్మరణంబు నందును, మావాక్కు నీదివ్యనామోచ్చారణంబునందును, మాకరంబులు నీసేవాకార్యంబులందును, మానేత్రంబులు నీదివ్యమంగళవిగ్రహాదర్శనమందును, మాచిత్తము నీపాదారవిందంబులయందు నిరంతరముఁ దగిలియుండునట్లు కృపసేయు' మని వేడి యనుజ్ఞాతులై చనిరి.

మద్దివృక్షంబుల ఫెళఫెళధ్వని పురమెల్లఁ బ్రాకెను. ఏమియుత్పాతమోయని గోపికాగోపకులు పఱువెత్తి వచ్చిరి.

కప్వేసుఁ బాఱవైచి యశోదాదేవియు హుటాహుటిఁ జను దెంచెను. నందుఁడు ముంగిటనుండి యెగిరి గంతువైచెను. మద్దిచెట్లు రెంఢును గూలియుండెను. వానిమధ్య కృష్ణుఁడు ఱోటితోఁ దసిఁజిక్కొని యుండెను. సంగతియేమో యెవ్వరును గ్రహింపలేరైరి. నందుఁడు బిఱబిఱ బంధనము వదలించి కృష్ణుని జంక చేర్చెను. యశోద వానిని బుడికిముద్దాడెను.

అచ్చటకు దాపున గోపబాలకులు కొందఱాడుచుండిరి. సంగతి యేమని వారినడిగిరి. కృష్ణుఁడు ఱోటినిఁ జెట్లనడుమ నిఱికించి లాగెననియు, ఆవృక్షంబులు తెగికూలెననియు, అం దుండి యెవరో దివ్యపురుషులిద్దఱు వెలువడి వచ్చిరనియు నబ్బాలకులు చెప్పిరి. ఆమాటలను గొందఱు నమ్మరైరి. 'కృష్ణుఁడు పుట్టినదిమొదలు మనముచూచినవింతలలో నిదియు నొకటిగావచ్చు' నని కొందఱు తలయూచిరి.

రత్నప్రదానము.

ఒకనాఁడు కృష్ణుడు తోడిబాలికాబాలురఁగూడి ముం గిట నాడుచుండెను. ఒకముదుసలి నెత్తిమీఁదగంపనుంచి 'పండ్లో' యనుచు నద్దారివచ్చెను. కృష్ణుఁడు హుటాహుటి నింటిలోనికిఁబోయి దోఁసెడు గింజలు తెచ్చి పండ్లదానిపొటఁ బఱచి గంపలో గింజలువైచి దోసెఁడు పండ్లు గైకొనివచ్చి తానుఁ దోడివారిగూడి యారగించెను.

ఆముదుసలి యందుండి చని యింకొకరికిఁ బండ్లమ్ము టకుగాఁ నెత్తిగంపను దింపెను. అందు రత్నాలుగానవచ్చె ను. ఆముదుసలి యావింతకు నాశ్చర్యపడి తన్నుఁ దానమ్మఁ జాలక రత్నవ్యాపారులయొద్దకుఁ బోయి గంపలోనివానిని

జూపెను. వారు చిరపరీక్షచేసి యవి మేలిరత్నంబులనిరి. ఆ ముదుసలి యీమాటకు సంతోషవివశయై యవియెట్లువచ్చెనో యూహింపఁజాలక నాటితో నిజదారిద్ర్యంబు తీఱెనని భావించి వానినమ్మి జీవితశేషంబును సుఖముగాఁ బుచ్చెను.

## బృందావన ప్రయాణము.

వ్రజపురము మధురకు ననతిదూరమగుట యందలి సంగతులు కంసునకు నప్పుడప్పుడే యందుచుండెను. అతఁ డెప్పుడేమిచేయునో యనుభయంబు నందాదుల వెన్నాడసాగెను. ఎందైనఁ బోవుదమాయని వారుతలంపఁజొచ్చిరి. ఏచోటైనను వారి గోధనంబునకు యోగ్యముగా నుండవలసినదయ్యెను.

ఇట్లుండ నొకనాఁడు తోఁడేళ్లు గుంపులు గుంపులుగా వచ్చి యాలమందలు చొచ్చి లేఁదూడల నూర్లకొలఁది చంపెను. వ్రజపురనివాసము మేలుగాదని తోఁచెను. గోపకులెల్లరుఁ గూడి కర్తవ్యము నూహింపసాగిరి. గోపకులలోనెల్ల వయోజ్ఞానంబుల రెంట వృద్ధుండును దేశకాలోపాయజ్ఞుండునైన యుపనందుఁడనువాఁడు వారినిజూచి 'వ్రజపురమందు మహోత్పాతంబులు పెక్కుగలిగెను. మనబిడ్డలయొక్కయు మనగోధనముయొక్కయు మేలుగోరుదుమేని వెనువెంటనే యీపల్లె వదలి పోవుట యుక్తము. ఇదిగో యీనందుని పట్టిని మన్రమోలనాడుచున్న వానినిఁ జూడుఁడు. పూతనబారి నుండి యీ బుడుత యెట్లు బ్రతికెనో యూహింపరాదు. తృణావర్తుఁడు సుడిగాలియై వచ్చి యీపాపను హఠాత్తుగా నెత్తికొనిపోయెను. మనయిలువేల్పు లడ్డపడుటవలనఁ గృష్ణుడు

మింటనుండి పెనుబండపైఁబడియుఁ గసుగందక జీవించెను. ఇతఁడు మద్దివృక్షంబులమధ్యఁ జిక్కుకొనెను. అవి నిలువునవిఱిగి పడెను. మనపూర్వపుణ్యవశంబున నితఁడు మనెను. మును ముందు మన కెట్టివిపత్తురానున్నదో తెలియదు; మనగతి యేమి గానున్నదో యూహింపరాదు. ముప్పుమ్రింగకమున్నె మేల్కొనుటొప్పు. ఈ సంగతిని దీర్ఘమాలోచించితిని. ఇటకు సమీపంబున బృందావనము గలదు. అది నదీగిరులతోను లతావనంబులతోను విశాలశాద్వలప్రదేశములతోను విరాజిల్లుచున్నది. అంతకన్నమంచితావు మనకు నివాసయోగ్యమైనది గానరాదు" అని పలికెను.

ఉపనందునకు గోపకులెల్లరు మేలుమేలనిరి. నాఁడే ప్రయాణంబును నిశ్చయించిరి. ఆలమందలు కదలెను; సంభారశకటంబులు తరలెను; శంఖారావంబులు గావించుచు ఢక్కాలు మ్రోయుచు గోపకులు నడచిరి. గోపికలు చిత్రవస్త్రాభరణంబులు దొడిగి పాలకడవలెత్తికొని కపోలముకురంబుల రత్నకుండలకాంతులు దొల్కాడఁగా, గటకధ్వనులు మందగతులకుఁ దాళమానంబులుగా మధురగానంబులొనర్చుచుఁజనిరి. రోహిణీయశోదలు రామకృష్ణులతోడ శకటంబుల మీఁదఁ బయనము సాగించిరి.

ఎల్లరు బృందావనము చేరి యొకచోట విడిసిరి. శకటంబుల నర్ధచంద్రాకారంబుగాఁ దీర్చి తన్మధ్యభాగంబున నాలమందలఁదోలిరి. కొందఱు మూఁదలకుఁ గాపుండిరి; కొందఱు మొక్కమోకలఁ జక్కఁజేసిరి; గుడారంబులు లేచెను; సంభారంబులు దిగెను; ప్రొయ్యిలు రాజెను; సరససల్లాపధ్వనులు

చెలరేఁగెను. ఆసందడికి నందలివన్యమృగంబులు వెఱచి వనాంతరంబులు ప్రాకెను. రాత్రియైనంత వారు భోజనాదులు గావించి పరుండి మైమఱచి నిద్రించిరి.

గోపులు వ్రజపురమందుఁ దరతరంబులుగా నుండిరి. వారికదియెంతయుఁ బ్రియమయ్యెను. ఇది సహజమే. అందుండుట వారికిఁక మేలుగాదని కృష్ణుఁడు భావించెను. ఏతన్మాత్ర కారణంబులకు వారాపల్లెను వదలునట్లు తోఁపదయ్యెను. గోధనమే వారిధనము. అట్టిజీవనోపాయంబునకు ముప్పుగల్గినఁగాని వారు వ్రజపురంబును విడనాడరని కృష్ణుడు నిశ్చయించి నిజమాయాబలంబున వృకంబులఁబుట్టించి యట్లు గావించి వారినందుండి బృందావనముఁ జేర్చెను. సాధుజనరక్షణము భగవంతునకు వ్రతమైయుండు. ఎవరికెప్పుడెట్లు మేలుగావింపవలయునో భగవంతుఁడొనర్చుచుండు. భగవల్లీలలు దురూహ్యంబులు. ప్రాకృతులది గ్రహింపనేరక తమ ముక్కునకు సూటిగా భావించి విఱ్ఱవీఁగుదురు.

## వత్సాసురుఁడు.

ఒకనాఁడు రామకృష్ణులు తోడిబాలురఁగూడి యాల మేపుచుండిరి. రాక్షసుఁడొకఁడు కంసునిపంపున వత్సరూపముదాల్చి యాలమందఁ జేరి కృష్ణునకై తఱివేచి యుండెను. కృష్ణుఁడది యెఱింగి రామునకుఁ జెవిలో బలికి మెలమెల్లగాఁ జని యామాయావత్సంబును దటాలున వెనుఁగాళ్లఁబట్టి దిర్దిరఁ ద్రిప్పివిసరి చెంగటివెలగమానుపయి మోదెను. ఆవ్రేటునకు మాయావత్సంబు నెత్తురులుమిసి యాచెట్టుతోడ నేలఁ

గూలి యసువులు వాసెను. ప్రాణంబులు వెడలుచేతడవుగా వత్సరూపంబు మాయమయ్యెను. అచ్చట రాక్షసుఁడు చచ్చి పడి యుండెను.

గోపబాలకులు గుమిగూడి మేలుమేలని కృష్ణునభినందించిరి. ఆసంగతి క్షణములో బృందావనము పరచెను. గోపకులు గుంపులుగా వచ్చి యారక్కసుని గాంచి 'కటా! ఇందును గంసునిబాధ తప్పదయ్యెఁగదా' యనుచుఁ గృష్ణుని వెంటఁగొని బృందావనమునకుఁ జనిరి.

బకాసురుడు.

ఒకనాఁడు రామకృష్ణులును గోపబాలురును యథాప్రకారము చలిదిమూఁటలు చిక్కంబులనిడికొని యాలమందలను తోలుకొనిపోయి వానిని మేఁతకు విడిచిరి. అవి కొంతసేపు మేసి దప్పిగొనెను. కాపరులు గోవులను గాళిందీజలంబులఁ ద్రాపి మరలివచ్చుచుండిరి. దారిలోఁ బెద్ద బకంబుండెను. దానిని జూచి గోపబాలకులు భీతిల్లిరి. ఆబకంబు చంచువుదీటి పక్షంబులు విధిల్చి కుప్పించి యెగచి బిలంబువోని వక్త్రంబుఁ దెరచి తీవ్రగతిన వచ్చి కృష్ణుని మ్రింగెను.

అది చూచి గోపబాలకులు శోకార్తులై 'అయ్యో! అయ్యో!' అనుచుఁ గొందఱును 'కృష్ణా! కృష్ణా!' అనుచు గొందఱును గేకలిడుచుఁ జెల్లాచెదరైరి. కృష్ణుఁడు బకవదనంబుజొచ్చినంతనే దానితాలువులు కార్చిచ్చునంబోలె కాలసాగెను. ఆవేడిమి నోర్వఁజాలక యది నోరప్పళించెను. కృష్ణుఁడు తన్ముఖాంతరమునుండి వెడలివచ్చి దానిదవుడలు

రెంటి రెండుచేతులఁ బట్టి గడ్డిపఱకునువలెఁ జీల్చివైచెను. ఆబకము నేలఁగూలి ప్రాణంబులు వదలెను. అంతలోన గోపబాలకులువచ్చి కృష్ణునిఁ గవుంగలించి తమయానందముఁ దెలిపిరి.

సాయంకాలమయ్యెను; గోవులు మందభూమిఁ జేరెను. నాఁటికత గోకులమెల్ల క్షణములోఁబఱచెను. గోపికాగోపకులు తండతండంబులుగా వచ్చిరి. నందునియిల్లు కిటకిటనయ్యెను, వారట్లు వచ్చి 'ఆహాహా! కృష్ణా! పుట్టినది మొదలు నిన్ను గండంబులు వెన్నాడుచునే యున్నవి. నీకుఁగీడురోయువారే చెడిరి. ఎందును నీకుఁగీడు గలుగదు. గర్గాచార్యుని పల్కులు జరుగుచున్న' వని పలువిధంబులఁ దమసంతాపసంతోషంబులఁ దెలిపి చనిరి.

అఘాసురుఁడు.

కృష్ణునకు నైదవయేడువచ్చెను. ఒకనాఁడు గోపకులు వనాంతరమందుఁ జలిదికుడుపులారగింపఁ దలంచిరి. కృష్ణుఁడు వఱువాతలేచి బారుగయూఁదెను. గోపబాలకులు పడకలువదలి చలిది చిక్కాలంబులు మూఁపులఁదగిల్చి లేఁగలతోడవెడలి మేఁతపొలముచేరి దూడలనువదలి యాటలకుఁ దొడంగిరి.

కొంతసేపు దొంగలాటలాడిరి; కోఁతులట్లు చెట్లెక్కి కొమ్మకొమ్మకు బ్రాఁకుచుఁ బండ్లుకోసి కొఱికివైచుచుఁ గొంతవడి వుచ్చిరి; పూగుత్తులుదాల్చి నెమ్మిపురిదండలు గైసేసి నాటకంబుఁ గొంతవడి ప్రదర్శించిరి; వేణుగానంబులు గావించిరి; నీడఁబట్టి పులుఁగులవెంటఁబఱచిరి; మయూరనృత్యం

చూపి 'మన క్రీడలకు నివియెంతయు నొప్పు. సమీపజలాంతరంబులఁ గమలంబులు వికసించి కమ్మనితావులు వెదజల్లుచున్నవి. ఆవాసనలఁబట్టి భ్రమరంబులు మరందలాలనకుఁ జిక్కి ఝుంకారంబులు గావించుచుఁ బద్మవనంబును మూఁగెను. ఇచ్చట మనము మధ్యాహ్నభోజనంబు లారగించి సుంతసేదదేఱి తరలుద'మనెను.

ఎల్లరు వల్లెయనిరి. వారంతట యమునాజలంబులఁ గాలుసేతులు కడిగివచ్చి చెట్లనీడఁగూర్చుండి మూఁటలు విచ్చి కుడువసాగిరి. కృష్ణుఁడు వారినడుమ నిల్చి డాకేల దధ్యోదనపుముద్దనిడి వలకేలఁ గొంచెకొంచెముగాఁ దీసి తినుచు మేలంబులఁజెలికాండ్ర నవ్వించుచు నుండెను. గోపబాలకు లాసంతోషంబునఁ గ్రేపుల సంగతి మఱచిరి.

దూడలు చూపుమేరదవ్వ దాఁటి కావరావయ్యెను. బాలకులు భీతిల్లి కుడుపులు మాని వత్సంబులకై పాఱనుండిరి. కృష్ణుఁడు వారిని వారించి తాను జని వనమెల్ల వెదకెను. ఎందును గ్రేపులు గాని వెంటనున్నవారుగాని గాన్పింపరైరి. అంతనతఁడు మరలి యథాస్థానమునకు వచ్చెను. అచ్చట గోపబాలకులొక్కరైనను గానరారైరి. కృష్ణుఁడు సుంత తలపోసి 'సరిసరి ; ఇదంతయుఁ బరమేష్ఠికార్యము. నా మాయాశక్తి యెంతో చూచుతలంపున విధాత యిట్లు క్రేపులను గోపబాలకులను దాఁచెను. ఒంటరిగా నింటికిఁ బోవుదునేని క్రేపులకై యావులును బిడ్డలకై గోపికలును రొదసేయుటగు; కానిమ్ము' అని నిశ్చయించి సంకల్పమాత్రంబునఁ దానే గోపకుమారులుగా గోవత్సంబులుగా నెందఱెన్ని యెట్లుండునో

యందఱునన్నియుఁ గా నై సాయంకాలమునకుఁ బల్లెచేరెను. గోవులు వత్సంబులను యథాప్రకారము కుడుపుకొనెను; వ్రజాంగన లాబాలకులఁ దమబిడ్డలుగానే భావించిరి.

అట్లొక్కసంవత్సరము గడచెను. అది బ్రహ్మకుఁ ద్రుటిమాత్రకాలమయ్యెను. పరమేష్ఠి యంతట సంగతియేమో చూచుకుతూహలంబున బ్రహ్మలోకమునుండి బృందావనమునకు వచ్చెను. అచ్చట గోపకుమారులును గ్రేపులును యథాపూర్వముండెను. బ్రహ్మ యది గాంచి తాను గోవర్ధనగిరియందు దాఁచినట్టి గోపకుమారులును వత్సంబులును దప్పించుకొనివచ్చెనో యని భావించి యటకు బోయెను. అచ్చట గోపకుమారులును వత్సంబులును గట్టుకదలక యట్లే యుండెను. అది బ్రహ్మకు నెంతయు విస్మయమొదవించెను. అంతియగాదు; రెండుచోట్లఁదానుచూచిన గోపకుమారులలో గోవత్సంబులలో నిక్కంబులేవో మాయాసృష్టంబులేవో వానికిఁగూడ గోచరింపదయ్యెను.

పితామహుఁ డట్లు విభ్రాంతచిత్తుఁడై యుండఁగా, గోపకుమారులును గోవత్సంబులును శ్రీకృష్ణరూపంబులు దాల్చి, నీలనీరదశ్యామలవర్ణంబుతోఁ, బీతాంబరంబుతో, శంఖచక్రగదాకమలవిరాజమానచతుర్బాహువులతో, నవరత్నఖచితకిరీటంబుతో, మణికుండలంబులతో, దారహారంబులతో, వనమాలికతో, శ్రీవత్సవక్షంబుతో, దరహాసచంద్రికాకందళితముఖారవిందంబుతో నొక్కరూపంబున వానియెదుటఁ దోఁచెను. ఒక్కొక్కకృష్ణమూర్తి యెదుట నొక్కొక్కచతురాస్యుఁడు నిలిచి సేవించుచుండెను. వారినివలకొని

యణిమాదిశక్తులును, మహదాదులును, కాలపురుషుండును, ప్రకృతియు, వాసనాదేవతలును, గుణకామకర్మఫలదేవతలును గొలుచుచుండిరి.

అచింత్యమైన యీమహాద్భుతంబును బ్రహ్మగాంచి విస్మయ విభ్రాంతి వశుఁడయ్యెను. వానియేకాదశేంద్రియంబులును స్వవ్యవహారంబులుడిగి స్తంభించెను. వాని నిగమజ్ఞానము వలసపోయెను; కన్నులుమిఱుమిట్లుగొనెను; అతఁడు ప్రతిమవలె నిలిచెను.

అంత భగవానుఁడు తనమాయను నుపసంహరించెను. బ్రహ్మ మరల స్మృతిని బడసి పునస్సముత్థితునట్లు భావించి కనువిచ్చెను. విభూతులెల్ల మాయమయ్యెను. శ్రీకృష్ణుం డొక్కఁడుమాత్రము కన్పట్టుచుండెను. అదియంతయు వైష్ణవమాయావిలాసమగుట పరమేష్ఠి గ్రహించి శ్రీకృష్ణునకుఁ బునఃపునస్సాష్టాంగ ప్రణామంబులాచరించి యిట్లు స్తుతించెను.

బ్రహ్మస్తుతి.

'దేవా! నీశక్తి నెఱుఁగఁగోరితి. నుంత ప్రదర్శించి నాకోర్కెఁ దీర్చితివి. నీశక్తికి మేరగలుగదు. సమస్తము నీవ మై యుండును. నీయందే సమస్తము నుండు. భవదన్యంబు గలుగదు. నీతత్త్వంబును దెలియఁగొందఱు జ్ఞానయోగంబు నాశ్రయింతురు. దానికి నీవందవు. కొందఱు కర్మయోగంబు ననుష్ఠింతురు. ఎల్లకర్మములకు నీవేమూలముగావున దానికి నీవు దొరకవు. కొందఱు భక్తియోగంబునవలంభించి సర్వాత్మకంబుగా నీకుసమర్పించుకొని నీనామస్మరణంబుఁ గావించుచు

నీయాజ్ఞలఁ జేయుచు నీతోడిదేలోకంబుగా నుండుదు. అట్టివారిననుగ్రహించి వారిమనఃపరిణతిప్రకారము నీదివ్యమంగళవిభూతులఁ బ్రకటింతువు. దేవా! నీలీలలఁగాంచుటకును, నీవిభూతులను సందర్శించుటకును, నీవలని యానందంబుఁ బడయుటకును, నిన్నుఁబొందుటకును భక్తికన్న నుత్తమమార్గము గలుగదు.

దేవా! నీవు నిర్గుణుండవును సగుణుండవునై వెలయుదువు. నీనిర్గుణతత్త్వము నిర్వికారము. వికారరహితంబగుట దానికి రూపముగలుగదు; రూపము లేమిం జేసి యది యదృశ్యము. దానికై ప్రాఁకులాడి యెందఱో మనస్వులు భగ్నమనోరథులైరి. నీసగుణతత్త్వమన్ననో యట్టిదిగాదు. లోకకళ్యాణార్థము నీవు రూపముఁదాల్చి యవతరించి నీవిలాసంబులఁ బ్రకటించి చిత్తంబుల నాకర్షింతువు. నీవచనామృతంబును గ్రోలి నీసందర్శనానందంబుఁ జవిగాంచినచిత్తం బన్యాంబుల నిరసించు. అదే వైరాగ్యమగు. తత్ఫలంబుగాఁ దుచ్ఛవాసనలు జన్మపరంపరాపాదితంబులైనవి సహితము సబీజంబుగా నశించు. ఆత్మకళ్యాణము సిద్ధించును.

దేవదేవా! సృష్టికర్త నని యహంకరించితిని. నా శక్తికి మించినశక్తి లేదని విశ్వసించితిని. నిక్కము గ్రహించితిని. దేవా! ఈనరాధముని యపరాధంబు సైరింపనగు. నీ సేవకునిగా నన్ను గ్రహింపుము; నీకరుణాపాత్రునిగా నన్ననుగ్రహింపుము.

దేవా! నేనొక్కలోకంబునకే కర్తయగుదు. నీరోమకూపంబులనుండి వేనవేలు లోకంబులు పుట్టుచుగిట్టుచునుండు.

నాశక్తియెక్కడ ? నీశక్తియెక్కడ ? వేయేల ? నాశక్తియెల్ల నీయనుగ్రహాఫలమేగదా. దేవా ! నిన్నూహించుటకు బుద్ధి చాలదు ; నీవు వాక్కునకు నందవు.

దేవా ! సమస్తజీవరాశికి నీవు మూలంబవును, నియంతవును, సాక్షివియు, నాశ్రయంబవు నగుటం జేసి చతుర్విధంబుల నారాయణపదవాచ్యుండవై తనరుదువు. బాహ్యదృష్టికి నీవు గానరావు. అంతర్దృష్టితో నిన్ను సులభముగా దర్శింపనగు.

దేవా ! నీవు అవాప్తసమస్తకాముఁడవు. కోరఁదగినదియుఁ బడయఁదగినదియు నీకుఁగలుగవు. అట్లుండియు నీశక్తి నిరంతరము వ్యవహరించుచునేయుండు. అది యెప్పుడెచ్చటనెందులకు వ్యవహరించునో యూహింపరాదు. నీశక్తివ్యవహారంబునకు దేశకాలప్రయోజంబులను వేదాదులు నిర్ణయించుట ప్రాకృతత్వప్రదర్శమేగాని వేఱుగాదు. నీశక్తి వ్యవహారమెల్ల నైజమగుట జ్ఞానులుమాత్రమే యెఱుంగుదురు. ఈనీస్వభావంబునే గాలచక్రమందురు.

స్వామీ ! నీవు పూర్ణుండవు, కేవలుండవు, అద్వితీయుండవు, స్వయంప్రకాశుండవు, అపరిచ్ఛిన్నుండవు, శాశ్వతుండవు నిర్వికారుండవు, సచ్చిదానంద లక్షణుండవు, చరాచరసమస్తమందు నంతరాత్మవై యుందువు. నీశక్తి నెఱుంగలేమియే యజ్ఞానము. ఈయజ్ఞానఫలంబుగా సంసృతిగలుగుచున్నది. బంధమోక్షంబులు అజ్ఞానజనితభావంబులేగాని వేఱుగాదు. అవి మానసికస్థితులగు. అంతర్యామివైన నీవే జీవుండవగుచుండఁగా నీకులేనట్టి బంధముక్తులు జీవునకెట్లు గలుగు ?

స్వామీ ! నీకు రాగద్వేషములు గలుగవు ; సర్వసముండవై వర్తింతువు. శరణన్న నెట్టివారినైనను రక్షింతువు. భక్తులపాలిటి కల్పకంబవై చరింతువు. దేవా ! నిన్నుఁ గంటి ; నీమహిమఁ గనుగొంటి ; తొంటియజ్ఞానంబు నెడసి మంటి.

‘శా॥ దేవా ! నీచరణప్రసాద కణలబ్ధింగాక లేకున్న నేం
డేవెంటం జను నీమహామహిమ నూహింపంగ నెవ్వారికిన్ !
నీవారై చనువారిలోఁ నొకఁడనై నిన్గొల్చుభాగ్యంబు నా
కీవే ? యిప్పటిజన్మమందయిన నేండెందైన నోయీశ్వరా ?

‘శా॥ ఏలా బ్రహ్మపదంబు ? వేదములకున్ వీక్షింపగారాని ని,
న్నీలోకంబున నివ్వనాంతరమునం దీమందలోఁ గృష్ణయం,
చాలాపాది సమస్తభావములు నీయందే సమర్పించు నీ,
వ్రేలందొక్కని పాదరేణువులు పైవేష్టించినం జాలదే ?’

‘మ నిను హింసించినపూతనాదులకు ముక్తిన్ నీమేటిసంకేత మి
చ్చిననీకుం బురదారపుత్రగృహగోస్త్రీప్రాణదేహాదు లె
ల్లను వచింపకయిచ్చిన గోపకులకున్ లక్షింపనేమిచ్చెదో ?
యని సందేహము దోఁచుచున్నయది ప్రసన్నానీకరక్షామణీ ?’

అని స్తుతించి యనుజ్ఞాతుఁడై చనెను.

### ధేనుకాసురుఁడు.

కృష్ణునకు నాఱవయేఁడు వచ్చెను. అందాఁకఁ గృష్ణాదులు గోవత్సంబుల మేపుటకు మాత్రమే గోపకులనుమతించియుండిరి. ఆఱవయేఁడు వచ్చినందునఁ గృష్ణుఁడు గోవులను మేపనియ్యకొనిరి.

రామకృష్ణులును గోపబాలకులును గోవులను దోలుకొని బృందావనమందుఁ బూర్వము త్రొక్కని ప్రదేశంబునకుఁ జనిరి. గోవులు ముందును వానివెనుకఁ బాడుచు బాల

కులును బోసాగిరి. రామకృష్ణులు వానిని వెంబడించిరి. వన మెల్లఁబూచికాచి సొబగారుచుండెను. కొదమతుమ్మెదకదుపులు మధురఝుంకారంబులు గావించెను; లేడిపండు లటునిటు నెగచి పఱవసాగెను; పక్షులకలకలరావంబులు శ్రవణంబులకు విందుగావించెను; అందందుఁగొలంకులు నిర్మలనీరపూరితంబులై యోగిజనహృదయంబులఁ దలపించెను; కమలగంధబంధురమై చల్లనిగాడ్పువీచెను; తరువులు ఫలభరనమ్రములై నేలజీరాడుచుండెను; లతలు సాగి పూగుత్తులబరువునకు వంగి దారికి నడ్డముగాఁ బఱచియుండెను.

ఆ వనసౌభాగ్యంబును గృష్ణుఁడు పరికించి 'అన్నా! బలరామా! నీపాదపద్మంబులను బూజించుట పరమభాగ్యంబుగా దేవతలు భావింతురు. దేవతలొనర్చు పూజలనుమెచ్చకయోయన జడంబులైన యీవనపాదపంబులు తలలతో నీకుమ్రొక్కుచు దివ్యఫలపుష్పంబుల నీకు సమర్పించుచున్నవి చూడుము. బృందావనపుణ్యక్షేత్రంబున జనించినవానికి నిది యుపపన్నమేగదా? అన్నా! యోగిజననిరంతరధ్యానాహ్వానంబులకు విసివియోయన నీవు నీస్వరూపంబునుమాని రూపాంతరము దాల్చి వారిని గనుమొఱంగి యిందువచ్చితివి. యోగిబృందము నీమాయలెఱింగి భ్రమరంబులై వెన్నంటి యిందువచ్చి నీగుట్టు రట్టడి చేయుచున్నవో యన నీకీర్తిని మధురగీతికలఁ బాడుచున్నవి వినుము. ఇవి నిన్ను వదలునట్లు గానరాదు. అన్నా! అపూర్వమైన యతిథివి నీవు వచ్చుటకు సంతసించి యవిగో మయూరంబులు నృత్యరూపంబున నీకు నాతిథ్యమొనర్చుచున్నవి. అన్నా! నీరూపలావణ్యంబులను

గోపాంగనలు వాల్గంటులఁ జూచుచున్నపుడు వారికి నపాంగ వీక్షణ చాతుర్యంబు గల్గదని వారిని బరిహాసించుటకోయనఁ గురంగంబులు ప్రేమార్ద్రికటాక్షవీక్షణంబుల నిన్నెట్లు పరికించుచున్నవో చూడు. అన్నా! గోపికాంగనల సంగీతంబులకు నానందింతువు. వారితోఁబంతగించియోయనఁ బికంబు లెంతయు మృదుమధురంబుగాఁ బాడుచున్నవి. అతిథులను సజ్జనులు తమకుఁగల యుత్తమార్థంబులతోఁ బూజించుట సహజము. వనవాసంబొనర్చుచుండియు నివిసజ్జనసాంప్రదాయంబు వదలవుగదా. అహాహా! ఇవి యెంతయుఁ గృతార్థులు సుమా? అన్నా! నీపాదస్పర్శఁజేసి యీ వనభూమియు, నీకరాదరణంబుఁగాంచి యీలతాకుంజ విటపంబులును, నీవీక్షణభాగ్యంబునకు బాత్రంబులై ఝురీగిరులును మృగపక్షులును బరమపావనంబులయ్యెను' అని అన్యాపదేశంబుగా నాత్మపరితోషంబును దెలిపెను.

అట్లు రామకృష్ణులు కొండొకతడవు వనవిహారము సలిపి యొకవృక్షంబు నీడగూర్చుండిరి. గోపబాలకులును వచ్చిచేరిరి. అటకు సమీపంబునఁ దాళవనంబొకటియుండెను. అందుండి పండినపండ్లమధురవాసనలు వీచెను. ఆతావికి నోరూరి 'కృష్ణా! తాటిపండ్లవాసన మూర్కొందువా? ఇటకుఁ జేరువున గొప్పతాటివనముగలదు. అందు తాటిప్రాకులు మిన్నులు ముట్టుచుఁ గిటగిటనుండు. పండ్లు రాలినేలఁబఱచియున్నవి. ఆవనమందు ధేనుకాసురుఁడు గలఁడు. ఆవనమునకుఁ బోయినవారి నెందఱనో యతఁడు చంపెనట. వాఁడుగార్దభరూపంబున నుండునట. వానికి వెఱచి యావంక నెవ్వరు జన

రట. ఆపండ్లకు నోరూరుచున్న'దని శ్రీదామసుబలస్తోక కృష్ణులనువారు పలికిరి.

రామకృష్ణులు వారినివిని 'అట్లయిన నేఁగో ప్రదము, రమ్మ' అని గోపబాలకులఁదోడ్కొని తాళవనముఁ జొచ్చిరి. బలరాముఁడు తాళవృక్షంబు నొకదానిని మొదలుపట్టియూఁచెను. ఊపువడికి నది పక్కవృక్షంబును దాఁకెను; దానివడికిఁ బ్రక్కవృక్షంబూగెను. వృక్షంబులు క్రిక్కిరిసియుంట నొండొండు దాకి వనమెల్లనూఁచెను. పండ్లు కుప్పలుకుప్పలుగా రాలెను. గోపబాలకులు యథామతిఁ బండ్లనారగింపసాగిరి.

ఆకోలాహలంబునకు ధేనుకాసురుఁడు మహోగ్రమై పొంది పరువెత్తుచువచ్చి వెనుగాళ్లతో రామునిఁ దన్న జూచెను. రాముఁడాకాళ్లనే యొడిసిపట్టి యెత్తి యాగార్ధభంబును దిర్దిరఁ ద్రిప్పి నేలమోఁదెను. అది రుధిరంబులు గ్రక్కి చచ్చెను. నాఁడుమొదలు యావనంబెల్లరకుఁ బ్రవేశయోగ్యమయ్యెను.

## కాళీయుఁడు.

గోపికా గోపకులాబాలవృద్ధము కృష్ణునిఁ బ్రేమదైవతముగా భావింప సాగిరి. వారిప్రేమయెట్టిదో యెంతమాత్రమో పరీక్షించుకుతూహలము కృష్ణునకు జనించెను.

యమునానదిలో లోతైనమడుగొకటి యుండెను. దానిలో నూటొక్కపడగల నల్లత్రాచుండెను. ఆకొలనినీరెల్లఁ దత్సర్పవిషమయమై పొగలెగయుచుండెను. అంతియగాదు. ఆమడుగునీటియావిరి పఱచినంతమేరమ ప్రాణులేగాక వృక్షాదులు

సహితము జీవింపవయ్యెను. ఇవియెల్ల గోపవృద్ధు లొకనాఁడు కతగాఁజెప్పికొనసాగిరి. ఆకతయెల్లఁ గృష్ణుఁడు వినెను.

ఒకనాఁడు కృష్ణుఁడు యథాపూర్వము గోపబాలకుల తోడ నావులను దరలించి యామునగువంకకుఁ గొనిపోయెను. ఏలనో బలరాముఁడు నాటిదినమున నింటనే యుండెను.

ఆవులు మేఁతకుఁ బఱచెను. కాపరు లాటపాటలకు దొడఁగిరి. కొంత తడవుగడచెను. అంత గృష్ణుఁడు వారినివెంట గొని యామునగునకుఁజనెను. దానిలోనినీరు సర్పవిషాగ్నికిఁ గ్రాగి పొగలెగయుచుండెను. దానిమీఁదుగాఁబఱచు పక్షులు తద్విషవాయువునకు సొమ్మసిల్లి పండుటాకులవలె నందు రాలు చుండెను. దానియొద్దునఁ బెద్దకదంబవృక్షంబొకటి నిలువున నెండి మ్రోడయి తద్విషప్రభావంబును జాటుచున్నదోయనఁ దోఁచెను. అందలిజలంబులు రక్తపీతవర్ణంబులై విషమిశ్రితంబు లగుట తెలిపెను.

కృష్ణుఁడదియెల్లఁ జూచి తోడిబాలకులను దవ్వున నిలిపి యొంటిగాఁబోయి మ్రోడైయున్న యాకదంబవృక్షమునెక్కి యందుండి దభాలున నమ్మడుగులో దుమికెను. ఆపాటునకు నందున్న సర్పము భయచకితమై లేచి పడగలువిచ్చి విషాగ్నులు గురియుచువచ్చి కృష్ణునినొక్కట నూటొక్కతలలతోఁగఱచి వాని నిలువెల్లఁ జుట్టెను. కృష్ణుఁడు సర్పంబునకుఁజిక్కి కదల లకమెదలకుండెను. గోపబాలకు లదిచూచి కృష్ణుఁడు చచ్చెనని భావించి విలపించుచుఁ బెద్దరొదచేసిరి. వారియేడ్పులకు గోవు లుగూడ నార్తారావంబులొనర్చెను.

ఆ దేసమయంబున వ్రజావాసమందు దుర్నిమిత్తంబులు దోఁచి మహాపదను సూచించెను. నందాదులానిమిత్తంబులఁ గాంచి మహాభయాతురులై కృష్ణుఁడెక్కడ? అని విచారింపసాగిరి. అంతలోన బలరాముఁడటకు వచ్చి 'కృష్ణుఁడు గోవులవెంటఁ బోయె' ననెను. ఆమాటతోడ వారిప్రాణంబులు నిలువున నెగసినట్లయ్యెను. గోకులంబెల్ల నట్లు భయశోకహతమై యిండ్లనక బిడ్డలనక యన్నియు వదలి కృష్ణుని వెదకుచుఁ బఱచెను. బలరాముఁడు వారికైలోలోన నవ్వుచు మిన్నకుండెను.

గోపులు స్త్రీపురుషులట్లు తరలి జాడలుపట్టి యమునానదికిఁబోయి యామడుగుగట్టెక్కి యందు విలపించుచుఁ బడియున్న గోపబాలకును మడుగులో సర్పావేష్టితుఁడై నిశ్చలనస్థితినున్న కృష్ణుని జూచిరి. వారిసంగతి యేమని చెప్పనగు? సృష్టియెల్లనొక్కట నస్తమించినట్లువారికిఁ దోఁచెను యశోదాదేవి యామడుగులో దుమికి కృష్ణునిఁ జేరనుంకించెను. గోపికలెల్లరు నామెనుజుట్టి ముట్టడించి కదలనీయరైరి. గోపకులు బడితెలతో దుముకనుండిరి. వేయేల? ఎల్లరును మైమఱచి తమతలంపులేమో తమచేతలేమో యెఱుఁగరైరి. అంతలోన బలరాముఁడటకువచ్చి వారినెల్ల వారించి ధైర్యము పలికెను.

అట్లువచ్చిన వ్రజస్త్రీపురుషుల శ్రద్ధాభక్తులను వారి తల్లడంబును బరికించి కృష్ణుఁడు తలయూచి మేనుపెంచెను. సర్పంబు చుట్లువదలి కృష్ణునెదుట నిలిచి పడగలెల్ల విచ్చి మహాభయంకరముగా బుసకొట్టుచు విషాగ్నులుఃమియుచు వడువునకై మునువెనుకలకు నూఁగుచు నాలుకలల్లార్ప సాగెను.

కృష్ణుఁడును ముందునకు వెనుకకు వచ్చుచుఁబోవుచు సర్పముతోడఁ జెల్లాడుచున్నాఁడోయనఁ దోఁచెను. కొంతసేపునకు సర్పమువడితగ్గెను. కృష్ణుఁడు తటాలున నెగచి దాని తలలపై నిలచి నృత్యమాడనారంభించెను. వానిపాదతాడనంబులకుఁ బడగలు వ్రీలి నెత్తురులు గురిసెను. సర్పము సొమ్మసిల్లెను.

సర్పంబుపాటుగాంచి వానిభార్యలు దవ్వునుండి రోదనంబులొనర్చుచు 'కృష్ణా! ఏ డేండ్లులేని నీ యీకార్యంబు మాకు భయంబుఁగొల్పుటం జేసి నీపాదంబుల వ్రాలవేఁడెదము. నీవేడ! మాభర్తయేడ? దోమ మత్తేభంబు నోర్చుటయ్యె. నీవు మర్త్యమాత్రుండవుగావు. నీచరితలు మహాద్భుతంబులు. నీ తత్త్వంబు గ్రహింప నల్పమతులకు మాకుఁ దరముగాదు. నీపాదంబులకు మ్రొక్కెదిమి. పతిభిక్ష వేడెదిమి. ఎప్పుడు నీదివ్యపాదంబులు వీనితలమెట్టెనో యప్పుడే యితఁడు పరమపావనుఁ డయ్యెను. ఈరూపంబున నీవు మాపతిని మమ్మునను గ్రహించితివి. మాపాపంబులెల్ల వెడలెను. దీనరక్షామణీ! ఈదీనురాండ్ర నాలింపు' మని మొఱలిడిరి. కృష్ణుఁడు వారి దీనాలాపంబులకు దయార్ద్రహృదయుఁడై, 'కాళియా! నీగర్వమే నీయీపాటునకుఁ గారణము. ఎవ్వరికిని గర్వము తగదు. సంగతి వినుము. తొల్లి యిచ్చట సౌభరమహర్షి తపంబాచరించుచుండెను. అప్పుడీమడుగు మహామత్స్యంబులతో నిండియుండెను. కొండొకనాఁడు గరుడుఁడు క్షుధార్తుఁడై యెందు నాహారముగానక యిందువచ్చి యీమడుగులో నున్న పెద్దమత్స్యంబును దన్నుకొనిపోయి మెసవి క్షుధార్తినిఁ బాపికొనెను. ఆమత్స్యంబునకై యందలిచేపలెల్ల

నేడువసాగెను. సౌభరమహర్షి వానిదుఃఖకారణంబువిని 'ఇక మీఁద గరుడుఁ డీమడుగులోని చేపలఁ దాఁకెనేని వానితల సహస్రశకంబులగు'నని శపించెను.

'కాళియా ! నీవు కద్రూతనయుఁడవగుటయు, కద్రూ వినతలకు వివాదముకలిగి యశ్వవాలంబును నల్లగాఁ జేయుమని కద్రువు తనబిడ్డలఁగోరుటయు, ఆమెపనుపు మీరుచేయమియు మీతల్లి మిమ్ము శపించుటయు, మీలోనొక్కఁడు తల్లి మది చేయుటయు, ఆకారణంబున వినతకు దాస్యంబువచ్చుటయు, గరుడుఁడుదయించి తల్లి దాస్యంబును బాపుటయు వినియే యుందువు.

గరుడుఁడు తనకు సర్పంబులాహారమగునట్లు తల్లివలన వరంబుఁబడసెను. తల్లిశాపంబునకు వెఱచి సర్పంబులు కొన్ని రమణకద్వీపంబునకు వలసపోయెను. నీవు నందొక్కఁడవైతివి. గరుడుఁడు రమణకద్వీపంబునకు వచ్చి యాహారముఁ గోరెను. ప్రతిశుక్లపాడ్యమినాఁడు మీలోనొక్కని వానికి నాహారార్థ మిచ్చునట్లుగా నేర్పాటుచేసికొని యట్లు గావించుచుండిరి. నీవంతువచ్చెను. నీవు స్వబలగర్వాంధుఁడవై గరుఁడుని ధిక్కరించితివి. అతఁడు మహాగ్రహమొంది ఱెక్కలువిసరి నీపైవ్రాల నుండెను. వానిఱెక్కలగాలివడకు నీవుదూదివలెనై యెగిరి యీమడుగులోబడితివి. సౌభరమహర్షి శాపంబునకు వెఱచి గరుడుఁడు నిన్ను వెన్నాడఁడయ్యెను. ఆకారణంబున బ్రతికి యిందుండఁగంటివి.

'కాళియా ! యమునాజలంబులు దేవతర్పణయోగ్యంబులు. నీవిషస్పర్శంజేసి యవిదోషదూషితంబులయ్యెను. ఇఁక

నీవిందుండఁజనడు. భార్యాపుత్త్రులతోఁ తను బంధుమిత్త్రాదుల తోడను నీవు నీతొల్లి తావునకుఁ జనుము. నాయాజ్ఞంజేసి గరుడుని భయంబు నీకుఁ గలుగదనెను.

కాళియుఁడు భార్యాపుత్త్రమిత్రబంధుపరివారంబుగాఁ గృష్ణుని వలగొని వానియానతిమేరకు రమణకద్వీపంబునకుఁ బోయెను.

కృష్ణుఁడంతట మడుగునుండి గట్టునకు వచ్చెను. యశోదానందులును గోపికాగోపకులును వానిని బునర్జీవితునిగా భావించి కవుంగిటఁగూర్చి యానందాశ్రుజలంబుల వర్షించిరి.

కాళీయమర్దనము విగ్రహగతముగాఁ జిత్రపటగతముగా నేఁడును గలదు. భగవంతుని నాగకన్యకలు స్తుతించినట్లు పైనఁజెప్పఁబడెను. అది నైజమును యుక్తియుక్తమును గాదని యుదాసీనతనులు గొందఱు భావించి యీకతకుఁ జారిత్రకరూపంబొసంగుచు వ్రాసిరి. నాగకన్యకలు స్తుతించుటయందు వింతయేమో యూహింపరాదు. ఉపాధులు బహురూపంబులై యుండుటయు, ఆయాయుపాధికిఁ దగినట్లుగా నాహారవ్యవహారాదులుండుటయుఁ గన్నారఁ జూచుచున్నాము. ఉపాధికిఁ దగినట్లుగా భాషగూడ నుండరాదా ? మనుష్యోపాధికిఁగల యింద్రియంబులు జీవరాశికెల్లఁగలవు. ఇంద్రియంబులు వానివానివ్యవహారంబులు సాగించుచునే యుండును. అట్లు సాగనినాఁడు శరీరమే నిలువదు. క్రిమికీటకాదులకు సయితము వాగింద్రియము గలదుగావున నయ్యది దానివ్యవహారమును సాగింపక మానదు. ధ్వనియన్ననో యది యుపాధినిబట్టి పలువిధములై యుండు. సంగీతవాద్యంబుల నానాత్వంబును

బట్టి ధ్వనియు నానాత్వమగుట యెల్లరకు సహజసిద్ధము. ఒకరాశిజీవిభాష మఱియొకరాశిజీవికిఁ దెలియకుండవచ్చు. ఏకరాశిజీవులైన మనుష్యులలోనే ఒక తెగవారిభాష మఱియొక తెగవారికిఁ దెలియరాకుండుట స్పష్టము. భగవంతుఁడు సర్వజ్ఞుఁడు గావున వానికిఁ దెలియని భాషగాని యూహగాని కలుగనేరదు.

మనుష్యుఁడు తనదృష్టియే తనజ్ఞానమే నిదానంబుగా సృష్టినెల్ల విమర్శించుచున్నాఁడు. మనుష్యజ్ఞానదృష్టు లత్యల్పంబులు నసంపూర్ణంబులునని మొట్టమొదట గ్రహింపవలయును. జ్ఞానదృష్టులు యోగశక్తివలనఁ గొంతకుఁగొంత పెంపొందును. ఆకారణంబుననే యోగులు సామాన్యులకు నందనివిషయంబుల నెఱింగియుఁ జూచియు లోకోపకారార్థము తెలుపుచున్నారు. పక్షిభాష, బల్లిపలుకు మొదలైనవానిని గూర్చిన శాస్త్రంబు లిట్టివేయగు. పక్షికి భాషయున్నప్పుడు సర్పమున కేల భాషయుండరాదు ?

సుఖదుఃఖంబులు జీవరాశికి సహజంబులు. అట్లుగాని నాఁడు కట్టనుజూచి పాముపఱవనేల? ఎప్పుడు సుఖదుఃఖములు గలవో యప్పుడే యానందార్తులు వానివెంటనుండు. ఆర్తికలిగినప్పుడు తన్నివారణప్రయత్నము నైజము. ఆర్తినిబట్టియు మనఃపరిణతిని బట్టియు యత్నరూపంబుండు. బుద్ధి యెంత దుష్టమైనదిగానున్నను, అతీతము సంభవించి నప్పుడది దైవంబును దలంచును. దైవముసర్వాంతర్యామియగుటయే యిందులకుఁ గారణము. విశేషాంశంబులు శాస్త్రాదుల వలన గ్రహింపనగు.

## దవాగ్ని.

అప్పటికిఁ బ్రొద్దు క్రుంకనుండెను. నాఁటిదుఃఖోద్వేగంబులకుఁ దోడుగా నుదయమునుండి యన్నపానాదులు లేమింజేసి యెల్లరు స్రుక్కిరి. గోపబాలికాబాలురకును స్త్రీలకును నడయాడుపాటిచిక్కెను ఆరాత్రి యందే గడప నిశ్చయించిరి. కొందఱుపోయి సంభారంబులుగొని వచ్చిరి. వంటలు తీరెను. ఎల్లరు భోజనంబులు గావించిరి. నాఁటిశ్రమంజేసి తోడ్తోడ నిదుర పైకొనెను. ఎచ్చటివారచ్చటఁ బరుండి మైమఱచిరి. గోగణంబున ట్లేయాయెను.

అప్పుడు గ్రీష్మర్తువుగావున నెంతవేడిమికి వనమెల్లఁ గ్రాగుచుండెను. అర్ధరాత్రియయ్యెను. కార్చిచ్చు హఠాత్తుగా రేఁగెను; మంటలు మింటికి బ్రాకెను. ఆసెగకు గోవులును గోపులును మేల్కాంచిరి. జ్వాలలుచుట్టుఁ గ్రమ్మెను; తప్పించుకొనుటకు దరిదొంకలు గానరావు; ఏమిచేయుటకుఁ దోఁపదయ్యెను. ఆలయఱపులును బిడ్డలయేడ్పులును మిక్కుటంబులయ్యెను. ఎల్లరును బ్రాణభీతులై

‹మ అదెవచ్చెన్ దవవహ్ని ధూమకణకీలాభీల దుర్వారమై,
డిదె కప్పెన్ మమునెల్లవారి, నిటమీఁదేలాగు? రక్షింపు, నీ
పదపద్మంబులకాని యొండెఱుఁగమో పద్మాక్ష! యోకృష్ణ! మ్రొ
క్కెద మో రామ! మహాపరాక్రమ దవాగ్నిన్ వేగ వారింపవే!›

అని కుయ్యిడిరి. ఆరొదకుఁ గృష్ణుఁడు మేల్కాంచి వారిదురవస్థఁ బరికించి యామంటల మ్రింగివైచెను. క్షణములో నగ్నియెల్ల నెచ్చటిదచ్చటనే కూలిచల్లారెను. నాటికి గండముతప్పి బ్రతికితిమనుచు గోపులాతావువిడిచి యాలమందల[illegible]జేరిరి.

* కృష్ణుని లీలలెల్లఁ గల్పితంబులనియు, కల్పనయన్ననో చాతురీరహితమును నీరసమునునై కథావస్తువునందు విశ్వాసమునకు మాఱుగా నిందానిరసనంబులఁ గలిగించుచున్నదనియుఁ గల్పనాశక్తికి మేల్బంతులైన నవలలసంగతి యటుండఁగా వానిలో నధమాధమముగా నెన్నఁబడుదానికిఁ గూడ సంవిధానంబున భాగవతంబు సాటిరాదనియు, గోరంతయుక్తివిజ్ఞానంబుతో భాగవతంబును బఠించువారికి భగవద్భక్తికి మాఱుగా భగవద్విరక్తియే చేకూరుననియుఁ గేవలయుక్తివాదులు కొందఱు తలంచుట గలదు.

వారిమాట వారినోటిలోనే వేయుదుము. వారు తలఁచునట్లుగాఁ గృష్ణలీలలు కల్పితంబులేయైనచో వారుపల్కుమాట లక్షరాక్షరంబుల సత్యమగు. అంతియగాదు. కృతికర్తయపాత్త్రుఁడునగు. భాగవతంబును వ్యాసమహర్షి రచించెను. వ్యాసుఁడెంతటివాఁడో, వానిమేధాశక్తి యెట్టిదో సార్వలౌకికము. చేతనంబులనోటనేగాక జడంబులచేతఁగూడ నపూర్వంబులు నమోఘంబులు నైన భావంబులను లౌకికపారలౌకికదృష్టులకు రెంటికి సమ్మతంబులైనవి పల్కించి శాశ్వతలోకపూజ్యతఁగాంచిన మహాత్మునకు నౌచిత్యజ్ఞానముగాని సంవిధాన చాతుర్యముగాని లేదనఁజాలరు. అట్టివాఁ డట్లురచించినప్పుడు కృష్ణలీలలు యథార్థములని గ్రహింపవలయునో మఱేమిగాఁ దలంపవలయునో యూహింపనగు. లీలాకల్పనమే వ్యాససంకల్పమైనచో తద్విధానము నేటినవలల విధానంబునకన్న నెన్నోరెట్లు ప్రజ్ఞావిభవపరమాదర్శములై సజీవంబులై యుండుఁగాని వేఱుగాదు.

వనప్రదేశములందు దవాగ్నులు పుట్టుట సహజము అకాలవర్షంబులు వచ్చుటయుఁగలదు. నాఁడు దవాగ్ని యట్లు పుట్టినప్పుడు కృష్ణసంకల్పఫలముగా మేఘంబులు కుంభవృష్టిఁ గురిసి దానిని చల్లార్చెనని వ్యాసుఁడు రచింపలేఁడా ? అంత మాత్రము లోకజ్ఞానముగాని సంవిధానశక్తిగాని వానికిఁగలుగవా? ఎల్లరకుఁ దెలిసినదియు సత్యమనినమ్మఁదగినదియు నైన యీ సంవిధానంబుండఁగా, దానివంకనేని దృష్టినిడక యా దవాగ్నిని కృష్ణుఁడు మ్రింగెనని యామహర్షి రచింపనేల ? అట్లురచించినను లోకము నమ్మదని వానికిఁ దెలియదా ?

ఐంద్రజాలకుని మహిమలట్లు భగవల్లీలలెల్ల మాయాకల్పితంబులనియుఁ, దాత్కాలికబుద్ధికి నైంద్రజాలకునిమహిమ లెట్లు సత్యములై తోఁచునో భగవల్లీలలుగూడ నట్లే తోఁచు ననియు, భగవల్లీలల కెల్లఁ దావన్మాత్ర సత్యత్వమునే గ్రహింపవలయుననియు, ప్రాకృతబుద్ధినిఁ గూపస్థమండూకంబువలెనుండు దానిని నుత్తమగతికి నీడ్చుటకై భగవంతుఁడు లీలలుగావించె ననియు, ఆలీలలనట్లే వ్యాసమహర్షి రచించెననియు, మఱికొందఱు వచింతురు. భగవల్లీలలనుగూర్చిన యీవివరము యుక్తియుక్తమేగాక సత్యపూతమునై యున్నది. సృష్టియే మాయాకార్యమనిరి. మాయ యనఁగా నీశ్వరశక్తియనిరి. మాయ నధిష్టించి యింతసృష్టిని గల్పించినవానికి లీలలేమాత్రమగు ? సృష్టిగూడ నొకగొప్పలీలయే యగుఁగదా ?

ఈలీలలేల ? యని యందురా ? భగవంతునే యడుగవలయు. ఊహకు నందినవఱకుఁ గార్యమునుబట్టి కారణంబు

నూహింతురు. ఇది బుద్ధికి నైజము. ఊహలెన్నటికి నూహ లేయగుఁగాని సత్యములుగావు. సత్యమును బరమేశ్వరుఁడే యెఱుఁగు.

ప్రలంబాసురుఁడు.

గ్రీష్మర్తువు వచ్చెను. ఎండవేడిమి మిక్కుటమై లోక మెల్లఁ దావదాహదీనమైనను బృందావనంబు నిసర్గసౌభాగ్యం బునఁజేసి ప్రాణికోటికి సుఖావహముగానుండెను. అందలి సెలయేఱులు బూఱటిల్లిపాఱుచుఁ దాపనివారణార్థమోయనఁ దుంపురులఁ జల్లుటయు సూర్యుఁడు కిరణజాలంబుఁ బఱచి సం గ్రహించి కొనిపోవునీటి యావిరిని గంధవహుఁడు తెరవాటులు గొట్టితెచ్చి యవ్వనవిటపిపుటాంతరంబుల దాఁచుటయు జడం బులుగావున నత్తరవు లాగుపద్ధనంబును హరింపనేరక బిందు రూపంబున జాఱవిడుచుటయు నయ్యది పఱక ప్రాణిగతమగుచు వారివ్యథదీఱుటయు నప్రార్థితంబుగా సంప్రాప్తమైన యా మహాభాగ్యంబునకై తమకుఁ గల్గిన యానందంబును దెలుపు చున్నవోయన నందలికోకిలంబులు పంచమస్వరంబున మధు రంబుగాఁ బాడుటయు, దన్నాద బ్రహ్మానందంబునకు మైమ ఱచి మయూరంబులు నృత్యంబులను భ్రమరంబులు ఝుంకా రంబులను గావించుటయు నచ్చట గొప్పవింతగానుండెను.

బృందావనంబట్లు శీకరశీతలమై మధురరుతంబులచేత వీనులకు విందును బూచి యేచి సొబగారుచున్న లతాగృహం బులచేతఁ గన్నులకు బండువును జేయుచుండఁగాఁ గొండొక నాఁడు కృష్ణుఁడు బలరామ గోపబాలకులతోడ నటకుఁ బోయెను. గోపబాలకులు కొండఱు కెందలిరుటాకు జొంపఁ

ఖులను, గొందఱు మయూరబర్హంబులను, గొందఱు గిరిధాతువులను గై సేసికొని నృత్యగానాదులకుఁ దొడంగిరి. అట్లు వారు కొంతవడి యథామతి విహరించి తత్సమీపంబున మేయుచున్న యాలమందవంకకుఁ జనిరి. అందున్న గోపాలకబాలకులును వారితోఁ జేరిరి.

ఎల్లరు భాండీరమను వటవృక్షంబునీడఁగూడినతర్వాత కృష్ణుఁడు వారితో 'మనమెల్లరము రెండుగా నుద్దులు తీఱి దొంగాట యాడుదము. ఓడినవారు గెలిచినవారిని భుజంబుల నెక్కించుకొని మోయవలయు' ననెను. అందఱు సరియనిరి. ఒకవంకఁ గృష్ణుఁడు నొకవంక బలరాముఁడునైరి. శ్రీరామ వృషభాది గోపబాలకులు బలరామునిపక్షంబునను, భద్రసేనాదులు కష్ణుని పక్షంబునను దీఱిరి. అత్తఱిఁ బ్రలంబుఁడను నసురుఁడు కంసప్రేరితుఁడై గోపబాలక రూపంబుఁదాల్చి వచ్చి కృష్ణుని పక్షంబునఁ జేరెను. కృష్ణుని పక్షంబోడెను. ఆటనియమము మేరకు కృష్ణుకు శ్రీరామునిని భద్రసేనుఁడు వృషభునిఁ బ్రలంబుఁడు బలరాముని మూఁపున నెక్కించికొనిరి.

కృష్ణాదులు గంతవ్యస్థానముచేరి వారిమూపుననున్న వారిని దించిరి. ప్రలంబుఁడట్లుచేయక యెల్లదాఁటి బఱఁగిడ సాగెను. అతఁడు పఱచుకొలఁది వానికి మూఁపుమీఁదభారము దుర్భరముకాఁజొచ్చెను. ప్రలంబుఁడది చూచి ప్రచ్ఛన్న వేషంబునఁ దనకార్యంబును సాధించుట కష్టమని తలంచి నిజ రూపంబుఁ దాల్చెను. దంష్ట్రాకరాళంబును దుర్నిరీక్షంబునైన వక్త్రంబుతో ఘోరాకారంబుతోనున్న యాయసురుని బల రాముఁడు చూచి వింతపడి క్షణములో సంగతియెల్ల గ్రహించి

దృఢముష్టినలవరించి యొక్కటి వానితలపయి నొడ్డించెను. ఆతాఁకువడికిఁ బ్రలంబుఁడు తలప్రీలి నెత్తురుగ్రక్కి నేలఁ గూలెను. గోపబాలకులు ప్రలంబుని మాయకు భయంబును వానివధమునకు సంతోషంబును జెందిరి.

ముంజారణ్యము.

కృష్ణాదులవ్విధంబున నాటలఁదవిలియుండగా గోగణంబు మేయుచు వనంబునుండి వనంబునకుదాఁటి ముంజారణ్యాబుఁజొచ్చి యందలిపొదలలోఁజిక్కి వెడలనోపక దాహాదీనస్వరంబున నార్వసాగెను. అఁట గోపబాలకులు వారియాటఁ జాలించి చూచుసరికి గోవులు గానరావయ్యెను. వారెంతయు వెగడొంది తరలి గోముఖంబులనుండి రాలినతృణశకలంబులఁ బట్టి జాడలు తీయుచుఁ జనిచని ముంజారణ్యంబు జేరిరి. కృష్ణుఁడంతట మహోన్నతమైన వృక్షంబెక్కి దవ్వుననున్న యాలమగాంచి యెలుగెత్తి పేర్వేఱ వానిఁబిలిచెను. గోవులును కృష్ణుని కంఠధ్వనిని గుఱుతించి మాఱుపలికెను. గోవుల యునికి తెలియవచ్చి నందులకు గోపాలకులెంతయు సంతసమంది యావంకకుఁబఱచిరి.

అంతలోన దావానలంబు పేర్చి మంటనాల్కలుచాచుచు వనమెల్లఁజుట్టెను. ఆయగ్నిజ్వాలలమధ్యఁ జిక్కి గోవులొక్కపెట్టున నార్వసాగెను. గోపబాలకులు దిక్కుదోఁపక నిలిచిరి. కార్చిచ్చువారినిగూడఁ జుట్టెను. వారు కృష్ణా! అనుచుఁ గుయ్యిడిరి. కృష్ణుఁడు వృక్షాగ్రమందేయుండి వారియార్తారావంబు లాలకించి 'భయమువలదు ; ఎల్లరుఁగన్నులు మూసికొండు' అనెను. వారట్లే గావించిరి. గోపాలురును గోవులును క్షణములో భాండీరవటముచేరెను.

అంత వారు గన్నులు విచ్చి సంగతి గ్రహించి విస్మితులై కృష్ణుని గీర్తించిరి. ప్రొద్దుక్రుంకవచ్చెను. గోగోపులు వ్రేపల్లె జేరిరి. నాటికతతో గోపికాగోపకులకుఁ దెల్లవారెను.

వర్షర్తువు.

క్రూరుఁడగు రాజువలె గ్రీష్మము మిత్రవ్యూహంబునఁ గఠోరకరంబులు పఱచి పీల్చి లోకంబునెల్ల సారహీనమొనర్పఁగా జీవరాశిపరితాపాగ్ని ధూమపటలంబులోయన మింటఁ గాఱుమబ్బులు గూడెను. ప్రజాంతర్గతరోదనధ్వనులోయన మేఘాంతరంబుల నుఱుముశబ్దంబులుప్పతిల్లెను. గుణాచ్ఛన్నంబైనజీవునిప్రకాశంబుకరణి సూర్యుని తేజంబు తిరోహితమయ్యెను. లోకారాధనపరుఁడైన రాజువలె జీమూతంబులు జీవనంబుల వర్షించి ప్రాణికోటికిఁ దాపశాంతిఁ గూర్చెను. పుడమి కామ్యార్థివలెఁ దపస్తప్తమై యెట్టకేలకు సిద్ధినొంది యలరారెను. మునిమాఁపులందు మిడుఁగుఱులు మినుకు మినుకుమనుచుఁ బాషండమతావృతమైన కలికాలమందు వేద ప్రచారస్థితిని దోపించెను. ఉఱుములకు మండూకంబు లఱచుచు నిత్యకర్మావసానంబున నాచార్యునిగమంబునువిని శిష్యులు వేదాధ్యయనంబునకుఁ రొదరువిధంబును దలపించెను. చిఱుకాల్వలు నీరింకి స్వగతితప్పి పాఱుచు నింద్రియవశుని సంపదల యనియతగతుల సూచించెను. పచ్చనిపచ్చికలతో నింద్రగోపంబులతోఁ బుడమి విరాజిల్లుచు ధర్మరాజపరిపాలిత రాజ్యశోభను దెలిపెను. సస్యంబులు వర్షహతికి వ్రాలుచు లేచుచుఁ గర్మగతిని జీవరాశికిఁ గలుగుసుఖదుఃఖంబులయు హాగశోకంబులయు రాకపోకలను సూచించెను. జంతువులు

ఏనవాలందెఁగి భాగవతులు హరిభజనంబుఁ బడయు సాత్మ శుద్ధిని దెలుపసాగెను. నదులు కల్లోలమాలికాయత్తంబులై నానాప్రకంపరాయత యోగిమనోలౌల్యంబును బ్రకటించెను. గిరులు వర్షధారాఘాతంబులకు వెతనొందక స్థితప్రజ్ఞులు విషయస్పర్శకు సహించుతత్త్వంబును బోధించెను. దారులు పచ్చికల గప్పి యామ్నాయహీనంబులైన శ్రుతులగతిని వెల యుండెను. జలదంబులయందు మెఱుంగులు నిలువక దాతల యెడఁ గృతఘ్నులమన స్తత్వంబునకు నిదర్శనంబులయ్యెను. గర్జా శబ్దగుణకంబైన గగనంబున గుణరహితమైన యింద్రచాపంబు తోఁచి గుణవ్యతికరలోకంబున గుణహీనపురుషునివర్తనంబును జాటెను. చంద్రుఁడు నిజచంద్రికాభాసితమేఘంబునఁ గప్పఁ బడి జీవుఁడు స్వప్రకాశభాసితంబైన యహంకారంబునఁ బరి వృతుఁడగుచందంబును గఱపెను. మయూరంబులు జనదా గమంబునఁ బ్రమదంబునంది ప్రాకృతులకు భాగవతసమాగ మంబుల సిద్ధించుకల్మిని వెల్లడించెను.

కృష్ణుఁడు తోడిబాలురఁగూడి యవ్వనాంతరవిహారం బుల వర్షర్తువును హాయిగాఁ బుచ్చెను.

### శరదృతువు.

యోగప్రశాంతచిత్తంబులు వాసనలడుల్చి స్వచ్ఛం బులగు చందంబున మేఘంబులు నీరంబులఁగార్చి నిర్మలంబు లయ్యెను. విషయస్పర్శంజేసి భ్రష్టంబులైన యోగిజనహృద యంబులు పునర్యోగాచరణసిద్ధిచేత విశుద్ధంబులగుకరణిఁ గాసా రంబులు వర్షజలంబులఁ జేసి మలినవంతంబులైనవి శమలసంసేవ

నంబున నిర్మలోదంబులయ్యెను. జ్ఞానులు శిష్యులయధికార తారతమ్యమునుబట్టి జ్ఞానంబును ప్రదానంబుఁ జేయుటో నిరాకరించుటో యగునట్లు పర్వతంబులు గొన్నియెడల జలంబులఁ బ్రవహించుచుఁ గొన్నియెడలఁ వానినిఁ దమయందే నిల్పికొనుచునుండెను. ప్రాకృతులు వారియాయువు క్షణక్షణంబుఁ దఱుగుచుండుట యెఱుఁగనివిధంబునఁ జలచరంబులు తరుపల్వలంబుల నీరింకుట నెఱవయ్యెను. సంసారికిఁ గ్లేశతాపంబట్లు వానికి సూర్యతాపంబు వృద్ధియయ్యెను. జ్ఞానికి నహంకారంబట్లు భూభాగంబున బురదయుడిగెను. ఆత్మరతుఁడు మౌనంబునట్లు సముద్రము తూష్ణీంభావము వహించెను. యోగులు తమబుద్ధిచే నింద్రియనిరోధంబునట్లు కృషీవలులు గట్టులచేత జలంబుల నిల్పిరి. భగవంతుఁడు భక్తులతాపంబునట్లు చంద్రుఁడు శరత్సూర్యాతపతాపంబును జల్లార్చెను. తత్త్వార్థగ్రహణంబున నంతఃకరణంబట్లు తారకాచయంబున నభంబు విరాజిల్లెను.

### కృష్ణగానము.

అట్లు బృందావనము శరత్కాలయోగంబున నిర్మల వారిపూరితంబులైన సరోవరంబులతోఁ గమలామోదలలితంబులును శీకరశీతలంబులునైన పవనాంకురంబులతోఁ గుసుమితలతాగృహంబులతో ఫలభారనమ్రశాఖామనోహరద్రుమంబులతో సొబగారుచుండఁగా, నొకనాఁడు కృష్ణుఁడు వఱువాత లేచి తల్లినిమేల్కొలిపి 'అమ్మా! ఉడుపులును గ్రోవియు నిమ్ము. మందవెంటఁబోవుదు' ననెను.

యశోద యట్లే యని ముద్దుపట్టి నలంకరించి నెమలిపురి

కల్కితురాయి నొదలఁగూర్చి, పూమాల నఱుత వైచి పసపు
వన్నెపట్టుపుట్టంబుఁగట్టి బొట్టుతీర్చి భుజకీర్తులుదొడవి యుం
బెలుగై సేసి, పసుపువలువను వెన్నుపయి జీగాడనైచి క్రోవి
యిచ్చి పుచ్చెను. కృష్ణుఁడట్లు సమలంకృతుఁడై జగన్మోహన
మూర్తివలెఁ దోఁచెను. కృష్ణుడంతరించి యైదువేలయేండ్లు
గడచినను నాటివేషంబుననే వానిని నేఁడును బూజింతురు.

కృష్ణుడంతట గ్రామకంఠంబునకువచ్చి క్రోవిఁబాడెను.
గోపబాలకులు మేల్కాంచి కొమ్ములును బూరుగలును గై
కొని చేరిరి. మందలు తరలెను. గోపబాలకులు పాడుచు
నాడుచు మందలవెంట నంటిరి. గోపబాలికలు ముంగిళ్ళ
నిలిచి కృష్ణుని జగన్మోహనాకారమును గాంచుచుఁ దదేకచిత్త
లైరి. యశోదయుఁ దనకూర్మిపుత్త్రునిఁ గన్నులకఱవుతీఱఁ
జూచుచు నానందబాష్పంబుల నించుచు వానియోగక్షేమంబు
లకుఁగా లోలోన సర్వేశ్వరుని బ్రార్థించెను.

మందలు గ్రాసభూమిఁజేరెను. ఆలను మేఁతకు వదలి
బాలకులు క్రోవులు పాడుచు బూరుగలూదుచుఁ దప్పెటలు
వాయించుచు నాటలకుఁ గడంగిరి. కృష్ణుఁడు ప్రతిబాలకుని
తో నాడుచుఁ బాడుచుఁ బ్రేమరసంబు లొలిపించుచు వారి
హృదయంబుల నాకర్షించెను. బాలకులదృష్టి వానియందే
లీనమయ్యెను.

అంతటఁ గృష్ణుఁడు గాత్రగానంబు నారంభించెను.
ఆగానమాధుర్యంబు వనమెల్లఁ బ్రాఁకెను. లేళ్ళు మేతమాని
యఱ్ఱులెత్తి తన్మయతనొందెను ; పక్షులు సంచారంబులుడిగి

వృక్షాగ్రంబులఁజేరెను ; మయూరంబులు నృత్యమాడసాగెను ; పన్నగంబులు పడగలెత్తి యట్టె నిలిచెను. ఆలాపగతి క్రమక్రమంబుగా నొక్కొక్క-స్థాయిదాఁటెను. చరాచరంబులు బ్రహ్మానందరుచిని గొంత చవిగాంచి పరవశత్వమొందెను.

కృష్ణుఁడు గాత్రము మాని వేణువు గైకొనెను. ఆ గానరసము క్షణక్షణమధురమధురమై వ్రేపల్లెకుఁ బ్రాకెను. వ్రేతలు తమతమపనులు మఱచి యెచ్చటివారచ్చట నిశ్చలవృత్తి నిలిచిరి. వారియుల్లంబులందు నపూర్వము ననిర్వచనీయమునైన తాపంబాక్రమించెను ; గోపబాలికలు పరమానందవివశలై నృత్యంబులు గావించిరి. గోవులుమేఁతచాలించి కర్ణపుటంబులువిచ్చి యాలింపఁజొచ్చెను ; క్రేపులు మోరలందలిచన్నుఁగుడువ మఱచెను.

అంతలోన లోకబాంధవుఁడు నభోమధ్యవీధి దాఁటి పశ్చిమదిశకు వ్రాలెను. భోజనవేళయగుటఁ గృష్ణుఁడు గానము చాలించి యమునాతటంబునకు సహచరులతోడఁ జనెను.

నాటి కృష్ణగానము త్రాలనుసయితము గఱగించి బృందావనమందలి చరాచరప్రాణివర్గంబునకెల్లఁ గర్ణరసాయనంబును హృదయస్రావియునై సకలేంద్రియవ్యాపారంబుల నుడిగించి బాహ్యప్రపంచజ్ఞానంబునుబాపి చిత్తంబునంతరాంతరంబునకు గొనిపోయి బ్రహ్మానందానుభవస్ఫురణంబుఁ జేకూర్చెను. ఆకారణంబునఁ గృష్ణగానంబనుపేరు లోకప్రసిద్ధమయ్యెను.

## వ్యక్తారాధనము.

వసుంధరాదేవి పచ్చటాకుపట్టుచీరెఁగట్టి పూబుటాపరి కిణి ముస్తీబుఁదొడవి యామనిరాకకు నెదురుచూచుచుండెను. గోపులు తమకులదైవతంబగునింద్రునకు యథాప్రకారము వార్షికవసంతోత్సవంబును దలపెట్టిరి. వారియుత్సాహంబులఁ జూచి సంగతియేమని కృష్ణుఁడు గోపవృద్ధుల నడిగెను.

'కృష్ణా ! ఇంద్రుఁడు మేఘంబులకు నధిదైవతము. వాని యాజ్ఞను మేఘంబులు వర్షించును ; వర్షోదయంబున సస్యవృద్ధియగు ; తత్ఫలముగా సకలజీవరాశి జీవించుచున్నది ; రాజులకు దేశక్షేమము ప్రధానము. అది గాలవర్షయోగంబునుబట్టి యుండు. వర్షంబులు గురియకున్న దేశమెల్ల దుర్భిక్షాద్యరిష్టంబులపాలగు. ఇంద్రప్రసాదంబుగా వర్షంబులుగురియుఁగాన రాజులింద్రునకు వారికృతజ్ఞతాభావంబును వర్షకాలానంతరము వసంతోత్సవరూపంబులఁ బ్రకటింతురు. దీనినే యింద్రారాధనమందురు. వసంతర్తువు వచ్చెను. ఉత్సవంబును సంకల్పించితి' మనిరి.

కృష్ణుఁడు వారిని విని యెలనవ్వుదాల్చి 'గోవులును వనపర్వతంబులును మనకు దేవతలగు. ఇంద్రోత్సవంబులు మనకేల ?' అని నందునివంక మరలి 'నాయనా ! గోవులవలన మనము జీవింతుము. గోధనమే మనకు ధనమగు. ఏవి మనలను బోషించునో వానిని బూజించుటొప్పు. ఒకనివలన మేలు పడయుచు వేఱొక్కనిఁ గొల్చుట కృతఘ్నతయగు. కృతఘ్నులు జన్మజన్మంబులకుఁగూడ శుభంబుఁబడయరు. గోవు

లు మనలను బోషించుచున్నవి. గోవులను వనపర్వతనదీ నదంబులు పోషించుచున్నవి. కావున మనగోవర్గంబునకును దానికి నాశ్రయమైన సకాననగోవర్ధనంబునకును బూజలు కావించుదము. కృతఘ్నతామహాపాతకంబునకు గుఱికావలదు.'

'నాయనా ! జలు కేవలవాచోపచారంబులగునేని ఫలంబు గలుగదు. పూజావ్యాజంబునఁ బందుగలు పశ్వంబులు గావించి యాత్మతుష్టిఁ బడయుదురు. ఇవియెల్ల మిథ్యాపూజలగు. భక్తిప్రేమలను దెలుపుటయే పూజాభావము. భక్తిప్రేమలు త్యాగరూపంబులు. త్యాగఫలము స్వార్థమెన్నడును గానేరదు ; అది పరార్థమగు. పరార్థమగుటయే పరోపకారమగు. దానినే భూతదయ యనియు వచింతురు.'

'పూజకుఁ ద్యాగబుద్ధి జీవము గావున మనకలిమినెల్ల దానికై వ్యయింతము. మఱియు నయ్యది మనలనుబోషించుచున్న గోవులకుగానగునేని కృతజ్ఞతాఫలంబుగూడ సిద్ధించును. మొట్టమొదట గోవులను బుష్కలగ్రాసప్రదానపూర్వకంబుగాఁ బూజింతము. మృష్టాన్నంబుల బీదసాదలకు నిచ్చుదము. ఇదే ప్రత్యక్షదైవారాధనము. ఇట్లు చేయుట యిహపరంబులకు రెంటికి మేలగు. ఈమార్గమును వదలి పరోక్షంబునకై ప్రాఁకులాడుట యుట్టికెక్కలేనివారు స్వర్గంబునకై చేతులెత్తుటగు.' న నెను.

* (1) కృష్ణునియుపదేశమందెంతో భావము గర్భితమైయున్నది. పూజ్యుఁడున్నఁగాని పూజకు నవకాశములేదు. పూజ్యుఁడున్నను వానిరూపము హృదయస్థమైనఁగాని భక్తినిలు

వదు. పూజ్యుఁడుత్తమోత్తముఁడుగా నుండవలయును. అంశంబులను బూజించినచో ఫలముగూడ నంశంబుగానే యుండును.

(2) భగవంతుఁడొక్కఁడే లోకపూజ్యుఁడు. దేవతాంతరములు వాని యంశమాత్రంబులై యల్పఫలప్రదంబులగు. భగవంతునకు వ్యక్తావ్యక్తరూపంబులు రెండునుగలవు. అవ్యక్తరూపంబు సామాన్యులకు గోచరింపదు. కావునఁ బూజార్థము భగవంతుని వ్యక్తరూపంబునే గ్రహింపనగు.

(3) సర్వసృష్టియే వ్యక్తరూపమగు. వ్యక్తావ్యక్తంబులలో దేనినారాధించినను మూలము భగవంతుఁడే గావున భగవదారాధనమేయగు. వ్యక్తరూపమైనసృష్టిని నిరసించి యంశమాత్రంబుల నారాధించుట అల్పఫలసిద్ధియగుటయే గాక భగవన్నిరసనముగూడనగు.

(4) అంతరపూజయనియు బాహ్యపూజయనియుఁ బూజ రెండువిధములు. పూజ్యుని గుణగణంబులను స్మరించుట యాంతరపూజయగు. వానియాజ్ఞలప్రకారము వర్తించుట బాహ్యపూజయగు. భగవంతుని యాజ్ఞలలో 'సత్యంవద, ధర్మంచర' అనునవి యుత్తమోత్తములు. సర్వభూతహితమే ధర్మము.

(5) సృష్టియెల్ల భూతమయముగావున సృష్టియందలి భూతంబులకు హితంబొనర్చుట ధర్మానుష్ఠానమగు. ధర్మానుష్ఠానము వారివారి యోగ్యతానుసారంబుగా నుండవలయును. ఈయోగ్యతనే వర్ణాశ్రమంబులందురు. వర్ణాశ్రమంబులు గుణవృత్తులకుఁ బర్యాయపదములనవచ్చును.

(6) గోపులు తత్త్వజ్ఞానులుగారు. గోరక్షణము వారి వృత్తియగు. గోపూజ వారివృత్తికి ననురూపమగు. గోవులను ... పర్వతంబులను బూజింపుమని చెప్పినప్పుడు, సృష్టియెల్లఁ జరాచరాత్మకముగావునఁ జరంబులకు గోవులును, అచరంబులకు వనపర్వతంబులును బ్రత్యామ్నాయములగు. వాని పూజ సర్వవ్యక్త్యారాధనమేయగు.

కృష్ణునియుపదేశమం దిన్ని భావంబులిమిడియున్నవి. ఇది భగవత్తత్త్వమునేగాక భక్తిలక్షణంబులను, సర్వసులభమైన ధ్యేయాకారంబును, పూజావిధానంబును, స్వధర్మానుష్ఠానంబును, ఆత్మకళ్యాణమార్గంబును లోకశ్రేయోభావంబును బోధించుచున్నది. వ్యక్త్యారాధనమే పరమాత్మారాధనమనుటకుఁ గృష్ణుఁడిచ్చుట బీజమునాటెను. ఆబీజము గీతాదులందు మొలచి యేఁచి లోకమెల్లఁ బ్రాఁకెను.

ఋష్యాదులు తమయతిథులను గోమాంసభక్షణార్పణపూర్వకంబుగా సత్కరించుచున్నట్లు రామాయణాదిగ్రంథములందుఁ గలదు. అట్టియాచారము సర్వభూతదయాసూత్రమునకు విరుద్ధమని కృష్ణుని యుపదేశము బోధించునని కొందఱు తలంతురు. ఇది సమంజసమేయగు.

హిందూదేశమునకు వ్యవసాయమే జీవనవృత్తియనియు ఆవృత్తికి గోగణంబాధారమనియు, గోరక్షణంబునఁగాని వృత్తి నిలిచి దేశరక్షణము కొనసాగదనియుఁ, గలిప్రవృద్ధింజేసి జనలు గోహింసాపరులై జీవనోపాయంబును గోల్పోయి దుఃఖవశులుగానున్నారని ..., అట్టిముప్పును రానున్నదానిని మున్నగ

నివారించుట మేలని తలంచి గోపాలను నిషేధించుటకై కృష్ణుఁడు గోసంరక్షణంబును బోధించెననియు మఱికొందఱు భావింతురు. లోకరక్షకునకు నిది భావ్యమేగదా.

గోపూజ హిందూదేశమందేగాక యీజిప్టుదేశమందుఁ గూడఁ బూర్వము సదాచారమై యుండెను.

కృష్ణునియుపదేశము అపూర్వంబును బూర్వాచారవిరుద్ధంబునై గోపులకు వింతఁగూర్చెను. ఆభావము రుచింపమింజేసి వారొండొరుఁ జూడసాగిరి. కృష్ణునియందలి భక్తివిశ్వాసంబులు వారిని బదులాడనీయవు. సాంప్రదాయము కార్యమునకు సమ్మతింపనీయదు. గుసగుసలు పుట్టెను. ఉపాయాంతరంబులను వెదకిరి. తోవగానరాదు. ఎట్టకేలకు నెల్లరుఁ దలలూఁచిరి. వ్రజపురంబెల్ల సంభారంబులతో గోవర్ధనగిరికిఁ దరలెను.

ఇంద్రోత్సవార్థము సేకరించిన పదార్థములతో నానావిధభక్ష్యభోజ్యంబులు సిద్ధమయ్యెను. బ్రహ్మవాదులు హోమంబులు గావించిరి. గోవులకు మెత్తనిపచ్చికలు దెచ్చి మేసవఁబెట్టిరి. శునకాదిజంతువులకును బక్షులకును నాహారంబులొసంగిరి. జనులకెల్లరకుఁ జండాలపతితాదులకు సయితము మృష్టాన్నంబున సంతర్పణంబొనర్చిరి. గోవర్ధనగిరికి బలి నర్పించిరి. ఎల్లరు లెస్స భుజించి వస్త్రాభరణములు ధరించి యాలమందలతోడ గిరిప్రదక్షిణంబు గావించిరి. ఆపర్వతము మూఁడుదివారాత్రంబులు దీపమయమై విందులతో నుత్సవంబులతో నృత్తగానంబులతోఁ జెలువారెను. పదియేండ్లకుర్రఁడు

మాటమాత్రంబున గోకులంబునెల్ల మరలించి నడుపుట వింత గానుండెను.

ఇంద్రగర్వభంగము.

గోపకులట్లు స్వకులాచారభిన్నమార్గంబును ద్రొక్కి, తనపూజను నిరసించిరని యింద్రుఁడు మహోగ్రహోదగ్రుఁడై సంవర్తకమేఘంబులఁ జీరి,

"మ॥ పరుఁగుల్ నేతులు ద్రావి క్రొవ్వి భువి నాభీరుల్ మదాభీరులై
గిరిసంఘాతకఠోర పక్షదళన క్రీడాసమారంభ దు
ర్భరదంభోళింధరుం బురందరు నను౦బాటించి పూజింప క
గ్గిరికిం బూజలుచేసి పోయిరిదెపో కృష్ణుండు ప్రేరేపగాన్ ॥"

"శా॥ ఉద్యత్సంపదనమ్మి నందతనయోద్యోగంబునన్ వెఱ్ఱులై
మద్యోగంబు విసర్జనీయమని రీమర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్గర్జలఁ గప్పిగర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
నద్యోమృత్యువుఁ బొందజాల్ గురియుఁడీ శౌర్యంబవార్యంబుగాన్ ॥"

అని శాసించెను. క్షణములోఁ గాఱుమబ్బులుపర్వెను; కటికిచీఁకట్లుగప్పెను; తీఁగెమెఱుఁగులకుఁ గన్నులు మూఁత వడెను; ఘెళఘెళధ్వనులకు భూమి కంపిల్లెను; సుడిగాలి రేగి ధరాతలంబు నువ్వెత్తుగానూదివై చుటకోయన భోరునవీఁచెను; వర్షంబు పిడుగులతోడ ధారాపాతంబుగాఁ గురిసెను.

వృక్షంబులు తెగి విసరి దవ్వునఁబడసాగెను; పక్షులు పండుటాకులవలె రాలెను; ఇంకినయేఱు లుబ్బిబూరటిల్లి గట్లు దాఁటి ధంధనధ్వనులతోఁ బాఱెను. మిఱ్ఱు పల్లంబు లేకమయ్యెను. ప్రవాహవేగంబు కాలూననీయదు; వాయువేగంబు నిలువనీయదు; తలఁదాపఁ దావుగల్గదు. గోగోవత్సంబులయు గోపికాగోపకుల[illegible] రోదనంబులు శ్రవణదుర్భరంబులయ్యెను.

పరమసంతోషము క్షణములో మహాదుఃఖముగా మాఱెను. 'అయ్యో ! కృష్ణునివిని చెడితిమని గోపవృద్ధు లాత్మనిందఁ గావించుకొనుచు లోలోన నింద్రునకు మ్రొక్కులిడిరి. బాలికాబాలకులును యువతీయువకులును 'హా ! కృష్ణా ! నీవేగతి' యని కుయ్యిడిరి.

కృష్ణుఁడింద్రునకై లోలోన నవ్వుచు,

చ॥ కలఁగకుఁడీ వధూజనులు కంపమునొందకుఁడీ వ్రజేశ్వరుల్
తలఁగకుఁడీ కుమారకులు తక్కినవారలు జాలవానచే
నలఁగకుఁడీ పశువ్రజము నక్కడనక్కడ నిల్వనీకుఁడీ
వెలవడ మీకునీశ్వరుఁడు మేలొసఁగుం గరుణార్ద్రచిత్తుఁడై ॥'

అని వారికెల్ల నభయంబులు పలికి గోవర్ధనపర్వతంబు నెత్తి వ్రేలిపయినిలిపి 'ఇదిగో గొడుగు; దీనిక్రిందికి రండ'నెను. గోపీగోపకులు గోధనంబుతోడ దానిక్రింద నిలిచిరి, శేషుఁడు గిరినిజుట్టి కట్టగానేర్పడెను. నీరు లోనికిరాఁజాలదయ్యెను. ఏఁడహోరాత్రంబులు కుంభవర్షముగురిసెను. కృష్ణుఁడంత పర్యంతము నగ్గిరినట్లే యెత్తి యుంచెను.

ఇంద్రుఁడావింతకు నాశ్చర్యమంది విఫలమనోరథుఁడై దివ్యదృష్టిని సంగతియెల్ల గ్రహించి మోడ్పుగరంబులతోఁ గృష్ణునొద్దకువచ్చి,

'శా॥ నీసామర్థ్యమెఱుంగ మేఘములచే నీఘోషముల్ భీమఘో
గ్రాసారంబునముంచితిన్ మఖము నాకై వల్లవుల్ సేయరం
చో సర్వేశ్వర ! భవన్మహాత్వమున నాయుద్యోగమిట్లయ్యె, నీ
దాసున్నన్నుఁగృతాపరాధుఁగరుణన్ దర్శింపవే ? మాధవా !'

'మ॥ నిను బ్రహ్మాదులెఱుంగలేరు, జడతానిష్ఠుండ లోకత్రయా
వన ! దుర్మానగరిష్ఠుఁడన్ విపులదుర్వైదుష్యభూయిష్ఠుఁడన్,

వినయత్యాగపరిష్ఠుఁడక్ గుజనగర్వి శ్రేష్ఠుఁడక్, దేవ ! నీ
ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియంగా నెవ్వఁడక్ సర్వగా !"

అని ప్రార్థించెను. కృష్ణుఁడు వానింగాంచిఁ అమరే శ్వరా ! గర్వంబెవ్వరికినిఁగాదు. పదవీగర్వంబు బొత్తుగాఁ గూడదు. పాలనాధికారివై యుండియుఁ బదవీగర్వాంధుఁడ వగుట తగునా ? నీవలన లోకంబునకుఁ ధర్మంబుగలుగునా ? నీగర్వంబును బాపుటకై యిట్లు గావించితిని. పూజలు భక్తి పురస్సరంబులు గావలయు. పూజ్యునిఁబట్టి యట్టిపూజలు గలుగుచుండు. భయంబుననోండె దానమానంబులనోండె గ్రహించు పూజలు నిరర్థకంబులు. నీపరిపాలనంబెల్లఁ బ్రతిఫలాపేక్షితంబని నీచేఁత తెలుపుచున్నది. నీతలంపు సరిగాదు. నీ యెడభక్తి సోపాధికంబుగావున స్థిరముగాదు.' అని పలికి వానిని వీడ్కొలిపెను.

అంతలోనఁ దెల్లవారెను. పూర్వదిశాంగనామణి నొసఁటఁగూర్చిన కుంకుమాంక మోయన రవిబింబంబుదయించెను. గోపీగోపకులును గోగణంబుతో వెడలిరి. కృష్ణుఁడంతట నప్పర్వతంబును యథాస్థితినుంచెను. వల్లవులు కృష్ణునెంతయు సంభావించిరి. గోపికలు పూసేసలిడి దీవించిరి. గోపవృద్ధులు తమసంశయబుద్ధికిఁ బ్రాయశ్చిత్తమోయనఁ గృష్ణుని గోపాధిపత్యంబునకు నభిషిక్తుఁగావించి 'మహాత్మా ! నిన్ను మనుష్యమాత్రునిగా భావించితిమి. నీయీకార్యము దేవతలకుఁ గూడ సాధ్యముగాదు. నీవెవ్వండవో యూహింపరాదు. నీవే మాకుదిక్కు ; త్రిశుద్ధి నీకు భక్తిచేయుదు'మనిరి. కృష్ణుఁడు వారినెల్ల విని 'గోపకులారా ! నేను మీయనురాగంబునకుఁ

భ్రాతృఁడనేని నన్నిట్లు మీరు ప్రశంసింపరాదు. నాయెడ మీకు మక్కువ నిక్కమేని మీలోనివానినిగా నన్ను గ్రహింపుఁడు. వేఱుతలంప వలదనెను.

భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడనియు, ప్రేమయొప్పాడును ప్రతిప్రేమను వలచుననియు, అది దానినైజమనియు, భగవంతుఁడు తదర్థము విశ్వంబును సృష్టించి యందుఁజొచ్చి ప్రాణికోటియనురాగంబునకుఁ బాత్రుఁడై తద్విధానందంబు ననుభవించుననియు, సర్వభూతములయెడదయతోవర్తించుటయే భగవంతునెడఁ జూపునట్టి ప్రతిప్రేమయనియు, ఈరహస్యంబు నెఱింగి వర్తించుటయే జ్ఞానమనియుఁ గొందఱు వచింతురు. కృష్ణుఁడు పయినసూచించినకోరిక యీభావంబునే బోధించును,

కృష్ణునివాక్యంబునందు ద్వైతాద్వైతభావంబులు రెండు నిమిడియున్నవి. భేదదృష్టితోఁ జూచినయెడల ఆమాటకు ద్వైతభావము స్ఫురించును. అభేదదృష్టితోఁ జూచినయెడల దానికే అద్వైతభావము స్ఫురించును. ఈభావద్వయము ద్రష్టయొక్క మనఃపరిణతినిబట్టి యుండు. ద్వైతమగునేని భక్తియు అద్వైతమగునేని జ్ఞానమునగు.

### నందప్రబోధము.

కృష్ణుని చర్యలెల్ల నమానుషికంబులును మహాద్భుతంబులు నగుట వానింగూర్చి గోపకులకు వింతవింతభావంబులు గలిగెను. ఒకనాఁడు వారు నందునొద్దకు వచ్చి 'అయ్యా! మీతనయుని కార్యంబులు మాయూహకు నందకున్నవి. ఇతఁడు మర్త్యుఁడో ఐంద్రజాలికుఁడో నిశ్చయింపరాదు. కన్నులఁ

విచ్చనినాఁడే పూతనను హరించెను ; మూఁడునెలలబుడుత యేడ ? శకటంబును గాలఁదన్ని కూల్చుటేడ ? ఏడాదిప్రాయంబునఁ దృణావర్తు నవలీలఁ జంపెను ; ఆోటిసీడ్చి మద్దిమ్రానులఁ ద్రోసెను ; బకాసురుని బలిగొనెను ; వత్సాసురుని వధించెను ! గర్దభాసురునిఁ గాలునఁ కల్పించెను ; కాళియుని గర్వమడంచెను ; దవానలంబును మ్రింగెను ; అన్నింటికి మిన్నయోయన గోవర్ధనగిరిని బూబంతివలె నెత్తెను. ఇందొక్కటొక్కటియు మనుష్యశక్తికి మించియుండు. ఇదియెల్ల నింద్రజాలమోయను శంకకలుగు. మమ్ము మేమే నమ్మలేకున్నాము. ఈమహాత్ముఁడు గ్రామ్యమైన మనకులంబునందు జన్మించుటేలనో తెలియదు. వీనియెడ మాయెల్లరకు నకారణమైన ప్రీతిగలదు. ఏలనో యూహింపరాదు.' అని వారియంతర్భావంబును దెల్పిరి.

నందుఁడు వారిసివిని 'గోపులారా ! ఇట్టిశంకలు మీకు గలుగుట వింతగాదు. నాపుత్త్రునకు గర్గమహర్షి నామకరణంబును జరుపుట మీరెఱుంగుదురు. నాఁడామహర్షి నాకూనంగూర్చి కొన్నివచనంబులు పల్కెను. అవి పరమరహస్యంబులు. అయినను మీశంకానివారణార్థము చెప్పక తప్పదు.

'ఇతఁడు ప్రతియుగంబున జనించుచుండు. యుగభేదంబున వీనికి వర్ణభేదముగలుగు ఇప్పుడు కృష్ణవర్ణుండై ప్రభవించెఁ గావున వీనికిఁ గృష్ణుఁడను పేరిడితి. ఈతఁడు వసుదేవునకుఁ బుట్టెఁ గావున వాసుదేవుఁడనఁబడు. వీనిరూపనామంబులకు లెక్కయేగలుగదు. గుణగణంబులఁబట్టి కొన్నియుఁ గర్మంబులఁబట్టి కొన్నియు వీనికి నామంబులు గలవు. ఈతఁడు

గోకులంబునకు మేలుగావించును. వేయేల ? ఇతఁడు నారాయణసముండు' అని యామహర్షి సూచించె' ననెను. నందుని ప్రబోధంబునకు గోపకులు కొంతవఱకు శంకలు మానిరి.

### గోపికావస్త్రాపహరణము.

గోపకుమారికలు ప్రతివర్షంబు మార్గశీర్షమాసంబున నీతినియమవ్రతలై యరుణోదయంబునఁ గాళిందీజలంబులాడి తన్నదీతీరంబున సైకతకాత్యాయనీప్రతిమలు తీర్చి చందనమాల్యధూపదీపంబుల చేతను వివిధోపహారంబులచేతను ఫలపల్లవాక్షతతండులంబుల చేతను నద్దేవి నారాధింతురు.

మార్గశీర్షమాసము వచ్చెను. గోపకుమారికలు వఱువాత లేచి కాళిందీనదికిఁ బోయి కట్టుపుట్టంబులు డుల్చి గట్టుననుంచి నీరాడసాగిరి. కృష్ణుఁడు చెలికాండ్రతోడ నటకుఁ బోయి గట్టుననున్న వారిచీరెలు సంగ్రహించి చేరువనున్న కదంబవృక్షమెక్కి 'ఇవిగో మీచీరెలు ! ఇటకు వచ్చి కొనిపొండ'నెను.

వారొండొరుఁజూచుచు సిగ్గునగొంతుబంటినీటిలో మునిఁగిరి. చలి మిక్కుటమయ్యెను. ఎంతసేపువేచినను గృష్ణుని భావము మరలుసూచనలు గానరాకుండెను. అంతటవారేకగ్రీవంబున 'కృష్ణా ! రాజపుత్త్రుండవై జనించితివి ; గోకులంబునకెల్లఁ బ్రేమమూర్తివైతివి. ఈపని నీకుఁదగునా ? చలి మితిమీఱెను ; మావలువలిమ్ము. అట్లుసేయవేని నీచెనఁటితనంబును ఱేనికెఱింగింతుము. కృష్ణా ! నీకు దాసురాండ్రము ; నెనరూను'మని మొఱలిడిరి.

కృష్ణుఁడు వారిని విని 'కుమారికలారా ! మీరు నిక్కముగా నాకు దాసురాండ్రగుదురేని నాపంచినపని మీరు తల దాల్పవలయు. ఇందువచ్చి మీమీవలువలు గైకొమ్మంటిని. వేఱువిధంబున మీయాప్సితంబులు కొనసాగ' వనెను. గోప కుమారికలామాట విని గత్యంతరముఁ గానకయుఁ జలికి నోర్వ లేకయు గోప్యస్థానంబులఁ గేల్దోయిఁ గప్పి నీరు వెడలివచ్చిరి. కృష్ణుఁడు వారిభక్తివిశ్వాసంబులకు మెచ్చి మానుదిగి 'గోపిక లారా ! వ్రతపరలకు దేహాభిమానము కూడదు. సర్వాత్మ సమర్పణంబునఁ గాని యీప్సితార్థంబులు సిద్ధింపవు. అభి మానము గోరంతయున్నను భక్తి సర్వాత్మకముగాదు. దేహాభి మానము మిమ్ము వదలదందుం ? అట్లయిన వ్రతపరలు ఒస మొలఁ దీర్థమాడరాదు. అట్లు నీరాడుట దేవతాపచారమగు. సర్వాత్మసమర్పణార్థమొండె నపచారదోషపరిహారార్థమొండె మీరు కేల్దోయిని శిరమునఁగూర్చి మ్రొక్కి చ్యుతదోషలై మీవలువలుగైకొను' మనెను. వారు భక్తికళంకంబునకును నపచారదోషంబునకును వెఱచి కేల్దోయి శిరమునఁగూర్చిరి. కృష్ణుఁడు వారివలువలిచ్చెను.

ఈగోపికావస్త్రాపహరణము కృష్ణునెడ జారచోరభ్రాంతులను గలిగించుచున్నది. జారచోరక్రియలు రహస్యకార్యములగునేగాని యెల్లరుఁ జూచునట్లుగా మూఢుఁడు సయితమొనర్పఁడు. గోపికలయెడఁ గృష్ణునకు జారభావమున్నచో వారిలోనొకట్టెకతో రహస్యస్థానంబునఁ గూడునుగాని, నూర్లకొలఁదిగోపికలతో నంతబాహాటముగా నొక్కసారిగాఁ గూడఁ దలంపఁడు. ఒకవేళ నట్టిపిచ్చితలంపుగల్గినను వారివస్త్రంబును

హరించుటవలన నయ్యది సిద్ధించునా ? కావున వస్త్రాపహార ణంబు నూతగాఁగొని కృష్ణునందు జారత్వదోషంబును నిరూ పించుట యుక్తియుక్తముగాదు.

కార్యమునుబట్టి కారణంబునూహింతురు. కార్యము స్వార్థమైనచోఁ గారణము స్వార్థభావప్రేరితమగుట స్పష్టము. జారత్వమునకుఁ గామము కారణమగు. కృష్ణుఁడప్పుడు గోపి కలతో సంభోగింపకున్నను దత్ప్రేరితమైనయిచ్ఛ వాని నీకార్యమునకుఁ బ్రేరేపించియుండరాదాయనన చ్చును. కృష్ణుఁ డప్పుడు పదియేండ్లవాఁడు. ఆప్రాయంబునఁ బురుషునకుఁ గామమే యంకురింపఁజాలదు. కామాదులు కాలబద్ధములు. కావునఁ గృష్ణునికార్యము కామప్రేరితమనుటకే యవకాశము లేదు.

వలువలహరింప నేలయందురా ? గోపికలకుఁ గృష్ణునెడ నెంతయు భక్తిగలదు. అయినను వారిభక్తి యింకను నిరభి మానపూర్వకముగా లేదు. వారిభక్తిని నిరభిమానపూర్వక ముగాఁజేసి పరాభక్తిగా మార్చి గోపికాభక్తిని లోకాదర్శము గా నొనర్పవలయునని కృష్ణుని సంకల్పము. భక్తులయెడ భగవ దనుగ్రహంబట్టిదిగానుండు. అభిమానంబులలో నెల్ల శరీరాభి మానము దురత్యయము. అందును స్త్రీలకు గోప్యగోపనాభి మానంబత్యధికము. ఉత్కటమైన యీ దురభిమానంబు నున్మూలించి కృష్ణుఁడు వారికిఁ బరమశ్రేయము నొదవించెను.

కృష్ణుఁడు భగవదవతారమని వానిమహిమలే చాటుచు న్నవి. భగవంతునివలన సర్వసృష్టియుఁ గలుగుచున్నది. భగ

వంతుఁడు సర్వజ్ఞుఁడు. వానికిఁ దెలియనివియు దాపనివియు నైన యంగప్రత్యంగరహస్యములే గలుగవు. కావునఁ గృష్ణుఁడు గోప్యదర్శన స్థితి యట్లుచేసెననరాదు.

వ్రీడాభావంబుండినగాని గోప్యగోపనభావంబు జనింపదు. గోపబాలికలకు వ్రీడాభావంబావయస్సున నుండనేరదనియు, ఇదంతయుఁ గల్పితంబనియుఁ గొందఱు వచింతురు. అవివాహితలైన స్త్రీలు సుమంగళీత్వమునుగోరి కాత్యాయనీ వ్రతంబాచరింతురు. అవివాహితలన్నప్పుడు వారు కన్యకలుగానొండె ఋతుమతులుగానొండె గావచ్చును. ఎవరైనను వారియెడ భర్తృగ్రహణభావంబంకురించి యుండవలయును. పతిభావముతోడ వ్రీడాభావంబును బుట్టును.

కృష్ణునే పతిగాఁగోరి గోపకుమారికలు కాత్యాయనీ వ్రతంబు నాచరించిరని భాగవతము. ఉత్తముఁడు భర్తయగునట్లుకోరుట స్త్రీజనంబునకు నైజము. ఇట్టిభావంబు లౌకిక దృష్టికిఁ దప్పుకానేరదు. భగవంతునికన్న నుత్తముఁడు కలుగఁడు. భగవంతుని భర్తగా గోపికలు గోరుట తప్పుగాని వింతగాని కానేరదు. సంకల్పంబు సిద్ధింపకమానదు. దాసశుభాశుభఫలంబులకు సంకల్పకులే బాధ్యులగుదురు. ఇందొక రహస్యము మాత్రము గలదు. స్త్రీలెల్లరును భగవంతునే భర్తగాఁగోరినను, వారిభావనయెల్ల నేకరూపంబుగా నేకముఖంబుగా నుండనేరదు. గుణతారతమ్యమునుబట్టి భావనయందుఁగూడఁ దారతమ్యముండును. అట్టి తారతమ్యఫలంబుగా సంకల్పసిద్ధి యుండు. అది ఏకకాలంబునఁగాని ఏకరూ

పంబునఁ గాని గలుగఁ జాలదు. గోపికలు వారిపూర్వజన్మం బున భగవంతుని భర్తగాఁగోరి యుండుచేని యిట్టి కృష్ణమూర్తిని వారుభావించిరైన నుండఁబోరు. ప్రకృతజన్మంబున వారు కోరరాదాయనిన, కృష్ణుఁడు వారిచెంతనేయుండెను. వానిం గూర్చి ధ్యానింపనేల ?

ఈయంతఃకరణవృత్తివిశేషంబులనెల్లఁ బరిశీలించినచో గోపికలు కోరినభర్తృత్వము అధ్యాత్మికమగుసేగాని నేఱుగాఁ జాలదు. భగవంతునిఁ బతిరూపంబున వలచి సేవించుట స్త్రీలయందేగాదు ; పురుషులందుఁ గూడఁ గలదు. అది మ ధురభక్తిలక్షణముగానున్నది. కాఁబట్టి గోపికలు తుచ్ఛమైన శారీరకభోగంబునుగోరి కృష్ణుని భర్తగావలచుటకాదనియు, జీవాత్మపరమాత్మలకు భక్తిరూపంబునఁ గలుగుసంధానంబు నట్లు వర్ణించిరనియు గ్రహింపనగునని కొందఱు తెలుపుదురు.

దీక్షితులభార్యలు.

ఒకనాఁడు రామకృష్ణులు గోపబాలురతోడఁ బసువుల వెంటఁజని బృందావనము దాఁటి వనాంతరముఁ జొచ్చిరి. అచ్చటివృక్షంబులు కమ్రఫలభరితంబులై మనోహరంబుగా నుండెను.

ఆవిటపంబులనుఁ గృష్ణుఁడు సహచరులకుఁ జూపి 'మిత్రు లారా ! ఈ చెట్లను జూచితిరా ? ఇవి వర్షాతపంబులను శీతో ష్ణంబులను దలయొగ్గి సహించును. ఆశ్రయించినవారికిఁ జల్లని నీడనిచ్చును ; ఆకొన్నవారికిఁ గోరినఫలంబు లొసంగును. జ డంబులయ్యు నియ్యవి పరార్థజీవితవిధానంబును లోకంబునకుఁ

జూటుచున్నవి. మఱియు నారలూలిచినను గొమ్మలువిఱిచినను గిమ్మనవు. దేహధారులకు సుఖదుఃఖంబులు సహజంబులని యు, వానినెల్ల సహించుచుఁ బ్రతిఫలాపేక్షరహితంబుగాఁ బరోపకారమొనర్చుటయే జన్మసాఫల్యమార్గంబనియు జడంబు లుగూడ బోధించుచుండఁగా, మూఢులారహస్యంబు గ్రహింపక వట్టిక్రతుక్రియలచేతఁ దమకాలంబెల్ల వ్యయించుచున్నా రని' తత్త్వరహస్యంబును సామాన్యవచనంబులఁ బల్కి, కాళిందీజలంబులు గ్రోలి యుపవనంబుల విహరించుచుండెను. కృష్ణుని యంతర్భావమును గోపబాలకులు గ్రహింపఁజాలరైరి.

మధ్యాహ్నమయ్యెను ; భోజనవేళమించెను. కుడుపు మూటలేలనో నాఁడు సకాలమున రావయ్యెను. గోపబాలకు లాఁకలికి స్రుక్కి 'కృష్ణా! ఏమిచేయుద' మనిరి. కృష్ణుఁడు వారితల్లడముఁగాంచి 'మిత్రులారా! అదిగో యచ్చటఁ గొందఱు బ్రాహ్మణులు స్వర్గకాములై యజ్ఞంబులాచరించుచున్నారు. అటకుఁజని రామకృష్ణులు పంపఁగావచ్చితిమనియు అన్నంబును దెమ్మనిరనియు మామాటగా వారికిఁ బలుకు' మనెను.

గోపబాలకులట్లేపోయి యజ్ఞదీక్షనున్న యాబ్రాహ్మణులకుఁ దామువచ్చినయర్థంబుఁ దెలిపిరి. వారువినియు విననట్లుండిరి. బాలకులు పెద్దయుందడవు వేచి నిరుత్తరులును నిరాశలునై మరలివచ్చి సంగతియెల్లఁ గృష్ణునకుఁ దెలిపిరి. కృష్ణుఁడు వారికి నవ్వి 'కార్యార్థులాఫలోదయము యత్నంబు నుజ్జగింపరాదు. మిన్నకున్నఁ గార్యము సిద్ధింపదు. ఈసారి

పోయి యాదీక్షితులభార్యలకు నామాటచెప్పు' మని మరల వారిని బంపెను.

గోపబాలకులు మరల యజ్ఞవాటికిఁజని యందొకచోటఁ గూర్చుండియున్న యాదీక్షితభార్యలకు నమస్కరించి తాము వచ్చిన యర్థంబును వారికి విన్నవించిరి. మునిపత్నులు వారిని విని 'కృష్ణునికతలెన్నో విందుము. ఆమహాత్ముఁడు చేరువకు వచ్చెను. వానిసందర్శనభాగ్యంబు నేటికి సంప్రాప్తమయ్యె' ననుచుఁ దద్దర్శనోత్కంఠలై లేచి రసవత్తరభక్ష్యభోజ్యంబులను శుద్ధపాత్రలనింపి తరలిరి. భర్తలు పోవలదనిరి; తలిదండ్రులు వారించిరి. ఎవరెన్నిపలికినను వినక నిలువక వారు యము నాతటోపవనంబునకు వచ్చి, యందున్న నీలమేఘశ్యామకోమ లాంగకుని బీతాంబరధారిని బర్హిబర్హచూడాలంకృతుని జగన్మో హనాకారుని గాంచి తన్మయులైరి.

కృష్ణుఁడు వారినిఁ జేరఁజీరి 'భాగ్యవతులారా! మీ నిరుపాధికప్రేమకు నెంతయుఁ గృతజ్ఞతాబద్ధుఁడనైతిని. మీ యిచ్చుభక్ష్యభోజ్యంబులఁ బ్రీతితో నారగింతుము.' అఁకొన్న వారికి నన్నంబిడితిరి. ఈమీభూతదయార్ద్రబుద్ధి మిమ్ముఁ గృతార్థవతులఁ జేసెను. సత్యము భూతదయ ఇవిరెండు నుత్తమోత్తమ ధర్మంబులు. అవిలేనినాఁడు తపోయజ్ఞాదులు వ్యర్థములు. సమబుద్ధి సిద్ధించినఁగాని భూతదయ యుదయింపదు. సమబుద్ధి సంపాదనార్థము తపోయజ్ఞాదులు సాధనమాత్రము లగు. అట్లుగాక యజ్ఞాదులు కామ్యార్థమగునేని జన్మపరంపరలు తప్పవు. కళ్యాణులారా! మీభర్తలయజ్ఞములు

సమాప్తముగానున్నవి. మీరుచెంతలేకున్నచో వారు తమ యజ్ఞంబులఁ బూర్తిగావింపరు. త్వరగాఁబోనగు' ననెను.

మునిపత్నులు కృష్ణునివిని దీనలై,

'మ॥ తగునేమాధవ ! యిట్టివాఁడిపలుకుల్ ధర్మంబులే మాయెడన్ ?
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్నివారింప వ
చ్చిగ నీయంఘ్రులఁజేరినార, మటవోఁజేకొందురే వారలా,
పగిదే మొల్లము, కింకరీజనులఁగా భావించిరక్షింపవే ?'

అని విన్నవించిరి. కృష్ణుఁడు వారికెంతయు సంతసించి 'శుద్ధచిత్తలారా ! మీపతులు మీయెడ నలుకవహింతురను నెంజలివలదు. నామాట నమ్మి మీరు పోనగు. మీకోరి నట్లే మిమ్ములను గింకరీజనులుగా గ్రహించితి. సంశయము వలదు. ఇందేయుండి మీరు నాకుభక్తిచేయుట విధిగాదు. భక్తికి మనస్సంగమంబు ప్రధానముగాని, చక్షురాద్యంగసంగ మంబుగాని దేశకాలాదులుగాని ప్రధానంబులుగావు. ఎందున్నను జిత్తంబు నాయందున్నఁజాలు. మీకోర్కెలచిరంబ సిద్ధించును. నాలోనైక్యమొందుదు'రని వారిని సమాధాన పఱచి పంపి వారుతెచ్చిన భక్ష్యభోజ్యంబులను బరమప్రీతి తో ననుచరులతోడ నారగించెను.

యజ్ఞము ముగిసెను. దీక్షితులు సావధానులై వారి భార్యలవలనఁ గృష్ణోపదేశంబులు విని యాఁదలి రహస్యంబును లోలోనఁ బరామర్శించి 'కటా ! ఎన్నిశాస్త్రంబులు చదివినను ఎన్నివ్రతంబు లాచరించినను దత్త్వరహస్యంబు నింతమాత్ర ము గ్రహింపలేక నిరంతరకర్మలంపటులమై జీవితంబెల్ల రిత్త పుచ్చితిమి. ఎట్టిచదువులును జదువని యీమూఢస్త్రీలకుఁ

గల్గినపాటి చిత్తశుద్ధియుఁ బరమభక్తియు మాకుఁగల్గదాయెను. బాహ్యక్రియాపరులగతి యింతేగదా, చిత్తము కూపస్థమండూకస్థితిని వదలి విరివిచెంది సర్వభూతసమత్వంబును గ్రహించి వర్తించుటయే కళ్యాణం' బని తలంచుచు నాత్మాపరాధ ప్రాయశ్చిత్తంబుగా లజ్జాచింతలఁ దలవంచి బాహ్యపూజాడంబరంబులు చాలించి మనఃకమలంబులను సమర్పించి కృష్ణునాత్మగతంబున భజించుచు స్వార్థత్యాగులై వర్తించిరి.

ఈకథయందు వేదాంతసారమెల్ల నిమిడియున్నది. కృష్ణుఁడుపల్కినమాటలొక్కొక్కటియు నొక్కొక్కయుపనిషత్తగు. ఆత్మకళ్యాణంబునకు నింతకన్నమించిన యుపదేశంబు గలుగదు.

## రాసక్రీడ.

పండువెన్నెలలు పాలవెల్లి దాపినట్లు నభోభాగంబున బఱచెను. వనలక్ష్మి హిమధామునకై సింగారించికొని పుష్పాంజలు లిచ్చెను; కమ్మనితెమ్మెరలు రవరవవీఁచెను; యమునాతరంగంబులు నునుగాడ్పులకుఁ జిఱుడోలికలవలెఁ దోఁచెను.

ఒకనాటిరాత్రి గోపబాలికాబాలకులు వెన్నెలఁగూడిరి. కృష్ణుఁడు వేణుగానంబు నారంభించెను. ఆగానమాధుర్యంబునకు గోపబాలిక లపూర్వానందవశులై యొకరినొకరు దోఁపాడుచుఁ గృష్ణునిచుట్టుఁ జక్రాకారంబుగాఁదీరిరి.

కృష్ణుఁడు వారిమధ్యనిల్చి యొక్కొక్కరికి నొక్కొక్క కృష్ణుఁడట్లు గాన్పించుచు మృదుమధురకటాక్షవీక్షణంబుల

నొకర్తుకను, లేనవ్వుఁ జేటల నొకర్తుకను, సరససల్లాపంబుల నొక తెను నొక్కొక్కరి నొక్కొకవిధంబున సంతోషపెట్టుచుఁ దన ప్రేమాతిశయంబులను వెల్లడించెను.

గోపికాబాలికలకు సర్వేంద్రియవ్యాపారంబులుడిగెను. వారిచిత్తము నివాతదీపకళికాకృతి నేకాగ్రస్థితిఁదాల్చెను. వారు బాహ్యప్రపంచంబును మఱచిరి. ఒక్కొక్కరిహృదయాంతరమందుఁ గృష్ణబింబము ప్రతిఫలించి విస్తరిల్లెను. వారెల్లరుఁ దన్మయులైరి. అట్టిస్థితిలోఁ గృష్ణుఁడు వారిమధ్యనుండి మాయమయ్యెను. కొంతవడికి వారికిఁ జిత్తైకాగ్ర్యము సడలెను ; బాహ్యజ్ఞానము తలసూపెను. కృష్ణుఁడు వారిమధ్య లేఁడయ్యెను.

కృష్ణుఁడు కానరామికి వారు చింతాక్రాంతలై వనమెల్లఁ గ్రుమ్మరుచు 'అశ్వత్థమా ! మామనశ్చోరుని నందతనయునిఁ జూచితివా ? కురువకా ! ఎవనిచిఱునగుఁ జేటలకు స్త్రీజనము సొక్కునో యాముద్దుకృష్ణునిఁ గాంచితివా ? తులసీ ! నీవు సహజమృదుహృదయవు ; ఎల్లరకు శుభంబుఁ గోరుదువు ; నీ చిత్తంబు నిరంతరము కృష్ణపాదారవిందంబులఁ దగిలియుండు. గోపాలుఁడు నిన్నుఁ గంఠంబునఁ దాల్చుటచేతనే నీయెడ వాని ప్రీతియెంతో విశదము. నీప్రియుని నీలమేఘశ్యామమోహనాంగుని గంటివా ? ఆహా ! కృష్ణునకుఁ బ్రియురాలననెడి గర్వంబు నిన్నుఁ బదులాడనీయదుగాఁబోలు. మాలతీ ! ఎవని ప్రేమకై మావలె నీవును బరితపింతువో యామిధ్యామూర్తి యీవంకఁ జనెనా ? వానిస్పర్శసుఖంబు నీకుఁ గలిగినట్లు స్రీతమా

కారమే తెలుపుచున్నదిసుమా. పలుకవేల ? మాచకమ్మలు మర్యాదలెఱుంగరు. చూతమా ! నీవు లోకోపకారార్థము వెలయుదువు. స్వార్థము నీకుఁగలుగదు. ముద్దుకృష్ణుఁడు మమ్ముఁ బాసి చనెను. వానికై వెదకివెదకి వేసారితిమి ; మూర్ఛయయ్యెఁడు. మాప్రియుఁ డెందుచనెనో దారిచూపుము. బదులాడవేల ? జాతిమత్సరము నిన్ను వదలదా ?' అనుచుఁ జెట్టుచెట్టును బుట్టపుట్టను బల్కరింపసాగిరి.

గోపికలట్టు లున్మత్తలవలెనై కృష్ణుని వనమెల్ల వెదకి వెదకి వేసారి వానిదర్శనాభావంబునకు శోకహతలై వానిచర్యలనొక్కటిగాఁ దలంచుచు విలపింపసాగిరి.

అంతలోనఁ జంద్రుఁడస్తమించి చీఁకటిగ్రమ్మెను. ఆ చీఁకటిలో నేదిగానవచ్చినను గృష్ణునిగాభావించుచు, ఆకుకదలినను గృష్ణునికాలిచప్పుడుగా నెంచుచు భగ్నమనోరథలగుచు నానాభావంబులకుఁ జిక్కుచు నెట్టకేలకు 'హా ! కృష్ణా ! యనుచువారు సొమ్మసిల్లిరి. అంతలోనఁ గృష్ణుఁడు వారియెదుటఁ దోఁచెను. ఒకతె వానిని గవుంగలించుకొనెను ; ఒకతె వాని పాదంబులను సందిటఁగూర్చెను ; ఒకతె వాని చేలాంచనంబు నీడ్చెను; ఒకతె వానిమోమునందె చూపునిల్పి కదలదయ్యెను; ఒకతె వానితో నిందాగర్భవచనంబులాడెను. అట్లు వారు కొంతవడిఁ బరిపరివిధంబులఁ దమతమిదీఱనుండిరి.

కృష్ణుని పునస్సందర్శనంబున గోపికలమనోవ్యథ చల్లారెను ; కృతార్థినులమైతిమని భావించిరి. యోగులు తమ హృదయంబునుబలె ఒకతె తనచేలాంచనంబును బఱచి కృష్ణు

నందుఁ గూర్చుండబెట్టెను. ఒకతె వానియడుగులొత్తెను ; ఒకతె వానికిఁదామరవీవెన వీచెను. ఒకతె తనయంతస్తాపంబును బట్టఁజాలక 'కృష్ణా ! కొందఱు తమ్మువలచినవారినేవలతురు; వలవనివారినిగూడఁ గొందఱు వలచుటగలదు; ఈరెండుతెగలు లోకసహజంబులు. వలచినవారినిగూడ వలవని తెగయొకటి గలదు. ఈవిపరీతమేమి ? అని యడిగెను.

కృష్ణుఁడు నవ్వుదాల్చి 'కల్యాణీ ! వలచినవారిని వలచుట స్వార్థపరత్వమగు. ఇచ్చికోలుపుచ్చికోలు భావంబులందుఁ గలవు. దయాధర్మంబులకు నచ్చటఁ దావులేదు. ఆత్మతృప్తియే వానికిఁ బ్రధానమైయుండు. రెండవతెగవారిచిత్తవృత్తి తలిదండ్రుల చిత్తవృత్తివలె అకారణవాత్సల్యమయమై యుండు. వారు దయాధర్మనిబద్ధులు. నీవుచెప్పిన మూడవతెగ వారిలో నాల్గుశాఖలుగలవు. ఆత్మారాములును అకారణంబున ద్వంద్వజ్ఞానశూన్యులునైన శాఖమొదటిది. వారికి బాహ్యప్రపంచజ్ఞానమే గలుగదు. సిద్ధపురుషులయ్యు ద్వంద్వవాసన సుంతమాత్రము గల్గినవారు రెండవ శాఖకుఁ జేరుదురు. ప్రపంచంబువలన వారెట్టి ప్రయోజనంబును గోరరు. దానంజేసి వారికి నన్యులతోఁ బనియేగలుగదు. తమ్మువలచుట యెఱింగియు విముఖులై యుండువారు మూఁడవశాఖకుఁ జేరుదురు. వీరిని మూఢులందురు. ఉపకరించినవారికే యపకరించు తెగ నాల్గవదియగు. వీరిని దుష్టులందురు. వీరిలో నీవేశాఖకు సంబంధింతువని నన్నడుగుదువా ? నేను వీనికెల్ల నవ్వలనుండు. ఎట్లందువా ? వలచినవారిని వలవను ; అట్లనుటవలన నాకు దయాదాక్షిణ్యంబులు లేవని తలంపవలదు. వారిహృదయం

బును మఱిమఱియాకర్షించి వారునిరంతరము నన్నే తలంచు నట్లు చేయుటకై వారియెడ నుపేక్షాభావంబును వహించినట్లుం డు. అంతియేగాని వేఱుగాదు. ఒకసారి నావలపురుచిని గలి గించి నేను కన్మొఱఁగుటవలనఁ బూర్వరుచి వానినూఱకుండ నీయదు; నా వెంటఁ బఱపించును. నేనట్లుచేయుట వానిమన స్తత్వపరీక్షకేయని గ్రహింపుము. వేయేల ? మీభక్తిని బరీక్షించుటకుగా నేనట్లు మాయమైతినేగాని మిమ్మొడఁబాయ లేదు. మీవెంటనే యుంటిని. మీవిరహాగతులఁ జూచుచుంటి; మీకై యానందించుచుంటి. ఇంతమాత్రాననే నాకుఁ బ్రే మాభావదోషంబును గట్టవలదు. నేను మీకెట్లు ప్రేమస మూర్తినగుదునో యట్లేమీరును నాకగుదురు. భాగ్యవతు లారా ! నాకై మీరు మీగృహబంధుమిత్రులను మాతాపిత లను మఱచితిరి. ఈత్యాగము మహాయోగులకుఁగూడ సా ధ్యముగాదు. ఈసిద్ధినిగాంచలేక సాధకులెందఱో మార్గాంతర భ్రష్టులైరి. మీనాసంబంధము ఆత్మానుసంధాన సంబంధము గాని కాయికవాచికమానసికమాత్ర సంబంధముగాదు. ఇది యత్యంత పరిశుద్ధము నిర్దుష్టమునై యున్నది. మీరునాయెడఁ జూపునట్టి ప్రేమభావమునకును నాకొనర్చు సేవకును, నాకుఁ గాఁ గావించిన త్యాగంబునకు మేరగలుగదు. నన్నుఁ గృతజ్ఞ తాబద్ధునిఁ గావించితిరి. మీఋణంబును వేయియుగంబుల కైనను దీర్పఁజాలను. మీభక్తిశ్రద్ధలు నిర్వ్యాజములగుటయే యిందులకుఁ గారణము. నాపడినయప్పను మీరు ప్రేమ బుద్ధిం జేసి మన్నించినను నేను మీకు తీఱనిఋణగ్రస్తుండ నైతి' ననెను.

కృష్ణుని వచనామృతంబున గోపికలవిరహతాపమెల్లఁ జల్లారెను. వారు తన్మయులై వాని చుట్టుఁదిరిరి. కృష్ణుఁడు నిజమాయాప్రభావంబున నెందఱు గోపికలుండిరో యందఱు కృష్ణులుగానై ప్రతిగోపికాపార్శ్వంబున నిలిచెను. అట్లు గావించుటంజేసి ప్రతిగోపికకు నిరుప్రక్కలఁ గృష్ణుఁడుండుట య్యెను. కృష్ణుఁడు తనవాఁడనుచుఁ బ్రతిగోపిక తలంచెను. అట్లు గోపికలతోఁగూడి కృష్ణుఁడు రాసక్రీడ యొనర్పసాగెను. ఆవిలాసంబును జూచుకుతూహలంబున దేవతలు తమకాంతలతోడవచ్చి నింగినిలిచిరి.

గోపికల యందెలయుఁ గంకణంబులయు ధ్వనులు తాళమానమయ్యెను. వారు తాళలయంబులకు సరిగా నడుగులిడుచుఁ గేంగేలులఁ ద్రిప్పుచు బొమలాడించుచు నృత్యమాడసాగిరి. కొందఱకు సంబరంబులు చెదరెను; కొందఱకు గొప్పుముడులువీడెను. అందఱితోడ నందఱుకృష్ణులు చేతులు గలపి నృత్యమాడిరి. ఒకతె తనకృష్ణునితోడ స్వరాలాపంబు గావించెను. అందులకుఁ గృష్ణుఁడానందింపఁగా నయ్యాలాపంబును ధ్రువతాళంబుగాఁ బాడి వాని నానందింపచేజేసెను. ఒకతె యాడిపాడి సొక్కి తనకృష్ణుని భుజంబులపై సోలెను. ఒకతె యామెకృష్ణుని కరతలంబునెత్తి ముద్దాడెను. ఒకతె చెమర్చియున్న నిజగండతలంబును దనకృష్ణుని గండతలంబునఁ జేర్చెను. అట్లువారు కొంతవడి నుదాత్తసంభ్రమసముత్సుకత్వంబులతో రాసక్రీడసలుపుచుండఁగా బ్రభాతంబయ్యెను. అంతవారు మహాకష్టముతో నయ్యాట చాలించి యుండ్లకుఁ బోయిరి.

ఈరాసక్రీడను భాగవతం బెంతో రసవత్తరంబుగా నభి
వర్ణించెను. ఇందు మధురభక్తియొక్క నానావస్థలభివర్ణితం
బులు. ఈభక్తిని గూర్చిన యింతరసవత్తరవర్ణనంబు, మఱి యే
గ్రంథంబునను గానరాదు. ఈవర్ణనభాగమందలి ప్రతిపదం
బునకు నంతరార్థముగలదు. భక్తిపుట్టినది మొదలు పరిణతి
నొందువఱకు దానిగతులునవస్థలు నొక్కొక్కయవస్థయందుఁ
గలుగు సంతోషసంతాపంబులు వాని యవాంతరభేదములు.
అది పరాభక్తి యైనప్పుడు జీవాత్మపడయు నానందము—
ఇవియెల్ల యథాక్రమంబుగా సమగ్రముగా నెఱుంగఁ గోరు
వారికి రాసక్రీడకన్న నుత్తమసామ్యము దొరకదు. భక్తిరసం
బును జవిచూచినవారికే యీరాసక్రీడాభావము బోధపడును
గాని యన్యులకు బోధపడదు. భక్తికిద్వైతభావము స్వతస్సి
ద్ధము. జీవాత్మలు గోపికలగాను బరమాత్మకృష్ణునిగాఁ జేసి,
జీవాత్మ దానిపూర్వసుకృతఫలంబుగా భక్తిరసంబును సుంత
చవిగాంచి మఱల విషయవాసనలకుఁ జిక్కి పూర్వానందం
బును దలంచి తత్ప్రాప్తికిగాఁ బడుపరితాపంబును, అదిమరలఁ
గొంచెము లభించినప్పుడు దానిని వదలక యనుభవించుటకై
చేయుప్రయత్నంబులును, ఆభక్తి సుస్థిరమైనప్పుడు అనుభవిం
చు నానందంబును, ఏకారణముచేతనైనను సుంతభంగంబుగలిగి
నప్పుడు కలుగు తల్లడంబు నవస్థాక్రమంబుగా భక్తితత్వంబు
నభివర్ణించి వ్యాసమహర్షి లోకంబునకు మహోపకారమొన
ర్చెను. అవియెల్ల నంతఃకరణవృత్తులు. ఈవృత్తులు భక్తు
నకును గాముకునకును సమానములు. ప్రాప్యము మా
త్రము భిన్నము. ఆనందానుభవము విభావానుభావ సాత్విక

వ్యభిచారభావంబుల రూపంబున వ్యక్తమగుచుండు. ఆయా భావంబులు గల్గినప్పుడు అంతఃకరణంబు తదనురూపమైన మూర్తులను జెందును. ఆమూర్తులెల్ల శరీరమందు వర్ణభేదంబును అంగప్రత్యంగవ్యాపారభేదంబును గలిగించును. ఇవియెల్ల రసప్రకరణమందుఁ జెప్పఁబడియున్నవి. ఇట్టిభావవిలాసప్రదర్శనంబునకు రాసక్రీడాభాగము అపూర్వమైన సినిమా ప్రదర్శనమగు.

రాసక్రీడాతత్త్వరహస్యం బిట్టిదై యుండ దీనికి విపరీతార్థభావంబులను గల్పించిరి. ఈకల్పనకు వారివారిరుచులే కారణములు. రుచులన్ననో ప్రారబ్ధకర్మవాసనాఫలంబులు. అవి వివిధవర్ణదర్పణంబులవలెఁ బెక్కురంగులు గలిగి ఏకవర్ణమైన బింబంబును స్వవర్ణానురూపంబుగా నాభాసించుచున్నవి. నానాత్వంబునకు మనగుణంబుల యంతరాంతరభేదములే కారణము. ఈరహస్యంబును గ్రహింపనేరక యసలువస్తువునందే నానాత్వంబు నారోపించి యాభ్రాంతితో వర్తింతురు. ఇదే యజ్ఞానము. ఈయజ్ఞానఫలంబుగా లోకకళ్యాణమూర్తియైన కృష్ణుఁడు ప్రాకృతబుద్ధికి నింద్యుఁ డగుచున్నాఁడు.

ఆనందం బతీంద్రియ విషయము. అది బుద్ధికిని వాక్కునకును రెంటికిని నందదు. అట్టిదానిని సాదృశ్యరూపంబుననేనిఁ బ్రాకృతులకు ఛాయామాత్రముగాఁ జవిజూపవలయునని మహర్షి సంకల్పించెను. ప్రాకృతానందంబులలో రత్యానందము గొప్పదిగా భావింపఁబడును. అది స్త్రీపుంసస్సంయోగంబునఁ గలుగును. దానిని సాదృశముగాఁ జేసి చెప్పినఁగాని ప్రాకృతలమదికి నింపుగల్గదని జీవాత్మను స్త్రీగాను బరమాత్మను బురుషుఁడుగాను నుపమించి రాసక్రీడావ్యాజంబున

నాత్మైక్యానుసంధానానందంబును మహర్షి చిత్రించెను. అట్టి పరమభావంబునుఁ బ్రాకృతచిత్తవృత్తికి ననురూపంబుగా నిశ్చయించి యసంభావనా విపరీతభావంబులను గృష్ణునకు మూటగట్టుటయ్యెను.

ఎవనిని భగవదవతారంబనియు లోకాదర్శనమూర్తి యనియుఁ గవులు వచించిరో వానినే యీనోటనే యాకవులే జారచోరశిఖామణియని వర్ణింతురా? కృష్ణుఁడు నిజముగా జారచోరశిఖామణియైనను బాత్రపోషణార్థము నొచితికొంటకు వానికళంకంబులను గప్పిపుత్తురేగాని వెల్లడింపరు అంత మాత్రపు సంవిధానజ్ఞానము అంతగ్రంథమును వ్రాసిన కవి పుంగవునకు గల్గదా? కవులు లోకోద్ధరణార్థము గ్రంథంబుల రచింతురు. ఉన్నతభావప్రచారంబున లోకం బుద్ధృతమగు. అందును భాగవతంబు జీవలోకసముజ్జీవమైన భగవద్భక్తిని బ్రతిపాదించుటకుఁగా రచింపఁబడెను. వ్రాసినదిమహర్షి; ఉద్దేశ్యము మహోన్నతము. కావునఁ బ్రమాదంబునకుగాని, అప మార్గబోధనంబునకుఁగాని యందవకాశమే యుండనేరదు. ఉపక్రమోపసంహారంబులనుబట్టి గ్రంథభావంబును గవితాత్పర్యంబును గ్రహింపవలయును. తోచినట్లు విపరీతార్థములు చేయరాదు.

పరమాత్మ యఖండానందస్వరూపము. ఆపరమాత్మ యుపాధిగతమగుటం జేసి ఖండానందస్వరూపియట్లు గాన్పించును. ఇదియెల్ల నావరణకార్యము. ఆవరణము భక్తిరససంక్షాళితమై పరిశుద్ధమగు. అప్పుడు ఖండమఖండమందు నైక్యమగు. దీనినే బ్రహ్మానందమందురు. ఈ యానందానుభవప్రక్రియను

రతియనిరి. ఇది యొకవిధమైన క్రీడయగు. అందువలన రతి శబ్దంబును గ్రీడాపరంబుగాఁ బురాణాదులందుఁ బ్రయోగించిరి. కాలక్రమంబున రతిశబ్దంబునకు లౌకికాచారమునుబట్టి కామ క్రీడయను నర్థము రూఢియయ్యెను.

ఈరాసక్రీడాకాలంబునఁ గృష్ణుఁడు పదియేండ్లవాఁడు. ఆవయస్సున వానికిఁ గామంబంకురించియైన నుండునా? రాస క్రీడను విష్ణుపురాణంబుగూడ వర్ణించెను. ఆవర్ణంబును బట్టి కృష్ణునెడ వ్రేలుచూపుటకుఁ గూడ నవకాశము గాన్పింపదు. బాల్యమందుగాకున్నను యౌవనమందైనను కృష్ణుఁడు అంకుతనమొనర్చినట్లెచ్చటను గానరాదు. మీఁదు మిక్కిలి కృష్ణుఁడు జితేంద్రియుఁడని భాగవతమే చాటుచున్నది. జితేంద్రియత్వమెక్కడ? జారత్వమెక్కడ?

కవులెల్లరుఁ గృష్ణుని తప్పులు గప్పిపుచ్చిరందురా? వాని వైరులట్లు చేయరుగదా? కృష్ణునివైరులలో శిశుపాలుఁడు ప్రథముఁడు. కృష్ణునెడ లోకద్వేషముఁ గలిగించుటయే యతనివ్రతమయ్యెను. నాఁడు శిశుపాలుఁడు సభాంతరాళం బునఁ దననోటితీటవోవఁ గృష్ణుని నిందించెను. కృష్ణునితప్పు లుగా నతఁడు భావించినవానిని గోరంతలు కొండతలుగాఁ జేసి పూసగ్రుచ్చినట్లు ప్రకటించెను. అతఁడు కృష్ణునెడ నెన్నో దోషంబు లారోపించెనుగాని అంకుతనంబును మాటసామెత కైనను బల్కలేదు. శిశుపాలుఁడు మఱచెనేమోయందురా? కురురాజులుగూడఁ గృష్ణునిదూషించిరి. వారిలో నొక్కని నోటనైన నట్టినిందరాదు.

అట్లయినఁ గృష్ణునకు గోపికాజారుఁడను బిరుదేలవచ్చె నందురా? రతిశబ్దంబునకువలె జారశబ్దంబునకుగూడ వేఱర్థము కలదు. గోపికాజారుఁడనఁగా గోపికాహృదయంబులను హరించినవాఁడని భావము. మఱియుఁ బరాభక్తిని వర్ణించునప్పుడు జారస్త్రీగుణంబును సాదృశ్యముగా గ్రహింతురు. జారస్త్రీ తనగృహకృత్యంబుల నొకవంక నెరవేర్చుచునే హృదయాంతరమందు నిరంతరము జారునేస్మరించుచుండు. ఇది జారస్త్రీకి నైజము. గోపికాంగనల మనంబులుగూడ భక్తిపారవశ్యంబునఁ జేసి కృష్ణునందులీనములై యుండెను. అదివారికి నైజమయ్యెను. గోపికల హృదయంబులను హరించినందునఁ గృష్ణుని గోపికాజారుడనిరి. జారశబ్దం బీయర్థంబునఁ బ్రయోగింపఁబడెను. దానినట్లే గ్రహింపనగు.

రాసక్రీడకు హల్లీసమను నామాంతరముగలదు. ఆక్రీడను గోపికాగోపకులేగాక రాజులును రాజకన్యలును గలసియాడినట్లు భారతమందుఁ గలదు. అంతియుగాదు. ఈరాసక్రీడలను కృష్ణుఁడు ద్వారకలో నెన్నోసార్లు జరిపెను. ఈక్రీడలందు భార్యాభర్తలును బుత్త్రికాపుత్త్రులును సోదరీసోదరులును మాతాపితలునుగూడి యాడుదురు. ఇట్టివారుగూడి యాడుక్రీడలందుఁ గామమోహంబులకుఁ దావుండునా ? ఈక్రీడ నేఁడును గొంచెము మార్పుతో నాంగలసంఘమందు జరుగుచున్నది. ఇవి వారికెంతయుఁ బ్రియమైనవిగానున్నది. ఆనందానుభవమే యీ క్రీడోద్దేశ్యము.

విశుద్ధమైన యాక్రీడ యెట్లో వామాచారమైన వైష్ణవ మతమందు వైపరీత్యరూపంబును దాల్చి మధుమాంసభోజన

పూర్వక కంచుకోత్సవాది హేయాచారంబునకు నాస్పద మయ్యెను. ఈనీచమార్గము తన్మతావలంబకులనేగాక యా క్రీడకు గు లమైన కృష్ణుని సర్వలోకారాధ్యునిఁగూడ భ్రష్ట స్థితికి నీడ్చిపైచుచున్నది.

కృష్ణుఁడు రాసక్రీడలనేగాక జలక్రీడలనుగూడ గోపి కలతోఁగూడి గావించెను. ప్రతిక్రీడయందు గోపికలెంద ఱుండిరో యందఱకు నందరుకృష్ణులేర్పడి క్రీడించినట్లు గ్రంథ ము చెప్పుచున్నది. కృష్ణుఁడు కాముకబుద్ధితోఁ గ్రీడించెనను టకు నిందఱుకృష్ణులుండుట యెట్లుపొసఁగునో యూహింపనగు. ఇదంతయు లీలావిశేషమో గోపికలభావనావిశేషమో కావల యును.పరాభక్తియందు అంతఃకరణము ధ్యేయాకారముఁదాల్చి నిల్చును. గోపికలు మహాభక్తురాండ్రు గావున వారికి ధ్యేయా కారమైన కృష్ణబింబ మొక్కొక్కరి యంతఃకరణమందుఁ బ్రతి ఫలించి నిలిచెను. అట్టి ప్రతిబింబముతో గోపికలు రతిసల్పి రన్నప్పుడు అదికాయికమో మానసికమో మానసికమైనను కామాంకితమో ఆనందఘనమోయూహింపనగు.

కృష్ణుని లీలలెల్ల విన్నంతటఁ బరిక్షిత్తునకుఁగూడ నిట్టి సందేహమే కలిగి 'మహాత్మా! కృష్ణుఁడందఱుగోపికలతో నెట్లు రతిసల్పెను ? అట్టిశక్తియున్నను గృష్ణుఁడట్టిది చేయునగునా ? అని యాయనయడిగెను. పరిక్షిత్తు కృష్ణతత్త్వంబును సమగ్రం బుగా గ్రహింపలేదని శుకమహర్షి తలంచి 'రాజా !

ఆ: గోపజనములందు గోపికలందును ।
సకలజంతులందు సంచరించు ।
నామహాత్మునకుఁ బరాంగనలెవ్వరు ?
సర్వమయుఁడు ... సల్పెఁగాక ॥

అని వివరించెను.

కృష్ణుఁ డీ ప్రబోధమును గోపకులకే చేయుటేల ? అని శంకింపవచ్చును. దేశమందలి జనమెల్ల జ్ఞానవర్గమునకో అజ్ఞానవర్గమునకో చేరును. అందు జ్ఞానవర్గమునకన్న నజ్ఞాన వర్గము బహుసంఖ్యాకముగా నుండు. ఇది నైసర్గికము. అ జ్ఞానవర్గము నుద్ధరించుటయే దేశోద్ధారకమగు. అజ్ఞానవర్గము లో గుణతారతమ్యమునుబట్టి యంతరాంతరములు గలవు. నాటిగోపకులము తనకార్యమునకు సాధనమగునని భగవం తుఁడు భావించి యాకులములోఁజేరి మొట్టమొదట గోపకుల హృదయంబధిష్ఠించి వారివలనఁ దనయవతారకార్యంబుల సా ధించెను.

బాలికలసంగతియన్ననో, వారు భావిమాతలు. తల్లి యనఁగా గృహదేవతయగు. ప్రజాసుగుణసంపదలెల్లఁ దల్లు లఁబట్టియుండును. మఱియు బాలికలు కోమలహృదయులు. వారియందు బీజము సులభముగానాఁటును. ఆకారణంబున భక్తిబీజంబును గోపబాలికలయెదలోఁ గృష్ణుఁడు నాఁటెను. ఆబీజమెట్లు వృద్ధిగాంచినది భాగవతమే తెలుపును.

స్త్రీలు ధర్మప్రవర్తనలగుదురేని వారిమాట కాంతా సమ్మితమై పురుషులనుగూడ మరలించి వారిని ధర్మోన్ముఖు లనుగా జేయును. అందులకు మునిపత్నులకథయే నిదర్శ నము. దేశమందలిమార్పు అనఁగా జనులభావమందలి మా ర్పేగాని వేఱుగాదు. భావగతింబట్టి ధర్మాధర్మంబులు వ్యవహ రించును. భావపరిణతిని బురుషులయందుఁగంటె స్త్రీలయందు సులభముగాఁ గలుగును. ఇదినైజము.

## కంసనారదులు.

కృష్ణునిచర్యలప్పుడప్పుడే కంసునిచెవిఁ బడుచుండెను. కృష్ణుఁడే తనకు మృత్యువుగాఁబోలు ననెడి నెంజలి వానిని వెన్నాఁడసాగెను. ఆకారణంబునఁ గంసుఁడు నిరంతరముఁ గృష్ణునిచింతలోనే మునిఁగి యుండుటయ్యెను.

ఒకనాఁడు నారదమహర్షి కంసునియొద్దకు వచ్చెను. కంసుఁడు వానికి సముచితసత్కారపూజలొనర్చి 'మహాత్మా! మీరు త్రికాలజ్ఞులరు. మీరెఱుంగనియర్థంబు ముల్లోకంబులఁ గలుగదు. కృష్ణుఁడెవఁడు? వానిచర్యలు పరమాద్భుతంబులుగా నున్నవి.' అని యడిగెను.

నారదుఁడు వానిని విని 'కంసా! నీయడిగినయర్థంబు పరమరహస్యంబు. అయినను చెప్పెద వినుము. నాఁడు నీ చేతినుండి యెగచి చన్నయాడుపాప యశోదాపుత్త్రికయని యెఱుంగుము. వ్రజపురమందు గోపబాలికలతోఁగూడి లీలలుగావించుచున్న కృష్ణుఁడు దేవకియొక్క యష్టమగర్భంబని గ్రహింపుము. దేవకికి నేఁడవచూలు స్రావమయ్యెననిరి. అది నిజముగాదు. ఆపిండము రోహిణీగర్భముఁ జొచ్చి బలరాముఁడను పుత్త్రుఁడుగా జనించెను. వసుదేవుఁడు నీకు నోడి వానితనయునిఁ గృష్ణుని నందునకు నర్పించెను. నీవన్నమహిమలెల్ల నీరామకృష్ణుల కార్యములేగాని యన్యములుగా'వని చెప్పి చనెను.

## కంసుని దుర్మంత్రము.

నారదునిమాటతోడఁ గంసుని సందేహంబులెల్లఁ దీఱె

నిలువున నెగచెను. అతఁడు నెమ్మదివహించి 'రాజేంద్రా! నీకు నేను విశ్వాసపాత్రమైనందులకు సంతసింతు. రాజునకు నెదురాడరాదు; నీవు పొమ్మన్నఁ బోనివాఁడనుగాదు. స్వబుద్ధిని నమ్మి వర్తింపరాదు. హితాహితంబుల విమర్శింపవలయు. నీతలంపు నీయభిమతంబును గూర్చునని నిశ్చయించితివా? దైవయోగంబెట్లోగదా? ఏదియెట్లున్నను రాజాజ్ఞయయ్యెను. ఇదేపోయెద' నని వానిని వీడ్కొనియెను.

అక్రూరపరితాపము.

అక్రూరుఁడు వ్రజపురంబునకుఁ దరలెను. రాజాజ్ఞ వానిని ముందునకు నెట్టును; తదీయదుర్వ్యూహము వెనుకకు లాగును. అతఁడట్లు డోలాయమానమానసుఁడై 'కటా! ఏమిచేయుదు! ఏమని కృష్ణునకుఁ జెప్పుదు? వానికిఁ గల్లవచింపఁజాల; నిజము పల్కుట స్వామిద్రోహమగు. పోకుండిన నరిత్రాఁడు నాకుఁదప్పదు. అయ్యో! కంసునకు నేనే యగపడితినా? కానిమ్ము; సర్వజ్ఞునకు నాయంతర్భావము స్పష్ట' మనుచు మెలమెల్లగాఁ జనసాగెను. మార్గమధ్యంబున శుభనిమిత్తంబులు తోఁచెను. అక్రూరుఁ డానిమిత్తములఁ గాంచి;

"మ॥ అలకభ్రాజితమై సుధాంశునిభమై హాసప్రభోద్భాసమై,
జలజాతంబుల కర్ణకుండలవిరాజద్గండమై యున్న యా
జలజాదాక్షుముఖంబు నూడఁగలుగుఁజ సత్యంబువో నాకు నా
వలదిక్కేగుచునున్న దీవసత్ప్రగవ్రాతంబు లిత్రోవలఁ॥"

అని ధైర్యసంతోషంబులు వహించి సాయంకాలమునకు బృందావనమును జేరెను. వనంబునుండి దిగిరాకున్నగోవు

లను జీరుశబ్దంబులును, గ్రేపులందలంచి స్రవించుపాడుగుల తోఁ బఱచుచు ధేనువులు గావించు సంభారవంబులును వానికి శుభ స్వనంబు లయ్యెను.

అక్రూరుఁడు ఘోషముఁజొచ్చి నందునియింటికిఁ బోయెను. నందుఁడు వానిని యథోచితమర్యాదల గారవించి 'అక్రూరా! సుఖమా? అయ్యో! క్రూరుఁడు కంసుఁడున్నంత కాలము సుఖముండునా? వానికిఁ బాపభీతి యింతయుఁ గలుగదు. ఆత్మార్థము వాఁడు వానిచెలియలబిడ్డల నామెకట్టెదుట గావుగొనెను. ఇంతకన్నఁ గఠినుఁడుండునా?' అని యనెను. అక్రూరుఁడు వానికిఁ దలయూచి దైవగతి చిత్రమనుచుఁ గొంతవడి వానితోఁబుచ్చి రామకృష్ణుల యొద్దకుఁ దరలి గోదోహనస్థానంబుననున్న వారియడుగుల మ్రోలఁ జాఁగిలఁబడెను.

రామకృష్ణులు వానిని గవుంగిటఁ గ్రుచ్చి యెత్తి గృహాంతరంబునకుఁ గొనిపోయి యుత్తమాసనంబునఁ గూర్చుండఁబెట్టి విధివిహితంబుగాఁ బాదప్రక్షాళనాదులు గావించి మార్గాయాసంబుఁ దీర్చి రసవత్తరంబైన యన్నంబుఁ గుడువఁబెట్టి భోజనానంతరము సుఖోపవిష్టుని గావించిరి. అట్లుకొంతవడి చన్నంత నక్రూరుఁడు తావచ్చినకార్యంబుఁ దెలిపెను.

కృష్ణుఁడు చిఱునవ్వు నవ్వి 'ఈమాటఁ బలుక జంకేల? కంసుఁడు తలంచినట్లే వత్తుము. తానొకటి తలంచిన దైవము వేఱొండుతలంచునందురు. యదువంశగ్రామకేతువు వ్రాలు తఱియయ్యెను. నాబాధువుమిత్రాదుల మనస్తాపంబులు చల్లారనున్నవి.' అనెను

కంసుని వ్యాపారహస్యం బెట్లో క్షణములో గోకులమెల్లఁ బ్రాఁకెను. గోపకులు క్రోధమూర్ఛితులైరి. కృష్ణునిరక్షించుటో తమప్రాణంబుల నర్పించుటో రెంటనొక్కటిఁగునసి పాఁపు నిశ్చయించిరి. గోపాంగనలు కంసుని దూఱి తూఱ్ప్సఁబోయుచు నక్రూరుని నిందించుచు దుఃఖసాగరంబున మునిఁగిరి. యశోదానందులు కృష్ణునకు నెదురాడలేక లోలోన క్రుగ్గసాగిరి.

### మధురప్రయాణము.

అక్రూరునివెంట రామకృష్ణులు మధురకుఁ దరలిరి. ఏడాదికప్పంబులు చెల్లించునెపంబునఁ గొందఱును ధనుర్యాగంబును జూచువేడుకతోఁ గొందఱును గోపులు నాగులు కృష్ణుని వెంబడించిరి. ప్రొద్దుక్రుంకువేళకు నెల్లరును మధుర బహిః ద్వారము చేరిరి.

### వస్త్రహరణాదులు.

చీఁకటిపడెను. రామకృష్ణులిరువురు నగరుఁజొచ్చిరి. చాకలి యొకఁడు ఱేనివస్త్రంబులు తీసికొనివచ్చువాఁడు వారికి నెదురయ్యెను. ఆరజకుని రామకృష్ణులు నిలిపి 'రజకా' నీమూటలో విలువగలవస్త్రంబులుండు. మాకు చెఱియొక జత యిమ్ము. నీకు మేలగు. మీరాజునకు విందలమై వచ్చితిమి. తగువేషంబునఁగాని ఱేనిని సందర్శింపరాదు. పని ముగిసినతర్వాత నీయిచ్చినట్టి యుడుపులను నీకుఁజేర్తు' మనిరి. ఆమాటకుఁ జాకి వెగటును నలుకయును దాల్చి 'ఆలమేపుకొనుచు నడవులపాలైయుండు దొరలెప్పుడును విలువవలువలే ధరింతురుకాఁబోలు. మైమఱచి మీకొలంది మీఱిరి. పసిపంద

లారా ! ఈవలుకు మఱియొకచోటఁ బలుకవలదు. రాజ భటులు విన్నచో మీకుఁ బ్రాణంబులు తక్కవు. ఆవలఁ బొమ్ము' అనిచెప్పెను.

ఆమాటలకుఁ గృష్ణుఁడు కోపపడి వానితలపైనొక్కటి వడ్డించెను. ఆవ్రేటుతోడ వాఁడు ద్రెళ్ళి యసువులు దొఱఁగెను. వానిపాటుచూచి తక్కినచాకళ్ళు మూఁపుమీఁది మూటలు పాఱవైచి పఱచిరి. రామకృష్ణు లామూటలలోని మేలివస్త్రంబులు గొన్నిధరించి తోడిగోపకులకుఁ గొన్నియిచ్చి తక్కినవి పాఱవైచి యిందుండి తరలి సుధాముఁడను పూలవానియింటికిఁ బోయిరి.

సుదాముఁడు పరమభక్తితో వారికి మ్రొక్కి యాసనంబులర్పించి పాద్యంబులిచ్చి వివిధకుసుమమాలల వారినలంకరించి 'దేవా ! మీశుభాగమనంబునఁ జేసి మాగృహము పావనమయ్యెను ; మాకు జన్మసాఫల్యము చేకూఱెను. లోకాభ్యుదయంబునకై యవతరించితిరి. మీమహిమంబును మూఢులెఱుంగక ప్రమాదపడుదురు. మీకింకరునకు నాజ్ఞయేమో సెలవీయనగు. మీవలన నాజ్ఞప్తుఁడై వర్తించుటకన్న మించిన వరము ప్రాకృతునకుఁ గలుగదు.' అని మరల సాష్టాంగనమస్కారమొనర్చెను. రామకృష్ణులందుండి పోవుచుండఁగాఁ గంసుని యంతఃపురదాసి గూనిది యొకతె వారికెదురయ్యెను. ఆయింతి లేఁబ్రాయపురాలయ్యు దాని యితరావయవంబులు సొష్టవంబులయ్యు గూనితనంబునఁ జేసి యది వికారముగానుండెను. కృష్ణుఁడు దానిని గనికరించి పరిహాసంబునకోయన 'సుం

దరీ! నీవెవ్వతెవు? నీచేతిపాత్రయం దేమున్నది?' అనెను. ఆకుబ్జ తలయెత్తి చూచి కృష్ణుని దివ్యమంగళాకారంబునకు విస్మయమంది దృష్టి వానియందే నిలిప 'అయ్యా! నన్నుం ద్రివక్ర యందురు. రాజుగారికి సుగంధలేపనంబుల సమకూర్తు. ఇది నావృత్తి. కొలువు మేరకు రాజుగారికి వాసనద్రవ్యంబులు నించిన యీపాత్రను గొనిపోవుచున్నా' ననెను. కృష్ణుఁడు దానికినవ్వి 'మాకుఁగొంచెమిత్తువా ?' అనెను. ఆదాసి శ్రోత్రోడఁ బాత్రయందలి గంధంబును బలకృష్ణుల మేననలంది యట్టిభాగ్యంబు తనకు లభించెనని మేలనో పరమసంతోషమందెను. కృష్ణుఁడు దానికి మేలుచేయువాఁడై 'సలతా! నీయట్టిచక్కని యింతిగలదా ?' యనుచు సద్దాసిగిష్టము క్రిందఁ జేయియుంచి తనకాలితో దానికాలుద్రొక్కిపట్టి సాగదీసెను. ఆదాసి గూనిపోయి మహాలావణ్యవతియై కృష్ణునిఁ బ్రార్థించెను.

రామకృష్ణులటు త్రివక్రను వీడ్కొని మధురాశాలనరసి యటకుఁబోయి శాలాంతరమందు నింద్రచాపంబువలె వెలుఁగుచున్న యుద్దండకోదండంబును గాంచిరి. దానిచుట్టు నూర్లకొలంది రక్షకులుండిరి. కృష్ణుఁడు వారిని ద్రోసిపాఱి లోనికిఁ జని యాచాపంబును వలకేలఁబట్టి యవలీలగా నెత్తి చెఱకుదండంబును గజరాజువలె రెండుగాఁ ద్రుంచివైచెను. అధనుర్భంగధ్వని యకాలాశనిపాతధ్వనివలెఁ బురమెల్లఁబఱచి కంసునకుఁ తత్తరపాటొదవించెను. చాపరక్షకులు కోపవివశులై పట్టుఁడుకొట్టుఁడనుచు రామకృష్ణులను ముట్టడించిరి. వారినుర [illegible] రామకృష్ణులు కన్నులెఱ్ఱచేసి కోదండతుండం

బులఁ జెఱియొకటి చేఁబట్టి తమ్ముమూఁగియున్నవారినిఁ బడఁగొట్టిరి. అంతలోన మఱికొందఱు కంసునిపంపున వచ్చిరి. వారిగతియు నట్లేయయ్యెను. ధనుర్భంగవిషయము క్షణములో నగరమెల్ల వ్యాపించెను.

అంత రామకృష్ణులు మఖశాలనుండి తన్మఖద్వారంబున వెలువడి నగరంబును జూచువేడుకతోఁ జనిరి. వారిరాజగాంభీర్యంబును రూపరేఖావిలాసంబులును బ్రజాదృష్టి నాకర్షించెను. జనులు వారినిజూచి దేవతలోయని భావించిరి. రామకృష్ణులు కొంతవడి నగరసౌభాగ్యంబును విలోకించి విడిదికిఁబోయిరి.

### ధనుర్మఖము.

ఈసంగతులెల్లఁ గంసునకు నప్పుడప్పుడే శ్రుతిపథమగుచుండెను. అతఁడు ధనుర్మఖరచనానాయకునిరావించి 'రేపు రామకృష్ణులు మఖశాలకు వత్తురు. వారు ముఖద్వారము త్రొక్కుటే తడవుగాఁ గువలయాపీడగజంబును వారిపయిఁ బురికొల్పుము. ఆగండము వారికిఁదప్పెనేనిఁ జాణూరముష్టికులను వారితోఁ గలుపుము. రామకృష్ణులు తప్పక నుగ్గునూచమగుదురు. అంతతో యాగసమాప్తియగు.' నని కట్టడిగావించి యెప్పుడెప్పుడు తెల్లవాఱునా యని యుండెను.

కంసునకు నిదురరాదయ్యెను ; భయంబు వానిని వెన్నాడసాగెను ; మరణసూచకంబులు గాన్పింపఁజొచ్చెను. అద్దమ్మును జూచెను ; మొండియప్రతిబింబము మాత్రమేఁ గాన్పించెను ; దీపంబులు రెండురెండుగాఁ దోఁచెను ; నీడను జూచుకొనెను ; ఒడలెల్లఁ గ్రంతలుగానుండెను. చెవులు

మూసికొనెను ; కర్ణాంతర ప్రాణనాదము వినరాదయ్యెను. అలసిసొలసి యతఁడించుక కనుగూర్కినంత శవంబును గవుంగలించికొనినట్లు, గాడిదపై నెక్కి విహరించినట్లు, విషము ద్రావినట్లు, నూనెనొడలెల్లఁ బూసినట్లు, దిసమొలనున్నట్లు స్వప్నంబులాయెను.

ఫాల్గుణ శుద్ధ చతుర్దశి యరుణోదయముతోడ భేరి మ్రోగెను. వందిమాగధులు జోహారువులు పాడిరి. లోకబాంధవుఁడు ప్రాచీముఖమండలంబునఁదోచెను. సామంతరాజులు మంత్రిపరివారంబులతోడ యథోచితస్థానంబుల మఖశాల నలంకరించిరి. పౌరముఖ్యులు నియతస్థానంబులఁ గైకొనిరి. కంసుఁడు మహోన్నతపీఠి నధిష్ఠించెను. వానిసమీపంబునఁ దీర్వరులు దీరిరి. అంతఃపురస్త్రీజనం బొకవంకను బురస్త్రీబృందంబొకవంకను గూర్చుండిరి. నందునకును గోపకులకును బ్రత్యేకస్థానంబులు చూపఁబడెను. అక్రూరవసుదేవులను వారికి సవ్వలఁ గూర్చుండఁబెట్టిరి. మఖశాల క్రిక్కిరిసెను. మఖారంభమెట్లోయని యెల్లరు నిరీక్షింపసాగిరి.

రామకృష్ణులు మఖశాలాద్వారంబునకు వచ్చిరి. రోదసీకుహరవిస్ఫాటితంబుగాఁ గువలయాపీడగజంబు ఘీంకరించుచుఁ దొండంబు వీచుచు నడగొండవలె ద్వారమువంకఁబఱచెను. సంగతియేమో యెవ్వరు నూహింపలేరైరి. ప్రజాదృష్టి యావంకనే నిలిచెను. గజంబు రామకృష్ణులపయిఁ గవసి వారిని దొండంబునంజుట్టి యెత్తెను. కంసునిముఖంబున సంతోషచ్ఛాయ దొల్కాడెను. శాలాంతరమందు హాహాకారావంబు

లును జచ్చిరినొచ్చిరను నేడ్పులు నుప్పతిల్లెను. రామకృష్ణులెట్లో యేనికతొండంబునుండి తప్పించికొని దుమికిరి. సింధురము క్రోధబంధురమై ఘీంకరించుచు రామకృష్ణులకై బిఱబిఱఁ దిరుగాడసాగెను. కృష్ణుఁడు మెల్లగా దానిని దోఁకంబట్టి తివిచి వదలెను. అది కొండవలె బోర్లపడి లేచి కృష్ణునెదురొక్కనెను. కృష్ణుఁడు ముష్టిసారించి యెగచి యాకుంభికుంభస్థలంబున నసచెను. దంభోళిహతినిబోని యా వ్రేటునకు నగ్గజంబు తలప్రీలి గీపెట్టి నెత్తురులు గ్రక్కి నేలఁగూలెను. రంగమెల్ల జయజయధ్వనులతోఁ గొల్లుమనెను. రామకృష్ణులు రంగమధ్యమునకు వచ్చిరి. వారిరూపలావణ్యంబుల సపూర్వశోభావంతంబులైన వానిని జనులు తమితీఱ చూచుచుఁ బరమానందవశులైరి. కంసుని ముఖము నల్లవాఱెను.

### చాణూరముష్టికులు.

రామకృష్ణులట్లు గజరక్తంబుల జొత్తిల్లుచుఁ గొదమ సింగంబులవలె నిల్చియుండఁ జాణూరముష్టికులను మల్లురు భుజంబులాస్ఫాలించుచుఁ దొడలు తట్టుచు వారిపయి గవిసిరి. అదిచూచి ‘అయ్యో! అయ్యో! ఇంతయన్యాయమా? ధర్మములేదా? ముక్కుపచ్చలారనిబుడుతలేడ? భూతంబులబోని యీమల్లులేడ?’ యను రొద పుట్టెను.

వలదువలదనెడి వారణధ్వనులు చెలరేఁగి చెవులు గిడ్వుఱచుచున్నను గృష్ణుఁడవి చెవిసిడక మహాశాంతముతోఁ జాణూరుని ఢీకొనెను. బలరాముఁడు ముష్టికిని దాఁకెను. అట్లు వారు జతలై చేయిచేయి గలిపి నెట్టుచు నీడ్చుచుఁ బొడుచుచుఁ గ్రుమ్ముచు ముమ్మరించుచుఁ బోరసాగిరి. ఆపోరు

కొండలకు లేగలకు నట్లుండెను. అయ్యసమానమల్లయుద్ధము ధర్మబాహ్యమనుచు సభాస్తారులు వగచుచు 'దైవమా' యని యుండిరి. రామకృష్ణులకై స్త్రీలకంటఁ దడియాఱదయ్యెను.

చాణూరునిబలంబు క్రమక్రమంబుగా సన్నగిల్లెను. కంసుఁడది గ్రహించి రోషకషాయనేత్రుఁడై రోఁజుచు రొప్పుచు వాద్యంబులు నిలుపనాజ్ఞాపించెను. కృష్ణుఁడు చాణూరునిబట్టి యెత్తి రాట్నమువలె గిఱగిఱఁ ద్రిప్పెను. చాణూరుఁడు రుధిరంబులు గ్రక్కి యుక్కుఁదక్కి యసువులు దొఱఁగెను. కృష్ణుఁడంతట వానిశవంబును విసరివైచెను. బలరాముఁడు ముష్టికునిఁ గాలఁబొడిచి ముద్దచేసి దవ్వుజోపెను. రంగస్థలినున్న వస్తాదులు బెగడంది సందుగొందులఁ బాఱిచిరి. సభాస్తారులదియెల్లఁ జూచుచుండియుఁ దమ్ము తామే నమ్మరైరి.

రామకృష్ణులంతట గోదాలో నిలిచి నృత్యమాడసాగిరి. గోపబాలకులును వారిని గూడిరి. అంతలోన సభయెల్లఁ దేఱి యథార్థస్థితి గ్రహించి రామకృష్ణులపయి నానందబాష్పంబులను వర్షించెను. జయజయ ధ్వనులు నింగిముట్టెను.

## కంసవధ.

కంసుఁడు వాంఛాభంగంబునకుఁ గ్రోధమూర్ఛితుఁడై కన్నుల నిప్పులు రాల్చుచు 'నందుని బంధింపుఁడు ; వసుదేవుని వధింపుఁడు ; గోపకులఁ గొల్లలాడు'డని మేఘనిర్ఘోషధ్వని నఱచెను. వానియఱపులకుఁ బూరిపుడుకయుగదలదయ్యెను. అతఁడు మఱిమఱి మండిపడుచుఁ బండ్లుగీఁటెను ; ఉఱిమెను ; ఉంకించెను ; బెదిరించెను. [illegible] సూడరైరి. సజనాసు

నోల్లంఘనం బెట్టిదో యెఱుంగని కంసునకు నది విపరీతమయ్యెను. వానినిలువెల్లఁ జెమర్చెను ; ఆపాదమస్తము వానిశరీరంబు వ[illegible]కెను ; నోటఁదడియూరెను. ఏమగునోయని జనులు తహతహపడసాగిరి. అంతలోనఁ గృష్ణుఁడు డేగవలె జివ్వున నెగచి కంసునికిరీటంబుఁ దన్ని శిరోజంబులఁబట్టి వానిని దిగిచి పడఁద్రోసి త్రొక్కి చంపి వానియురంబధిష్ఠించెను.

కంసుని చావునకు వానితమ్ములు సుమాలి కంకన్యగ్రోధాదు లెనమండ్రుగురు మహా[illegible]గ్రులై యొక్కుమ్మడిఁ గృష్ణునిపయి నురవడించిరి. వారినెల్ల బలరాముఁడుక్కడంచెను. గోపబాలకుల జయజయధ్వనులు చెలరేఁగెను. అదియెల్లఁ గలయోకల్లయో యని సభాస్తారులు తలంచిరి. ఆ రొదకుఁ బుగమెల్ల నెత్తివచ్చెను.

కంసవధావృత్తాంతము వానియంతఃపురమునకుఁ దెలిసెను. వానిభార్యలు గోడుగోడుమనుచు వచ్చి వీరశయ్యాన్నిద్రితుఁడైయున్న పతినిఁ గవుంగిలించి విలపింపసాగిరి. అతని తలిదండ్రులయు భార్యాపుత్త్రులయు దుఃఖరోదనంబులు విను వారికి గుండియలు నీరుగావించెను. కృష్ణుని యెదఁగూడ జాలిజనించెను.

ఆరొద సుంత సమసినంతటఁ గంసాదులకుఁ బరలోకక్రియలు యథావిధిజరుపఁ గృష్ణుఁడాజ్ఞాపించెను. పురోహితులువచ్చి యగ్నిరగిల్చి సుగంధద్రవ్యంబులు చల్లి యాజ్యధారతో మంటచేసిరి. రాజబంధువులును మిత్రులును శవంబును బీతాం[illegible]ంబులఁగప్పి పుష్పంబులఁగూర్చి శిబికలనుంచిరి.

శవవాహకులు శిబికలను దరలించిరి. వెలిగొడుగుముందు నడిచెను ; ఇరువంకలఁ జామరంబులువీఁచెను ; వివిధ వాద్యంబులు మ్రోగెను ; నవరత్నదానంబులు గురిసెను.

అట్లు శవంబులను రాజమర్యాదలతో శ్మశానవాటిఁ జేర్చి సువర్ణకలశజలంబులఁ దోయమాడించి తెల్లగంధము పూసి తుంగరసమిశ్రకాలాగురుధూపంబులొసంగి వెలివలువలు గప్పి శ్రీగంధశకలరచితచితిపయినుంచి యగ్నిపెట్టిరి. దహన క్రియలు సమాప్తమయ్యెను.

అంతటఁ గృష్ణుఁడు కంసునితలిదండ్రులకడకుఁబోయి వారికి నమస్కరించి యోదార్పులు పలికి వచ్చెను.

మాతాపితృసందర్శనము.

అప్పటికిఁ గృష్ణునకుఁ బదురెండేండ్లును బలరామునకుఁ బదుమూఁడేండ్లునైనను వారందాక వారితలిదండ్రు లెట్టివారో యెఱుంగరు. దేవకీవసుదేవులును గంసునకు వెఱచియు బంధనాదులఁజేసియుఁ గన్నబిడ్డల ముద్దాడనోచరైరి. రామకృష్ణులు చెఱసాలయొద్దకుఁ జని తలిదండ్రులను బంధవిముక్తులఁ గావించి వారికి సాష్టాంగప్రణామంబు లాచరించి 'తలిదండ్రులు వారిభావిసుఖంబునకై సంతానంబుఁగోరి వడయుదురు. మమ్ముఁ గన్నారనుటయేగాని మావలనఁ బుత్రపరిష్వంగాదిసుఖంబు లెట్టివో యెఱుంగరు. మీమన్ననలను మీలాలనంబులను మేమును నోచమైతిమి. అంతియగాదు. మీబందికి మేము కారణభూతులమైతిమి. మాయట్టి మందభాగ్యులు గలుగరు. ఈవ్యసనంబు తలంపునకుఁగూడ నందదు. ఇదంతయు మా

డార్భాగ్యవిశేషముగాని వేఱుగాదు. అమ్మా! నాయనా! మీదుఃఖకారకులను మమ్ము మన్నింపవేడుదుము. పితౄణము న. తేండ్లకైనఁ దీర్పరాదు. ఈశరీరంబులు మీసొమ్మని పునఃపునస్సాష్టాంగంబు లొనర్చిరి. దేవకీవసుదేవులను బుత్త్ర వాత్సల్యంబు పైకొనెను. వారు రామకృష్ణుల లేవనెత్తి యొడిలోఁగూర్చి యానందబాష్పంబులఁ గురిసి తమకష్టంబుల నెల్ల మఱచి పునర్భవముగాంచినట్లుగా భావించిరి.

మథురరాజ్యపట్టాభిషేకము.

కంసుఁడు రాజ్యాధిపత్యము వహించి విశృంఖలమార్గముఁ ద్రొక్కెను. వాని యనుజీవులకు రాజప్రీతియే పరమార్థమయ్యెను. రాజ్యమందెల్లెడల నధర్మంబు విచ్చలవిడి విహరింపెను. పరిపాలనవిధానము సరిగాదన్నవారికిఁ జావో చెఱయో రెంటనొకటి తప్పదయ్యెను. అనుచరులదుండగంబులను తేఁడు మెచ్చసాగెను. మొఱవినువారు లేరైరి.

లంచంబులీయఁజాలకయు, నక్రమంబుల సహింపలేకయుఁ బ్రాణమానభయార్తులై వృష్ణిదాశార్హభోజాదులెందఱో దేశాంతరగతులై యిడుమలఁబడుచుండిరి. కృష్ణుడు దూతల వలన వారినెల్ల రావించి జ్ఞాతిమర్యాదల సత్కరించి వారివారి తావులందు యథాపూర్వము చేర్చెను. వారెల్లరుఁ గృష్ణునకుఁ గృతజ్ఞతాబద్ధులైరి.

కంసునకు సంతానముగలుగదు. రాజ్యంబనాథస్థితి నుండరాదయ్యెను. అధికారి యెవఁడో యనుతలంపు దేశమెల్ల వ్యాపించెను. ... తు.రాజు... హాతులో జతులోనైనప్పుడు వారి

రాజ్యంబులను జేతలాక్రమించుటగలఁడు. కంసునిఁ గృష్ణుఁడు చంపెను. మగధరాజ్యంబునకుఁ గృష్ణుఁడే నేతయగునను భావము విస్తరించెను. గోపకులును మగధరాజ్యాధిపత్యంబునకు బహువిధంబుల కృష్ణునిఁ బ్రేరేపింపసాగిరి. ప్రజానురాగంబును గృష్ణునివలననే యుండెను. జ్ఞాతివర్గంబుగూడ నట్టిభావంబు ననుమోదించెను. ఒకచెవిలోఁ బేదఱికంబు నొకచెవిలో రాజ్యకాంక్షయు నిలుకట్టి కృష్ణునకుఁ బలుకసాగెను. ప్రజాభావంబును గాలపరిస్థితిని బరికించి రాజ్యంబు తనకు వలదనియుఁ గృష్ణునకే కట్టనగుననియు నుగ్రసేనుఁడు విస్పష్టముగాఁ జెప్పుచుఁ గృష్ణునొక్కుమ్మడి బలవంతపఱచుటయ్యెను. కృష్ణుఁడేరాజని యెల్లరు నిశ్చయించి పట్టాభిషేక మహోత్సవ దర్శనార్థం బువ్విళ్ళూరుచుండిరి.

కృష్ణుఁడు ప్రజాభావంబును గ్రహించి మహాసభఁ గావించెను. సామంతరాజులును బ్రాహ్మణోత్తములును రాజనీతివేత్తలును వ్యవహారజ్ఞులును గూడిరి. జనులు మహోత్సుకులై గుంపులుగుంపులుగాఁ జేరిరి. కృష్ణుడు సభాంతరంబున నిల్చి 'మిత్రులారా! రాజ్యకాంక్షంజేసి నేను కంసుని వధింపలేదు. అట్టివాంఛ యీషన్మాత్రముగూడ నాకుఁ గలుగదు. కాననమే నారాజ్యము, గోపకులే నాప్రజావర్గము, గోవులే మాధనము. ఇతఃపరంబుగోరను. కంసుఁడు లోకకంటకుఁడయ్యెను. వానిదుర్మార్గమే వానిని హరించెను.' అని నిజభావంబును స్పష్టపఱచి, యుగ్రసేనునివంక మరలి, తాతా! ఱేఁడు ప్రమత్తుడైన రాజ్యంబు సహింపదు. నీ పుత్త్రుని వానిదుండగమే హరించెను. నేను నిమిత్తమాత్రం

బైతి. తాతా ! మధురరాజ్యంబు తొలుదొల్త వృష్ణిరాజన్యులదై యుండెను. వారికి యయాతిశాపంబున రాజ్యచ్యుతి గలిగెను. అంతటరాజ్యము వారిస్త్రీసంతాన పరమయ్యెను. ఆ యింతిని యాదవరాజు పెండ్లాడెను. అయ్యీరువురవంశంబున నీవు జనించితివి కావున మధురరాజ్యము నీకు వంశానుగతము. నీ సొమ్మును నీవు గ్రహింపక తప్ప' దనెను. కృష్ణుని ధర్మబుద్ధికిని నిస్సంగత్వంబునకు నెల్లరు నాశ్చర్యపరవశులై వానిని సహస్రముఖంబుల శ్లాఘించిరి. ఉగ్రసేనునకుఁ బట్టముఁ గట్టిరి.

## ఉపనయనసంస్కారము.

రామకృష్ణులు యుక్తవయస్కులైనను వారితలిదండ్రులు చెఱనుండుటచేతనో మఱియేకారణంబుననో యందాక వారికి నుపనయనసంస్కారము జరుగకుండెను. వసుదేవుఁడు గర్గాది భూసురోత్తములను రావించి సుముహూర్తము నిశ్చయించి యావిధి నెఱవేర్చి బ్రాహ్మణుల నపరిమితానందంబులచేతనుఁ బ్రజలనిష్టమృష్టాన్నంబులచేతను సత్కరించి యర్థులకుఁ గామితార్థముఁ లిచ్చెను. రామకృష్ణులు బ్రహ్మచారులైరి.

*ఉపనయనసంస్కారము వైదికంబనియుఁ బౌరాణికంబనియు రెండువిధంబులు. వైదికంబు బ్రాహ్మణక్షత్రియులందు మాత్రమే నేఁడుజరుగుచున్నది. వైశ్యులందుఁ బౌరాణికంబనుష్ఠితంబగుచున్నది. శూద్రులకుఁగూడ నొకవిధమైన యుపనయనసంస్కారము గలదుగాని దానినంతగా నెల్లచోట్ల ననుష్ఠించుట గానరాదు.

జ్ఞానోదయంబునకు నెల్లరు సర్హులగుదురు. జ్ఞానోప దేశంబునకు యుక్తవయస్సు వచ్చుటయు జ్ఞానోపదేశమగుటయు నివ్విధి సూచించును.

### నందాదుల వీడ్కోలు.

కంసుని దుండగంబుల ఫలంబుగా విపరీతంబులు ధర్మ విరుద్ధమైనవి మధురరాజ్యమెల్ల నల్లుకొనెను. వానినెల్ల దిద్ది నిచో ధర్మంబు కాలూనుటయుఁ బ్రజలు సుఖముండుటయుఁ గల్లఁగాఁ గృష్ణుఁడు భావించెను. ఆపని యత్యవసరమయ్యెను. దానంజేసి కృష్ణుఁడు నందవ్రజంబునకు వెంటనే మరలిపోఁ జాలఁడయ్యెను.

నందాదులు వ్రజపురంబునకుఁ బోవసమకట్టిరి. రామ కృష్ణులు నందునియొద్దకుఁజని 'నిన్నటివఱకు మాతలిదండ్రు లెవరో మేమెఱుఁగము. నీవే తండ్రిగా యశోదయే తల్లిగా భావించితివిు. మీరును గన్నవారికన్న మిన్నగా మమ్ముఁ బ్రేమించి పెంచితిరి. మీరుమమ్ముఁబెంచినప్రేమతో నెవ్వరు ను వారిబిడ్డలఁబెంచియుండరు. తండ్రీ ! మీవాత్సల్యవిశే షంబున నింతవారమైతివిు. మీఋణంబు దీర్పరాదు. మీ రాకకు వ్రజపురి యెదురుచూచున్నది. కార్యాంతరంబులు మమ్మిందుఁ గొన్నాళ్ళు నిలుపుచున్నవి. మీవెంట మేమును రాఁజాలమికిఁ జింతయయ్యెడు. ఈసంగతి మనవారికిఁ దెలుప వేడుదుము. ఎందున్నను మాయంతరాత్మ మీయందేయుం డు' నని వినయవిధేయంబులఁ బల్కి వానిని వస్త్రాభరణాదుల సన్మానించి తరలించెను. నందుఁడును వియోగవిహ్వలుఁడై కన్నీరు సించుచుఁ బ్రయాణోన్ముఖుఁడయ్యెను.

కృష్ణుఁడంతట గోపనాయకులకును గోపవృద్ధులకును మ్రొక్కి ధనకనకవస్త్రాదుల వారిని సత్కరించి తదీయాశీర్వాదంబులంది వీడ్కొలిపెను. గోపబాలకులు వియోగదుఃఖాశ్రువులు నించుచుఁ గృష్ణుని ముట్టడించిరి. కృష్ణుఁడు వారి నెల్ల గాఢాలింగనంబుల సత్కరించి 'చెలులారా! బాల్యంబు నుండి మీతోడిదే లోకంబుగా నుంటిమి. మీ ప్రేమకు మేరయే లేదు. జీవితంబెల్ల మీతోడనే పుచ్చువేరాస యెంతో నన్ను బాధించుచున్నది. గార్యాంతరంబులడ్డమ్యెను. మన వియోగంబు తాత్కాలికంబని భావించి దానినెట్లో సహింపఁ గోరుదు. ఒక్కటి మిమ్ము వేడెద. మీచిరమిత్రుని ప్రణయంబు వమ్ముగాదని నమ్ముడు. నాతల్లి యశోదాదేవి నన్నెంత ప్రేమించునది మీకుఁ గ్రొత్తగాదు. నన్నుగానక నిమిషంబైన నామె నిలువరింపదు. గోపబాలికలు నాయందే మది నిల్పి మదేకచింతతో నుందురు. వారికి వియోగక్లేశం బనివార్యమయ్యెను. ఎట్లో వారిని సంతసపెట్టి యావ్యథను మఱపింతురుగాక. నన్ను లాఁతిచోటికి విధిలాగుచున్నది. ఎందున్నను దనయొడిలోనున్నట్లే నన్ను భావింపవలసినదని నాతల్లికిఁ జెప్పి వాప్రణతులామెకు నర్పింపుఁడు. కృష్ణుఁడు చెంతనే యున్నట్లుగాఁ దలంపుమని గోపబాలికలకుఁ దెల్పి వారికి నా మురిపంబులొసంగుఁ' డని యొక్కొక్కరిని మరలఁ గవుంగిటఁ గ్రుచ్చి మెల్లరఁ దరలించెను.

### ఉద్ధవుని గోపికలయొద్దకుఁ గృష్ణుఁడు పంపుట.

నందాదులుచనిరి. గోపబాలికలకుఁబంపినసందేశము వలన వారికి నూఱట గల్గునో లేదో యనుతలంపు కృష్ణునెడఁ

బాయఁదయ్యెను. భక్తులయెడ భగవంతుని ప్రేమయెట్టిదో యూహింపనగు.

ఒకనాఁడు కృష్ణుఁడు తనకు మిత్రుఁడును భక్తుఁడునైన యుద్ధవునిఁ బిలిచి 'మిత్రమా! గోపికలు నాకు సర్వాత్మ సమర్పకంబుగా నిరుపాధికభక్తి సేయుదురు. భక్తియన శ్రద్ధాప్రేమలసారంబగుట నీకుఁ గ్రొత్తగాదు. దేనివలననిష్టసిద్ధి యగునని తలంతురో దానినిఁగోరుట ప్రేమయగు. ప్రేమించినదానిని బడయుటకైన యాతురత శ్రద్ధయగు. గోపికలు వారిప్రాణంపుఁ బ్రాణంబుగా నన్ను ప్రేమింతురు. నాకుఁగా వారు పుత్త్రమిత్త్రబంధువులను మాతాపితృలనేగాక భర్తలను గూడ విడనాడిరి. వారిప్రేమ యెట్టిదో నీవే యూహింపనగు. వారియంతఃకరణము నాయందే లీనమైయుండు. ఎవరు మనఃపూర్వకంబుగా నైహికాముష్మికంబులఁ ద్యజింతురో వారిభరణరక్షణంబులు నాకుఁదప్పవు. నేను నట్టిదీక్షాపరుఁడ నగుట నీకును స్పష్టము. నందవ్రజంబునుండి నేనిందు వచ్చినదిమొదలు గోపికలు నారాక నిరీక్షించుచు మదేకచింతాపరలై యున్నారు. త్వరగావత్తునని వారికి మాటయిచ్చి వచ్చితిని. ఆయాశాపాశంబున వారిప్రాణఁబులురియాడుచున్నవి. నాకుశలవార్తనేని వారు కొంత యూఱటగాంతు రేమో యని తలంతు. నీవటకుఁబోయి వారికి మనశ్శాంతి నెట్లయినఁ గూర్చి రావలయు' ననెను.

ఉద్ధవుఁడు కృష్ణునిమాటఁ దలఁదాల్చి పయనమై సాయంకాలమునకు వ్రజపురముచేరి నందుని యింటికిఁ బోయెను

నందుఁడు వానికై యపరిమితానందంబునొంది యెదురేఁగి వా
నిని గవుంగిటఁగ్రుచ్చి తోడితెచ్చి సకలోపచారంబు లొనర్చి
మెత్తని పాన్పుపయిఁ గూర్చుండఁబెట్టి 'పుణ్యాత్మా ! మన
మిత్త్రుఁడు వసుదేవుఁడు కుశలవమా ? బంధవిముక్తియు స్వాఽ
నంబుతోడి కలయికయు వానికిఁ జేకూఱెను. అట్టిమహాభా
గ్యంబు వానికిఁ గలుగునని కలలోనైన స్మరింపనైతి. ఎట్లో
వాని సుకృతఫలంబుగా నవివానికి నేటికి సిద్ధించెను. యాదవులు
నిసర్గసౌజన్యహృదయులు. అట్టివారిని గంసుఁడు నిష్కా-ర
ణంబుగా హింసించెను. పాపఫలం బెవ్వరికిని దప్పదు. వాని
చావునకై రాజ్యమెల్ల సంతసించుచున్నది.

'ఉద్ధవా ! కృష్ణుఁడు మమ్మెన్నఁడైనను దలంచునా ?
గోపికాగోపకులెల్లరు వానితోడిదే లోకంబుగానుందురు. వారి
నెన్నఁడైనను స్మరించునా? ఈగోవుల నీబృందావనశాద్వలప్ర
దేశంబుల నీగోవర్ధనపర్వతసౌభాగ్యంబు నెప్పుడైనను బ్రస్తా
వించునా ? గోవిందుఁడు బంధుమిత్రసందర్శనార్థ మిందెప్పు
డైన రాఁదలంచెనా ? ఆనగుమొగంబుఁ జూచి యాతేనియ
పలుకులు విని యానందించు భాగ్యంబు మాకుఁ గలదా ?'

'మిత్రమా ! ఎవ్వఁడు దవాగ్నిమధ్యనుండి మమ్ము
రక్షించెనో, ఎవఁడు గోవర్ధనంబును గొడుగుగాఁ బట్టి యే
డహోరాత్రంబులు పిడుగులవాననుండి మమ్ముఁ గాపాడె
నో, మాకుఁగల్గిన మహోపద్రవంబులెల్ల నెవ్వనిప్రేమం
జేసి యువ్వెత్తుగా నెగసిపోయెనో, యాకృష్ణుఁడు మమ్ము మ
ఱువఁడు[illegible]సా ? ఉద్ధవా ! కృష్ణపాదస్పర్శచేఁ బవిత్రంబులైన

యీనెలయేళ్ళను వనపర్వతంబులను దలంచినమాత్రాన మాకుఁ దన్మయత్వంబాబాధిల్లెడు. గర్గాచార్యులు వచించినట్లుగా రామకృష్ణులు లోకోపకారార్థమై యవతరించిన భగవదంశంబులగుట మాకు నిశ్చయమయ్యెను. ఉద్ధవా ! కంసుఁడు సహస్రనాగబలుండుగాని యేతన్మాత్రుఁడుగాఁడు. వానితో మాకు దినగండముగానుండెను. వాని నవలీలగాఁ ద్రుంచెను; కువలయాపీడంబు దిగ్గజంబునకు సాటియగుఁగాని వేఱుగాదు. అదిత్రుటిలోఁ దెగటాఱెను. చాణూరముష్టికులన్న మల్లలో కంబెల్ల భీతిల్లును. వారు పెనుగాలికి గడ్డిపరకలువలె నైరి. రామకృష్ణుల మహిమ లింతనరా' యనుచు వారిని శ్లాఘింపసాగెను.

అంతలోన నందుని నోటిమాట తటాలున నిలిచెను; వానికన్నుల హర్షబిందువులు రాలెను. యశోదాదేవియుఁ బుత్త్రవాత్సల్యంబునఁ గాఁబోలు చన్నులఁ బాలుస్రవించెను. ఉద్ధవుఁడు యశోదానందులకు మహాసంతోషమంది 'అహో ! మీభక్తినేమనవచ్చు ! అవ్యగ్రము నిష్కళంకంబునైన యిట్టి భక్తి సేయువారు శరీరధారులందుఁ బెక్కురుగల్గరు. మీపుణ్యంబింతనరాదు. భగవంతుఁడు భక్తులకుఁ దోడునీడయై యుండు. శ్రీకృష్ణభగవానుఁడు శీఘ్రకాలములోనే యిందు వచ్చి తలిదండ్రులైన మీకు నయనోత్సవంబును గూర్చు. సంశయింపవలద'ని వారికి సుఖశమనోక్తులు పలికెను. శ్రీకృష్ణునిముచ్చటలతో నారాత్రిగడచుటే వారెఱుంగరైరి.

మఱునాఁడు వేఱువాఁతనే గోపికలు లేచి తమతమ మందిరాంగణంబులఁ జిమ్మి కలయంపి చల్లి ద్వారంబుల నలంక

రించి కృష్ణభగవానుని బాడుచుఁ బొలుచిలికిరి. సూర్యోదయం బయ్యెను. నందుని యింటిముందు రథంబొకటి సిద్ధమైయుండె ను. గోపికలదిగాంచి భ్రమాయత్తచిత్తలై 'కటా ! అక్రూ రుఁడు మహాపాపాత్ముఁడు కంసునకు బలియిచ్చుటకుగా మన కృష్ణునిఁ దోడ్కొనిపోయినవాఁడు మరలవచ్చెనా ? ఎవని మృత్యువై యితఁడువచ్చెనో ?' అని తలపోయసాగిరి.

అంతలో నుద్ధవుఁడు దినకృత్యంబులు తీర్చి నందునియింటి వాకిటకు వచ్చెను. వానియందుఁ గృష్ణునిపోలికలఁగాంచి గో పాంగనలు మహాకుతూహలాయత్తచిత్తలై యితఁడు కృష్ణసం దేశహారునిగా విని హుటాహుటి వానికడకుఁ బోయి మ్రొక్కి 'మహాత్మా ! నీవు యాదవేశ్వరుని మిత్రంబవనియు, వాని సందేశంబును గొనివచ్చితివనియు విందుము. కృష్ణుఁడు య శోదానందులఁ దలంచి వారికై నిన్నుఁ బంపియుండు. తలి దండ్రులయందలి యనురాగంబు బలవత్తరము. సన్న్యాసులు గూడ దానినిఁ ద్రెంపఁజాలరు. మైత్రి సోపాధికమును బ్ర యోజనపూర్వకము నగుట సామాన్యము. అట్టి చెలిమి యిష్ట సిద్ధితోడ నంతరించు. ఇట్టి కపటనాటకంబుతో లోకమెల్ల జరుగుచున్నది. పురుషులు పూఁబోండ్లయెడ మక్కువలు గురిపింతురు. అబలలు నమ్మి మోసపోవుదురు. భ్రమరంబునకుఁ బుష్పమందుఁ బ్రేమయెట్టిదో యెంతకాలమో యట్లపురుషుల కు స్త్రీలయెడ మక్కువ నట్టిదిగానున్నది. మహాత్మా ! నిర్ధనుని బణ్యాంగనవలె, అశక్తవృద్ధీపతిని బ్రజలువలె, గురువును విద్యా పూర్తిఁగన్న శిష్యుఁడువలె, యాగంబును దక్షిణలందినబుత్త్వి క్కులవలె, బక్షులు ఫలరహితవృక్షంబును, మృగంబులు దవా గ్నిదగ్ధారణ్యంబునువలె, జారుఁడు భుక్తస్త్రీని త్యజించు ననుచు

శ్రీకృష్ణవియోగంబునఁ దమకుఁ గల్గిన వ్యసనంబును సర్వ్నగర్భం బుగాఁ దెలిపి, వానితోడి తమక్రీడల నొక్కొక్కటి పేర్కొనుచు విలపించిరి.

### భ్రమరగీతలు.

ఆగోపాంగనలో నొకతె నన్యాపదేశంబుగా నిట్లనియెను. ఇందుఁ గృష్ణుని మధుపంబునకును, భర్తురాండ్రను సవతిజనంబునకును, వారిహృదయంబును బుష్పంబులకును. అనురాగంబునుఁ బూఁదేనియకును, బోల్చి భ్రమరగుణంబును బరమాత్మునందారోపించి విప్రలంభశృంగారవ్యాజంబున మధురభక్తి నెంతో రసవత్తంబుగా మహర్షి వర్ణించెను. ఈరహాస్యంబు నాత్మనుంచి పాఠకులీభ్రమరగీతల యానందంబు ననుభవింపవలయు.

'మధుపా! మధువును గ్రోలుట నీకు సహజమయ్యెను. ఆతీపు నీవిఁకమఱచుట కల్ల. మఱువలేకున్న మానేఁగాక ; నీబుద్ధికి నిల్కడ గలుగదయ్యెను. ఇది మధుకార్యమో ? త్రాపుఖోతులతత్త్వమో యూహింపరాదు. దీనిం బట్టి నీవు ధూర్తబాంధవుఁడవే గాని నిక్కమైనచెలికాఁడవు కానేరవు. నీధూర్తత్వమేమందువా ? నీమీసంబుల నంటియున్న కుంకుమపంకంబెక్కడిది ? సవతిజన కుచవిలులిత మైన పూమాలయందలి కుంకుమముగాదా ? అంతమాత్రము గ్రహింపఁజాలమా ? నీకైతవముచాలు. మాపాదంబుల ముట్టవలదు. దూతవై వచ్చితినందువా ? నీవేషమే నీదూతత్వంబును బ్రకటించుచున్నది. ఎవనికి దూతవై వచ్చితివో యామానవపతికిఁ బ్రియురాండ్రు యదుసభలోనున్నారుగాని

యిందు లేరు. ఆహా! యాయలుక త్తియల ప్రసాదంబు వానికినింపుఁ గూర్పునుగాని మాయట్టిముగ్ధల ప్రేమ రుచింపదు. మధుపా! నీవు పూఁదేనెఁ ద్రావి యాపుష్పంబునెట్లు నిరసింతువో యట్లే నీమధుపల్లి లోకమోహనంబైన వాని యధరసుధారసంబు నొక్కతూరి చవిచూపి మరలనిరాకరించెను. మీయిరువురు నట్టివారుగావునసే మీకుఁ బొత్తుచేకూఱెను. అట్లగునేని వాని పాదపద్మంబులను లక్ష్మి సేవించుటెట్లందువా? లచ్చి మాయ లెఱుంగదు. వానియిచ్చకంబులు నమ్మి మోసబోయెను. మేమట్లు మోసపోవువారము కాదు. షట్పదమా! నీయదుపతిచరితలు మాకుఁ గ్రొత్తలుగావు. వానినిఁ బాడిపాడి యలసితిమి. అవి మాకుఁ బ్రాఁతపురాణంబులు. వానినే నీవు మాయెదుటఁ బాడినఫలమేమి? మఱియు మాకు నిండ్లువాకిళ్ళు లేవు. వాని నెల్లవదలితిమి. అట్టిమాకడ నీవు పాడినను బిడికెడుబిచ్చము గూడ దొరకదు. ఈవృథాయాసము మాని వానినూత్న ప్రియలయెదుటఁ బాడుము. వారు నీపాటకు మెచ్చి నీయిచ్చ చేయుదురుగాక. ద్విరేఫమా! వానికపటరుచిహాస భ్రూ విలాసంబులకు శ్రీదేవియంతటిదే లోఁబడి వానిపాదపద్మ పరాగంబు వలచి సేవించుచుండఁగా మీరెంతవారందువా? నీమాట నిజము. నిన్నుఁబంపినవాని నుత్తమశ్లోకుఁడందురు. ఆశబ్దము దీనజనపరాయణునకే యొప్పునుగాని మాయలాడు నకుఁ దగదు. ఇది మామాటగా వానికి విన్నవింపుము. సారంగమా! ముకుందునిపదముఁ దలమోచికొని నయగారపుఁ బల్కుల మమ్ము బుజ్జగింప వచ్చితివి. నీచదురులెల్ల మేమెఱుంగుదుము. వానిని నమ్మి మేము మాసర్వస్వముఁ ద్య

జించితిమి. అట్లు నమ్మినవారిని నీస్వామి నట్టేటముంచి దిగ నాడెను. నీసంధికి నవకాశమేమిగలదు ? నీకృష్ణుఁడు మంచి వాఁడందువా? వానిమంచి లోకమెల్ల నెఱుంగు. లుబ్ధధర్ముఁడై వాలిని జంపెను. స్త్రీపరతంత్రుఁడై యాదాక్షిణ్యంబునకు నోడి వలచివచ్చిన వనితను విరూపవతినిగాఁ జేసెను. బలిని యాచించి దానంబుఁబడసి యాదాతనే బంధించెను. ధర్మ హీనుఁడును స్త్రీలోలుఁడును కృతఘ్నుఁడునైన మీరాజు సం గతిచెప్పెదవేల ? వానిచెలిమి యిఁకఁజాలు. అయ్యో ! వానితలంపే మఱతుమన్నచో, వానికథార్థరుచిఁ జవిగొన్న మాబుద్ధి మమ్మెట్లో కనుఁబ్రాముచున్నది. ఈగతి మాకొ క్కరికే దాపరించుటగాదు. వానిచరితకర్ణామృతంబును గ్రో లిన వారెందఱో ద్వంద్వంబులఁగడచి ప్రపంచాతీతులై య హంకారమమకారరూపంబులైన గృహకుటుంబంబులఁ ద్యజిం చి భిక్షువృత్తి నవలంబించి హంసలై చరించుచున్నారు. మా బోంట్లసంగతి చెప్పనేల ? ఈగోడటుండనిమ్ము. అయ్యో ! ప్రియునివలనఁ బంపఁబడి వచ్చితివా ? నీవచ్చినయర్థమేమి ? మమ్ముఁ దోడ్కొనిరమ్మనెనా ? సౌమ్యా ! సిరి వానియెదఁ బాయదు. మాకిఁక నెడమేమియుండు ? ఇందురాఁడా ? మ మ్ములఁగాకున్నను దలిదంబ్రులనైనఁ దలంపఁడా ?'

ఉద్ధవుఁడు గోపికల పరాభక్తికి మహాశ్చర్యమంది 'అహో ! వీరిభక్తి నేమనవలయు ? వీరెల్లరిమనోవాక్కాయ కర్మంబులు నిరంతరము శ్రీకృష్ణపరంబులై యున్నవి. భక్తి స్థిరమగుటకుగా దానధర్మంబులను వ్రతక్రతువులను జపతపం బులను యజ్ఞయాగంబులను యమనియమాదులను సలుపు

మురు. ఇందొక్కటియు వీరెఱుంగరు. అయినను వీరిభక్తి యసదృశంబు నపారంబునై యసంగయోగిజనంబునకుఁగూడ నందరానిదై వింతగొల్పుచున్నది. చరాచరంబులందెల్ల శ్రీకృష్ణరూపంబునే చూచుచు దానితోనే యానందించుచున్నారు. భక్తితత్త్వంబును నాకుఁ గఱపువ్యాజంబున భగవానుఁడు నన్నిటకుఁ బంపెఁగాబోలు. వీరిం గాంచి కృతకృత్యుఁడనైతి' నని లోలోనఁ దలపోసి, 'కళ్యాణులారా ! మీచరిత నాకుఁ బరమపావనమయ్యెను. ఈరహస్యమును మీవలన గ్రహించుటకై భగవానుఁడు నన్నిటకుఁ బంపెనని తలంతు. ఆభగవానుఁడు నాముఖంబున మీకీసందేశము నందించుచున్నాఁడు.

'ప్రియలారా ! నాకును మీకును వియోగంబెన్నడును గలుగనేరదు. మీయందు నేనును నాయందు మీరును నిరంతరముందుము. మీరు నన్నే తలంచుచుండుటయు నన్నుఁ జూడ నువ్విళ్ళూఱుటయు నెఱుంగుదును. విప్రలంబశృంగారరసంబును మీకు సుంత చవిచూపఁదవ్వైతిని. మీమనోవృత్తిని బరికించితిని. మీకెంతయుఁ బ్రీతుఁడనైతి. అనన్యచింతాపరబుద్ధితో నన్నే మీరు శరణెల్లితిరి గావున మీరు భాగ్యవతులలో భాగ్యవతులైతిరి. అచిరంబ నన్నుఁ జేరనున్నారు.'

ఆవచనంబులు గోపికలకు మధురమధురంబులయ్యెను. వారుపరమానంద వివశలైరి. భక్తులకు భగవదభయప్రదానంబట్టిదే యగుఁగదా. గోపికలాయుద్ధవుని గృష్ణప్రతినిధినిగా గారవింపసాగిరి. ఉద్ధవుఁడు కొంతకాలము నందవ్రజమందే యుండి నదీవనగిరికాసారంబులు సంచరించుచు గోపికాభక్తి

యెట్టిదో సమగ్రంబుగా గ్రహించి, 'అహో! వీరిజన్మమే జన్మము. ఏపరమాత్మసంయోగంబునకై వేదాంతులు ప్రాకులాడుదురో, ఏపరంధామునికై త్యాగులు సర్వసంగసన్యాసమొనర్తురో, ఏదయామూర్తిని సందర్శించుటకై భక్తులు ధ్యానైకవృత్తితో జీవితంబునెల్లఁ గడపుదురో, ఏలోకైకమూర్తియొక్క ప్రీతికిఁ బాత్రులుగాఁగోరి కర్మయోగులు విశ్వారాధనంబునకు సర్వస్వము ధారపోయుదురో, యాపరమాత్మను వీరు కొంగుముడిఁ గట్టిరి. వేదాదివిజ్ఞానరహితలయ్యు వనభూములఁ జరించుచుండియు మధురభక్తిచేత వీరు శ్రీకృష్ణపరమాత్మను దాసానుదాసునిగాఁ జేసికొనిరి. ఏమియాశ్చర్యము! భక్తిమాత్రంబుననే జన్మసాఫల్యసిద్ధి చేకూఱుననుటకు వేఱునిదర్శనమేల? లక్ష్మీదేవి శ్రీవిష్ణువక్షంబునిల్లుగాఁ గొనియున్న నుండుఁగాక. గోపాంగనలు వానివలన రాసక్రీడాదులందుఁ బడయు లాలనంబులును మురిపంబులును బడయనేరదు. అయ్యో! నేనీబృందావనములో నొకతీవియనైపుట్టి యీకళ్యాణుల పాదస్పర్శఁ బడయనోచిన నాజన్మము ధన్యధన్యమైయుండు. ఏదివ్యపాదంబులు సిరికి నిరంతరసేవ్యమానంబులో బ్రహ్మాదులకు ధ్యేయంబులో ఋష్యాదులకుఁ బూజ్యంబులో యాదివ్యపాదంబుల నీవ్రేతలు తమహృదయపేటికలందు భద్రపఱచి సర్వావస్థలందుఁ దదేకచిత్తలై తద్దర్శనపూజాధ్యానగతులఁ బరమానందంబు ననుభవించుచున్నారు. వీరిపాదధూళి నాశిరముపై వ్రాలుగాక' అని భక్తిపారవశ్యుఁడై గోపికలకు సాష్టాంగనమస్కారముఁ గావించి వారినివీడ్కొని మధురకుఁ బ్రయాణోన్ముఖుఁడయ్యెను.

యశోదానందులును గోపికాగోపకులు నుద్ధవుని జుట్టి కొని 'మహాత్మా ! మాహృదయంబులు శ్రీకృష్ణపాదారవిందంబులందు నిరంతరము [illegible]బులై యుండునట్లుగా, మావాక్కు వాని దివ్యనామస్మరణమందే నిల్చునట్లుగా, మాదృష్టి వానిదివ్యమూర్తిచింతనమందే యలరారునట్లుగా, వానిసేవయే మాకు జీవనంబుగా వానికైన నమస్కారాదులే మాకుదినకృత్యములుగాఁ గోరితి' మని మావిన్నపంబును వానికి నందిమ్మి. ప్రారబ్ధకర్మఫలంబుగా భగవదిచ్ఛానుసారంబుగా మేమెందు బుట్టనున్నను, శరీరంబులెట్టివి మాకుఁ గల్గనున్నను శ్రీకృష్ణచింతనంబు మమ్మోడఁబాయకుండు ప్రసాదంబును వేడితిమనియు, ఇదొక్కటే మాపరమప్రార్థనంబనియువానిచెవి కెక్కఁ బల్కు' మని వచించి యుద్ధవుని గవుంగిటఁగూర్చి కృష్ణాదులకు యథోచితంబులైన నజరు నిచ్చి వానిని బంపిరి.

ఉద్ధవుఁడు మధురకు వచ్చి వ్రజవాసులకుఁ గృష్ణునెడగల శ్రద్ధాభక్తివిశేషంబులనెల్లఁ గృష్ణునకు వివరించి వారుపంపిన నజరులను రామకృష్ణులకు నుగ్రసేన వాసుదేవులకు నర్పించెను.

### కృష్ణుఁడు త్రివక్రను సందర్శించుట.

త్రివక్ర నాఁడు కృష్ణుని జగన్మోహనాకారంబునకుఁ గామవివశయై 'సుందరాకారా ! ఇంటికిఁ బోవుదము దమ్ము. నీవు నామనసును హరించితివి. నిన్ను విడనాడనోప ; నామది సేయు'మని వానినిఁ జేలాంచలను బట్టి యాడ్చెను. బలరామాదులయెదుట లజ్జమానిని యా త్రివక్ర యట్లు గావించుటకుఁ గృష్ణుఁడు నవ్వుదాల్చి 'సుందరీ ! ఇల్లువాకిలిలేని మాఁ

బోఁటులకు సేవలయుఁ బ్రాప్యపగుదును. కొంత్యర్థసే వచ్చి
తిని. నాసనానీగినత్వాంత నీయింటికిఁ దప్పక వచ్చెద. లోక
వాసనామతులకు సౌకాంతప్రదేశంబునఁగాని సంభాషణంబు
వాయదని చెప్పెను.

అదిమొదలు త్రివక్ర కృష్ణునే స్మరించుచు వానిరాక నిరీక్షించుచుండెను. ఒకనాఁడు కృష్ణుఁడు తనవాగ్దానంబును దలంచి యుద్ధవుని తోడ్కొని త్రివక్ర యింటికిఁ బోయెను. ఆదాసి కృష్ణుఁడు వచ్చుట కెంతయు సంతసించి యెదురేఁగి వానిని నుద్ధవుని మహామర్యాదలతోఁ దోడ్కొనివచ్చి యర్ఘ్యాసనంబులర్పించెను. ఉద్ధవుఁడు తన కొసఁగఁబడిన మర్యాదార్థము చేతితోముట్టి నేలఁగూర్చుండెను. కృష్ణుఁడు లోకమర్యాద ననుసరించి పాన్పుపయిఁ గూర్చుండెను. త్రివక్ర యంతలోనఁ జని పన్నీట జలకమాడి పీతాంబరంబుఁగట్టి యనర్ఘరత్నరచితభూషణంబులఁదొడవి పువ్వులుముడిచి గంధంబలది తమ్ములముసేయుచు హొయలుమీఱఁ గులుకునడకతో మొలక నగవులతో వాలుచూపులతోఁ గృష్ణునిఁజేరవచ్చెను. కృష్ణుఁడు త్రివక్రను జేరఁబిలిచి కరంబుఁబట్టి పాన్పుమీఁదికి నీడ్చి నంతవడి దానితోడఁ గ్రీడలుసలిపెను. త్రివక్ర యానందపరవశయై కృష్ణుని చరణంబుల దోయిటఁగూర్చి యురంబునఁజేర్చి లాలించి కన్నులకు నద్దుకొని జన్మసాఫల్యమైనట్లు భావించి 'ప్రియా ప్రియా! నాల్గునాళ్ళు నాయింటనేయుండి నాతోడి క్రీడల నానందింపుము. నీసహవాససౌఖ్యమును గోల్పోవ నోప'నని ప్రార్థించెను. కృష్ణుఁడు దానికోర్కెఁదీర్చి యుద్ధవునితోడ స్వమందిరమునకు వచ్చెను.

ఈకతనుబట్టి కృష్ణుని వర్తనంబును పలువిధంబుల భావింతురు. కృష్ణుఁడు జాగుఁడనుటకు నియ్యదొక్కటే చాలు ననియు భగవదవతారమై కృష్ణుఁడే యిట్లు చేసె నప్పుడు నీతి నియమంబులగతి యేమనియు అపమార్గంబునకు గృష్ణుఁడే దారిచూపెననియు అట్టివానిని బూజింపనగునా యనియుఁ గొందఱు భావింతురు.

ఈకతవలన గ్రహింపవలసిన యర్థంబు వేఱనియు త్రివక్ర దానిమన స్తత్వంబునుబట్టి యాసించెననియు భగవంతుఁడు సన్నిధానంబుననున్నను దేహాత్మబుద్ధులు దేహమే పరమార్థముగా భావించి తద్భోగమునే గోరుదురుగాని పరమకళ్యాణంబును గోరరనియు నైజంబట్టిదై యుండుననియు ఎవరేదికోరినను భగవంతుఁడు దాని ననుగ్రహించుననియు దోషము కోరికయందే యుండుఁగాని దాతయందు లేదనియు కొందఱు ధనంబును గొందఱైశ్వర్యంబును గొందరాయురారోగ్యంబులఁ గోరుటయుఁ బడయుటయు లోకసహజమై యున్నదనియు ప్రాకృతులు వారి ప్రారబ్ధకర్మవాసనలెట్లో యట్లువర్తింతురేగాని వేఱుగాదనియు ప్రారబ్ధంబు దురత్యయమని యీకత బోధించుననియుఁ గొంద ఱూహింతురు.

త్రివక్రశబ్దము వక్రములైన త్రిగుణంబుల సూచించుననియు మూఁడుగుణంబులు వక్రగతినొందినప్పుడు జీవిజీవితంబు నీచాతినీచమై యుండుననియు అట్టిస్థితిలోఁ బరమార్థచింతనకే యవకాశముండదనియు అట్టివక్రత భగవదనుగ్రహంబునఁగాని మఱియొక్కటఁ జక్కపడదనియు భగవద్దర్శనంబున నద్దాని వక్రగుణంబులు [illegible] [illegible]యు ఎప్పుడు

గుణంబులు చక్కఁబాగున్నో యాస్త్రీయే తత్త్వము చక్కనగు ననియు విరూపిగానున్నదాసి సురూపిణియయ్యె నన్నప్పుడు వక్రగుణవతిగానున్నది సుగుణవతి యయ్యెనన్నను సూచించు ననియు గుణసంస్కారంబున బుద్ధియు సంస్కృతమై పరమార్థమునంక మఱలి తదానందంబున సుఖించి చవిగాంచుననియు ఆరుచి యంతమధురమధురంబుగాన్పున హృదయంబు తనివోందక దానినే నిరంతరముఁ గోరుచుండునని శ్రీకృష్ణస్వరూపమైభగవన్నిరంతర సాన్నిధ్యంబును గోరెననుటయందుఁ బైన జెప్పిన యర్థమే భావితమనియు మఱికొందఱు తలంతురు.

కృష్ణలీలలు పరమార్థభావంబులు. ఒక్కొక్కలీలకు నంతరార్థమెంతో గలదు. పామరులభావంబు ప్రాకృతదృష్టికి గోచరింపదు. అట్టిదృష్టితో నాలీలల విమర్శించినచో విపరీతభావంబులే స్ఫురించును.

## అక్రూరుని హస్తినాపుర ప్రయాణము.

ఒకనాఁడు కృష్ణుఁడు బలరామోద్ధవులను వెంటఁగొని యక్రూరునియింటికి బోయెను. ఆ పురుషరత్నంబులను ముఖ్వుర నక్రూరుఁడు దవ్వునఁజూచి లేచి యెదురేఁగి, రామకృష్ణులకు నమస్కరించి యుద్ధవుని బల్కరించి వారిని దోడితెచ్చి యథావిధి సత్కారంబు లొనర్చి సుఖాసీనులఁగావించి 'కంసుని వానిబలగంబుతోడ రూపుమాపినందులకు రాజ్యమెల్ల సంతసించుచున్నది. యాదవులదుఃఖంబు ననన్యసాధ్యమైన దానిని మీరు హరించితిరి. మీవలన వారౌన్నత్యంబునకు రానోచిరి. మీపాదధూళిసోకి నాగృహము నేఁడు పవిత్రమయ్యెను. భక్తులయందలి నీప్రేమాతిశయంబునఁ గాక నన్యకారణంబున

మీరు మాకడపలైనఁ ద్రొక్కుదురా ? కృష్ణా ! నీతత్త్వము దురూహ్యము. యోగీశ్వరులొండె స్వర్గాదివాసులొండె నిన్ను సులభముగాఁ బొందఁజాలరు. అట్టినీవు స్వయముగా నిందువచ్చి మాకు దర్శనమిచ్చుట మాపూర్వసుకృతఫలము గాని వేఱుగాదు. ధన్యధన్యులమైతిమి' అని ప్రశంసించెను.

కృష్ణుఁడు చిఱునవ్వుదాల్చి 'నీవు మాకు బంధువగుట యేగాక హితోపదేశకుఁడవు నగుదువు. మేము మీబిడ్డలము గావున నీవాత్సల్యరక్షణంబులకుఁ బాత్రులము. ఆత్మసుఖం బును గోరువారికి నీయట్టిపెద్దల సేవకన్న మించినది గలుగదు. సత్పురుషులు దేవతలకన్న నధికులు. ఎట్లందువా ? దేవతలు స్వార్థులైవర్తింతురు. పుణ్యాత్ములు స్వార్థమెట్టిదో యెఱుం గరు. పుణ్యతీర్థంబులు వానిలోఁ గ్రుంకినవారిని మాత్రమే పునీతులఁజేయును. పుణ్యాత్ములన్ననో దర్శనమాత్రముననే లోకంబును బవిత్రీకరింతురు. నీవు నట్టివాఁడవగుదువు'.

'పాండురాజు శతశృంగపర్వతంబునఁ జనిపోయెననియు వానిభార్య కుంతీదేవి దుఃఖదీనయై దిక్కుగానక హస్తినాపురం బునకుఁ గొనిరాఁబడి పుత్త్రకులతోడ నచ్చట ధృతరాష్ట్రుని పజ్జలఁబడియున్నదనియు విందుము. ధృతరాష్ట్రుఁడు పుట్టంధు వగుటయగాక స్థిరమతిలేక దుర్యోధనునిచేతిబొమ్మయై యు న్నాఁడు. ఆకారణంబున నతఁడు ధార్తరాష్ట్రపాండుల నిరు వురనొక్కచూపుతోఁ జూడఁజాలఁడు. నీవు హస్తినాపురం బునకుఁబోయి ధృతరాష్ట్రుని నడవడి పాండవులయెడ నెట్లున్నదో పరిశీలించి రావలయును. నిజము తెలిసిన తర్వాత నేమిసేయు

నగునో చూతమని చెప్పి వానిని వీడ్కొని బలరామోద్ధవుల తోడ తనమందిరమునకు వచ్చెను.

అక్రూరుడు హస్తినాపురంబునకు వచ్చి ధృతరాష్ట్ర భీష్మ విదురులను గుంతీదేవిని బాహ్లికసోమదత్తులను ద్రోణ కృపకర్ణులను దుర్యోధనాశ్వత్థామలను గ్రమముగా సందర్శించి యనంతరము పాండవులను దదితరబంధువర్గంబును సంధించెను. వారెల్లరు మధురలోని వసుదేవాదుల క్షేమలాభంబులు విచారించిరి. అక్రూరుడు వారికెల్లఁ దగుమాటలు చెప్పి కొన్నిమాసంబులందేయుండి ధృతరాష్ట్రుఁడు శకునిమున్నగువారి దుర్బోధనలు విని వర్తించుటయు ధార్తరాష్ట్రులు పాండవుల వినయాది సుగుణంబులను శౌర్యోన్నతులను సహింపకయుఁ బ్రజలు వారియెడ ననురాగంబూనుట యోర్వలేకయు వారికి విషాన్నాదులు పెట్టుటయు విదురునిముఖంబుననే గాక యన్యులవలనఁగూడ విని యథార్థము గ్రహించెను.

ఒకనాఁడు కుంతీదేవి తనపుట్టింటిని దలంచికొని యక్రూరునొద్దకుఁ బోయి 'అన్నా ! నాతల్లిదండ్రులును సోదరీసోదరులును వారిబిడ్డలును సుఖముందురా ? నా మేనల్లుండ్రు రామకృష్ణులు సౌఖ్యమా ? నా బ్రతుకు తోడేండ్ల నడుమఁ జిక్కిన లేడి బ్రదుకగుట నీవు చూచితివి. తండ్రి లేని నాబిడ్డలు పడుపాట్లు వినియుందువు. వారెన్నడైనను గృష్ణునిమదికి వత్తురా? 'హా ! కృష్ణా ! యోగీశ్వరా ! విశ్వాత్మకా ! లోకరక్షకా ! నోరులేనినాబిడ్డలకు నీవేదిక్కు. ఈ దీనుల నాలకింపుము. మృత్యుముఖంబుఁ జొచ్చియున్నలోకంబునకు నీపాదారవిందంబులు దక్క నన్యంబులు శరణం

టులు గానరావు. ఇదేనీకు ముక్తికి శరణిల్లితి' అని విగ్గనేడ్చెను.

అంతలోన నటకు విదురుఁడును వచ్చెను. అక్రూరవిదురులు సుఖదుఃఖంబుల సమభావంబునఁ జూచువారయ్యుఁ గుంతీపరిదేవనంబులకు జాలిపడి పాండవుల దేవాంశసంభవత్వంబును వారిజననకారణంబును దెలిపి యామెకు నోదార్పులు పలికిరి.

అక్రూరుఁడొకనాఁడు సమయముచూచి ధృతరాష్ట్రునొద్దకుఁబోయి కొంతవడి లోకవృత్తాంతంబుల సంభాషించి తనప్రయాణంబును దెలిపి 'వైచిత్రవీర్యా! నీతమ్ముఁడు పాండురాజు పరలోకగతుఁడయ్యెను. హస్తినాపుర రాజ్యమెల్ల నీహస్తగతమయ్యెను. దానిని మంచినను ముంచినను దత్పుణ్యపాపంబులు నీయవియగు. ఏరాజు దయార్ద్రధర్మబుద్ధితో నిష్పాక్షికదృష్టితోఁ బ్రజలనెల్లఁ బ్రజవవలెఁ బ్రోచునో వానిరాజ్యం బాయురైశ్వర్యాభివృద్ధిఁ గాంచును. అట్లుచేయని జేఁ డిహపరంబులకు రెంటికి దూరుఁడగు. రాజా! నీవెఱుంగని ధర్మరహస్యంబులు గలుగవు. ధార్తరాష్ట్రపాండవులు నేకరూపంబున భావింతువని నమ్మెదు. రాజా! దేహమే శాశ్వతము గాదన్నప్పుడు భార్యాపుత్త్రులయు సిరిసంపదలయు సంగతి చెప్పవలయునా? ప్రాణి పుట్టునప్పుడు తోడనెవ్వరుఁ బుట్టుటలేదు; గిట్టునప్పుడు తోడనెవ్వరును వచ్చుటలేదు. జీవుఁడు స్వకృతశుభాశుభఫలభోగార్థము శరీరధారణము గ్రహించుచున్నాఁడు. మూఢులు సిరిని శాశ్వతంబుగా భావించి మూటకట్టుదురు. అదితుదకు నపాత్రులపాలగుచున్నది. కొందఱు భార్యాపుత్త్రులను భోగభాగ్యంబుల నాత్మతుల్యంబుగా భావించి

మౌనోన్నేయకార్యంబులొనర్చి వారిని బోధింతురు. ఆలుబిడ్డలును సిరిసంపదలును వానిని ద్యజించుట మందబుద్ధి గ్రహింపఁడు. ధర్మబాహ్యుఁడు నిక్కముగానాత్మశ్రేయము నెఱుంగనే నెఱుంగఁడు. ధర్మహీనుని దుఃఖము పరలోకంబునఁ గూడ వెన్నాడు. రాజా ! ఈలోకమెల్ల మాయామాత్రంబనియు స్వప్నప్రాయంబనియు గ్రహించి ధర్మనిబద్ధచిత్తవృత్తుండవై నిష్పాక్షికబుద్ధితో వర్తించి సుఖమందు'మనెను.

నాపుడు 'అక్రూరా! నీహితవచనంబు కర్ణామృతముగా నయ్యెను. మిత్రమా ! పుత్రవాత్సల్యంబునఁజేసి నాబుద్ధి పక్షపాతంబు నెడయదు. నామనశ్చాంచల్యంబుడుగు మార్గము దోఁపదు. ఏమిసేయుదు ?' ననెను.

అక్రూరుఁడట్లు ధృతరాష్ట్రునిభావంబును వానినోటనే యెఱింగి వానిని వీడ్కొని మిత్రాదులయనుమతింబడసి మథురకు వచ్చి రామకృష్ణులకు సంగతియెల్ల వినిచెను.

### గురుకులవాసము.

కాశీపట్టణము విద్యాపీఠంబని యనాదిప్రసిద్ధము. దేశదేశాంతరంబులనుండి విద్యార్థులు వేలకొలఁది యటకు వచ్చి కోరినశాస్త్రంబులఁ గఱచి కృతస్నాతులై చనుచుందురు. ప్రస్తావనకాలంబునఁ గాశీపట్టణమందు సాందీపనియనుబ్రాహ్మణోత్తముఁడు వేదబ్రహ్మయని ప్రఖ్యాతిగన్నవాఁ డవంతిపురవాసి యుండెను. బ్రహ్మవిద్యారతులు పెక్కురు వానిని శుశ్రూషించుచుండిరి.

ఒకనాటియుదయంబున సాందీపని యొద్దకు బాలు

రిద్దఱు వచ్చి సాష్టాంగంబులొనర్చి తమ కులగోత్రంబులను దెలిపి విద్యాదానంబును వేడిరి. వారిరూపారేఖా విలాసంబులును వినయమధురవర్తనంబును సాందీపనిహృదయంబు నాకర్షించెను. ఆవిద్యానిధి మహాసంతోషముతో వారిని శిష్యులనుగా గ్రహించెను.

ఆబాలకులు చతుష్షష్టికళలను దినమునకొక్కటివంతున నఱువదినాల్గుదివసంబులలో సాంగోపాంగంబుగాఁ గఱచిరి. వారి యలౌకిక ప్రజ్ఞా విశేషంబునకు సాందీపని మహాశ్చర్యమంది 'అహో! ఎందరో శిష్యులు నాతోడఁజదివిరి. ఇంతటి ప్రతిభాశక్తి యెవరియందును గానరాదు. ఈప్రజ్ఞ యమానుషికము. వీరెవరో యూహింపరాదు. వీరిలోఁ జిన్నవాఁడు సర్వజ్ఞుఁడుగాఁ దోచు' ననుచుఁ దలపోయ సాగెను. ఆబాలురకు సుదాముఁడను విప్రకుమారుఁడు సహపాఠిగా నుండెను.

ఆబాలకు లిద్దఱుఁ గొండొకనాఁడు సాందీపనికి భార్యాద్వితీయుఁడై యున్నవానికి సాష్టాంగంబు లాచరించి 'గురువర్యా! మీయనుగ్రహంబున సకలవిద్యాసారంబును గ్రహించితిమి. గురువు సాక్షాత్పరబ్రహ్మమగు. గురుపదవికి నెల్లరుఁ దగరు. మీయట్టిగురువు లుండుటవలన లోకము నిలువనోర్చెను. మాకు విద్యాపరిసమాప్తియయ్యెను. గురుదక్షిణను సమర్పింపనినాఁడు గఱచినవిద్య ఫలకారిగాదు. గురుదక్షిణఁ గోరవేడుదు' మనిరి.

సాందీపని వారికెంతయుఁ బ్రీతుఁడై 'రామకృష్ణులారా! మీరు ప్రజ్ఞావతారములుగాని వేఱుగాదు. మీరుశిష్యు

లగుటయే పరమభాగ్యము. ఉపన్యాససంపద పరమదుర్లభము. మీరు సర్వజ్ఞులై యుండియు శాస్త్రమర్యాదను గాపాడుటకు గా శిష్యత్వంబు నర్థించి వచ్చితిరని నాయంతరాత్మ పలుకుచున్నది. మీకు నుపదేశికుఁడఁగా నోపితి. ఇంతకన్న వేఱు దక్షిణలేల ?' యని వాత్సల్యానందంబులఁ దెలిపెను.

అంతలోన సాందీపనిభార్య కనుగీఁటెను. సాందీపని తన్మనంబు గ్రహించి 'వత్సలారా ! ఏకపుత్త్రకులముగా నుంటిమి. ఒకనాఁడు మాసుతుఁడు స్నానార్థము ప్రభాసతీర్థము నకుఁ బోయి తజ్జలంబులఁ గ్రుంగి మాయమయ్యెను. అది మొదలు నాభార్య పుత్త్రవియోగకృశయై పరితపించుచున్నది. దీనిమొదరు తీర్పరాదు. విద్యావ్యాసంగంబున నెట్లో నాకు దినములు గడచుచున్నవి. మీరిందువచ్చిననాటనుండి యీ యింతి పేరాసతోనున్నది. దీనియార్తి మీవలనఁ దీఱునని దీనియంతరాత్మ పలుకుచున్నదఁట. దీనిభాగ్యంబెట్లున్నదో?' యనెను.

గురుపుత్త్రుఁడెన్నఁడో మాయమయ్యెను. అతఁడు చచ్చెనో లేదో తెలియరాదు. చచ్చియున్నచో వానినిఁ గృష్ణుఁడు బ్రతికించునని గురుపత్ని యెట్లు విశ్వసించెను ? ఆమెకు నట్టి భావంబెట్లు కలిగెను ? మందులో మంత్రాలో ప్రయోగించి కృష్ణుఁడు వానిని బ్రదికింపనోపునని యామె భావించె నందుమా ? పుత్రకుని శవమైననున్నచో నట్టియాసకుఁ గొంతయాధారముండును. అదియు లేదు. గురువు స్వపుత్రకుని దెచ్చి యిచ్చుట దక్షిణగాఁ గోరెను. గురుదక్షిణ యియ్యనిచో నేర్చినవిద్య నిలువదు. ఏమిచేయనగు ?

రామకృష్ణులు సాందీపనిని విని ప్రభాసతీర్థంబునకుఁ జని సముద్రు నడిగిరి. ఆ బాలుని యమపురికిఁగొనిపోయిరని సముద్రుఁడు చెప్పెను. రామకృష్ణులు యమపురికిఁ జనిరి. వారు విష్ణులీలామూర్తులగుట యముఁడెఱింగి సాందీపనిసుతుని భక్తితోడఁ దెచ్చి యిచ్చెను. వారతనిఁ గొనివచ్చి గురువు నకు నర్పించిరి సాందీపని వారికెంతయు వింతపడి మీవలనఁ గృతార్థులమైతిమి. ఈ కార్యంబు పరమేశ్వరునకుఁ దక్క నన్యు లకు సాధ్యముగాద'ని వారిని బహువిధంబుల శ్లాఘించెను. రామకృష్ణులు గుర్వాశీర్వచనంబులంది వానినివీడ్కొని చనిరి.

* చచ్చినవారిని బ్రతికించుట రామాయణమందును గలదు. రాముఁడు భగవదవతారమయ్యుఁ దననరత్వంబునకు భంగముగలుగునని యెంచి యాకార్యంబును దానొనర్పక యింద్రునివలనఁ జేయించెను. కృష్ణుఁడు మహిమావతారము గావున నక్కార్యంబును దానే యొనర్చెను. గోపబాలకు లను వత్సంబులను వేలకొలఁది సంకల్పమాత్రంబునఁ బుట్టించి సంవత్సరపర్యంతము నిలిపి సృష్టికర్తయైన బ్రహ్మకుఁ గూడ నాశ్చర్యంబుఁ గూర్చిన భగవానునకు నిది యేపాటిపనియుఁ గానేరదు. ఈకార్యము బుద్ధికి నందదందురా? బుద్ధికినందున దైనచో నది మహిమయే గాఁజాలదు. లోకసాధారణంబు గాదందురా? లోకసాధారణంబైనచో భగవన్మాయావిలాసము గానేరదు. అలౌకికము నతీంద్రియగోచరంబు నగుటవలననే యిట్టివెల్ల భగవన్మహిమాప్రదర్శంబులై భగవంతుఁడున్నాఁ డనుటకుఁ బ్రమాణంబుగలగుచున్నవి.

ధనుర్విద్యాభ్యాసము.

రామకృష్ణులు క్షత్రవంశంబునఁబుట్టిరి. క్షత్రియులకు ధనుర్విద్యాభ్యాసము ముఖ్యము. సాందీపనియొద్ద నది గలవ రైరి. ఘోరబుద్ధియనునతఁడు ధనుర్విద్యాపారంగతుఁడుండెను. రామకృష్ణులు వానిని సేవించి వానివలన ధనుర్వేదంబును సరహస్యంబుగా గ్రహించిరి.

తపోవ్రతానుష్ఠానము.

అప్పటికి బలరామునకు బదునాల్గేండ్లును గృష్ణునకుఁ బదుమూఁడేండ్లు నయ్యెను. తపోవ్రతస్నాతులైనఁ గాని విద్యాపరిసమాప్తము గాదు. ఆకారణంబున వారు హిమవత్పర్వతంబునకుఁ జని యటఁ బదుమూడేండ్లు తీవ్రతపం బాచరించిరి.

* శాస్త్రంబును జదివి దానియర్థంబును మననముచేసి నిశ్చితభావంబును నిదిధ్యాసంబువలన స్వానుభవసిద్ధంబొనర్తురు. ఇది శాస్త్రక్రమము. ఇదియే తపస్సగు. వాసనలుకామ్యంబులగునేని తపస్సు కామ్యార్థమగును. అవి కామరహితంబులగునేని తపస్సు మోక్షార్థమగు. కృష్ణుఁడు దేనింగోరి తపం బాచరించెను? కృష్ణుఁడు భగవదవతారంబనిరి. భగవంతుఁ డవాప్తసమస్తకాముఁడు. అట్టివాఁడు పొందదగినది గాని పొందనిదిగాని గలుగదు. కావునఁ గృష్ణునితపస్సు కామ్యార్థముగాదు. మోక్షార్థమందుమా? కృష్ణుఁడే మోక్షస్థానమయ్యెను. కావున వానితపస్సు మోక్షార్థము గూడఁ గానేరదు? అట్లయినఁ గృష్ణుఁడు తపస్సుచేయుటేల? వాని విద్యాభ్యాసతపోవ్రతంబులు లోకలక్ష్యార్థంబులు.

'యద్యదాచరతి శ్రేష్ఠః దదేవతరోజనః' అనియు 'మమవర్త్మాను వర్తంతే' అనియు గీతలో సూచించిన ప్రకారము లోకనియతి కొఱకు కృష్ణుఁ డట్లాచరించెను.

జరాసంధుఁడు.

కంసుఁడు చన్నంతట వానిభార్యలు అస్తి ప్రాప్తియను వారు వైధవ్యదుఃఖహతలై మధురనుండి వెడలి మగధకుఁబోయి తండ్రియైనజరాసంధుని యెడిలో వ్రాలి గోడుగోడు మనిరి. పుత్రికలదుఃఖము జరాసంధునియెదలోఁ గ్రోధవహ్నిని దగిలించెను. మగధేశ్వరుఁడు మధురరాజ్యంబును యాదవసహితంబుగా రూపుమాపవలయునని పంతముపట్టెను.

యాదవులు నిసర్గబలదర్పోన్నతులును ప్రబలసహాయసంపన్నులునై సులభసాధ్యులు గాకుండిరి. జరాసంధుఁడది గ్రహించి యొంటరగా వారితోఁబోరుట యుక్తముగాదని నిశ్చయించి కార్యసిద్ధికై దానమానంబులచేతఁ బెక్కురాజులను వశపఱచికొనెను. చేదిరాజు శిశుపాలుఁడు వానికి సేనానాయకుఁడయ్యెను ; కురుషాధిపతి దంతవక్త్రుఁడు వానికను సన్నల మెలఁగువాఁడయ్యెను ; యవనభూపాలుఁడు భగదత్తుఁడు వానిమాట నొదలఁదాల్చెను ; వంగపౌండ్రకిరాత దేశాధీశుఁడు పౌండ్రకుఁడు వానిపజ్జలాశ్రయించెను ; భోజవిభుఁడు భీష్మకుఁడు భూభాగంబుననాల్గవపాలు నేలకునేతయు యాదవులకు బంధువును హితుఁడునయ్యు వానియాజ్ఞ మీఱలేకుండెను. జరాసంధుఁడట్లు వశీకృతనానారాజేంద్రుఁడై పగఁబూనిన త్రాచువలెఁ దఱివేచియుండెను.

ఉగ్రసేనుఁడు పేరునకుమాత్రము రాజుగానుండెను. ముదిమికిఁదోడుగా సుతవియోగదుఃఖంబుగూడి వానికి వైమనస్యంబును బుట్టించెను. రాజ్యాంగవిధానము నానాటికి సడలెను. దిద్దువారును లేరైరి. పదియేండ్లుగడచెను.

మధురరాజ్యస్థితిని జరాసంధుఁడు సమగ్రంబుగా గ్రహించి తఱియయ్యెనని నిశ్చయించి యిరువది యక్షౌహిణుల బలంబుతో దాడివెడలివచ్చెను. యదువృష్ణిప్రజలకు దిక్కుదోఁచదయ్యెను. కృష్ణుఁడు దక్క నన్యులు రక్షింపఁజాలరని నిశ్చయించిరి. కృష్ణుఁడెందున్నదియు నేరక వానికై వెదకసాగిరి.

కృష్ణుఁడంతలోనఁ దపోవ్రతము పూర్తిచేసి మధురకు వచ్చెను. ఎల్లరు వానిచరణంబుల వ్రాలిరి. కృష్ణుఁడు యాదవశాఖలఁ బదునెనిమిదింటిఁ గూర్చి కర్తవ్యము నూహింపుమనెను. తలకొకయూహ తెలిపిరి. కృష్ణుఁడు వారినెల్ల విని పరిస్థితులు విమర్శించి నూరేండ్లుపోరినను వారు జరాసంధుని గనుగందింపలేరని నిశ్చయించి వృష్ణిసైన్యంబును గొలఁది మాత్రము నగరరక్షణంబునకు నియమించెను.

జరాసంధునిసేన మధురనలువలంకులఁ జూపుమేరదవ్వు వలచెను. రాకపోకలు ముగిసెను ; సంభారంబులు నగరమందు నానాటికిఁ దఱిగెను ; కూన కుంటి గుజ్జు లాఁకటఁ జావసాగిరి ; పురుషులు ప్రాణంబులపై నాసవదలిరి ; స్త్రీలు మానభంగంబునకు వెఱచి యాత్మహత్యలు తలపెట్టిరి. దుఃఖదైన్యంబులు నగరంబు నావరించెను. కృష్ణుఁడు మాత్రము

ధైర్యము విడువక నగరభాగంబులనెల్లఁ దాను నియమించిన కాలంది సైన్యము వలననే రక్షింపసాగెను. వైరికి నెన్నాళ్లకు సందుదొరకదాయెను.

హంసుఁడు డింభకుఁడు ననువారలు మహాబలపరాక్రమశాలులు జరాసంధునకు మిత్రులై వానిసేనానాయకత్వంబు వహించి వచ్చియుండిరి. హంసడింభకులమైత్రి యింతనరాదు. ఒకరిని బాసి యొకరు జీవింపనోల్లరు. హంసుఁడొకప్రక్కను డింభకుఁడొకప్రక్కను మధురను ముట్టడించి యుండిరి. జరాసంధునిసేనలో హంసుఁడనుపేరి రాజొకఁడుండెను. వానికిని బలరామునకును బాహాబాహి పోరు పదునెనిమిదిదివసంబులు హోరాహోరి జరిగెను. తుదకు హంసుఁడు నీల్గెను.

హంసుఁడు చచ్చెనన్నవార్త క్షణములో జరాసంధుని సైన్యమెల్లఁ బ్రాఁకెను. ఆమాట విని డింభకుఁడు తనమిత్రుఁడుచచ్చెనని భావించి దుఃఖహతుఁడై యమునాజలంబులఁబడి యసువులు దొఱఁగెను. డింభకునిచావునకు హంసుఁడెంతయు విధినిదూఱి యాత్మహత్య గావించుకొనెను.

హంసడింభకుల దుర్మరణంబును జరాసంధుఁడు విని తన రాజ్యంబునకు మూలస్తంభంబులుగానుండిన యయ్యిరువురకుఁగాఁ బెల్లు దుఃఖించి విరక్తిచెంది ముట్టడిచాలించి మగధకుఁ బోయెను. మధురముట్టడి నాటికి నట్లుతీరెను.

* 'కృష్ణుఁడు భగవదవతారమగుట సత్యమేని వాని మహిమలెల్ల నిజములేని జరాసంధుని సంహరింపఁడేల ? సంకల్పమాత్రంబున వాఁడు సబలఁబుగా నీఱయి యుండఁడా?'

అని శంకింపవచ్చు. జీవుఁడు ప్రారబ్ధకర్మఫలంబు ననుభవించు వండాక తనువును వదలఁడు. కర్మానుభవము పూర్తియైన తర్వాత తనువు తనంతట తానేవదలును. ఇది కర్మవిధానము; చంపుటయుఁ జంపఁబడుటయు నైమిత్తికంబులు. మఱియు జన్మకర్మానుభవంబులు శిక్షాక్రమంబులు. జీవుఁడట్లు శిక్షితుఁడగుచుఁ బ్రారబ్ధంబును వ్యయించుచు శాస్త్రజ్ఞానగురూపదేశ సజ్జనసాంగత్య దైవానుగ్రహంబులను బడసి దుర్వాసనలను నిరసించి యున్నతస్థితికి రావలయును. ఈయవకాశంబును భగవంతుఁడు ప్రతిప్రాణికి ననుగ్రహించెను. భగవంతుఁ డిచ్చిన యవకాశంబును భగవంతుఁడే హరింపఁడు. ప్రతివ్యక్తియు శుభంబునందుటే భగవత్సంకల్పము. తదర్థమైయెన్నోయవకాశంబులిచ్చును. ఈయవకాశములేజన్మలనఁబడు.

* సృష్టియెల్ల భగవంతుని యఖండప్రేమాభివ్యక్తియగు. ప్రేమాభ్యున్నతిని భగవంతుఁడపేక్షించు ; అదే వాని యానందము. ఔన్నత్యం బొక్కసారిగా రాదు ; అది సక్రమాభివృద్ధిఁ జెందును. వృద్ధికిఁ గాలంబత్యవసరము.

* కర్మవాసనలు శుభాశుభమిశ్రంబులై యుండు. ఏది యెప్పుడు పరిమళించునో వాసనాబలాబలంబులఁబట్టి యుండును శుభవాసన యొక్కొక్కఁటికి నంతకాలంబునఁ బరిమళింపవచ్చును. అప్పుడు మూఢబుద్ధిసయితము ప్రసన్నమై మేలు వడయవచ్చును.

* జరాసంధుఁని ప్రారబ్ధకర్మానుభవంబునకు నిరోధము గలిగింపరాదనియో అతఁడేఁదేని శుభవాసనచేతఁ బ్రేరేపితుఁడై

బుద్ధిమార్చికొనునేమో యనియో, యాదవులకు మధురరాజ్య నివాసము మహోపద్రవకరంబని యెఱింగి వారినందుండి తరలించువాఁడై ప్రాణమానధనోపద్రవంబు గల్గినగాని పందులకు నియ్యకొనరని గ్రహించి యట్టిక్లిష్టపరిస్థితిని గలిగించుటకు మగధేశ్వరుఁడు సాధనమగునని యెంచియో కృష్ణుఁడు వానిని దెగటార్పడయ్యెను. ఈశ్వరేచ్ఛ యూహింపరాదు.

### జరాసంధ కాలయవనుల దండయాత్ర.

జరాసంధుఁడు మరలివచ్చినందులకు వానిని వానిరాజ్యమెల్ల సహస్రముఖంబుల నిందించెను. వానికిఁ దలయెత్త రాదయ్యెను. ఆమచ్చమాయుటకై యతఁడు యాదవవంశ సమూలనాశంబును రెట్టించినపట్టుదలతో నిశ్చయించి కార్యనిర్విఘ్నపరిసమాప్తిఁ గోరి మహాబలపరాక్రమశాలియు బహూపాయజ్ఞుఁడును నైన యవనాధీశునిఁ గాలయవనుని విప్రోపాయంబుల పిలిచి మిత్రునిగాఁ జేసికొని వానితోడ మధురపయి మరలదండెత్తెను.

జరాసంధుఁడు మరల దండెత్తివచ్చుట తెలిసినంతనే యాదవుల గుండియలు ఝల్లుమనెను. యాదవు లాబాల వృద్ధము గూడినను జరాసంధుని సైన్యంబున శతాంశమేనియు గాదు. పోరువలన స్వకులనాశంబగునని యాదవనాయకులు నిశ్చయించిరి. వారెల్లరుఁ గృష్ణుని యొద్దకుఁ బోయి తమ తమభావంబులు దెలిపిరి. కృష్ణుఁడు వారిని విని 'మిత్రులారా! స్వపరబలంబుల విచారించి యుద్ధము తలపెట్టవలయు. మూఢబుద్ధిని నమ్మి మంచునగ్నిలోఁ బడరాదు. జరాసంధుని బలంబీసారి యతివేలముగానున్నది. వానినెదిరింపఁ జాలరు. నుప్పు

దొలంగి చనుటమేలు. ఇది సరియందు రేని జాగుచేయగాదు. నగరంబును ముట్టడించుటకుమున్నే యిందుండి చననగు. ఎందు బోవుదమందురా? ఘూర్జరదేశంబున రైవతకపర్వతము గలదు. దానిప్రక్కఁ గుశస్థలి యున్నది. అందుఁజేరి తంత్వతివిషయ మును నెమ్మదిగా నిశ్చయింపవచ్చు" ననెను.

ద్వారకానిర్మాణము.

యాదవులు గత్యంతరముగానక వల్లెయనిరి. సాంసార శకటంబులు తరలెను. ధనకనకంబులమూటలు నెత్తికెక్కెను. ఎల్లరును బశ్చిమముఖులై హుటాహుటి నడల నదులు తరించి పర్వతంబులుదాటి కాననంబులుదూఱి చనిచని పశ్చిమసముద్ర తీరముననున్న కుశస్థలిఁ జేరిరి.

అచ్చటికోట తోడ్తోడ మరామత్తు చేయఁబడెను. ఇరు వదిరెండు గోపురంబులను దీర్చిరి. యాదవశాఖలు పదునెని మిదింటిలో వీరాతివీరులను గోపురముంచిరి. బాలకులను యుద్ధశిక్షాక్రమంబునకు నప్పగించిరి. వారు నానాటికి గడ తేఱి సంసప్తకసైన్యంబనుపేరఁ గాలక్రమంబున లోకవిఖ్యాతిఁ గాంచిరి.

యాదవులట్లు కుశస్థలిఁజేరి రైవతకపర్వతంబు నవ్వలి వైపున సముద్రాంతరమందుఁ బట్టణంబొండు ద్వాదశయోజ నాయతంబును రథ్యాచత్వరవీథీవిరాజమానంబును శిల్పినై పుణ్యనిధానంబును వాస్తుశాస్త్రలక్ష్యంబును సురద్రుమలతో ద్యానవిచిత్రమునై హేమశృంగంబులతో స్ఫాటికాట్టాలగోపు రంబులతో నొప్పుచు నమరావతినిమించినదానినినిర్మించి యందుఁ జేరిరి. ఆపట్టణంబునే ద్వారకయందురు.

* అప్పుడు కృష్ణునకు నిరువదిమూఁడేండ్లుండును. ఆ మహనీయుఁడచ్చట నేయేయద్భుతంబులు రచించెనో సమగ్రముగాఁ దెలియదు. పురాణంబులు గూడ నేమియు వివరింపవు. అచ్చటివానిచరిత్రను దెలుపుగ్రంథంబు లభించునందాఁకఁ దద్విషయిక కుతూహలముతీరదు.

* కృష్ణునిసంకల్పమేమో ఆయన జరాసంధునకు వెఱచి పఱచిన ట్లేలనటించెనో యిప్పుడూహింపనగు. కృష్ణుఁడు జరాసంధుని నోడించియో హరించియో యున్నచో యాదవులు మధురనుండి కాలైననుగదల్చియుండరు. ద్వారకానిర్మాణ సంకల్పము కొనసాగియుండదు. ఏదియెప్పుడు కర్తవ్యమో దేని నెట్లు నిర్వహింపనగునో సర్వజ్ఞుఁడొక్కఁడే యెఱుంగు. దైవతంత్రము దురూహ్యము. మర్త్యులయంచనలెల్ల నంచనలే యగు సుమా.

## ముచుకుందుఁడు.

యాదవులు ద్వారకఁజేరిన తర్వాత కాలయవనుఁడు మధురను ముట్టడించెను. కృష్ణుఁడు మధురలోఁ దోఁచి కాలయవనునకు కంటఁబడెను. యవనేశ్వరుఁడు కృష్ణుని గుఱుతించి వానిని బట్టికొనుటకై వెన్నాడసాగెను. కృష్ణుఁడు వానికి వెఱచినవాఁడువోలెఁ బఱచిపఱచి యొకగిరికందరము చొచ్చెను. కాలయవనుఁడు వానిని వెన్నంటి యాగహ్వరము దూరెను. గుహాంతరమందుఁ గృష్ణుఁడు మాయమయ్యెను. కాలయవనుఁడది యెఱుంగక చీఁకటిలోగుహనెల్ల వెదకివెదకి యొకచోట నిద్రావశుఁడువోలెనున్న వ్యక్తినొకనిఁగాంచి యావ్యక్తియే కృష్ణుఁడని భావించి వానినిఁ గాలఁదన్నెను.

ఆవ్యక్తి కనువిచ్చి చూచెను. వానికోపాగ్నికిఁ గాలయవనుఁడు భస్మీభూతుఁడయ్యెను.

అంతఁ గృష్ణుఁ డావ్యక్తియెదుట నిల్చి 'ముచుకుందా ! ఐక్ష్వాకువైన మాంధాతృనకుఁ బుత్రుండవై జనించి యమరులను మెప్పించి కైవల్యప్రాప్తి నర్థించితివి. నీకోర్కెఁ దీర్ప శక్తిచాలక విష్ణునిఁ బ్రార్థింపుమని వారునీకుఁబల్కిరి. నీవును రాజ్యపరిపాలనాక్లేశపరిశ్రాంతుఁడవై యీగుహాంతరముఁ జొచ్చితివి. నీకు నిద్రాభంగముగల్గించువారు నీదృష్టింబడి భస్మం బగుదురని దేవతలు నీకు వరంబిచ్చిరి. కాలయవనుని చావు నీచేతనుండెను. వాఁడు మృత్యుచోదితుఁడై యిందువచ్చి నీకంటిమంటకు నీఱై' ననెను.

ముచుకుందుఁడు వానిమ్రోలనున్న ఘనశ్యామలకోమలాకారునిఁ బీతకౌశేయాంబరుని శ్రీవత్సవక్షుని కౌస్తుభాలంకృతుని చతుర్భుజుని వనమాలాధరుని చారుప్రసన్నవదనుని మకరకుండలమండితకర్ణుని గంజాతేక్షుని జగన్మోహనమూర్తిని గాంచి 'అయ్యా ! నీవెవండవు ? కంటకమయంబైన యీయరణ్యంబు దాఁటి యీగిరిగహ్వరాంతరంబులకు రానేల ? నీతేజస్సు సూర్యచంద్రాగ్నులతేజస్సును మించి భాసిల్లుచున్నది. మహేంద్రుఁడవో లోకపాలకులలో నొక్కఁడవో యూహింపరాదు. నీవెవండవో తెలుపవేఁడుదు' ననెను.

నావుఁడు 'ముచుకుందా ! నాకు జన్మంబులు వేనవేలు గలవు ; నాకర్మంబులకు నంతమే గలుగదు. నాజన్మకర్మంబులు కాలత్రయోపపన్నంబులై యుండు. ఋషులు సయ

తము వాని నెఱుంగనోపరు. అసురవృద్ధింజేసి భూభారంబు దుర్వహమయ్యెను. దానినుడుప నన్నువిరించి గోరెను. తదర్థము యదుకులంబునఁ బుట్టితి. వసుదేవునకుఁ బుట్టుటంజేసి నన్ను వాసుదేవుఁడందురు. నీవు తొల్లి నన్నుఁ గూర్చి ప్రార్థించితివి. నీకోర్కెఁ దీర్ప నిందు వచ్చితి' నని చెప్పెను. ముచుకుందుఁడు నాటిగర్గవచనంబును స్మరించి తనమ్రోల నున్నది నారాయణుండని గ్రహించి 'స్వామీ! జనులు నీమాయావిమోహితులై నిన్నెఱుంగరు. నీవు పరమార్థసుఖస్వరూపుండవు. అట్టి నిన్ను భజించి కడతేఱలేక యాత్మవంచితులై భౌతికసుఖమే పరమార్థంబుగా దలంచి యెండమావుల వెంటఁ బఱచి దుఃఖభాగు లగుదురు. కామసుఖంబులు సూకరాదులకును గలవు. ఆవిషయంబున నరులకును వానికిని భేదము గలుగదు. భగవద్భక్తి యొక్కటిమాత్రమే నరజన్మంబునకు విశిష్టమైయుండు. నరజన్మంబు నొందియు నిన్ను భజింపని మూఢుల నేమనవలయునో యూహింపరాదు. స్వామీ ! అజ్ఞానవశంబున దేహాత్మబుద్ధినై సుతదారధనభోగంబులఁ దవిలి జీవితంబెల్ల వ్యర్థ మొనరించితిని. శరీరంబులు ఘటకుడ్యాదులవంటివి ; అస్థిరంబులు ; ఎప్పుడు పడునో తెలియరాదు ; అనాత్మకంబులు. వానియందుఁ దగిలినబుద్ధి మనోరథపరంపరలకు లోనై చరించును. కోరికలు భగ్నమైనను విషయలాలసము పాయదు. అది వృద్ధియగుడు లోభంబు పైకొనును. లోభగ్రస్తుని నంతకుఁడు సర్పంబు మూషికంబును వలె మ్రింగును. స్వామీ ; రాజాధిరాజైనను విషయలోలుఁడగునేని నతఁడు స్త్రీలకుఁ గ్రీడామృగమగు. తృష్ణా

కులునకు భోగశాంతియే సిద్ధింపదు. అట్టివాని తపంబెల్లఁ గామ్యార్థమైయీజన్మంబునఁ గాకున్నను జన్మాంతరమందేనియు వాంఛాసిద్ధిని సంపాదింపనుండు. బహిర్ముఖులగతి యిట్టిదై యున్నది. ఈజాడ్యము నివృత్తికావలయుననన్న నీభక్తియే పరమౌషధము. నీభక్తియెట్లు గల్గునందువా ? ఎవనికి భవబంధంబు నశించుకాలంబు ప్రత్యాసన్నమగునో వానికి సత్సాంగత్యంబు లభించును. సత్సాంగత్యంబున సర్వసంగనివృత్తి యగు. అప్పుడతఁడు కార్యకారణనియంతవైన నీవంకమఱలు. నీయనుగ్రహంబున కెప్పుడు పాత్రుఁడగునో యప్పుడే వానికి ముక్తి సిద్ధమగు.

స్వామీ ! సత్సంగఫలంబుగా నాకు రాజ్యాదులందు మమకారము నశించెను. తత్ఫలంబుగా నీదయకు నోఁచితిని. స్వామీ ! ఒండుకోరిక నాకుఁ గలుగదు. పరమాత్మా ! అద్వయుండవు గావున నిర్గుణుండవు. నిర్గుణుండవు గావున నిరంజనుండవు ; నిరంజనుండవుగావున జ్ఞానఘనుండవును జ్ఞప్తిమాత్రుండవునై వెలయుదువు. అట్టి యక్షరుని నిన్ను శరణు చొచ్చితి. స్వామీ ! ప్రారబ్ధకర్మఫలంబులగు పాపవృత్తుల చేతను వానివాసనలచేతను బరితపింపఁబడుచు నాయింద్రియంబు లాఱును తృష్ణావశంబులై యాకారణంబున శత్రువులవలె వర్తించుచున్నను దైవానుయోగంబున నెట్లో శాంతిఁబడిసి లోకశరణ్యంబులైన నీపాదపద్మంబులఁ జేరితిని. అభయంబిచ్చి నన్ను పాలింపుము. ఆపన్నజనత్రాణము నీకు దీక్షయేగదా యని సాష్టాంగంబొనర్చెను.

కృష్ణుఁడు ముచుకుందునకు సంతసించి 'రాజా ! నీచిత్తంబు విమలంబు నూర్జితంబునై విరాజిల్లుచున్నది. కామంబులెంత ప్రలోభించినను నీకుఁ బ్రమాదము గలుగనేరదు. నాకు నేకాంతభక్తిచేయువారిని విక్షేపంబులుగలంపఁ జాలరు. విషయాభిముఖులై నాకుభక్తిసేయనివారు ప్రాణయామాదులెన్నియొనర్చినను వారి మనోవాసనలు చెలరేఁగి వారిసీడ్చుచుండు. నాకు భక్తిసేయుదురేని యావాసనలెల్ల నశించిప్రశాంతులై చరింతురు. నీకు నాయెడ స్థిరభక్తి నిరంతంబునుండుఁగాక. సమాహితుండవై తపంబాచరించి విశిష్టపాపంబులఁ బాపి కొనుము. జన్మాంతరమందు సర్వభూతప్రియుండవగు ద్విజవరుండవై నన్నుఁ జేరుదు'వని పలికెను.

ముచుకుందుఁ డంతటఁ గృష్ణునకుఁ బ్రదక్షిణనమస్కారంబు గావించి గుహాంతరంబునుండి వెడలివచ్చి యల్పప్రమాణులైన మర్త్యులను దదితరంబులను గాంచి కలియుగంబు ప్రాప్తంబగుట గ్రహించి యుత్తరదిశాభిముఖుఁడై గంధమాదనంబుఁ జొచ్చి బదర్యాశ్రమంబుఁజేరి నిస్సంగుఁడును ముక్తసంశయుఁడునై మనస్సును గృష్ణునందు నిల్పి పరమశ్రద్ధాయుఁడై తపంబు చేయసాగెను.

కృష్ణుఁడంతట మధురకువచ్చి యాపట్టణంబును ముట్టడించియున్న మ్లేచ్ఛబలంబునెల్ల హతమొనర్చి వారిధనంబునెల్ల ద్వారకకు దరలించెను. ఆసంగతి జరాసంధుఁడు విని మహాసైన్యంబుతో వచ్చెను. రామకృష్ణులు జరాసంధునకు భయపడినవారువోలె నటించి తాము తెచ్చుచున్న ధనంబులఁ బాఱవైచి బహుయోజనంబుల దూరము బఱుగెత్తసాగిరి. జరా

సంధుఁడు నగుచు వారిని వెంబడించెను. రామకృష్ణులు ప్రవర్షణాద్రిని బదునొకండు యోజనంబులయెత్తైనదాని నెక్కి యందుదాగిరి. జరాసంధుఁడు కొంతవడి వారిని వెదకి వెదకి జాడలుగానక గిరికి నిప్పుపెట్టెను. ఆయగ్ని తరువర్గంబు నెల్ల దహించుచు నింగిముటుచుఁ గొండయెల్లఁ బ్రాకెను. రామకృష్ణు లావహ్నిలోఁ బడిచచ్చిరని జరాసంధుఁడు సంతసించి తనపట్టణంబునకు మరలి పోయెను. రామకృష్ణులెప్పుడో ద్వారకఁ జేరిరి.

### రేవతీ వివాహము.

అనంతరము బలరాముఁడు రైవతుఁడనురాజుయొక్క పుత్రికను రేవతియనుదానిని వివాహమయ్యెను.

### రుక్మిణీ కళ్యాణము.

ఆకాలంబున విదర్భ (బీహారు) రాజు భీష్మకుండను వాఁడుండెను. వానికి నేవురుపుత్రులును నొకపుత్రికయుఁ గల్గిరి. పుత్రులలో రుక్మియనువాఁడు జ్యేష్ఠుఁడు. పుత్రికను రుక్మిణి యనిరి.

రుక్మిణికి వివాహయోగ్యవయస్సు వచ్చెను. ఆమె జగన్మోహనాకారము నాటిరాజన్యుల చిత్తంబు నాకర్షించెను. నానాదేశరాజకుమారకు లామె పాణిగ్రహణమహాభాగ్యంబును గోరి భీష్మకునకు సందేశంబులఁ బుత్తెంపసాగిరి.

జరాసంధునకు భీష్మకుం డనుకూలవర్తిగానుండెను. ఆకారణంబున నతఁడు భీష్మకసుతను రుక్మిణినిఁ దనసర్వసేనాపతియైన శిశుపాలునకుగా వరించెను. భీష్మకుఁడు వానికి

నెదురాడనోడెను. మఱియు భీష్మకునికుమారుఁడు రుక్మి తన చెలియలిని శిశుపాలునకే యియ్యవలయునని పట్టుపట్టెను.

నానాటికి జరాసంధునిరాయిడి మెండయ్యెను. రుక్మిణీ మనోరథంబు వేఱుగానుండెను. భీష్మకుఁడు వారిమధ్యఁ జిక్కి యేమియుంబలుకనోడి యాప్తులతో దీర్ఘమాలోచించి నాటిసాంప్రదాయానుసారముగా రుక్మిణికి స్వయంవరకళ్యాణంబును నిశ్చయించెను. సందేశంబులు తోడ్తోడ దేశదేశాంతరంబులకుఁ బఱచెను.

రుక్మిణి యాసంగతివిని 'నాతండ్రి జరాసంధునకు బాసటయయ్యెను. నాయన్న తలంపు స్పష్టము. నాచిక్కు దీర్చువారు గానరారు' అని పెద్దయుం దలపోసి యాప్తుఁడైన బ్రాహ్మణోత్తము నగ్నిద్యోతనుని రహస్యంబుగా రప్పించి తనగుట్టు వానికిఁజెప్పి కమ్మవ్రాసియిచ్చి వానిని ద్వారకకుఁ బంపెను. ఆవిప్రుఁడు ద్వారకఁజేరి తనరాకను ప్రతీహారుల వలనఁ గృష్ణునకు దెలిపి యనుజ్ఞాతుఁడై లోనికిఁ జని కాంచనాసనంబునఁ గూర్చుండియున్న పురుషసింహుని సందర్శించెను. కృష్ణుఁడావిప్రుని జూచినంతనే నిజాసనంబునుండి లేచి వానికి మర్యాదలెల్లఁ దీర్చెను. అగ్నిద్యోతనుఁడు నిష్టమృష్టాన్నంబు లారగించి మార్గశ్రమవాసి సుఖాసీనుఁడయ్యెను.

కృష్ణుఁడంతట వానిపాదంబు లొత్తుచు 'ద్విజోత్తమా! ధర్మము పెద్దలకు సమ్మతముగా నడచునుగదా. బ్రాహ్మణు లెల్లరు సంతుష్టులేగదా. వారుసంతుష్టులేని లోకమెల్ల సంతుష్టిఁజెందు. ప్రాప్తంబు పదివేలుగా భావించువాఁడు నిరంత

రహః సుఖమై యుండు. ఎవఁడు స్వలాభసంతోషియో యతఁడు సాధువును సర్వభూతసుహృత్తముఁడును నిరహంకారియు శాంతమూర్తియునై విరాజిల్లు. అట్టివానిపాదంబులఁ దల దాల్తు. ద్విజసత్తమా! మీకుఁ గుశలమా? మీరాజ్యమందలి ప్రజలెల్లరు సుఖముందురా? మీరింత దవ్వువచ్చిన పని యేదైనఁగలదా? అయ్యా! రహస్యము దాఁపవలదు. ఏమిగలయునో నన్నాజ్ఞాపింపనగు' నని మృదుమధురంబుగా నడిగెను.

నావుడా బ్రాహ్మణుఁడు ప్రహృష్టాత్ముఁడై రుక్మిణి తనచేతనుంచిన కమ్మను గృష్ణుని హస్తతలంబునఁ బెట్టి 'భువనైకసుందరా! విదర్భాధీశునిపుత్త్రి రుక్మిణి లోకైకమోహిని పంపఁగా నిందు వచ్చితిని. ఆకళ్యాణీసందేశంబు నాకర్ణింపఁ గోరుదు. ఆమె యిట్లు చెప్పిపంపెను. 'భువనసుందరా! నీగుణగణంబులు నామనంబును హరించెను. నీదివ్యమంగళరూపసందర్శనంబునకు నానేత్రంబు లువ్విళ్లూరుచున్నవి. కులకన్యలకు నిట్లు సందేశము పంపుట మర్యాదగాదందువా? కులవతులు వారికి ననురూపమైన వరులఁ గోరుట సహజము. భువనైకమంగళమూర్తిని నిన్నుఁ గోరుట వింతయేమి? అదితప్పగునేని దానికి నీదివ్యరూపమే కారణంబగు. నాథా! నీకు నర్పించికొంటిని. నీదానను నన్ను శిశుపాలుఁడు సింహము పాలిసొమ్మును నక్కవలె నాసించియున్నాఁడు. నీప్రాపు నాకు మదీయబహుజన్మాంతరసుకృతఫలంబని భావించితిని. బంధువులవలనఁ జైద్యునకు నర్పితమైనదానను నన్ను గ్రహించుట పాడిగాదని శంకింపవలదు. అంతకు మున్నే నేను నీకు

నర్పించికొంటిని. కావున నేను నీదాననుగాని యన్యునుగాదు. నీధనంబును నీవు గ్రహించుట తప్పుగాదు. మీఁదుమిక్కిలి యది ధర్మమేయగు. శుల్కపూర్వకంబుగా వివాహంబు కాఁదగునందువా ? నీవీర్యమే యుంకువయగు. అంతఃపుర వాసినిని శిశుపాలాదివీరబల సంరక్షితను నన్ను హరించుట యెట్లందువా ? అంబిక మాకు గృహదేవత యగును. వివాహ పూర్వము రాజకన్యకలామెకు మ్రొక్కవచ్చుట సాంప్రదా యము, నేను నట్లేచేయుదు. అది సమయంబుగా నన్నుఁగొన నగు. చైద్యుఁడు యోగ్యుఁడు కాదాయని యందువా? అతడు నీపాదధూళికిఁగూడఁ జాలఁడుసుమా. అంబుజాక్షా ! నా మొఱాలింపవేని నిన్నేస్మరించుచు వ్రతోపవాసకృశనై ప్రా ణంబులఁద్యజింతు. అంతియగాదు. కోటిజన్మంబులకైనను నిన్నే పతినిగాఁ బడయుదు. ఇది నిక్కము'. కృష్ణా ! సందే శంబును దెలిపితి. ఏదియుక్తమో యదిసేయనగు' ననెను.

కృష్ణుఁడు సందేశంబునెల్ల విని చిఱునవ్వుదాల్చి యగ్ని ద్యోతనునికరంబు నిజకరంబునఁ గూర్చి 'రుక్మిణి నాయందెట్లో నేనును రుక్మిణియందట్లే యుందు. మాకు రాత్రులు నిద్రా రహితంబులుగాఁ గడచుచున్నవి. మాయిరువురకు వివా హము జరుగకుండు యత్నంబులు చేయుట యెఱుంగుదు. రాజ న్యమాత్రులను హరించి నాయందాసక్తయైయున్న యాయన వద్యాంగిని యాగాగ్నిశిఖనుబోలెఁ గొనివత్తు'నని పలికి రథంబు నాయత్తముచేయ దారకునకు నాజ్ఞాపించెను. సార్థ క్షణ ములో సైన్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబులనెడి హయోత్త

మంబుల నాల్గింటఁ బూన్చిన రథంబును గొనివచ్చెను. కృష్ణుఁడు భూసురోత్తమునితోడ రథం బెక్కి తరలెను.

అటఁ గుండినపురంబున మార్గరథ్యాచతుష్పథంబులు సంమృష్టంబులై పన్నీటికలయంపి వాసనలతో నిండి చిత్రధ్వజపతాకాసమలంకృతంబులై చెన్నారెను. మందిరంబులగరుధూపదీపితంబులును బుష్పతోరణాభిరామంబులునై వైవాహికమాంగళ్యంబును బ్రకటించెను. భీష్మకుఁడు పితృదేవతల నర్చించి విప్రజనంబును విధిప్రకారము మృష్టాన్నసంతుష్టులఁగావించెను. రుక్మిణిని జలకమార్చి కౌతుకమంగళంబుగావించి క్రొత్తవస్త్రంబులతోను నానారత్నాభరణంబులతోను గైసేసి యథర్వవేదవేత్తలైన ద్విజోత్తములచేత రక్షయొనరించిరి. పురోహితులు గ్రహశాంతులు చేసిరి. హిరణ్యారౌప్యంబులును వస్త్రంబులును గుడమిశ్రితతిలలును ధేనురత్నంబులును యథావిధి దానంబులీయబడెను. వేయేల? అభ్యుదయోచితంబులైన కర్మంబులెల్లఁ గావింపఁబడెను. తెల్లవాఱి రుక్మిణీశిశుపాలుర కళ్యాణమహోత్సవంబును జూచు పేరాసతోఁ బురంబెల్ల నుప్పొంగుచుండెను.

శిశుపాలుఁడు పెండ్లికొమరుఁడై రథగజతురగసేనాసమేతంబుగా వచ్చెను. వానిని దగుమర్యాదలతోడ విడిదియింట నిల్పిరి. చైద్యపక్షీయులైన సాల్వుఁడును జరాసంధుఁడును దంతవక్త్రుఁడును విదూరథుండును బౌండ్రకాదులును వేలకొలది పరివారంబుతో వచ్చి చేరిరి. ఎల్లరకు మర్యాదలును విందులును యథావిధిజరుగుచుండెను. భీష్మకసుతయైన రుక్మిణిని హరించి తెచ్చుటకై కృష్ణుఁడొంటిగాఁజనుట బలరాముఁడు

విని కలహంబు శంకించి మహాబలసమేతుఁడై హుటాహుటిఁ గుండినపురంబునకుఁ దరలి కృష్ణుని గలసికొనెను.

రాత్రియయ్యెను. ఎవరెవరువచ్చినది యప్పుడప్పుడే దాసీజనులు రుక్మిణికిఁ దెలుపుచుండిరి. రుక్మిణిమనస్సు కృష్ణునుండియుఁ దదీయదృష్టి ద్వారకామార్గంబునుండియు దిరుగ వయ్యెను. రాత్రి మూఁడుజాములు గడచెను. కృష్ణునిసంగతియే తెలియకుండెను. ఆమె యపరిమితచింతాకులయై

"మ॥ ఘనుఁడాభూసురుఁడేఁగెనో ! నడుమమార్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుండిది తప్పుగాఁదలచెనో విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింపఁదలంచునో తలఁపఁడో యార్యామహాదేవియుఁ
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో నాభాగ్యమెట్లున్నదో"

"శా॥ లగ్నంబెల్లి వివాహముంగదిసె నేలారాఁడు గోవిందుఁడు
ద్విగ్నంబయ్యెడి మానసంబువినెనో వృత్తాంతముఁ బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుఁడేటికిందడసె నాయత్నంబు సిద్ధించునో
భగ్నంబైచనునో విరించికృతమెబ్భంగిం బ్రవర్తించునో !"

అనుచు రుక్మిణీదేవి చింతాక్రాంతయై యఱమోడ్పుఁ గందోయితోఁ జాన్పుపయి వ్రాలెను. ఆమెకు వామోరుభుజనేత్రస్పందనంబయ్యెను. అశుభసూచకంబు లామెకు మఱల నాసఁబుట్టించెను. అంతలోన నగ్నిద్యోతనుఁ డంతఃపురములోనికి వచ్చి యామెకంటబడెను. వానిసంతోష ముఖంబును రుక్మిణిగాంచి కార్యంబనుకూలించెనని భావించి చిఱునవ్వుదాల్చెను. భూసురోత్తముఁ డంతటఁ గృష్ణుఁడు వచ్చెనని యామెకుఁ దెలిపి కతయెల్ల వివరించెను. రుక్మిణి వానిని సాంతంబుగా నాలకించి 'భూసురోత్తమా! నీఋణంబు

నెట్లు తీర్పనగునో యూహింపరాదు' అని నమస్కరించెను.

రామకృష్ణులుగూడ వచ్చిరని భీష్మకునికిఁ దెలిపిరి. అతఁడు వానిపుత్రికాభావంబు నెఱింగియున్నకతన రామకృష్ణులరాకయొక్క ఫలంబు నూహించి వారిని మధుపర్కవస్త్రాది పూర్వకంబుగా యథావిధిఁ బూజించి యోగ్యనివాసంబునఁ జేర్చెను.

కృష్ణుఁడు వచ్చినవార్త విదర్భనగరంబెల్ల క్షణములో వ్యాపించెను. పురజనులెల్లరు గుంపులు గుంపులుగా వచ్చి వానిముఖపద్మామృతంబును గన్నులారగాంచి 'అహో! రుక్మిణికిఁ గృష్ణుఁడే భర్తకావలయు; కృష్ణునకు రుక్మిణియే భార్యగానోపు. ఇయ్యిరువుర దాంపత్యం బన్యోన్యశోభావహమై లోకానందంబుఁ గూర్చు. కృష్ణుఁడు రుక్మిణి ననుగ్రహించి యామెపాణిపల్లవంబును గ్రహించుగాక' అని వారి ప్రేమానందంబుల వర్షించిరి.

రుక్మిణి గౌరీపూజార్థము తదాలయంబునకుఁ గాల్నడక తోఁ దరలెను. ఆమెచిత్తము కృష్ణపాదారవిందసక్తమగుటం జేసి చెలికత్తెలెటునడపిన నట్లామె నడువసాగెను. శూరులైన రాజభటులు సాయుధులై చుట్టుఁజుట్టి కదలిరి. మృదంగ, శంఖ, పణవ తూర్యంబులును భేరులు నొక్కట మ్రోగెను. వారాంగనలు వేలకొలఁది వివిధంబులైన యుపహారబలులను గైకొనిరి. ద్విజసీమంతినీమణులు సాలంకృతలై యామెవెంట నంటిరి. సూతమాగధవందివాదంబులు చెలరేగెను.

రుక్మిణీదేవి దేవసదనంబుఁజేరి పాదకరకమలంబులను శుద్ధి

వఱచి యాచమించి ప్రశాంతాత్మయై యంబికాంతికమున
నిల్చెను. వృద్ధస్త్రీలు మునుపడవచ్చి భవసహితయైన భవా
నికి విధిపూర్వకంబుగా రుక్మిణీచేత వందనంబు చేయించిరి.
రుక్మిణి యట్లు నమస్కరించి

"ఉ॥ నమ్మితినామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁబురాణదంపతుల మేలు భజింతుఁగదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివిగదమ్మ హరిం బతి సేయుమమ్మనిన్
నమ్మినవారికెన్నఁడును నాశము లేదుగదమ్మ యీశ్వరీ॥"

అని ప్రార్థించి పార్వతీపరమేశ్వరులను బూజించెను. విప్రాంగ
నలంతట వాసస్రగ్గంధాక్షతలును ధూపదీపంబులును నానోప
హారంబులు నద్దేవికి సమర్పించి వధువు నాశీర్వదించిరి.

రుక్మిణి యంతట దేవాలయంబునుండి వివాహమంట
పమునకుఁ దరలెను. ఆసంగతి తెలిసినంతనే రాజపుత్రకు
లకు నిలువెల్లఁ గన్నులాయెను. వారిదృష్టి యామెవచ్చు
దారినంకనే నిల్చి మఱల దయ్యెను. రుక్మిణి తన్నే వరించు
ననుచు నొక్కొక్కఁడు లోలోన నుబ్బి బూరటిల్లుచు మను
గాళ్ళ నుండెను. అళినీలాలకలుగప్పి పూర్ణచంద్రబింబంబుతో
నెనయుచున్న ముఖమండలంబు లేవెన్నెలలఁ గాయుచుండగా
మృగశాబకంబులకు దృష్టినైపుణ్యవిధానంబును నేర్పుచున్నవో
యను కటాక్షవీక్షణమాలికలు దిదృక్షాజనహృదయంబులకుఁ
బాశంబులగుచుండఁగాఁ, బ్రవాళంబుతో మచ్చరించి బింబ
ఫలంబును నిరసించి యధరపల్లవంబు లేఁగెంపుఁగ్రొంజాయల
గురియుచుండఁగా, పాదకాంతికి నేలయెఱ్ఱనై మృదువిన్యా
సంబునకుగా రక్తకంబళంబును బఱచిరోయను భ్రాంతి గలుగు

చుండఁగా, గుచకుంభంబుల భారంబునకు నెన్నడుముఁ దీవె యసియాడుచు భావాభావవిభ్రమంబుఁ గొలుపు చుండఁగా, దుర్మోహావివశమైయున్న రాజపుత్రలోకంబునకు హృదయ తాడనంబులోయన శింజత్కలానూపురధ్వనులు చెలఁగుచుం డఁగా స్వయంవర పుష్పదామంబు నరుణాంభోజహస్తంబున దాల్చి మత్తేభరాడ్గమనంబున దేవమాయవలె వచ్చుచున్న యావీరమోహినిని గాంచి వీరవర్గంబు మోహవివశమై 'అహా! ఈలోకసుందరి యాత్రామిషంబునఁ దనలావణ్యంబును హరికి సమర్పింపవచ్చెనో', యని భావించుచు హస్తతలంబులనున్న యస్త్రంబులు జాఱి క్రిందబడుటనయిన మెఱుంగరైరి.

రుక్మిణి యట్లు మందమందగతి స్వయంవరమండపంబుఁ జొచ్చి యలకపాళిని వామకరంబున నెగఁద్రోసి యపాంగ వీక్షణంబు సారించి రాజపుత్ర లోకంబునెల్లఁ గలయ నవలోకించి

'మ॥ కనియెం బూర్ణశశాంకమండలముఖున్ గంఠీరవేంద్రావల
గ్నున్ నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశదే
హున్ నగారాతిగజేంద్రనిభబాహున్ జక్రిఁ బీతాంబరున్
ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్'

అట్లు కృష్ణుని గాంచి లేనగవుఁదేఁట నజరువెట్టి వీక్షా మాలికాదామంబును వానికంఠంబున వైచెను. కృష్ణుఁడు తటాలున నామెను గయిపట్టి తనరథంబుపయి నెక్కించుకొని బలరామాదులతోడ ద్వారకామార్గముఁ బట్టెను.

స్వయంవరమండపంబెల్ల గగ్గోలుమనెను. ఎచ్చటివార చ్చట ఱిచ్చపడి నిలిచిరి. రాజకుమారకులు తేఱి క్రోధ మూర్ఛితులై పట్టుఁడుకొట్టుఁడనుచు లేచిరి. జరాసంధాదులు

రుక్మిణీహరణంబును దమయశోహరణంబుగా భావించి యుద్ధ
సన్నద్ధులైరి. వీరవరులు ధనుష్టంకారంబులు గావించి యాద
వానీకంబుపైఁ శరవర్షముఁ గురిపించిరి. ఆశ్వికులాశ్వికులతో
గజారోహకులు గజారోహకులతోఁ బదాతులు పదాతులతోఁ
దలపడిరి. రుక్మిణీదేవి తనపతిసేనా బలంబు శరాసారవిచ్ఛిన్నంబ
గుటఁజూచి వ్రీడాభయవిహ్వలలోచనంబులఁగృష్ణునిఁజూచెను.
వాసుదేవుఁడు నిజప్రియారత్నంబునకు నభయంబు పలికెను.
అంతలోన వైరిపక్షంబున పథికాశ్వికగజకుల తలలు సకిరీటకుండల
లోష్ణీషంబులుగాఁ దెగి నేలఁబడెను. హస్తంబులు తెగియు
దొడలు విఱిగియు హస్తితురంగంబులును బదాదులును నేల
రాలుటయ్యెను. యాదవజయజయధ్వనులు రోదసీకుహరంబు
నగలించెను.

అంతట రాజపుత్త్రులు జరాసంధుని తోడ శిశుపాలుని
హృతదారాతురుఁడుంబోలె నున్నవానినిఁ జేరవచ్చి 'పురుష
శార్దూలా ! దౌర్మనస్యము వలదు ; ప్రియాప్రియంబులు
సుఖదుఃఖంబులు నీశ్వరతంత్రప్రేరితంబులై కొమ్మబొమ్మవలె
నటునిటుఁ దిరుగుచుండు. ఈకృష్ణుఁడు జరాసంధునిచేత నిరు
వదిమూఁడుసార్లు పరాజితుఁడై పఱచెను. సర్వముఁ గాల
యుక్తమై నడచును' అని వానికి ధైర్యంబులు పలికి యెల్లరు
వారివారి దేశంబులకుఁ జనిరి. శిశుపాలజరాసంధులు హత
శేషులను గూర్చికొని తమ పురంబులకుఁ బోయిరి.

రుక్మి యారాక్షసవివాహంబును సహింపకయు నవమా
నంబు నోర్వకయు కృష్ణునిఁ[illegible] రుక్మిణిని దేఁజాలనేనిఁ గుండిన

పురంబునఁ గాలైననిడ' నని ప్రాపుగోని బు ప్రేరా లఁ బ్రతినజేసి యక్షౌహిణీబలసమేతంబుగాఁ జని నిలునిలుమనుచుఁ గృష్ణునిఁ దఱిమి వానిసిదలపడెను. కృష్ణుఁడు వానినెదుర్కొని కొం డొకసేపు వానియాటను సాగనిచ్చి రథంబునుండి దుమికి వానిని సిగఁబట్టి యీడ్చి తదీయకంఠంబును దెగవేయ నుంకెను. రుక్మిణి యదిగాంచి యన్నకై జాలినొంది భయవిహ్వలయై పతిపాదంబులఁ బ్రాలి 'లోకకళ్యాణా ! నాయన్నను గావు'మని వేడెను. కృష్ణుఁడా మొఱనాలకించి రుక్మిని విరూపునిగాఁజేసి ప్రాణంబులతో వదలి ద్వారకకుఁ బోయెను. రుక్మి యట్లు పరాజితుఁడు నవమానితుఁడునై నిజప్రతినందలంచి యాయుద్ధ భూమియందే పురంబొండు నిర్మించి యందే నివసింపసాగెను. ఆపురంబును భోజకటకంబనిరి.

* భగవంతునినమ్మిన వారికి నెన్నఁడును నాశనము లేదనుభావంబును రుక్మిణీకళ్యాణంబు ఘంటాపథంబుగాఁ జాటు చున్నది. రుక్మిణిని శిశుపాలుఁడు వరించెను. ఆయింతిని వానికే కూర్పవలయునని జరాసంధుడు పట్టుపట్టెను. రుక్మియు వానికి ననుకూలించెను. అదితప్పదనిదేశమెల్ల విశ్వసించెను. రుక్మిణిగూడఁ దనయాశలెల్ల వదలి యడియాసంబట్టి వ్రేలాడ సాగెను. పర్యవసానంబెట్లయ్యెనో చూడుఁడు. భగవంతుఁడు భక్తులనెప్పుడును విడనాడఁడు భగవత్కటాక్షము వ్రాలె నేనిఁ గొండంతవిఘ్నంబులు గోరంతలై పఱచును. ఈశ్వరుఁడు కూర్చునట్టి శుభయోగవిధానంబు తలంపునకు నందదు. అది యద్భుతంబులకు నద్భుతమై యుండు. అహాహా ! భగవ ద్వాత్సల్యము.

కృష్ణుని భార్యలు.

కృష్ణునకుఁ బదునారువేల నూర్గురుభార్యలని విష్ణుపురాణముప ్కను. రుక్మిణి, సత్యభామ, జాంబవతి, కాళింది, మిత్రవింద, సత్య, భద్ర, లక్ష్మణ, యను వారెనమండ్రుగురు భార్యలు వానికుండిరని హరివంశము వచించును. వీరలేగాక పదునారువేల మంది గోపికలుగూడఁ గృష్ణుని భార్యలని భాగవతము తెలుపును.

కృష్ణచరిత్రఘట్టంబులందెల్ల రుక్మిణీసత్యభామల వ్యవహారంబులే గానవచ్చునుగాని తక్కినవారివ్యవహారములు గానరావు. కృష్ణుని సంతానమన్ననో వేయిన్నినాల్గువందలనలువదిమంది యని విష్ణుపురాణము. రుక్మిణీ జాంబవతీపుత్త్రులు దక్క మతెవ్వారును బేర్కొనఁబడరు.

కృష్ణుఁడు రుక్మిణీ సత్యభామలను మాత్రమే విధివిధానంబునఁ బెండ్లాడెననియు, ఆకారణంబున నయ్యిరువురను మాత్రమే యర్చనాదులందు గ్రహింతురనియుఁ దక్కినవారట్లు గృహిణులుగానుండున వారిప్రస్తావనంబంతగాఁ జేయఁబడలేదనియుఁ గొందఱందురు.

కృష్ణుఁడు ధర్మసంస్థాపనార్థమవతరించి ధర్మతత్త్వంబును లోకప్రచారంబుగా బోధించెను; కామమును ధర్మావిరుద్ధముగా సేవింపవలయునని నిర్ణయించెను. అట్టివానికి నిందఱు భార్యలుండిరన నతఁడు కామలోలుఁడనక తప్పదు. ఇదియెట్లు పొసఁగునో యూహింపరాదు. గోపికలభార్యాత్వమెట్టిదో కృష్ణుని వారేభావ[illegible]లో భ[illegible]గా గ్రహించిరో రాసక్రీడాదు

లందు వివరింపఁబడెను. గోపికాకృష్ణుల భార్యాభర్తృత్వం
బులు కేవలభక్తిప్రాణితంబులు. కావున వారిసంబంధంబులను
లౌకిక సతీపతిత్వదృష్టితో గ్రహింపరాదు.

గోపికలు పూర్వజన్మంబున ఋషికన్యలనియు, వారు రామావతారమందు రామునిఁబతిఁగాఁగోరి తపంబాచరించిరనియు, వారికోరికలెల్ల నవతారాంతరంబున సిద్ధించునని వారికి రాముఁడు వరముఁ బ్రసాదించెననియు, ఆమునికన్యకలు గోపికలై జనించిరనియు, కృష్ణుఁడు వారిహృదయాంతరాళములందు భక్తిని నెలకొల్పి మనస్సంగమరూపరత్యానందంబును వారికిఁ జేకూర్చెననియు, ఆకారణంబుననే యొక్కొక్క గోపికకు నొక్కొక్క కృష్ణుఁడుండుటయ్యెననియు గోపికాకృష్ణుల భార్యాభర్తృత్వంబు లీరూపంబులే గాని ప్రాకృతులు దలంచునట్టివి గావనియు, భాగవతమందే గలదు. అంతియగాదు. అష్టభార్యలలోఁ గృష్ణుఁ డెవ్వతెను మిక్కుటంబుగాఁ బ్రేమించునను విషయమును గుఱించి వారిలో వారికి వాదము గల్గినట్లును కృష్ణునకుఁదానొక్కతయే ప్రియురాలననియుఁ దత్కారణంబునఁ గృష్ణుఁడు తన్నెప్పుడు నెడఁబాయఁడనియు సత్య విఱ్ఱవీఁగసాగెననియు, ఆసంగతి పరీక్షకు వచ్చినప్పుడు కృష్ణుఁడేక కాలంబుననే యెనమండ్రుగురు భార్యలయొద్ద గాన్పించి సత్యభామకు గర్వభంగమొనరించెననియు భాగవతమే తెలుపుచున్నది. ఇందఱు భార్యలున్నను గృష్ణుఁడస్ఖలితబ్రహ్మచారియని యాగ్రంథమే చాటించెను. దీనింబట్టి కృష్ణుని పతిత్వమెట్టిదో యూహింపనగు.

భక్తిసాధనకాలమందుఁ గృష్ణుఁడు భర్తయైనట్లును దాము భార్యలైనట్లును బురుషులుగూడ నభినయించుట వైష్ణవసాం

ప్రదాయమందు నేఁడునుగలదు. శ్రీచైతన్యస్వామి యొక్కయు శ్రీరామకృష్ణపరమహంసయొక్కయుఁ జరితలే యిందులకు నిదర్శనంబులు. పురుషులే యట్లు నటింపఁగా స్త్రీల సంగతి చెప్పవలయునా? ఆనందానుభవార్థము భక్తులు వివిధంబుల వర్తింతురు.

భగవంతునకు రూపనామంబులు గలుగవు. భక్తులు వారివారి రుచుల ప్రకారము భగవంతునకు రూపనామంబులు కల్పించి భక్తిచేయుదురు. ఏయేరూపంబును భావించి భక్తి చేయుదురో యాయారూపంబుననే భగవంతుఁడు ప్రత్యక్షమై వారియభీప్సితంబులఁ గూర్చుచుండు. ఇది గీతయందు విస్పష్టముగాఁజెప్పఁబడెను. భగవంతుఁ డిన్నిరూపంబులఁ దోఁచుటయు నిందఱియభీప్సితంబుల నేకకాలంబునఁ దీర్చుటయు లీలలగునేగాని నిక్కములు గాఁజాలవు. యథార్థస్థితి యిట్లున్నను భక్తులనంటియుండు ద్వైతభావము వారినట్లు భ్రమింపఁజేయుచుండును. జ్ఞానప్రదీపనంబున ద్వైతవాసనలు నశించినప్పుడు భ్రమలెల్ల సమసి పరమాత్మ ఏకము అద్వయము సచ్చిదానంద స్వరూపమగుట స్పష్టపడి పూర్వానుభవంబులెల్ల మనఃకల్పితంబులైన భగవల్లీలలగుట స్పష్టమగును.

భక్తి తొమ్మిదివిధములు. వానిలో మధురభక్తియందు నంతఃకరణంబు ప్రేమద్రవీభూతమగు. అందు ధ్యానమూర్తి ప్రతిఫలించును. ఆప్రతిబింబంబును భక్తులుగట్టిగాఁబట్టుకొందురు; తన్మయులగుదురు. తన్మయస్థితి యట్లే నిలువదు. స్థితి మాఱినప్పుడు ప్రతిబింబం బదృశ్యమగు; తదర్థము

భక్తులు ప్రాకులాడుదురు. దీనినే విరహావేదనమనిరి. ప్రేమద్ర వీభూతాంతఃకరణమందు ధ్యేయాకారము ప్రతిఫలించినప్పుడు తత్సందర్శనసాన్నిధ్యాదులవలనజనించునట్టి రసమేయానందము. భక్తివలన జనించునట్టి యానందము స్థిరస్థాయి గానందున దానిని ఖండమనిరి. జ్ఞానసిద్ధమైనట్టి జీవబ్రహ్మైక్యంబునఁ గలుగు నానందంబు చిరస్థాయిగావున దాని నఖండమనిరి.

మధురభక్తివిలాసంబులను సతీపతుల యనురాగవిర హంబుల సామ్యంబున నభివర్ణింతురు. కృష్ణుని బహుభర్తృ త్వాదులను విమర్శించునప్పు డీభావంబును మఱవరాదు.

### రాజయజ్ఞము.

ఒకనాఁడు నారదమహర్షి కృష్ణునొద్దకువచ్చి వాని యోగక్షేమంబులు విచారించెను. కృష్ణుఁడాప్రశ్న విని 'మునీంద్రా! నాభాగ్యంబులో నర్ధభాగంబును నాబంధువులకిచ్చి వారినెంతో ప్రీతితో మన్నింతు. అట్లుచేయుచున్నను వారి దూషణలు నాకుఁ దప్పవు. వారు నాకు దాసులగుటకు మాఱుగా నేనే వారికి దాసుడనై యుందు. మునివర్యా! బలదేవుఁడును, గదుఁడును, సుకుమారుఁడును, నాపుత్త్రుఁడు ప్రద్యుమ్నుఁడును లోకోత్తరసుందరమూర్తులనఁ బడుదురు. వారొండొరు నోర్వరు. నేను వారినెల్ల సమదృష్టితోఁ జూతును. అదివారు సహింపరు. ఆకారణంబున వారియీర్ష్యకు గుఱియగుచున్నాను. అంధకులును వృష్ణులును బలపరాక్ర మములందు విఖ్యాతిగాంచిరి. వారియన్యోన్యకలహంబులను మాన్పఁ జాలకున్నాను. ఆహుకుఁడును అక్రూరుఁడును నాకుఁ బరమమిత్త్రులు. అయ్యిరువురును రెండుకన్నులుగా

భావింతును. ఒకనితో నేకాంతముగా క్షణకాలంబుందునేని రెండవవాఁడు నన్ను ద్వేషించును. మనస్సు విచ్చి మాటాడ రాకున్నది. వేయేల? జీవితంబెల్ల దౌర్భాగ్యగతి నున్న'దనెను.

దీనిసారాంశ మేమి ? సృష్టియెల్ల రాగద్వేషపూరితము. సృష్టిగలంతకాలము రాగద్వేషములు తప్పవు. వానివిజృంభణంబు వ్యక్తికివలె సంఘంబునకుఁగూడ దుఃఖకారియగు. రాగద్వేషంబులకు మర్యాద గావించుటయే పరిపాలనమనఁబడు. వానినట్లు హద్దులో నుంచుట దైవాంశసంభూతులకుఁగూడఁ గష్టసాధ్యమనఁగా మర్త్యమాత్రులసంగతి చెప్పవలయునా ? పరిపాలనం బసిధారావ్రతచర్యము. 'కూలినాలిచేసి కుడుచు పేదసుఖంబుఁ దక్కఁదిలనుమకుటధారికెందు' అన్నట్లుగాఁ బాలకునకు సుఖమే లేదు. అతఁడు జీవితంబునెల్లఁ బ్రజార్థము ధారపోయవలయు. ఇదే రాజయజ్ఞము. పాలకునియాత్మసుఖత్యాగ ఫలంబుగా రాష్ట్రప్రశాంతిగల్గుచుండు. అట్లలాభార్థమైన పాలనంబు చిరస్థాయిగాదు. ఈభావంబునే శ్రీరామచరిత్రయు గఱపుచున్నది.

## స్యమంతకమణి.

యాదవనాయకులలో సత్రాజిత్తనువాడుండెను.అతడు సూర్యునుపాసించి వానివలన స్యమంతకమణి యనుపేరి యనర్ఘ రత్నంబొందు పడసెను. ఆరత్నంబెవ్వనియింట నుండునో వాని యింట ధనము కురియునని ప్రతీతిగలిగెను. ఆరత్నం బెల్లర దృష్టి నాకర్షించెను. అట్టిరత్నము రాజాధిరాజునొద్దఁదక్క నన్యులయొద్ద నుండరాదని జనులు తలంపసాగిరి.

ప్రజాభావము సత్రాజిత్తునకుఁ దెలిసెను. కృష్ణుని తలంపుగూడ నట్టిదేయని యతఁడూహించెను. యిఁకనది తన సొమ్ముగాదని విశ్వసించెను. సత్రాజిత్తునకుఁ బ్రసేనుఁడను వాఁడగ్రజుఁడు గలఁడు. అతఁడు పేరాతి వీరుఁడు. వాని పేరు చెప్పిన నెల్లరు భయపడుదురు. కృష్ణుఁడుగూడ వానికివెఱచును. ఇవియెల్ల సత్రాజిత్తు తలపోసి యారత్నంబును ప్రసేనునకిచ్చెను.

ఒకనాఁడు ప్రసేనుడారత్నంబును దలఁదాల్చి వేఁటకు బోయి యెన్నాళ్లకు మరలిరాడయ్యెను. వానికై వెదకిరి. అతఁడు కాననాంతరంబున నొకచోటఁ జచ్చి పడియుండెను. కృష్ణుఁడు స్యమంతకమణి నిమిత్తము ప్రసేనుసిజంపి యారత్నంబును హరించెనను ప్రవాదము రాజ్యమెల్లఁ బ్రాఁకెను. ఆనింద కృష్ణుఁనకు మోయరాకుండెను. కృష్ణుఁడు పూర్వాపరములు పరిశీలించి యొంటిగాఁబోయి వనమెల్ల వెదకి వెదకి యొకచోటఁబడియున్న యారత్నంబును గొనివచ్చి యాదవ ముఖ్యులఁజేర్చి దానినిసత్రాజిత్తునకిచ్చి దూఱుతప్పించుకొనెను.

కొండొకనాఁడు సత్రాజిత్తు నిద్రించుచుండఁగా శతధన్వుఁడనువాఁడు వానినిజంపి యారత్నంబును హరించెను. ఆఘోరకృత్యము యాదవమండలంబునెల్ల నుద్ఘాటించెను. ఆ ధూర్తునకు మరణదండనంబును విధించిరి.

శతధన్వుఁడది విని స్యమంతకమణిని రహస్యంబుగా నక్రూరునిచేతనుంచి వడిగలగుఱ్ఱమెక్కి ద్వారకనుండి పలాయనమయ్యెను. ఆసంగతి రామకృష్ణులకుఁ దెల్పిరి. వారు

వానిని వెన్నాడిరి. శతధన్వుఁడు వారిచేతచావు తప్పించుకొనఁ దలంచి గుఱ్ఱమునుండి దుమికి వనము దూఱెను. వానిగుఱ్ఱము డబ్బాటున నందే పడి చచ్చెను. కృష్ణుఁడు వానిని వెంబడించెను. శతధన్వుఁడు మార్గాంతరముగానక కత్తిదూసి కృష్ణు నెదుర్కొనెను. ఇరువురుఁ గొంతవడిఁ బోరిరి. శతధన్వుఁడు నేలఁగూలెను.

కృష్ణుఁడంతట వానినిలువెల్ల శోధించి స్యమంతకమణిని గానక మరలి వచ్చి బలరామునకుఁ జెప్పెను. అతఁడామాట నమ్మక 'కృష్ణా ! కల్లవచింపవలదు. దానిని నీవేహరించితివి ఛీ ! ఇంతదురాశతగదు. ఇఁక ద్వారకలో నడుగైననిడ'నని పరుషంబులుగాఁ బలికి విదేహపురికిఁబోయి యట మూఁడేండ్లు నివసించెను.

కృష్ణుఁడు వానికిఁగా నెంతయు ఖిన్నుఁడై 'కటా ! రత్నములును గన్యకారత్నములుఁ నెంతటివారినైనఁగలంచునందురు. వేఱునిదర్శనమేల ?' అని తలపోయుచు ద్వారకకు మరలి వచ్చెను. ఆలోన నక్రూరుఁడు ద్వారకను వదలి పోయెను. అతఁడుపోవుటఁ గృష్ణునకుఁ దెలిపిరి. వానినిర్గమణ కారణం బెవ్వరు నూహింపఁ జాలరైరి. వానిని రమ్మని కృష్ణుఁడెన్నో సందేశంబులు పంపెను. అతఁడు రాఁడయ్యెను. వానివర్తనము కృష్ణునకు సందేహముఁ గలిగించెను. కృష్ణుఁడు బలవంతముగా నక్రూరుని ద్వారకకు రప్పించెను. అతఁడు వచ్చినంతటఁ గృష్ణుఁడు యాదవముఖ్యులఁగూర్చి యక్రూరుని బిలిపించి 'మిత్రమా ! అక్రూరా ! నాకుఁబరమమిత్రంబవై

యుండియు నేను వచ్చులోన నిష్కారణంబుగా నీవు ద్వారక నుండి పోవుటేల? ఎన్ని సార్లు చెప్పిపంపినను రాని కారణమేమి? ఈనీవృత్తము నీయెడ సంశయంబు నొదవించుచున్నది. నెంజలి వదలి చెప్పుము. స్యమంతకమణి నీయొద్దనే యున్నది గదా? యని యడిగెను. అక్రూరుఁడు కృష్ణునకుఁ గల్లవచింపనోడి 'కృష్ణా ! చక్కఁగా నూహించితివి'. అని చెప్పి యామణిని గృష్ణునిహస్తంబుననుంచి దానికతయెల్ల వివరించెను. ఆమణికై పెక్కురువ్విళ్లూరిరి. కృష్ణుఁడు వారినెల్ల నిరాకరించి 'మిత్రమా ! దీనిని ధరించుటకు మనలో నీకన్న నర్హులు లే'రని దాని నక్రూరునకే యిచ్చెను. బలరాముఁ డాసంగతివిని తనప్రమాదంబునకు సిగ్గుపడి మరల ద్వారక జేరెను.

### నరకాసురవధ.

ప్రాగ్జ్యోతిషంబును నరకాసురుడనువాఁడు పాలించుచుండెను. అతఁడు మదాంధుఁడై యుత్పథముఁ ద్రొక్కి ప్రజలఁ బీడించుచుఁ బదునారువేల స్త్రీలను బందిచేసెను. వారు చెప్పరానియగచాట్లకుఁ జిక్కి గోడుగోడు మనిరి. నరకాసురుని యునికింజేసి లోకమెల్లఁ బాపానుబంధమై నశించునట్లాయెను. లోకానుగ్రహార్థము వానివధ విధియయ్యెను. కృష్ణుఁడు వానిని సంహరించి బందీకృతలైన స్త్రీలనెల్ల విడిపించి వారికృతజ్ఞతానురాగంబులకుఁ బాత్రుడయ్యెను.

నరకాసురయుద్ధంబున సత్యభామ కృష్ణునకు రథసారథ్యము వహించెనని పురాణము. నాటికాలంబున రాజస్త్రీలు సర్వకళాశిక్షితలగుట దీనివలన సూచిత మగుచున్నది.

నరకాసురుఁడు భూదేవిపుత్త్రుఁడనియు భూదేవి కృష్ణావతారంబున సత్యభామగా జనించెననియు, వాఁడు తనయవసాన కాలంబున సత్యభామతో 'అమ్మా! నీవు తొల్లి భూదేవివి, నేను నీసుతుండను ; నా పేరు నిల్చునట్లు వరమి'మ్మని కోరె ననియు, సత్యభామావరఫలంబుగా వాని మరణకాలంబున నేఁటేట దీపావళిపండుగ చేయుదురనియు కృష్ణుఁడెందఱనో యసురులఁజంపినను వారికెల్లఁ గలుగని యిట్టి విశిష్టమర్యాద నరకాసురునకుఁగల్గిన కారణంబదేయనియుఁ గొందఱుచెప్పుదురు.

నరకమే నరకాసురుఁడని యభివర్ణితమయ్యె ననియు గీతలోఁ జెప్పఁబడిన నరకద్వారములు కామక్రోధలోభంబులను జీకటిగోబలను జయింపవలసినదనియు వానిని గడచిపోవుటకు భగవద్భక్తి యొక్కటే మహాదీపికయగుననియు దీపావళి యనఁగా భక్తిదీపికావళి యని భావంబనియు మఱికొందఱూహింతురు.

జనులు నరకాసురునకు వెఱచి యింటదీపంబునుగూడ బెట్టరైరనియు, వాఁడు చచ్చుటంజేసి యింటింట దీపమును వెలిగించుటయ్యెననియు, ఆదినము వారికి శుభదినంబగుటవలన దానినిఁ బండుగదివసంబుగా గ్రహించిరనియు నిఁకఁ గొంద ఱందురు. పండుగలు ప్రాయికముగా నేకదేశీయములు; దీపావళి శివరాత్రి పెద్దపండుగ లట్లుగావు ; యావద్దేశీయంబులు. కారణంబూహింపనగును.

నరకాసురునివధానంతరము కృష్ణుఁడు శల్యునిఁ బౌండ్రరాజును గాసిరాజును బాణాసురుని సంహరించెను. కృష్ణుఁ

డందఱరాజులను జంపుటఁబట్టి యుద్ధలాలసుఁడా యను పేరి జనించును. కృష్ణుఁడు కయ్యమునకుఁ గాలుద్రవ్వి నిరపరాధిరాజునొక్కనినైనఁ జంపినట్లుగానరాదు ; మఱియు జితుల రాజ్యంబును గోష్పాదమంతయైనను గైకొన్నట్లు లేదు. వాని యుద్ధంబులెల్ల దుష్టసంహార శిష్టరక్షణాత్మకములుగా నున్నవి. రాజ్యలాలసులో కీర్తికాములో పరరాజసంహార క్రీడాప్రగల్భులగుదురు. కృష్ణుని రాజ్యకాంక్షాభోగతృష్ణ లేమాత్రంబులో వానినోటనే విననగు.

## శ్రీకృష్ణతత్త్వము.

ఒకనాఁడు రుక్మిణీకృష్ణు లేకాంతముగా నుండిరి. రాజభోగాదులు ప్రస్తావనకువచ్చెను. కృష్ణుఁడు రుక్మిణితో 'కాంతామణి ! రాజాధిరాజులు నీకరపద్మంబును గోరిరి. శిశుపాలుఁడు నీకుగావగచెను. వానికే నిన్ను నీతమ్ముఁడు నిశ్చయించెను. ఎల్లరనుగాదని నన్నుఁగోరి పెండ్లాడితివి. నీతలంపు తెలియరాదు. ధైర్యపరాక్రమంబులను వలచితివో యనుటకు బరరాజులకు వెఱచి సముద్రాంతరంబున దాగినవాఁడెంత ధీరుఁడో యూహింపనగు. భోగభాగ్యంబులను వరించితివో యనుటకు నాలగాచి జీవించునతఁడెంతభాగ్యశాలియో వానివలన నెట్టి భోగంబులబ్బునో లోకవిదితము. ప్రేమను గోరితివో యనుటకుఁ గృష్ణుఁడు స్త్రీవశవర్తిగాఁడనుట యెల్లరెఱుంగుదురు. గుణవర్తనంబులఁ గాంక్షించితివో యనుటకు నీవల్లభుఁడు నిర్గుణుఁడు. వానికి నిలుకడ లేదు. ప్రేయసీ ! వియ్యమునకుఁ గయ్యమునకు సమతవలయు నందురు. నీవు రాజాధిరాజపుత్త్రికవు ; ఒక్కఁడుగు నేలయైన నాకుగలుగదు. [illegible]ంబును

దేహాభిమానంబును నాకుఁ గడుంగడు దూరంబులు. ఈషణ త్రయంబు నన్నంటదు; నిరంతరాత్మారాముండనై చరింతును. అట్టివానిని వరించుట దుఃఖంబును వరించుటేగాని యొండుగాదు. ఏదియెట్లున్నను మాటైననాలించి ముదముఁ గూర్పవా యనిన స్వతః ప్రమాణబుద్ధినై వర్తింతును. ఒరులవినను. కళ్యాణీ! అజ్ఞానవశంబునఁ బ్రమాదపడితివిగాఁబోలు' నని మేలంబులాడు టగా నాత్మతత్వరహస్యంబును దెలిపెను. కృష్ణతత్వనిర్ణయంబునకు నిప్పలుకులే పరమప్రమాణంబులు.

లీలాఖండము సమాప్తము.



శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.



# శ్రీ కృ ష్ణ చ రి త ము.

## స ం ధి ఖ ం డ ము

### కురుపాండవులు.

ప్రస్తావనకాలంబున నార్యావర్తమందుఁ గురుజాంగలము పాంచాలంబునను రాజ్యంబులు వన్నెక్కియుండెను. ఇప్పటిఢిల్లీపరగణాలు కురుజాంగలంబనియు, ఘూర్వార్ రాజ్యంబు పాంచాలంబనియు, కురువంశ్యులుండుటంజేసి కురుజాంగలంబనియు బాంచాలురుండుటవలనఁ బాంచాలంబనియు వానికి సార్థకనామంబులు గలిగెననియుఁ జెప్పుదురు. కురుపాంచాలురు మొట్టమొదటఁ గూడియుండి తర్వాత కలహాకారణంబునఁ జీలి దేశంబులను బంచికొనిరందురు.

కురుజాంగలంబునకు శంతనుఁడు రాజయ్యెను. వానికి భీష్ముఁడను పుత్త్రుడుదయించెను. శంతనుఁడు సత్యవతియను దానిని మత్స్యదేశాధిపుఁడైన దాశరాజు పెంపుడుసుతను వలచి నిజభావంబును దాశరాజునకుఁ దెలిపెను. దాశరాజు తన పుత్త్రికాగర్భజాతునకు రాజ్యంబునిత్తువని కురుజాంగలాధిపుఁడు ప్రమాణముచేయునేని వానికోర్కెయగునని మాఱుచెప్పి పంపెను. రాజ్యము జ్యేష్ఠపుత్త్రక్రమాగతమగుటయు శ్రేష్ఠ

పుత్త్రుఁడు భీష్ముఁడుండుటయు శంతనుఁడు తలపోసి మత్స్యాధీశునిమతంబు సేయనోపకయు సత్యవతియందలిమరులుఁ బాయలేకయుఁ జింతాక్రాంతుఁడై కృశింపసాగెను.

భీష్ముఁడది విని దాశరాజునొద్దకుఁబోయి 'మత్స్యేశ్వరా ! రాజ్యంబునేగాదు వివాహంబునుగూడఁ ద్యజించితిని. సత్యవతీసంతానమే వంశపారంపర్యముగా రాజ్యాధికారంబు వహించు' నని యగ్నిసాక్షికంబుగాఁ బ్రమాణముచేసి యాజేని నొడఁబఱచి సత్యవతిని దెచ్చి తనతండ్రికి మనఃప్రియంబుఁగూర్చెను.

సత్యవతీశంతనులకుఁ జిత్రాంగద విచిత్రవీర్యులు జనించిరి. అంత శంతనుఁడంతరించెను. చిత్రాంగద విచిత్రవీర్యులు అంబాంబాలికలఁ గ్రమముగాఁ బెండ్లాడి పట్టాభిషిక్తులై నిస్సంతానముగాఁ జచ్చిరి. భీష్ముఁడు మున్నె రాజ్యవివాహంబులరెంటి విసర్జించినఁ కారణంబున గురురాజ్యము పరాధీనమును గురువంశము నామావశిష్టమునగు దుస్థితి యేర్పడెను.

సత్యవతి శంతనుసిఁ బెండ్లాడుటకుమున్ను తండ్రినియోగంబున యమునలోఁ బడవనడుపుచుండఁగా నామెను బరాశరమహర్షి మోహించెను. సత్యవతికి సద్యోగర్భమయ్యెను ; వ్యాసుఁడు జనించెను. ఆకారణంబున వ్యాసుఁడు తల్లిపార్శ్వమునంబట్టి చిత్రాంగదవిచిత్రవీర్యులకు నగ్రజుడయ్యెను.

కురువంశంబట్లు కానుండుటకు సత్యవతి యెంతయు వగచి యంబాంబాలికలఁ జీరి 'పుత్రహీనలైనవిధవలు వంశంబును నిలుపుటకుగా నాపద్ధర్మంబు నాశ్రయించి వారిభర్తల తోఁబుట్టువులవలన సంతానముఁ బడసి వంశంబును నిలుపుట

గలదు. ఇప్పుడు కురువంశము నిర్వంశముగానున్నది. వంశం బునుద్ధరించుట పరమధర్మంబగు. చిత్రాంగద విచిత్రవీర్యుల కన్న మున్ను వ్యాసునిగంటిని. కావున నానియోగంబున మీరు వ్యాసునివలన సంతతిఁబడసి కులంబు నిలుపనగునని బోధించి వారి నొడఁబఱచెను. వ్యాసునివలన నంబ ధృత రాష్ట్రునిని, అంబాలిక పాండురాజును గని కౌరవవంశాంకురంబుల బ్రతిష్ఠించిరి. ధృతరాష్ట్రుఁడు గాంధారరాజపుత్త్రిని గాంధా రినిఁ బాండురాజు కృష్ణునిమేనయత్తయైన కుంతినిని మద్రరాజు సుతయైన మాద్రిని బెండ్లాడిరి.

ధృతరాష్ట్రుఁడు పుట్టుగ్రుడ్డియైనను జ్యేష్ఠుఁడగుటంజేసి పేరునకు వానినే రాజుగాఁజేసి రాజ్యపరిపాలనభారంబును బాండురాజుపయి మోపిరి. పాండురాజు నిజశౌర్యోన్నతులఁ జూపి కౌరవరాజ్యంబునెంతయుఁ బెంపొందించెను. కొండొక కాలంబునకు ధృతరాష్ట్రపాండురాజులకు నంతఃకలహము జనిం చెను. పాండురాజు సకళత్త్రముగా హిమాలయంబునకుఁ బోయెను. అనంతరము వారిగతియేమయ్యెనో యెవ్వరికి దెలి యకుండెను. ధృతరాష్ట్రుఁడు దుర్యోధనాదిపుత్త్రుల నూర్వుర గాంధారివలనఁబడిసి హస్తినాపురమందు సుఖముండెను.

అటఁ బాండురాజు కొండొకనాఁడు వేఁటతమింజని కు రంగరూపంబులఁగవఁగూడియున్న మునిదంపతులను హరిణం బులుగాఁదలంచి యందొకదానిని వైచి చంపెను. రెండవది స్వరూపము వహించి మునియై 'రాజా! నీకార్యము ప్రమాద జనితమని యెఱుఁగుదు. అయినను గవగూడియున్నవానిని వేయరాదు. ఈదోషంబు నీకుఁ దప్పదు. భార్యాసంగమ

భాగ్యంబు నీకు దూరమగుఁగాక'యని శపించెను. ఆకారణం బునఁ బాండురాజు సంతానహీనుఁడై యనపత్యచింత బ్రుంగ సాగెను.

కుంతీదేవి తనపతిచింతాకారణంబును గ్రహించి 'నాథా! నేను నావివాహాపూర్వము సద్యస్సంతాన ప్రదమగు మంత్రంబును మహర్షి వలన గ్రహించితిని. అనుజ్ఞయేని నీచింత దొలంగింతు' ననెను. పాండురాజు పుత్త్రపరిష్వంగ సుఖలాలసుఁడుగావున దానికి నియ్యకొనెను. అంతఁ గుంతీదేవి ధర్మ దేవతనుపాసించి ధర్మనందనుని, వాయుదేవు నుపాసించి భీముని, నింద్రునుపాసించి యర్జునునిఁబడసి, యామంత్రంబును మాద్రికినుపదేశించెను. మాద్రియు నశ్వినీదేవతలనుపాసించి వారివలన నకులసహదేవులను గాంచెను.

పాండురాజు తనయనపత్యదోషనివారణంబునకు సంత సించి భార్యాసుతులతో సుఖముండెను. కొండొకనాఁడు కుంతీదేవి కార్యాంతరతత్పరయై యుండెను. అప్పుడు పాండు రాజు మాద్రితో నేకాంతముండి మదనవివశుఁడై యామెయిం తితో బలవంతముగా రమించి పూర్వశాపహతుఁడై తనువు వాసెను. మాద్రి తనయపరాధప్రాయశ్చిత్తంబుగాఁ బతి తోడ సహగమనంబొనర్చెను. కుంతి యాపుత్త్రకుల నేవు రను ఋషులసాహాయ్యంబునఁ బెంచుచుండెను.

*ధర్మనందనుఁడు పుట్టిన యేడాదికి భీముఁడు జనించెను. భీముని జననమును దుర్యోధనుని జననము నొక్కనాఁడేగావున వారిరువురును సమానవయస్కులు. కృష్ణుఁడు భీమునకన్నఁ

గొన్నాళ్ళు ముందుపుట్టెను. అయినను భీమదుర్యోధనకృష్ణులు సమానవయస్కులే యగుదురు.

* మంత్రశక్తిని శంకించువారుందురుగాని దానితత్త్వమును గ్రహింతురేని సంశయంబునకే యవకాశముండదు. ఈశ్వరశక్తి యెల్లలోకంబును వ్యాపించి యున్నది. దానిని యంత్రమంత్రములచేఁ స్వాధీనపఱచికొని యిష్టకార్యంబుల సాధింతురు. ఆశక్తిని యంత్రమూలమున వశపరచుకొని యెంతటికార్యంబులఁ జేయనగునో యిప్పటియంత్రముల వలననే మనకు స్వానుభవము. యంత్రస్థానమున మంత్రము; అంతియగాని వేఱుగాదు. యంత్రమనఁగానేమి ? అదియు మనఃకల్పితమేగాని యన్యముగాదు. మంత్రముగూడ మనఃకల్పితమేయగు. యంత్రము బాహ్యేంద్రియాదృశ్యము ; మంత్రమన్ననో యంతరింద్రియమాత్రదృశ్యము. ఈరెండింటికిఁగలభేదము తావన్మాత్రమే. ఒక్కొక్కకార్యంబునకు నొక్కొకరూపమైన యంత్రముపయోగించును. ఎల్లకార్యములకు నొక్కరూపయంత్రమే గొఱగాదు. అనఁగా శక్తి యొక్కటే యైనను యంత్రభేదమును బట్టి దానికిఁ బ్రయోగవినియోగభేదములు గలుగుచున్నది. అట్లే మంత్రముగూడ నొక్కొక్క కార్యంబునకు నొక్కొక్కరూపమైన యుపాధి నాశ్రయించి కార్యముఖమగు. ఈయుపాధినే యధిదేవత యందురు. యంత్రమునకుఁ గీళ్లు జీవములైనట్లు మంత్రమునకు బీజాక్షరంబులు జీవములగు. కీలుసడలినప్పుడు యంత్రంబపమార్గముఁ ద్రొక్కునట్లే బీజాక్షరసంపుటి తప్పినప్పుడు మంత్రంబనర్థ కారియగు.

* మంత్రశక్తిని మన పెద్దలు గ్రహించి గొప్పశాస్త్రము రచించిరి. దానినే యథర్వవేదమందురు. అందుఁజెప్పినట్లుగా నాయామాయధిదేవతలను బీజాక్షరసంపుటితో జపించినచో నాయాకార్యము సిద్ధించును. మంత్రశక్తి యంతో యింతో నేఁడును బాముకాటు మున్నగువానియందు మనకుఁ బ్రత్యక్షగోచరము. మంత్రశక్తి యట్టిదైనప్పుడు దానినాశ్రయించి కార్యసిద్ధిఁ బడయుట యందు వింత యేమి గలదు? విశేషము గానున్నశక్తిని యంత్రము వలె మంత్రముగూడఁ గేంద్రీకరించును. కార్యము స్వతస్సిద్ధమగు. విశేషాంశంబులను యంత్రశాస్త్రంబునవలె మంత్రశాస్త్రంబున గ్రహింపనగు.

కొండొకనాఁడు ధృతరాష్ట్రుఁడు సింహకొలువై యుండగా ఋషిపుత్త్రులు కొందఱు పేవురుమగశిశువులతోడ నొకస్త్రీతోడ వానియొద్దకు వచ్చి 'రాజా! ఈమె కుంతీదేవి; ఈశిశువులు పాండునందను'లని చెప్పి వివరంబుఁ దెలిపిరి. ధృతరాష్ట్రుఁడు భ్రాతృవియోగంబునకు దుఃఖపడి యాబిడ్డలను పసబిడ్డలుగా గ్రహించెను. భీష్మవిదురులు వారినెంతో గారాబంబునఁ బెంచుచు దుర్యోధనాదులతోడ వారికిని సకలవిద్యలు గఱపిరి. అర్జునుఁడు సాటిలేనిమేటివిలుకాఁడయ్యెను. గదాయుద్ధంబున భీమదుర్యోధనులు అద్వితీయులైరి. ధర్మనందనుఁడు నయవినయ ఋజువర్తనంబుల నెల్లరకు నల్లారుముద్దయ్యెను. పాండురాజునందలి ప్రజానురాగము వానిపుత్త్రులయెడ మూర్తీభవించెను.

పాండవులవర్తనంబు నాటినాటికిఁ బ్రజాహ్లాదయం బధిష్ఠించెను. కౌరవులుగర్వమునఁజేసి దినదినమునకుఁ బ్రజకు

దూరము కాసాగిరి. పాండవులపయి నీర్ష్యామత్సరంబులు దుర్యోధనునియెదలో నంకురించెను. వారు జీవించుట తన కెంతయుహానికరమని యతఁడు నిశ్చయించెను. అతఁడు న్యాయాన్యాయంబులు విడనాడి పాండవవినాశార్థము బహుప్రయత్నంబులు గావించెను. పాండవులు కాలమునకుఁ గట్టువడి దుర్యోధనుని దుర్నయంబులెల్ల సహించుచు వానిప్రేమకై యెంతో శ్రమింపఁ జొచ్చిరి. ఎందునను వానికి వారియెడ గరుణ యుదయింపకుండెను. ఆసమయమందే యక్రూరుఁడు హస్తినాపురమునకు వచ్చి పోవుట తటస్థించెను.

## లాక్షాగృహము.

పాండవులకు విషముపెట్టిరి. భీముని నీటఁద్రోసి సర్పాబులచేతఁ గఱపించి యేనుఁగుకాళ్ల ద్రొక్కించిరి. ఎందునను వారికిఁ జావు కలుగదయ్యెను. దుర్యోధనుఁడంతట మిత్రులతో సంప్రతించి వారణావతంబున లక్కయిల్లు కట్టుటకై పురోచనుఁడను శిల్పిని బంపెను.

పురోచనుఁడు వానిపనిని బూర్తిచేసెను. పాండవులను గుంతితోడ నటకుఁ దరలించిరి. విదురుఁడు దుర్యోధనుని దురుద్దేశ్యంబు నెఱింగుటంజేసి రానున్నముప్పును గూఢముగా ధర్మనందనునకు సూచించెను. పాండవులు వారణావతముఁ జేరి యాగృహముఁ బ్రవేశించిరి. ఆరాత్రి వారితోడఁ బురోచనాదులుగూడ నందేపరుండిరి. అర్ధరాత్రంబున లాక్షాగృహము దగ్ధమాయెను. దగ్ధశరీరంబులను దెల్లవారి పరీక్షించిరి. పాండవులు కుంతీసహితంబుగామడిసిరని నిశ్చయించిరి. ఆవార్త

క్షణములో హస్తినాపురంబునందెను. భీష్మాదులు దుఃఖవశు లైరి. దుర్యోధనునిసంతోషంబు పట్టరానిదయ్యెను.

ద్రుపదుఁడు.

అక్కాలంబున ద్రుపదుఁడనురాజు పాంచాలంబును పాలించుచుండెను. అతఁడును ద్రోణాచార్యులును బాల్య మందొక్కగురువునొద్ద విద్యగఱచిరి. ద్రుపదుఁడు రాజయిన తర్వాత ద్రోణుఁడు బడిచెలిమిం బురస్కరించుకొని వాని యొద్దకుఁ బోయెను. ద్రుపదుఁడు రాజ్యమదాంధీభూతుఁడై తనసహపాఠిని గౌరవించుటకు మాఱుగా నవమానించెను. ద్రోణుఁడది మదినిడి కౌరవులఁ జేరి వారికి గురువై వారివలన ద్రుపదుని బట్టి తెప్పించి యగడుపఱచి వదలెను. కౌరవులు ద్రుపదునిరాజ్యమందు సగము గైకొనిరి. అదిమొదలు ద్రుప దుఁడు కౌరవులయెడఁ బగపూనెను.

ద్రుపదునకు ద్రౌపదియను పుత్రికయు ధృష్టద్యు మ్నశిఖండులను పుత్త్రులును గల్గిరి. ద్రౌపది యసాధారణ రూపవిలాస సంపదయు నిఖిలకళ్యాణగుణభాగ్యంబును గలిగి నాఁటిరాజన్యుల చిత్తంబు నాకర్షించెను. ఆమెకై నానా రాజకుమారులు ద్రుపదునొద్దకు సందేశంబులఁ బంపసాగిరి. పాండవులు మహాబలపరాక్రమ సంపన్నులగుటయు వారిలో నర్జునుఁడు శరవిద్యావిశారదుఁడగుటయు ద్రుపదు డెఱుంగుఁ గావున వారిసహాయ్యంబునఁ గౌరవులను సాధింపనిశ్చయించి పాండవ మధ్యములో వియ్యమందనెంచి యన్యరాజకుమారకుల సందేశంబులను నిరసించుచుండెను. పాండవులు లాక్షాగారం బునదగ్ధులైరనిరి. అందులకు ద్రుపదుఁడు మహాచింతాక్రాం

తుఁడై తనభావంబును దిగనాడి పుత్రికావివాహంబునకు మార్గము వెదుక సాగెను.

## ద్రౌపదీ స్వయంవరము.

ఒకనాఁడు ద్రుపదుని మంత్రులును బంధువులును మిత్రులును గూడి సకలరాజకుమారక సందేశంబులను బరిశీలించి కులమర్యాదను బట్టి స్వయంవరకల్యాణమే ద్రౌపదికి యుక్తమని నిశ్చయించిరి. లాక్షాగృహంబున నర్జునుఁడు దగ్ధుఁడైనఁ దద్వాత నంతటియల్లుఁడు గల్గినచోఁ గౌరవులమీఁదికి తనపగసాధింపనగునని ద్రుపదుఁడుండెను. ఎందువిచారించిన నంతటివాఁడు గానరాఁడయ్యెను. ఆకారణంబున ద్రుపదుఁడు మార్గాంతరముగానక మంత్రులతాత్పర్యంబునంగీకరించి రానున్నయల్లుని పరాక్రమంబుఁ బరీక్షించుటకై భూరిచాపంబొకటి నిర్మించి యంతరిక్షంబున మత్స్యయంత్రంబును గట్టించి 'ఎవఁడా చాపంబును జేఁబట్టి నీడమచ్చెమును జూచి నింగి మచ్చెము నేయునో వానికి ద్రౌపది భార్యయగు'నని చాటించెను.

హస్తినాపురంబునుండి దుర్యోధనాదులును మగధనుండి జరాసంధుఁడునుఁ జేదిదేశంబునుండి శిశుపాలుఁడును దేశదేశాంతరంబులనుండి నానారాజకుమారకులును విచ్చేసిరి. రామకృష్ణులుగూడ స్వయంవరదర్శనోత్సుకులై యరుదెంచిరి. ద్రౌపది మంగళస్నానమాచరించి సాలంకృతయై పూదండతోడి పసిండి పళ్లెరంబును గైకొని చెలులఁగూడి స్వయంవరమండపంబుఁ బ్రవేశించెను. కృష్ణుఁడు సభామండపంబునెల్లఁ గలయం జూచి 'అన్నా! బలరామా! నేఁడు గొప్పవింతఁ జూతువు' మనెను.

రాజపుత్త్రులొక్కొక్కరుగా లేచి పోయి కార్ముకంబు నంటి యెత్తలేక కొందఱును మోపెట్టఁజాలక కొందఱును మరలివచ్చి పరిహాసభాజనులైరి. కర్ణుఁడంతట లేచిపోయి చాపంబు నెక్కుపెట్టి శరసంధానంబుఁ గావింపనుండెను. ద్రుపదుని మోము నల్లవాఱెను. దుర్యోధనాదులు సెబాసు కాని మ్మనిరి. ద్రౌపది తలయెత్తి చూచి శరసంధానంబునకుఁబూని యున్న యతఁడు కర్ణుఁడగుట చెలులవలన విని 'సూతునివరింప నొల్ల'నని పలికెను. కర్ణుఁడామాటకు విసువు నేవగింపువహించి వింటిని బాఱవైచి వచ్చి కూర్చుండెను.

ఇతరులు వింటివంకనైనఁ జనరైరి. సభాంతరాళమెల్ల మాటుమణఁగినట్లయ్యెను. ఒకరినొకరు చూడసాగిరి ; సభలో నుండి యవమానంబును గుఱుచుటకన్న మోము తప్పించుట మేలనుభావము తలసూపెను. రాజకుమారకులు కొందఱు ప్రయాణంబునకు వస్త్రాదులు సవరింపఁదొడఁగిరి. స్వయం వరమే యాగిపోవునట్లు తోఁచెను. ఒకవంక ద్రుపదుఁడు నొకవంక ధృష్టద్యుమ్నుఁడును దలలు వ్రాల్చి కూర్చుండిరి.

ఆసభయందు బ్రాహ్మణులకుగాఁ బ్రత్యేకస్థానము నిర్ణీతమైయుండెను. అచ్చట నానాదేశాగతులైన బ్రాహ్మణులు కూర్చుండి తలకొకమాటగా గుసగుసలాడుచు సంభావనప్రాప్తి సున్నయ్యెనని వెలవెలనైరి. అంతలోన వారిమధ్య నుండి యువకుఁడొకఁడు లేచెను. వానిని గాంచి యావిప్రులు మహాశ్చర్యకోపపరీతులై 'అహో! వీరాతివీరులైన రాకుమారకులు శరాసనకర్మంబునకు జాలక వీగిపోవుచుండఁగా నితఁ డెవ్వఁడో తనశక్తి నెఱుంగక ముందునకువచ్చెను. విప్రవంశం

బునకుఁ దలవంపుఁ దేఁగోరెఁ గాఁబోలు' ననుచు వానిపయి నిందాపరిహాసంబులు వర్షించిరి. ఆయువకుఁడు వారిని బాటి సేయక చాపంబుడాయఁబోయి గురువృలకు నమస్కరించి కార్ముకంబును వలగొని దానినెక్కు వెట్టి బాణంబుఁగూర్చి ఛాయామత్స్యంబునుజూచి యంత్రమత్స్యంబు నేసెను. నింగి మచ్చెము తెగి నేలరాలెను.

బ్రాహ్మణులు లేచి బళిబళీయనుచు సంతోషపరవశత్వంబున నుత్తరీయంబులను విసరిరి. సభామంటపంబెల్లఁ గరతాళధ్వనుల మాఱుమోఁగెను. రాజపుత్త్రుల వదనంబులు నిట్టూర్పుఁజొచ్చెను. మంగళవాద్యంబులు బోరుకలఁగెను ; బట్టులు పొగడిరి ; పురోహితులు దీవించిరి. ద్రౌపది మందమందగమనంబున నయ్యువకుని డాయవచ్చి వానికంఠంబునఁ బుష్పదామము వైచెను.

రాజపుత్త్రులది గాంచి 'కటా ! ఇందఱురాకుమారకులుండఁగా ద్రౌపది పేదపాఱుని సొమ్మయ్యెనా? ఇది రాజకులంబునకెల్లఁ దలవంపుగదా ? ఈమచ్చమాపుకొననగు' నని తలంచి ద్రౌపదిని బలాత్కారంబుగా హరింపనుద్యుక్తులైరి. కృష్ణుఁడు వారికుహనాభావంబు నూహించి మునుపడవచ్చి సభవంకమరలి 'ఈబ్రాహ్మణబ్రువుఁడు న్యాయముగా నార్జించిన ధనంబు నన్యులాసించుట ధర్మముగా'దని ఘంటాస్వనంబున నుడివెను. ధర్మంబునకును గృష్ణునిబలంబునకును వెఱచి యెల్లరుఁ జల్లపడిరి. అతఁడెవ్వఁడను శంక జనించెను. పాండవమధ్యముండను శబ్దము సభాంతరంబున నుప్పతిల్లెను. ద్రౌపది యానందాబ్ధి మునిఁగెను. ద్రుపదునిసంతోషంబునకు మేర

మీాతెను. కౌరవులుగుదిలపడిరి. దుర్యోధనునిమోము విన్న నయ్యెను ; శకుని వెలవెలఁబాఱెను. భీష్మద్రోణకృపవిదు రాదుల నయనంనబు లానందాశ్రువులు గురిసెను. ఎచ్చటి వారచ్చటకుఁ జనిరి.

## కృష్ణపాండవుల ప్రథమసమావేశము.

తెల్లవాఱినంతటఁ గృష్ణుఁడు లేచి నిత్యకృత్యములు దీర్చి యాయువకుఁడు విడిచియున్న కుమ్మరి యింటికిఁ బోయి యందున్న కుంతీపాండవులకుఁ దన్నెఱింగించికొని మేనత్తకు మ్రొక్కి 'ధర్మనందనా ! మిమ్మిచ్చటఁ జూచుకల్మి నాకుగల్గి నందులకు నెంతయు సంతసింతు. కుంతీసహితంబుగా మీారు హస్తినాపురముచేరుటవినియుఁ గార్యాంతరప్రసక్తింజేసి స్వయముగా రాఁజాలక యక్రూరుని బంపితిని. వానివలన మీా యోగక్షేమంబు లెఱింగితి. మిమ్ముఁ జూచుకుతూహలంబున నుంటి. అంతలోన మీారు లాక్షాగృహమున దగ్ధమైనవార్త వినవచ్చెను. ఆకఠోరవార్త నాహృదయంబు నగలించెను. నిన్న సభామండపంబున నర్జునునిపోలిక లక్రూరునివలన విన్నవి యితనియందుఁ దోఁచెను. దైవయోగంబు వేఱనిభావించితి. లక్క యింటినుండి యెట్లుతప్పించుకొని బ్రతికితిరో గదా' యనెను.

నావుడు 'కృష్ణా ! దుర్యోధనుఁడు మాకుఁగా వారణావతంబున దివ్యగృహంబొకటి కట్టించి యటకు మమ్ముఁబొమ్మనెను. వాని యీర్ష్యాసూయలకు గుఱియై యతనికట్టెదుట నుండుటకన్న దవ్వగుట మేలనితోఁచి యటకుఁ దరలితిమి. విదురుఁడు మామేలుగోరువాఁడుగావున మమ్మటకు సాగనం

పుచు మాకు రానున్నముప్పును సూచించెను. దుర్యోధనుని రహస్యంబు నూహించితిని. వారణావతంబుఁ జేరినంతనే భీముఁడు లాక్షాగృహంబున సొరంగముఁ దొలిచి కప్పియుంచెను. గృహ ప్రవేశమైతిమి. ఆగృహమును నిర్మించిన శిల్పి పురోచనుఁడును మఱియొకస్త్రీ తనయేవురుబిడ్డలతో నాటిరాత్రి యందే పరుండిరి. మేము నిద్రావశులమైయుండఁగా నయ్యింటికి నగ్ని దరికొల్పిరమ్మని పురోచనునకు దుర్యోధనుని యాజ్ఞయఁట. ఆ కారణంబున నతఁడా రాత్రియందే పరుండెను. అర్ధరాత్రమైనంతట భీముఁడా యింటికి నగ్గిఁ జొన్పి భూగర్భద్వారంబున మమ్మెల్ల వెడలించెను. అట్లు బ్రతికివచ్చితిమి. పురోచనాదులు దగ్ధులైరి. తెల్లవారి దగ్ధశరీరంబులఁ గాంచి పురోచనునితోడ మే మేద్గురము నశించితిమని తలంచిరి. ఆస్త్రీయును దాని యేవురుబిడ్డలు నాటిరాత్రి యటఁ బరుండుట యెవ్వరెఱుఁగరు. మా కత యిది' యని ధర్మనందనుఁడు చెప్పి వెచ్చనూర్చెను.

కృష్ణుఁడా కతయెల్ల విని 'ధర్మనందనా ! విధివిధానంబు నూహింపరాదు. మన మొక్కటి తలంచిన దైవము వేరొక్కటి సేయు,నని పలికి వారిని సంభావించి కుంతీధర్మనందనులకు మ్రొక్కి యర్జునాదుల గాఢాలింగనపురస్సరంబుగా నాదరించి వారినీడ్కొని ద్వారకకుఁ బోయెను.

### కౌరవదుర్మంత్రము.

ద్రౌపదీస్వయంవరవిశేషంబులు హస్తినాపురంబునకుఁ బ్రాఁకి ధృతరాష్ట్రుని గుండియలగల్చెను. ద్రుపదుని వైరంబును బాండవులు వారికిఁ దోడగుటయు నతఁడు తలంచి మహాదైన్య మ్మొంది దుర్యోధన,దుశ్శాసన, శకుని,కర్ణుల రావించి 'నాయనా!

దుర్యోధనా ! పాండవులతోఁ బగవలదన్న నామాట వినవైతివి. వారిని వెనుకాములఁగుడిపితిరి. ద్రుపదుఁడు మనయెడఁబగ బూని యుండుట నీకుఁ గ్రొత్తగాదు. వానికిఁ బాండవులు తోడైరి. ఇది తలంచుకొనలేఁది భయమయ్యెడు' అనిచెప్పెను.

దుర్యోధనుఁడు వానిని విని 'తండ్రీ ! నిన్నునిష్కారణ భయంబు వెన్నాడుచున్నది. పగతు నోర్చునుపాయంబు లెన్నోగలవు. మిత్రభేదంబు నాశ్రయించి ద్రౌపదీపాండవు లకుఁ బరస్పరవైమనస్యంబులఁ గలిగింపవచ్చు. కౌంతేయు లకును మాద్రేయులకు నన్యోన్యవైరంబులఁ బెంపనగు'ననెను. కర్ణుఁడదివిని 'నీచెప్పినవెఱవులు వ్యర్థంబులు. విక్రమంబుదక్క నన్యంబులు గొఱరా' వనెను.

ధృతరాష్ట్రుఁడు వారినిబంపివైచి భీష్మాదులను రావించి వారికి దుర్యోధనాదుల మతంబును దెలిపెను. వారందులకు నెంతయుఁ జింతపడి బహువిధంబుల ధృతరాష్ట్రునకు ధర్మోప దేశంబులు గావించిరి. అవియెల్ల నడవిఁగాచిన వెన్నెలట్ల య్యెను. పుత్త్రుని మానంబు సేయుటయే పరమధర్మంబని ధృత రాష్ట్రుఁడు నిశ్చయించెను.

### అర్జునుని తీర్థయాత్ర.

పాండవులు తల్లియాజ్ఞను నారదోపదేశంబును గౌర వించి యేవురును సమయప్రకారము ద్రౌపదితో సుఖముం డిరి. ఒకనాఁడు బ్రాహ్మణుండొకఁడు పాండవులున్నమందిరంబు నకు వచ్చి 'అయ్యా ! నాగోవును దొంగలు ముచ్చిలిరి. దాని కాపాడ వాఁడు లేక నిన్నటఁగోలె నఱచుచున్నది. శరాసనముఁ

గైకొని వెంటనే నావెంటరానగు' నని పెనుగొాదచేసెను. అర్జునుఁ డావిప్రుని దుఃఖంబుఁదీర్చుతమకంబునఁ దమసమయంబు నుల్లంఘించి ధర్మరాజున్నగది మీఁదుగా నాయుధాగారంబు నకుఁ బోయి నిజకార్ముకంబును గైకొని యాపాఱునివెంటఁజని మ్రుచ్చులను హరించి ద్విజునిఁ దనిపి మరలి వచ్చి ధర్మరాజు నకు మ్రొక్కి 'అన్నా ! మర్యాదాభంగముఁ గావించితిని. తత్ప్రాయశ్చిత్తంబుగా ద్వాదశమాసిక తీర్థయాత్రావ్రతంబు నాచరింతు. అనుజ్ఞ వేఁడుదు' ననెను. ఎట్టకేలకు ధర్మనందనుఁ డనుమతించెను. అర్జునుఁడు బయలుదేరి సకలతీర్థంబులను సేవించి కృష్ణసందర్శనోత్కంఠుఁడై ద్వారకకు వచ్చెను. వాని రాకను గృష్ణుఁడు విని యెదురేగి వానిని దోడితెచ్చెను.

## సుభద్రా వివాహము.

ఆసమయంబున రైవతకాద్రి మహోత్సవము జరుగు చుండెను. ఆపర్వతము వివిధదీపికా సముద్దీపితమై మధుర గానంబులతో నటీనటాభినయనంబులతో నానారూపక్రీడ లతోఁ జెలువారెను. యాదవయువతీయువకులు దివ్యవస్త్రా భరణ భూషితులై యుత్సవదర్శనార్థము సురలోకంబుననుండి వచ్చిన దేవతలోయన నద్రితలంబెల్ల విహరించుచుండిరి.

కృష్ణుఁడర్జునుని తోడ తన్నగంబునకుఁజని వానికి నా యావిశేషంబులఁ జూపుచు నొకచోటికి వచ్చెను. అటఁ గొందఱు లీలావతులు గూడి యాడుచుఁ బాడుచు నుండిరి. వారిలో నొకతె యర్జునుని దృష్టినాకర్షించెను. కృష్ణుఁడది గ్రహించి 'అర్జునా ! స్త్రీసందర్శనము సన్యాసినిఁ గూడఁ

గలంచునా ?' యని యుల్లసమాడి 'సఖా ! ఆమె నాచెల్లెలు సుభద్రాదేవి. నాతండ్రి ప్రేమ యామెయెడ మూర్తిభవించి యుండు. నీవుత్రిశుద్ధికి సుభద్రను వలతువేని నీతలంపు నా తండ్రికిఁ దెలుపుదు' ననెను.

నావుడు 'కృష్ణా ! సుభద్ర సుభద్రయేయగు. ఈ సుందరీమణి నామనంబును హరించెను. ఈయింతిని నాకుఁ గూర్తువేని సర్వలోకాభ్యుదయంబులను నాకు నొసంగుటగు' ననెను. కృష్ణుఁడు తలయూచి 'అర్జునుఁడు సుభద్రను వరించెను. ఆమెయు నితనిఁ బ్రేమించినట్లు తోఁచును. పాండవులు రాజ్య హీనులనియు వారిపుట్టు పూర్వంబులు సంశనీయంబులనియు వృష్ణికులంబు తలంచుచున్నది. అట్టి వారితోడి వియ్యము వారికి సమ్మతముగాదు. వారుసమ్మతించినను బలరామవసుదేవు లంగీకరింతురను నమ్మకములేదు' అని లోలోనఁ దలపోసి 'మిత్రమా ! సుభద్రకు స్వయంవర వివాహంబును సంకల్పించిరి. అదినీతలంపునకు ననుకూలింపదు. కన్యాహరణము రాజులకు నంగీకరించిరి. అది శూరమార్గమని శ్లాఘింతురు' అని నిజాభిప్రాయంబును సూచించి, యాసంగతిని ధర్మనందనున కు రహస్యముగా నెఱుకపఱచి వానియనుమతిని బడసెను.

ఒకనాఁడు వృష్ణికన్యకలు సుభద్రాసహితంబుగా విహారార్థము రైవతకాద్రికిఁ జనిరి. అర్జునుఁడది సమయంబుగా నెంచి కృష్ణుని రథంబెక్కిపోయి వారు మరలివచ్చునప్పుడు వారి నడుమఁ గ్రొమ్మెఱుంగువలె నున్న సుభద్రను గయిపట్టి తేరెక్కించి యింద్రప్రస్థమార్గముఁ బట్టెను.

అర్జునునిసేతఁకు ద్వారకయెల్ల నుడ్డుడికెను. సభాపా లుఁడు జయభేరిని మ్రోయించెను. భోజాంధకవృష్ణివీరులు సాయుధులై పరుగెత్తి వచ్చిరి. ఆజ్ఞయయ్యెను. పట్టుఁడు కొట్టుఁడను కేకలు చెలరేఁగెను. అంత బలరాముఁడు కృష్ణుని వంకమరలి 'కృష్ణా! అర్జునుఁడింతపని నీయెఱుక లేకయేచేసెనా?' యనెను. కృష్ణుఁడు వానిభావంబును గ్రహించి 'అన్నా! అతఁడు సర్వధర్మజ్ఞుఁడు; మీఁదుమిక్కిలి పాండవసింహము. అంతియగాదు. మనమేనత్తకొడుకు. మేనమఱఁదలిని దోడ్కొ నిపోయెను. ఇందేమి వింతగలదు. మీతలంపులనుడుగుఁడు. ద్రోణాచార్యశిష్యుఁడును జితకాశియునైనవాఁడు మీకు సులభ సాధ్యుఁడు గాఁడ'నెను.

ఆమాటకు బలరాముఁడు కోపపడి నీకుగావృష్ణికులము వానిని గౌరవించెను. అమ్రుచ్చు తనపాదంబును మనతలపై మోఁపెను. ఇంతకన్న మానభంగముకలదా? యనెను. కృష్ణుఁడు వానినివిని 'అన్నా! అర్జునుని వలన మనకు మచ్చ వచ్చినట్లు తలంతువు. ఆభావముసరిగాదు. వానివలన మన కీర్తి దిగంతమయ్యెను. ఎట్లందువా? మనము యాశకుఁగాఁ గన్యలను విక్రయించువారముగాము. కన్యాదానంబు నర్జు నుఁడు గ్రహించువాఁడుగాఁడు. సుభద్రార్జునులు పరస్పరాను రాగవశులైరి. కన్యామనంబునకువిరుద్ధముగా వివాహముచేయ రాదు. స్వయంవరమందువా! సుభద్రాస్వయంవరంబున ద్వారక యెన్నో కడగండ్లపాలగు. అదిమీరెవ్వరును దలంపరైరి. అర్జునుఁ డివియెల్ల విమర్శించి కన్యాహరణమార్గముఁ ద్రొక్కెను. అది రాజవంశ సంప్రదాయమేగదా? ఆసంగతి యటుండనిమ్ము.

కన్యను దగువరునకిచ్చుటకంటె సంతోషకరకార్యము తలిదండ్రులకు నన్నదమ్ములకుఁ గలదా ? అర్జునునికన్న మంచివరునిఁ దేఁగలమా ? సుభద్రార్జునులదాంపత్యము పరస్పరశోభావహముగాదా ? వేయేల! అర్జునుఁడు భర్తయగుట సుభద్రాసుకృతవిశేషమగు. అందులకై యానందించుటకు మాఱుగా నతనిపయి దాడితలంతురా ? వానిని జయించుట కల్ల. వానికి నోడితిమేని మనకీర్తి యంతతో నంతరించు. వానిచెలిమి మనకెంతయు మేలగు' ననెను. యాదవులు కృష్ణుని తలంపు గ్రహించి యర్జునునొద్దకుఁ బోయి వానిని సుభద్రా సహితంబుగాఁ దోడితెచ్చి యయ్యెరుపురకు వివాహమంగళంబొనర్చిరి.

### మయసభామందిర నిర్మాణము.

ధృతరాష్ట్రుఁడు భీష్మాదులను నొప్పింపనోపకయో మఱియేకారణంబుననో పాండవులకు నొక్కింతనేలను యమునాతీరమందిచ్చెను. అది కీకారణ్యమగుట దానినిఁ జక్కచేసి యందుఁ బురంబును నిర్మించుకొనుట పాండవులకు విధియయ్యెను. ఆవనమందొక ఖండంబును ఖాండవంబందురు. అందు నగరనిర్మాణంబును సంకల్పించిరి.

ఒకశుభదినంబున జనులు దానిని జక్కచేయుటకై ఖడ్గకుఠారంబులతోఁ దరలిరి. అప్పుడు కృష్ణుఁడు సుభద్రను దోడ్కొని వచ్చియున్నవాఁ డర్జునునితోడ నవ్వనంబునకుఁ బోయెను. దానికి నగ్నిదరికొల్పిరి. మంటలు మింటికెగసెను. పక్షులఱచుచు నెగసి ఱెక్కలు కాలి రాలెను ; మృగంబులు ఘోరారావంబులు గావించుచు నటునిటుఁ బఱచుచుఁ ద్రోవ

గానక యందే చిక్కి మసియయ్యెను. ఎవ్వఁడో యొకఁడు వన్యుఁడామంటలోఁ జిక్కి కుయ్యిడ సాగెను. అర్జునుఁడు వానిని గనికరించి రక్షించెను.

అతఁడు ప్రాణభయంబువాసి రక్షకుని యొద్దకు వచ్చి 'అయ్యా ! నీవలన బ్రతికితి. నావలన నెద్దియేనిఁ బ్రయోజనం బున్నఁ జెప్పనగు. నన్ను మయుఁడందురు ; మీరెవరో యూహింపరా' దనెను. అర్జునుఁడు వానిని విని 'మయా ! వీనినిఁ గృష్ణుడందురు ; నన్నర్జునుఁడందురు ; పాండవమధ్యముఁడను. నీవినయోక్తులేమాకుఁ బదివేలయ్యెను. మాయెడ మైత్రి నున్నఁ జాలు'ననెను. అనవుఁడు 'భరతాగ్రణీ ! మీవంశం బునకుఁ దగినట్లే నుడివితివి. కృతజ్ఞతాఋణముఁ దీర్పకుండ రాదు. పురనిర్మాణంబును మీరిచ్చట సంకల్పించితిరని మీ యీకార్యంబున నూహింతు. శిల్పంబున నాకుఁ గొంత నేర్పు గలదు. నన్ను దానవవిశ్వకర్మయనియు వచింతురు. నావలన నేదేనొకపనిఁగొని నాకు ఋణవిముక్తిఁ గావింపవేడుదు'ననెను. అర్జునుఁడు వానిప్రణయంబు విని 'దానవాగ్రణీ! నీవలనఁ బ్రత్యుపకృతిని గొనరాదు. కృష్ణునకుఁగా నీయిచ్చవచ్చి నది సేయుము. అది నాకుఁజేయుటే' యనెను.

మయుఁడు కృష్ణుని వంకమరలి 'అయ్యా ! సెలవీయ వేడుదు' ననెను. కృష్ణుఁడు తలయూచి 'శిల్పకాగ్రణీ! మాకు మేలుచేయు తలంపు నీకుఁగలదేని ధర్మనందనునకుఁ దగినట్టి సభామందిరంబును నిర్మింపుము. అది నీశిల్పనైపుణ్యంబునకు మేరగాఁదగు'నని వలికి వానిని ధర్మనందనునొద్దకుఁ గొని

పోయి సంగతియెల్ల వినిచెను. పాండవాగ్రజుఁడు మయుని సముచితవిధంబున సత్కరించి యకార్యంబునకు నియమించెను.

సభామందిరనిర్మాణసంకల్పంబు కృష్ణునకుఁ గల్గుటేలనో, ఆసభానిమిత్తంబున నేమిరానున్నదో ధర్మనందనాదులెవ్వరు నూహింపఁజాలరైరి.

### రాజసూయయాగవిచారము.

పాండవులట్లు ఖాండవవనంబును దహించి యట నింద్రప్రస్థపురంబును నిర్మించిరి. మయుఁడచ్చట ధర్మనందనునకుఁ గాఁ గృష్ణునాదేశప్రకారము సభామందిరంబు నపూర్వవిధంబున రచించెను. పాండవులాపురంబును ముఖ్యపట్టణంబుగాఁ జేసి వారిబలశౌర్యోన్నతులవలన రాజ్యంబును వృద్ధిపఱచిరి. ఇంద్రప్రస్థరాజ్యంబు క్రమాభివృద్ధిఁగాంచి నిరుపమబలభాగ్యోన్నతుల హస్తినాపురరాజ్యంబును దలదన్నెను. ధర్మనందనుని రాజాధిరాజుగాఁ బెక్కురాజు లంగీకరించిరి. వాని కోశము నిండి బూరటిల్లెను.

ఇంద్రప్రస్థరాజ్యమహోన్నతిని రాజసూయయాగముఖంబునఁ బ్రకటించు సంకల్పంబు తద్రాజ్యమంత్రిముఖ్యులకును రాజబంధువర్గంబునకును జనించెను. వారెల్లరుఁగూడి ధర్మనందనుని రాజసూయంబునకు నానావిధంబులఁ బురికొల్పిరి. పాండవాగ్రజుఁడు వారినెల్ల విని బదులాడక ద్వారకకు సందేశముఁ బంపెను.

 కృష్ణుఁడు ద్వారకనుండి వచ్చెను. ఎల్లరు సభగూడిరి.

ధర్మనందనుఁడంత 'కృష్ణా! మావారు రాజసూయంబునకు నన్నుఁ బ్రేరేపించుచున్నారు. ఆయాగము వట్టికోరికలతోఁ గొనసాగదు. ఎవరెంతచెప్పినను నీమతంబు నెఱుంగ నిన్నిటకు రప్పించితిని. ఎల్లయర్థంబుల నీకన్న మాకుఁ బ్రాపుగలుగదు. కొందఱు కేవలంబుత్సాహపూరితులై వచింతురు; సాధ్యాసాధ్యంబులఁ బరిశీలింపరు. కొందఱు స్వలాభార్థులై యిచ్ఛకంబులాడుదురు; కొందఱు స్వమతమునే లోకమతమని నమ్మి పల్కుదురు. నీదృష్టి యట్టిదిగాదు. రాగద్వేషంబులు నీకుఁ గలుగవు. నీతలంపులు పరిశుద్ధంబులు; నీమనం బవ్యగ్రము. హితంబును నిశ్చయించి యానతింపనగు' ననెను.

కృష్ణుఁడు వానిని విని 'పాండవాగ్రణీ! సామ్రాజ్య పట్టాభిషేకంబునకు నెల్లవిధంబుల నీవు తగుదువు. ప్రజ లట్లు భావించుట తప్పుగాదు. వారు చక్కఁగాఁ దలంచిరి. అయినను గార్యంబు వారు తలంచునంత సులభసాధ్యము గాదు. ఎన్నోయాతంకంబులు దోఁచుచున్నవి. ఏదియెట్లున్నను జరాసంధుఁడున్నంతవఱకు మీవారికోర్కి కొనసాగదు. అతఁడు రాజులనెందఱనో గిరివ్రజపురమున బందిచేసెను. వారిగోడు వినరాదు. వానికివెఱచి మేమును మధురవదలి ద్వారకకుఁ బఱచితిమి. అందఱు రాజులు బందియై యుండఁగా నీవు రాజసూయంబు నొనర్చియు ఫలంబేమి? రాజసూయమనఁగా నీయాధిపత్యంబు నంగీకరించుటగదా. అంగీకరించు రాజులెల్ల బందియైరి. ఇఁక నంగీకరించువారేరి? వారిసంగతి యట్లుండ నిమ్ము. జరాసంధుఁ డియ్యకొనెనా? అతఁడు నీకార్యంబును గట్టెక్కనిచ్చునా? వానిని గాదని యత్నింతువేని యతఁడు

మీకును మీరాజ్యంబునకును ముప్పుతెచ్చును. ఎట్లువిచారించినను జరాసంధుని హరింపనిదే మీకార్యము గట్టెక్కదని తోఁచు. మఱియు వానిని గడతేర్తువేని రాజులనెందఱనో రక్షించినవాఁడ వగుదువు; లోకంబునకు నెంతో మేలు సేయుటగు. నీకీర్తియు దిగంతవిశ్రాంతిఁగాంచు. ఔన్నత్యాధిష్ఠానంబునకు ఫలము లోకకళ్యాణమేగదా' యనెను.

ధర్మనందనుఁ డావచనంబులు విని 'కృష్ణా! నీమాట కాదనువారు లేరు. జరాసంధునకు నీవే వెఱచి పఱచితి నంటివి. మాసంగతి చెప్పనేల?' యనెను. భీముఁడు వాని మాటకు సడ్డువచ్చి జరాసంధునకు వెఱవనేల? వానికి నే నొక్కండఁ జాలనా? రారండని వోవసుంకించెను. 'జరాసంధునంత పెద్దచేయుటేల?' అని యర్జునుఁడు పలికెను. వాని లావు చూతమని కవలనిరి. సేనానాయకులు ఖడ్గంబుల దూసి మునుగాళ్ళ నిలిచిరి.

కృష్ణుఁడు వారినెల్ల విని 'వీరికి లోకానుభవము చాలదు. దానంజేసి వీరిదృష్టి దవ్వుచనదు' అని మెల్లగా నుడివి 'పాండవాగ్రణీ! జరాసంధుని సేనాబలంబునకును నీసేనాబలంబునకును హస్తిమశకాంతరము. సైన్యసంపద నాశ్రయించి వానిని ఢీకొనరాదు. అట్లుచేయుట నీసైన్యంబును చేతులార వానికి బలిపెట్టుటగు. ఒక్కటి వినుము. మనము జయింపవలసినది జరాసంధుఁడా? వానిసైన్యమా? సైన్యము నాయకాధీనము. 'యథారాజా తథాప్రజా' యనిరి. సైన్యమెందైనను నీటికి నజ్జుచాచియుండు; రక్షకుఁడు చెప్పినట్లు

నడుచుట సైన్యమునకు నిష్ప్రయోజనకర్మము. కావున గుణదోషంబులు సైన్యమునందు లేవు; దానిని నడుపువానియందుండు. కావున సర్వానర్థంబులకు జరాసంధుఁడే మూలము. నాడి స్థానంబున సత్పురుషుఁడు సేనాధిపత్యము వహించెనేని యాసైన్యమే సత్పథను ద్రొక్కి మెలంగును. కాఁబట్టి జరాసంధునివధ ముఖ్యముగాని తత్సైన్యవధ ముఖ్యముగాదు. సైన్యంబును వదలి జరాసంధునితోఁ బోరుటెట్లు [illegible] ? ఆసంగతినే మనము విచారింపవలయును. శూరులు మల్లయుద్ధంబును వలతురు. కావునజరాసంధుని మల్లయుద్ధంబునకుఁ జీరి వానితోఁ బోరనగు. అందులకు మనలో నెవ్వరందురా? నేనున్నాను; భీముఁడున్నాడు; అర్జునుఁడున్నాఁడు. మామువ్వురలో నెవ్వఁడైనను వానికిఁ జాలు. అనుజ్ఞయేని భీమార్జునులను వెంటఁగొనిమగధకుఁ బోయి జరాసంధునుని మల్లయుద్ధంబునకుఁ బిలుతును. మానవాలునువాఁడు తప్పక చైకొనును. వృథారక్తపాతము తప్పును. మనతలంపు నెఱవేఱును. మాకుగాభయయమువల్లదు.' అనెను.

జరాసంధవధ.

మగధరాజ్యంబునకు గిరివ్రజపురంబు ముఖ్యపట్టణము గా నుండెను. ఆపురంబును నలువలంకుల నైదుకొండలు చుట్టియుండు. ఆకొండలలో నేదేనొకటి దాటిగాని నగరు చొఱరాదు.

ఒకనాఁడు స్నాతకబ్రాహ్మణులు మువ్వురు గిరివ్రజంబును జుట్టియున్న నైదుకొండలలోఁ జైత్యకంబను గొండను దాటి నగరుచొచ్చి రాజద్వారము చేరి సందర్శనార్థము వచ్చితి

మని తేనికిఁ దెలిపిరి. రాజాజ్ఞయయ్యెను. వారిని లోనికి ప్రవేశపెట్టిరి. జరాసంధుఁడు వారికి సముచితసత్కారంబుల నర్పించెను. ఆమర్యాదలను వారు గ్రహింపరైరి. మగధేశ్వరుఁ డాశ్చర్యమంది నింపాదిగా వారిని బరిశీలించి 'స్నాతక వ్రతులేడ ? పుష్పసుగంధధారణంబు లేడ ? నీరెవ్వరో యూహింపరాదు. మీకరతలంబులు జ్యావల్లీటంకితంబులై యున్నవి. మీవేషంబులకును మీలక్షణంబులకును బొత్తు గలుగదు. నిక్కము దాపక చెప్పనగు. మఱియు మీరు చైత్యకాద్రిమీఁదుగాఁ బురంబుఁ జొచ్చితిరనిరి. రాజమార్గం బుండఁగా నట్లురానేల ?' యని యడిగెను.

నావుడు వారిలో నొక్కఁడు జరాసంధునివంక మరలి 'రాజా ! స్నాతకవ్రతంబునకు బ్రాహ్మణక్షత్రియవైశ్యులు ముగ్గురు నర్హులు. పుష్పము శుభకరము గావున ధరించితిమి. మిత్రనివాసంబును ద్వారంబునను, అమిత్రనివాసంబు నద్వారంబునను ప్రవేశించుట శాస్త్రీయము. నీతోడ మాకుఁ బనికలదు గావున నీయర్ఘ్యంబు నొల్లమైతి' మనెను. అమాటలు జరాసంధుని యాశ్చర్యంబును రెట్టించెను. అతఁడు కొంతవడికి నెమ్మది వహించి 'మీరునాకుఁగాని నేను మీకుఁ గాని యెన్నఁడు నెట్టి యపకారంబును జేసినది లేదు. వైరంబునకు మూలముండవలయును. నన్ను మీశత్రువునిఁగాఁ దలంపనేల ? ధర్మలోపంబును నాయందు శంకింతురా ? స్వధర్మంబునుండి యెన్నఁడు దొలంగినది లేదు. రాజధర్మములోఁ బ్రజారాధనంబు త్తమోత్తమము. ప్రజకుఁ గలలోఁగూడ నెగ్గుతలంపను. అమరులనుగాని వసుధామరులనుగాని మీఱితి

వందురా ? అదియు లేదు. నాయెడ మీరు ప్రమాదపడితి రనెను.

నాపుడు 'రాజా ! రాజధర్మంబును బ్రస్తావించితివి. నృపతులనుబట్టితెచ్చి చెఱపెట్టి వారిని బశుపతికిం బశువరింపఁ దలంచితివి. ఇది క్షత్రధర్మమా ? అంత క్రూరులుందురా ? ఈపూజలను బశుపతి కోరునా? నీవిట్లొనరించు టేల ? ఐశ్వర్యప్రాప్తికిఁ గదా ? జీవితావధి యుదియగునా ? ఆత్మకళ్యాణార్థము కాకుండుఁగాక ; భోగార్థమేయగుఁగాక. భోగంబులనైనను భైరవపూజాది క్రూరకర్మంబులఁ బడయవచ్చునా? ఇట్టిసేతలు భోగంబులకన్నఁ బాపంబులఁ జెంచుఁగదా. రాజా ! ప్రజలనుఁ బ్రేమింతునంటివి. ప్రేమరసంబు నీయెడ నిసుమంతైనఁ గలదేని నీకిట్టి దారుణసంకల్పంబుదయించునా ? అంత స్తత్వంబునకు బహిఃకార్యము దర్పణంబగును. రాజా ! సత్పరిపాలన ప్రాపకవ్యాజంబునఁ దోడిరాజులను బంధించి బలిపెట్టనున్నవాఁడును, ఆత్మభోగార్థము ఘోరవ్రతంబు లాచరించువాఁడును లోకకంటకుఁడగునేగాని లోకరక్షకుఁడు కానేరఁడు. అట్టి పాపకర్ములను ధర్మరక్షణ ముపేక్షింపరాదు. ఉపేక్షించినచోఁ దత్పాపము వారికిని దగులు. మేము నిఖిలధర్మరక్షణక్షములము గావున లోకకళ్యాణార్థము నిన్ను నిగ్రహింపవచ్చితిమి. రాజా ! నేను కృష్ణుఁడను ; వీరు భీమార్జునులు. స్వవేషంబున వత్తుమేని రాష్ట్రమెల్ల నలజడిగాంచునని తలంచి స్నాతక వేషంబులను దాల్చితిమి. మాకు నీవొక్కఁడవ పగతుఁడవు గాని నీప్రజ పగతులుగారు. అందువలనఁ బ్రజాసంక్షోభముఁ గలిగింపనైతిమి. బందీకృతరాజవర్గంబును వదలుటో

యమలోకబందీకృతుఁడవగుటో రెంటనొకటి వరింపు' మనెను.

*ధర్మానుష్ఠానంబువలె నధర్మనిరోధంబుగూడ ముఖ్యమనియు, అట్లుచేయనినాఁడు స్వధర్మదూషకుఁడగుననియు నిందువలన స్పష్టము. పాపబుద్ధిని మరలించుటకు నెన్నో మార్గంబులు గలవనియు, అందునుపదేశము సౌమ్యమార్గమగుననియు, బుద్ధాదు లాసరణినే త్రొక్కిరనియుఁ, గృష్ణుఁడుమాత్ర మట్లేల చేయలేదనియు శంకింపవచ్చును. ఉపదేశంబెల్లెడల నుపయోగింపదు. అదిచాలనినాఁ డేమి చేయవలయు ? మౌనము వహించి మిన్నకుండు మందురా ? అట్లొనర్చినచో దౌరాత్మ్యంబు విజృంభింపదా ? తత్ఫలముగా లోకంబెల్ల దుఃఖమందదా ? ఈకాలపరిస్థితులే యిందులకు నిదర్శనముగదా. ఆ ధర్మము ప్రబలినప్పుడు దానినెట్లయిన నడంచుట విధియగు. అట్లుచేయుట లోకకళ్యాణార్థమేగాని యాత్మకళ్యాణార్థము గాదు. ప్రయోగవిధానమందురా ? అది దేశకాలపాత్రోచితమై యుండు. కెంగేల బుదుకను వంపనగు. కొలిమినిప్పున గాని గడ్డపాఱ వంగదు. ఈయర్థంబును లోకప్రదర్శనంబుగాఁ గృష్ణుఁడు చాటెను.

జరాసంధుఁడు కృష్ణునకు నవ్వి 'రాజులనోర్వరాదా ? బందిసేయుట దోసమా ? కృష్ణా ! నీక్షత్రధర్మము విపరీతము. బెదరింపులకు జరాసంధుఁడు భయపడఁడు ; వైరవార్పితులను విడువఁడు. కయ్యమునకుఁ గాలుద్రవ్వి వచ్చితివి. నాపేరు చెప్పినఁ బఱచితివి. నాఁడెల్ల నీబీరమేమాయెను ? మల్లయుద్ధముఁ గోరివచ్చితిరా ? అట్లేగానిమ్ము. ముువ్వురు నొక్కటై

వత్తురా ? ఒక్కరువత్తురా ? సాయుధముగా పోరుదురా ? నిరాయుధముగాఁ బోరుదురా ? ఇచ్చవచ్చినట్లు పోరనగు. కృష్ణా ! నీవు కంటికిగూడఁ దాళవు ; అర్జునుఁడు పిడికిటికిఁ జాలఁడు. మీతో జరాసంధుఁడు మల్లయుద్ధంబొనర్చెనన్న లోకమెల్ల నన్నేనవ్వును. అసమానయుద్ధము ధర్మముగాదు. భీముఁడొక్కఁడె నాకు నుద్దియగు' ననిపలికి నిజకుమారుని సహదేవుని రాజ్యమందు నిలిపి పురోహితకృతస్వస్త్యయనుఁడై మల్లయుద్ధ ప్రసాధనంబుఁ దాల్చి పోరునకు వచ్చెను.

భీమజరాసంధులయుద్ధము కార్తికమాస ప్రథమదివసంబు మొదలు త్రయోదశివఱకు నహోరాత్రంబులు జరిగెను. చతుర్దశినాటిరాత్రి జరాసంధునివదనంబు మహాశ్రాంతభావంబును సూచించెను. కృష్ణుఁ డదిగ్రహించి భీమునిఁ బ్రబోధించెను. అతఁడు వానితండ్రియైన వాయుదేవుని స్మరించి తత్ప్రసాదంబున మహాసత్త్వసమేతుఁడై జరాసంధునిబట్టి చండానిలంబు తృణఖండంబునువలె వీచెను. మగధేశ్వరుఁడు నాసికాముఖకర్ణరంధ్రంబుల శోణితధారలొల్కఁ సొమ్మసిల్లెను. భీముఁడు వానిని సంధియెమ్ములు విఱిచి వధించి యార్చెను. ఆయార్పునకు పురజనులు భూతలంబు వ్రచ్చెనోయని బెగడందిరి. మగధాధిపునిసైన్యము కృష్ణునకు జోహారువనెను.

కృష్ణుఁడంతట మాగధులకు నభయంబిచ్చి బంధీకృతుల విడిపించి సహదేవునకు హితంబులు పల్కి మగధేశురథంబును భీమార్జునసహితంబుగా నధిష్ఠించి బంధముక్తరాజ చక్రపరివృతుఁడై యింద్రప్రస్థంబునకుఁ దరలెను.

మ. జనసంత్రాసకరున్ బలోద్ధతుఁ జరాసంధున్ మదాంధున్ రణం
బున భంజించెఁ బ్రభంజనాత్మజుఁడు భూభృద్వీరులం దన్నిరో
ధననిర్ముక్తులఁ జేసె నింకఁ జతురంతక్షోణికిన్ ధర్మనం
దను సామ్రాజ్యము పూజ్యమయ్యెనని మోదంబందిరుర్వీజనుల్ ॥

కృష్ణుఁ డింద్రప్రస్థపురముజేరి భీమార్జునులతోడ ధర్మనందనునకు మ్రొక్కి విమోక్షిత పృథ్వీపతులచేత మ్రొక్కించెను. పాండవాగ్రజుఁ డారాజులనెల్ల యథార్హప్రియగౌరవంబులఁ బూజించి వారివారి దేశంబులకు వీడ్కొలిపెను.

వారెల్లరుఁ గృష్ణునొద్దకువచ్చి 'శూరాగ్రణీ! నీవింత లెన్నోవింటిమి. ఇట్టి పరోపకారంబులు నీకు నిత్యకృత్యములు. జరాసంధునకుఁ జిక్కి ప్రాణాపేక్ష వదలితిమి. ఖడ్గంబు మామెడపయినుండెను. ఎప్పుడో యేనిమిషమో యని యుంటిమి. మాసుకృతఫలంబుగా నీకు మాయెడ జాలి కలిగెను. మాకుఁ బునర్జన్మమెత్తుటయ్యెను. మాకృతజ్ఞత యింతనరాదు. ఇదే కయిగూర్తుము. ఆజ్ఞాపింపనగు' ననిరి. కృష్ణుఁడు వారికెంతయుఁ బ్రీతుఁడై 'ధరణీశులారా! రాజత్వము ధర్మస్థాపనపరిపాలనార్థమేగాని యాత్మభోగార్థముగాదు. ఎవఁడు ప్రజానురాగపాత్రుఁడై వారిహృదయంబుల నధిష్ఠించునో యతఁడే రాజనాఁబడు. ధర్మనందనుఁడు రాజసూయయాగంబును సంకల్పించెను. దానిసంకల్పంబు నామోదింతురేని మీరెల్లరు దానికిఁ దోడ్పడఁ గోరుదు' ననెను. అందులకు వారు పరమసంభావితులట్లు సంతోషించి తమసమ్మతులఁ దెలిపి యనుజ్ఞాతులై స్వదేశంబులకుఁ జనిరి. కృష్ణుఁడంతట ధర్మనందనునొద్దకు వచ్చి 'రాజాగ్రణీ! ఇఁక నీయిచ్చ సేయనగు' నని పలికి వానిఁ వీడ్కొని ద్వారకకుఁ బోయెను.

రాజసూయోత్సవం

రాజసూయంబును దిగ్విజయయాత్రాపూర్వకంబుగాఁ జరుపుదురు. విరోధులను జయించి రాజాజ్ఞను నిల్పుటయే తద్యాత్రాభావము. తదర్థము భీమాదులు నల్వురు నాల్గు దెసలకుఁ బోయి వైరిరాజులనోర్చి యపరిమితంబులైన కప్పంబులఁ గొనివచ్చిరి.

ధర్మనందనుఁడంతటఁ దమ్ములను మంత్రిసత్తములను గూర్చి 'మీరెల్లరుఁ గులగురువు ధౌమ్యుఁడును బ్రాహ్మణోత్తములును వచించునట్లు యాగవస్తుసంభారంబులఁ గూర్పవలయు' నని యాజ్ఞాపించెను. భాండాగారము జాలదయ్యెను ; కోష్ఠాగారము ఘృతతైలంబులతోను లవణతండులాది వస్తువులతోను నిండెను ; రాజన్యులకును చాతుర్వర్ణ్యంబులకును దగునివేశంబులు నిర్మితంబులయ్యెను ; యజ్ఞాయతనంబున సర్వసంభారంబుల నించిరి ; పురప్రాంత ప్రదేశము ప్రమదవనంబుతో దీర్ఘికాకూపంబులతో వెలసెను.

విరాట, ద్రుపద, శిశుపాల, గాంధారరాజులును, ప్రాగ్జ్యోతిషాధిపతియును, శకసాల్వ బృహద్బల చంద్రసేనులును, కుంతిభోజ పౌండ్రకులును, అంగవంగకళింగకాశ్మీరాధిపులును, గౌడాంధ్ర కాంభోజ సింహళేశ్వరులును, కేరళ కుంతల ద్రవిడ మరుయవనపతులును, బార్వతేయులును సాగరానూపవాసులును, తదితరులును బంధుమిత్రపరివారంబుగా వచ్చిరి. హాస్తినాపురంబునుండి ధృతరాష్ట్ర భీష్మ ద్రోణ విదుర కృపాశ్వత్థామ సోమదత్తులను, గర్ణ భూరిశ్రవ శ్శల్య శకుని సైంధవ దుర్యోధన దుశ్శాసన వికర్ణాదులను నకులుఁడు దోడితెచ్చెను.

వేదవేదాంగవిదులైన బ్రాహ్మణోత్తములును, క్షత్రియ వైశ్య శూద్రముఖ్యులును, వివిధప్రాంతములనుండి యరుదెంచిరి. ద్వారవతినుండి రామకృష్ణాదులు విచ్చేసిరి.

ధర్మనందనుఁడు వారినెల్ల యథార్హ గతులఁ బూజించి 'మీయనుగ్రహంబున నిమ్మహాధ్వరంబునకుఁ బూనితి. కార్యభారంబును మీరే వహించి యాగము నిర్విఘ్నపరిసమాప్తి నొందింప వేఁడు' నని సభకు విన్నవించి, హిరణ్యరజతరత్న దక్షిణదాన విషయంబునఁ గృపాచార్యుని గృతాకృతపరిజ్ఞానంబునందు భీష్మద్రోణులను, సకలవస్తువ్యయంబునందు విదురుని, రాజసమాగతోపాయనస్వీకరణమందు దుర్యోధనుని భక్ష్యభోజ్యాది వినియోగంబునందు దుశ్శాసనుని నియోగించి మయనిర్మితమైన యజ్ఞశాలఁ బ్రవేశించి వేదమూర్తులైన పైల ధౌమ్యులు హోతలుగా యాజ్ఞవల్క్యుండధ్వర్యుఁడుగా ద్వైపాయనుండు బ్రహ్మగా సుసాముఁ డుద్గాతగా యాగం బారంభించెను.

## అగ్రపూజ.

యజ్ఞంబులందు నొక్కనిఁ బెద్దచేసి వానికి నర్ఘ్యమిచ్చుట సాంప్రదాయము. అందులకు స్నాతకునో ఋత్విజునో గురువునో యిష్టునో సంయజునో రాజునో వరింతురు. నాటి కార్యంబునకు నెవ్వని వరింపనగునో యనువిచారము వచ్చెను. ధర్మనందనుఁడు భీష్మునివంక మరలి యెవ్వనిని వరింపనగునో యానతి యిమ్మనెను.

ఆమాటతోడ యజ్ఞమండపమందు గుసగుసలు పుట్టెను.

సభాస్తారు లొండొరుఁజూచుచు భీష్మునినోట నేమివచ్చు
నోయని చెవులు విచ్చియుండిరి. భీష్ముఁడు దీర్ఘమాలోచించి
'రాజా ! అర్కుఁడు రుచిరాంశురుచిచే రోదసీకుహరంబును
వెలిగించునట్లుఁగా, శీతాంశుఁడు సుధానిష్యందిచంద్రికచే నా
నందంబుఁ గూర్చునట్లుఁగా, ఎవఁడాత్మద్యుతిచేఁ జరాచరసమస్త
లోకంబును దనుపుచు జగదేకసేవ్యుఁడగునో యట్టి యనాది
నిధనుఁ డచ్యుతుఁడు కృష్ణుఁడుగాక యెవరులర్ఘ్యంబునకుఁ దగ
రు. అట్టి సకలలోకపూజ్యుని బూజించుటే యజ్ఞఫలం' బని
వచించెను. జయజయధ్వనులు మిన్నుముట్టెను. ధర్మనంద
నుఁడు కృష్ణునకు శాస్త్రదృష్టవిధానంబున నర్ఘ్యమిచ్చెను.

శిశుపాలాధిక్షేపము.

కృష్ణుని మూఁడవ మేనత్తకొడుకు శిశుపాలుఁడు లేచి భీష్మునధిక్షేపించుచు,

'మ. అవనీనాథు లనేకులుండఁగ, విశిష్టారాధ్యు లార్యుల్మహీ,
దివిజుల్ పూజ్యులు పల్వురుండఁగ, ధరిత్రీనాథ ! గాంగేయదు,
ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితున్ వార్ష్ణేయుఁ బూజించి నీ
యవివేకం బెఱిఁగించితిం దఱుకు దాశార్హుండు పూజార్హుఁడే ?'

'చ. కడుఁగొని ధర్మతత్త్వమెఱుఁగంగ నశక్యము ధర్మబాహ్యు ని,
న్నొడఁబడ నిష్టుఁడై కఱపి యుత్తములుండఁగ వాసుదేవుఁడన్
జడునకుఁ బూజయిమ్మని విచారవిదూరుఁడు భీష్ముఁ డెంతయున్
వెడఁగుదనంబునం బనిచె వృద్ధులబుద్ధులు సంచలింపవే ?'

'చ. ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తు రభీష్టములైన కార్యముల్
మతినొనరింతు రిష్టుఁడనిమంతురుగాక మహాత్ములైన భూ
పతులను విప్రముఖ్యులసభన్ విధిదృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హునర్హుఁడని యచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే ?'

రాజా ! వృద్ధునిఁ బూజింపఁదలంతువేని వసుదేవుఁడు లేఁడా ? ఋత్విజు నారాధింపఁ గోరుదువేని ద్వైపాయనుఁడు గలుగఁడా ? ఆచార్యుని సత్కరింతువేని ద్రోణకృపులుండరా ? రాజును గౌరవింపనెంతువేని యెందరో మండలేశ్వరులుండరా ? పూజనీయులిందఱుండఁగా గొల్లనిఁ బూజింపనేల ? ఏభావముతో వానినిఁ బూజించితివి ? రాజని పూజించితివా యనుటకు గొల్లలు రాజులుగారు. నీవు పూజించినవానికి గోష్పాదమంత భూమియును లేదు. గోపాలశబ్దము నీకు భ్రాంతిఁగలిగించెనా ? ముదుసలిని విని యింత సేయఁ దగునా ? ధర్మనందనా ? నీవు ప్రజ్ఞాశాలివనియు ధర్మవిదుండవనియుఁ బూజ్యుండవనియు భావించి నీపిలుపు మన్నించి వచ్చితిమి. నీవు గొల్లను బెద్దచేసి నిండుసభలో మమ్ముఁ బరాభవించుట యెఱుంగము. ఈవెఱ్ఱితలంపు నీకుఁ గలదేని మమ్ము రప్పించుటేల ? నీకు భయపడి యీదెవ్వరును రారు. నీపొత్తును విలుచుటకై కాన్కలర్పింపలేదు. చక్రవర్తిపదవిని గోరితివి. నీసద్గుణసంపదకు మెచ్చి యిచ్చకొంటిమి. ఇదంతయు మఱచి మాకుఁదలవంపుఁగూర్చితివి. ఇదంతయు బుద్ధిపూర్వకంబైనచో నేమైయుండునో యూహింపరాదు. ఒరుసవిని చేసితివి గావున రాజమండలంబు నిన్ను క్షమించుటయ్యెను. తెలిసియో యెఱుసివిసియో యర్ఘ్యంబిచ్చితివిపో. ఇతఁడు తనతగమిం దలంపక దానిని గ్రహింపనగునా ? రాజా ! నీయీసేత పేడికి దారక్రియవలెను, జెవిటికి మధురగీతికవోలెను జీకునకు మానవతీదర్శనంబులాగున నయ్యెను. ఈయవజ్ఞ చాలు' నను సభనుండి వెల్వడనుద్యమించెను.

ధర్మనందనుఁడు శిశుపాలునిఁ గేలుపట్టి నిలిపి 'చేదీశ్వరా! నీయట్టిరాజులకు వాక్పారుష్యము కూడునా? అది విషముకంటె దవాగ్నికంటె మహాదారుణంబై కాల్చునుగదా. భీష్ముఁడు బుద్ధిజాడ్యోన్మాదుఁడై చెప్పెనంటివి. భీష్మునిమాట యటుండనిమ్ము. ఇందఱు రాజాధిరాజులు మెచ్చినదానిని నీవు కాదనఁదగునా?

"ఉ. ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు, వే
దాది సమస్తవాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు, లో
కాది త్రిలోకపూజ్యుఁడని యాత్మనెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని, యుక్తముగాకిది యేమిదోసమే ?"

అని నయవినయంబుల వానికి శాంతముఁ బల్కెను.

భీష్మసమాధానము.

భీష్ముఁడు ధర్మనందను నందికొని, 'శిశుపాలా! బ్రాహ్మణుఁడు బాలుఁడయ్యు నుత్తమజ్ఞానవృద్ధుఁడగునేని బూజ్యుఁడగు. క్షత్రియుఁడు బలపరాక్రమోన్నతుఁడగునేనిఁ బూజ్యతఁగాంచు. ఈరెండును గృష్ణునందు నొప్పియున్నవి. అట్టి మహాత్మునిఁ గాదందువేల? మఱియొకవిశేషము. ఎవనిఁ బూజింతురో యతఁడు మాత్రమే తృప్తుఁడగును. ఇది లోకసహజము. కృష్ణునిపూజ యట్టిదిగాదు. వానిని బూజించిన ముల్లోకంబులుఁ దనివినొందు. ఈమర్మము నెల్లరు గ్రహింపఁజాలరు. ఏలయందువా? కృష్ణునిఁ గేవలమర్త్యమాత్రునిగా భావించుటయే కారణము. ఎవఁడు చరాచరాత్మక సకలభూతప్రపంచంబును దనదివ్యశక్తిమై యాత్మఁ దాల్చియుండునో, ఎవ్వనితత్త్వము నిశ్చలయోగనిష్ఠాత్ములకుఁ దక్కఁ బ్రా

కృతబుద్ధులకు గోచరింపదో, ఎవని నెఱుంగ భవాదృశులకుఁ గోటిజన్మంబులకుఁ గూడఁ గాదో, యట్టి యచ్యుతునిపూజ నధిక్షేపించువారుండుట వింతయేగాక చింతయునయ్యెడు. శిశుపాలా! కృష్ణునకుఁ దలయొగ్గని నరేంద్రు నొక్కని నిమ్మహా సభలోఁ జూపఁగలవా? జ్ఞానవృద్ధుల నెందఱనో సేవించితిని. వారెల్లరు నొక్కమొగిఁ గృష్ణునెంతో యుగ్గడించిరి. కృష్ణుని మహిమల వింటిని. అవి లోకాద్భుతంబులు. అట్టి జ్ఞానగమ్యుని జూపఁగలవా? అట్టి మహిమలరచించినవానిఁ బేర్కొనఁగలవా? బాంధవ్యంబుననో వ్యామోహంబుననో ఫలాభిసంధిచేతనోఁ గృష్ణునారాధింతుమని భ్రమపడవలదు. కృష్ణుఁడు సర్వలోకపూజనీయుఁ' డనుచుఁ దటాలున విరమించెను.

ఏప్రేమభక్తి గోపీగోపకులనెల్ల నానందవార్ధి నోలలాడించెనో, ఏప్రేమభక్తి యార్యావర్తమెల్లఁ బఱచి ప్రవహించెనో, యాప్రేమభక్తి భీష్ముని బైకొనెను. ఆభక్తాగ్రేసరుఁడు వివశుఁడయ్యెను. ఆకారణంబున వానిమాట నిలిచెను; వాని కందోయి యానందబాష్పంబులఁ గురిసెను. భీష్ముఁడు కొంత వడికి బాహ్యజ్ఞానంబు సుంతవహించి, 'ఔనౌను; కృష్ణుని బూజించితిమి. కృష్ణుఁడెవఁడు? సృష్టికి మూలంబెవ్వఁడో, ఎవని యందు స్థితిలయంబులు నెలవైయుండునో, అవ్యక్తము శాశ్వతము వ్యక్తాతీతమునైన యేపరతత్త్వము లోకానుగ్రహార్థము శ్రీకృష్ణరూపంబున సాక్షాత్కరించెనో, యాపరతత్త్వంబు నారాధించితి' మని గభీరస్వరంబునఁ బల్కెను.

భీష్మోపాలంభనము.

భీష్ముని శ్లాఘావచనంబులకు శిశుపాలుఁడు మహాగ్రహాదుర్నిరీక్ష్యమూర్తియై చివ్వున మరలి 'మూఢా! వృద్ధబుద్ధిజాడ్యంబు నిన్నుఁ గైకొని యిట్లాడించుచున్నది. కృష్ణునిఁగూర్చి నా ప్రేలఁబల్కుట మేనత్తసౌభాగ్యంబును మేనమామయెదుట వర్ణించుటగు. నీపొగడ్తలను కృష్ణుఁడు నమ్మిన నమ్ముఁగాక. మేముమాత్రము నీబట్టుదనంబును మెచ్చితిమి. కౌరవులపడిపంచలు ప్రాఁకి బ్రదుకు నీయట్టివాఁడు చట్టుపనికేఁగాక వేఱొక్కటికగునా?' యని నిందాస్వరంబునఁ బలికెను.

ఆపల్కులకు సభాంతరమెల్ల సంక్షోభించెను. ధర్మనందనుఁడు భీష్ముని సమీపించి 'మహాత్మా! మఖవిఘ్నంబును జనాపకారంబును సంభవింపకుండుటకుఁగా రాజలోకమనశ్శాంతిని గూర్పు' మని వేఁడెను. భీష్ముఁడు తలయూచి 'ధర్మజా! నారాయణుఁడు యజ్ఞపూరుషుఁడై నీచెంతనుండఁగా నీయజ్ఞంబునకు విఘ్నంబుఁ గూర్ప నేర్తురా? కృష్ణుఁడు తేఱిచూచిన వీరెల్లరు నీఱుగారా?' యనెను.

ఆపల్కులు శిశుపాలునకు మంటపై నాజ్యధారయయ్యెను. అతఁడు క్రోధపరీత చిత్తుఁడై,

'ఉ. నెట్టన ధర్మనందనుఁడు నిన్నవలంబముచేసి రోడతో
గట్టినయోడవోలె గతగౌరవుఁడై కడుఁదూలెఁ గృష్ణుఁ జే
పట్టి విభీషికల్ ధరణిపాలుర కిప్పుడుచూపి, లెందు నీ
యట్టి దురాత్ములుండుదురె? యంతయధీనులె ధారుణీపతుల్?'

భీష్మా! కృష్ణమహిమలంటివి. అవియేవి? పాలిచ్చిన పూతనను జంపుట, శకటంబును ద్రోయుట, మ్రాఁకులఁ

కూల్చుట, పుట్టగొడుగంతటికొండ నెత్తుట, వృషభంబును జంపుట యివే గదా నీచెప్పనైనమహిమలు? గోరంతలఁ గొండంతలు సేయ సిగ్గుగాదా? పొగడినను చెవికి నింపువలదా? భీష్మా! ఒక్కనాల్కనీకుఁ జాలదుగాఁబోలు. అదివ్రీలి వేయిపఱియలైయున్న నోటితోఁటవోవఁ బదరియుందువు. వెఱ్ఱివెఠగా! స్త్రీహత్యయు గోహత్యయుఁ గుఱువఁబెట్టినవానిఁ గూల్చుటయు, నమ్మినవానిని జంపుటయు మహాపాతకములగుట విందువా? నీజగదీశ్వరుఁడు నీధర్మదేవత పూతనను జంపి స్త్రీహత్య నొడిగట్టెను; వృషభంబును హరించి గోహత్య సంపాదించెను. అట్టిపరమపాతకికి నర్ఘ్యంబిప్పించితివి. నీధర్మబుద్ధి నేమననగు? ఒరుఁడువలసిన యంబను హరించితెచ్చిన మహాత్మా! నీయట్టియనపత్యుఁడు ధర్మప్రతిపాదియగునేని లోకంబుగతిఁ జెప్పనేల? కృష్ణుఁడు వీరాతివీరుఁడంటివి. ఆసంగతి జరాసంధుఁడెఱుంగు. అతఁడు పరమధర్మజ్ఞుఁడంటివి. ఎదయిచ్చి పోరలేక స్నాతకబ్రాహ్మణవేషధారియై యేమరించి పరమబ్రహ్మణ్యుండైన జరాసంధుని భీమునిచేతఁ జంపించిన ఘనుఁడు ధర్మజ్ఞుఁడుగాక వేఱగునా? భీష్మా! నీనాల్కదురద తీఱదేని శ్లాఘ్యులైన నరేంద్రులులేరా? ఈకర్ణునిఁబొగడరాదా? ఈ శల్యునిఁ బ్రశంసింపరాదా? ఇట్టివారెందఱో యుండఁగా వరాటుని వర్ణింపనేల? భీష్మా! వేయేల! నీకృష్ణుఁడంతటివాఁడేని శిశుపాలుశక్తి సుంతచవిచూడ రమ్మనుమని యొత్తిపాడిచెను.

ఆమాటలెల్లరకుఁ గర్ణశూలములాయెను; కౌరవులు సయితము సహింపరైరి. భీమునికంట మంటలుగురిసెను;

అర్జునుని నిలువెల్ల గగుర్పొడిచెను. రాజమండలమంతయుఁ చంచలంబాయెను. విప్రాదులు ధిక్ధిక్కనిరి. ధర్మరాజుఁడు విన్ననయ్యెను. సభాదృష్టి భీష్మునివంకను గృష్ణునివంక నుండెను.

కృష్ణుఁడావచనంబులకు సుంతయుఁ జంపక చిఱునవ్వు మోముతో లేచి 'సభాస్తారులారా ; శిశుపాలుని వింటిరిగదా. ఇతఁడు నామేనత్తకుమారుఁడు. అంట్లుండియు మాకుఁ గీడునే రోయుచుండు. ప్రాగ్జ్యోతిషాధీశునిపయి మేము దాడివెడలి యుండఁగా నితఁడు మాద్వారకాపురిని దొంగతనముగాఁ జొచ్చి యచటిబాలవృద్ధులను గాల్చెను. భోజరాజన్యులు కాంతాసహితులై రైవతాద్రికిఁబోయి యందుఁ గ్రీడాప్రమత్తులైయుండఁగా నిద్దురాత్ముఁడు దయాధర్మంబువేది వారిని బట్టి వధించెను. నాతండ్రి వసుదేవుఁడు హయమేధయాగార్థమై నిశ్చయించిన యశ్వంబు నిద్దురితాంధుఁడు హరించి వాని యజ్ఞంబునకు విఘ్నంబొనర్చెను అక్రూరుఁడెట్టివాఁడో మీకుస్పష్టము. వానిభార్య సౌభరరాజ్యంబునకుఁ బోవుచుండఁగా మార్గమధ్యంబున నామెనిక్కుటిలుఁడు తటాలున దొంగిలించికొనిపోయెను. విశాలాధిపుఁడు వానిపుత్త్రియైన భద్రను గరూశరాజునకు వాగ్దానముచేయఁగా నీదుష్టుఁడు కరూశరాజవేషంబునవచ్చి మోసగించి బలాత్కారముగా నామెను జెఱిచెను. ఈచేఁటితప్పులు నూఱుసైతునని నామేనత్తకు మాటయిచ్చితి. ఆమెకుగా నిక్కాఁక నిన్నాళ్లుసైచితి. వీని నేరములు శతాధికములయ్యెను. ఇతఁడు కావరించి కన్నఱుంగఁక గయ్యమునకుఁ జీఱుచున్నాఁడు. యుద్ధభిక్షను వీరుఁడు నిరాకరింపరాదు. ఆర్యావర్తరాజపుంగవులైన మీయెల్లర

ప్రోల నిట్లుసంభవించుట యెంతయుమేలయ్యెను. ఇదిగో చూడు' మనెను.

### శిశుపాలవధ

మఖశాల క్షణములో యుద్ధరంగమయ్యెను. శుభసంతోషంబులు వలసబోయెను. ధర్మనందనుని ముఖమండలంబు దుఃఖధూమావృతమై తేజంబుఁదొఱఁగెను. భీముని దంతఘట్టనంబులు బిట్టుఱుములై తోఁచెను. అర్జునుఁడు వ్యసనదీనుఁడై కృష్ణునివంకఁ జూడసాగెను. ఏమగునోయనుచు సభాస్తారులు నిర్నిమేషులైరి.

శిశుపాలుఁడు కత్తిదూసి రోజుచురొప్పుచు యుద్ధసన్నద్ధుఁడై నిలిచెను. కృష్ణునిచేతి చక్రము దిర్దిర తిరుగుచువెడలెను. దానికాంతిపుంజంబునకు సభాదృష్టి మిఱుమిట్లుగొనెను. సభాస్తారులు స్వస్థదృష్టులై చూచునంతకు శిశుపాలుని శిరంబు నేలఁబడి దొర్లాడుచుండెను. ఎల్లరు బెగ్గడిల్లుచు నోరప్పళించిరి.

అంతట యాగము నిర్విఘ్నపరిసమాప్తిఁగాంచెను. రాజులెల్లరు ధర్మజునకు మ్రొక్కి యథార్హసత్కృతులై తమతమదేశంబులకుఁ దరలిరి. విప్రవర్యులును దదితరులును తగుమర్యాదలంది తరలిరి.

కృష్ణుఁడంతట శిశుపాలునిరాజ్యంబును వానికుమారునకుఁగట్ట నాజ్ఞాపించి ధర్మజునితో 'రాజా! పర్జన్యుని సకలభూతసంఘంబట్లు బహుఫలవృక్షంబును బక్షివ్రాతమువలె నిన్ను బంధుకోటి యుపజీవింపఁగాఁ గీర్తికాంతనుగూడి సుఖ

ముండు' మని పల్కి ద్వారకాగమనంబునకు ననుజ్ఞ వేడెను. ధర్మజుఁడు కృష్ణునికరంబుఁబట్టి.

ఉ॥ నీకరుణం గరంబు రమణీయతరంబయి సర్వవిఘ్న దూ
రీకృతమై సమాప్తి నొవరెఁ ధరణీధర ! యిమ్మఖంబు భూ
లోకములోన నేను నృపలోకనమస్కృతిఁ గీర్తిఁ బర్వితిన్,
నాకులముక్ వెలింగ సుగుణంబులకాస్పదమై పవిత్రమై ॥'

'క॥ ద్వారవతినుండియునునిట,
యారసియుండునది దానవాంతక ! లోకా,
ధార ! సమీపస్థుండవ,
దూరంబున నుండియును జతుర్భుజమాకున్ ॥'

అని బహువిధంబులఁ గృతజ్ఞతావచనంబులు పల్కి వివిధసన్మానంబులు గావించెను. కృష్ణుఁడంతఁ గుంతీద్రౌపదీ సుభద్రల వీడ్కొని ద్వారకకుఁ బోయెను.

## సాల్వవధ.

శిశుపాలునివధకు వానితమ్ముఁడు సాల్వుఁడు మహోద్రగ్రుఁడై యాదవకుల సమున్మూలనంబును బ్రతినసేసి కఠిన వ్రతముఁబూని యన్నపానంబులు విసర్జించి పాలాక్షునిగూర్చి ఘోరతపంబొనర్చి వానివలన సౌరభంబను విమానంబును మయనిర్మితంబును గామచారియైనదానిని బడసెను. అతఁడట్లావిమానంబును బడసి కృతకృత్యుఁడట్లు భావించి కృష్ణుఁడు లేనితఱిఁ జూచి ద్వారకను ముట్టడించి యందలివారిని జించి చెండాడసాగెను. అంతలోనఁ గృష్ణుఁడు ద్వారకకు వచ్చి సాల్వుని సవిమానంబుగాఁ దునిమి సముద్రాంతరంబునఁ ద్రోసెను.

### దంతవక్త్రవిదూరథులు.

కృష్ణుని మేనమామకొడుకులు దంతవక్త్రవిదూరథులను వారుండిరి. వారు సాల్వునకు బరమమిత్రులైరి. సాల్వుని వధకు దంతవక్త్రుఁడు కినిసి కృష్ణునిపై దాడివెడలెను. వానినిఁ గృష్ణుఁడు గెడపెను. అన్నకుఁగా వగచి విదూరథుఁడు కృష్ణుని చేఁకి సంహతుఁడయ్యెను. శిశుపాలాదుల నల్వురచావుఫలంబుగాఁ దద్రాజ్యంబులు రాజోపద్రవంబులు బాసి చల్లనయ్యెను. జనులు కృష్ణుని వేనోళ్ళఁ గీర్తించిరి.

### విమానములు.

విమానంబులు నవీనశిల్పకళాఫలంబులని కొందఱు భావింతురు. అవి మొట్టమొదట మనదేశమందే నిర్మితంబులాయెను. త్రేతాయుగంబునుండి వాని ప్రసక్తి మనదేశమందుఁ గలదు. త్రేతాయుగంబునాటి శ్రీరామునికాలంబునఁ బుష్పకవిమానంబును, ద్వాపరయుగాంతమునాటి కృష్ణునికాలంబున సౌరభవిమానంబు నుండినట్లు పురాణంబులు దెల్పుచున్నవి. కలియుగంబునఁగూడ, ఇప్పటికి దాదాపుగా వేయి సంవత్సరములనాఁడు ద్రవిడప్రభుండొకఁడు వానిభార్యకు రానున్నముప్పును దప్పించుటకై మయూరవిమానంబును జేయించి దానిమీఁద నామెనవ్వలకుఁ బంపెనని చరిత్ర తెలుపుచున్నది. కీళ్ళగుఱ్ఱములకతలు కీళ్ళయేనుంగులకతలు నెన్నో మనగ్రంథములలోఁ గలవు. అవి కల్పితంబులు గానేరవు.

పూర్వవిమానంబులకు నవీనవిమానఁబులకు రచనావిధానంబునఁ జాలభేదము గాన్పించుచున్నది. అప్పటివిమానంబులు వాయుపూరణంబుననో నవరత్నప్రభావంబుననో

విహరించినట్లు చెప్పుదురు. వాయుపూరణవిధానబునకు నేఁడు మనకు దృశ్యములు గలవు. నవరత్నంబులు నవగ్రహంబుల యంశంబులనియు, నవగ్రహబలంబున భూగోళం బెట్లు పరివర్తించుచున్నదో యట్లే నవరత్నంబుల బలంబున విమానాదులఁ బరిభ్రమింపఁజేసిరనియు, నవగ్రహాచారమర్మంబును గ్రహించి యాచార ప్రకారమే నవరత్నంబుల గూర్చి విమానంబుల నడిపించిరనియు, అంతటి శిల్పనైపుణ్యం బిప్పుడు లేదనియు వచింతురు. శిల్పంబునఁ బ్రజ్ఞావంతులు పూర్వులో నవీనులో యూహింపనగు.

పుష్పకవిమానరచనయందు మఱియొకవింతగూడఁ గలదనిరి. దానిరూపము రోజాపుష్పాకృతినుండునట. భారము హెచ్చుకొలఁది దానిఱెక్కలు విస్తరించునట. ఆకారణంబున నెందఱైన నందెక్కవచ్చునట.

విమానంబులు నూటొక్కవిధంబులనియు, ఇప్పటివిమానంబులు గృధ్రరూపంబులనియు, మనవిమానశాస్త్రము దేశాంతరగతమయ్యెననియు, ఆశాస్త్రరహస్యంబును సమగ్రంబుగా గ్రహింపశక్తిచాలక, అందొక్క విమానస్వరూపంబును జూచి గృధ్రవిహారవిధానంబును బరీక్షించి ప్రతిభాశక్తిని వినియోగించి తైలయంత్రసాహాయ్యంబున నొక్కదానిని పాశ్చాత్యులు నిర్మింపఁగల్గిరి. ఏలఁబడియుండలి కట్టుదిట్టంబులంజేసి మనదేశశిల్పప్రతిభ యడుగంటెను. రాజాజ్ఞయైనచో

శిల్పకళాచాతుర్యంబును బ్రదర్శింపఁగల నేర్పరులు మన దేశమం దిప్పుడును గలరు.

ఈవిషయంబులనెల్ల నిష్పాక్షికబుద్ధితో సమగ్రంబుగాఁ బర్యాలోచించినచో మొట్టమొదటనుండి యేదేశము చతుష్షష్టికళలందు నభ్యున్నతిఁ గాంచియుండెనో, ఏదేశంబు నుండి పరదేశంబులు విశేషాంశంబుల గ్రహించెనో విశదమగు. అట్టి మనదేశము కాలవశంబునఁ దనయౌన్నత్యంబును గోల్పోవుట యట్లుండఁగాఁ దానిచ్చినయెఱువు సొమ్ములతోఁ దళుకు బెళుకులాడుచు నమమంత్ర పుసిరికై మైమఱచి విషయసుఖమే పరమంబుగా భావించి తదర్థము సర్వము ధారవోయుచున్న పరదేశంబులనుండి దద్భాషా వేషవ్యవహారాచారంబుల ననుకరించి వానినిమించఁదలంచి స్వకీయంబులైన యముతాల్యంబులకు వైముఖ్యమగుట వింతయేగాక చింతయుఁ గూర్చు.

### దుర్యోధన సభా ప్రలంభనము.

ధర్మజుఁడు రాజసూయయాగానంతరము కొన్నిదినంబులు దుర్యోధనాదుల నింద్రప్రస్థపురంబుననే నిల్పుకొని భ్రాతృవాత్సల్యాతిశయంబుల వారిపయి గురియించుచుండెను. ఒకనాఁడు వారు మయసభావిభవంబును సమగ్రంబుగాఁ జూడ వేడుకపడి యటకుఁబోయి యయ్యాయిప్రదేశంబులఁ గ్రుమ్మరుచు దాని యపూర్వరమణీయతకు విస్మయమందుచు నిర్మాణకౌశల్యంబును మెచ్చుచునుండిరి. దుర్యోధనుఁడుఁ 'దర్పణ ప్రదీప్తిం జేసి తెఱచియున్న ద్వారంబును మూసియున్నదానినిగా భావించి యామార్గంబునఁ జనకోల్లకయు, నఁవృతంబైన

దానిని వికృతంబుగాఁదలంచి చోరంబోయి లలాటతలంబునదిరాఁకఁగాఁ దన ప్రమాదంబును గ్రహించి యందుండి మరలియు, నీలాశ్మరశ్మిస్థగితంబైన విమలమణిస్థలంబును జలాశయంబుగా వగచి పరిధానం బెగద్రోచికొని యావలఁజని యది జలాశయంబుగాదని యెఱింగి సిగ్గుపడియు, మఱికొంతదవ్వుచని స్ఫటికదీప్తిజాలంబునంజేసి విమలమణిస్థలంబుగాఁ దోఁచుచున్న జలాశయంబునఁబడెను. అతఁడు కట్టిన పుట్టంబులు తడిసెను. వానిఁ బాండునందనులును బాంచాలియు నగిరి.' ధర్మనందనుఁ డాసంగతివిని దివ్యవస్త్రాభరణంబులను భీమునిచేత వానికిచ్చి పంపెను.

### దుర్యోధన దురాలోచనము.

దుర్యోధనుఁడు సభాప్రలంభనంబునకు లజ్జితుఁడై లోలోన వగచుచుఁ గొన్నాళ్ళకుఁ బాండవులవీడ్కొని నిజపురంబునకు వచ్చి శకుని రావించి 'మామా! ధర్మరాజుసభను జూచితివిగదా. అట్టిది భూలోకంబున నెందైననున్నట్లు వినము. దానినతఁడెట్లు పడసెనో యూహింపరాదు. ధర్మనందనుఁ డాసభవలన సంభావితభాగ్యుఁ డయ్యెను. ప్రసిద్ధధాత్రీశ్వరులు వైశ్యులవలె వశ్యులై యనర్ఘరత్నరజతాదులు మోసి తెచ్చి పాండవాగ్రజునకుఁ గానుకలర్పించుట జూడఁగా వానిదే సార్థకజీవితంబని తోఁచెడు. మఱియు యాదవుఁడు శిశుపాలునిఁ జంపుట రాజులెల్లరు బొమ్మలవలెఁ జూచుచునుండిరే గాని వానిపై విక్రమింపనోపరైరి. పాండవలక్ష్మి పరాక్రమార్జితమైనది. నాకనుగుట్టుచున్నది. మామా! సపత్నుల వృద్ధియు నాత్మహానియు మానధనాఢ్యులు సహింపనోర్తురా?

యని యంతర్భావంబును దెలిపెను. శకుని వానివగపు గ్రహించి తచ్ఛోకనివారణోపాయంబును సూచించెను. దుర్యోధనుఁడాదులకు నెంతయు సంతసించి విదురాదులు వలదన్నను వినక తండ్రి నట్లొ యొడఁబఱచెను.

## ద్యూతము.

ధర్మనందనుని జూదంబునకుఁ బిలిచిరి. యుద్ధంబునకును ద్యూతంబునకును జీరినప్పుడు కాదనుట పిఱికితనంబుగ్గా నాటిరాజలోకము భావించుటయ్యెను. ధర్మజుఁడు ద్యూతకుశలుఁడుగాఁడు. అయినను బిలుపువచ్చినప్పుడు కాదనలేడయ్యెను. జూదమాడుట ధర్మమా? కాదా? యన్న సమ్మనమేయగు. ఆసంగతి ధర్మజునకు దెలియదా? యనిన తెలిసియేయుండనోపు. అంతమాత్రము నేరడేని వానిని ధర్మరాజని యనరు. తెలిసియ్యు నట్లు చేయుటేల? యని శంకింపవచ్చును. తండ్రి పిలువనంపెను. వానిపిలుపును నిరాకరించుటో జూదంబును నిరాకరించుటో రెంటనొకటి వానికిఁ దప్పదయ్యెను. తండ్రిపిలుపు నాదరించెను. అట్లుసేయుట తగునా? యందురా? తగదనియే చెప్పనగు. తగనిపనినిగావించి తత్ఫలమనుభవించెను. ఇది లోకంబునకెల్ల నీతి బోధయయ్యెను.

ధర్మజుఁడు హస్తినాపురముచేరెను. వానితోజూదమాడ శకునిని నియమించిరి. శకుని మాయావిదుఁడగుట వానిని నియమించుటయ్యెను. తొలియాట శకుని గెలిచెను. ఓటమికి ధర్మజుఁడు మత్సరించి మఱియొకటి యొడ్డి యాడెను. ప్రతిపర్యాయము శకునియే జయించెను. పాండవాగ్రజునకుఁ గోపమత్స

తంబు లతిశయించెను. అది ద్యూతస్వభావమో కాలస్వభావమో యూహింపరాదు. ధర్మరాజుఁడు రెట్టించినపట్టుదలతో నొకొక్కటియొడ్డి యోడి తుదకు రాజ్యంబునే యొడ్డెను. శకుని దానినిగూడఁ గెలిచెను. ధర్మసుతుఁడంతతో మానక తమ్ములనొడ్డెను. వారును గెలువఁబడిరి. ఒడ్డుటకు నొండేమియు లేక తన్నే యొడ్డెను. ఆపందెమునుగూడ శకుని జయించెను. కట్టకడపట ద్రౌపదినొడ్డెను. ఆమెయు విజితయాయెను. మధుపానజూదంబులందు మొదటిది తెలివిని హరించి చెఱచును; రెండవది తెలివితోడనే చెఱచునుమా.

## ద్రౌపదీమానరక్షణము.

దుర్యోధనుఁడు ధన్యుండనైతినని భావించి సంతోషపరవశుఁడై మయసభామందిరంబునఁ దనకై నగిన పాంచాలిని దలంచి 'విదురా! ద్రౌపదిని దోడితెచ్చి నాయిల్లు తుడువ నియమింపు' మనెను. విదురుఁడామాటకుఁ గటకటంబడి 'మూర్ఖా! మదాంధుఁడైన దుర్జనుండు సిరులెడలయ్యెను' మొదటిసంపదలతోడ సమూలంబుగాఁ జెడును. ఏసతీమణి సామ్రాజ్యమహాత్సవంబునకుఁ బరమయోగ్యయై యున్నదో, యాసతీమణిని నవమానించు తలంపు వలదు. ఎఱిఁగి యెఱింగి యాశీవిషంబుల నగలించుచున్నావు. దీనిఫలంబు వేణుఫలంబువోలె సమూలవినాశంబునకు నిమిత్తంబగు' నని హితంబులు వచించెను.

దుర్యోధనుఁడు విదురునకుఁ జెడచెవినిడి ప్రాతకామినిఁ బిలిచి 'విదురుఁ డెప్పుడు నరిష్టంబకాని పలుకఁడు. అతఁడు

పాండవులకు వెఱచును. నీవుపోయి ద్రోపదిని తోడ్కొనిరమ్మనెను. వాఁడు పాంచాలికడకుఁ బోయి భక్తి వినతుఁడై 'దేవీ ! ధర్మనందనుఁడు ధనసంపదలను రాజ్యంబును దమ్ములను దన్ను నిన్ను జూదంబుననొడ్డి యోటువడెను. కౌరవేశ్వరునాజ్ఞ నిన్నుఁ దోడ్కొని పోవచ్చితి. చనుదేర నగు' నని చెప్పెను. ద్రౌపది యేకవస్త్రయు నధోనీవియు నై యుండియు మార్గాంతరంబు గానక యరుదెంచి కురువృద్ధు మ్రోల నిలిచెను. పాండవులు లజ్జాదుఃఖంబులఁ దలలువ్రాల్చిరి. దుర్యోధనుండు దుశ్శాసనుని జూచి 'తమ్ముఁడా ! ప్రాతికామి వృకోదరునకు వెగడుచున్నాఁడు. నీవు చని ద్రౌపది నీడ్చికొని రమ్మ'ని వచించెను. దుశ్శాసనుండు పిఱుందనఁ జని,

'చ॥ తడయక తొందుపల్కుచును దబ్బఱలాడక యింకనీవు నె
క్కడకరుగంగఁబోలుఁ జులుకం జనుదెమ్మిటు సౌబలుండు ని
న్నొడిచె దురోదరంబునఁ గురూత్తము నర్థముపైతి నిన్నునుం,
బుడమిని దమ్ముఁ గోల్పడిరి పార్థి ! భవత్పతులైన పాండవుల్ ॥'

అనుచు డాయ వచ్చెను. ద్రౌపది చుఱచుఱఁ బొక్కుచు 'రజస్వలను, ముట్టకుము ; ఏకవస్త్రనై యున్నాను. ఇట్టి నేను గురుబంధుజనాధిష్ఠితంబైన సభకు నెట్లు రానేర్తు' ననెను. దుశ్శాసనుండు నగుచు 'ఏకవస్త్రవైననేమి ? వివస్త్రవైననేమి ? నిన్నట్లుం దోడ్కొనిపోదు' ననుచు రాజసూయావభృథంబున భూసుర మంత్ర పవిత్ర వారిధారాపావనంబులైన శిరోజంబులఁ దెమల్చి యామె నీడ్చి సభకుఁదెచ్చెను.

భీష్మ విదురాదులు ఱిచ్చపడిరి ; ద్రోణ కృపాచార్యాశ్వత్థామాదులు నోరప్పళించిరి. ఎవ్వరు నడ్డురారైరి.

ద్రౌపది యట్లు దుశ్శాసనావకృష్టయై విశీర్ణ కేశంబులతో విశీర్ణ వదనంబుతోఁ గర్ణదుర్యోధనశకునిసైంధవాది దుష్టభాగాయుక్తంబైన సభను నిల్చి కోపలజ్జాపరవశయై 'ధర్మజుఁడు ధన్యుఁడు గావున దైవయోగహతుఁడయ్యు ధర్మపథంబుఁ దప్పఁడు. కురువృద్ధులారా ! ఈదురాత్ముఁడు నన్నిట్లు తలఁబట్టి యీడ్చి తెచ్చుట చూచుచును నుచితంబుగాదనరైరి. సర్వధర్మవిదులైన భారతవీరులవంశంబు నేఁడధర్మవశమై రాజలోకనింద్యాద్ధృష్టికి బాత్రమయ్యెనా ?' యనెను. ఒక్కరును బదులాడరైరి.

పాండవులు ధర్మంబునకుఁ గట్టువడి పలుకరైరి. సభ్యులు పరమాన్యాయశ్రవణవికర్ణులై మిన్నకుండిరి. వికర్ణుఁడు లేచి 'కురువృద్ధులు నాచార్యులును సభాసదులును బలుకరైరి. అయినను నేను ధర్మనిర్ణయంబు చేసెద వినుండు. జూదంబును వేఁటయును పానంబును బహుభక్షణాసక్తియు నను నాల్గు దుర్వ్యసనంబులఁ దగిలినపురుషుండు ధర్మువుఁ దప్పి వర్తిల్లుటగు. అట్టివానికృత్యంబులు సేకొనందగవు. కితవాహూతుఁడై వ్యసనవర్తియై పరాజితుండైన పాండవాగ్రజుఁడు పాండవుల కందఱకు సాధారణధనంబైన పాంచాలిని బణంబు సేసెం గావున ద్రౌపది యధర్మవిజితయయ్యెను. మఱియు నేకవస్త్రయైన యామానవతిని నిటకుఁ దోడితెచ్చుట యెంతయు నన్యాయం' బనెను.

వికర్ణుని పల్కులకుఁ గర్ణుఁడు కటకటంబడి 'బేలా ! ధర్మువు మాకుఁ దెలియదా ? వృద్ధులమ్రోలఁ జెలుతవు. నీకింత తులువతనమేల ? ధర్మజుఁడు సభాసదులకన్నెదుట

సర్వస్వము నోడ్డి యోటువడెను. ద్రౌపదియు వానికి వెలి గాదు. కావున నిది ధర్మవిజితయగునేగాని నీవన్నట్లుగాదు. అట్లుకానినాఁడు పాండవులంగీకరింతురా ? ఏకవస్త్రను సభకు నీడ్చ్రరాదంటివి. భార్యకు దైవవిహితంబైన భర్తయొక్కరుం డుండును. ఇది యనేకభర్తృకగావున బంధకియనంబడు. అట్టి దానికి మానావమానంబులెక్కడివి ? దానిని విగతవస్త్రనుఁ జేసి తెచ్చినను దోషమగునా ?' యని వానిని గద్దించెను.

దుర్యోధనుఁడు కర్ణునందికొని 'దుశ్శాసనా! పాండవులు సర్వస్వము నోడిరి. కావునఁ బాండవులయు ద్రౌపదియు వస్త్రం బుల హరింపు' మనెను. పాండవులు వలువలొలిచి యుంచిరి. ద్రౌపదికి వెఱపుదోఁపదయ్యెను ; ఎట్టి శరణంబు లేదయ్యెను. ఆమె కృష్ణపాదలగ్నచిత్తయై,

"ఆ॥ వె॥ దిక్కులేని నిఖిలదీనులకచోట్లు,
దిక్కగుచు నెవండు తీర్చునెడరు,
లాదయార్ద్రహృదయుఁ డార్తశరణ్యుండు,
తోడు నిల్చుఁగాక నేఁడునాకు ॥"

అనుచు నిశ్చలభక్తితో నగ్గోవిందుని ధ్యానించుచు మై మఱచెను.

దుశ్శాసనుండు హితాహితవివేకదూరుఁడై ద్రౌపది కట్టిన పుట్టంబును నిండుసభలో నొలిచెను. ఆమె యథా పూర్వము సవస్త్రయై కానవచ్చెను. దుశ్శాసనుం డొక్కొ క్కచీరె నొలుచుటయు నామె యథాపూర్వము సచేలయై యుండుటయుఁ గోకలు రాశిపడుటయుఁ జూచి సభాసదు

లాశ్చర్యపరవశులైరి. దుశ్శాసనుండుక్కుదక్కి లజ్జనొంది నిజో
ద్యమంబును విరమించెను. ఎల్లరకు నది, వింతనయ్యెను.
కర్ణాదులు తమ్ముఁదామే వమ్మైరి, విదురాదులు సంతోష
పరవశులైరి. భీష్మునిచిత్తము కృష్ణునివంకఁ బఱచెను.

గీ॥ ఎల్లయభిమానములుడుల్చి యేకబుద్ధి
సర్వలోకైకపాలుని శరణుగన్న
పరమభక్తుల నెట్టియాపదలనైనఁ
గానకపేరవు, తత్కర్త చెడునుగాక ॥

శరణాగతిని జెప్పునప్పుడు విభీషణశరణాగతిని ద్రౌపదీ
భీష్మశరణాగతులను బేర్కొందురు. అర్థార్థియై విభీషణుఁడును
ఆర్తయై ద్రౌపదియు జిజ్ఞాసువై భీష్ముఁడును శరణొల్లిరి. ఈ
మువ్వుర శరణాగతులందు నిట్టి భావభేదము గలదు. అందు
ద్రౌపదీశరణాగతి సద్యఃఫలప్రాప్తినేగాక భగవంతునిమహిమ
నుగూడ లోకప్రదర్శనము చేయుచున్నది.

వేఱుదిక్కు లేదని తోఁచుట. నీవేదిక్కనునిశ్చయము
భగవంతునెడఁ గలుగుట, బుద్ధి యేకాగ్రమగుట, దేహాభిమా
నాదుల సమగ్రంబుగా వదలుట, సర్వాత్మకంబుగా సమర్పించు
కొనుట, ఈపంచలక్షణంబులు శరణాగతికి ప్రధానములు.
ఇవియైదును సంపూర్ణంబుగాఁగల శరణాగతి యుత్తమోత్తమ
ము. సాధారణంబుగానివి పరమార్తియందు నతితీవ్రముగా
నభివ్యక్తమగుచుండు. ఆర్తిత్వమట్టిదై యున్నది. ఆకారణంబున
నే యార్తులకుఁ బ్రాపించు సద్యఃఫలంబన్యులకు గలుగదు. భగ
వంతునకు భక్తిచేయునప్పు డీరహస్యంబులను మఱవరాదు.

## కుచేలుఁడు.

అవంతిదేశంబున బ్రాహ్మణుఁడు బ్రహ్మవిదుండొకఁడు వట్టి యడియాసలవెంట బఱుగులిడక యథాప్రాప్తసంతృప్తుఁడగుచు గృహస్థాశ్రమము నడపుచుండెను. వానిభార్య పతివ్రతామణియయ్యు నిరంతరదారిద్ర్యక్లేశంబును భరింపఁజాలక యొకనాఁడు భర్తను జేరంజని 'మహాత్మా మనసంసారము దినదినాభివృద్ధిఁ గాంచుచున్నది. భరించువెఱవు దోఁపదు. లక్ష్మీపతికృష్ణుఁడు నీకు బాలసఖుఁడంటివి. ఆమహనీయుఁడు శరణాగతదీక్షారతుండని లోకము వచించుచున్నది. వానివలన మనకష్టంబులు దీరనోపు బిడ్డలమేలనుగ్రహింపు' మని బహువిధంబులఁ బ్రార్థించెను.

అతఁడామె మొఱవిని 'శుభాశుభంబులు ప్రారబ్ధాధీనంబులు తఱింబట్టి యవివచ్చుచుండు. ఈబిడ యెన్నఁడు నన్నిట్లు కోరదు. శుభోదయంబునకుఁ గాలమయ్యెఁ గాఁబోలు. ఈయింటి తలఁపు సేయుదేని యిదికోరు భాగ్యంబుగాకున్నను శ్రీకృష్ణపునస్సందర్శనభాగ్యంబైనను సిద్ధించునుగదా' యని తలపోసి యామెప్రణయంబు నంగీకరించి 'కళ్యాణీ! నీయిచ్చ సేయుదు. దైవవృద్ధబాలురయొద్దకు రిక్తహస్తంబులఁ బోరాదు. ఏదేనియుఁ గలదేని కొనిరమ్మ'నెను. వారియింట నాపూట కూటికిఁగూడ లేదు. ఏమిచేయవలయు? ఆసాధ్వీమణి యిరుగుపొరుగువారి నడిగి నాల్గుపిడికిళ్ళయడుకులు తెచ్చెను. అవి మూటకట్టుటకుఁ బ్రాతపేలికకూడఁ గఱవయ్యెను. వాని వస్త్రమన్ననో చీకిచినిగియుండెను. ఆబిడయెట్లో యయ్యడుకులను వానికొంగున ముడిచెను. అతఁడది చూచి 'కటా!

కృష్ణుఁడెక్కడ ? ఈయదుగులెక్కడ ? వానికివి యెట్లు సమ ర్పింతు ? ఏగతి వానిని సందర్శింతు' నని చింతించి గత్యంతరము గానక ద్వారకకుఁ బోయెను. ద్వారకావాసులతఁడు కట్టి యున్న చీకుగుడ్డను జూచి వానినిఁ గుచేలుఁడనిరి. నాటనుండి యాపేరు వానికి స్థిరమయ్యెను.

కుచేలుఁడు ద్వారకఁజేరి గుల్మంబులు మూఁడుదాఁటి కక్ష్యాత్రయము గడచి కృష్ణుని మందిరముఁజొచ్చెను. అత్తఱిఁ గృష్ణుఁడు హంసతూలికాతల్పంబునఁ బరుండి రుక్మిణితో సల్లా పంబులాడుచుఁ గుచేలుని దవ్వునఁ జూచి తటాలున లేచి యెదురేఁగి యతనినిఁ గవుంగిటఁ గూర్చి యాదరించి పరమా నందబాష్పంబుల నించుచుఁ దోడితెచ్చి తనపాన్పుపయిఁ గూ ర్చుండఁబెట్టి స్వయముగాఁ బూజాద్రవ్యంబులను గొనివచ్చి యతని యడుగులు గడిగి యాతీర్థంబును దలఁదాల్చి 'మిత్ర మా ! సుదామా ! ఎన్నాళ్ళకు నన్నుఁగననోచితి ? కుశలమే గదా ?' యని యోగక్షేమంబులు విచారించెను. కృశించి కళ్యాగతమైయున్న శరీరంబుతో జీర్ణమై కడుమాసినపుట్టంబు తో నున్న యాపేదపాఱునిఁ గృష్ణుఁడట్లు సత్కరించుట రుక్మి ణిగాంచి పతిమనంబు నూహించి మృణాళమృదులంబైన తన హస్తంబున వానికి వీవనవీవసాగెను. దారిద్ర్యావతారమో యననున్న యాబ్రాహ్మణునకు రుక్మిణీకృష్ణులట్లుపచారంబులు చేయుట యంతఃపురజనంబునకు మహాశ్చర్యమయ్యెను.

కృష్ణుఁడు తనహస్తంబున నతనిహస్తంబుఁ గూర్చి 'సు దామా ! గురుకులవాసము సమాప్తిగావించి గురుదక్షిణ యొ ర్పించి గృహస్థాశ్రమము స్వీకరించితివా? మనము సాందీపనియొద్ద

నున్నప్పుడే నీచిత్తం బీమహాత్రయంబునకు దవ్వుగాఁదోఁచెను. తేంద్రియులు లోకసంగ్రహార్థము కర్మపరులగుట గలదు. మిత్రమా ? మనగురుపత్ని యింధనంబులకై మనలఁ బంపుట యు, మనము చని గాఢారణ్యంబుననుండఁగా నుఱుములు మెఱుములతో గాలివానకురియుటయు, గాఢుచీఁకట్లు క్రమ్మి దారిడొంక తెలియరాక యారేయెల్ల మనమందే తిరుగాడుట యు, మనకుగా మనగురువు చింతాద్వితీయుఁడై రేయెల్ల నొక యుగంబుగాఁ బుచ్చి రేపడ వెదకుచు వచ్చి కాననాంతరం బుననున్న మనలను గాంచి 'వత్సలారా ! ప్రాణులకు దేహం బత్యంతప్రియము. అట్టిదానిని మీరు గుర్వర్థము సమర్పించి తిరి. మీచిత్తశుద్ధి యింతనరాదు. ఇంతకుమించిన గురు పూజ గలుగదు. మీగఱచిన విద్య మీకు నుభయలోకశుభ ప్రతిపాదినియగుఁగాక'. అని దీవించుటయు, మఱువవుగదా' యనెను.

సుదాముఁడు కృష్ణుని యాదరణంబున కెంతయుఁ బ్రీతుఁడై 'నాతెచ్చినయటుకులితని కెట్లీయనోర్తు' నని లోలోన సిగ్గుపడసాగెను. కృష్ణుఁడు వానిభావంబు గ్రహించి కొంగు మూటను దానేవిచ్చి 'ఆహా ! ఇవి నాకెంతయుఁ బ్రియం' బని పిడికెడు గైకొని భుజించి రెండవపిడికెడు గ్రహింపనుండె ను. రుక్మిణి తటాలునఁ గృష్ణునికరంబుఁ బట్టికొని 'నాథా ! నీగ్రహించిన పిడికెటితోనే లోకద్వయసంపదలెల్ల నీబ్రాహ్మ ణోత్తమునకు సిద్ధించె'నని వారించెను.

 సుదాముఁడు నాటిరేయి యచ్చనుసుఖముండి తెల్లవాఱి

ప్రయాణోన్ముఖుఁడయ్యెను. కృష్ణుఁడు వానిని గతిపయదూరము సాగనంపి వచ్చెను. కుచేలుఁడు దారిఁబట్టి పోవుచుఁ గృష్ణుఁడు చూపిన ప్రేమగౌరవంబులనే తలపోయసాగెఁగాని తావచ్చిన యర్థంబునే తలంపఁడయ్యెను.

సుదాముఁడు స్వస్థానము చేరెను. అచ్చట దివ్యవిమానమనోహరంబైన మందిరంబు చిత్రోపవనపరివృతమై వివిధవేషభూషణాలంకృత పరిజనబృందంబుతో నిండియున్నది గానవచ్చెను. ఆపేదపాఱు డదిచూచి 'ఇది నాయిల్లుగాదు. దారితప్పితి'నని యావలఁ బోనుండెను. అంతలోన వానిభార్య వచ్చి మ్రొక్కి పతినిలోనికిఁ దోడ్కొనిపోయెను. సుదాముఁడు కొంతవడికి భ్రాంతివీడి 'అహాహా! ఇదంతయుఁ గృష్ణుని నిర్వ్యాజకరుణావిశేషముగాని వేఱుగాదు. భగవంతుఁడు భక్తవాత్సల్యుఁడనుటకు వేఱునిదర్శనంబులేల? భక్తియే సమస్తము సమకూర్చుచుండఁగా నర్థార్థులై వేఱుగా భగవంతుని వేఁడుట వెఱ్ఱితనముగదా? ఎవ్వని కేదియెప్పుడు వలయునో యాసర్వజ్ఞుఁడే యిచ్చుచుండు. భక్తియొక్కటే మర్త్యులకుఁ గర్తవ్యము. వేఱుతలంపులు వృథాయాసంబులు. పరమేశ్వరా! నాభక్తి యింకను సుస్థిరమగునట్లనుగ్రహింపుము.' అనుచు నానందపరవశుఁడయ్యెను. వానిభార్యయు భగవదనుగ్రహంబునకు నెంతయు సంతసించెను.

### మహిమాప్రదర్శన విచారము.

కృష్ణుఁడు చూపినమహిమలకు మేరయేగలుగదు. అవియు నొక్కరూపముగాకఁ జిత్రవిచిత్రంబులుగా నున్నవి. భగవంతుఁడట్లు స్వమహిమలఁ బ్రదర్శింపనేల? యని శంకింప

వచ్చును. భగవంతుఁడు మహిమలను జూపుట స్వశక్తిప్ర దర్శనార్థముగాదు ; లోకానుగ్రహార్థము. ఎట్లాదురా ? భగవచ్ఛక్తి స్వతస్సిద్ధంబు నఖండంబు ననిర్వచనీయంబు ననంతంబునై యున్నది. భగవంతుఁడాత్మశక్తిప్రదర్శనంబున భగవంతుఁడగుట లేదు. భగవంతుఁడెప్పుడును భగవంతుఁడే యగును.

మహిమల ప్రదర్శనంబు లోకానుగ్రహార్థంబెట్లనవచ్చున... జనులు వారివారికర్మానుసారంబుగా జనింతురు. కర్మవాసనలు శుభాశుభమిశ్రంబులు గానుండును. శుభవాసనలు స్వతఃప్రబుద్ధంబులై హితమార్గంబున నడపించును. అశుభవాసనలును మిశ్రవాసనలును స్వోత్కర్షంజేసి సూక్ష్మరూపంబున నుండు శుభవాసనలఁ ద్రొక్కియుంచును. అంతమాత్రాన శుభవాసన లేనిదే నరజన్మమురాదు. అశుభమిశ్రవాసనల త్రొక్కిడి సామాన్య బోధాదులవలనఁ దొలఁగదు. అదితొలంగుటకు నతీతమైన ప్రబోధవలయును. మహిమలు లోకాతీతంబులు గావున మూఢజనప్రబోధనార్థము భగవంతుఁడు ప్రదర్శించును. మూఢదృష్టిని మహిమలాకర్షించునట్లుగా నన్యంబులాకర్షింపవు. దృష్టియెప్పుడు భగవంతునివంకకు మరలునో యప్పుడే భగవదనుగ్రహంబునకుఁ బాత్రుఁడగును.

భగవన్మహిమలు దేశకాలపాత్రోపయుక్తమై చిత్రవిచిత్రంబులుగా నుండును. కొన్ని వేళలనవి సౌమ్యముగాఁ దోచును కొన్ని వేళల మహాఘోరంబులుగాఁ గాన్పించును. ఒక్కొక్క చోట నంశావతారంబులు చాలియుండ... ఒక్కొక్కచోట విశేషావతారము వలసి

యుండును. ఈవిశేషమెల్ల సమయానుసారమై యుండును.

ఇదంతయు నుద్ధరణార్థమేకాని నాశనార్థముగాదు. భగవంతుఁడు పరమకారుణికాత్ముఁడు గావున జీవులయం దేలునే గోరి పాటుపడుచుండును. పాపాత్ముఁనైనను త్యజింపఁడు. నయముచేతనో భయముచేతనో వానిని సన్మార్గంబునకు మరలించుకొనుచుండును. దైవస్వభావంబట్టిదిగా నున్నది.

ఉద్ధరణము వ్యక్తిపరమనియు సంఘపరమనియు రెండు విధంబులు. తదర్థమైన సాధనము ఆజ్ఞామూలకంబనియు బోధమూలకంబనియు రెండు తెఱంగులు. ఆత్మపరిణతి పర్యవసానము ఆజ్ఞ తలను వంపించునేగాని యాత్మపరిణతినిఁ గావింపదు. అందువలన నాజ్ఞాజనితపరిణామము తాత్కాలికమును మిథ్యారూపంబునగు. సత్యమును స్థిరమునైన పరిణామంబు గలుగవలయునన్నచో నంతఃకరణమందు మార్పుపుట్టవలయును. అట్టిమార్పును గలిగించుటకుఁ బ్రబోధమే యుత్తమోపాయము.

వ్యక్తిప్రబోధంబునకు సాధారణంబుగా గురూపదేశంబును శాస్త్రోపదేశంబును సమర్థంబులగు. సంఘప్రబోధంబునకు నట్టివెల్లయెడల సమర్థంబులుగావు. మహిమలందులకుఁ జాలును. ఆకారణంబున మహిమాప్రదర్శనంబునకు నవకాశము గలుగుచున్నది. క్రీస్తువు మహమ్మదు మున్నగు మహాత్ములు మహిమలనుజూపి ప్రజలగుఱికిఁ బాత్రులై స్వమతంబులను స్థాపించినట్లు వానిచరిత్రలే చాటుచున్నవి.

ఒకొక్కప్పుడుపదేశము ఏకవ్యక్తివిషయంబునఁగూడ

నిరర్థకమగుచున్నది. అందులకు నర్జునుఁడే నిదర్శనము. అర్జునుని భావంబును మరలించుటకై శ్రీకృష్ణభగవానుఁడు తత్త్వోపదేశంబెంతో గావించెను. ఎంతచెప్పినను పాండవమధ్యముని నంజలి తీఱదయ్యెను. కృష్ణుఁడది గ్రహించి వానికై విశ్వరూప ప్రదర్శనమహిమను జూపవలసివచ్చెను. దానిని గాంచి నంతట నర్జునుని యసంభావనావిపరీతభావంబు లంతరించెను. అతఁడు పరిణద్ధచిత్తుఁడై కృష్ణునకు దాసోహమ్మనెను.

ఘోరంబులైన విప్లవంబులును రాజవిద్వరంబులును భగవంతుని మహిమంబులేయనియుఁ బ్రచ్ఛన్నవిధానంబున నయ్యవి లోకోపకారంబు నొనరించుచున్నవనియు విజ్ఞులు వచింతురు. ఏదియైనను మేలునకేయగు. తద్రహస్యంబు ప్రాకృతదృష్టికి గోచరింపదు.

### కృష్ణా ! నీవెవండవు ?

గోపబాలకుండవై తివి ; కోటిరాజన్య కిరీటరత్ననీరాజనంబులందితివి. ఆలగాచితివి ; అఖిలవేదాంతసారంబును బిదికితివి. పాటలుపాడితివి; పరమప్రేమరసంబును గ్రుమ్మరించితివి. కృష్ణా ! నీవెవండవు ?

ప్రేలభామలలోఁ బెఱిగితివి ; వీరాతివీరుండవై తివి. అంబోధి దాఁగితివి ; ఆర్యావర్తహృదయంబు నధిష్ఠించితివి. కృష్ణా ! నీవెవండవు ? మహాత్ముండవని కొందఱు నమానుష వ్యక్తివని కొందఱు నవతారమూర్తివని కొందఱు నిన్నుఁ బూజించిరి. నీబలపరాక్రమంబులకు నీరాజనీతికి నెల్లరుఁ దల యొగ్గిరి. నీయలౌకికప్రజ్ఞకు నీయసదృశపాండిత్యంబునకు నీ దయార్ద్రధర్మబుద్ధికి మహర్షులును రాజర్షులును వేదవేత్తలును

నివ్వెఱగంది నీకే యగ్రస్థానంబు నిచ్చిరి. జనులు నిర్వ్యాజ భక్తిస్తోలికల నిన్నూచిరి. దుష్టులు వెలవెలనైరి. కృష్ణా నీవెవండవు ?

కృష్ణా ! కంసునిఁ గూల్చితివి ; కారాములఁ బాపితివి. ప్రేమబీజంబును నాటితివి ; అపూర్వభావంబును బఱచితివి. కృష్ణా ! నీవెవండవు ? నీతత్వంబూహింపరాదు ; నీచరితలద్భుతంబులు. నీవే తండ్రివనియు నీవే గురుండవనియు నీవే దైవంబవనియు లోకము త్రిశుద్ధికి నిన్ను సేవించుటయ్యెను. ఆలకాపరుల నత్యంతవీరులఁ జేసితివి ; నరేంద్రులకు నవ్యమార్గదీపకుండవైతివి. కృష్ణా ! నీవెవండవు ?

కృష్ణా ! యమునాతరంగిణివలె నీవు మధురమూర్తివియు సులభుండవును బ్రాప్యంబు శరణంబునై వెలసితివి. తత్త్వము మాత్రము హిమాలయముకంటె మహోన్నతమై మిన్నులురాయుచు నందరాకున్నది. ప్రాస్వదృష్టికి సర్వసమున్మూలకారిమైన ప్రలయఝంఝానిలంబువలెఁ దోఁచెదవు? సమాసన్నులకు శీతకరశీతలమూర్తివగుదువు. అంతఃకలహావిభక్తమైన యార్యావర్తంబు నేకచ్ఛత్రచ్ఛాయకుఁ దెచ్చుటఁజూచి నిన్నుఁ రాజసమూర్తిఁగా భావించిరి. వేదాంతవేత్తలయు ఋషిసత్తములయు బుద్ధికినందని నీమతంబునుగాంచి నిన్ను సత్త్వపారావతారంబుగా గణించిరి. కృష్ణా ! నీవెవండవు ?

కృష్ణా ! సిరికి నీయఱచేయి యిల్లయ్యెను. నీకు నిల్లువ నీడగాని, కుడువఁగూడుగాని గలుగదు. ఎల్లరగృహద్వారాదేహంబులందు వర్తింతువు. నీకు స్వగృహద్వారాదేహంబి

మానంబులుగలుగవు. లౌకికావర్తంబునఁజిక్కి పరిభ్రమింతువు; పరమసన్న్యాసివై చరింతువు. నీవున్నచోటు బ్రహ్మానందమై దనరు ; నీవు మాత్రము కేవలుండవై యుందువు. జీవప్రకృతులు నిన్ననుసరించును. నీవెవ్వరిననుసరింపవు. నీ జీవితంబెల్ల విపరీతమై తోఁచు. కృష్ణా ! నీ వెవండవు ;

కృష్ణా ! నీకై లోకమెల్లఁ దరిలేని విభ్రాంతి గూలెను; నీవో తాఁకితాఁకనట్లుందువు. నీగుణంబులు పరస్పరవిరుద్ధంబులు; నీవర్తనంబిట్టిదనరాదు. మర్త్యమాత్రుండవో యనుటకు నేతలు మర్త్యలోకాతీతంబులు. ఐంద్రజాలకుండవో యను టకు నీయెడ మాయగానరాదు. అహో ! కృష్ణా ! ని న్నూహించుటెట్లు ?

కృష్ణా ! నీసంగతి నీసమకాలికులకే వింతయయ్యెను. పంచసహస్రాధిక దుర్మోహాంధకార నిమగ్నులకు మాకు నేఁడు గోచరించునా ? నిన్నూహింపఁజాలక యూహ యురి యాడుచున్నది. నిన్ను వర్ణింపనోడి వాక్కు వలసపోవు టయ్యెను. వేదాంతగోచరుండవనిరి. వేదాంతముగూడ నిన్ను 'నేతినేతి' యని పల్కునేగాని యిదమిత్థమనదు. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'యని నిన్నుఁ బల్కిరి. అవియెల్ల నీకు విశే షణంబులగునేగాని నీవుగావు. ఇఁక నిన్నెఱుంగుటెట్లో ?

కృష్ణా ! నీస్వరూపజ్ఞానం బలభ్యమైననగుగాక. నీ యుపదేశజ్ఞానంబైనను సమగ్రంబుగా సిద్ధించునాయనిన నదియు దుర్లభమేయాయెను. నీబోధలపరమార్థంబిదియని నాటికి నేటికిఁ దేలదు. అంతఃకరణపరిణతింబట్టియు బ్రజ్ఞాతిశయం

బునుబట్టియు నీభావంబునూహించిరి. వానికిని దుదగానరాదు.

కృష్ణా! ఉపనిషత్సారంబును బిండి చూరవిచ్చితివి. మోక్షము పరమప్రాప్యమంటివి. అజ్ఞానంబు ప్రతిబంధక మని తెలిపితివి. అజ్ఞానకార్యంబుల నిరూపించితివి. అజ్ఞాన వినాశంబునకు మార్గంబులుగాఁ గర్మభక్తిజ్ఞానంబులఁ జూపితివి. అవి యంగాంగిక్రమంబున నజ్ఞానంబును హరించునంటివి. జ్ఞానము స్వతస్సిద్ధమై ప్రకాశించునంటివి. జ్ఞానంబు పరోక్షంబనియు నపరోక్షంబనియు విశదీకరించితివి. సన్యాసరహస్యంబును జాటించితివి. లోకభ్రాంతిఁ దొలఁగించితివి. కృష్ణా! నీవెవండవు ?

కృష్ణా! నీబోధను స్వానుష్ఠానపూర్వకంబుగాఁ దెలిపితివి. నీమార్గంబున వర్తింపుమంటివి. హింసాతత్త్వంబును వివరించితివి ; విశ్వభ్రాంతిని దీర్చితివి. కృష్ణా! నీజ్ఞానమార్గము వ్యాసశంకరాదులకు నుగ్గితయయ్యెను ; నీభక్తిరసంబు గోపికాహృదయాంతరంబులు నిండియుబికి వెలిబ్రాఁకి యము నాచార్యుని దడిపి రామానుజాచార్యు నోలలాడించి దేశంబున శాఖోపశాఖలై పఱచి నింబార్గమధ్వవల్లభాచార్యులకు దప్పిదీర్చి చైతన్య చండీదాస విద్యాపతుల ముంచి, మీరాబాయి తుకారాం నృసింహ మెహతాదులకుఁ బరమపానియమై యాసేతుహిమాచలంబు ప్రవహించెను.

కృష్ణా! నీభక్తిరసంబును వర్ణింపఁ గవీంద్రులు కవితాశక్తినెల్లఁ బ్రదర్శించిరి ; యోగులు యోగశక్తినెల్ల వ్యయించిరి ; నీబాలక్రీడాభివర్ణనంబుతోడ విష్ణుచిత్తునకుఁ గాలము

గడచెను ; నీబృందావనలీలలను జిత్రించుటకు ఆండాలమ్మకు జీవితము చాలదయ్యెను. నిన్ను వర్ణించు కులశేఖరుఁడు రాజకులశేఖరుఁడయ్యెను. నీభక్తిరసపానవివశులై నీపాటలతోడ నాళ్వారులు కడతేరిరి ; జయదేవమహాకవి గీతాగోవిందంబు నన న్యసాధ్యామృతమధుర కవితాకృతిరచించి శాశ్వతుఁడయ్యెను; లీలాశుకునకు నీపేరు కర్ణామృతమయ్యెను. ఆహా ! కృష్ణా ! నీవెవండవు ?

కృష్ణా ! నీవు కలవో లేవో ? యనుసందేహంబుతోఁ గొందఱుంతరించుచున్నారు. నీతత్వవిచారముతోఁ గొందఱుజీవితంబు వృథపోవుచున్నది. నీమూర్తిచింతనంబుతోఁ గొందఱును, నీనామస్మరణంబుతోఁ గొందఱును నీలీలావినోదంబులతోఁ గొందఱును ధన్యధన్యులగుచున్నారు. నిన్నునమ్మి నీయందుగుఱినిల్పి నీతోడిదేలోకంబుగా భావించి నిన్నారాధించువారు సంసృతి సాగరంబు ననాయాసంబుగా దాఁటి యనన్యసాధ్యంబును బరమప్రాప్యంబునైన యఖండానందశైలాగ్రంబు నధిష్ఠించిభవత్పదంబును శాశ్వతానంతావ్యగ్ర నిరుపమానయోగిమనోమాత్రగోచరంబైన దానిని జేరుచున్నారు.

కృష్ణా !-నీవెవండవో తెలియదు. నిన్ను నమ్మితిని ; నీపాదంబుల మదిఁగూర్చితిని ; నీవేగతియంటిని ; ఇతఃపరం బెఱుఁగనైతిని. నీటముంతువో పాలముంతువోయూహింపరాదు; పదినీవొనర్చినను నాకదిమేలేయగు. ప్రారబ్ధనాసనలంజేసి పరకాంక్షలు ప్రాఁకులాడుచుండు; బుద్ధివిమోహామగు; అహితంబు హితంబైతోఁచు. ఆర్తత్రాణదీక్షాధురంధరా ! ఆదిమధ్యాంతర౦-తా ! అఖిలలోకశరణ్యా ! అమృతస్వరూపా ! అనంతా

త్మకా! సమస్తభ్రాంతులఁ జోపి యీ వరాటునిపై వాత్సల్యంబు నింపుము.

శా॥ ఏనొక్కింతయు లేదు ప్రాయమది వ్రాలంజొచ్చె నే వేళనో
జీవంబుల్ చనుఁ జిహ్వాలాసములతో జీర్ణించె సామర్థ్యముల్,
దేవా! యింతటనైనఁ జేకొనవె యీ దీనాతి దీనాత్మకున్
నీవే దిక్కని నమ్మితిన్ శిరమునన్ నీపాదముల్ గూర్చితిన్॥

ద్యూతకర్మదోషప్రాయశ్చిత్తము.

పాండవులు ద్యూతదోషఫలంబుగా సమస్తముఁ గోల్పోయి తత్పాపపరిహారార్థమునకును రాజ్యపునఃప్రాప్తికినిఁ బ్రాయశ్చిత్తమోయన ద్వాదశవర్షవనవాసంబు నొక్కయేడజ్ఞాతవాసంబును గ్రహించి ద్రౌపదితోడఁ గాషాయాంబరంబులు గట్టి భీష్మవిదురకృపద్రోణాచార్యాదులకు మ్రొక్కి వారిదీవెనలంది కుంతీదేవికిఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి యనుజ్ఞవేడిరి. ఆమె వారింజూచి 'కటా! ఇట్టి దుర్వ్యసనోపహతులైన మిమ్ముఁ జూడవలసిన మందభాగ్యంబు నోచితి' నని విలాపించి 'హా! కృష్ణా! ద్వారకాపురీశ్వరా! నీపాదాంభోరుహాశ్రితులైన వీరికి నీవే దిక్కు'ని లోలోన స్మరించి, ద్రౌపదిని గవుంగిటఁ గ్రుచ్చి 'అమ్మా! నీవలన ద్రుపదపాండువంశంబులు రెండును బవిత్రములయ్యెను. భర్తలననుగమించి వారినిగొల్చు పుణ్యంబు నోచితి'వని పల్కి కొడుకులను గోడలిని దీవించి పుచ్చెను.

కృష్ణుఁడు పాండవుల నోదార్చుట.

పాండవులట్లు పురంబు వెడలి యరణ్యముసొచ్చి కామ్యకవనంబుఁ జేరిరి. వారిరాక విని పాంచాలయాదవ వృష్ణిభోజాదులెల్లరుఁ గృష్ణునితోడ వారి కడకు నేతెంచిరి. పాండవులు

వారికెంతయు లజ్జపడిరి. కృష్ణుఁడది గ్రహించి 'ధర్మజా! యుయుధానునివలన నింతయు విని యరుదెంచితి. ఆపన్నుఁడవైన నిన్నుఁజూడ మహాదుఃఖమయ్యెడు. అయ్యెడ నేను మీయొద్దనుండమింజేసి యిట్టి దుర్వ్యసనంబు సంభవించెను. కామజంబులైన స్త్రీమాతమృగయాపానంబులు నాల్గు దుర్వ్యసనంబులకు ద్వారంబులగు. అందు ద్యూతంబు విశేషించి యనర్థమూలంబు. వానిని బరిహరింపనినాఁడు పాపంబగు. గతంబునకు వగచియు ఫలంబులేదు. కృప ద్రోణ విదుర గాంగేయులం దోడుసేసికొని యాంబికేయు నోడంబఱచి దుష్టద్యూతఫలంబు సర్వప్రకారంబుల నివారింతు. నాహితంబును వినరేని వారిని నిగ్రహింతు. నేనుండఁగా మీకు గష్టంబులు వచ్చునా?' యని ధైర్యోక్తులు పలికెను.

అంతలోన ద్రౌపది కృష్ణునొద్దకు వచ్చి మోడ్పుఁ గేలితో 'మహాత్మా! నీయెఱుంగనిదెద్దియు లేదు. అయినను నాపడిన పరాభవంబు విన్నవింతు. పాండుమహీపతికిఁ గోడలనై యుద్ధకుశలులైన పాండుతనూజులకు భార్యనై నీసఖుఁడైన ధృష్టద్యుమ్నునకు భగినినై యుండియు దుశ్శాసనునిచేఁ దలపట్టి సభకు నీడ్వఁబడి యప్పాపకర్మునిచేఁ గోక యొలువంబడితి. ఇంతకన్నఁ బరిభవంబు గలుగదు. ఆదురాత్ములట్లు చేయుచున్నను బాండవులు మిన్నక చూచుచుండిరి. భీష్మాది కురువృద్ధబంధుజనులు పలుకరైరి. భ్రాతృపుత్త్రబంధుజనంబులు నామఁ గలిగియు లేనివారైరి. అప్పుడు కర్ణుఁడు నన్నుఁ జూచినగినపువ్వు దుస్సేనుచేయుదికంటె నతిదారుణమై శిఖియవోలె నామనంబు నేర్చుచున్నది. బాలకేళీవినోదంబునన్నున్న

నాఁడు ప్రమాణకోటియందు నిద్రించుచుండిన భీమసేను నంటఁగట్టి గంగామడుఁగునఁ ద్రోయించిరి. జననీసహితులైన మమ్ము లక్కయిల్లు సొనిపి యగ్నిఁ బ్రయోగించిరి. వారు చేసినయపకారంబు లిన్నియనరావు. ఇవన్నియు నొకయెత్తును రాజలోకసమక్షంబున నధర్మద్యూతంబున దుర్యోధనుఁడు రాజ్యంబు నపహరించి యవమానించి గుట్టలకుఁ దోలుట యొకయెత్తు నయ్యెను. ఈదుఃఖసాగరంబు నీదుటెట్లో' యని వలవల నేడ్చెను.

కృష్ణుఁడామెపయిఁ గరుణార్ద్రదృష్టి నెఱపి 'అమ్మా! వగవవలదు; ధృతరాష్ట్రబలసంహారరూపంబున నీహృదయ తాపంబుఁ జల్లారు. నావచనంబు తప్ప'దని యోదార్చి వారిని వీడ్కొని సుభద్రాభిమన్యులఁ దోడ్కొని ద్వారకకు నరిగెను.

### సత్యభామా కృష్ణులు పాండవులకడకు వచ్చుట.

పాండవు లంతట ద్వైతవనంబునకు వచ్చి యందుఁ గొన్నాళ్లు గడపి సరస్వతీతీరనివాసంబుఁ గోరి యటఁ గతిప యకాలంబు పుచ్చి మరలఁ గామ్యకవనంబుఁ జేరిరి. అప్పటికి వారి వనవాసకాలంబునందు స్వల్పభాగంబవశిష్టమై యుండెను.

అత్తరి సత్యభామ తాను ద్రౌపదినిజూడఁగోరి కృష్ణునిఁ బ్రేరేపించెను. కొండొకనాఁడు కృష్ణుఁడు సత్యభామాద్వితీయుఁడై కామ్యకవనంబునకుఁ బాండవులయొద్దకు వచ్చెను. ధర్మజాదులు వారిని యథావిధి సత్కరించిరి. కృష్ణుండును జిరకాలదర్శనోల్లాసితంబులైన యాలోకనంబుల ధనంజయు

నాదరించి 'ధర్మనందనా ! మనపార్థుఁడు హరసుర్జరాదులవలనఁ గృతాస్త్రుఁడై వచ్చెనని వింటిని. నీవెంతయు ధన్యుఁడవైతివి. ఇవియెల్ల నీధర్మనిష్ఠాతపః ఫలంబులుగాని వేఱుగావు. శమదమంబులును సత్యంబును నిత్యతృప్తియు ధైర్యనిగూఢబుద్ధియు నీకు నైజంబులయ్యెను. కామలోభంబుల నెన్నఁడుఁ బొందవు. దుర్యోధనరచితంబులైనవ్యథలను నిష్కంప ధైర్యోన్నతిసహింప నీకే చెల్లెను. నీవు సత్యసంధాబద్ధుండవై విక్రమంబొల్లమిం జేసి కౌరవాధములయుద్ధతి సాగెను. అట్లుగాకున్నఁ జతురంభోధిపరీతధరాతల సామ్రాజ్యలక్ష్మికిఁ బతివైన నీవు తలంచిన దానికి నడ్డుగలుగునా ? పాండవాగ్రజా ! అంధకవృష్టిభోజకుకురభూపతులు నీయెడ బాంధవ సౌహార్దప్రణయభక్తివిశేషంబుల నెంతయుఁగలిగి నీయెడరుఁ దీర్పఁబూనియున్నా' రనెను. నావుడు 'కృష్ణా ! అన్నిటికి నీ వేగలవు. నీశరణుసొచ్చినమాకు శుభంబుగాక మఱియొండగునా ? అల్పావశిష్టంబైన యివ్వనవాసంబు నజ్ఞాతవాసంబు నెట్లోగడుపుదుము. అనంతరము నీయిచ్చ' యనెను.

అంతలోనఁ బాంచాలి యటకు వచ్చెను. కృష్ణుఁడామెను జూచి 'కళ్యాణీ ! నీపుత్త్రలేవురు యదుకుమారులతోడఁ బరమస్నేహంబుఁ గలిగి కరితురగారోహణ వివిధ శస్త్రాస్త్రవిద్యలఁ గఱచుచు నొండు మఱచి ద్వారకానగరంబున సుఖమున్నారు. ప్రద్యుమ్నుఁడు వారికి దివ్యాస్త్రజాతంబు నిచ్చెను. సుభద్ర తనపుత్త్రునికంటె నీతనయులఁ గూర్మి నించుచుండును. మీయెడరు తీఱుకాలంబుగూడ సమీపించుచున్న' దని యూరార్పులు పలికెను.

అయ్యవసరంబున మార్కండేయమహర్షి యటకువచ్చెను. వానిని గృష్ణుండును పాండవులును యథోక్తవిధులఁ బూజించి 'మహాత్మా! నీవలన సకలధర్మంబు నెఱుంగఁ గుతూహల పడుచున్నా' మనిరి. అంతలోన నటకు నారదుఁడువచ్చి మార్కండేయుంజూచి 'మునిసత్తమా! పరమపుణ్యాకథాకథనంబునఁ గృష్ణపాండవప్రియహితార్థం బొనరింపు'మని చెప్పి చనియెను.

మార్కండేయమహర్షి ధర్మజునకు నారాయణ ప్రభావంబుఁ జెప్పి

శా॥ నాకమ్మైఁబోడసూపెఁదాను గృపతోనాఁడందు నేఁడియ్యెడన్
నీకుం గాదిలిచుట్టమై సచివుఁడై నెయ్యుండునై యున్నపు
ణ్యాకారుం గమలాయతాక్షుఁ గరుణైకాయత్తు నత్యుత్తమ
శ్లోకుం గృష్ణునిఁ గంటి నాసుకృతముల్ శోభిల్లెఁ బక్వంబులై॥

ధర్మజా! ఈ దేవదేవుని కరుణంజేసి నిర్వికారనిఃఖేదుండనై యుందును. వీని సాన్నిధ్యంబునఁ జేసి నాకుఁ బూర్వస్మృతి యొదవెను. ఈపరమపురుషుని గృష్ణుని శరణుఁజొచ్చు' మనెను.

మార్కండేయుఁడట్లు కృష్ణపరమతత్త్వంబును సూచించి ధర్మనందనునకు సకలధర్మంబుల బోధించెను. అప్పుడు కృష్ణుఁడచ్చట నెంతకాలముండెనో తెలియదు. మార్కండేయ కథాకథనాంతంబువఱకు నుండి యనంతరము వారిని వీడ్కొని ద్వారకకుఁ గృష్ణుఁడు జనెనని యూహింపనగు.

### దుర్వాసుని యాతిథ్యము.

ఒకనాఁడు పాండవులును ద్రౌపదియు భోజనము గావించి సుఖోపవిష్టులై యుండఁగా నపరాహ్ణానంతరంబు

దుర్వాసుఁడు శిష్యులతోడఁ బాండవుల యొద్దకు వచ్చెను. ఆవచ్చినవారు భోజనము చేయకుండుట పాండునందనుం డెఱింగి యెల్లరకు నాతిథ్యము నిమంత్రించి యేటికిఁజని త్వరగా స్నాన మాచరించి రమ్మనెను. వారు స్నానార్థము చనిరి. ఆసం గతి ద్రౌపదికిఁ దెలిపిరి. వంటసామగ్రి యత్యల్పముగా నుండెను. వంటచేయుటకు వ్యవధియు లేదయ్యెను. ద్రౌపది చింతాకులయై 'కటా ! దుర్వాసుఁడు కోపనుఁడు ; ఆయన వచ్చులోపల భోజనము సిద్ధముగాకున్నఁ దప్పక యతఁడు శపించును. ఏమిచేయనగు' నని పెద్దయుం దలపోసి 'హా ! కృష్ణా ! సర్వలోకాత్మకా ! నీవేగతి'యని వానినిధ్యానించెను.

కృష్ణుఁడత్తఱి ద్వారకానగరంబున రుక్మిణితో సరస సల్లాపంబులాడుచుండి ద్రౌపదీధ్యానోద్వేగంబెదతట్టఁగాఁ దో డ్తోడ నామెకట్టెదుటఁ దోఁచి 'అమ్మా ! ఆఁకలిమెండుగా నున్నది. పిడికెడన్నము పెట్టు' మనెను. ద్రౌపది యాపిలు పునకు బహిర్ముఖయై కృష్ణుని విని తలవ్రాల్చి 'ఎల్లరు భోజ నము గావించిరి. మెదుకైనను లేదు. సుంతనిదానించిన వంటచేయుదు' ననెను. కృష్ణుఁడామెను వినక వంటపాత్రను జూపుమనెను. ఆమె యట్లేగావించి 'చూడు మెదుకైననులే' దనెను. కృష్ణుడాపాత్రనుశోధించి యందంటుకొని యున్న యన్నశాకంబును భుజించి గ్రక్కునత్రేపి ధర్మజునొద్దకువచ్చి 'అతిథులింకనురారా ? ప్రొద్దుపోయె' ననెను. కృష్ణుఁడెప్పుడు వచ్చెనో ఆతిథ్యమునెట్లు వినెనో ధర్మనందనుఁడూహింపక విస్మితుఁడై యతిథులఁదోడ్కొనివచ్చుటకు భీమునిఁబంపెను.

దుర్వాసుఁడును వానిశిష్యులును స్నానమాడి గట్టునకు వచ్చునప్పటికి వారియుదరంబులు నిండి త్రేపులు రాసాగెను.

ఆవింతకు వారాశ్చర్యపడుచుండఁగా భీముఁడు వచ్చి 'అయ్యా అకాలమయ్యెను; భోజనంబునకు దయచేయుం'డని త్వరపెట్టెను. అమ్మహర్షియు శిష్యులునొకరిమొకరు చూచుచు 'అయ్యో! నిమంత్రణంబు నంగీకరించితిమి. ఎంతో శ్రమపడి వండి యుందురు. పొట్టలుబ్బి గొంతువరకు బూరటిల్లుచున్నవి. ఒక్క మెతుకైనను బట్టుతావు లేదు. అటకుఁబోయి కుడువకున్నఁ బాండవులు శపించినను శపింతురు. వారంతటి శక్తిసంపన్నులు. ఇదంతయుఁ గృష్ణుని మహిమగాని వేఱుగాదు. అయ్యో! దుర్యోధనునకుఁ బ్రియంబు గూర్పను ద్రౌపది భక్తిని బరీక్షింపను వచ్చితిమి. ఆమె మనలనే పరీక్షించుచున్న'దనుచు భీమునకు మాఱుపల్కక నోరు కాలికి బుద్ధిచెప్పిరి. కృష్ణుఁడంతట నంతర్థానమయ్యెను.

ద్రౌపది కామ్యకవనాంతరంబునుండి ప్రార్థించుట, ద్వారకలోనున్న కృష్ణుఁడు విని వచ్చుట, అట్టిమహిమచూపుట కొందఱకుఁ గల్పితంబులుగాఁ దోఁపవచ్చును. ఆకాశవాణి (రేడియో) కన్నారఁ జూచుచుఁ జెవులారవినుచు నింకను నిట్టివిషయంబులగూర్చి సంశయంబులేల? సర్వవ్యాపియైన భగవంతునకు దవ్వుదగ్గఱలు కలవా? గజేంద్రుఁడెక్కడ? వైకుంఠమెక్కడ? అతఁడు సర్వాత్మకంబుగాఁ బ్రార్థించినంతనే.

'మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై ॥

అన్నట్లుగా హుటాహుటివానికిఁ బ్రత్యక్షము కాఁడా? భక్తియెప్పుడు పరమార్తిప్రేరితమై యేకాగ్రతనొందిన తీవ్ర,

మగునో యప్పుడే భగవంతుఁడు వానిని భావించి ప్రార్థించినట్టి యారూపంబునఁ బ్రత్యక్షమగును. భగవత్ప్రత్యక్షకాలము భక్తిగతింబట్టియుండు. ఆకాశవీచికాగతి మందమధ్యమ తీవ్రంబులని మువ్విధమనియు, అందు రేడియోధ్వనిని ఏవీచికాగతికి ననుసంధానము చేయుదురో ఆవీచికాగతి ననుసరించి ప్రచారంబుండుననియు రేడియో శాస్త్రజ్ఞులు వచింతురు. అట్లే భక్తిగతిసహితంబని గ్రహింపనగు. రేడియోగతిత్రయము అనుదాత్త ఉదాత్త స్వరితంబులకు సరిపోవునేమో యెఱుంగనగు. పాశ్చాత్యులు గతిత్రయంబును మాత్రమే సాధించిరి. మనశాస్త్రము సప్తగతులను సప్తమండలంబులను దెలుపుచున్నది. సృష్టిరహస్యంబు లింక నెన్నో గలవు.

పాండవరాజ్యపునస్సంపాదనవిచారము.

పాండవులు ద్వాదశవర్ష వనవాసంబుఁ గడపి మాఱువేషంబులు దాల్చి విరటునిఁగొల్చి యజ్ఞాతవాసవత్సరంబుఁ బుచ్చిరి. పాండవులగుట్టు వెల్లడయ్యెను. విరటుఁడు మహాసంతోషమంది పాండవుల యభ్యుదయసూచకంబుగా ధర్మనందనునిఁ దనసింహాసనంబుపయిఁ నిల్పి తనపుత్త్రికయైన యుత్తరను సుభద్రార్జునుల పుత్త్రుఁడైన యభిమన్యునకు వివాహము చేయసంకల్పించి ద్వారకకుఁ దెలిపి బంధుమిత్త్రాదిరాజన్యలోకంబునకు నాహ్వానంబులు పంపెను.

కృష్ణుఁడు సాత్యకీ బలరామసమేతుఁడై సుభద్రాభిమన్యులఁ దోడ్కొని కృతవర్మ ప్రద్యుమ్న సాంబయుయుధాన రుక్మిణ్యాదులతోడను, నింద్రసేనాది పాండవసారథులతోడను, యాదవకుమారులతోడను జనుదెంచెను. ద్రుపద

రాజు బంధుమిత్ర పుత్ర పరివారంబుగా నరుదెంచెను. రాజన్యులు నానాదేశంబులనుండి వచ్చిరి. రెండు తెలుఁగుల చుట్టరికముల సమక్షంబున నుత్తరాకల్యాణము మహోత్సాహ మానంబుగా జరిగెను.

కల్యాణమంటపమందు నానారాజన్యులుగూడి పాండవులకు పోరిరాజ్యంబును మరలఁ గైకొనఁగ సంకల్పించి కృష్ణుని పంపఁ జూచిరి. కృష్ణుఁడు వారిమనంబు గ్రహించి 'రాజన్యులారా! సభాసదులారా! మీతలంపు విదితమయ్యెను. పాండవులకుఁ బైతృకంబైన రాజ్యంబును దుర్యోధనుండు కపట ద్యూతంబున నపహరించుటయేగాక ద్రౌపదీసహితంబుగా వారిని బరిభవించి యడవులకుఁ దోలెను. పాండవులు సత్యంబునకుఁ గట్టువడి, శక్తిమంతులయ్యు స్వరాజ్యపదభ్రంశంబునోర్చి ఘోరవిపినంబులు దూఱి క్రూరసత్త్వరాక్షసావళితోడఁ బదు రెండు వర్షంబులు గడపి యజ్ఞాతవాసవర్షంబు నెట్లో పుచ్చి సమయంబుఁ గాచిరి. పదుమూడవయేఁడు గడచుటకై వారు పడిన పాట్లుపాహింపనగునేదాని వచింపఁగాదు. దిగ్విజయంబు చేసి యలవరించుకొన్న రాజ్యంబును జేతులారఁ గోల్పోవుటకుఁ దోడుగా ధార్తరాష్ట్రులొనర్చిన యపకారంబులు గూడ పాండవుల హృదయంబులందుఁ గ్రోధాగ్ని రగిల్చెను. ఆయగ్ని తీవ్రముగా మండుచున్నది. కుంతీతనయులు తమబలపరాక్రమ శౌర్యోన్నతుల నెఱింగింతుమనుచున్నారు. గాంధారీతనయుండు పాండవుల లెక్కింపక సంగరముఖంబున వారిని బరిమార్పఁ దలంచును. వారికి సహాయసంపద యనంతముగానున్నది. ధర్మపరులగు రాజులు పాండవపక్షంబునఁ జేరుదురు. ఉభయ

పక్షంబులు దేవాసురులట్లు ఘోరసంగ్రామంబునకుఁ గడంగు ను. తత్ఫలంబుగా నార్యావర్తమందెల్ల మహాక్లేశం బాపాదించును. రక్తపాతంబగు. కార్యము మించకమున్నె యుభయపక్షంబులకు వెయ్యాదిమేల్కో యరసి చేయనగు. అధర్మమార్గంబున మహేంద్రాధిపత్యంబు చేకూరనున్నను ధర్మనందనుండొల్లఁడు. ధర్మపక్షంబు మెట్టి యొక్కయూరిచ్చినను నతఁడు సంతుష్టుఁడగు. పాండవాగ్రజుఁడు కౌరవశ్రేయంబుఁ గోరుచుండునేగాని వారికి నెగ్గునోయఁడు. దుర్యోధనుని భావంబు తెలియదు. ఎదిరిమతంబెఱుంగక యెద్దియు నిశ్చయింపరాదు. తగువానిఁబంపి దుర్యోధనుని మనంబెఱుంగుట యుక్తము. అతఁడు ధర్మాధర్మంబులు పరిశీలించి పాండవులకు రాజ్యంబు పాలిచ్చిన మేలగు. అట్లు చేయఁడేని నప్పటికిఁ దగినది మీరే నిశ్చయింపనగు' ననెను.

బలరాముఁడు కృష్ణునినందికొని 'ఇది యిరు తెఱంగుల వారికి హితంబు ధర్మోత్తరంబునై యున్నది. కుంతీనందనులు సగఁబాలు వదలనున్నప్పుడు కాదనుట కౌరవులకుఁ దగవు గాదు. ఇయ్యిరువురకు నిట్లుపొత్తుగూర్తురేని నపాయంబు దప్పును. బాంధవలోకంబెల్లఁ బ్రియంపడును; జగమెల్ల సుఖముగానుండు. ఈపని నెడసేయక యొక్కనిఁ బంపవలయును. అందులకు నెల్లరుఁదగరు. కార్యసాధనంబునకుఁ దగువానిని నియమింపవలయును. అతఁడు నయవినయంబులఁ గౌరవేంద్రునిచిత్తవృత్తి గ్రహించి యనువుగావర్తించి వానిం బ్రార్థించి కార్యంబును సాధింపవలయును. మఱియు నతఁడు కౌరవేంద్రునితో 'రాజా! ధర్మనందనుఁడు జూదంబునఁ గోరి

వచ్చినవాఁడు గాదు. నీపుత్త్రుఁడు దుర్యోధనుఁడు నిన్నుఁ బ్రేరేపింపఁగా నీవు సుతవాత్సల్యంబునఁ జేసి వానికిఁ బ్రియం బొనర్చువాఁడవై విదురుని బంపి ధర్మనందనుని రప్పించితివి. వానికి నక్షవిద్యాపాటవంబు గలుగదు. అదియెఱింగి తదీయులు వలదనివానిని వారించిరి. అతఁడు వారిని వినక తండ్రివైన నీయాజ్ఞను దలఁదాల్చివచ్చెను. దుర్యోధన ధర్మనందను లిద్దఱుఁ బాచికలాడియున్న ఫలంబెట్టిదిగా నుండియుండునో తెలియదు. దూతకళాపరిణతుఁడైన శకునిని వానికి నెదురు పెట్టితివి. ఇవినీకుఁ గ్రొత్తగావు. ఈవిషయంబులనెల్లఁ దలంచి యుభయులకు క్షేమంబును బ్రసాదింపు'మని యచ్చచెప్పి పనిని దీర్చికొనరానగు' నని పలికెను.

ఆమాటలకు సాత్యకి కటకటంపడి 'కౌరవులు కపట ద్యూతంబున రాజ్యంబపహరించిరి. దురాత్ములకు సిరిదక్కదు. పాండవులు కేలొగ్గి దుష్టుల యాచింపనేల ? దైన్యంబు నెంత మాత్రము దూతచూపరాదు. సమయంబును జ్ఞప్తిచేసి ధర్మజురాజ్యంబు నడుగనిమ్ము. ధృతరాష్ట్రుండందులకు నియ్య కొన్న వానికినాత్మగౌరవము దక్కును. విరుద్ధభాషణంబు లాడెనేనిఁ దత్ఫలంబతఁడనుభవించు'నని నాటఁబల్కెను.

ద్రుపదుఁడు వానినండికొని 'దుర్యోధనుఁడు సహజ దుష్టాత్ముఁడు. అతఁడు స్వబలపరాక్రమ సహాయసంపదల నమ్మి విఱ్ఱవీఁగుచున్నాఁడు. వానిమదాంధత్వము హితంబును విననీయదు. ప్రియవచనంబులకు నతఁడు లొంగఁడు; రాజ్య ముఁ బంచి యీయఁడు. ఇది సిద్ధము. యుద్ధంబునఁగాని వాఁడు చక్కంబడఁడు. భీష్మద్రోణాదులు వానికి హితంబు

గలుపరాయనవచ్చు. కూటికై వారక్కుమతి ననుసరింతురు. ధృతరాష్ట్రుఁడన్ననో కొడుకుమాటకుఁ మాఱాడఁడు. కర్ణుఁడు కయ్యమునకు గాలుద్రవ్వుచుండు. ఎట్లు విచారించినను సంగరము తప్పుచొప్పుగానరాదు. కాలవిలంబము సేయక పిలువందగినరాజులకుఁ బిలుపు పంచి బలంబులఁ గూర్పనగు. దుర్యోధనుఁడు మున్నుగా నరపతుల సాహాయ్యముఁగోరును. వారు మాటయిచ్చి తప్పరు. వెసగలకాలరులఁ బుచ్చి శల్య కేకయాది భూపతులకును వారివారి బంధుమిత్రజనంబునకును నెఱింగించుట కార్యమగు'నని పలికి చేరువనున్న తనపురోహితుని జూచి 'ఆలోన వీనిని ధృతరాష్ట్రునొద్దకుఁ బంపనగు' ననెను.

కృష్ణుఁడు వానినివిని 'రాజోత్తమా! మాకుఁ బాండవ కౌరవు లొక్కరూపయగుదురు. ఉభయుల శుభంబుల నపేక్షింతుము. పెండ్లికై పిల్వఁబడఁగా వచ్చితిమి. మావచ్చిన కార్యము తీఱెను. ఇఁకఁ దడయరాదు. ద్వారకకుఁ జనువారము. రాజేంద్రా! మీరు మాకెల్లరకు గురుస్థానంబు. మీమాటను ధృతరాష్ట్రుఁడు గూడ బహుమానించును; శాంతనవుఁడు మిమ్ము గొనియాడుచుండు; మీయెడ ద్రోణకృపాచార్యులు సఖ్యంబుఁ బాటింతురు. అట్లగుటం జేసి పాండవార్థమై యొక్కరుఁబనుప మీరే తగుదురు. మీపలుకే యందఱుపలుకగు. మీమాట వినని వారు చెడక మానరు. పొందు కుదిరిన నెల్లరకు మేలగు. విరసమైనచో నెల్లరాజుల రావించి పిదప మమ్ముఁ బిలువనంపునది' నని వచించి వారిని వీడ్కొని బలరామసాత్యకి సమేతంబుగా ద్వారకకు జనెను.

తక్కటిరాజన్యులు వివాహార్థము వచ్చినవారు సంగ్రామ సన్నాహంబునకై తమతమ పురంబులకుఁ జనిరి. ద్రుపదుఁడు వానిపురోహితుని హస్తినాపురంబునకుఁ బంపెను.

యాదవకుల వినాశ శాపము.

కృష్ణుఁడు ద్వారకఁజేరినకొన్నాళ్ళకు కణ్వనారదగాధేయులు వానిని సందర్శించుటకుగా నప్పురంబునకు వచ్చిరి. కపిలగడ్డంబులతోఁ గవిలజడలతోఁ బురవీధి వచ్చుచున్న యా ఋషిసత్తములను వృష్ణికుమారులు చూచి వారినిభరిహాసించు తలంపున సాంబునకు స్త్రీవేషము వైచి వారియొద్దకుఁగొనిపోయి దొంగదండంబులుపెట్టి 'మహాత్ములారా! ఈపడఁతి రాజుభార్య గర్భవతియయ్యెను. ఏబిడ్డను గనునో సెలవీయవేడుదు'మనిరి.

ఆ తపోధనులు వారియాగడంబునకు మహాకోపమంది "ఇతడు కృష్ణునికొడుకు సాంబుఁడు. వీనిగర్భంబున సకల యాదవకులక్షయకారియైన ముసలంబు జనించును. రామ కృష్ణులు దక్క యాదవులెల్లరు దీనికారణంబున నశింతురు. పొం'డని పల్కి కృష్ణుని సందర్శించుట భావ్యముగాదని మరలి పోయిరి.

ఆసంగతి కృష్ణుఁడు విని 'కాలనియతిని దప్పింపఁదగ' దని నిశ్చయించి బంధువులతో 'మనవారియకార్యఫలంబుగా నెంతమూడెనో చూడుఁ' డని పల్కి మిన్నకుండెను.

ద్రుపదపురోహితుని దౌత్యము.

ద్రుపదుని పురోహితుఁడు హస్తినాపురముఁజేరి మొట్ట మొదట ధృతరాష్ట్రుని సందర్శించి యనంతరము కృప ద్రోణ

విదురగాంగేయాదులను సముచితాలాపంబులఁ బ్రసన్నచిత్తులఁ జేసికొని, తర్వాత దుర్యోధనునితో సంభాషించి కొలఁదిదినంబు లందేయుండి యొకనాఁడు కౌరవేశ్వరుఁడు పేరోలగంబున్న యవసరంబున నటకుఁ బోయి సమస్తసేనాపతులఁ గలయంగనుంగొని 'ధర్మవిదులారా! ద్రుపదరాజు నొద్దనుండి వచ్చితిని. ధృతరాష్ట్రుండును పాండురాజును సహోదరులగుట లోకవిదితము. తండ్రులధనంబును బుత్త్రులు గొనుటధర్మము. కౌరవపాండవులట్లే గావించి సుఖముండిరి. వారికై దేశమెల్ల సంతసించెను. కాలవశంబుననో కర్మవశంబుననో ద్యూతభావము తలయెత్తెను. అదియు ధర్మయుక్తముగాక వంచనాయుతమయ్యెను. దీనికెల్లఁ గౌరవేంద్రుఁడియ్యకొనెను. ద్యూతఫలంబుగాఁ బాండవులకు రాజ్యభ్రంశంబును వనవాసాజ్ఞాతవాసంబులును సంభవించెను. పాంచాలినిఁ జీరమాసియున్నదానిని బలాత్కారముగాఁ బట్టితెచ్చి నిండుసభలో దానిపతుల కట్టెదుటఁ జీరలొలుచుటయ్యెను. పాండవులట్టి దౌర్భాగ్యంబు నోచియు మాటకుఁ గట్టుబడి దైన్యవృత్తితో నుగ్రాటవులఁ గాలము పుచ్చిరి. ఇవియెల్ల మీకు విదితంబులు. ఇన్నియిడుమలు గుడిచియు వారు మీతో సంధికోరుచున్నారు. వారట్లుగోరుట నిఖిలప్రజానాశంబునకు వెఱచియేగాని యొండుగాదు. కేవల బాహుబలసేనాబలంబుల నమ్మి యధర్మయుద్ధంబు సేయుట మేలుగాదు. పాండవుల ననదలుగాఁ దలంపవలదు. భీముని బాహుబలంబును నర్జునుని గాండీవబలంబును మీకుఁ గ్రొత్తలుగావు. మఱియు వివిధోపాయజ్ఞుఁడును రిపుజనభయంకరుండును మంత్రరక్షణకళా

ప్రావీణ్యుండును సమధిక ధైర్యవివేకాదిగుణోత్తరుండును నిఖిల విద్యాజాలసంవేదియునైన మాధవుండు వారిదిక్కుననున్నాఁడు. పాండవేయులకు నసాధ్యంబు గలుగదు. ఇవి యెల్ల మీరు ధర్మనిష్ఠాబుద్ధిఁ బరిశీలించి యుభయపక్షంబులకు హితంబును బ్రియంబునగు మార్గంబు నిర్ణయించి పాండవులను బిల్వఁబంచి కొండొకనేల వారికిచ్చి కూడిమనుట యిరువురకు మేలగు. అదను దప్పవలదు ; తప్పి విత్తిన ఫలింప'దనెను.

భీష్ముఁడు వాని వంకమరలి 'ఆర్యవర్యా ! నీవచనంబు లెంతయు సమాదరణీయంబులు. పాండునందనులు వారు పడినబాములు మఱచి యీసుదక్క సుహృజ్జనబాంధవులతో గలసి సుఖముండుట యెల్లరకు సంతోషమగు. పైతృకంబైన ధనంబున వారిపాలిచ్చి వారిని దనసుతులనువలె మన్నించుటవలన మనఱేఁడు సర్వలోకసంభావితుఁడగును. ధర్మంబును మెచ్చు' ననెను.

ఆమాటలకుఁ గర్ణుఁడు కనలి 'అయ్యా ! జగమెల్ల నెఱింగిన దానిఁ గూర్చి మీరిట్లాడుట వింతయయ్యెడు. దుర్యోధనునికై శకుని జూదమాడెను. ధర్మజుఁడది యొల్లఁడేని వాసి నప్పుడే యాక్షేపించియుండనగు. పల్లెత్తుమాట పల్కక వానితో నాడెను ; సమస్తము నోడెను. ఇందుఁ గపటంబొండె నధర్మంబొండె నేమిగలదు ? పాండవులు గుట్టల మ్రగ్గిరంటివి. అట్టి పందెము నొడ్డనేల ? ఇప్పుడు చింతింపనేల ? బుద్ధిపూర్వకంబుగాఁ గోల్పడిన దానిని మరలఁగోరనగునా ? కోరినంతనే యదివచ్చునా ? యుద్ధము తప్పదంటివి. కానిమ్ము రానిమ్ము ; కౌరవులు గాజులు దొడిగియుండరు. వట్టిబెదిరింపులకుఁ

గురుసింహంబులు వెఱచి పఱచునవిగా' వని గంభీరముగా నుడివెను.

ఆవచనంబులకు భీష్ముఁడు మహారోషమంది 'కర్ణా! నీమాటవిన్న నవ్వువచ్చెడు. అర్జునుఁడొక్కరుఁడే నాఁడు మనల నార్వురఁ జించి చెండాడి నప్పుడు నీ మొనగాడుదనం బేమాయె' నని గద్దించెను. ధృతరాష్ట్రుఁడు గాంగేయు ననుసరించి గాంధేయుని గిసిసి ద్రుపదరాజపురోహితునితో 'భూసురోత్తమా! నేనును బంధుమిత్ర విబుధజనంబును గలసి యెల్లరకుఁ బ్రీతి యగునట్లుగా విచారించి యాబిడ్డలపాలికి సామ్యు నొక్కనిఁ బంపెదను. మీరు ముందుగాఁజని నామనోగతిని వారికిఁ దెలుపనగు' నని చెప్పి కనకాభరణ వస్త్రతాంబూలాదిమర్యాదలతో వానిని వీడ్కొలిపెను. ఆబ్రాహ్మణుఁడు ద్రుపదు పట్టణము చేరి తనపోయివచ్చిన తెఱంగు వారికిఁ దెలిపెను.

### సమరసన్నాహము.

పాంచాలురకును గౌరవులకునుఁ గల పూర్వవైరానలంబు పాంచాలీమానభంగరూప ప్రళయానిలంబున రేఁగి భగభగమండుచుండుటం జేసి పాండవులు సంధికోరుట వారి కొంతమాత్రమును సమ్మతముగాదు. కౌరవశరరక్తంబు లొలిచి భూతంబులకు బలి యిచ్చునందాఁక తమకు బ్రశాంతి కలుగదని వారునిశ్చయించి సమరసన్నాహంబులందుండిరి. మఱియు పాండవులు వలదన్నను యుద్ధముతోలఁగు మార్గము లేకుండెను. ఈయుద్ధంబు కౌరవపాండవ యుద్ధంబనుటకన్నఁ గురుపాంచాలయుద్ధంబనుట యుపపన్నంబగు.

శ్రీకృష్ణుని కౌరవపాండవులు సాహాయ్యముకోరుట.

యుద్ధంబు తప్పదగుట నిరుపక్షంబులవారు తమతమ బంధుమిత్రాదులకుఁ దెలియపఱచిరి. ఆర్యావర్తమెల్ల నుద్వు డికెను. రాజవర్యులు యుద్ధసన్నద్ధులు కాసాగిరి. కృష్ణుని సంగతి స్పష్టపడకుండెను. వాసుదేవుఁ డేవలననుండునో యావంక జయపతాక నిల్చునని యుభయపక్షంబులకు స్పష్టము. వానిసహాయంబును మున్నుగాఁ గోరుట యుభయులకుఁ బ్రధానకార్యమయ్యెను. హస్తినాపురంబునుండి దుర్యోధనుడు తరలెను. ఉపప్లవంబునుండి యర్జునుఁడు బయలుదేరెను. ఇరువురు ద్వారకఁ జేరిరి.

వారువచ్చుతఱికిఁ గృష్ణుఁడు నిద్రించుచుండెను. వానికి నిద్రాభంగంబుఁ గలిగింప వెఱచి వానితలయంపి వంకనున్న పీటపయి దుర్యోధనుఁడు కూర్చుండెను. కృష్ణుని పాదంబుల మ్రోల నేలపయి నర్జునుఁడు చదికిలఁబడెను. కొంతవడికిఁ గృష్ణుఁడు మేల్కాంచి పాదంబులవలననున్న యర్జునుని దొలుదొల్తఁ గాంచి తలవంకనున్న దుర్యోధనునిఁ దర్వాతఁ జూచి యిరువురకు మర్యాదలొనర్చి వారువచ్చినపనియడిగెను.

దుర్యోధనుఁడు మునుపడి 'కృష్ణా! బాంధవ్యంబును బట్టియేని మైత్రిం జేసియేని మేమిరువురము నీకొక్కరూపయగుదుము. నేను ముందువచ్చితిని. మున్నువచ్చినవానిని మన్నించుట సజ్జనసంప్రదాయము. అది తలపోసి నీవు నాకుఁ దోడు కావలయు' ననెను. నాఁపుడు 'దుర్యోధనా! నీవు ముందు వచ్చియుండవచ్చు. మొట్టమొదట నర్జునుఁడు నా

కంటబడెను. ఇరువురకుఁ దోడ్పడుట నాకు ధర్మమగు. నారాయణబలంబనెడి నాగోపబలము గలదు. వారు సమర కోవిదులుగాని సామాన్యులుగారు. ఒకతలవారు నొకతల నేను నుందుము. ఒక్క టిసిజము. ఏ ప్రక్కనున్నను నేనెంత మాత్రము నాయుధంబుఁ బట్టుటలేదు. ఇది నా వ్రతము. ఈరెండు తెఱంగులలో మీ కెయ్యది ప్రియమో యదికోరనగు. అర్జునుఁడు నీకు చిన్నవాఁడు. తొలుత బాలుని గోరనీయుట ధర్మ'మని కృష్ణుఁడు పల్కి 'అర్జునా! ఈరెంట నీకెయ్యది యిష్టమోకోరు' మనెను.

'నీవేనాకుఁజాలు'నని యర్జునుఁడనెను. దుర్యోధనుఁ డామాటవిని కత్తిపట్టని యొంటి కృష్ణునకన్న లోకవిఖ్యాతి గాంచిన నారాయణబలంబు తనకుఁ జేకూరుట పరమభాగ్యం బని యెంచి 'కృష్ణా! నారాయణబలంబే నాకుఁ జాలు'నని పల్కి యందుండి బలరామునికడకుఁ బోయెను.

దుర్యోధనుఁడు చన్నంతటఁ గృష్ణుఁడర్జునునిజూచి 'పార్థా! కత్తి పట్టనని గట్టిగాఁ దెలిపినను నన్నేకోరితివేల? యనెను. అర్జునుఁడు నమ్రుఁడై 'పురుషోత్తమా! రణంబునకై సహాయంబొల్ల, నిన్నెదిరించి మనువారు ముల్లోకంబులఁ గలు గరు. నీవు సమరంబుచేయకునికియుఁ బ్రియంబ. విజయ మూలంబైన నీతోడు నాకుఁ గల్గినఁ జాలు. కావున నిన్నుఁ గోరికొంటి. 'నీసారథ్య గౌరవంబును నాకుఁ గృపసేయు' మనెను. కృష్ణుఁడు చిఱునవ్వు దాల్చి 'అర్జునా! అట్లే నీయిచ్ఛఁ జేయుదు' నని పలికి వానిని దోడ్కొని యుపప్లవంబునకుఁ దరలెను.

దుర్యోధనుఁడు బలరాముని జూచి తావచ్చినకార్యముఁ దెలిపెను. ఆయన వానిని విని 'రాజోత్తమా ! ఈయుద్ధంబున నేనెవ్వరివంక నుండరాదని నిశ్చయించుకొంటిని. నాసంగతి వదలుము. మీరెల్లరు భరతవంశజులు. భరతవంశము ధర్మంబునకుఁ బుట్టిల్లని ప్రసిద్ధిఁ గాంచెను. ధర్మంబెడసి యుద్ధంబొనర్పవల' దనెను. అంతట దుర్యోధనుఁడు ద్వారక నున్న ముఖ్యులనెల్ల సందర్శించెను. కృతవర్మాదులు దుర్యోధనునివలను నిల్చిరి. సాత్యకి యర్జునుని వంకఁ జేరెను. దుర్యోధనుఁడిట్లు తనవారెవ్వరో నిశ్చయించుకొని హస్తినాపురమునకు మరలెను.

### సంజయుని రాయబారము.

ధృతరాష్ట్రుఁడిట్లు ద్రుపదపురోహితుని బంచి సంజయుని రావించి 'సంజయా ! పాండవు లుపప్లవనంబునకు వచ్చియున్నారు. పితృభాగంబునకు వారర్హులగుదురు. వారు మనతోఁగూడి యుండుట మేలగు. వారు మనల నమ్మఁబోరు. అయినను హితాహితజ్ఞుఁడు ధర్మజుఁడు గలఁడు. నీవటకుఁబోయి తండ్రి పంపఁగా వచ్చితినని చెప్పి వారిహృదయంబులు పరితోషించునట్లుగా వర్తింపు' మని పుచ్చెను.

సంజయుఁడుపప్లవంబుచేరి తనరాక తెలిపి నిండుకొలువున్న ధర్మజుని సందర్శించెను. పాండునందనులు వానికిఁ దగు మర్యాదలు గావించిరి. సంజయుఁడు వారిని కుశలంబరసి కొంతవడిఁ బుచ్చి 'ధర్మనందనా ! ఎవని కెప్పుడేమివచ్చునో యెఱుంగరాదు. సుఖదుఃఖంబులును గలి[illegible] ప్రాణి

కోటికి సహజంబులు. వానికిఁ దొలఁగి జీవించినవ్యక్తియే గానరాదు. పూర్వకర్మఫలంబులై యవి వచ్చునేగాని యొరులవలనఁ గ్రొత్తగాఁ గలుగునవి కావు. పరులు నిమిత్తమాత్రులగుదురు. ఈరహస్యంబు నెఱింగినవిజ్ఞులు వానిని సహింతురేగాని వానిం బురస్కరించుకొని వర్తింపరు. ఈ యర్థంబు నీకుఁ దెలియనిదిగాదు. ధర్మజ్ఞా! ఈసందర్భంబులెల్ల విచారించి కౌరవ పాండవవంశంబులు సమూలనాశంబుఁ బొరయని వెఱవూహింపుము. నీచకార్యము నీకుఁదగదు; మచ్చకు నెడమీయకుము. సర్వక్షయకరంబు మహోపద్రవప్రదంబునైన కార్యంబును ప్రాజ్ఞులు మన్నింపరు. బంధుశ్రేయముఁ గోరునాఁడెంతయు నుత్తముఁడు. ఆత్మీయులను జంపి బ్రతుకుటయు నొక బ్రదుకా? జయాపజయంబులరెంట నీకగు మేలు నాకుఁ గానరాదు. ధర్మనందనా! కేల్మోడ్చి ప్రార్థింతు. కురుపాండుకులంబులకు రెంటికిఁ బ్రశాంతిఁ గూర్పుము.'

'ధర్మజ్ఞా! ముదిమిం చేసి ధృతరాష్ట్రునకుఁ జిత్తంబొకరీతి గాదు. ఆకారణంబున నతఁడు సుతుని యుద్ధతిని మాన్పలేఁడయ్యెను. వానికి హితులైనను గల్గరాయనవచ్చును. వాని కడనున్న వారొండొరుమాటఁ బోవు వారు గారు. వారినంతగా గణింపఁబనిలేదు. నీవు శిశిరశీతలహృదయుండవై గతంబెల్ల మఱచి భావిమహాదయంబునకు బీజంబు నాటి నీయజాతశత్రుత్వంబును నిఖిలలోక విశ్రుతమొనర్పుము. పాండవాగ్రణీ! ఎట్లయిన నీవుపశమించుట మేలగు. నీకుఁ గుణశీలా

మహాలుండెంతయు సంతసిల్లు. వానికి ననుమతంబైన తెన్ను సర్వలోకసమ్మతంబగు' నని పలికి సభవంక మరలి

"ఉ॥ మ్రొక్కెద వాసుదేవునకు మాద్రీసుతులు సవ్యసాచికిన్,
దక్కటి మిత్ర బాంధవ హిత ప్రియ మంత్రి వయస్యకోటికిన్.
మ్రొక్కుచు విన్నవించెద నసూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ,
యక్కరుణాకరుల్ శరణమైనది వేఁడెదఁ గ్రోధశాంతికిన్."

అని సభా నమస్కారంబొనర్చెను.

ధర్మజుఁడు వాని నాలకించి 'సంజయా ! నేను నెయ్యము నే గోరుదు. తలంపునఁగూడఁ బోరు మాకు వలదు. కయ్యము లేకుండుట యెల్లరకు మంచిదేగదా. పోరులేకయే యర్థసిద్ధియగునేని వలదని వెడఁగైనను బల్కునా ? సంజయా ! మేము తృష్ణావశవర్తులమై చరించువారముగాము. అట్లని భోగంబుల సన్యసించుట గాదు. ఒక్కమాటచెప్పెద వినుము. ఎదిరినిఁ దనయట్లు భావించినఁ బొత్తుకుదురును. అట్లు గాక కుడుము తాఁదినుచు నొరుని వక్క గొఱుకుమన్నఁ బొందు కుదురునా ?' యనెను.

సంజయుఁడాపల్కులు విని 'ధర్మనందనా ! నీవు ధర్మ తత్పరుండవగుట లోకవిదితము. సర్వలోకసామ్రాజ్యా ధిపత్యము చేకూఱినను జీవికిఁ జావు తప్పదు. ఇంతమాత్ర నకుఁగా నిందఱఁజంపి రుధిర ప్రదిగ్ధమైనరాజ్యంబును భోగించు టకన్న భిక్షమెత్తి జీవింపవచ్చును. జీవితము క్షణభంగురం బును దుఃఖమయంబు నగుట యెఱిఁగి తదర్థమై యధర్మంబు నాచరించుటకన్న నజ్ఞానంబు గలుగదు. ఎల్లయనర్థంబులకుఁ

గ్రామము బీజము. దానిని జయింపనినాఁడు సుఖము లేదు. పాండవాగ్రణీ! వేదంబులను గఱచితివి; బ్రహ్మచర్యం బాచరించితివి; పెద్దల సేవించితివి. యజ్ఞంబు లొనర్చితివి. అట్టి నీవు స్వల్పంబునకై పాపంబు నొడికట్ట తగదు. ఇచ్చటఁ జేయు పాపపుణ్యాంబు లిందే యంతరింపవు. వానిఫలంబు లోకాంతరంబులవఱకు వ్యాపించును. అర్థకాంక్ష నిన్ను యుద్ధంబునకుఁ బురికొల్పునేని నీవిన్నాళ్ళనల్పిన ధర్మవ్రతము నిరర్థకమగు. ధర్మజా! క్రోధంబునకుఁ జిక్కి దేశంబును రుధిరప్లుతము చేయవలదు. తండ్రులును దమ్ములును బంధుమిత్రవర్గంబుఁ జనఁగా దేశమెల్ల ననాథస్త్రీజననవిలాపమయముగాఁగా రాజ్యమేల? మ్రుక్కడులకుఁ జెవియొగ్గవలదు. ఆత్మకళ్యాణంబునకు భంగంబు కానట్లు వర్తింపు' మనెను.

కృష్ణుఁడంతట వానిమాటనందికొని, 'సంజయా! కురుపాండవులకు నుభయులకు నిరంతరము మేలు గోరుచుండుదు. వారికి నన్యోన్యమైత్రి నెంతయు నపేక్షింతు. ఒండు వారికి నుపదేశింపను ధర్మజుఁడు సంధినే గోరుచుండు. ఇదినాకు స్పష్టము. ధార్తరాష్ట్రులతలంపు వేఱుగానున్నది. సంధి కుదురు టెట్లు? వీరిపగలు నానాటికిఁ బెఱుఁగుచున్నవి. అది వింతగాదు. సంజయా! ధర్మజుఁడు నీకుఁ గ్రొత్తగాడు. వానినెఱింగియు నింద వానిపయి మోపనేల?'

'సంజయా! ధర్మమంటివి. ధర్మమనఁగానేమి? త్రికాలాబాధితంబైన సత్పదార్థంబేదో మెఱింగి దానితత్వమేమో గ్రహించి తదనుగుణంబుగా వర్తించుట

అందులకుఁ బ్రతికూలముగా నడచుట యధర్మమగు. సత్పదార్థము కేవలాఖండానందాత్మకము. ఆయానందంబునకై యెల్లరు శ్రమింతురు. శ్రమఫలంబాత్మగతమైన యానందమగు ; అది పరవ్యాప్తిఁగాంచినఁ బ్రేమయగు. ఆప్రేమ యాశ్రయంబునుబట్టి బహురూపనామంబులఁ బరగుచుండు. ఎవఁడట్టి యానందంబును దాననుభవించుచుఁ బరులకుఁ గూడ నందఁ జేయునో యతఁడే ధర్తవేత్తయు ధర్మవర్తనుఁడు నగు. వాని వృత్తమే ధర్మము. ఈక్రమమునే లోకోపకారంబనియుఁ బ్రజారంజనంబనియు నానావిధంబులఁ బేర్కొందురు. అట్లు చేయుటయే త్యాగము సన్యాసము సమస్తమునగు. అది యాత్మార్థమాత్రంబగుటయే లోభము రాగము నపకారము నగు.'

'సంజయా ! ధర్మాచరణంబున జ్ఞానకర్మంబులు రెండు నంగాంగిభావంబున నంతర్భూతంబులగు. జ్ఞానంబాఁకలివంటిది. కర్మంబుకుడుచుట కుడువఁబెట్టుట వంటిది. ఆఁకలి తీఱుట తీర్చుట విజ్ఞానంబువంటిది. కావున నట్టిజ్ఞానంబునఁగాని వట్టి కర్మంబునఁగాని ఫలంబు లేదు. రెండును గలసిమెలసి వర్తింపవలయును. అప్పుడు లోకకళ్యాణమగు

'సంజయా ! ధర్మప్రతిపాదనార్థము జ్ఞానకర్మంబులు రెండుఁగలసి వర్తింపవలయునంటిని. జ్ఞానము విషయబోధఁ గావించును ; కర్మంబనుష్ఠానసాధనంబగు. సిద్ధికి మార్గంబులు దేశకాలపాత్రోచితంబులై నానావిధంబులగును. ఒకరికర్మం బొకరికి సరిపడదు ; గాలివీచునేగాని యెండగాయదు.

సూర్యుఁడు ప్రకాశించునేగాని గాలివీవఁడు. ఏదియెవరికి నైజ మో దాని నతఁడు చేయును. ఇదియే స్వధర్మము.'

'సంజయా ! ధర్మజుని స్వధర్మమేమి ? కురుపాండవులు క్షత్రియవంశ్యులు. క్షత్రియులకు ధర్మపరిపాలనరూపధర్మ ము స్వధర్మమగు. పాలించుటకు రాజ్యము వలయును. రాజ్య మును వదలినచో ధర్మజునకు స్వధర్మానుష్ఠానంబునకు నవకాశ మేమిగలదు ? అట్టి యవకాశంబును గలిగింపక వానిని ధర్మ మాచరింపుమనిన ఫలమేమి ? అదియెట్లు సాగును ?'

'సంజయా ! ఎల్లధర్మానుష్ఠానంబులు లోకకళ్యాణార్థ మనిచెప్పితిని. అనుష్ఠానఫలంబు లోకగతమైన లోకకళ్యాణమగు. అట్లుగాక యది యాత్మార్థమేయైన నధర్మమగు. ఇది నీకు స్పష్టము. స్వార్థమనఁగాఁ బరార్థసంగ్రహణమేగదా. అది దుర్నయమగుఁగదా. అట్టివాఁడు పాలకత్వంబునకుఁ దగునా? కాదని యట్టివానికి నధికారమిచ్చినచోఁ గంచెచేను మేయు టగు గదా ?

'సంజయా ! అధర్మము విపరీతము గావున దానిని లోకము సహింపదు. అధర్మవర్తిని సంస్కరించుటో పరిష్క రించుటో యగు. సంస్కారము నాల్గువిధంబులు. వానిని సామ దాన భేద దండంబులందురు. అవి యుత్తరోత్తర తీవ్రతరంబులు. వానినిఁ శాస్త్రోచితఁబుగాఁ బ్రయోగింతు రు. దండంబు బహువ్యక్తిపరమగునేని యుద్ధమనఁబడు. ఈ సంస్కారమే రాజధర్మము.

'సంజయా ? ధృతరాష్ట్రుండును బాండురాజును దోఁబుట్టువులు. వారుభయులుకలసి రాజ్యంబును వృద్ధిపఱచి పరిపాలించుచుండిరి. పాండురాజు చన్నంతటఁ గురుపాండవులు రాజ్యంబును విభజించికొనిరి. పాండవరాజ్యంబు నపహరించు సంకల్పము దుర్యోధనునకుఁ గలిగెను. శకుని వానికిఁ దోడ్పడెను. మాయాద్యూతంబును రచించిరి; పాండవులరాజ్యంబును హరించిరి ; వారిని గుట్టలకుఁ దోలిరి. ఇందుఁ బరధనాపహారియెవఁడో ! వానికార్యం బధర్మంబుగాదో, దానిని సంస్కరింపవలదో నీవే చెప్పుము'.

'సంజయా ! జూదమెవ్వరికిఁదగదు. ఇఁక రాజుసంగతి చెప్పనేల ? కుంతీనందనుఁడు రాజుగానుండి ద్యూతరూపాధర్మం బొనర్చెను. తత్ప్రాయశ్చిత్తముగా నతఁడు సిరినోడి వనవాసియై కష్టంబులు కుడిచెను. దోషమే శిక్షించుఁ గావున ధర్మజుని వానిదోషంబట్లు శిక్షించెను. అతఁడు శిక్షితుఁడై పునీతుఁడయ్యెను. పాండవులు సమయము చెల్లించి వారిరాజ్యంబును గోరిరి. దుర్యోధనుఁడు నిరసించెను. ఇది తెలివాటు గాదా ? ధరణీపాలునకు నదితగునా ? తగని నాఁడతఁడు శిక్షార్హుఁడుగాఁడా ?'

'సంజయా ! దుర్యోధనుఁడు పరమపతివ్రతారత్నంబు నేకవస్త్రను గురులుపట్టి యీడ్పించి నిండుసభలోఁ జీరలొలిపించెను ; ఆమెకుఁ దనయూరవు చూపెను ; అందుఁగూర్చుండ సన్నచేసెను. వన్యుఁడైన నట్లుచేయునా ? ఇదంతయు నామె పతులకన్నెదుట జరిపెను ... నకన్న ఘోరముగలదా?

ఇదేగతి వానిభార్యకుఁగల్గిన నతఁడు సహించునా ? ఇంతటి రాగద్వేషపూరితుని పరిపాలనంబున ధర్మంబునకుఁ దావు గలదా ? ఈపాతకము దప్పునా ?' యని పలికి ధర్మజునివంకకు మరలి 'పాండవాగ్రణీ ! ధార్తరాష్ట్రులు శతులగుదురుగాక. వారు మీకు నపకారంబులొనర్చి యుందురు గాక. మనము సంధినే కోరవలయు. 'సంధిమిచ్ఛంతిసాధవః' అనిరి. సంధికై సర్వయత్నంబు లొనర్పు' మనెను.

నావుడు 'కృష్ణా ! ఈకార్యంబునకు నీకంటె నేర్పరులు గలుగరు. ఉభయులకు నీవు కూర్తువు. సర్వధర్మంబులు నీ యెడ మూర్తీభవించియుండు. నీమాట నెల్లరుఁ దలదాల్తురు. ఉభయవంశక్షేమంబును జగన్మంగళంబును గోరి ధర్మమువంక దృష్టి నిలిపి యెల్లరకు మేలుగూర్చి మమ్మేలుము. నీవే మాకు దిక్కు ; మాప్రణయంబు నంగీకరింపు' మని ధర్మజుఁడు వేఁడెను. కృష్ణుఁడు తలయూచి 'సంజయా ! ధర్మజుని మాట కాదనఁజాల. వానితలంపు సేయుదు. కౌరవులయెద్దకు వత్తు ; సంధికై యథాశక్తి యత్నింతు. నామాట వారు విందురుగాక' యనెను.

ధృతరాష్ట్రుని తలంపును దుర్యోధనుని నిశ్చయంబును పాండవుల భావంబును గృష్ణుని తాత్పర్యంబును సంజయుఁడు తలపోసి యతనిరాయబారమునకు నీర్ష్యవిడిచి హస్తినాపురం బునకు మరలెను.

సంధియా ! సమరమా !

"ఉపప్లవ్యంబు వెలిగుడారంబులతోనిండి హంసంబులతోడి

నీలాంబుకాసారంబువలెఁ దోఁచెను. గజఘీంకారంబులును హయహేషలును రథనేమినిర్ఘోషంబులును బెనుఁగొని సాగరఘోషను బురుడించెను. ఎడతెగని పాండవబలంబులు కౌరవరక్తాస్వాదనంబునకు నాల్కలఁ జాపెను. అట్లు పాండవానీకంబొకవంక క్రోధపరవశమై రణకండూతి భుజంబులు రాయుచు నిప్పులు గ్రక్కుచున్నను గృష్ణుఁడు సంధిఁ గూర్చి యుద్ధము వారించి యార్యావర్తవినాశంబు దప్పింప హస్తినాపురప్రయాణంబును నిశ్చయించెను.

ధర్మజుఁడు కృష్ణునొద్దకు వచ్చి 'కృష్ణా! నీప్రయాణంబునకు నేనే కారణము. అట్లాడియు నాయెదలో విపరీతభావంబేలకో యుదయించెను. నిన్నుఁ బంపుటను గూర్చి పర్యాలోచించితిని. నీవు పోవుట యుక్తముగాఁ దోఁపదు. మిత్రభావంబుతో వర్తింతువుగాక; వేయిహితంబులఁ బల్కుదువుగాక. దుర్యోధనుఁడు నిన్ను వినఁబోఁడు. శత్రువుల మధ్యకు నీవు చనుట తగ' దనెను. కృష్ణుఁడాపల్కులు విని 'రాజోత్తమా! ధార్తరాష్ట్రుల దుస్స్వభావము నాకుఁ గ్రొత్త గాదు. నాకుఁగా భయము వలదు. నారాయబారము రిత్త వోవదు. ఫలంబెట్లున్నను సంధికై తుదివఱకు యత్నింపవలయును. నిందకు మనము సందియ్యరా'దనెను.

ధర్మజుఁడంతట నెమ్మది వహించి 'కృష్ణా! నీయిచ్ఛ చేయుము. శుభమగుఁగాక. ఏది మాకు మేలో యదినీకు స్పష్టము. ఏమిపలుకవలయునో ఎట్లు వర్తింపవలయునో నీకు నేర్పువారు లేరు. నీవే మాకు బంధుండవును మిత్రుండవు. భరత

వంశంబునకుఁ విశ్రాంతిఁగూర్పుము. ఉభయులముఁ దృప్తిపొం
యుండుమాడ్కిఁ జేయు' మనెను.

కృష్ణుఁడు వానిమనంబు గ్రహించి 'ధర్మనందనా!
యావజ్జీవబ్రహ్మచర్యము వీరునకుఁ దగదు. శూరుఁడు భిక్షా
టనవృత్తి మనరాదు. విజయమో వీరస్వర్గమో శూరునకుఁ
బరమేశ్వరుఁడు విధించెను. నీవు వృధాదైన్యవిషాదంబులకుఁ
జిక్కవలదు. దైన్యము న్యాయమైనహక్కునుగూడ సాధింప
నేరదు. నీరాజ్యము నీకుఁ దక్కవలయునన్న భుజబలంబు
నాశ్రయింపక తప్పదు. అట్టిస్థితి యేర్పడెను. సమరసన్నా
హంబున నుండనగును. కౌరవుల సంగతి నాకు వదలుము.
సంధికై యెల్లప్రయత్నంబు లొనర్తు. అయినను యుద్ధము
తప్పుననిమాత్రము తోఁప' దనెను.

భీముఁడు నందుకొని 'కృష్ణా! యుద్ధప్రసక్తితోఁ గౌ
రవుల భయపెట్టవలదు. సంధినే వచింపుము. దుర్యోధనుఁడు
నిన్నునిరసించినను గోపించినను మదిఁబెట వలదు. కౌరవ
వంశంబును రూపుమాపుటకన్న మేమేవారిని గొల్చిమనుట
మేలు. ఇది ధర్మజునకును సమ్మతమేయగు. అర్జునుఁడు
మృదుహృదయుఁడు; వానికి యుద్ధమిచ్చగింప' దనెను.

కృష్ణుఁడు భీమునకు నచ్చెరువంది 'వీరాగ్రణి! ఇప్ప
ట్టున నీవిట్లుపల్కుట యెంతయు వింతయయ్యెడు. ఏభీముఁడు
సభామధ్యంబున దుర్యోధనసంహారము ప్రతిజ్ఞచేసెనో యా
భీమునిపల్కులాయివి? నమ్మజాల. భీమా! నిన్ను భయంబు
పైకొనెనా? విషాదము ముంగెనా?' యని చూపిపల్కెను.

భీముఁడాతాకుమాటలువిని 'కృష్ణా ! యుద్ధంబునకు వెఱచుట గాదు. భీమునకును భయమా ? ధార్తరాష్ట్రులపయి జాలి యట్లుపలికించెను. వంశరక్షణంబునకై యెట్టిక్లేశమైన నోర్తు' ననెను. వానికిఁ గృష్ణుఁడు నవ్వి 'వీరాగ్రణి ! నీయంతరంగము నెఱుంగుదు. నీయెడ దోషములే'దని వానిని శాంతిపఱచెను.

అంతట నర్జునుఁడు లేచి 'కృష్ణా ! చెప్పఁదగినదంతయు ధర్మనందనుఁడు చెప్పెను. నీమాటలు చూడఁగా సంధియాస నీకును లేనట్లే తోఁచు. అయినను యథాశక్తి యత్నింపుము. నీకన్న నధికుఁడును శ్రేయోభిలాషియు నుభయులకు గలు గఁడు. నీయిచ్చఁ దలఁదాల్తు' మనెను. నాపుఁడు' అర్జునా ! సంధికై యావచ్ఛక్తి వినియోగింతు. ఫలము నాయధీనము గాదుగదా. దున్నివిత్త నచ్చును. వానకురియకున్నఁ బండు నా ? అట్లని మిన్నకుండరు. ఏట్లో నీరుపెట్టయత్నింతురు. నీరే యభావమైన నేమిసేయనగు ? ఫలము దైవాధీనము ; యత్నము పురుషాధీనము; పౌరుషంబునకు దైవంబుతోడ్ప డిన యత్నసిద్ధియగు. దైవము తోడ్పడునో లేదో యెఱుంగ రాదు. అట్లని మిన్నకుండరాదు. శుద్ధబుద్ధికి నందినంత హితా హితంబులు విమర్శించి హితంబునకై యత్నింతురు. ఆభా వంబుతో నిక్కార్యంబునకుఁ బూనితి' నని కృష్ణుఁడు బదులు చెప్పెను.

పాండవులు యుద్ధాయుద్ధంబులమధ్యఁ జిక్కిరి. యుద్ధము కూడదని వారియంతఃకరణంబులు తట్టిపల్కుచుండెను. యుద్ధ కర్తవ్యముగాఁ బరిస్థితులు స్పష్టీకరించెను. ఈశ్వరేచ్ఛ

యెట్లో యట్లగునని వారుభావించి సర్వభారము కృష్ణునందుంచి వానియాజ్ఞకుఁ దలయొగ్గిరి.

### కృష్ణుని రాయబారము.

తెల్లవాఱినంతటఁ గృష్ణుఁడు దినకృత్యములు దీర్చి సూర్యచంద్రుల నర్చించి గోపుచ్ఛంబును దాఁకి యగ్నినివల గొని సమస్తశుభవస్తువుల సందర్శించి బ్రాహ్మణోత్తములయు ఋషిసత్తములయు నాశీర్వచనంబునంది దివ్యాంబరాభరణ భూషితుఁడై సాత్యకితో 'దుర్యోధనుఁడు దుష్టస్వభావుఁడు. అంతకన్న దుష్టులైన శకునికర్ణులు వానికి మహోపదేశికులైరి. ఎంతబలశాలియైనను వైరినలఁతిగా భావింపరాదు. సాయుధంబుగా రథంబు నాయత్తపఱచి తెమ్మ'నెను.

సాత్యకి యట్లే గావించెను. కృష్ణుఁడు రథంబారోహించెను. వానివెంట శూరాగ్రేసరులు పదుగురు తరలిరి. వారిని వేయికాల్బలంబనుగమించెను. దానిని సహస్రాశ్వదళము వెంబడించెను. దానివెంట సంభారసామగ్రి శకటంబులు తరలెను. వేదఘోషలు ప్రతిధ్వనులీనెను. దధిమధుఘృతంబులనుఁ గృష్ణునకు నర్పించిరి. అతనినిఁ జూచువేడ్కతోఁ బురంధ్రీమణులు వీధి యిరుప్రక్కల బారులుతీఱి నెత్తావి పుష్పంబులదోయిళ్ళ నతనిపైఁ జల్లిరి.

అట్లు కృష్ణుఁడు కార్తికమాసంబున రేవతీయుక్తమైత్రిముహూర్తంబునఁ దరలి మార్గాంతరరమ్యవనంబుల విలోకించుచు నందందు జానపదుల సత్కారంబులందుచు వృకస్థలంబును చేరెను. అచ్చట ఋషిసత్తములు వానికై వేచి

యుండిరి. కృష్ణుఁడురథముదిగి వారిని బూజించి 'మహాత్ములారా! మీతపంబులు నిర్విఘ్నంబుగా సాగుఁగదా. మీకుఁ గుశలమే గదా! మీరాకకుఁ గారణంబు గలదా? ఎందైనఁబోవుదురా? నాయొనర్పనైన సేవగలదా ?' యనెను. ఆతపోధనులు వాని వినయమధుర భాషణంబులకుఁ బరమప్రీతులై 'కృష్ణా నిన్ను సందర్శించి నీకు సత్కారంబులుగావించి నీవొంటఁ గౌరవసభకు వచ్చి నీముఖంబున వెడలు మహోపదేశామృతంబును వీనులారఁ గ్రోలి యానందింపవచ్చితి' మనిరి. కృష్ణుఁడు వారికి వినయ నమస్కారంబులులొనర్చి తదనుజ్ఞాతుఁడై గ్రామము జొచ్చెను. అంతలోన రవి క్రుంకనుండెను. కృష్ణుఁడు సాయాహ్నికంబులు తీర్చి యారాత్రి యందు విడిదిచేసెను.

కృష్ణుఁడుపప్లవంబునుండి తరలుట ధృతరాష్ట్రుఁడెఱింగి 'విదురా ! వాసుదేవుఁడు హస్తినాపురంబునకుఁ దరలెనట. నాపుత్త్రులెదురేఁగి తగుమర్యాదలతో వానిని దోడితెత్తురు గాక. కృష్ణునిఁ జూచుటకై మన స్త్రీలువువ్విళ్లూరుదురు. వారు ముసువులు తొలగించి చూడనగు. వానికి నగరంబెల్ల నభ్యుత్థానం బొసగుఁగాక. పురంబెల్లధ్వజ పతాక తోరణంబులతో నలంకృతమగుఁగాక. రాజవీధులు సుగంధిజల సి ంబులును దివ్యధూపదీపితంబులు నగుఁగాక. దుర్యోధనుని మందిరంబునకన్న దుశ్శాసనుని మందిరంబు సర్వవిధముల నొప్పియున్నది గావున నద్దానిని గృష్ణుని విడిదికై యేర్పాటుచేయు'మని యాజ్ఞాపించెను.

తెల్లవాఱులోపల వృకస్థలంబునుండి హస్తినాపురంబు

వఱకు మార్గమెల్లఁ జలువపందిరులతో గుడారంబులతో సొబగారెను. హస్తినాపురము వివిధగతుల నలంకృతమై ధ్వజపతాకతోరణంబులతోఁ గృష్ణునాహ్వానించెను. కృష్ణుఁడు వఱువాత లేచి కాలకృత్యంబులు దీర్చి వృకస్థలంబునుండి బయలుదేరి సపరివారంబుగా హస్తినాపురము చేరెను. తూర్యనినాదంబులతో శంఖారావంబులతో నగరమెల్ల నెదురేఁగి తలతో మ్రొక్కి వానిని తోడితెచ్చెను.

కృష్ణుఁడు మెలమెల్లగా ధృతరాష్ట్రునిమందిరముఖశాలకు వచ్చి రథంబునుండి డిగి తన్మందిరాంగణంబులు దాఁటి కురురాజును జేరఁబోయెను. కౌరవేంద్రుఁడు భీష్మద్రోణాదిపురస్సరంబుగా నెదురేఁగి కృష్ణుని దోడితెచ్చి నవరత్నమయ దివ్యాసనంబునఁ గూర్చుండఁ బెట్టి యథాశాస్త్రము మధుపర్కాదులర్పించెను. కృష్ణుఁడు మర్యాదతో నవిగ్రహించి కౌరవేంద్రునకును భీష్మాదులకును బ్రతిపూజలొనర్చెను. ఎల్లరుఁ గొంతవడి సరససల్లాపంబుల నిష్ఠాగోష్ఠినుండిరి. అంతఁ గృష్ణుఁడు సదస్యులను వీడ్కొని విదురునింటికిఁ బోయెను.

విదురుఁడు తనకు విందయైన యయ్యతిథిరత్నంబును సమస్తోపచారపూర్వకంబుగా బహువిధంబుల గౌరవించి తన జీవితము నాఁడు ధన్యమయ్యెనని సంతసించెను. కృష్ణుఁడంతటఁ గుంతీదేవియొద్దకుఁ జనెను.

కుంతీదేవి సుతక్లేశపరితప్తయై హస్తగతప్రాణగా మూలఁబడియుండినది కృష్ణునిఁజూచి దుఃఖముపట్టఁజాలక వలవల నేడ్చెను కృష్ణుఁడు చేరఁబోయి యామెకు మ్రొక్కి 'అత్తా!

నీపాటిస్త్రీ పుణ్యలోకంబులఁ గనుఁగను వీరాగ్రేసరులకుఁ దల్లి వైతివి. ఇట్టి నీవు దుఃఖంబునకు నెడమీయనగునా? జీవరాశికి ద్వంద్వంబులు సహజంబులు. వానిని సహించు టొప్పు. నీసుతులు నిద్రాహారంబులను జయించిరి; సుఖ దుఃఖంబుల సమదృష్టినొప్పిరి. ఆపదలెన్నిపై కొన్నను వారు ప్రసన్నచిత్తులై యుందురు. క్లేశలక్షణమే వారిసుఖంబులఁ గానరాదు; శూరులుగావున నలంతికై యట్టుచూపరు. ఎక్కు నున్న సామ్రాజ్యపీఠి నెక్కవలయు; కాకున్న గహనాంతర సీమలాశ్రయింపవలయు. ఈరెంట నెద్దియేసియుఁ బరమ సౌఖ్యంబుఁ గూర్చు; మధ్యమార్గము త్రిశంకుస్వర్గము. అత్తా! నీపుత్త్రులును నీకోడలును వారిక్షేమవార్తను నమ స్కారపూర్వకంబుగా నీకు నాముఖంబున నంపఁజేయుచున్నా రు. ఎల్లరు సుఖమున్నారు. స్వపుత్త్రులు వారి పైతృకరా జ్యంబు నధిష్ఠించుటఁ గన్నారఁజూతు' వనెను. కుంతీదేవి పెప్పుసూచ్చి 'కృష్ణా! లోకసంగ్రహార్థం బవతరించితివి; పర మాత్మవు; సర్వము నీయిష్టాధీనము; నీమాట తప్ప'దనెను.

కురుపాండవులయుద్ధం బనివార్యమని కృష్ణుని తాత్ప ర్యమగుట పైవాక్యంబులవలన స్పష్టము. ఎఱిఁగి యెఱిఁగి సంధికై యత్నింపనేల? యనుసంశయంబు గలుగకమానదు. ఇందులకు సమాధానంబును సంధిసమరవితర్క భాగంబున శ్రీ కృష్ణభగవానుఁడే చెప్పెను.

కృష్ణుఁడట్లు కుంతీదేవికి నోదార్పులు పలికి దుర్యోధనుని మందిరంబునకుఁ జనెను. అతఁడు తమ్ముఁ గర్ణశకుని ప్రముఖులతో

మంతనము చేయుచుండి కృష్ణుఁడువచ్చినంత వానిని సము
చితమర్యాదల గౌరవించి సుఖాసీనుఁజేసి కుశలంబారసి భోజ
నంబునకుఁ బిలిచెను. కృష్ణుఁడు వానియాతిథ్యంబును వినయ
పూర్వకంబుగా నిరసించెను. దుర్యోధనుఁ డాశ్చర్యపడి 'మా
యిచ్చు ఫలాహారపానీయంబులును వస్త్రశయ్యాసనంబులును
గ్రహింపఁదగవా? కురుపాండవులు నీకు సమానులేగదా?'
యని పరిభావహీనస్వరంబునఁ బలికెను.

కృష్ణుఁడు:- రాజోత్తమా! రాయబారులు తామువచ్చినకార్యము తీఱునందాక విందులు గ్రహింపరాదు. కార్యానంతరము మన్నెల్ల నిష్టామృష్టాన్నంబుల సత్కరింప నగు.

దుర్యో: నీపలుకులు మెప్పింపవు. ఇది ధర్మముగాదు. నీకును మాకును బగలేదు. మనకు బాంధవ్యమేగాక మైత్రియుఁ గలదు. నీవచ్చినకార్యంబునకును నా యిచ్చునట్టి యాతిథ్యంబునకును సంబంధము గలుగదు. నామాట నంగీకరింపవలయు. ఒండు చెప్పవలదు.

కృష్ణుఁడు:- కౌరవోత్తమా! కామక్రోధమదమాత్సర్యంబులఁ జేసిగాని, యిష్టార్థసిద్ధికైగాని, వాదార్థముగాని, లోభంబునఁగాని, మఱియేకారణంబునఁగాని ధర్మవ్యతిక్రమంబు గావింపరాదు. ఇష్టసిద్ధిని గూర్చిన వారియింట భుజింతురు. ఇది లోకసామాన్యధర్మ [illegible] బునమాత్రము నావచించిన

ధర్మంబునకు నపవాదము చెప్పిరి. రాజా ! నీవింకను నాయిష్టంబొనర్పనైతివి. ఇట్టి కూడువవలసిన యాచన నాకుఁ గలుగదు.

ఆమాటలకు దుర్యోధనుఁడు మోమువాఁచెను. కృష్ణుఁడు వినయపూర్వకంబుగా వానిని వీడ్కొని భీష్మద్రోణ కృపాదులను సందర్శించెను. వారొక్కొక్కరుఁ దమసర్వస్వమును గృష్ణునకు నర్పించిరి. కృష్ణుఁడు వారియౌదార్యసౌశీల్యంబులకు నెంతయుఁ గృతజ్ఞతఁ దెలిపి వారిని వీడ్కొని విదురునింట భుజించెను.

దుర్యోధనుని యాతిథ్యంబును దిరస్కరించుటకుఁ గారణంబును గృష్ణుఁడే యొకచోట నిట్లు చెప్పెను.

'దుష్టులిచ్చు పదార్థంబులెల్ల దోషభూయిష్టంబులై యుండు. ఏలయన వారిస్వభావంబు వారిచ్చుపదార్థంబులందుఁ గూడ వ్యాపించి యుండును. దానం జేసి యవి గ్రహింపరాదు. ధర్మపరుఁడు పేదయైనను వాఁడిచ్చు పదార్థంబులమృతప్రాయంబులగు. అవియెల్ల భక్తిప్రేమ పరిశుద్ధంబులగుటయే కారణము. దుర్యోధనుఁడు దుష్టుఁడు గావున వానియాతిథ్యము కాలకూటవిషతుల్యంబగుటం జేసి నిరసించితిని. విదురుఁడు కురుముఖ్యులలోఁ బేదయైనను దయార్ద్రహృదయుండును నీతిసంపన్నుఁడు గావున వానివిందు ప్రీతితో గ్రహించితిని.

ఇదేభావంబును 'గంగగోవుపాలు గరిటెడైనను చాలు, గడివెడైననేమి ఖరముపాలు, భక్తికలుగుకూడు పట్టెడైనను

చాలు' అనుపద్యము బోధించుచున్నది. అన్నపానాదులను గ్రహించు నెడల నెంతజాగ్రతవలయునో యీయుపదేశము సూచించుచున్నది. దీనిఁబట్టి భోజనాదివిషయంబుల నార్య సాంప్రదాయము శ్లాఘ్యమో కాదో యూహింపనగు. భావ తత్త్వము పదార్థతత్త్వంబును మార్చుననుటలో నెంతో యర్థ ముగలదు. భావమన్నను సంకల్పమన్న నొక్కటేయగు. సంకల్పశక్తి యొకపదార్థమునేగాదు, సృష్టినెల్ల మార్పఁ గలదు. శుభాశుభంబులు భావంబునుబట్టియుండు. భావం బన్నచో యంతఃకరణంబును బట్టియుండు. అందువలననే మన పెద్దలు 'ఆత్మశుద్ధి, ఆత్మశుద్ధి' యని ఘోషించిరి. ఆత్మశుద్ధియే సర్వవేదాంతంబునకు మూలము. వేదాంత గ్రంథంబులెల్ల ఈముక్కకు వివరణంబులనవచ్చును.

భోజనానంతరము విదురుండు భయభక్తిన మ్రుఁడై కృష్ణునిఁ జేరఁబోయి 'దేవా! మీరిటకురాకుండుట మేలని భావింతు. దుష్టుఁడు దుర్యోధనుఁడు నిజాశ్రితులైన శకుల దుర్బోధనలు విని పాండవులకు నొక్కపల్లెయైన నీయరాదని నిశ్చయించెను. మీవచ్చినకార్యము ఫలింపదు. మఱియు వైరిమండలికి మీరువచ్చుట నాకు సమ్మతము కాదు.' అనెను. నావుడు 'మహాత్మా! జ్ఞానికిఁ దగినట్లు వచించితివి. నారాకకు గారణము వినుము. భూమండలంబెల్ల గజాశ్వ రథంబుల త్రొక్కుళ్ళ నశింపనున్నది. దానిని మృత్యుముఖం బునుండి రక్షించుటకన్న నుత్తమోత్తమధర్మము గలుగదు. మఱియు మిత్రునిఁ గ్లేశపాపంబులనుండి యుద్ధరించుట సజ్జన ధర్మము. క్లేశంబులపట్ల సహాయుఁడై నిల్చుటయుఁ బాపంబుల

పట్ల వానిని గయిపట్టి యీడ్చియైనను మరలించుటయు సత్పు రుషులకు విధివిధానము. ధార్తరాష్ట్రులును బాండవులును నాకుఁ గూర్చువారేగాని యన్యులుగారు. వారు ప్రమాద పడినప్పుడు ధర్మంబుపదేశించి వారికి మంచిదారిఁ జూపకున్న నామైత్రివలని ఫలమేమి ? నాయత్నము ఫలింపదందువా ? అది దైవమునకే యెఱుక. మనధర్మంబును మనము వదల రాదు. సత్సంకల్పంబుతో నుద్యమింతుము. ఫలము దైవా ధీనము. నాతలంపు కొనసాగినేని లోకంబునకు మేలగు. ఫలింపదేని యది నాదోషముగాదు. ఫలాఫలంబు లెట్లున్నను స్వధర్మంబు నిర్వర్తించుటగు. పురుషప్రయత్నంబు తావ న్మాత్ర' మని కృష్ణుఁడు వానికి సమాధానము చెప్పెను.

శ్రీకృష్ణభగవానుని మతంబును ధర్మానుష్ఠానక్రమం బును నుద్యోగాది పర్వంబులలో నందందు సూచింపఁబడెను. ఆయంకురంబులే వేఁచి పూచి 'గీతగా ఫలించి జగదాహ్లాదం బును గూర్చుచున్నవి. బోధాచరణంబులరెంట శ్రీకృష్ణ భగవానుఁడెంత యాదర్శమూర్తిగా వర్తించెనో యూహింప నగు.

వందిమాగధులు వేగుమేల్కొలుపులఁ బాడిరి. కృ ష్ణుఁడు ప్రాతరాహ్నికంబులు తీర్చి యగ్నిహోత్రాదికము నిర్వర్తించి యథార్హవస్త్రాభరణ భూషితుఁడయ్యెను. దుర్యో ధనుఁడు శకునితోడ నటకు వచ్చి 'వృష్ణివంశశేఖరా ! కౌరవేం ద్రుఁడు కొలువుదీఱి మీరాకకు వేచియున్నాఁడ' నెను. కృ ష్ణుఁడును [illegible]కిఁ దగుమర్యాదలు గావించి నేనుఁగూడ సిద్ధ

ముగానున్నా' ననెను. అంతలోన రథము ద్వారముఖంబున నిల్చెను. కృష్ణుఁడు బ్రాహ్మణోత్తములను సత్కరించి వారి దీవెనలంది యగ్నిప్రదక్షిణంబొనర్చి వృష్ణివీరసంరక్షితుఁడై రథంబారోహించి కౌరవేశ్వరుని సభకుఁ దరలెను. వాని వెనుక విదురదుర్యోధనశకునులు వేఱురథంబుల వచ్చిరి. సాత్యకియుఁ గృతవర్మయును వృష్ణివీరులును గజాశ్వంబు లారోహించి వెంబడించిరి. భటులు నూర్లకొలఁది సాయుధులై జయంబులు పల్కుచు నడచిరి. మంగళతూర్యంబులును శంఖారావంబులును మ్రోఁగెను. కృష్ణసందర్శనార్థము పురమెల్ల వెల్లివిరిసెను. సౌధంబులు స్త్రీజనభారంబున నుబ్బొఁగెను. జనులు కృష్ణరథంబును జుట్టిరి. కర్పూరహారతుల సెగపొగ లెగసెను. మేడలనుండి పుష్పవర్షముఁ గురిసెను.

కృష్ణుఁడు ప్రజామర్యాదల నాదలతో గ్రహించుచు వారిని శుచిస్మిత చంద్రికల నాదరించుచు మెలమెల్లగాఁ జని సభాముఖద్వారము చేరెను. సమస్తవాద్యంబులొక్కుమ్మడి మ్రోసెను. ఉత్తమోత్తమపురుషునిఁ గాంచుకల్మికి సభాంతరరాజమండలంబు పేరాసతోనుండెను.

కృష్ణుఁడు రథంబునుండి దిగి దుర్యోధనకర్ణులు దారి చేయఁగా, విదురసాత్యకులు చెఱియొకవైపున నడవఁగాఁ గృతవర్మాదులు వెన్నంటిరా సభాంతరము ప్రవేశించెను. ధృతరాష్ట్రుఁడు భీష్మద్రోణాదికురువృద్ధులతోడ నెదురువచ్చి శుభాగమనంబు పలికెను. కృష్ణుఁడు వారికి దత్తద్వయోబుద్ధిస్థితిగతులఁ బట్టి యథోచిత సంభావంబులు వచించి కౌరవేంద్రుఁడొసఁగిన

యాసనంబు నలంకరించెను. సభాస్తారులు తమతమపీఠంబుల గ్రహించిరి. దుశ్శాసనుఁడు కృతవర్మకు నర్ఘాసనంబొసంగెను. దుర్యోధనకర్ణులు కృష్ణునిచెంతఁ గూర్చుండిరి. శకుని వారికిఁ జేరువుగా వసించెను. కృష్ణుని వెనుకపార్శ్వంబున విదురుఁడు కూర్చుండెను. సభాంతర మెల్ల నిశ్శబ్దమయమయ్యెను.

అంతఁ గృష్ణుఁడు లేచి ధృతరాష్ట్రునివంక మరలి 'కౌరవేంద్రా ! కురుపాండవులకు సంధిఁగూర్ప వచ్చితిని. సంధికిఁ బూర్వాంగోత్తరాంగంబులు రెండుగలవు. మలికతములు మానుట పూర్వాంగము; పదకము కుదురుట యుత్తరాంగము. పూర్వాంగము చక్కనైనఁగాని యుత్తరాంగమును కార్యరూపముదాల్పదు. పూర్వాంగమును విమర్శింతము. మలికతంబు లెవ్వరెవ్వరికిఁ గలిగెను ? కురువంశంబు లకుఁ గలిగెను. కురువంశంబెట్టిది ? ఆర్యావర్తరాజవంశంబులకుఁ దలలమానికెమువంటిది. అట్టియున్నతికిఁ గారణమేమి ? శాస్త్రజ్ఞానసద్ధర్మాచరణంబులకు నిరవై, భూతదయాపశ్చాత్తాపంబులతో వెలసి, యధర్మనివర్తనపరోపకార దీక్షాబంధురమై సత్యమందు నిలిచి యపకారంబులు సహించుచు నిష్కాపట్య బుద్ధితో వర్తించుటంజేసి యావంశంబునకు నంతటి యౌన్నత్యంబు స్వతస్సిద్ధమయ్యెను.

'ఈకీర్తిని నిలుపుటకై భీష్ముఁడు యావజ్జీవబ్రహ్మచర్యవ్రతంబును స్వీకరించి రాజ్యంబును సన్యసించి వంశాంకురంబుల సంపాదించెను. ఆయంకురంబులే ధృతరాష్ట్రపాండురాజులగుట లోకవిదితము. వారు శరీరంబులు వేఱైనను

హృదయంబు లోకకంటిగాఁజేసి రాజ్యాభివృద్ధిఁ గావించి దిగంత విశ్రాంతయశోవిశాలురైరి. పరస్పరప్రేమాతిశయంబునఁ జేసి కౌరవేంద్రుఁడు పేరునకు రాజపదవి నధిష్ఠించి పరిపాలన భారమెల్లఁ గూర్మితమ్మునిపై నుంచెను.

అట్టివారి సంతానంబున నేఁడు మనస్పర్థలేర్పడుట విను వారికి మాకే యెంతో చింతయయ్యెడు. ఈస్పర్థకు బీజమేమి? రాజ్యకాంక్షయే బీజము. కౌరవేంద్రుఁడు దీర్ఘదర్శిగావున రాజ్యంబు నెట్లో పంచి తనపుత్త్రులకుఁ బాండుపుత్త్రులకు రా నున్నవైరంబును మాన్పెను. అందులకెల్లరు సంతసించిరి.

జ్ఞాతివహ్ని చల్లారుట శత్రులకు రుచింపదయ్యెను. హిత శత్రువులు గూడిరి ఆయగ్నిని రేపిరి. తత్ఫలముగాఁ బూర్వ వైరంబులు పెరిగెను. అది రాజధర్మనిర్వహణంబునఁగాని వట్టి మాటలతోఁ జల్లారదు. ధర్మంబు స్వపరతారతమ్యంబునుగాని పక్షపాతంబునుగాని యెఱుంగదు ; దోషమెందున్నను శిక్షించు ను. రాజేంద్రా! కురువంశంబును మహోత్పాతము ముంగ నున్నది. దీనిని నివారింపరేనిఁ బ్రపంచంబెల్ల విధ్వస్తమగు. ఇందులకు నీవెంతయు సమర్థుండవు. నీయిచ్ఛామాత్త్రంబున నిది సిద్ధించును.

రాజేంద్రా! ఇది యసాధ్యంబని వెఱవవలదు. వలయు నేని నేను నీవెంట నిలుతు; ఇరువక్షంబుల నిష్పాక్షికబుద్ధితో విచారించి దోషాదోషంబుల నిశ్చయింపుము. నీపుత్త్రుల వలనఁ దప్పుగల్గిన నీవు వారిని దిద్దుము. పాండవులు దోషు లైన వారిని నేను సవరింతును. కౌరవేశ్వరా! సంధిని

గూర్తువేని గురుపాండవులకు వెలలేని మేలొనరించినవాఁడ వగుదువు. నీకీర్తి కలకాలముండును. పాండవులు మీకు మిత్రులు కాఁదగుదురేగాని శత్రువులుకాఁదగరు. వారు నీ వలను నున్న నిన్ను జయించు మేటి గలుగఁడు. లోకమెల్ల నీఛత్రచ్ఛాయ సుఖముండును. అట్లు చేయవేని సర్వజన సంహారంబునకుఁ గారకునిగా నిన్నే చూపుదురు. అందులకుఁ బాత్రుఁడవు కావలదు. ధర్మదృష్టినొండెఁ గీర్తికాంక్షనొండె స్వార్థలాభబుద్ధినొండె లోకమంగళాభిలాషనొండె నెట్లు విచారించినను నింతకన్న హితము నీకుఁ గానరాదు.

రాజపుంగవా! నీసుతులును నీతమ్మునిసుతులును గత్తులుదూసి యొండొరులకుత్తుకలు దఱిగి నీయెదుట నశించుట చూచుచుందువా? ఈమహోపద్రవమునుండి వారిని రక్షించుట నీకుఁ బితృధర్మమేగాక రాజధర్మమును గాదా? రాజేంద్రా! ఈవైరానలంబు కురుపాండవవంశద్వయ వినాశంబుతోఁ జల్లారదు; ఆర్యావర్తమెల్ల వ్యాపించును. రాజు లిరుపక్షంబులఁ జేరిరి. దేశమెల్ల క్షత్రరక్తసిక్తమై భయంకరాకారముఁ దాల్పనున్నది. రాజవినాశంబున సమస్తధర్మంబులును లుప్తములగును; అధర్మవ్యాప్తి నిరంకుశమగును. రాజసింహమా! వీరినెల్ల శాసించి దేశంబునకు సుఖసంతోషంబులు గూర్చుశక్తి నీయఱచేతిలోనున్నది. ధర్మజ్ఞా! పాండవులు నీతమ్ముని సుతులుగాని వేఱుగాదు. వారిశరీరంబులందున్నది మీరక్తమేగాని యన్యముగాదు. పిన్నటనాట నుండి వారిని పెంచి పెద్దచేసితివి. ఆపుత్రవాత్సల్యంబు నేఁడు నినుఁగనుఁ బ్రామదుగదా. నాఁడెట్లో నేఁడునట్లే వారియెడఁ

బ్రియదృష్టి సారించి యథాన్యాయము వారికి రాఁదగినది యొంతో యొకింత మనసారయిచ్చి యుభయులకుఁ బొందుఁ గూర్పుము. నీసొమ్మును వారుగూడఁ దినదగియేయున్నారు.

రాజేంద్రా ! ఆపదలెన్ని పైకొన్నను ధర్మనందనుఁడు ధర్మమును దప్పఁడు. కష్టంబులెన్ని వచ్చినను నతఁడు మీ రక్షణంబును వదలఁడు. క్షమాసమానంబులు వానియందు మూర్తీభవించియున్నవి. నాటికి నేటికి వానియందు మార్పు గానరాదు. ఇవన్నియుఁ బరిశీలింపుము. పుత్త్రుల దురాశా పిశాచంబును దలయెత్త నీయవలదు.

కౌరవేశ్వరా ! పాండవు లనన్యసామాన్యబలపరాక్రములగుట నీకుఁ గ్రొత్తగాదు. ధర్మము వారివలన నుండుట నీయంతరాత్మయే చెప్పును. అట్లుండియు వారు నీ యాజ్ఞకై వేచియున్నారు. మీకుఁగా వారు ప్రాణంబుల నైనఁ ద్యజింతురు. సంశయము వలదు. ధర్మంబును మఱి వక శిష్టమతంబును మానక పక్షపాతంబెడసి దేశక్షేమంబు నాత్మలాభంబు దలపోసి దూరదర్శివై శాంతిఁగూర్చి ప్రశాంత హృదయుండవై శాశ్వతకీర్తి నాపాదింపుము. మనినంతకాలం బిఁక మనఁబోవు. యశఃకాయంబునఁ జిరస్థాయివగుము.

ఉ॥ ధృతరాష్ట్రండును దత్సుతుల్ వనము కుంతీనందనుల్ సింహముల్
మతినూహింప నసింహమైనవనముల్ మర్దింతు రందుల్ వనా
వృతవృత్తంబులుగాని సింహములకుల్ వేగంబచేటొందుఁ గా
న తెగంబొందుట కార్యమీ యుభయము న్సంతుష్టిమైనున్కికిల్ ॥'

కౌరవేంద్రా ! ఇదియే నాపరమోపదేశం' బని గూర్చుండెను.

సభాసీనులై యున్న ఋషీంద్రులు కృష్ణుని యుపదేశా మృతంబును గర్ణపుటంబులఁ గ్రోలి యాశ్చర్యవివశులై 'అహెూ ! ఏమిపలుకులు ! ఏమిపలుకులు ! ఉద్దేశ్యమెల్ల సత్యపూతమై పథ్యమై కౌరవుల భూతవర్తమానభవిష్యత్కాల త్రయస్థితిగతులకు ముంజేతి యద్దముగా నున్నది. ప్రతి పదము ధర్మతత్త్వంబు నెదతట్టి బోధించును.' అని తమలోఁ బలికికొని 'రాజా! కృష్ణునిపల్కు లక్షరాక్షరంబుల జరుపుము. ఇదియే మాపరమభావం' బనిరి. భీష్మాదికురువృద్ధులును వారికిఁ దోఁచిన విధంబున ధృతరాష్ట్రునకు ధర్మంబు నుపదేశించిరి.

కౌరవేశ్వరుఁ డెల్లరను సాకల్యంబుగా నాకర్ణించి 'కృష్ణా ! న్యాయతత్త్వంబును ధర్మరహస్యంబును నిరూపించితివి. ఉత్తమగతికి మార్గంబుఁ జూపితివి. నీవచనంబులు సత్యపూతములు. అయిన నేమిసేయుదు ? అస్వతంత్రుఁడనైతి. నామాట వినరు. దుర్యోధనుఁడు నామతంబు సేయఁడు. నీవే వానికి హితంబు గఱపి వానిమది మరలింపు' మని డగ్గుత్తుకతోఁ బలికెను.

కృష్ణుఁడంతట దుర్యోధనునివంక మరలి 'మిత్రమా ! గొప్పవంశంబునఁ బుట్టితివి. అట్టివానికి నకార్యంబు గాదు. నైచ్యంబును నిర్దయయును సిగ్గులేమియు నలసులకు నగునే గాని యభిజాత్యులకుఁ దగవు. పాపానుబంధులు కుత్సితపథంబునే వరింతురు. ఉన్నతులు ధర్మమార్గముఁ దలగరు. మిత్రమా ! నీతత్త్వంబూహింపరాకున్నది. నీతలంపు మహా

దారుణమగుట నీకు స్ఫురింపదా? నీవెక్కడ? ఈతలంపెక్కడ? మిత్రమా! బుద్ధిమంతులు కానిసేఁతలఁ ద్యజింతురు; బంధుమిత్రహితంబుఁ గూర్తురు. ఇది నీయెడ విపరీతంబగుట కెంతయుఁ జింతయయ్యెడు. ఇంతటనైన నీ ప్రాగ్భావంబు మాని పాండవులతో మైత్రి యొనర్పుము. అది నీతండ్రిమాట సేయుటగు; వారిపరితాపంబు నుడుపును; భీష్ముని సంతోషపెట్టును; గురుముఖ్యులకుఁ దృప్తిగావించును; విదురసంభావనంబును లోకవిశ్రుతిని గూర్చును.'

'మిత్రమా! జీవరాశిమంగళంబెప్పుడును శాంతంబు నాశ్రయించి యుండును. జగత్పరిశాంతిని గూర్పుము. ఇంతకన్న వాంఛనీయంబును గర్తవ్యంబును మర్త్యునకుఁ గలుగదు. మిత్రమా! దయాదాక్షిణ్యజ్ఞానంబులు ప్రకృతము నీయెడ సుప్తంబులైనను ఉన్నతకులోత్పన్నుఁడవగుట హితుని ప్రబోధంబున మేల్కాంతువని యింతగాఁ జెప్పుదు. పదవీభద్రునిఁ ప్రబోధించుట ప్రయాసమేగాక ప్రమాదమునగు. ఎల్లరు నందులకుఁ దగరు. తగినవారుగూడఁ దెగింపరు. ఇది యెఱింగియు నాధర్మంబును దలంచి నీ మేలు గోరి మోమోటమి వదలి యథార్థము వచించితిని. మిత్రవాక్యంబు విననివాఁడు మేలుపడయఁడు. ధర్మదృష్టి యట్లుండనిమ్ము. లోకదృష్టికేని నీచేత యుక్తమగునా? ఎంతమాత్రముగాదు. ఎట్లందువా? తెలివిగలారు శూరాగ్రేసరులైన యాత్మీయుల విడిచి కూటికై యిచ్చకంబులాడువారిని జేరఁదీయరు. నీటికన్న నెత్తురుచిక్కంబగుట మఱువవలదు. దుర్యోధనా! ఎన్నిబాములఁ ద్రోసినను క్లేశంబులెన్నిగుడిపినను పాండవులు నిన్ను ద్వేషింపరు.

అట్టివారిని దవ్వుసేయుదువా ? ఇది దూరదృష్టి యగునా ? అన్యులు వేనవేలకన్నఁ బాండవు లేవురు నీకుండుట యొనలేని సంపదయగు. ఈమాట ముమ్మాటికి నిజము. పాండవుల తోడి నీకూర్మి సర్వార్థంబులను నీకుఁ జేకూర్చును. నీ కెదు రుండరు.'

'దుర్యోధనా ! అర్జునునకు సాటియైనమేటి నీకుఁ గలుగఁడు. ఉన్నాఁడందువా ? ఎవఁడో చెప్పుము ? అతఁడు మనినంతకాలము నీకు జయము కల్లయేయని గ్రహింపుము. పాండవులతో వృథావైరముఁ బెంచి జనప్రళయంబును గల్గింపవలదు. దాననీకగులాభమేమి ? మిత్రమా ? సుతులను సోదరులను బంధుమిత్రాదులను దలంపుము. స్త్రీలపసుపు నిలుపుము ; దుర్యోధనుఁడు కురువంశధూమకేతువను దుష్కీర్తి నొడిగట్టకు.'

'మిత్రమా ! రాజ్యకాంక్ష యందువా ? అట్లయిన నామాటసేయుము. పాండవులతో మైత్రియొనర్పుము ; వారే కౌరవేంద్రుని సామ్రాజ్యపట్టాభిషిక్తు నొనర్తురు ; నీవు రాజప్రతినిధి వగుదువు ; ఇష్టసిద్ధి మీకగు. అమృతంబఱచేత నుండఁగా నన్యుల నాశ్రయింపనేల ?'

అట్లుగాక ధర్మబుద్ధి గలదేని బాండవులకు వారిభాగ మిచ్చి వారితోఁ గలసి మెలసి సుఖముండుము. ఎట్లు విచారించినను బాండవులతోడిపొత్తు నీకు మేలేయగును. పక్షపాతబుద్ధితోఁగాని వంచనామతితోఁగాని స్వలాభార్థినైగాని యిట్లు చెప్పుటగాదు. రాజనీతిని విమర్శించినను ధర్మంబు

విచారించినను నీకింతకన్న మేలుమార్గము గలుగదు. ఇంటికి వచ్చినసిరికి మోకాలడ్డవలదు.

"ఉ॥ పూనినభాగ్యరేఖ చెడిపోయినపిమ్మట యెట్టి మానవుం
డైనను వానినెవ్వరుఁ బ్రియంబునఁబల్కరు పిల్వరెచ్చటన్ ;
తానది యెట్లకోయనినఁ దథ్యము, పుష్పమువాడి వాసనా
హీనతనొందియున్నయెడ నెవ్వరు ముట్టుదురయ్య మిత్రమా॥"

యని నొక్కి వక్కాణించెను,

దుర్యోధనుఁడు సాంతముగాఁ గృష్ణుని విని 'కృష్ణా! పాండవులను బొగడితివి ; ఎల్లదోషంబులు నాపయిమోపితివి. పూర్వోత్తరంబులఁ బరామర్శింపక ధర్మాధర్మంబులఁ బరిశీలింపక తప్పు నాయందే యారోపించితివి. నీవేగాదు, భీష్మద్రోణవిదురులును దుదకు ధృతరాష్ట్రుండును నాదే తప్పందురు. ఎవరేమిచెప్పినను నాయెడ దోషమున్నట్లు నాయంతరాత్మ వచింపదు. ఎట్టియక్రమంబును చేయలేదు ; నాయొనర్చిన వానినెల్ల సూక్ష్మదృష్టితో విచారించితిని. ఒక్కటియుఁ దప్పుగాఁ దోఁపదు.'

'కృష్ణా! పాండవులు జూదంబునకై వచ్చిరి. శకుని నాకుఁగా వారితో జూదమాడెను. రాజ్యమొడ్డిరి, ఓడిరి. ఇందు నాతప్పేమిగలదు ? వారు బుద్ధిపూర్వకంబుగా నోడిన దానిని గూడ మరల వారికే యిచ్చివేయుమంటిని. అంతతో నుండక వనవాసాజ్ఞాతవాసంబులు పందెమొడ్డిరి. ఓటుపడిరి. తత్ఫలముగాఁ గ్లేశములపాలైరి. ఇదంతయు వారికి స్వయంకృతాపరాధఫలముగదా. జూదంబు నాడుమంటినా ? రా

రాజ్యంబు నొడ్డుమంటినా ? గుట్టలు పట్టుమంటినా? నేనే యోడి యున్న మీరు పలుకనైనఁ బలుకుదురా ?'

ఎట్లో యిదంతయు సంభవించెను. దాని నట్లుండనిమ్ము. ఓడినవారెట్లు వర్తింపవలయును ? పాంచాలురు మాకు వంశ పారంపర్య శత్రువులగుట లోకవిదితము. పాండవులు వారితోఁ జేరిరి. పోటకూటికై చేరిరందురా ? అట్లయినఁ గాలంబునెట్లో మెల్లగాఁ గడపవలయును. నన్నుఁ జంపి రాజ్యము హరింప యత్నించిరి. ఇది ధర్మమగునా ? వారు ధర్మాత్ములగుదురా?'

పాండవులు కయ్యమునకుఁ గాలుద్రవ్వినప్పుడు నేనేమి చేయవలయు ? మిన్నకుండుట క్షాత్రధర్మముగాదుగదా ? సోదరులందువా ? ఆభావము వారికి లేసినాఁడు నాకుండియు ఫలమేమి ? వారి తలంపులును జేఁతలును ధర్మవ్యతిక్రమం బులుగదా? ధర్మవ్యతిక్రమంబు నీవుమాత్రము సహింతువా? పాండవులు బలసంపన్నులు గావున వారిని జయింపరాదంటివి. మేముమాత్రము గాజులు దొడిగియున్నామా ? దుర్యోధ నుఁడు వైరికి నెప్పుడును దలయొగ్గఁడు. వైరికిఁ గయికూర్చుట కన్నఁ జచ్చుట మేలుగదా.'

కృష్ణా ! రాజ్యము ధృతరాష్ట్రునకుఁ బిత్రుపైతామహ ము. ఇది నీకును దెలిసియే యున్నది. నాతండ్రి కేవల భ్రాతృవాత్సల్యంబునఁ బాండురాజును బరిపాలనాధికారినిగా జేసెను. అంతమాత్రాననే యతఁడు భాగార్హుఁడగునా ? రాజ్యమును బంచియిచ్చిరందువా ? నేను పసివాఁడనై యుం డఁగా నాతండ్రికి మాయలు గఱపి యర్ధరాజ్యంబును బాండు

వందనున శిప్పించిరి. నేనుండఁగా నట్లుచేయుటకు నాతండ్రికి వాక్కులేదు. అట్లుచేయుటగాని చేయించుటగాని ధర్మవిరుద్ధమగు. ఇంతకన్న దారిద్ర్యపుదుండునా? కృష్ణా! రాజ్యము రాజునకు భోగార్థమేగాని దానయోగ్యమగునా? మీఁదు మిక్కిలి సంతానమున్నప్పుడట్టి దానము చెల్లునా?'

కృష్ణా! ఇందఱునుగూడి నాసొమ్మును బలాత్క్రాంత మొనర్చినను దుష్టతుదకు నాది నన్నే చేరెను. తానొకటి తలంచిన దైవము వేఱొకటిఁ దలంచునుఁగదా. మరల నాసొమ్మి మ్మనుటకు నాలుక యెట్లాడు? పాండవుల తోడిపొత్తంటివి. 'జ్ఞాతిచ్ఛేదన లేనకి'మ్మన వినవా? త్రాఁచునైనను రాఁదీయవచ్చునుగాని దాయాదిని రాదీయరాదు. కృష్ణా! వేయిమాట లేల దుర్యోధనుఁడు బ్రదికియుండఁగా, రాజ్యము వానియధీనమైయుండఁగా, సూదిమొననేలగూడఁ బాండవులకురాదు ఇదిసత్యమని పలికి పాదతాడిత కృష్ణసర్పంబువలె దీర్ఘముగా నిశ్వసించుచు సభామందిరము పదలెను. వానివెంట వాని తోయమువారును వెడలిరి.

కృష్ణుఁడంత ధృతరాష్ట్రునివంక మరలి 'కౌరవేంద్రా! కురుముఖ్యులిందఱుండియు నొక్కదుష్టమతిని దిద్దలేరైరి. ఇది యెంతయు శోచనీయము. నీసుతుఁడు కలహకారణమైన నిజ సంకల్పంబును గప్పిపుచ్చి ప్రజ్ఞావిశేషంబు నాశ్రయించి వాచాలత్వమును జూపినంతనే లోకము నమ్మఁబోదు. ఇట్టి తెలివితేఁటలు సత్యంబును మోసగింపఁ జాలవు. రాజేంద్రా! ఇఁకను పేక్షింపరాదు. ఆర్యవంశసంరక్షణభావంబు నీకు నిక్క

ముగాఁ గలదేని, ధర్మబుద్ధి నిన్నెడయదేని, యీధూర్తునుబట్టి బంధింపనగు. ఒక్కనికై ఎల్లరఁ జెఱుపవలదు. నాఁడు కంసుఁ డెట్లో నేఁడితఁడట్లయ్యెను. ఇట్టివానిని నీవు త్యజింపవేని నిన్నెల్లరును ద్యజింతురు. ఆత్మరక్షణార్థము ప్రజకు నియ్యది విధియగును. యాదవవృష్ణివంశ్యులు కంసునిఁ ద్యజించుటం గదా శుభమందనోచిరి. రాజా! ఈధూర్తుతోడ వాని హితశత్రువులను గూడ బాధించుట నీకు విధ్యుక్తధర్మము. కటా! ఇతని గర్వంబు నేమనవలయు? ప్రజాసంఘాతమరణం బితనికిఁ జెల్లాటముగా నున్నది. వీనికి జాలియేగలుగదు. ఈ క్రూరాత్మునకై వంశంబును గావుపెట్టెదవో, వంశంబునకై యీపాపినిఁ ద్యజింతువో రెంట నొక్కటి నిశ్చయింపుము. చెఱకుతుదవెన్ను పుట్టినట్లుగాఁ గురువంశంబునకు నితఁడు జనించెను. రాజా! ధర్మము దయాదాక్షిణ్యంబుల నెఱుంగదు.

‘ఉ॥ కంసుఁడు నిట్లు తండ్రి మదిఁ గందెడుచందమొనర్చి ధర్మవి
ధ్వంసము సేసినం గులమువారలు నాకెఱిగింప నేను దు
ర్మాంసముఁగోయు వైద్యునిక్రమంబున నాతనిఁ ద్రుంచి యాన్వయో
త్తంసముఁ జేయనే జనక! దద్విధమొప్పదె మీరుఁ జేసినన్?

అని కోపస్వరంబునఁ బలికెను.

ఆవాక్యంబునకు ధృతరాష్ట్రుఁ డాపాదమస్తకము వడఁకెను; వానినిలువెల్లఁ జెమర్చెను. పుత్రవాత్సల్యంబొకవంకను గృష్ణుని తీవ్రవచనంబులొకవంకను వానినురియాడించెను. ధృతరాష్ట్రుఁ డెట్టకేలకు నెమ్మది వహించి యుపాయాంతరంబునఁ గార్యము సాధింపఁదలఁచి గాంధారిని

సభకు రావించి సంగతియెల్ల దెలిపి పుత్త్రుని సమాధాన పెట్టఁగోరి వానిని దోడ్కొనిరా విదురుని బంపెను. దుర్యోధనుఁడు వచ్చెను. వానిని గాంధారి చేరువకుఁజీరి కన్నీరునించుచు ధర్మంబును నీతియు బాంధవ్యంబును సుఖజీవనోపాయంబును స్వపరబలతారతమ్యంబును గులజనమనోమార్గంబును బూసగ్రుచ్చినట్లుగా నొక్కటొక్కటి నాటఁజెప్పి బుజ్జగించియుఁ గినిసియు హితంబుపదేశించెను. దుర్యోధనుఁడు తల్లిమాటలెల్ల విని,

'ఉ॥ ఏమునువారుఁ బంచికొని యేలుటగల్గదు, పల్కకుండు మిం
కేమియు వాఁడినాఁదిమొనయించుక మోపినయంతమాత్రమున్
భూమి యొసర్చి పాండునృపపుత్త్రున కిత్తునె ? యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబుగొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్॥'

అని పరుషంబుగాఁబల్కి కర్ణాదులవంక మరలి 'కృష్ణుని బోధలు వింటిరిగదా. అతఁడు మననెల్ల బందిచేయుమనెను. ఆపని వానికే చేయుదము. అంతతోనైనను బాండవ పాంచాలురు ధైర్యకవచంబులు జాఱవిడుతురు. యుద్ధప్రసక్తియే సమసిపోవును. కాదని వత్తురేనిఁ బరాజయము వారినొసఁట వ్రాసియున్న'దని రహస్యముగాఁబల్కి యందుండి చనెను.

ఆమాట సాత్యకి విని కృతవర్మను జీరి మనసైన్యము నెల్లఁగూర్చి యాజ్ఞకై సభాద్వారంబున వేచియుండుమని చెప్పి కృష్ణునకు సంగతి వినిపించెను. అది ధృతరాష్ట్రునితోఁ జెప్పుమని కృష్ణుఁడు వచించెను. సాత్యకి యంతటఁ గౌరవేంద్రునకును గురుముఖ్యులకునట్లే దెలిపెను. వారు నిర్విణ్ణులైరి.

దూతను జెనకరాదు. కృష్ణుఁడు దూతమాత్రుఁడే గాదు సర్వలోకప్రియుఁడు. అంతియగాదు. వాని నవతార మూర్తిగా గణించిరి. మఱియు నతఁడు విందమై వచ్చెను. అట్టివానిని బంధించు తలంపు దుర్యోధనునకుఁ బుట్టుటకు భీష్మాదులయుల్లంబులు తల్లడిల్లెను. వారు తలలు వ్రాల్చి మౌనముదాల్చిరి.

కృష్ణుఁడు మెల్లగా లేచి 'కౌరవేంద్రా! నీముద్దుసుతుఁడు నన్ను బంధింపఁదలంచెను. అంతశక్తియున్న నట్లేకానిమ్ము. కావరము గన్నుఁగప్పెఁగాబోలు. సంకల్పమాత్రంబున బూడియగుదురు. నింద్యమని యాతలంపుఁ దలంపనైతి. నీ వారు పరధనంబునకు నఱ్ఱుచాచిరి. తముఱిపోవు టెఱుంగరు. ఏతఱిణంబున మద్బంధనభావంబు దుర్యోధనునియెడ నంకురించెనో యాఱిణంబుననే యతఁడు యుధిష్ఠిరపట్టాభిషేకంబునకు బీజమునాటెను. ఇఁక యథేచ్ఛానుసారంబుగా నతఁడు వర్తింపవచ్చు' నని రోషకషాయస్వరంబున నుడివెను.

ధృతరాష్ట్రుఁడు శోకభయవిహ్వలుఁడై విదురునిబంపి పుత్త్రునిరప్పించి 'దుర్మతీ! ఈక్రూరబుద్ధి నీకేలజనించె? దుష్టులు గఱపిరా? ఒకనాటికిని ద్రోహభావము నిన్నుఁ బాయదుగదా. కృష్ణుని బందిసేతువా? నిన్నుఁ బుట్టించినవాని కైన నదిసాధ్యమా? ఇంత తలపోయవైతివా?' యని మందలించెను.

కృష్ణుఁడు దుర్యోధనునివంక మరలి 'ఒంటరివని తలంచితివా? సహాయమిందు లేదనుకొంటివా? ఎంతమందమతివో

నీతలంపే తెలుపుచున్న' దని పలికి, వానికిఁ దనవిశ్వరూపంబు ను జూపెను. అతఁడు నోరప్పళించి యట్టెచూచుచు నిశ్చేష్టుఁడయ్యెను. కృష్ణుఁడంతట సభనుండి సాత్యకితోఁడ వెడలెను. ధృతరాష్ట్రుండు భీష్మద్రోణవిదుర సహితంబుగాఁ గృష్ణుని సాగనంపవచ్చి ద్వారమునొద్ద వానికేలుపట్టుకొని 'కృష్ణా! నాకొడుకులు నామాటవినమి నీవే కన్నారఁజూచితివి. పాండవులయెడ నాకు ద్రోహబుద్ధి కించిన్మాత్రముగూడలేదు. సంధికై నాశక్తికొలఁది చూచితి' ననుచు వానిని వీడ్కొనియెను.

కృష్ణుఁడంతటఁ గురుముఖ్యులతో 'సమస్తము పెద్దలు చూచితిరి. ధృతరాష్ట్రునివింటిరి. నారాయబారము ముగిసెను. అనుజ్ఞవేడుదు. ఉపప్లవంబునకుఁ బోయెద'నని పలికి వారిని వీడ్కొని కుంతీదేవిని సందర్శించి యామె యనుమతిఁ బడసి పాండవులకడకుఁ దరలెను.

### కృష్ణకర్ణ సమాగమము.

కృష్ణుఁడట్లు హస్తినాపురము వీడి చనుచుండఁగా నార్యావర్తదేశము సర్వసౌభాగ్యవిలసితంబైనది మృత్యువునోటఁ జిక్కి పరితపించుట వానికంటికిఁ గానవచ్చెను. అనాథస్త్రీజనరోదనంబులును శిశువిలాపంబులును వానికి వినవచ్చుచున్నట్లు దోఁచెను. దేశమెల్ల రుధిరప్లుతమై వానియంతర్దృష్టికిఁ బొడసూపెను. దేశభావిగతినిఁ గృష్ణుఁడట్లు తలపోయుచుఁ జనుచుండఁగాఁ గర్ణుఁడు వానికి నెదురయ్యెను. వాసుదేవుఁడు వానినిఁజూచి 'దుర్యోధనునకు నితఁడు కుడిభుజంబగును. ఇతని బలఁబును నమ్మి యతఁడు పాండవులతోఁ బోరుసంకల్పించెను.

సంధికై సర్వవిథంబుల యత్నింతునని పలికి వచ్చితిని. కర్ణుని తో నేకాంతముగా మాట్లాడితివా యని పాండవు లడుగుదురు. ఆయవకాశము తనంతతానిప్పుడు గల్గెను. అదియుఁ జూతము. కర్ణునితత్వంబుగూడ స్పష్టమగును. ఇతఁడు నామాటవిన్న యుద్ధము సమసి లోకము సుఖపడును. వినఁడేని నాకు గౌరవ హానిగాదు. దూతనై వచ్చితిని. ప్రయత్నలోపముండరాదు.' అని తలపోసి కర్ణుని జేరఁజీరి వానినిఁ దనరథంబుపయి నెక్కిం చుకొని యూవలకుఁ గొనిపోయెను.

కృష్ణుఁడట్లు కర్ణుని నేకాంతప్రదేశమునకుఁ గొనిపోయి 'కర్ణా! మనకు నేకాంతసమావేశమగునని తలంపలేదు. దైవం బేలనో యది యిప్పుడు సమకూర్చెను. ఒక్కటినీకుఁ జెప్పఁ దలంచితిని. నీవెవండవో యెఱుంగుదువా? రాధాతిరథులకుఁ బుట్టితినని తలంతువుగదా. అది నిజముగాదు. కుంతీదేవి పాండురాజును బెండ్లాడకపూర్వము మంత్రసిద్ధిని బరీక్షించు టకుగా సూర్యునారాధించి వానివలన సద్యోగర్భము వడసి నిన్నుఁగాంచెను. పెండ్లికానిదానికిఁ బుట్టితివిగావున నిన్నుఁ గనీనుఁడనిరి. కనీనునితల్లి యెవ్వని వివాహమాడునో యతఁడే కనీనునకుఁ దండ్రియగును. కావున నీవు గూఢోత్పన్నుఁడ వైన పాండుసుతుండవు; ధర్మజునకుఁ బెద్దవాఁడవు. కుంతీ దేవి తనకన్యాత్వదూషణంబునకు వెఱచి నిన్ను మందస నుంచి యేటిలోవదలెను. అది యతిరథునకుఁ జిక్కెను. రాధాతిరథులు నిన్నుఁ బెంచిరి. ఈరహస్యంబు కుంతిదక్క నన్యులెఱుంగరు. నీగుటు పాండవులకుఁ దెలిసినచో వారిప్పుడే వచ్చి నీపాదంబుల వ్రాలి యగ్రజుని నిన్నే రాజ్యపీఠి నిల్పు

దురు. రాజమండలంబెల్ల నీకనుసన్నలమెలంగును. వృష్ణి భోజులము మేమెల్లరము నీవెంటనుండుటగు నీవు నీతమ్ములం గూడి యసపత్నరాజ్యంబును భోగించుటగును. నీవలన లోక మెల్ల నానందించును.

'ఉ॥ తల్లిమనంబు సేయుదువు తమ్ములకోరికఁ దీర్తువర్మిలిన్,
బల్లిదులైన రాజులకుఁ బ్రాణములిత్తువు, స్త్రీలతల్లడం
బెల్లెడఁ బాపనోర్తువు సురేంద్రసమోన్నతి మీఱఁ,గీర్తిసం
పల్లలనాలలామలకుఁ బ్రాపయి ప్రాలుదు వక్కజంబుగాన్ ॥'

అని పలికెను.

'కర్ణుఁడది విని 'కృష్ణా! నాయందలి దయామైత్రి వాత్సల్యంబులఁ జేసియు, లోకహితంబు పొంటె నింతగా బోధించితివి. నాజననరహస్యంబు నెఱుంగుదు. కుంతీదేవి నన్నుఁగని పాఱవైచెను. మరల నన్నుఁదలంచియైన నేరదు. రాధాతిరథులు నన్నుఁబెంచి పెద్దఁజేసిరి. నాతోడిదేలోకంబుగా వారుందురు. వారుగాక యెవరులు నాకుఁ దలిదండ్రులగుదురా? వారిని నేఁడు త్యజింపఁ బాడియగునా? అతిరథుఁడు సూతవంశ్యుఁడు. ఆవంశంబునఁ బెండ్లాడితిని. నాకుఁ బుత్రులును పౌత్రులును గల్గిరి. ఈసంబంధబాంధవ్యంబులు త్రోసినను దొలగునవి కావు. సామ్రాజ్యాధిపత్యము చేకూఱుఁగాక; నవనిధులు నాయింటనిల్చుఁగాక; సర్వసంపదలు నాయధీచేత నుండుఁగాక. ప్రాణోపద్రవము వచ్చుఁగాక; ఈబంధంబులఁ ద్రెంపఁజాలను.'

'కృష్ణా! దుర్యోధను నాశ్రయించితిని; వానియన్నంబు

నిన్నాళ్ళు తింటిని ; వానివలన రాజ్యాధిపత్యంబు ననుభవించి తిని ; అతఁడు నన్ను నమ్మి యుద్ధము తలంచెను. ఇప్పుడు వానిని విడనాడుట నట్టేటఁ బుట్టి ముంచుటగాదా ? ఇంతకన్న ద్రోహముండునా ? నీవు మాత్రము మెత్తువా ?' "

'కృష్ణా ! ధర్మనందనుఁడు సత్యసంధుడును జితేంద్రియుఁడు నగుట లోకవిదితము. నేను కుంతీదేవి మొదటికాన్పు నగుట మాటమాత్రము తెలిసిన నీవన్నట్లుగా నతఁడు రాజ్య మెల్ల నాయదుచేతనుంచుట నిజము. దానిని నేను దుర్యోధనువశంబొనర్తుగాని వేఱుగాదు. అది పాండవులకు మేలగు నా ?'

కృష్ణా ! ప్రజాక్షయంబంటివి. దైవయోగంబట్లున్నది. తప్పింప నేరితరము ? విధివిధానంబు వేఱగునేనిఁ గురుపాండవులకు నింతటివైషమ్యంబులు జనించియే యుండవు; నేను సూతపుత్త్రుండనై యుండను ; రాజలోక జనప్రపంచములందు నిష్కారణపరస్పరమత్సరంబు లంతతీవ్రముగాఁ బుట్టియుండవు. ఇవియెల్లఁ జూడఁగా విధివిధానము వేఱనక తీఱదు.'

'కృష్ణా ! కీర్తియంటివి. భారతచరిత్ర నేటితో విస్మృతిప్రాయముగాదు. అది కలకాలముండును. ఇందలిగూఢంబులైన ధర్మసూక్ష్మంబులెన్నో గలవు. ధర్మసూక్ష్మతత్త్వంబుఁ గఱపుటకుగా భారతయుద్ధము రచింపఁబడుచున్నదని తలంతును. ఈకథయున్నంతకాలము మాపేర్లు నిల్చియుండును. దుర్యోధనునివదలి పాండవులఁ గూడుదునేని ద్రోహబుద్ధిక

నన్నే పేర్కొందురు. ఇది నాకుఁ గీర్తియో యపకీర్తియో నీవే యూహింపుము.'

'ప్రాణంబులందువా ? అవి శాశ్వతములుగావు. పుట్టి నది గిట్టక మానదు. నేఁడో రేపో యింతేగాని వేఱుగాదు. దానికి వెఱవనేల ? కృష్ణా ! సందర్భములెల్ల వివరించితిని నామనంబు విచ్చి చెప్పితిని. వానిశ్చయంబును దెలిపితిని ఒండు తలంపవలదు. నాకునేఁడిట్టి యవకాశము గల్గినందు లకు నెంతయు సంతసింతు' ననెను.

కృష్ణుఁడు వానిని విని 'కర్ణా ! నీకు రాజ్యకాంక్షలేదం టివి. అట్లయినఁ బాండవవిజయము సిద్ధము. ఇఁక యుద్ధము తప్పదు. ఈమాసంబున భోజనపదార్థంబులు సమృద్ధంబులు; వనవాటులు ఫలభరితంబులై యున్నవి ; తటాకంబులు నిర్మల వారిపూర్ణంబులు ; కాలము సమశీతోష్ణము. నేటికి నేడవ నాఁడు యుద్ధము ప్రారంభమని కురువీరులకుఁ దెల్పు' మనెను. నావుడు 'కృష్ణా ! నీవు సర్వజ్ఞుండవు ; ప్రజాక్షయము ప్ర త్యాసన్నమగుట నీకు విదితము. ఇది యెఱింగియు నాకు మనోవైకల్యంబును గలిగించుటయు నన్నుఁ బెడత్రోవఁ ద్రొక్కింప యత్నించుటయు నేల?' యని కర్ణుఁడడిగెను. కృష్ణుఁడు వానిసందేహము నెఱింగి 'కర్ణా ! దూతనై వచ్చితిని. నాధర్మంబును సమగ్రంబుగా నిర్వర్తింపవలయును. నీ మతంబు నాకు మున్నే స్పష్టము. నీయంతస్సారంబును బ్రక టింపఁదలంచితిని. దానంజేసి యిట్లాడితిని. అంతియేకాని నీవు నన్ను నిందువనిగాదు. కర్మము దురత్యయమైన దైవంబేమి

సేయు ? ఇదే నిదర్శనము. ఒండుచో నా యత్నము విఫల మగునా ?' యని బదులు చెప్పెను.

అంతఁ గర్ణుఁడు కృష్ణుని మహాప్రీతిపూర్వకంబుగాఁ గవుంగిటఁ గూర్చి 'కృష్ణా ! బ్రదికియున్న నిన్నుమరలఁ జూతును ; చచ్చినఁ బరలోకమందుఁ గాంతు'నని వానిని వీడ్కొని హస్తినాపురమార్గము ద్రొక్కెను.

## శ్రీకృష్ణదౌత్య విమర్శనము.

కృష్ణుని రాయబారమునుగూర్చి భిన్నాభిప్రాయములు గలవు. కృష్ణుఁ డవతారమూర్తియేని సంకల్పమాత్రంబున విప్లవంబు సమసిపోదాయనియు, అట్లుచేయకుండుటకుఁ గారణ మేమనియు, అట్లుగావింపనందున నతని యవతారతత్త్వము కల్లయో, లేక రాయబారమెల్లఁ గపటనాటకమో రెంటనొకటి యగుననియుఁ గొందఱు భావింతురు. కృష్ణుఁడవతారమూర్తి యగుట వానిమహిమలే చాటుచున్నవి. అాతియగాదు. త్రికాలజ్ఞులైన మహర్షులెల్లరుఁ గృష్ణుని యవతారమూర్తిగా నంగీకరించిరి. కృష్ణుఁడు కపటనాటకంబును రచింపఁ గారణము లేదు. అట్లయినచో ఘోరప్రజాక్షయంబును గృష్ణుఁడు తప్పింపఁడేల ? యను ప్రశ్నవచ్చును.

లోకకళ్యాణమే పరమేశ్వర తాత్పర్యము. అట్లుకాదేని సృష్టివ్యాపారమే యనవసరంబగును. కళ్యాణము సాధారణధర్మము. అధర్మగతినే కర్మమందురు. కర్మగతి యథావిధి సాగునంతకాలము శుభమేయగును. దానికి సద్ధంకులు

గలిగినప్పుడు రథము తొట్రుపడుటయో నిలుచుటయో సంభవించును. ఈయడ్డంకులఫలంబు నరిష్టమందురు.

అడ్డంకిని నివారింపరాదాయనవచ్చును. నివారణంబును గోరుట కళ్యాణార్థమేగదా. అడ్డంకిబలంబు నరికట్టి నిల్పుట కన్న నదిసాగి స్వయముగావ్యయించి నశించుట యొక్కొకవేళ మేలుగావచ్చును. ఏవిధానము మేలో భగవంతుఁడే యెఱుంగును. లోకకళ్యాణమే భగవత్తాత్పర్యము గావునను ఏదిమేలో వానికి స్పష్టము గావునను, కర్మగతివిధానము స్వల్పమతుల మైనమనకు విపరీతంబుగా ననర్థకారిగాఁ దోఁచినంతమాత్రాననే యదే పరమసత్యమని భావించి కుతర్కములకు దిగరాదు. ఆహారాది దోషసంక్రమంబున వ్యక్తికెట్లో యట్లే లోకంబునకుఁగూడ నరిష్టరూపజాడ్యంబులు గలుగుచున్నవి. వైద్యుఁడు కొన్నింటి నప్పుడప్పుడే యరికట్టుచున్నాఁడు. కొన్నింటిని వానిబలంబుడుగువఱకు సాగనిచ్చి యనంతరము పాటునకుఁ దెచ్చుచున్నాఁడు. ఏది యెప్పుడెట్లుచేయవలయునో వైద్యుఁడెఱింగిచేయుచున్నాఁడు. వ్యక్తిని బాధపెట్టుటకుగా రోగంబును వైద్యుఁడు సాగనిచ్చుటగాదు. ఫలసాధనంబునకు నమ్మార్గం బనుకూలమగునప్పుడే యట్లుచేయును. అంతమాత్రాననే వైద్యునకు నిందలు మూటకట్టుటలేదు. అదేవిధానంబు సృష్టియెల్లెడల వర్తించుచున్నది. కావున భారతయుద్ధవిషయమై యశక్తత్వ కపటత్వంబులు కృష్ణునెడ నారోపింపనవకాశము లేదు.

ఆరోగ్యమనఁగానేమి ? దోషాభావమే యారోగ్యము. దోషంబెట్లో వచ్చెను. దానినట్లేయుంచిన నారోగ్యము

చేకూఱదు. దోషంబు నున్మూలింపవలయును. దానియున్మూలనంబు బహువిధంబులనుండును. ఒక్కొక్కసారి త్రుటిమాత్రంబున నయ్యది సమసిపోవును ; ఒక్కొక్కసారి యంగచ్ఛేదనాదు లవసరంబగును. ఛేదనాదులు బాహ్యదృష్టికి ఘోరంబులుగాఁ గాన్పింపవచ్చును. ఘోరంబులైనను ఫలసాధనంబునకు నవి యత్యవసరంబైనప్పుడు జంకరాదు. జంకినచో మొదటికే మోసమగును.

దోషము వ్యక్తిపరంబనియు, సంఘపరంబనియు రెండువిధంబులు. దోషక్షయంబగుటకు దోషి తద్దోషనివారణార్థమై యార్తిని బడయవలయును. అందాఁకఁ దన్నివారణార్థమైన పరప్రయత్నంబుపయోగింపదు. ఆర్తిత్వంబునుబట్టి పరసహాయంబుఁగలుగుటయు నదిఫలకారియగుటయు నుండును. సంఘమునకు నార్తియెప్పుడు గలుగునందురా ? దోషంబెప్పుడు దుర్భరంబగునో యప్పుడార్తి గలుగును. దోషము దుర్భరమయ్యెనని గ్రహించుటెట్లు ? వ్యక్తియందు దోషంబు దుర్భరమైనప్పుడు ఏయేలక్షణంబులు వానియందు గాన్పించునో యట్లే సంఘమందును గాన్పించును. ఆలక్షణంబులనుబట్టి వ్యక్తియందువలె సంఘమందును దోషప్రకోపంబును గ్రహింపనగును. ప్రకృతము సంఘమందట్టిలక్షణంబును గాన్పించెను. దోషప్రకోపముతోడ బాధయెక్కువయయ్యెను. తన్నివారణార్థమై యార్తిజనించెను. ఆర్తిత్వమే దోషక్షయంబునకును భగవదనుగ్రహంబునకును బీజమగును. భగవంతుఁడార్తత్రాణపరాయణుఁడు గావునఁ దదర్థము పూనెను.

కృష్ణుఁడు మాటమాత్రము రాజ్యకాంక్షవలదని పాం

డవులతోఁ జెప్పిన వారది యంగీకరించి యుందురనియు, యుద్ధమే సమసిపోయియుండుననియుఁ గొందఱు తలంతురు. కృష్ణునకు ధర్మస్థాపనంబు ప్రధానము. తదర్థము సామదానభేదంబులను మూఁటయత్నించెను. అవి ఫలకారులు గావయ్యెను. యుద్ధంబున తప్ప వేఱొకటి దోషనివారణంబును ధర్మస్థాపనంబుఁ గలుగవయ్యెను. కృష్ణుని దూత్యమే యీరహస్యంబును దెలుపును.

యుద్ధమువలన ధర్మస్థాపనం బెట్లగు నందురా ? యుద్ధమందుఁ బాపతత్త్వంబు లొండొంటితోఁ బోరాడి స్వయముగా నశించును. తన్నాశనంబున విశిష్టము సుఖపడును.

యుద్ధము హింసకాదాయనవచ్చును. హింసాతత్త్వము సులభగ్రాహ్యము గాదు. మనోవాక్కాయంబులఁజేత నన్యునకు నొప్పికలిగించుటయే హింసయని హింసాతత్త్వంబుమ స్థూలముగా నిర్వచించిరి. అంతమాత్రముతో హింసాతత్త్వము తేటతెల్లముగాదు. అట్లునొప్పి కల్గించుట ఆత్మార్థమా ? కాదా ? అనునది హింసాతత్త్వ నిర్ణయంబునకు సానరాయియగును. ఆత్మార్థమైనచో నట్టిది హింసయేయగును. ఆత్మార్థము కానినాఁడది హింసకానేరదు.

భారతయుద్ధమువలనఁ గృష్ణుఁడు గోరంతఫలంబును గూడ స్వార్థము బడయలేదు. ఆసంగతి యాగ్రంథమే తెలుపుచున్నది. కావునఁ గృష్ణుని కార్యంబు హింసాత్మకమగుటకు వలనుగాదు. 'సూక్ష్మాగతిర్హి ధర్మస్య' అన్నట్లుగా ధర్మాధర్మంబుల తత్త్వము మహాసూక్ష్మము. వానితత్త్వంబునుఁ

ప్రాకృతదృష్టిమాత్రంబుననే నిశ్చయింపరాదు. వివిధంబులైన ధర్మరహస్యంబులకు భారతము పెద్దరత్నఖనిగానున్నది. అందలిరత్నంబుల విలువ నాటికి నేటికి నిర్ణయింపఁజాలకున్నారు. ఆరత్నములలో సత్యము, అహింస అనునవి యనర్ఘములు. వానివాస్తవార్థంబును లోకమెల్ల నూహించెను. ఎవరెన్ని విధంబుల నూహించినను 'యద్భూతహితం తదేవసత్యమ్; తదేవధర్మ'మని భారతము చెప్పిన ముక్కకన్న మించినమాట సార్వలౌకికవాఙ్మయమందే గానరాదు. ఈవచనంబును నిదానంబుగా గ్రహించి కృష్ణచరిత్రను బరిశీలింపవలయును.

'ఒకచెంపఁగొట్టిన రెండవచెంపనిమ్ము' అని క్రీస్తువు చెప్పినవాక్యంబును అహింసానిర్వచనంబునకుఁ బ్రమాణంబుగా గొందఱువచింతురు. ఈవచనంబు సహనతత్త్వనిర్వచనంబునకుఁ బ్రమాణంబగునేగాని అహింసాతత్త్వంబునకుఁ గానేరదు. హింసాహింసలఫలము పరవ్యాపకము; సహనఫలంబాత్మీయము.

ధర్మాదులకు సామాన్యలక్షణంబులును విశేషలక్షణంబును గలవు. విశేషలక్షణంబులనే యపవాదములందురు. లోకకళ్యాణమే రెండింటి తాత్పర్యము. సామాన్యధర్మంబుల వలన లోకకళ్యాణంబునకు నాపదగల్గునప్పుడు విశేషధర్మంబుల నాశ్రయింపుమసిరి. విశేషధర్మంబులు ప్రాకృతబుద్ధికి విపరీతంబులుగాఁ దోఁపవచ్చును. అంతమాత్రాననే యవి విపరీతంబులుగావు. ఎల్లధర్మంబులు సాధనమాత్రంబులేగాని వేఱుగాదు. సాధ్యమైన లోకమంగళంబునకు నదియెల్ల నుప

కరింపవలయును. ఏదియట్లుపకరించునో యదియే పరమధర్మం బగు. ఇదే సర్వధర్మశాస్త్రసారము.

### కృష్ణాదుల వయోవిచారము.

ధర్మరాజు కృష్ణాదులకన్న నేడాది పెద్దవాఁడు. భీమ దుర్యోధనకృష్ణులు సమానవయస్కులు. భారతయుద్ధము నాటికి ధర్మరాజునకుఁ దొంబదియొక్కయేడును, కృష్ణాదులకు దొంబదియేండ్లును డెనని వచింతురు. ధృతరాష్ట్రునకు నూట యిరువదియు, వానికి దండ్రివరుసయైన భీష్మునకు 150 సంవత్సరంబులైన నుండునందురు.

### ఆయుష్కాలము.

కలియుగంబునఁ బురుషాయుష్కాలము 120 సంవత్సరంబులనియుఁ దత్పూర్వయుగంబులందు విశేషమనియు జెప్పిరి. ఆయుష్కాలనిర్ణయంబు శ్వాసపరిమాణంబును బట్టి యుండును. ప్రతివ్యక్తియు వానిప్రారబ్ధకర్మానుభవంబునకుగా ఇన్నిశ్వాసలపర్యంతము ముండునని నిశ్చయించిరి. ఈశ్వాసలనుబట్టియే జీవితకాలంబు నిర్ణయింపఁ బడుచున్నది.

శ్వాసగతిని మార్చినచో ఆయుష్కాలము వృద్ధియగును. దీనినే కుంభకయోగమందురు. రసాయనాదులవలనఁ గూడ నాయుష్కాలంబును వృద్ధిచేయవచ్చునని శాస్త్రము. మనపూర్వులింతకాలము బ్రదికిరనుటకు నాశ్చర్యపడఁబనిలేదు. చీనాదేశములో 250 సంవత్సరంబులుగల పురుషుఁడు నేఁడునున్నాఁడని వినుచున్నాము.

## భీష్ముడు—యుద్ధము.

యుద్ధము సమీపించెను. కౌరవసేనాధిపత్యమునకు భీష్ముని నియమించిరి. ఇరువాగులందు వీర్యసాహసోత్సాహంబులు రూపుదాల్చి తాండవంబాడసాగెను. ఏడక్షోహిణుల బలంబుతోఁ బాండవులును బదునొకండక్షోహిణులతోఁ గౌరవులును సమావేశమైరి.

భీష్ముఁడు సర్వధర్మసూక్ష్మపరిజ్ఞాతయై యెల్లరకు గురుభావపూజితుఁడునుగా నుండెను. ఎట్టిధర్మసంశయంబువచ్చినను వానివచనమే ప్రమాణంబుగా నుండెను. అంతటివాఁడు గావుననే ధర్మరాజునకు భీష్మునివలన వానియవసానకాలమందు సర్వధర్మంబులను గృష్ణభగవానుఁడు చెప్పించెను.

ఈయుద్ధమందు ధర్మము పాండవులవలననే యున్నదని భీష్ముఁడు పెక్కుసార్లు పలికెను. ఆసంగతి తెలిసియు ధర్మవేత్తయైన భీష్ముఁడు కౌరవపక్షంబునే యెట్లవలంబించెనను శంక గలుగక మానదు.

ఆత్మలాభార్థియై భీష్ముఁడట్లు వర్తించెనోయనుటకు రాజ్యాదులనేగాని సమస్తమును ద్యజించి యాయన మమకారరహితుఁడైనట్లు వానిచరిత్రయే చాటుచున్నది. అట్లుండియు భీష్ముఁడు కౌరవపక్షంబుననే యుండనేల ? అదిధర్మమా ?

ధర్మము స్వధర్మమనియు సార్వలౌకికధర్మంబనియు రెండువిధంబులు. స్వధర్మంబాత్మకళ్యాణార్థమగు. అందులకు నెల్లరు నర్హులు. రెండవది లోకకళ్యాణార్థమగు. అందు

లకు నెల్లరు నష్టులు. రెండవది లోకకళ్యాణార్థమగు. అందులకు నెల్లరు నష్టులుగారు ; భగవంతుఁడొక్కరుఁడే యష్టుఁడు. భీష్ముఁడు భక్తుఁడుగాని జ్ఞానిగాఁడు. అందువలన ధర్మాధర్మవిచారంబును స్వధర్మపరిపాలనంబును వానికిఁ గర్తవ్యంబులాయెను. జ్ఞానివిషయమన్ననో యతఁడు ధర్మాధర్మంబులకు నతీతుఁడు. వానిసంకల్పమే ధర్మంబగును.

భీష్ముఁడు భక్తుఁడేయగుఁగాక ; స్వధర్మానుష్ఠానము వానికి విధియగుఁగాక. క్షత్త్రవంశ్యుఁడుగాఁబట్టి యతనికి యుద్ధము స్వధర్మమేయగుఁగాక. న్యాయాన్యాయవిచారము వలదా ? యనిశంకింపవచ్చును.

దుర్యోధనుని పోషణంబుననున్నందున వాని యన్నంబిన్నాభృతిని నేఁడు వానిని ద్యజించుట ద్రోహమనితలంచి భీష్ముఁడు వానిపక్షంబె యవలంబించెనందుమా ? అట్లయిన న్యాయంబును ద్యజించుటగూడ ద్రోహమేయగును. దుర్యోధనుని త్యజించుటవలనఁగలుగు ద్రోహదోషముకన్న న్యాయంబును ద్యజించుటవలనఁగలుగు ద్రోహదోషము శతాధికమగును. ఆసంగతి భీష్మునకు స్పష్టము. కావున ద్రోహభీతి కారణముగానేరదు.

మైత్రివాత్సల్యాదులందుమా? దుర్యోధనునివలనకంటె ధర్మరాజాదులవలన భీష్మునకు మైత్రియొండె వాత్సల్యంబొండె నధికమగుట దుర్యోధనుఁడే చెప్పెను.

రాజ్యకాంక్ష, ద్రోహచింతనము, మైత్ర్యాదులు.-ఇవి యెల్లఁ గాదంటిమి. ఇఁకఁ గారణమేమి ?

'భీష్ముఁడివియెల్ల విమర్శించి 'సతాంహి సందేహాపదేషు వస్తుషు ప్రమాణమంతః ప్రవృత్తయః' అను న్యాయంబు ననుసరించెను. భీష్ముఁడు సత్పురుషుఁడగుట నిర్వివాదాంశము. అతఁడు సత్పురుషుఁడు గావున వానియంతఃకరణంబు రాగద్వేష రహితము. అట్టివానియందేభావము స్ఫురించునో యది ధర్మ నిబద్ధమేయగును. కర్మంబెంత ధర్మనిబద్ధమైనను దానినంతో యింతో దోషంబంటియే యుండును. అది కర్మమునకు నైజము కావుననే 'సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః' అని భగవానుఁడు వచించెను. ఆదోషంబు ననుభవించియే తీఱవలయును. అదియెవ్వనికిఁ దప్పదు. భీష్ముఁడుగూడ వాని యపరాధంబు నొప్పికొని తత్ఫలంబనుభవించితిననెను. భీష్ముఁడు దోషబలాబలంబులను విచారించి యాసందర్భములనుబట్టి దుర్యోధనుసకు పక్షంబవలంబించుటయే రెండుదోషంబులలో నల్ప మని వానియంతఃకరణస్ఫురణంబు నాధారముచేసికొని యుద్ధ మొనర్చెను. అధికదోషంబును త్యజించి యల్పంబు ననుష్ఠించుట ప్రాజ్ఞసంప్రదాయము' అని కొందఱందరు.

'పరిశుద్ధమైన భీష్ముని యంతఃకరణంబున నట్టిభావము స్ఫురింపనేల ? యనవచ్చును. భీష్ముని జననంబునకు నేదికారణమో, ఏకర్మనిమిత్తం బామహనీయుఁడవతరించెనో, ఏకర్మము తానొనర్పనిచోఁ బాపానుబంధులు నశించుటయు లోకకళ్యాణంబుచేకూఱుటయు సిద్ధింపవో, యాకర్మంబునకుఁ దాను విముఖుఁడై యాత్మమంగళంబును మాత్రమే సంపాదించుకొనుటకన్నఁ దత్కర్మంబునాచరించి లోకమంగళంబుఁగావించుట మేలనియుఁ, స్వార్థము లోకార్థము అనురెండింటిలో లో

కార్థమే యుత్తమధర్మంబనియు వాసికిస్ఫురించెను. సర్వభూత హితమేగదా యుత్తమధర్మము. 'సత్యంవద, ధర్మంచర' అని వేదాంతసారము. భీష్మునిమనోనిశ్చయంబు మహాగంభీరంబును సామాన్యదృష్టికి నగోచరంబునై సర్వధర్మసారముగా నున్నది. తండ్రికై యామరణ బ్రహ్మచర్యవ్రతంబును స్వీకరించినవాఁడును సత్యవతికై హస్తంగతరాజ్యంబును గడ్డినువలెఁ ద్యజించినవాఁడును, భూతహితమే ప్రధానంబుగా గ్రహించినవాఁడును, ధర్మాధర్మంబులయొక్క సూక్ష్మాతిసూక్ష్మరహస్యంబుల జ్ఞానముచేతఁ బరిణతచిత్తవృత్తుఁడును గావున భీష్ముఁ డిట్లొనర్పఁజాలెను.' ఇదియొక మతము.

ఇవన్నియు యుక్తికినిలువవు. భీష్ముఁడు మహాధర్మజ్ఞుఁడైనను స్వతంత్రించి నిజమార్గంబును నిశ్చయింపక ధర్మాధర్మవిచారంబునువదలి యంతర్ముఖుఁడై భగవంతుని శరణుచొచ్చి తనకర్తవ్యంబునుఁ దెలుపఁగోరి యుండును. పరమభక్తులిట్లు చేయుట సహజము. ఈశ్వరేచ్ఛానుసారవర్తనంబుతప్ప మఱియొండువారిచ్ఛగింపరు. భగవంతుఁడు అర్జుననకువలె భీష్మునకుఁగూడ 'యోగస్థకురుకర్మాణి' అని తెలిపియుండును. భగవదిచ్ఛయట్టిదగుటం జేసి యొండుతలంపుమాని భీష్ముఁడు యోగబుద్ధినాశ్రయించి యీశ్వరేచ్ఛ నడిపినట్లు నడిచియుండును. కర్తృత్వబుద్ధియున్నప్పుడే ధర్మాధర్మవిచికిత్స యుండును. అట్టిబుద్ధిలేనప్పుడు వానికార్యమెల్ల నీశ్వరప్రేరితమై పాపపుణ్యభావరహితమై యుండును. భీష్ముఁడు కౌరవులపక్షంబున యుద్ధమొనర్చుటకు నిదియేకారణము. భీష్ముఁడు వానినిర్యాణ

కాలమందు 'ఏదినాకు మేలో యదినీవేయూహింపు' మనివేడె ను. భీష్మునిజీవితమందెల్ల నిట్టిభావంబు గాన్పించుచున్నది.

ధర్మము.

ధర్మమనఁగానేమి? అని లోతునకుదిగి విచారించినచో నన్నిఁటికి మూలమైనట్టి యేసత్పదార్థముగలదో దానిననుసరించి వర్తించుటయే ధర్మమగు. ఈక్రమమునే వేదాంతపరిభాష లో సగుణపరంబుగాఁ జెప్పునప్పుడు 'ఈశ్వరేచ్ఛానుసారమైన క్రమమే ధర్మ'మనిరి. ఈశ్వరేచ్ఛయనునది పారలౌకికము. సర్వజనోపయోగార్థము తత్క్రమమును బెద్దలు వారిశుద్ధాంతఃకరణంబులకు స్ఫురించినంత శాస్త్రీకరించిరి. శాస్త్రగతంబులైనవే సర్వధర్మములు గావని గట్టిగా గ్రహింపవలయును. దేశకాలపాత్రానుసారంబుగాఁ బెద్దలుకొన్నిఁటిని దెల్పిరి. ఎవ రెన్ని తెల్పినను ఏదియీశ్వరేచ్ఛానుసారమో యదే ధర్మమగు ను. ఈశ్వరేచ్ఛయేమో యీశ్వరునివలననే యెఱుంగవల యును. శరణాగతియే యందులకుఁ బరమసాధనము. ఈ భావంబునే 'సర్వధర్మాన్‌పరిత్యజ్య మామేకంశరణం వ్రజ'అని శ్రీకృష్ణభగవానుఁడు బోధించెను. భీష్ముఁడాబోధప్రకార మే వర్తించెను.

ఈశ్వరేచ్ఛానుసారవర్తనమే ధర్మముయొక్క పరమావధి. సర్వాత్మసమర్పణమే యందులకునుపాయము. సర్వ శాస్త్రములు సర్వబోధనలు మనస్సునట్టిస్థితికి నడపించుటకే గాని వేఱుగాదు. ఈసిద్ధి యొక్కసారిగా నెల్లరకుఁ గలుగదు. అదిక్రమక్రమముగా రావలయును. మనుష్యతత్త్వతార

తమ్యమునుబట్టియు దేశకాలంబులఁబట్టియు సాధనంబులుండు. కర్మభేదనంబునకు నిదే కారణము. తత్త్వాదులనుబట్టి కర్మము ను గర్మమునుబట్టి ధర్మగతియు నుండుటను జేసి మనకు కర్మ బహుత్వంబును ధర్మగతికి సూక్ష్మాతిసూక్ష్మభేదంబులును గలుగు చున్నవి. ఈయంతరాంతరభేదంబులు తప్పవు. పరమార్థం బును మఱచి యీయంతరాంతరభేదంబులనుబట్టి యూఁగు లాడుచు గుణదోషనిర్ణయంబు కఠాదకతనుజూపుచు లోకము కాలమును రిత్తవుచ్చుచున్నవి. ఈవిషయమై యెంతో గ్రంథ మును వ్రాయవచ్చును. ఎంతగ్రంథమును వ్రాసినను ఫలి తార్థము 'ఈశ్వరేచ్ఛానుసారవర్తనమే ధర్మము' అనునదే సారాంశము.

అట్టియంతఃకరణపరిణామంబు సిద్ధించుటకై కొన్నినియ మంబుల నభ్యసింపవలయుననిరి. వానినే లౌకికభాషయందు ధర్మంబులందురు. అవి సామాన్యంబులనియు విశేషంబులని యు రెండువిధములు. అహింసాదులు సామాన్యంబులు. అనఁగా నెల్లరు ననుష్ఠింపవలసిన ధర్మములు; వర్ణాశ్రమములనుబట్టి యనుష్ఠింపవలసినవి విశేషధర్మంబులు. విశేషధర్మంబులకు సాంకర్యంబును గలిగించినచోఁ బతనము తప్పదు. కావున వానివిషయమై ప్రమాదపడవలదు. ఏవర్ణంబునకు నేయా శ్రమంబునకు నేధర్మంబుయుక్తమో దానిననుష్ఠించుట గుణ మగునేగాని వర్ణాశ్రమాంతరధర్మంబుల ననుష్ఠించుట గుణము గాదు. అట్టి భ్రాంతిని వదలవలయును.

సంధిఖండము సమాప్తము.

---



# శ్రీకృష్ణచరితము.

## గీతాఖండము.

### అర్జునునివిషాదము.

కురుపాండవ సైన్యంబులు సమరక్షోణిఁ గూడెను. కృష్ణుఁడర్జునుని కోరిక ప్రకారము వానిరథసారథ్యంబును వహించెను. ఇరుసేనలను జూచుతలంపు పార్థునకుఁ గలిగెను. వానియిష్ట ప్రకారము కృష్ణుఁడు రథంబును దోలితెచ్చి యుభయసేనా మధ్యంబున నిలిపెను. అర్జునుఁడు రెండుపక్షంబులఁబరికించి కృపావిష్టుఁడై 'కృష్ణా! వీరిని జూచినంతనే నాకు భరింపరాని దుఃఖమగుచున్నది. శరీరమెల్ల వడఁకెడు; నోరెండువాఱెడు; ధైర్యము సన్నగిల్లెను; కన్నులు పచ్చనై కానరావు; దిటవు తప్పుచున్నది; నిలువనోపకున్నాను. కటా! ఇందఱను జంపి వీరినెత్తుటమాగినముక్కిరాజ్యభోగంబుల ననుభవించుట కన్న భిక్షమెత్తి జీవింపఁదగదా? ఎవరికిగా రాజ్యాదికాంక్ష గలిగెనో వారే ప్రాణభోగాద్యాపేక్ష మాని యిందుఁగూడిరి. వీరు పోయిన తర్వాత రాజ్యమేల? కామక్రోధవశులమై రాజ్యవ్యామోహంబునకుఁ జిక్కి బంధుమిత్రాది సమస్తస్వజన

మారణరూపమైన మహాపాతకంబునకు సాహసించితిమి. ఇంత కన్న ఘోరము గలదా ? ఈతప్పు నజ్ఞానవశంబునఁ దొలుదొల్త గ్రహింపమైతిమి. ఇంతటికైనను మేల్కొనుట మేలు గదా. వైరులసంగతి యేమందువా ? వారు మమ్ము నతికినను నఱుకుదురుగాక. వారినిఁ జెనకనోపను. అట్లుండుట యప కీర్తిగాదాయని శంకింతువా ? వీరినిఁజంపుటవలనఁ గల్గునపకీర్తి కన్న నది విశేషము గాదు. పిఱికినై తినందువా ? పిఱికినో గాదో లోకవిదితము. ఇది క్షత్రధర్మమా ? యనియడుగుదువా ? ధర్మము లోకోపకారార్థమగునేగాని తన్నాశనార్థము కాఁజాలదు. యుద్ధమువలన స్త్రీలెందరో యనాథలై గోడు గోడుమందురు. శిశువులెందఱో యల్లాడుదురు ; దేశమెల్ల దుఃఖమయమగును. వర్ణసాంకర్యము సంభవించును. ఇన్ని వెతలకుఁ గారణమైన సేత యది ధర్మమగునా ? కృష్ణా ! ఎట్లువిచారించినను యుద్ధము తగదని తోఁచుచున్నది. నీవు సర్వజ్ఞుండవు ; ధర్మాధర్మంబులరహస్యంబెల్ల నీయఱచేతిలో నున్నది. ఏదినాకు మేలో నీవే నిశ్చయించి చెప్పు' మని శస్త్రాస్త్రంబులను దిగవైచెను.

అర్జునుని మనస్తత్వంబు కృష్ణునకు నాశ్చర్యంబు నొదవించెను. పార్థుఁడు యుద్ధవిమనస్కుఁడైనచోఁ బాండవులు వానిదారిఁద్రొక్కుటయుఁ, దత్ఫలముగా ధార్తరాష్ట్రవిజృంభణంబగుటయుఁ, దత్ఫలంబుగా నధర్మంబునకు నాటవిడుపగుటయుఁ, గురుపాండవయుద్ధమూలకంబున ధర్మంబును స్థాపించుటకుగాఁ దానవతరించిన సంకల్పంబునకే భంగమగుటయుఁ గృష్ణుని హృదయదర్పంబునఁ బ్రతిఫలించెను.

అర్జునుని మరలించుటో యంగీకరించుటో రెంటనొకటిఁ గృష్ణునకుఁ దప్పనిసరియయ్యెను. అర్జునునకు శాస్త్రజ్ఞానము లోకజ్ఞానము వలసినంత గలదు ; అతఁడు మూఢుఁడుగాఁడు. వానినిమరలించుట యంతసులభకార్యముగాదు. మఱియుఁ బార్థునివాదమును లోకసామాన్యమైన శాస్త్రమెల్ల నంగీకరించుచున్నది. యుద్ధమునందుఁ బ్రాణివధ తప్పదు. ప్రాణివధ హింసయనియు హింసాకార్యము మిక్కిలియధర్మమైనదనియు శాస్త్రమే పల్కుచున్నది. మఱియు దానిని లోకమెల్ల నామోదించుచున్నది. అట్టిపని హింసయు నధర్మంబును గాదని నిరూపించుటెట్లు ? నిరూపించినను లోకము విశ్వసించునా ? విశ్వసింపనిచో లోకము దానినాచరింపదుగదా. ఏమి చేయవలయు ?

## గీతావతారము.

ఈమనోవ్యాధి సామాన్యచికిత్సలకుఁ గుదురునది కాదయ్యెను. దివ్యమూలికా ప్రయోగంబుననేగాని యది చక్కఁబడునట్లు గాన్పింపదయ్యెను. ఆమూలికయన్ననో పారలౌకికము. అది యెల్లరకు సాధ్యముగాదు. ఎట్లయినను దానిని సాధించి ప్రయోగించుట యత్యవసరంబయ్యెను. దానినట్లే ప్రయోగింపరాదు. ఇందునట్టియనుపానంబుతోఁ గూర్చి దానిని బ్రయోగింపవలసియుండెను. ఇంతపనిచేయుటకు నొరులు చాలరైరి. కాఁబట్టి కృష్ణభగవానుఁడే యందులకుఁ గంకణము ధరించెను. ఆమూలికయే గీత ; దానిసారమే గీతామృతము ; రోగికినౌషధంబిడుటకై గ్రహించిన యనుపానములే కర్మాదియోగములు. శ్రీకృష్ణభగవానుఁడు పార్థుని

నిమిత్తముగాఁజేసి సర్వలోకవ్యాపకమైన యీమనోవ్యాధిని అనన్యౌషధసాధ్యమైన దానిని నివారించుటకుగా గీతామృతంబును బారలౌకికమైన దానిని గొనివచ్చి యనుగ్రహించెను. ఇదే గీతావతారము.

'గీతావతారంబునుగూర్చి శ్రీ శంకరభగవత్పాదులవారిట్లు గీతాభాష్యములో వ్రాసిరి. ఎల్లప్రాణులకు శోకమోహాదులు గలుగుచుండును. ఆశోకమోహంబులే సంసారబీజభూతంబులైన దోషంబులగుచున్నవి. ఆదోషంబులెప్పుడు పైకొనునో యప్పుడే సర్వప్రాణులకును స్వధర్మత్యాగంబును ప్రతిషిద్ధధర్మసేవయు సహజంబు లగుచున్నవి.'

'ఎవరోకొందఱు స్వధర్మప్రవృత్తులున్నను, వారివాఙ్మనఃకాయాదిప్రవృత్తి ఫలాభిసంధితో నహంకారంబుతోఁ గూడియుండును. ప్రవృత్తియట్లు అహంకారఫలాభిసంధితోఁ గూడినప్పుడు అదియు దోషమేయై సంసారహేతుభూతమగుచున్నది.'

'స్వధర్మపరిత్యాగంబున ధర్మలోపంబును ప్రతిషిద్ధధర్మసేవనంబున అధర్మాభివృద్ధియు నగుచున్నది. ధర్మాధర్మంబుల వృద్ధింబట్టి యిష్టానిష్టజన్మంబులును సుఖదుఃఖాదులును గలుగుచుండును. ధర్మాధర్మంబుల ఫలంబు ననుభవింపక తప్పదు. తదర్థమై కలుగు జన్మపరంపరయే సంసారము.'

'దీర్ఘముగా విచారించినచో సంసారంబునకు శోకమోహంబులు రెండును బీజభూతంబులుగా నున్నవి. సంసారనివృత్తి వలయునన్న శోకమోహంబులు పోవలయును. అవిపోవుటకు నాత్మజ్ఞానంబొక్కటియే శరణము. ఆత్మజ్ఞానము సర్వకర్మసంన్యాసంబునఁగాని కలుగదు.'

'ఈపరమరహస్యంబును సర్వలోకంబునకు నుపదేశించుటకై శ్రీకృష్ణభగవానుఁడు అర్జునుని నిమిత్తముగాఁ జేసి గీతను బోధించెను. ఇదే గీతావతారకారణము.'

సర్వకర్మసంన్యాసమనఁగా నేమో యుత్తరభాగంబున వివరింపఁబడును.

### గీతోపదేశదినము.

శ్రీకృష్ణభగవానుఁడు గీతను మార్గశీర్ష మాస శుద్ధైకాదశినాఁడు అర్జునునకు నుపదేశించెనని కొందఱును, శుద్ధత్రయోదశినాఁడుపదేశించెనని కొందఱును, బహుళ విదియనాఁడుపదేశించెనని కొందఱును చారిత్రపరిశోధకులు తలంచుచున్నారు. అయినను శుద్ధైకాదశియే సిద్ధాంతముగా దేశమెల్ల నంగీకరించుచున్నది. శుద్ధైకాదశి వైకుంఠైకాదశి యగును. గీతోపదేశము వైకుంఠ (మోక్ష) ద్వారము విచ్చుచున్నది. కావున వైకుంఠైకాదశియే గీతోపదేశదినమని గ్రహించుట యెంతయు సమంజస మగుచున్నది.

### గీతాప్రయోజనము.

గీతాగ్రంథము తత్త్వోపదేశంబునకు ననుకూలించునే గాని లోకవ్యవహారంబునకు నుపయోగింపదని కొందఱందురు. లోకవ్యవహారంబులెల్లఁ దత్త్వజ్ఞానపూర్వకంబుగా జరుపవలయునే గాని యథేచ్ఛానుసారంబుగా జరుపరాదనియు, లోకవ్యవహారమార్గబోధకొఱకే గీతయుపదష్టమయ్యెననియు

'గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమంగృహమ్'

గీతాజ్ఞానముపాశ్రిత్య త్రీల్లోకాణ్ పాలయామ్యహమ్
అని భగవంతుఁడే ప్రకటించెను. ఇదే గీతాప్రయోజనము.
ప్రజావర్తనంబునుబట్టి లోకస్థితి యుండునుగదా.

గీతనుగూర్చిన మతాంతరములు.

గీత యెంతమాత్రముఁ గృష్ణోపదిష్టముగాదనియుఁ బ్ర క్షిప్తమనియుఁ గొందఱు తలంతురు. గీతాభావంబులు మాత్రము కృష్ణోపదిష్టంబులనియు గీతాగ్రంథము పరకృతమనియు మఱికొందఱు భావింతురు.

గీతను గృష్ణుఁడుపదేశింపలేదనువారిలోఁ గృష్ణావతారమే కల్లయనువారు గలరు. కృష్ణావతారము కల్లయో గాదో యీగ్రంథాంతరమందు విచారింపఁబడియున్నది. ప్రక్షిప్తవాదమును విచారింతము.

గ్రంథములందుఁ బ్రక్షిప్తంబులు లేవనఁ జాలరు. ప్రక్షిప్తంబునకు రెండు మార్గములు గలవు. పూర్వోత్తర సందర్భములఁ జూచి నడుమ యిఱికించుట యొకమార్గము. ప్రక్షిప్తంబునకు ననుకూలంబుగాఁ బూర్వోత్తరంబులను సవరించుట యొకమార్గము. ప్రక్షిప్తంబు మూలగ్రంథప్రచారపూర్వమే కావలయునుగాని యనంతరమున జరుగదు.

భారతము పెక్కువ్రాతపతులఁబట్టి యెల్లరాష్ట్రములలో ముద్రితమైయున్నది. అట్లు ముద్రితమైన గ్రంథములలో నొకదానిలోనున్న కొన్నిభాగంబులు మఱియొకదానిలోఁ గానరావు గాని గీతమాత్రమెల్లగ్రంథములలో నున్నది. గీత ప్రక్షిప్తముకాదనుటకు నిదియొక ముఖ్యకారణము. గీత యొకవేళ

ప్రక్షిప్తమైనచో గీతకుననుకూలంబుగా భారతంబును సవరిం
చిరా ? భారతసందర్భంబునకు ననుకూలంబుగా గీత నిఱికించి
రా' యను ప్రశ్నవచ్చును. గీతకు ననుకూలంబుగా భారతం
బును సవరించుట సాధ్యముగాదు. గీత భారతమందు ఆది
శాంతి అనుగీతాపర్వములలో మొత్తముమీద నేఁడుచోట్లఁ
బల్కరింపఁబడుచున్నది. గీతాభావంబులు భారతమందచ్చట
చ్చట వెదఁజల్లఁబడియున్నది. గీతకును భారతంబునకును రచనా
సాదృశ్య మెంతో గలదు. అంతియగాదు. గీతలోని పదంబులు
సమాసంబులు వాక్యంబులు నట్లుగానో యించుకమార్పుతోనో
భారతమందుఁ బెక్కుచోట్లఁ గలవు. మఱియు గీతాశ్లోకంబులు
యథారూపంబుననే భారతాంతరంబునఁ గలవు. ఇన్నికార
ణంబులనుబట్టి గీతాగ్రంథము ఏవిధమైన ప్రక్షిప్తముఁ గానేర
దని గట్టిగాఁ జెప్పవచ్చును.

పైనఁజెప్పినదెల్ల బాహ్యపరీక్షయగు. ఇఁక నంతరప
రీక్షనుఁబట్టి చూతము. గీతావతారంబునకు భారతమందవ
కాశమున్నదా ? లేదా ? యనుట అంతరపరీక్షలో మొదటి
దగును. గీతావతారంబునకు భారతమందు సంపూర్ణావకాశ
ముగలదు గీతయే లేనిచో భారతజీవమే సున్నయనవచ్చును.
నానాధర్మసూక్ష్మంబులను బ్రబోధించుటకై భారతము రచిం
పఁబడెను. ఇంతయేల ? 'ఇందులేనిది మఱెందు నుండ' దని
వ్యాసమహర్షి ప్రతినచేసి భారతంబును రచించెను. ఈకార
ణంబుననే భారతంబును బంచమవేదమనిరి. ధర్మాధర్మంబులు
కార్యాకార్యరూపంబులు. అవి మనోవాక్కాయపరములై
యుండును. ధర్మములోనెల్ల నహింస, సత్యము ఇవి ముఖ్య

ములు. వానింగూర్చి మనఋషులేగాక యన్యదేశపండితులు గూడ రచించిన వేనవేల గ్రంథములను బట్టి యవియెంత ముఖ్యములో యూహింపవచ్చును.

యుద్ధము హింసాత్మకము. హింస యధర్మమని స్పష్టము. అట్టిదే సంభవించెను. లోకకల్యాణమెల్ల హింసాతత్త్వనిర్ణయరూపమైన పట్టువోగునంటియుండునట్లుగా నేర్పడెను. అర్జునుఁడంతటివానికిఁ గూడ తద్విషయమున వేఱుతలంపు గలిగెను. యుద్ధము ధర్మమా ? అధర్మమా ? ధర్మమైనచో ఎప్పుడెట్లుచేసిన ధర్మమగును ?' అను నిర్ణాయకము విధియయ్యెను. దానిని వదలినచోఁ గథాపర్యవసానం బెట్లున్నను భారతంబువలన లోకోపకారము గలుగకపోవుటయే గాక జగంబునెల్ల సందేహసాగరంబున ముంచుటగును.

అన్యదేశనీతివేత్త లిట్టి క్లిష్టస్థితులను గల్పించి ప్రజోపకారార్థ మెన్నో సందేహంబులను దీర్చిరి. వ్యాసుఁడంతటివాఁడట్టి క్లిష్టపరిస్థితిని గల్పించి మిన్నకుండునా? ఈముడిని గీత విచ్చి వివరించుచున్నది. కాఁబట్టి గీతావతారంబునకు భారతమందెంతో యవకాశము గలదు. అంతరపరీక్షంబట్టిగూడ గీత ప్రక్షిప్తము కాదని దృఢముగా చెప్పనగును.

గీతాగ్రంథము కృష్ణార్జునసంవాద యథారూపముగాదనునది మఱియొక వాదము గలదు. (1) సంవాదము వచనరూపంబుననుండఁ బోలునేగాని శ్లోకరూపంబున నుండఁబోలదనియు, (2) యుద్ధసమయంబున యుద్ధరంగమందు సంవాదం బంత విరివిగా నుండనేరదనియు, (3) వారిసంవాదం బెట్టిదైనా

షంబున జఱిగినను దానిని వ్యాసుఁడు స్వయముగా విని వ్రా యలేదనియు, (4) ఎవరేని వినివచ్చి చెప్పఁగా రచించినట్లు వ్యాసుఁడెచ్చటను సూచింపలేదనియు, కాఁబట్టి వారిసంవాద ము యథారూపంబున గ్రంథస్థమైనదని తలంచుటకు వలను పడదనియు నీవాద సారాంశము.

వీనినెల్ల నంగీకరించినను గీతాగ్రంథము కృష్ణార్జునసం వాదమనుటకు భంగము గలుగదు. వ్యాసుఁడు కృష్ణార్జును లకు సమకాలికుఁడు. వ్యాసుని విష్ణువేయనిరి. వ్యాసుఁడు మహాయోగి గావున వానికిఁ ద్రికాలజ్ఞానము స్వతస్సిద్ధము. సంకల్ప మెవ్వనికైనను జనించినంతనే యది హృదయాకాశ గతమగును. ఆసంకల్పము శబ్దరూపంబున వెలువడినప్పుఁడు బహిరాకాశగతమగు. అట్లాకాశగతమైనదానికి నాశనము లేదు. ఈవిధానమునే చిత్రగుప్త రచనమందురు. యోగులు త్రికాలజ్ఞానులు గావున యోగదృష్టితోఁ జూచినప్పుడు వారికి సమస్తము యథారూపంబున స్పష్టపడును. సృష్టార్థంబును వారు లోకానుగ్రహార్థము ప్రకటింతురు. వ్యాసమహర్షి యీవిధంబున కృష్ణార్జునసంవాదంబునేగాక భారతమంతయుఁ జూచి రచించెను.

ఈయద్భుతశక్తిని ఇదానీంతన పాశ్చాత్యప్రకృతిశా స్త్రజ్ఞులు సయిత మంగీకరించిరి. ఎవరికి బుద్ధి యేకాగ్రమగు నో వారికెల్ల నిట్టిశక్తి యంతో యింతో కలుగుచుండును. కవులును దీర్ఘాలోచనపరులును దీనినిఁ గొంతకుఁగొంత చవి చూతురు.

గీతయందలి భావంబులు కృష్ణునవిగాని వేఱుగాదు. ఆభావంబులను వ్యాసమహర్షి యమృతభాషలో రచించెను. భావసత్త్వమునకు భాషాసత్త్వము తోడ్పడి గీతను సజీవగ్రంథముగా సార్వలౌకిక సార్వకాలికంబుగాఁ జేసెను. గీత యట్టి దగుటంజేసి యనుకరణాతీతమై యధ్యాత్మతత్త్వ తారామండలంబునకుఁ బూర్ణచంద్రబింబమై విరాజిల్లుచున్నది. భావంబులు భగవంతునివనియు, భాషయు నిబంధనంబును వ్యాసమహర్షివనియు శ్రీశంకరభగవత్పాదులవారు సయుత మంగీకరించిరి. 'చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్' 'పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయమ్ । వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతమ్॥' అనువానిని స్మరింపనగును.

కృష్ణుఁడు కవికల్పితమూర్తియనిరి. కవికల్పితమూర్తు లెందఱో గలరు. అట్లు కల్పించినకవులన్నరో దిగంతవిశ్రాంత కీర్తినిగాంచినవారుగాని మేతన్మాత్రులుగారు. అంతటివారు కల్పించినమూర్తులలో నెవ్వరైనను రామకృష్ణాద్యవతారంబులు వలె ప్రజాహృదయంబుల నధిష్ఠించిరా ? జనులు వారికి గాఁజేయుభక్తిలో గోరంతయైన నట్టివారు పడయనోచిరా ? తుదకు వారిపేరైనఁ గలదా ?

అసలువస్తువంతోయింతో హృదయస్థమైనగాని దాని యెడ భావంబంకురింపదు. ఇది సర్వమత శాస్త్రసమ్మతము. వస్తువునందలి గుణాతిశయంబును బట్టి భావనావ్యవసాయము సాగుచుండును. కవి తానెంతటివాఁడైనను వస్తువుత్తమోత్తము

మైనప్పుడే వాని భావనాశక్తి యథావిధి మనోహరగతి విహరించును. ఈనిదానంబునఁ బరిశీలించినను రామకృష్ణాద్యవతారంబులు కల్లలో కల్పితంబులో మహోన్నతంబులో విదితమగును.

గీతాశాస్త్రము.

దీనిని యోగశాస్త్రంబన్నియు వచింతురు. యోగమనఁగా సంకల్పవికల్ప రహితమైన మనస్థితి యనియు, మనోవృత్తి నిరోధంబనియు, జీవబ్రహ్మైక్య మనియు వచించిరి. రెంటి కలయికయందు యోగశబ్దంబును బ్రయోగించుట సహజముగానున్నది. జీవబ్రహ్మైక్యసిద్ధికి మనోవృత్తిలయంబును దానికి సంకల్పవికల్పనాశనంబును బూర్వాంగములగును.

యోగంబును మొట్టమొదట హిరణ్యగర్భుఁ డుపదేశించెననియు, వానియుపదేశంబులను దర్వాతివారి యుపదేశంబులను పతంజలమహర్షి కూర్చి సూత్రీకరించెననియుఁ జెప్పుదురు.

ఆర్యవేదాంతంబునకెల్ల ఉపనిషత్తులును బ్రహ్మసూత్రములు, గీతయు ముకుటప్రాయములు. ఆమూఁడింటిని ప్రస్థానత్రయమందురు. అందు గీతయనునది భగవంతుని ముఖంబున వెలువడుటంజేసి దానికి నధికప్రాముఖ్యత గలిగెను. ఆకారణంబుననే యది సార్వలౌకికంబును సార్వకాలికంబునై దేశదేశాంతరములఁ బ్రాఁకి నెట్టివారికినిఁ బూజ్యమగుచున్నది.

గీతలోని భావంబులు సర్వోపనిషత్సారములై యున్నవి అవి సత్యసంజీవితంబులుగావున శాశ్వతంబులగును. గీతాభావంబులెట్లో యట్లే యా భావప్రతిపాదకశబ్దంబులు గూడ

నమృతప్రాయంబులై చదువఁగాలేది తలపోయఁగాలేది నూత్నాశయంబులను గలిగించుచుండును. ఆకారణంబుచేతనే గీతాతత్త్వంబునకు మేరయిదియని నేటికిని నిరూపితము కాకున్నది. ఇది యెంతపాటిదో యూహింపనగును.

గీతయందు మఱియొక విశేషము గలదు. అందలి ప్రతి పదమును ముఖాముఖ సంభాషించునట్లుండును. అర్థము తెలిసి చదువువారి యానందంబునకు మేరయే గలుగదు ; అర్థము గోచరింపకున్నను అందలిశబ్దంబుల స్ఫోటము చదువువానిని వినువానిని లోకాంతరంబులకుఁ గొనిపోయి యందలి రహస్యంబులను వారికి స్ఫురింపఁ జేయుచుండును. గీతయందింత మహాత్మ్యముండుట వలననే 'గేయం గీతా నామసహస్రం' అని శ్రీయాచార్యస్వాములు పలికిరి.

గీతామే పరమా విద్యా బ్రహ్మరూపా నసంశయా, అర్థమాత్రాక్షరా నిత్యా స్వానిర్వాచ్యసదాత్మకా॥' వేదత్రయీ పరానందా తత్వార్థజ్ఞాన సంయుతా॥ అను వచనంబే యీభావంబును స్పష్టీకరించును.

### గీతోపదేశము.

ఇది తత్త్వభాగంబనియు సాధనభాగంబనియు ద్వివిధము. తత్త్వభాగంబు పరమార్థంబును నిశ్చయించును. సాధనభాగము తత్ప్రాప్యమార్గంబును దెలుపును.

### పరమార్థము.

ఏదినిత్యమో సనాతనమో, దృశ్యమెల్ల నశించినను ఏది నిల్చియుండునో, ఏదిసర్వగతమో యేదిపూర్ణమో, యచలమో,

యేది నిర్వికారమో, ఏది బుద్ధికిఁగూడ నందదో, యదే పర మాత్మ యగును. (2-17, 24 ; 8-20)

పరమాత్మస్వరూపంబును శ్రీశంకరభగవత్పాదులవా రిట్లు వచించిరి.

'అస్తి కశ్చి త్స్వయం నిత్య మహం ప్రత్యయలంబనః
అవస్థాత్రయసాక్షీ సన్ పంచకోశవిలక్షణః.
యో విజానాతి సకలం జాగ్రత్స్వప్నసుషుప్తిషు,
బుద్ధి తద్వృత్తిసద్భావ మభావ మహమిత్యయమ్.
యః పశ్యతి స్వయం సర్వం యన్న పశ్యతి కశ్చన,
యశ్చేతయతి బుద్ధ్యాది న తద్యం చేతయత్యయమ్.
యేన విశ్వమిదం వ్యాప్తం యన్న వ్యాప్నోతి కించన,
ఆభారూపమిదం సర్వం యం భాంతమనుభాత్యయమ్.
యస్య సన్నిధిమాత్రేన దేహేంద్రియమనోధియః,
విషయేషు స్వకీయేషు వర్తంతే ప్రేరితా ఇవ.
అహంకారాది దేహాంతా విషయాశ్చ సుఖాదయః,
వేద్యంతే ఘటవద్యేన నిత్యబోధస్వరూపిణా.

ఇందుఁ జెప్పఁబడిన నిత్యశాశ్వతాదులు అసలు వస్తువు పేర్లుగావు. దానివిశేషణమాత్రంబులగు. ఇట్టి విశేషణం బులనెల్లఁ గూర్చి నిగ్గుదీసి 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' యనిరి. ఇదియు లక్షణంబులగునేగాని నామంబులుగావు. వీనిలో సత్యము, జ్ఞానము ఇవిరెండు స్వరూపలక్షణంబులనియు 'అనంత' మనునది వ్యతిరేక నిరసనస్వరూపలక్షణంబనియు, 'బ్రహ్మము' అనునది గూడ విశేషమే యనియు, ఏదిసత్యమో

ఏదిజ్ఞానమో ఏది అనంతమోయన్నప్పుడు, సత్యాదులు స్థితులగుననియు, అట్టిస్థితులను గలిగినదేదో యది బ్రహ్మమగుననియు, బ్రహ్మమనఁగాఁ బరిమాణములేనిదని భావమనియు, నేర్పడును. అనిర్వాచనీయంబు నింతకు మిక్కిలిగా నిర్వచింప సాధ్యముగాదు.

### తత్త్వవిచారము.

ఇది ఆగమమూలకంబనియు, యుక్తిమూలకంబనియు ద్వివిధము. ఋష్యాదులు ప్రాయికంబుగా మొదటిమార్గము నే ద్రొక్కిరి. మాండవ్యమహర్షి రెండవమార్గమునుగూడఁ ద్రొక్కెను.

ఏది సచ్చిదానందస్వరూపమో, ఏది నిత్యశుద్ధసిద్ధబుద్ధముక్తస్వతంత్రమో, ఏది కర్తయు భోక్తయుఁ గాక సాక్షిమాత్రమైయుండునో, ఏది యఖండమగుటంజేసి సజాతీయ విజాతీయ స్వగతభేదంబులొండె దేశకాలవస్తు పరిచ్ఛేదంబులొండెఁ గలుగక యేకరాశిగానుండునో యది పరమాత్మ యనిరి.

### పరిచ్ఛేదము.

పసపు కాశ్మీరమందు దొరకును. ఢిల్లీయందు దొరకదు. ఇది దేశపరిచ్ఛేదము. మామిడిపండ్లు వైశాఖంబున దొరకును ; మార్గశిరమందు దొరకవు. ఇది కాలపరిచ్ఛేదము. ఉప్పులో జక్కెరయుండదు ; చక్కెరలో నుప్పుండదు. ఇది వస్తుపరిచ్ఛేదము.

### నిత్యపదార్థ విచారము.

దేనికిఁ బ్రాగభావ ప్రధ్వంసాభావ, అన్యోన్యాభావ అత్యంతాభావంబులు నాల్గును గలుగునో యది నిత్యమగును.

అభావము.

ఇది సంసర్గమనియు, అన్యోన్యమనియు రెండువిధములు: అందు సంసర్గము ప్రాగభావము, ప్రధ్వంసాభావము అత్యంతాభావమని త్రివిధము. ఘటము తన్నిర్మాణపూర్వము గలుగదు. ఇది ప్రాగభావము. పగులగొట్టిన తర్వాత ఘటముండదు. ఇది ప్రధ్వంసాభావము. ఘటము తన్నిర్మాణంబునకుం బూర్వముగాని దానిసిఁ బగులఁగొట్టినతర్వాత గాని లేనిదగుట స్పష్టము. ఈలేకుండుట యింతకాలమునుండి యని నిర్ణయింపఁదరముగాదు; అనఁగాఁ గాలనియతియే లేదు. దీనిని అత్యంతాభావమనిరి.

కుండ గుడ్డకాదు. గుడ్డ కుండకాదనెడి భావము కుండలో నున్నది. కుండయు గుడ్డయు రెండునున్నంతకాలము కుండ గుడ్డకాదనియు గుడ్డ కుండకాదనియు అనఁగా భేదభావము కలదు. ఆరెంటిలోఁ గుండను బగులఁగొట్టినయెడలఁ గుండ గుడ్డ అనెడి రెండుపదార్థములు లేవు గావున భేదభావము నశించుచున్నది. రెండునున్నప్పుడు కలిగిన భేదభావము అవిరెండు నున్నంతకాలమేగాని యందేదినశించినను దానితో భేదభావము నశించుచున్నది. కావున నిట్టిభేదభావము నిత్యము కానేరదు. దీనిని అన్యోన్యాభావమందురు.

అగ్నియందుఁ జల్లఁదనం బెప్పుడును గలుగదు. ఇది యత్యంతాభావమగును. ఈయభావముగూడ నిత్యముగాదు. అగ్నిని జల్లార్చినప్పుడు అందలి వేడిమి బోవుచున్నది గదా.

## సృష్టి.

సృష్టినిగూర్చి అజాతవాదమనియు, జాతవాదమనియు రెండు మతములు గలవు. ఏదో యొకయర్థమునుగోరి సృష్టించుట లేదనియు, బ్రహ్మమే సర్వమనియు, సృష్టిని బ్రహ్మాభిన్నముగా గ్రహించుట యజ్ఞానమనియు, అజాతవాద సిద్ధాంతము. 'దేవస్య ఏషస్వభావః' అను సూత్రమే యీమత సిద్ధాంతము.

భగవంతుఁడు జగత్తును సృష్టించెననుట జాతవాద సిద్ధాంతము. ఈజాతవాదమందుఁ బెక్కుశాఖలు గలవు. దానినొక్కొక్కదానిని పాఠకుల వినోదార్థము వివరింతును.

1. అసత్కారవాదము. కారణములేకయే కార్యమైన జగత్తు పుట్టుచున్నదని యీమతసిద్ధాంతము. కారణము లేకయే కార్యము పుట్టునన్నచో ఘటాదులు గూడ నట్లే కారణము లేకయే పుట్టవలయునుగదా యనియు, అది శాస్త్రసమ్మతముగాని స్వానుభవసమ్మతముగాని కానేరదనియు, ఈవాదమందుఁ బ్రత్యక్ష విరోధరూపదోషమున్నదనియు దీనిని నిరసింతురు.

2. అభావవాదము.-అభావమే సృష్టికిఁ గారణమని వీరందురు. అభావంబునుండి భావము కలుగనేరదు. ఈమతమును గీతగూడ 'నోభావోవిద్యతే' అనుచోట నిరసించెను. ఈ వాదమందుఁ గూడ ప్రత్యక్షవిరోధదోషము గలదు.

3. శూన్యవాదము.-శూన్యమునకు అభావమునకుఁ గొంత భేదము గలదు అభావమనునది అసత్కారము. అనఁగా

నిఃస్వరూపపదార్థము. శూన్యమనఁగా ఏమియు లేదని భావము. శూన్యమునుండి సృష్టివచ్చునేని బీజములేక యే ధాన్యముపుట్టుటగుననియు, ఈవాదమందు అసంభవ రూపదోషముగలదనియు దీనిని నిరసింతురు.

శూన్యవాదంబును నాస్తివాదమనియు వచింతురు. వేద ప్రమాణంబు నంగీకరింపని మతము నాస్తికమతమని మతాంతరము గలదు.

నాస్తికులు.-మాధ్యమికుఁడనియు, యోగాచారుఁడనియు, సౌత్రాంతికుఁడనియు. వైభాషికుఁడనియు, చార్వాకుఁడనియుఁ దిగంబరుఁడనియు నాఱుతెఱంగులు.

మాధ్యమికుఁడు శూన్యవాదియగును. విజ్ఞానమే పరమతత్వంబనియు, అది క్షణికంబనియు, సమస్తపదార్థంబులు విజ్ఞానమేగాని మఱొండుగాదనియు యోగాచారుని మతము. బాహ్యపదార్థజ్ఞానముచేత విజ్ఞానాకారం బేర్పడుచున్నదనియు, ఆ కారణంబున బాహ్యపదార్థంబుల యనుమానంబునకు విజ్ఞానమే హేతువనుట స్పష్టమనియు, దానంజేసి బాహ్యపదార్థము అనుమానప్రమాణవిషయమేగాని ప్రత్యక్షమొండె స్థిరమొండెఁ గాదనియు సౌత్రాంతికునిమతము. చార్వాకుఁడు క్షణికంబు నంగీకరింపఁడు. దేహమే యాత్మగాని యాత్మపదార్థము వేఱుగా లేదనును. దేహమువేఱు ఆత్మవేఱన్నియు దేహమెంతో యాత్మ యంతదిగానుండుననియు దిగంబరునిమతము.

4. పరమాణువాదము.-ఇది నైయాయికమతము. పరమాణువుల సంయోగంబున సృష్టియగుచున్నదని వీరిమతము.

పరమాణువులు నైయాయికమతప్రకారమే జడములును అవయవరహితములునై యున్నవి. అవయవంబులున్నఁగాని యొండొంటికి సంయోగము గలుగనేరదు. ఎట్లో సంయోగము గలుగవచ్చునన్నచో, సంయోగమునకు నిచ్ఛ యుండవలయును. ఇచ్ఛయుండ వలయునన్నచో సజీవపదార్థమునకే యిచ్ఛయుండును గాని నిర్జీవపదార్థంబునకు నిచ్ఛయుండనేరదు. నైయాయికుల పరమాణువులు జడంబులని వారే యంగీకరించిరి. జడంబులకు నట్టిసంయోగము ఇచ్ఛాపూర్వకమైనది యెట్లుగలుగును ? ఈవాదమందు అసంభావ్యదోషము గలదు గావున దీనిని నిరసించిరి.

5. కాలవాదము.-కాలమే సృష్టించుచున్నది. కాలమెల్లప్పుడు నుండునదే గావునఁ ద్రివిధమైన యభావదోషము దానికి గలుగనేరదు. ఆకారణంబున నది సృష్టికిఁ గారణము కావచ్చును గాని కాలముచేత సకలకార్యోత్పత్తి గలుగుట లేదు. దానంజేసి కాలవాదమందు అకారణరూప దోషముగలదని దానిని నిరసింతురు.

6. స్వభావము.-ఇది చార్వాకమతము. అజాత స్వభావవాదంబునకును చార్వాక స్వభావవాదంబునకును భేదము గలదు. అజాతవాదము బ్రహ్మము నంగీకరించుచున్నది. చార్వాకమతము బ్రహ్మము నంగీకరింపదు. చార్వాక స్వభావమే సృష్టికారణమగునేని స్త్రీజనస్వభావసిద్ధమైన గర్భధారణము గొడ్రాలునందేల వర్తింపదు. స్వభావంబొకచోట నొకవిధముగా మఱియొకచోట నింకొకవిధముగా

వర్తింపదుగదా ? కావున స్వభావవాదము యుక్తియుక్తముగాదని దానిని నిరసింతురు.

7. అదృష్టవాదము.-ఇది మీమాంసకమతము. అదృష్టమనునది జడము. జడమునకు నిశ్చయశక్తి గలుగదు. అందువలనఁ గారణకార్యసంబంధమే యుండనేరదు. అనఁగాఁ గారణంబొకటి యుద్దేశించినను గార్యంబొకటి యగుచుండును. దానంజేసి యీవాదము యుక్తికి నిలువదని దీనిని త్రోసివైచిరి.

8. యదృచ్ఛావాదము.-ఇది ప్రత్యక్షవాదిమతము. పృథివ్యాది పంచభూతముల యదృచ్ఛాసంయోగంబున సృష్టియేర్పడుచున్నదని యీమతము. యదృచ్ఛావ్యవహారము పిచ్చివానిచేతిరాయివలె నగునేగాని క్రమముగాని నిర్దేశ్యముగాని గలుగవు. సృష్టియన్ననో క్రమబద్ధమై నిర్దేశ్యపూర్వకమై యున్నది. కావున నిట్టివాదముగూడ నిల్వదని దీనిని నిరసించిరి.

9. ప్రత్యక్షప్రమాణవాదము.-యదృచ్ఛావాదమందు యదృచ్ఛయే కారణమగుచున్నది. ఈవాదమందుఁ బంచభూతములు కారణమగుచున్నవి. పంచభూతములు కార్యములగును గాని స్వకారణంబులు గాఁజాలవు. కావున నిట్టివాదము నిలువదు.

10. ప్రధానవాదము.-ఇది సాంఖ్యమతవాదము. ప్రధానము జడము. జడమువలనఁ జైతన్యరూపసృష్టి కలుగనేరదు. కావున నిట్టివాదము నిరస్తము. ఈమతప్రకారము

బ్రహ్మము అకర్తయు అకారయితయు అవికారుఁడు నిత్యుఁడు కేవలభోక్తయునైన పురుషుఁడగును. అట్టిపురుషుని సన్నిధి మాత్రునిగా నుంచుకొని ప్రధానము సృష్టించుచున్నదని యీమతము.

అవికారుఁడైన పరమాత్మకు భోక్తృత్వమున్నదన్నప్పుడు, భోక్తృత్వముగూడ నొకవికారమేయగును గావున బ్రహ్మము సవికారుఁడగుచున్నాఁడు. ఇది సాంఖ్యసిద్ధాంతమంగీకరింపదు. బ్రహ్మమెట్టివికారమొందకయే భోగించుట వానికి స్వభావమందురేని, భోగ్యార్థము బాహ్యపదార్థముండవలయును. అట్టిబాహ్యపదార్థంబు నెద్దానిని సాంఖ్యమంగీకరింపదు. కావున సాంఖ్యసిద్ధాంతము స్వమతఘాతమగుచున్నది.

11. యోగమతము..ఇది వైశేషికమతఛాయయగును. హిరణ్యగర్భాదిరూపుఁడైన యసంగపురుషుఁడు సృష్టికారణమని యీమతము. అసంగుఁడు ఎద్దానియందుఁ దగులుకొనక యేకాకిగా నుండును. ఏదేనొక కోరికయున్నఁగాని యెవఁడు నెట్టికార్యమును జేయఁడు. సృష్టికర్తయైన పురుషుఁడు అసంగుఁడన్నంతనే వానియందుఁ గర్తృత్వాదు లభావము లగుచున్నవి. అట్టివానివలన సృష్టియెట్లు గలుగును ? కావున నిట్టివాదము యుక్తిబాహ్యమై నిరస్తమగుచున్నది.

12. కాలాదిసంయోగవాదము.-కాలాదులు జడంబులని వారే వచింతురు. జడంబులవలనఁ జైతన్యస్వరూపసృష్టి కలుగనేరదు గావున నిట్టివాదము నిరస్తమగుచున్నది.

13. జీవవాదము.-జీవుఁడు బ్రహ్మపరిణామమనియు, అజీవుడేఁ తనభోగార్థము సృష్టినిఁ జేయుచున్నాఁడనియు యీమత

సిద్ధాంతము. జీవుఁడు అల్పజ్ఞుఁడు, అల్పశక్తిమంతుఁడును బరాధీనుఁడగును. జీవునకు వాస్తవముగా సత్తిది లేకున్నను భ్రాంతివలన నతఁ డట్టివాఁడని భావించుకొనుచున్నాఁడు. సృష్టికి సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వము స్వాతంత్ర్యమునుండవలయును. కావున సృష్టి జీవునికార్యము గాదనిరి.

14 బ్రహ్మవాదము.- బ్రహ్మము నిర్వికారియనిరి. కార్యము వికారమగును. వికారరూపమైన కార్యమునకు నిర్వికారి కారణము గాఁజాలఁడనిరి.

15. శైవమతము.- ఆత్మ (అనఁగా జీవుఁడు) అవిద్య, శివుఁడు ఈ మువ్వురును సృష్టికిఁగారణమని యీమతము. అట్లగుసేని శివుఁడు పరమాత్మకన్న భిన్నవ్యక్తియు దృశ్యపదార్థంబు నగును. దృశ్యము నశ్యమనుట నిర్వివాదాంశము. దానంజేసి శివుఁడు నాశస్వభావుఁడగునేగాని శాశ్వతుఁడు కానేరఁడు. అది యీమత సిద్ధాంతముగాదు. దానంజేసి యీమతమునకు స్వసిద్ధాంత ఘాతదోషము గలదు.

వైశేషికుల హిరణ్యగర్భుఁడే శైవులశివుఁడగును గావున శైవవైశేషికంబులకుఁ బేర్లుభేదముతప్ప వేఱు గానరాదు. వైశేషికమత ప్రకారము హిరణ్యగర్భుఁడు ప్రథమజీవుఁడగును. శైవమత ప్రకారము శివుఁడు ప్రథమజీవుఁడగును.

పరమాత్మ పూర్ణము అఖండము నిర్వికల్పము నగుట యేగాక యవాప్తసమస్తకాముఁడునైనదని జాతవాదం బంగీకరించును. అవాప్తసమస్తకామమైన పరమాత్మకుఁ గోరదగినదే

యుండదనియు, అట్టిపరమాత్మ సృష్టించుచున్నదందు రేని ఏకో రికతో సృష్టించుచున్నదనియు, గోరికయున్నచోఁ పరమాత్మ యెట్లు పూర్ణమగుననియు, సృష్టికిఁ గారణంబేమనియు అజాత స్వభావవాదులు జాతవాదుల నడుగుదురు. కారణం బగోచ రంబును అనిర్వచనీయంబునని జాతవాదు లందులకు బదులా డుదురు. ఆమాట యుక్తికి నిల్వదనియు, యుక్తివిరోధమైన దానిని గ్రహింపరాదనియు జాతవాదంబును అజాతస్వభావ వాదులు నిరసింతురు.

అజాతస్వభావవాదము తత్త్వకుశలమతులకుఁ దక్క నన్యులకు నందదు. సృష్టిని గూర్చి సామాన్యబుద్ధికి యుక్తి యుక్తమైన సమాధానమును జెప్పవలయును. అట్టి సమా ధానమునకై వివర్తవాదము ప్రతిపాదితమయ్యెను.

మందాంధకారమందు రజ్జువును జూచి సర్పమని భ్రాం తిపడుదురు. అట్లు భ్రాంతిపడుటకుఁ గారణమేమో పరమా త్మను జగత్తుగా భావించుటకు నదేకారణమని వివర్తవాదము. మఱియు సృష్ట్యాదికథలు సామాన్యజనులకు విశ్వాసము గలి గించుటకై కల్పితంబులేగాని వేఱుగావనియు, అవి కల్పితంబు లైనను వానివలన నేర్పడు భావముమాత్రము సత్యమే యని యు అజాతవాదులందురు.

### అద్వైత—విశిష్టాద్వైతములు.

నిమ్మపండు సమిష్టిదృష్టికి నొక్కటిగానేయుండును. అనఁ గాఁ దొళ్ళకును లోపలిభాగంబునకును వేర్వేరుగాఁ గాన్పింప దు. వ్యష్టిదృష్టికి అనఁగాఁ జక్కఁగాఁ బరిశీలించినయెడల, దాని

చర్మంబును లోపలి ఫలంబును వేర్వేఱుంగా స్పష్టపడును. అట్లే బ్రహ్మము సమష్టిదృష్టికి నేకము అద్వితీయముగాఁ దోఁచినను, బరిశీలించినచో బ్రహ్మమును దదీయమైన ప్రపంచంబును వేఱుగానున్నవని విశిష్టాద్వైతము.

రాజు కేవలప్రజాప్రేమైకబుద్ధితోఁ బ్రజలమధ్యనుండియుఁ, బ్రజలకన్న వేఱై యుండునట్లే పరబ్రహ్మముగూడ సృష్టియందంతర్యామియై యుండియు సృష్టికన్న వేఱుగానే యుండునని యీమతతాత్పర్యము.

దీపంబునకునుఁ దత్కిరణంబులకు నెట్లో బ్రహ్మమునకును జీవులకు నట్టిసంబంధమే. అనఁగా జీవులు బ్రహ్మాంశతద్విభూతి తద్రూప తచ్ఛరీరులగుదురని యీమతము.

బ్రహ్మముయొక్క యేశక్తిని అద్వైతులు మాయయందురో యాశక్తినే వీరు లక్ష్మియందురు. మోక్షప్రాప్తికి మాయను దాటవలయునని అద్వైతులందురు. లక్ష్మి నాశ్రయించి యామెమూలకంబునఁ బరబ్రహ్మానుగ్రహంబును బొందినఁగాని మోక్షసిద్ధిగలుగదని వీరందురు. అద్వైతుల బ్రహ్మము నిర్గుణము ; వీరిబ్రహ్మము సగుణము; మోక్షమునకు జ్ఞానమే సాధనమని యద్వైతులు ; భక్తియే సాధనమని విశిష్టాద్వైతులు.

చూచువాని యవస్థానభేదంబులఁబట్టి దృశ్యరూపభేదంబులు గానవచ్చునని యు, విమానమెక్కి యంతరిక్షంబున మహోన్నతస్థానంబునకుఁ బోయి యందుండి భూమిని జూచినచో భూమిమీఁదనుండి చూచినప్పుడు నింగియెట్లో యట్లే వలయా

కారముగా సర్వము గాన్పించుననియు, ఒక్కొక్కయంతరము దిగివచ్చుకొలఁది గోళంబుగా శిఖరాదిమయంబుగాఁ దుట్టతుదకు భూమిగాఁ గాన్పించుననియు, ఈభేదంబులెల్ల నవస్థానజన్యభేదంబులేగాని యసలుపదార్థంబునఁ గలభేదంబులు గావనియు, అట్లే జాగ్రత్స్వప్నసుషుప్తితురీయావస్థలను బట్టి సృష్టిదర్శనంబు భేదభేదాభేద విశిష్టభేదాభేదంబులుగా నున్నదనియు, అజాతస్వభావవాదుల వాదము.

ఈవిషయమై గీత యేమియుపదేశించుచున్నదో చూతము.

'అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా' (7-6)
'మత్తః పరతరం నాన్యత్కించి దస్తి, ధనంజయ !
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణి గణాఇవ' (7-7)

'చరాచరాత్మకమైన సమస్తజగత్తుయొక్క యుత్పత్తిలయంబులు నేనే ; నాకన్న వేఱైనది గోరంతయును లేదు. దారమునందు మణులువలె నాయందీసర్వముఁ గూర్పఁబడియున్నవి'అని పైశ్లోకముల శబ్దార్థము. ఈవాక్యములవలన జాతవాదమును దానియవాంతరభేదంబులును దూరీకృతములగుచున్నవి. అంతియగాదు. అజాతమతము ప్రతిపాదితమగుచున్నది. మూఁడవపాదమందు అవస్థాదర్శనవిభేదము సూచితమగుచున్నది. ఇది పారమార్థికసత్యము. బోధనార్థము ఈమూఁడు పాదములకు వ్యావహారికసత్యప్రతిపాదనంబుగా నర్థముఁ జెప్పనగును. అట్లే చెప్పియు నున్నారు.

### వ్యక్తావ్యక్తములు

పరమాత్మ అవ్యక్తమనియు సృష్టి వ్యక్తమనియు జాత

వాదులందును. ఈ రెంటిసంబంధము రాజరాష్ట్రసంబంధమా? మఱి యెట్టిసంబంధము? అను ప్రశ్న వచ్చును. సంబంధ భావమే వ్యావహారికమనియు, 'మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా' (9-4) అనుటవలన అవినాభావ సంబంధమనియుఁ గావున రెండింటినిఁ బ్రత్యేకింప సాధ్యమే గాదనియు స్పష్టమగుచున్నది.

### పరిణామవివర్తాదులు.

'పరమాత్మ జగత్తును వ్యాపించియుండు'నని పైనఁ జెప్పఁబడెను. దానిభావమేమి? భగవత్స్వరూపము జగద్రూపముగా మాఱెనా? భగవంతుఁడక్కె కట్టుకదలకుండుచు జగత్తు ఏర్పడెనా? అను శంకలు గలుగును.

'మత్స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః (9-4) సర్వభూతములు నాయందేయున్నవి నేను 'భూతములందుండుట లేదు' అనుటవలనఁ బరిణామవాదము నిరస్తమగుచున్నది. 'నచమత్స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరమ్' (9-5) 'భూతములు నాయందు లేవు. ఈశ్వరసంబంధమైన నామహిమ యెట్టిదో చూడు' మనుటవలన వివర్తవాదనిరసము సూచితమగుచున్నది.

జగత్తు పరమాత్మగాని తద్భిన్నముగాని రెండునుగా నున్నప్పుడు భావము సామాన్యులకు బుద్ధిగ్రాహ్యముగాదు. ఇది యంతనిగూఢమైన విషయము. అయినను పదార్థవంబేదో యొకవిధఁబుగా బుద్ధిస్థమైనఁగాని విశ్వాసఁబును శాంతియు గలుగవు. అందువలనఁ బరమాత్మకును జగత్తునకును సముద్ర

త్తరంగన్యాయమును సామ్యముగా గ్రాహ్యార్థము చెప్పిరి.

తరంగంబులు సముద్రముగావు ; తద్భిన్నంబులును గావు. అట్లే జగత్తుగూడ భగవంతుఁడును గాదు, తద్భిన్నమునుగాదు ; రెండింటికి విశిష్టమైన అవినాభావము. దృష్టి దేనియందు పాఱునో అదిమాత్రమే గాన్పించును ; అప్పుడు రెండవది గాన్పింపదు. అనఁగా భావభేదంబున వస్తుభేదము గాన్పించుచున్నది. రెండింటి నొక్కటిగాఁ జూచుటయే అద్వైతభావము ; వానిని వేఱుగాఁజూచుటయేద్వైతభావము, తరంగంబులను సముద్రాంశముగా భావించునట్లు జగత్తును భగవదాంశంబుగా భావించుట విశిష్టాద్వైతమగును.

## పదార్థశోధనము.

జడచైతన్యంబులకుఁ గలసంబాధ విచారము పదార్థశోధనమనఁబడును. ఈ సంబంధము కారణకార్యసంబంధమనియు, అధిష్టానాధ్యస్త సంబంధమనియు, ద్రష్టృదృశ్యసంబంధమనియు, సాక్షిసాక్ష్యసంబంధమనియు నాల్గువిధములు. విశిష్టచైతవ్యంబునందుఁ గారణకార్యసంబంధంబును, శుద్ధచైతన్యంబునందు అధిష్ఠానాధ్యస్తసంబంధంబును, ఉపాధిస్థచైతన్యంబున మూడవదియు; సంభవించుచున్నవి.

## ఈశ్వరుఁడు-జీవుఁడు.

జీవేశ్వరులకుఁ గలభేదాభేదంబులఁ గూర్చి (1) అవచ్ఛేదవాదము. (2) ఆభాసవాదము, (3) ప్రతిబింబవాదము అని మూఁడు వాదములు గలవు. మొదటి రెండువాదముల ప్రకారము జీవేశ్వరులకు ఉపాధిగతభేదమే గాని స్వగతభేదము లేదు.

అందు అవచ్ఛేదవాద ప్రకారము ఈశ్వరోపాధి మాయ యనియు, జీవోపాధి అవిద్యయనియు, ఆభాసవాద ప్రకారము ఈశ్వరోపాధి ఆభాససహితమాయయనియు జీవోపాధి ఆభాస సహితావిద్యయనియు నేర్పడుచున్నది. ప్రతిబింబవాదప్రకారము ఈశ్వరుఁడు బింబమును, జీవుఁడు అజ్ఞానమందలి చైతన్యప్రతిబింబమనియుఁ జెప్పిరి. ఈమతప్రకారము జీవేశ్వరులకు నుపాధిగతభేదముగూడఁ గలుగదు. పైకిఁగానవచ్చు భేదమెల్ల జీవత్వంబు నీశ్వరత్వంబును రెంటిని చైతన్య మందారోపించుట వలనఁ గలుగుచున్నది.

ఆరోపితవస్తువు అధిష్ఠానమునకన్న భిన్నముగాఁ గాన్పింపదు. అది అధిష్ఠానాభిన్నమై యాకారణంబున అధిష్ఠానస్వరూపంబును గప్పిపుచ్చి తాను ప్రతీతమగుచున్నది. అధిష్ఠానమైన రజ్జువును అధ్యస్తమైన సర్పము గప్పిపుచ్చి రజ్జుస్థానంబునఁ దాను నిల్చి ప్రతీతమగుచున్నది. అట్లే జీవుఁడును వానికి అధిష్ఠానమైన యీశ్వరుని గప్పిపుచ్చి యాస్థానమునఁ దాను ప్రతీతుఁడగుచున్నాఁడు.

### కార్యకారణవిచారము.

ఘటంబునుఁ జేయుటకు మన్నును, జేయువాఁడును, గావలయును. ఇందు మన్ను ఉపాదానకారణంబనియుఁ, జేయునట్టి కుమ్మరి నిమిత్తకారణంబనియు వేదాంతపరిభాషలోఁ జెప్పఁబడును. 'ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి' (9-8); 'మయాఽధ్యక్షేణ ప్రకృతిస్సూయతే' (9-10) అనుటవలన జగన్నిర్మాణంబునకు భగవంతుఁడే నిమిత్తకారణంబును ప్రకృతి ఉపాదానకారణంబునగును.

'మత్తః పరతరం నాన్యత్కించిదస్తి' (7-7) అని భగవంతుఁడే ఘంటాపథంబుగాఁ జెప్పెను. భగవంతునికన్న నన్యతరమైనది గోరంతయు లేదన్నప్పుడు, ఈ ప్రకృతి యెందుండి వచ్చెను ? అను శంకగలుగక మానదు. ప్రకృతి అనఁగా భగవన్నైసర్గికశక్తియేగాని వేఱుపదార్థముగాదు. అందువలన భగవంతుఁడే నిమిత్తోపాదానకారణంబులు రెండు నగుచున్నాఁడు. దీనినే 'అభిన్ననిమిత్తోపాదానకారణం'బని వేదాంత పరిభాషయందుఁ జెప్పుదురు. అనఁగా సర్వము భగవంతుఁడే యనియు 'వాసుదేవస్సర్వ'మను వాక్యమే పరమార్థమనియు, కార్యకారణవాదమెల్ల సృష్టిచింతకులతృప్తికేగాని వేఱుగాదనియుఁ దాత్పర్యము.

'ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి' (13-20) ప్రకృతిపురుషులు అనాదు'లనుటవలనఁ బ్రకృతి యనునది యొకటున్నదని గీతయే యంగీకరించుచున్నదనియు, 'కార్యకరణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే' (13-21) కార్య కరణ కర్తృత్వంబులకుఁ బ్రకృతినే హేతువుగాఁ జెప్పుదు' రనుటవలనఁ బ్రకృతి ఉపాదానకారణమగుచున్నదనియు దీనింజేసి జాతవాదము సూచితమగుచున్నదనియుఁ దలంతురు. 'ప్రకృతిరుచ్యతే' అనుటవలన అదియే సిద్ధాంతముగా గీత యంగీకరించెనాయని శంకింపవలసియున్నది. 'ప్రకృతిం యాంతి మామికామ్' (9-7) అనుటవలనఁ బ్రకృతియనునది భగవత్సంబంధమైనదేగాని తద్వ్యతిరిక్తముగాదని స్పష్టము.

ప్రకృతి భగవన్నైజశక్తిగాని వేఱుగాదు. శక్తికి శక్తిమంతునకు అవినాభావము. శక్తిని శక్తిమంతుని వ్యష్టిగా

వచించునప్పుడు ప్రకృతి పురుషులందురు. ప్రకృతి పురుషుల సమష్టితత్త్వమే పరమాత్మయగును. అట్టి సమష్టితత్త్వమునే సమగ్రబ్రహ్మమనియుఁ బురుషోత్తముఁడనియు వ్యవహరింతురు.

ప్రకృతికి లీనావస్థయు వ్యవహారావస్థయుఁ గలవనియు, సంకల్పముతోఁడ వ్యవహారావస్థయు నిస్సంకల్పస్థితియందు లీనావస్థయు నగుననియు, లీనావస్థయందు బ్రహ్మము నిర్వికల్పుఁడగుననియు, వ్యవహారావస్థకు సవికల్పకస్థితియని నామాంతరమనియు, సంకల్పము గుణాత్మికమనియు, గుణములు వ్యాపారించుననియు, సంకల్పముదయించినను అది గుణాత్మికము గాకయుండునప్పుడు బ్రహ్మము నిర్గుణమగుననియు, అది గుణాత్మికమైనప్పుడు బ్రహ్మము సగుణమగుననియు, సంకల్పము గుణాత్మికమైనను గుణములు వ్యాపారముఖంబులుగానప్పుడు బ్రహ్మము సగుణ నిరాకారమగుననియు, గుణములు వ్యావారముఖమైనప్పుడు బ్రహ్మము సగుణసాకారమగుననియు, ఈసాకారత్వమే సృష్టియనియు, వచింతురు. ఈవిభాగమెల్లసృష్టిచింతకులు గ్రాహ్యార్థము కల్పించినదే గాని, పరమాత్మ యెల్లప్పుడు అనఁగా నిర్గుణ సగుణ నిరాకార సాకారస్థితులందు అనుస్యూతమైయుండును. ప్రకృతిదశలను బట్టి యీవిభాగంబును వచించిరి.

ప్రకృతిపురుషు లనాదులనుచుఁ బురుషునకు నంతము లేదనియుఁ బ్రకృతికిమాత్ర మంతముగలదనిరి. ఈభావంబును గీత యంగీకరింపదు. ప్రకృతికి అంతమున్నదనుచోఁ బ్రకృతిపురుషు లవినాభావులగుట యందర్థము లేదు. ప్రకృ

తికి అంతములేదు కావుననే దానిని దాటుమనియే గీత చెప్పు చున్నది.

ప్రకృతికి అంతముచెప్పినప్పుడు స్వరూపనాశనము గాదనియు దానివ్యవహారంబునకు నంతముగలదని భావంబని యు, ప్రకృతికి స్వరూపన్నాశంబునుఁ జెప్పినచో పునస్సృష్టికిఁ బ్రకృతికారణము గావున పునస్సృష్టియే కల్లయగుననియు గ్రహింపవలయును. ప్రకృతినాశనమును జెప్పినప్పుడు గూడ 'ఎవడు ప్రకృతికి విముఖుఁడో వానికిఁ బ్రకృతి నశించినదే యగు' నను భావంబును గ్రహింపవలయును.

కేవలసమాధిస్థితియందుఁ బ్రకృతి దానివ్యవహారంబు లన్నెల్ల నుడిగి లీనమై యుండును. ఆస్థితిలో శ్వాసముగూడ నుండదు. ఆస్థితిని సమగ్రబ్రహ్మమనవచ్చును. అందుండి క్రిందిమెట్టునకు వచ్చినప్పుడు శ్వాసము హ్రస్వరూపంబున నుండును. ప్రకృతివ్యాపారమెల్ల శ్వాసపూర్వకము. అయి నను శ్వాసమప్పుడప్పుడే ప్రారంభమగుచున్నది గావునఁ బ్ర కృతి యప్పుడు గుణాత్మికగాదు. ఆస్థితిని నిర్గుణబ్రహ్మము నకు సామ్యముచేయవచ్చును. వ్యుత్థానావస్థయందు శ్వాసం బును దానితోడ గుణవ్యవహారంబును గలుగును. ఆస్థితిని సగుణబ్రహ్మమునకు సామ్యము చేయవచ్చును. గుణవ్యవ హారము ప్రారంభించినను సంకల్పము రూపునుదాల్పలేదు గా వున ఆస్థితిని సగుణనిరాకారబ్రహ్మమునకు సాటిచెప్పవచ్చు ను. సంకల్పము కార్యరూపమైనప్పుడు ఆస్థితిని సగుణసాకార బ్రహ్మమునకు సాటి చేయవచ్చును.

ప్రకృతి పురుషవిచారము సగుణపరమేయని గ్రహింపవలయును.

**అనాదివిచారము.**

బ్రహ్మము, అవిద్య, జీవుఁడు, ఈశ్వరుఁడు, భేదము, సంబంధము, యీయాఱింటిని అనాదులందురు. అందు బ్రహ్మము మాత్రము అనాదియేగాక యనంతమునగును. తక్కినవి అనాదులైనను సాంతములే యగును.

ఏలయందురా ? బ్రహ్మము త్రికాలాబాధ్యము గావున బ్రహ్మమునకు నంతమే గలుగదు. అవిద్యాదులు జ్ఞానబాధితంబులు గావున వానికి నంతము గలుగుచున్నది.

అనాది యనఁగా నుత్పత్తియే లేనివని భావము. బ్రహ్మము మొదలగు నాఱింటి యనాదిత్వ మెట్లందురా ? అన్నిటికి బ్రహ్మమే యధిష్ఠానముగా నున్నది. బ్రహ్మమునకు వేఱొక యధిష్ఠానము గానరాదు. కావున బ్రహ్మము అనాదియగుచున్నది.

బ్రహ్మము నిర్వికారమనిరి. వికారమే యుత్పత్తియగును. నిర్వికారమైన బ్రహ్మము వికారమొందుట పొసఁగదు గావున బ్రహ్మమువలన అవిద్య పుట్టనేరదు. అవిద్యోత్పత్తి యీశ్వరాదుల నాశ్రింటఁ గారాదాయన్నచో యీశ్వరాదులు గూడ అవిద్యాఫలములే గావున వానిసిద్ధి యవిద్యాసిద్ధినిబట్టి యున్నది. అనఁగా అవిద్య పుట్టినతర్వాత తత్ఫలముగా నీశ్వరాదులకు నునికిఁ గల్గుచున్నది. కావున నీశ్వరాదులు తత్పూర్వము జనించుచున్న యవిద్యకుఁ బుట్టస్థానంబులు

గానేరదు. అందువలన అవిద్యగూడ అనాదియగుచున్నది.

బ్రహ్మము, అవిద్య ఇవి రెండు అనాదులంటిమి. ఆ రెంటికిఁ దాదాత్మ్యసంబంధముగలదు. అనాదులసంబంధము అనాదియే యగును.

జీవేశ్వరుల పరస్పరభేదము స్వతస్సిద్ధము. అది బ్రహ్మమువలననొండె మాయవలననొండె, బ్రహ్మమునకును మాయకును గలభేదమువలననొండెఁ గలిగినదిగాదు. కావున భేదము అనాదియగుచున్నది.

జీవేశ్వరులసిద్ధి తద్భేదమువలన గలుగలేదు. మఱే మనిన అవిద్యాచైతన్యసంబంధమువలనఁ గలుగుచున్నది. అట్టి సంబంధమునకుఁ బూర్వమే జీవేశ్వరసిద్ధిగలుగుఁగావున వారును అనాదులగుదురు.

బ్రహ్మము, అచలము. అచలముతో సంబంధమెట్లుండురా? వృక్షము అచలము. దానిమీద పక్షి వ్రాలుచున్నది. ఆవిధముగా వృక్షపక్షులకు సంబంధమేర్పడుచున్నది. అట్లే బ్రహ్మావిద్యల సంబంధము. అదియుఁ గల్పితమేగాని వేఱు గాదు.

సంకల్ప మెప్పుడుకలిగెను ?

సృష్టియెల్ల భగవత్సంకల్పఫలమసిరి. సంకల్పమెప్పుడుదయించెనను ప్రశ్నవచ్చును. 'యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ' (15-4) అనుటవలన సృష్టియెల్లఁ బురాణమైనదే గాని నడుమవచ్చినదిగాదని స్పష్టము. సంకల్పమే లేనిచో సృష్టియేగలుగదు. సంకల్పముతోడ సృష్టికలిగెననిమాత్రము చెప్ప

వచ్చును. కావున సంకల్పము ప్రాక్తనము సృష్టిపరమని చెప్ప నగును. సంకల్పంబునకుం గాలనిర్ణయము సాధ్యముగాదు గావున అనాదియనిరి. సృష్టిగూడ నట్లే యనాదియగును.

### సృష్టి యాదృచ్ఛికమా ?

విశ్వంబునెల్ల నొక్కసారి సింహావలోకనంబు గావింతురేని, అది సంవిధానపూర్వకమేగాని యాదృచ్ఛికముగాదనియు, సమస్త పరమాణువు మొదలు సూర్యాదులవఱకు నొక్కొక్కటియు నిబంధననిబద్ధమై వర్తించుచున్నదనియు స్పష్టమగును. ఇదేభావంబును 'యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః' (3-31) 'యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్' (3-32) భగవంతుఁడు తెలిపి నియమంబుల నేర్పఱచి యానియమంబుల ప్రకారము వర్తింపవలసినదనియు, అట్లు వర్తింపని వారు చెడుదురనియు శాసించెను. దీనింబట్టి సృష్టి యాదృచ్ఛికముకాదని స్పష్టము. సృష్టి యాదృచ్ఛికమైనచో గట్టుదిట్టము లేర్పఱచుట యుండనేరదు. కట్టుదిట్టములు లేనినాఁడు సృష్టినిలుచుటకే యవకాశము లేదు. ధర్మాధర్మ నియతియు నుండదు.

### ప్రయోజనమేమి ?

సృష్టి భగవదిచ్ఛామాత్రమని కొందఱును, కాలసిద్ధమని కొందఱును, క్రీడార్థమని కొందఱును, భోగార్థమని కొందఱు నూహించిరి. ఇవన్నియు నూహలేగాని యుక్తికి నిలువవు.

'న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి' (3-22)

అర్జునా ! ముల్లోకములలో నాకు చేయవలసిన పని గిల్లంతయును లేదు. ఏలయందువా ? నేను పొందనిదిగాని పొందవలసినదిగాని యేమియు లేదు. అట్లయినచో నిట్టి కర్మపరతంత్రమేలా ? యని యందువా ? అది నైజముసుమా ?' అనుటవలనఁ బైనచెప్పిన యిచ్ఛామాత్రాదు లైనయూహలు నిలువవు.

సృష్టియెల్ల సత్యమనుచు అదేచోట నయ్యది మాయా కల్పితమని మఱికొందఱు వచింతురు. మాయ అసత్పదార్థమని వారే నిర్వచించిరి. అసత్తునుండి సత్పదార్థము కలుగదని గీతాచార్యుఁడు సర్వవేదాంతంబునకు బీజసూత్రముగా వచించెను. కావున మాయావాదము గూడ నిలువదు.

కాఁబట్టి సృష్టి నైజమేగాని యేదే ఫలాపేక్షతో సృజింపఁబడుట లేదనువాక్యమునే ప్రమాణంబుగా గ్రహింపవలసియున్నది. ఇదేభావంబును 'దేవస్య ఏష స్వభావః' అను ముక్కగూడ సూచించును. సృష్టివిషయమై యింతకన్న యుక్తియుక్తముగాఁ జెప్ప సాధ్యముగాదు.

దైవస్వభావవర్తనంబెట్టి దందురా ? బ్రహ్మము చైతన్యాత్మకము. చైతన్యము శక్తిమంతము. శక్తినే మాయయనియుఁ బ్రకృతియనియుఁ గూడ వచింతురు శక్తికిఁ జలనవ్యాపారము నైజము. ఈవ్యాపారమునే కర్మమందురు. కర్మమనఁగాఁ జేయుట అని భావము. కర్మమునంటి ఫలంబుదయించును. ఈఫలమే సృష్టియనఁబడుచున్నది. ఈవిధానము నిర్గుణ నిరంజన నిర్వికల్ప బ్రహ్మము సగుణసవికల్పసాకార

బ్రహ్మమగుట యని వేదాంతపరిభాషలో నుడువుదురు. అట్లు కానేల ? యని యడుగుదురా ? బ్రహ్మము నిర్గుణాదిగా నుండుటయు సగుణాదిగా మాఱుటయు సృష్టిచింతకుల కల్పన మేగాని వాస్తవముగాదు. బ్రహ్మము త్రికాలాబాధితము గా బ్రహ్మముగానే యుండును. ఇది పరమార్థము. కల్పన లెల్ల వ్యావహారికములు. సృష్టివిచారంబెల్ల వ్యవహారార్థమే యనుభావంబుతో వర్తింపవలయును.

### సృష్టిపరిపాలనము.

భగవంతుఁడు జగత్తును సృష్టించుచున్నప్పుడు, సృష్టించిన వాఁడు దానిని పాలింపకతప్పదు. వానిపరిపాలనం బెట్టిది ? చక్రవర్తి యెచ్చటనో యుండి తాబేదార్లమూలకంబుగా దేశంబును పాలించునట్లుగా భగవంతుఁడు వైకుంఠములోనో కైలాసమందో యుండి యధికారిపరంపరగా దేవతలను నియమించి పరిపాలించుచున్నాఁడా ? అనుశంక యుదయింపక మానదు. భగవత్పరిపాలనము చక్రవర్తిపరిపాలనమువంటిదిగాదు. భగవంతుఁడు తానే సర్వమునై యున్నాఁడు. కావున భగవంతుఁడు సర్వగతుఁడై పరిపాలించును.

'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి' (18-61) భగవంతుఁడు ప్రతిభూతముయొక్క హృదయపీఠి నధివసించియున్నా' డనుటవలన భగవత్పరిపాలనము ప్రత్యక్ష మేగాని పరోక్షముగాదని యేర్పడుచున్నది. ఈరహస్యంబు నెఱుంగుటయే జ్ఞానము. ఎఱిఁగి వర్తించువారు జ్ఞానులగుదురు. ఎఱుఁగక వర్తించువారు మూఢులగుదురు. ఎఱింగియు

నెఱుంగనట్లు వర్తించువారు దుష్టులగుదురు. దుష్టులు లోకంబును వంచించుచున్నామనుకొందురు. అది కేవలము ప్రమాదము. వారు వారినే వంచించికొని చెడుచున్నారు.

భగవంతుఁడు హృదయదేశమందున్నాఁడను భావంబును జ్ఞప్తిలో నుంచుకొనుటయే ఉత్తమోత్తమ భగవద్భజనమగును. ఈవాక్యమును సువర్ణంబుల లిఖించి జపించుటకన్న మేలైనజపము గానరాదు.

భగవంతుఁడు శరీరమందెచ్చటనుండు ననువిషయంబున మతభేదములు గలవు. భగవంతుఁడు (పరమాత్మ) హృదయదేశమందే యుండునని గీతామతము. ఇదే భావంబును శ్రీ శంకరభగవత్పాదులవారు

'ఆత్మైవ సత్వాత్మని ధీగుహాయా,
మవ్యాకృతాకాశా ఉశత్ప్రకాశః,
ఆకాశా ఉచ్చై రవివ త్ప్రకాశతే,
స్వతేజసా విశ్వమిదం ప్రకాశయ౯ ॥' వి॥చూ॥32లో

దెలిపిరి. స్థూలశరీరములోపల హృదయప్రదేశమందు అంతఃకరణముండును. ఆయంతఃకరణము దానివ్యాపారమునుఁబట్టి చిత్తము, మనస్సు, బుద్ధి, అహంకారము అని నాల్గువిధములుగా గ్రాహ్యార్థము విభజింపఁబడెను. అందు నిశ్చయాత్మకవ్యాపారమును చేయుదానిని బుద్ధియనిరి. ఈబుద్ధిలోపల అవ్యక్తమనెడి కారణశరీరముండును. తత్కారణశరీరములోపల ఆత్మ యుండును.

శరీరమునకు హస్తపాదాద్యవయవంబులు గలవు. వాని

నెల్ల ఛేదించినను జీవముండుట గలదు. హృదయదేశంబునకుఁ బ్రమాదముగల్గినంతనే జీవము పోవుచున్నది. దీనింబట్టి జీవరూపంబుననున్న యాత్మకు హృదయమే స్థానమని గ్రహింపనగును.

హృదయస్థుని గ్రహింపనేల ?

భగవంతుఁ డంతసమీపవర్తియై యున్నను వానిని గ్రహింపనేల ? అని యడుగవచ్చును. భగవల్లక్షణంబులలో జ్ఞానమొకటిగాఁ జెప్పఁబడెను. ఎప్పుడు భగవంతుఁడు హృదయస్థుఁడనిరో వానిలక్షణమైన జ్ఞానముగూడ హృదయస్థమే యని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. జ్ఞానమునకుఁ బ్రకాశము లక్షణము. దీపప్రకాశంబునవలె జ్ఞానప్రకాశంబున సర్వము నెఱుంగఁబడుచుండును. ఈజ్ఞానము అజ్ఞానముచేత నావృతమైనప్పుడు భ్రాంతి యుదయించి సత్యము స్ఫురింపకుండును. (5-15) దీపముపై ఘటంబును గప్పుటవలె జ్ఞానంబునజ్ఞానమావరించినప్పుడగును. దీపప్రకాశమును నిరోధించినప్పుడు గృహాంతరము చీఁకటిమయమై యందున్నవస్తువులు గానరాక యొకదాని నొకటిగా భావించునట్లుగా జ్ఞానప్రకాశము అజ్ఞానావృతమైనప్పుడు తత్త్వము యథాస్థితిఁ గానరాకుండును. ఆకారణంబున నొకటి మఱియొకటిగాఁ గాన్పించుచున్నది.

చీఁకటి యొకవస్తువుగాదు. వెలుతురు లేకపోవుటయే చీఁకటి ; అనఁగా అదియొక యవస్థయగునేగాని వేఱుగాదు. అట్లే జ్ఞానాభావావస్థయే అజ్ఞానము. అదియు నొక యవస్థయే యగును.

ఈజ్ఞానము పరోక్షము, అపరోక్షము అని రెండువిధం బులు. 'శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే' ఒకరివలన విని నమ్ము ట పరోక్షజ్ఞానము. స్వానుభవసిద్ధము అపరోక్షజ్ఞానము. దీ నినే ప్రత్యక్షజ్ఞానమనియుఁ జెప్పుదురు.

### అజ్ఞానస్వరూపము.

అజ్ఞానము వస్తువుకానందున దానికి రూపమే లేదు. అది కామరూపి (3-39)యై వర్తించుచుండును. అనఁగా ఏ విధమైనకోరిక జనించునో యారూపంబును అజ్ఞానము వహించి వర్తించుచుండునని భావము.

### అధిష్ఠానము.

అజ్ఞానము దశేంద్రియంబులను మనోబుద్ధులను నావ రించియుండును. అజ్ఞానము మొట్టమొదట హితాహితవివేచన పూర్వకనిశ్చయాత్మకమైనబుద్ధిని గప్పివైచును. అప్పుడు బుద్ధి భ్రాంతిఁజెంది ఒకదానిని మఱియొకటిగా భావించి నిశ్చయిం చును. దాని నిశ్చయప్రకారము మనస్సు వర్తించును. మనస్సు ఎట్లాడించిన నట్లు సర్వేంద్రియంబులును వర్తించును.

తేజశ్శబ్దంబులు పుట్టినచోటనుండి యాకాశమనెడి ఉపాధి మూలకంబున వ్యాప్తిఁగాంచుచున్నవి. ఆకాశమే లేనిచో నవి పుట్టినచోటనే యుండకతప్పదు. అనఁగా వానికి వ్యాప్తి యే గలుగదు. అంతియగాదు. ఏకారణంబుననైనను ఆకా శము కలిలమగునేని వానివ్యాప్తి యథాగతిఁ గాంచక మంద మగును. నిస్తంత్రీవార్తా శాస్త్రాదులవలన మనకిప్పుడీరహ స్యము స్పష్టము.

అట్లే జ్ఞానప్రకాశవ్యాప్తికి బుద్ధియనునట్టి యంతఃకరణం బుపాధిగానున్నది. అది మోహగ్రస్తమైనప్పుడు జ్ఞానప్రకాశ వ్యాప్తి యథాగతినుండదు. తేజశ్శబ్దంబుల వ్యాప్తికి ఆకాశం బు నిర్మలంబుగా నుండుట యెంతయావశ్యకమో జ్ఞానప్రకాశ వ్యాప్తికి బుద్ధీంద్రియంబు నిర్మలంబుగానుండుట యంతయావ శ్యకము.

### కామోత్పత్తి.

కామము దేనివలనఁగలుగునందురేని, 'రజోగుణ సముద్భవః' (3-37) రజోగుణంబునఁ బుట్టుచున్నది. రజస్సు ఎక్కడిదందురేని 'సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభ వాః'(14-5) బ్రకృతివలనఁ గలుగుచున్నది. ప్రకృతి యనఁ గా 'గుణమయి మమమాయా' (7-14) మాయయగును. మాయయనఁగా భగవచ్ఛక్తియే యని వివరింపఁబడెను. భగ వచ్ఛక్తి వ్యవహారదశయందు మూఁడు గుణంబులై వర్తించు చున్నదని భావము.

సర్వానర్థంబులకుఁ గామమే మూలంబని గీతచెప్పుచు న్నది. ఆవాక్యభావంబును గొంత విమర్శింపవలయును. కా మము అనఁగా గోరిక. అది శుభమని, అశుభమని రెండు విధ ములు. పరాపకారంబును దలంచునది యశుభమగును. అది పూర్వవాసనాఫలంబుగా నంకురించినను, దానినిఁ గార్యరూ పంబు దాల్పనీయకుండునట్లుగా నడచివేయవలయును. అంత తో నది సమసిపోవుచున్నది.

ఈప్రయత్నము అల్పమధ్యమ వాసనలప్రేరితమైన

కామమందే ఫలకారియగును. గాఢవాసనాప్రేరితమైనదాని నడంప మహత్తరప్రయత్నంబు వలయును. అంతసామర్థ్యము లేనినాఁడు అదికార్యరూపము దాల్చుటయు దుఃఖముగలిగించుటయు దప్పవు.

ఆర్తినివారణార్థమో, అర్థార్థమో, జిజ్ఞాసారూపమో యైన కోరిక శుభమగును. అయినను వానిలో మొదటిది యార్తితోలఁగుపర్యంతముండి నశించుచున్నది. రెండవది భావిఫలంబు నపేక్షించుచున్నది. తత్ఫలానుభవంబునకై పునర్జన్మాదులు తప్పవు. దానంజేసి రెండవది తాత్కాలికంబున మంచిదిగాఁ దోఁచినను భావిజన్మాదులకుఁ గారణమగుచున్నది. మూఁడవదానికి మోక్షప్రాప్తియే ఫలంబు గావునను మోక్షము పరమవాంఛనీయమే గావునను, అది యుత్తమోత్తమంబే యగును.

అర్థారమైన కామమే సర్వానర్థంబులకు మూలంబని పై గీతావచనభావము. ఇది చక్కఁగా గ్రహింపవలయును.

గుణశక్తి.

ఈ మూఁడుగుణంబులలోఁ దమోగుణంబునకు ఆవరణశక్తియు, రజోగుణంబునకు విక్షేపశక్తియు, సత్త్వగుణంబునకుఁ బ్రకాశశక్తియుఁ గలదు.

మూఁడుగుణంబుల స్వరూపాదులు.

సత్త్వ రజస్తమస్సులను మూఁడు గుణంబులకు రూప, లక్షణ, వృత్తి, ఫల, రుచి, వ్యవహారగతులు వేర్వేఱుగానున్నవిం

రూపములు.

సత్త్వగుణంబు నైర్మల్యరూపంబు ; రజస్సు రాగరూపంబు ; తమస్సు అజ్ఞానరూపంబు (గీ. అ. 14_6-7)

లక్షణములు.

సత్త్వంబునకుఁ బ్రకాశంబును, రజస్సునకు లోభంబును, తమస్సునకు అప్రకాశంబును లక్షణంబులు. (14_11-12)

వృత్తులు.

జీవాత్మకుఁ జుట్టియున్న యావరణంబును దొలంగించుట సత్త్వగుణవృత్తిగాను, కర్మములందుఁ బ్రవేశపెట్టుట రజోగుణవృత్తిగాను, మోహమును గలిగించుట తమోగుణవృత్తిగా నున్నవి. (14-8)

ఫలము.

సత్త్వంబునకు జ్ఞానంబును, రజస్సునకుఁ బ్రవృత్తియు, తమస్సునకుఁ బ్రమాదంబును ఫలంబులగును. (14_6-8)

రుచి—వ్యవహారాదులు.

ఆయుస్సు, సత్త్వము, బలము, ఆరోగ్యము, సుఖము, ప్రీతి-వీనిని వృద్ధిచేయునట్టియు, రసవంతంబులును, స్నిగ్ధంబులును సారవంతంబులును హృద్యంబులును నైనట్టియుఁ బదార్థంబులు సత్త్వగుణంబునకు రుచించును. (17-8). చేదుగాను, పులుసుగాను, ఉప్పుగానుండునట్టియు, అత్యుష్ణముగా నుండు పదార్థంబులు రజోగుణంబునకు రుచికరంబులగును. వీనివలన దుఃఖము, శోకము, అనారోగ్యము సంభవించును. (17-9) రుచిలేనట్టియు, కుళ్ళినట్టియు, అపరిశుద్ధములైనట్టియుఁ బదార్థంబులు తమోగుణమునకు రుచిగానుండును. (17-10).

సత్త్వగుణవ్యవహారము ప్రతిఫలనిరపేక్షముగాఁ గర్మార్థము వ్యవహరించుటగా నుండును. రజోగుణవ్యవహారము ప్రతిఫలాభిసంధితోఁ గూడి దంభపూర్వకంబుగా నుండును. తమోగుణవ్యవహారము నీతినియమంబులు లేనిదై శ్రద్ధాహీనమై యుండును. (17-11, 12,13).

ఇంతియగాక ఈమూఁడుగుణంబులు కాయిక, వాచిక, మానసికంబులనెడి త్రివధ తపోవ్రతమందేమి, దానమందేమి వేర్వేఱుగా వ్యవహరించును. (17-14 to 22).

గతి.

సత్త్వగుణంబునకు ఊర్ధ్వగతి ; రజస్సునకు మధ్యగతి ; తమస్సునకు అధోగతి (14-19).

పైనిఁజెప్పిన రూపాదులనుబట్టి ఏయేయుపాధియందు ఏయేగుణము ప్రధానముగా వర్తించుచున్నదో గ్రహింపనగును.

గుణవృద్ధి కారకములు.

శాస్త్రము, జలము, జనులు, దేశము, కాలము, కర్మము, జన్మము, ధ్యానము, మంత్రము, సంస్కారము —ఈ పదియు వ్యష్టిగానొండె సమిష్టిగానొండె గుణంబులను బెంపొందించుచున్నవిగానున్నవి. ఇవి సాత్త్వికంబులైనచో సత్త్వగుణంబును రాజసికంబులగుచో రజోగుణంబును, తమఃప్రధానంబులగుచోఁ దమోగుణంబును బెంపుసేయును. ఈవిషయమును జక్కఁగా గ్రహించి వర్తింపవలయును.

వృద్ధిమార్గ ద్వయము.

ఈగుణవృద్ధికి అన్వయమార్గమనియు వ్యతిరేకమార్గ

మనియు రెండు మార్గములు గలవు. ఏగుణంబుయొక్క వృద్ధినిగోరుదురో యాగుణవృద్ధికి ననుకూలంబులైన వానినే సేవించుట అన్వయమార్గంబనియుఁ బ్రతికూలంబులను వదలుట వ్యతిరేకమార్గంబనియుఁ జెప్పిరి.

సాత్వికగుణాభివృద్ధిని గోరుదురేని నివృత్తిమార్గబోధక శాస్త్రంబులును పవిత్రజలసేవనంబును, సజ్జనసాంగత్యంబును, ఏకాంతవాసంబును, నిశ్శబ్దసమయధ్యానంబును, నిరంతరపరోపకారకకర్మపరత్వంబును, సత్త్వగుణమూర్తులను ఆలంబనముగాఁ గొని సత్త్వమంత్రములచేత జపించుటయుఁ జేయవలయును. ఇది అన్వయమార్గము. సత్త్వగుణాభివృద్ధికి విరోధంబులగు ప్రకృతిబోధకశాస్త్రంబులను, వాసనద్రవ్యంబులతోఁగూడినజలంబులను, మద్యపదార్థంబులను, భోగపరులతోడి చెలిమియు, లౌకికవ్యవహారమగ్నులైన దుష్టులసాంగత్యంబును, రచ్చలు ద్యూతగృహంబులు మున్నగుప్రదేశంబులను, శబ్దమయమై విక్షేపకారకంబులగు సమయంబులను, స్వార్థంబును ఘోరంబులునైన కర్మంబులను, పరోపద్రవకరమంత్రంబులను, భూతప్రేతపిశాచాదిఘోరదేవతలను, శారీరకర్షకఘోరతపంబులను వర్జింపవలయును. ఇది వ్యతిరేకమార్గంబగును. ఇట్లే తక్కిన గుణంబులవిషయంబునఁ గూడ నూహింపవలయును.

### గుణములు—సృష్టివిభాగము.

గుణంబులనుబట్టి సృష్టియెల్ల రెండుగా విభజింపఁబడుచున్నది. సత్త్వగుణప్రధానమైనదానిని దైవసృష్టియనియు రజస్తమఃప్రధానమైన దానిని అసురసృష్టియనియుఁ బేరొ-

నిరి. సృష్టియనఁగా నామరూపకల్పనమేగాని తత్పూర్వము లేని పదార్థము క్రొత్తగాఁ బుట్టించుట కాదు. ఈ ద్వివిధ సృష్టి వివరము 16-వ అధ్యాయంబునఁ గలదు.

### సృష్టివైచిత్రి.

సృష్టియెల్ల నానారూపగుణచరాచరంబులతోఁ గూడి చిత్రవిచిత్రముగా నున్నది. ఈవైచిత్రికిఁ గారణంబులను బెక్కులూహింతురు. అన్నిఁటికి మూలకారణంబొకటి గలదు. దానినే కర్మమందురు.

ప్రతికర్మంబునకు ఫలంబును తద్విధవాసనయుఁ గలవు. ఫలము భుక్తమైగాని నశింపదు. దానిభోగార్థము తదనుకూల శరీరము గలుగును. ఆశరీరమందుఁ దత్ఫలానుమేయములైన వాసనలును జేరును. ఆవాసనల సముచ్చయంబునే స్వభావంబనిరి. ఆస్వభావంబునుఁబట్టి గుణంబులును, వానింబట్టి రుచులును, వానింబట్టి ప్రేరణంబులును, వానింబట్టి పునఃకర్మంబులును, వానింబట్టి ఫలంబులును, వానింబట్టి భోగాయతనశరీరంబులును గలుగుచుండును. ఇదియే సృష్టివైచిత్రికి మూలకారణము.

### ఫలవిభాగము.

ప్రతికర్మంబునకు నేదోయొకవిధమైన ఫలము తప్పదు. ఆఫలంబులు ఇష్టంబులనియు, అనిష్టంబులనియు, మిశ్రమంబులనియు మూఁడువిధంబులు. ఇష్టఫలంబు సుఖరూపంబునను, అనిష్టఫలంబు దుఃఖరూపంబునను, మిశ్రఫలంబు సుఖదుఃఖాత్మకంబుగాఁ బ్రాప్తమగుచుండును.

ఈఫలప్రకరణంబెల్ల ఫలాభిసంధితోఁ గర్మములుచేయు వారికే యన్వయించును. ఈఫలములు శాశ్వతంబులు గావనియు, మోక్షమొక్కటే శాశ్వతఫలంబనియు, ముక్తికాము లెల్లరును ఫలాభిసంధిరహితంబుగా స్వధర్మానుసారంబుగాఁ గర్మంబులాచరింపవలయుననియు గీత ఘంటాపథంబుగా బోధించుచున్నది.

### బంధముక్తులు.

బంధమనఁగానేమి ? ముక్తియనఁగానేమి ? అనుప్రశ్నలు ప్రతిబుద్ధికిఁ దగలకపోవు. భ్రాంతియే బంధమనియు ఆభ్రాంతిపోవుటయే ముక్తియనియుఁ దెల్పిరి. ఒకదానిని మఱియొకటిగా భావించుట భ్రాంతియగును. అశాశ్వతంబును శాశ్వతంబుగా లోకము భావించుచుఁ దద్విధభ్రాంతికిఁ జిక్కి యాయశాశ్వతము వెంటఁబడి ప్రాకులాడుచుఁ దుదఁగానకయున్నదనియు, అట్లు తాము వెంటఁబఱచునది అశాశ్వతమని దృఢముగా నెఱుంగుటయే ముక్తియనియుఁ బల్కిరి. ఈబంధముక్తులురెండును కేవల భావనామాత్రంబులు.

### భ్రమజ్ఞానము.

ఈభ్రమయు నొకవిధమైన జ్ఞానమే యగునుగాని సత్యజ్ఞానముమాత్రముగాదు. ఈభ్రమజ్ఞానము సంశయము, అసంభావనము, విపరీతభావనము అని మూఁడు విధంబులు. ఒక్క ధర్మిమీఁదనే రెండుధర్మంబులారోపించి అదియా ఇదియా యని సందేహించుట, అనఁగా రజ్జువునుజూచి, ఇదిసర్పమా ? రజ్జువా ? అని సందేహించుట సంశయమగును. లోకసహజముగానగుదానిని అసంభావ్యముగాఁ దలంచుట, అనఁ

గా, రూపవంతులును గుణవంతులునైన తలిదండ్రులకుఁ గురూపియు దుష్టుఁడునైన పుత్త్రుఁడు జనించుట లోకసహజమైనను, అట్టిపుట్టుక వారి పూర్వకర్మవిశేషమై యున్నను, దానిని మఱచి, ఆతలిదండ్రులకు నతఁడు పుట్టలేదనుట అసంభావమగును. ఒకవస్తువుమీఁద దానికి సంబంధింపనట్టియు వేఱొకవస్తువునకు సంబంధించినట్టియు ధర్మంబు నారోపించుట, అనఁగా ముత్తెపుచిప్పను జూచి దానికి సంబంధింపనట్టియు వెండికిసంబంధించినట్టియు రజితధర్మంబును ఆముత్తెపుఁ జిప్పయందారోపించుట విపరీతమగును. త్రివిధమైన యీ భ్రాంతి నశించుటయే ముక్తియగును.

జీవుఁడే బ్రహ్మమనుట పరమార్థసత్యము. వాస్తవస్థితియట్లున్నను జీవుఁడు వేఱనియు బ్రహ్మము వేఱనియు భావించుట లోకసహజమైయున్నది. ఈభావము భ్రాంతిజన్యముగాని వేఱుగాదు. ఆభ్రాంతియన్ననో అజ్ఞానకారణంబున అనఁగా నిజము తెలియకపోవుటవలనఁ గలుగుచున్నది. ఈ భ్రాంతి తొలఁగి జీవబ్రహ్మములు అభేదమనెడి భావసిద్ధి కలుగుటయే ముక్తియగును. ముక్తియన్నను మోక్షంబన్నను ఒక్కటే యర్థమగును.

### భావత్రయము.

భావసిద్ధిగలుగుటయే ముక్తియని పైనిఁ జెప్పబడెను. ఈభావము మానసికవ్యాపారము. అది సమానాధికరణంబనియు. విశేషణవిశేష్యంబనియు, లక్ష్యలక్షణంబనియు మూఁడువిధములు. రాముఁడనువాని నెప్పుడో ఎచ్చటనో చూచియుందుము. అతఁడు మరల నిప్పుడు కాన్పించును. వానిని

జూచినంతనే ఆరాముఁడే, అనఁగా నాఁడెచ్చటనో చూచిన రాముఁడే యీరాముఁడను భావము గలుగును. ఇఁట 'ఆ' 'ఈ' అనునవి రాముని రూపసమానత్వంబును దెల్పుచున్నవి. ఇట్లు రెంటికినిగల సమానత్వంబును దెల్పుభావంబును సమానాధికరణంబనిరి. 'తత్ త్వమసి' అనునది మహావాక్యము. 'తత్' అనఁగా బ్రహ్మము ! 'త్వమ్' అనఁగా జీవుఁడు. బ్రహ్మమే జీవుఁడని ఈమహావాక్య తాత్పర్యము. ఇందు తత్, త్వమ్ అనునవి బ్రహ్మమునకును జీవునకును సమానత్వంబును దెల్పును. కావున నిచట సమానాధికరణభావము గలదు.

ఆరాముఁడే ఈరాముఁడన్నప్పుడు, రాముఁడనువాని నెన్నఁడో యెచ్చటనో చూచినభావము ద్యోతమగును. రాముని మొదటఁ జూచి యుండుట భూతకాలికవిషయము. ఇప్పుడు వానిని మరలఁజూచుట వర్తమాన కాలికవిషయము. 'ఆ' అనునది భూతకాలంబును, 'ఈ' అనునది వర్తమానకాలంబును దెలుపుచున్నవి. ఇట భూతకాలద్యోతకమైన 'ఆ' అనునది వర్తమానకాలద్యోతకమైన 'ఈ' అనుదానికి విశేషణంబగును. అట్లే 'తత్' అనునది 'త్వమ్' అనుదానికి విశేషణంబగును. కావున నిట విశేషణవిశేష్య భావము గలదు.

రాముని మొట్టమొదటఁ జూచినప్పుడు అతఁడు కిరీటాదులులేక సామాన్యవస్త్రధారియై యుండవచ్చును. ఇప్పుడతఁడు కటకకిరీటాద్యలంకారసహితుఁడై యుండవచ్చును. ఇట్లు బాహ్యలక్షణంబులందు భేదము గల్గినను, వ్యక్తి యొక్కఁడే యను భావమగుచున్నది. దీనిని లక్ష్యలక్షణభావమనిరి.

బ్రహ్మము నిరుపాధికముగానుండును. ఆబ్రహ్మమే ఉపాధిగతమైనప్పుడు జీవుఁడనఁబడును. అచ్చట ఉపాధి లేదు; ఇచ్చట ఉపాధి కలదు. దానంజేసి బ్రహ్మమునకును జీవునకును బాహ్యలక్షణములందు భేదము గాన్పించుచున్నది. అంతియగాని యయ్యిరువురకు నంతర్భేదము లేదు. బ్రహ్మము నందుఁగల లక్షణంబులకన్న భిన్నమైనలక్షణంబులు, అనఁగా ఉపాధిని బొందియుండుట, ఆయుపాధికిఁ దగిన ధర్మంబులాచరించుట, ఆభాసచైతన్యమాత్రమై యుండుట అనులక్షణంబులు జీవునందున్నను, ఈవిలక్షణంబులను వదలి జీవబ్రహ్మములకుఁ గల సామాన్యలక్షణంబును అనఁగాఁ బరత్వంబును మాత్రమే గ్రహించుట లక్ష్యలక్షణభావంబగును. దీనినే జహదజహల్లక్షణభావంబనియు, భాగత్యాగలక్షణభావంబనియుఁ జెప్పుదురు. జీవబ్రహ్మములకు నైక్యంబును సాధించునప్పుడు మీఁదఁజెప్పిన మూఁడువిధములుగా భావంబును సాధింపవలయును.

### బంధస్వరూపము.

'బంధము' అనుమాట వేదాంతశాస్త్రమందు సర్వసామాన్యముగా వాఁడఁబడుచున్నది. అయినను దానిస్వరూపంబును జక్కఁగా గ్రహింపవలయును ఒకదానిలోఁ జిక్కి కట్టుబడియుండుట బంధశబ్దమునకు నర్థము. వేదాంతశాస్త్రమందు ఈపదమును బ్రయోగించినప్పుడు 'ఎవఁడు దేనిలోఁ జిక్కి కట్టుబడియున్నాఁడు?' అను ప్రశ్న వచ్చును. జీవుఁడు ఉపాధియైన శరీరములోఁ జిక్కికొని యున్నాఁడు అని దానికి బదులుచెప్పుదురు. అంతమాత్రాననే బంధశబ్దభావము స్పష్ట

ముగాదు. జీవుఁడుపాధితోఁ జిక్కుకొనుట యనఁగా ఉపాధియే తానని జీవుఁడు భావించుటయని యర్థము. జీవుఁడు వాని ప్రారబ్ధకర్మఫలమైన శరీరమందుఁ జేరి, తనస్వరూపంబును మఱచి, ఉపాధిమాత్రుఁడనని తలంచుచు, అయ్యుపాధికిఁ బ్రారబ్ధవశంబున సంప్రాప్తంబులగు సుఖదుఃఖంబులను దనవిగా భావించుచు నుండుట బంధమనఁబడును.

### బంధమోక్షణము.

ఈబంధంబెట్లు తొలంగునను ప్రశ్న వెంటనే వచ్చును. జీవుఁడు ఉపాధితోఁ దాదాత్మ్యంబునొందుటయే బంధమని చెప్పఁబడెను. అట్టి తాదాత్మ్యభావంబు పోవుటయే మోక్షమగును. అట్టిభావంబెట్లు పోవునందురా? అట్టిభావంబు గలుగుటకుఁ గారణమేమి? అజ్ఞానమే కారణము. కావున అజ్ఞానము నశించెనేని సత్యము స్పష్టమగును. దానితోడ అజ్ఞానకార్యమైన భ్రాంతియుఁ దత్ఫలమైన తాదాత్మ్యభావంబును దొలంగును. ఇదే మోక్షము

### అజ్ఞానము.

అజ్ఞానమనఁగా జ్ఞానశూన్యముగాదు; విపరీతజ్ఞానమని భావము. ఈ అజ్ఞానమెట్లు వచ్చెనందురా? దీనికి నునికియే లేదు. సత్యజ్ఞానము మఱుఁగుపడినప్పుడు మాత్రమే యది కాన్పించుచున్నది. జ్ఞానోదయంబుతోఁడ నది నశించుచున్నది. కావున జ్ఞానావరణమే అజ్ఞానకారణమనిరి.

### జ్ఞానావరణంబులు.

జ్ఞానము స్వతఃప్రకాశమానము. అది యెల్లప్పుడు

నేకరాశిగానే ప్రకాశించుచుండును. దానికి రాకపోకలు లేవు. అయినను దానిని రెండువిధములైన యావరణంబులు గప్పిపుచ్చుచున్నవి. ఆరెంటిని అసత్వాపాదకంబనియు, అభావాపాదకంబనియు, వచింతురు. ఏదికాదో యదేయనుభావంబును గలిగించునది అసత్వాపాదకావరణంబనియు అభావంబునకు భావరూపంబును గలిగించునది అభావాపాదకావరణంబనియు ఆరెంటికి లక్షణంబులు చెప్పిరి. ఈరెండునుండుట యనుభవసిద్ధము. ఇవియేల గలుగుచున్నవన్నచోఁ గారణము దురూహ్యము. భగవన్మాయయే యిందులకుఁ గారణంబనిరి.

## ఆవరణభంగము.

ఇవిరెండును మధ్యవచ్చినవే గావున వీనిని దొలంగింపవచ్చును. పరోక్ష అపరోక్ష సాధారణ ప్రమాణజ్ఞానమాత్రంబున అసత్వాపాదకావరణంబు దొలంగుననియు, సాక్షాత్కారమొక్కటే రెండవదానిని దొలగించుటకు సమర్థమనియుఁ బల్కిరి.

## జ్ఞానాజ్ఞాన లక్షణంబులు.

ఆత్మయనునది పరమానందస్వరూపము. అట్టిపరమానందంబు ననుభవించుటయే జీవితావధి. పదార్థంబులవలనఁ గలుగునట్టి యానందంబు ఇంద్రియానందమేకాని వేఱుగాదు. దానంజేసి యది తాత్కాలికమగునేగాని శాశ్వతికంబు గానేరదు. ఈసంగతిని గ్రహించి దానిని స్వానుభవసిద్ధము చేసికొనుటయు, క్షణికంబులకైన గుంజులాటను వదలుటయు, శాశ్వతానందంబునకై యత్నించుటయు జ్ఞానలక్షణంబులు.

ఇంద్రియగోచరపదార్థంబులెల్ల జీవకోటియొక్క తత్త త్ప్రారబ్ధకర్మఫలభోగార్థము దాల్చిన యుపాధులుగాని వేఱు గాదు. ఫలభోగంబుతోడ నుపాధి నశించుచున్నది. అది యుపాధిస్వభావము అట్టినశ్వరంబులను శాశ్వతంబులుగా భావించుట అజ్ఞానప్రథమలక్షణము. అట్టి నశ్వరపదార్థంబుల వలన నానందముగల్గునని భావించి వానికై ప్రాకులాడుట అజ్ఞాన ద్వితీయలక్షణము.

### జ్ఞానసాధనములు.

జ్ఞానంబును బడయుటకు వివేకము, వైరాగ్యము, శమాదిషట్కము, ముముక్షుత, శ్రవణము, మననము, నిదిధ్యాసనము, తత్త్వంపదార్థశోధనము అని ఎనిమిదింటిని సాధనంబులుగాఁ జెప్పిరి. శమ, దమ, శ్రద్ధా, సమాధాన, ఉపరతి, తితిక్షలు అనునాఱింటిని శమాదిషట్కములోఁ జేర్చిరి.

### (1) వివేకము—దానిఅంతరాయములు.

ఏది నిత్యమో, ఏది అనిత్యమో యెఱుంగుట వివేకమగును. ఈవివేకంబునకు మలము, విక్షేపము, ఆవరణము అనునట్టి యంతరాయములు మూఁడు గలవు.

మలము-జన్మాంతరపాపము మలమనఁబడును. అనఁగా జన్మాంతరమందుఁ జేసిన యశుభకర్మములవాసనఁ బ్రారబ్ధజన్మంబున మలమగును. విక్షేపము-ఎందేనియు నొకచోట నిల్కడలేక మనస్సు పరిపరివిధంబులఁ బఱచుట విక్షేపమగును. స్వరూపంబును దెలియలేమి యావరణంబగును.

### వివేకాంతరాయ నివారణసాధనములు.

మలము అశుభవాసనారూపంబని చెప్పఁబడెను. ఆ

వాసనలు ప్రారబ్ధజన్మంబున వానియదనువచ్చినప్పుడు పరిశీ
మించి తద్దూ్రాపకర్మములకుఁ బ్రేరేచుచుండును కర్మము లెట్టి
వైనను నిష్కామబుద్ధితో వాని నాచరింతురేని, అట్టి కర్మంబు
లకుఁ గలుగు ఫలములుగాని అట్టిఫలవాసనలుగాని కర్తనంట
నేరవు. అట్లు చేయుటవలనఁ బ్రారబ్ధమలమువలనఁ బునర్మ
లాంకురంబులు జనింపనేరవు. ఇదియే మలనివారణసాధనము.
అనఁగా నిష్కామకర్మము మలదోషనివారణంబునకు సాధన
మగును. గంగాస్నానము, ఈశ్వరనామోచ్చారణము భూత
దయ మున్నగునవి నిష్కామకర్మమందు అంతర్భూతములు.

ఉపాసనవలన విక్షేపము తొలంగును. ఈశ్వరధ్యా
నము, అజపాజపము, యోగము, గురుసేవ, వేదాంతప్రవేశ
ము ఇవి యుపాసనయందంతర్భూతములు.

ఆవరణదోషము జ్ఞానమువలన నశించును. జ్ఞానమ
నఁగా అపరోక్షజ్ఞానంబని గ్రహింపవలయును.

### ఈశ్వర నామోచ్చారణ మాహాత్మ్యము.

పై మలదోషహరణసాధనంబులలో నెల్ల ఈశ్వరనామో
చ్చారణంబునకు నత్యధిక మాహాత్మ్యంబు గలదు. గంగా
స్నానాదులొక్కొక్కమలదోషంబును మాత్రమే హరింపఁ
గలవు. ఈశ్వరనామోచ్చారణంబన్ననో సర్వమలదోషంబు
లను మూలముట్ట హరించును. అంతియగాదు, అది మలదో
షహరణ పూర్వకంబుగా నంతఃశుద్ధిగావించి, బుద్ధి నేకాగ్ర
మొనర్చి జ్ఞానంబు నుదయింపఁజేసి మోక్షంబును జేకూర్చు
చున్నది. అజామిళునిచరిత్రయే యిందులకు నిదర్శనము.

శ్రీశుకమహర్షి యంతవాఁడు సయితము నామోచ్చారణప్రభావంబు నెంతయు నుగ్గడించెనన వేఱచెప్పవలయునా ?

జ్ఞానసౌధంబు నారోహించుటకు వివేకము మొదటిమెట్టుగానున్నది. అది దృఢముగాకున్నచో, దక్కిన వైరాగ్యాదిసాధనంబులు సఫలంబులుగావు. కావున నెల్లవిధంబులం బునాదిమెట్టును గట్టిగాఁ గూర్పవలయును.

2. వైరాగ్యము.

మర్త్యలోకము మొదలు బ్రహ్మలోకము వఱకుఁ గల సమస్తభోగ్యవస్తువులు పర్యవసానంబున దుఃఖరూపంబులేగాని శాశ్వతసుఖదాయకంబులుగావని నిత్యానిత్యవస్తువివేకపరిజ్ఞానంబున నేర్పడుచున్నది. ఆభావము హృదయస్థమైన తర్వాత వానిని గాకమలంబువలె వదలవలయుననెడి మనోవృత్తిగలుగును. దానినే వైరాగ్యమనిరి. అనఁగా విషయభోగకాంక్షను బరిత్యజించుట వైరాగ్యమగును. కాంక్షనువదలక వస్తువును మాత్రము త్యజించుట వైరాగ్యమెన్నఁడును గానేరదు.

వైరాగ్య భేదములు.

ఈవైరాగ్యము (1) బాధదృష్టివైరాగ్యమనియు, దోషదృష్టివైరాగ్యమనియు, అపరోక్షమిథ్యాదృష్టివైరాగ్యమనియు, మూఁడువిధములు. ప్రపంచమే లేదనుట బాధదృష్టివైరాగ్యము. ఇంద్రియార్థభోగాపేక్షయే సర్వదుఃఖంబులకు మూలమనుట దోషదృష్టివైరాగ్యము. సృష్టియెల్ల మిథ్యారూపమనుట అపరోక్షమిథ్యాదృష్టి వైరాగ్యము.

మొదటిరెండు వైరాగ్యంబులు సంపూర్ణజ్ఞానఫలంబులు

గావు గావున అవి యొకానొకప్పుడు సడలవచ్చును. మునులు గూడ నప్పుడప్పుడు స్త్రీవశులగుటయే యిందులకు నిదర్శనము. అపరోక్షమిథ్యాదృష్టివైరాగ్యమన్ననో అదిసమగ్రజ్ఞానఫలంబు గావున దానికిఁ జ్యుతియే గలుగనేరదు. మొదటిరెండువైరాగ్యములు సాధనావస్థలగును. మూఁడవది మొదటిరెంటి సాధనఫలమగును. ఇది జీవన్ముక్తావస్థయందు మాత్రమే కలుగును.

### 3. శమాదిషట్కము.

జ్ఞానసాధనములలో శమాదిషట్కము మూఁడవదానినిగా గ్రహించిరి. ఈషట్కములో నొక్కొక్కదానికి అంతరాంతరసంబంధములు గలవు. వాని వివరము తెలియుట మేలు గావున నొక్కొక్కదానిని సుంత వివరింతును.

### (a) శమము.

మనస్సు నిరంతరము విషయములవెంటఁ బఱచుచుండును. అది దానికి నైజము. విషయములందలి దోషంబులను గ్రహించి వాని నుండి మనస్సును మఱలించుట శమమగును. ఈమఱల్చుట దోషదృష్టిపూర్వకంబుగా నుండవలయును.

### (b) దమము.

ఇంద్రియములను స్వాధీనము చేసికొనుట దమమగును. స్వాధీనము చేసికొనువాఁడెవఁడు ? మనస్సేగాని మఱియొకఁడు గాఁడు. ఇంద్రియంబులనట్లు స్వాధీనపఱచుకొనుటకు మొట్టమొదట తాను కుదురుటచెందవలయును. అనఁగా మనస్సు మొదట శమమునంది తర్వాత యింద్రియంబులను స్వాధీనము

చేసికొనవలయును. అట్లుచేసినప్పుడే యింద్రియంబులు మనస్సుయొక్క యిచ్ఛానుసారంబుగా వర్తించును.

(౮) శ్రద్ధ.

వేదశాస్త్రగురువచనంబులందు సంపూర్ణ భక్తివిశ్వాసంబులు గలిగియుండుట శ్రద్ధయనంబడును. ఈ శ్రద్ధయను జ్ఞానసాధనంబులన్నింటిలో ముఖ్యసాధనమగును. ఇది లేనిచో దక్కినవెల్ల నిష్ఫలంబులేయగును. కావుననే శ్రీభగవానుఁడు 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' అని శ్రద్ధాప్రభావంబును నొక్కి పల్కెను.

(౯) సమాధానము.

మనస్సును ఏకాగ్రముగా నుంచుకొనుట సమాధానమగును. ఈసమాధానవిషయమై మతాంతరములు గలవు. నిర్గుణబ్రహ్మమందుఁ జిత్తనివృత్తి సమాధానమని యొకరనిరి. నిర్గుణబ్రహ్మమందుఁ జిత్తలయము సమాధానమని యింకొకరు పల్కిరి. వీరిరువురును 'సర్వథా స్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణి సర్వదా' అను వివేకచూడామణి వాక్యమునే పురస్కరించిరి. శుద్ధబ్రహ్మమనఁగా నిర్గుణబ్రహ్మమని వారిమతము.

శుద్ధబ్రహ్మము నిర్గుణబ్రహ్మమనుట ఆచార్యులవారి భావము కానేరదు. ఏలయందురా? నిర్గుణబ్రహ్మము జ్ఞేయమగునేగాని ధ్యేయము కానేరదు. జ్ఞేయము కేవలజ్ఞానగమ్యమగునే గాని చింతనాది సాధ్యముగాదు. సమాధానమన్ననో, చిత్తైకాగ్ర్యపూర్వక బ్రహ్మచింతనమగును. చింతనమనఁగా గుణచింతనమని భావము. నిర్గుణబ్రహ్మము

గుణరహితము. గుణరహితమైనదానిని గుణచింతనము సేయు టెట్లు ? కావున నిర్గుణచింతనమే పొసఁగదు.

మఱియు సమాధానసాధకుఁడు మూర్త్యాదిసాకారపదార్థములనుగాని, సత్యకామ సత్యసంకల్ప సర్వజ్ఞత్వాదీశ్వరధర్మంబులనుగాని చింతన సేయరాదనియు, నిరాకారనిర్వికల్పబ్రహ్మమును జింతనసేయువలసినదనియు, ఆభావము స్పష్టమగుటకై 'శుద్ధ' అను శబ్దంబును ఆచార్యులవారు ప్రయోగించిరనియు గ్రహింపవలయును. అంతియగాని నిర్గుణబ్రహ్మభావమునకే సమాధానసాధనమందవకాశము లేదు.

మఱియు సమాధానమందుఁ జిత్తనివృత్తియని యొకరున్, చిత్తలయమని యొకరు నుడివిరి. నివృత్తికిని లయంబునకు నెంతో తారతమ్యము గలదు. నివృత్తియనఁగా మఱలుటయని యర్థము. మనస్సు ప్రపంచముఖమగుట ప్రవృత్తియనియు, అందుండి మఱలుట నివృత్తియనియుఁ జెప్పిరి. బ్రహ్మము ప్రపంచము ఇవి వేర్వేఱని వ్యావహారికభావము. మనస్సు అట్టిభావంబుతో నుండుట ప్రవృత్తియగును. ఆభావము మాఱి ప్రపంచమే బ్రహ్మమనుభావము నొందుట నివృత్తియగును. ఎప్పుడు ప్రపంచప్రత్యేకభావము నశించెనో అప్పుడు బ్రహ్మముమాత్రమే శేషించును. మనస్సు బ్రహ్మముఖమగుటయే బ్రహ్మసాక్షాత్కారమగును. బ్రహ్మసాక్షాత్కారముతో సర్వము సమాప్తమగుచున్నది. తర్వాత సాధనములకే యవకాశము లేదు. సమాధానము వలననే బ్రహ్మసాక్షాత్కారమగునేని తర్వాతిసాధనములఁ జెప్పనేల ? కాఁబట్టి సమాధానమునకుఁ జిత్తనివృత్తి భావము గాదు.

ఇంకఁ జిత్తలయమును గూర్చి విచారించుదము. కారణమందుఁ గార్యము లయించుట శాస్త్రసమ్మతము. సృష్టికి బ్రహ్మము అధిష్ఠానమాత్రమనియు, మూలావిద్యయనునది కారణంబనియు వచించిరి. అనఁగా సృష్టియనునది యొకటి గలదందురేని, అప్పుడు సృష్టికి మూలావిద్య కారణంబగుననిరి. మూలావిద్యకారణమైనప్పుడు కార్యము దానియందే లయింపనేర్చునుగాని అధిష్ఠానమందు దానికిఁ గించన్మాత్రముగూడ నవకాశము గలుగదు. మూలావిద్యవలనఁ గార్యమగు ప్రపంచభావము మనస్సునకుఁ గలిగెను. ఈ ప్రపంచభావరూప కార్యము కారణమైన మూలావిద్యయందు లయింపనేర్చునేగాని సర్వాధిష్ఠానము వంకఁ గూడఁ జనఁజాలదు.

మఱియు సమాధానమందు మనోవృత్తియుండును. వృత్తితోనుండు మనస్సునకు వృత్తిహీనమైన నివృత్తిగాని, స్వరూపనాశనరూపమైన లయముగాని ఎట్లుసంభవించును ? సమాధానమందు మనస్సు ఏకాగ్రతను మాత్రము దాల్చి ఆవృత్తిలో నట్లే చలనరహితంబుగా నిల్చియుండును. ఈ భావము స్పష్టమగుకొఱకే శ్రీఆచార్యస్వాములు 'స్థాపన' మను శబ్దమును బ్రయోగించిరి.

ఆచార్యస్వామివారు 'స్థాపన' శబ్దముతోఁగూడ 'సకృదా' యను పదమును గూడఁ బ్రయోగించిరి. అది కొందఱికు విపరీతముగాఁ దోఁచుచున్నది. స్థాపించుటఅనఁగా గట్టిగా నిల్పుట. ఈస్థాపనకార్యము ఒక్కసారిమాత్రమే సాధ్యమనియు, స్థాపించినదానిని మఱలస్థాపించుట యెట్లనియు వారి

భావము. స్థాపించుకార్యము ఒక్కసారిమాత్రమే సాధ్యమనుట నిర్వివాదాంశము. స్థాపించిన తర్వాత అది యేదేనొక కారణంబునఁ గదలుటగలదు. ఇది లోకానుభవసిద్ధము. అట్లు కదలినప్పుడెల్ల దానిని గట్టిచేయుచుండవలసినదనియు, ఒకసారి నాటినాముగదా యని దానిను పేక్షింపరాదనియు సూచించుటకై 'సర్వదా' శబ్దంబును వారు ప్రయోగించిరి.

చిత్తము శుద్ధబ్రహ్మమందు ఒకసారి యేకాగ్రమై నిల్చినను దానికి విక్షేపము గలుగవచ్చును. అట్లు విక్షేపము గలిగినప్పుడెల్ల నట్లే విడువక దానిని మరలమరల బ్రహ్మమందు నిల్పుప్రయత్నము చేయుచుండవలయునని సాధకులకు శ్రీస్వామివారు హెచ్చరిక గావించుచున్నారు.

(౬) ఉపరతి.

వైరాగ్యఫలముగా విషయభోగేచ్ఛాత్యాగము గలుగవచ్చును. అయినను ఎప్పుడేని ఏకారణముచేతనేని మరల భోగేచ్ఛ జనింపవచ్చును. అట్టియిచ్ఛ జనించినప్పుడు మరల విచారపూర్వకంబుగా దానిని నిరసించుట ఉపరతి యగును.

వైరాగ్యంబునకును ఉపరతికినిఁ గొంతభేదముగలదు. విషయభోగేచ్ఛకై వైరాగ్యము అవకాశమీయక యుండవచ్చును. అనఁగా భోగపదార్థంబులను వైరాగ్యము కోరనీయకుండవచ్చును. అంతియగాని అప్రార్థితంబుగా సంప్రాప్తమగువానినెడ నది యంతగాఁ బనిచేయఁజాలదు. ఉపరతియన్ననో యట్టివానిని గూడ నిరసింపఁజేయును. ఈరెంటికి నిట్టిసూక్ష్మభేదము గలదు. అందువలననే 'ఉపరతి'ని ప్రత్యేకముగా గ్రహించిరి.

'ఉపరతి' యందు సంన్యాసభావము గర్భితముగానున్నది. ఇట్టిసంన్యాసము గృహస్థునకుఁ గూడఁ బాటింపఁదగినదే యను భావంబును 'కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః' అనుచోట శ్రీకృష్ణభగవానులు సూచించిరి.

### (f) తితిక్ష.

సుఖదుఃఖాది సమస్తవిధద్వంద్వంబులను సహించుట తితిక్షయగును. ప్రతీకారశక్తి లేకగాని, అయ్యో ! అని ఏడ్చుచుఁగాని సహించుట తితిక్షగాదు.

'సహనం సర్వదుఃఖానా మప్రతీకార పూర్వకమ్,
చింతావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే' అని శ్రీఆచార్యస్వామివారు తితిక్షాశబ్దంబునకు వివరముగావించిరి.

'మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదా,
ఆగమాపాయినోఽనిత్యా స్తాంస్తితిక్షస్వ భారత॥' (2-24)
అని శ్రీభగవానుఁడు తితిక్షాతత్త్వంబును జెప్పెను.

### (g) ముముక్షుత.

మోక్షమందలి యిచ్ఛ ముముక్షుత యనఁబడును. అనర్థముఁ దొలగుట, పరమానందము చేకూఱుట—ఈ రెండును గూడి మోక్షస్వరూపమగును.

మోక్షేచ్ఛలేనివాఁ డెట్టి జ్ఞానసాధనంబు నభ్యసింపఁడనియు, ఎల్లసాధనంబులనభ్యసించుటకుగా మోక్షేచ్ఛయే మూలమగుననియు, సంగతి యిట్లుండఁగా మూలమైన మోక్షేచ్ఛను ప్రథమసాధనంబుగాఁ జెప్పక దానిని గడపట చెప్పుటేల ?

అనియు శంకింపవచ్చును. మోక్షేచ్ఛలేనివాఁ డెట్టిసాధనంబులకుఁ బ్రయత్నింపఁడనుట సత్యమే. మోక్షేచ్ఛతోనే సాధకుఁడు సాధనాభ్యాసంబునకుఁ బ్రయత్నించును. అయినను ఈమోక్షేచ్ఛ తొలుదొల్త మందముగానుండి సాధకుని సాధనక్రమంబునకుఁ బురికొల్పును. ఒక్కొక్కసాధనసిద్ధి గలుగుకొలఁది ఆయిచ్ఛ తీవ్రమగుచుండును. అట్టితీవ్రమమ్ముక్షుత కలిగినప్పుడు మాత్రమేసాధకుఁడు శ్రవణాదికమందు, అనఁగా, మోక్షమననేమి ? అదియెట్లు సిద్ధించును ? అను విచారణకుఁ దొడంగును. అందువలన శమాదిపంచకంబునకుఁ దర్వాతను శ్రవణాదులకుఁ బూర్వమును ముముక్షుత చెప్పఁబడెను. వివేకము మొదలు తితిక్షవఱకుఁ గల సాధనంబుల సిద్ధియైనఁ గాని మోక్షేచ్ఛ తీవ్రముగాదనియు, అప్పుడు మాత్రమే శ్రవణాదికము ఫలకారియగుననియు భావము.

వైరాగ్యము-శమము—ఈరెంటిభావము స్థూలదృష్టికి నొక్కటిగాఁ దోచినను వానికిఁ గొంతభేదము గలదు. అట్లే శమదమ సమాధానములందుఁ గూడ భేదముగలదు.

ఈశమాదులలో శమదమములు, శ్రద్ధాసమాధానములు, ఉపరతి తితిక్షలు, అనుజంటలు పరస్పరసాపేక్షకంబులు. శమము లేకున్న దమము చేకూఱదు ; దమము లేకున్న శమముగలుగదు. అట్లే తక్కినవి గూడ నని గ్రహింపవలయును.

## 4. ముముక్షుత.

దీనింగూర్చి పూర్వము చెప్పఁబడెను.

## 5. శ్రవణము.

వేదాంతవాక్యతాత్పర్యంబును నిశ్చయించుట శ్రవణ మందురు. ఈతాత్పర్యనిర్ణయంబునకు ఆఱువిధములైన యుక్తులు గలవు. వానినే షల్లింగములందురు. కేవలము వేదాంత వాక్యంబులను జదువుటగాని వినుటగాని ప్రథమశ్రవణంబగును. ఆవాక్యవిచారము ద్వితీయశ్రవణంబగును.

వేదాంతవాక్యము అవాంతరవాక్యమనియు, మహావాక్యమనియు రెండువిధములు. మొదటిదాని శ్రవణము పరోక్షజ్ఞానంబునకును రెండవదాని శ్రవణము అపరోక్షజ్ఞానంబునకును హేతువగును. ప్రథమశ్రవణంబున జ్ఞానోదయంబుగావచ్చునుగాని అసంభావనావిపరీతభావంబులు దొలంగవు. అవి ద్వితీయశ్రవణంబున దొలంగును.

## 6. మననము.

శ్రవణమువలన గ్రహించినదానిని సాధకబాధకయుక్తులచేత నిశ్చయించి అట్లునిశ్చయించిన దానినిగూర్చి చింతనము చేయుట మననమగును. బ్రహ్మము సచ్చిదానందము ; జీవుఁడు నట్టివాఁడే ; కావున జీవబ్రహ్మములకు భేదములేదనుట సాధకయుక్తియగును. బ్రహ్మము ఉపాధిరహితము ; ఆ బ్రహ్మమే యుపాధిగతమై జీవుఁడనఁబడును. అంతమాత్రాననే జీవబ్రహ్మములకు స్వరూపభేదము గలుగదు. మహాకాశ ఘటాకాశంబులకునెట్లో యట్లే బ్రహ్మమునకు జీవునకు అభేదమనుట బాధక యుక్తియగును.

ఈ ద్వివిధయుక్తులలో నొక్కటియు (1) అనుమానప్రమా

ణంబులనియు, (2) ఉపమానప్రమాణంబులనియు, (3) అర్థాపత్తిప్రమాణంబులనియు ముత్తెఱంగులు. బాధకయుక్తులందు అనుపలబ్ధి ప్రమాణంబనునది నాల్గవది గూడఁగలదని కొందఱందురు.

అనుమానప్రమాణయుక్తులకు (1) పక్షము, (2) సాధ్యము, (3) హేతువు, (4) ఉదాహరణము అనునవి యంగములగును.

ఈమననమునుగూర్చి మరియొకచోట వివరింపఁబడును.

7. నిదిధ్యాసనము.

మననంబునకుఁ బూర్వము మనోవృత్తి బహిర్ముఖమై అనఁగా భోగపరమైయుండును. మననముచేత బహిఃప్రపంచంబువలన శాశ్వత సుఖము గలుగదని యేర్పడును. అప్పుడు మనోవృత్తి యంతర్ముఖమై బ్రహ్మాకారమును దాల్చును. దీనినే నిదిధ్యాసనమందురు.

మనోవృత్తి బహిర్ముఖమై యున్నప్పుడు దానిని అనాత్మాకారవృత్తియనిరి. బహిర్ముఖమగుట మాని యది యంతర్ముఖమైనప్పుడు బ్రహ్మాకారవృత్తి యగును. ఈమనోవృత్తి నిదిధ్యాసనమందు నిరంతరాయముగా నుండవలయును. నిదిధ్యాసనమందు మనోవృత్తి ప్రయత్నపూర్వకంబుగా బ్రహ్మాకారమగును. సమాధియందది అప్రయత్నపూర్వకముగా నగును. కావున నిదిధ్యాసనము సమాధికిఁ బూర్వాంగమగును. నిదిధ్యాసనమందు బ్రహ్మాకారవృత్తికిఁ జ్యుతి గలుగవచ్చును. సమాధియందట్టి చ్యుతికే యవకాశములేదు.

మఱియు నిదిధ్యాసనమందు అంతోయింతో యావరణంబు శే షించియుండును. సమాధియందది యుండదు. బ్రహ్మసాక్షా త్కారము నిదిధ్యాసనమందు ఛాయామాత్రముగానుండును; సమాధియందది సంపూర్ణముగానుండును. సమాధిస్థుఁడు బహిర్ముఖుడైనప్పుడు గూడ బ్రహ్మసాక్షాత్కారమహానంద ము మఱువఁడు. దానంజేసి వానికి లోకవ్యవహారము సామాన్యులకు రుచించినట్లు రుచింపదు. కావున నతఁడు బహిర్ముఖత్వంబునకుఁ బశ్చాత్తాపపడును. నిదిధ్యాసనవంతుఁ డంతగాఁ బశ్చాత్తాపపడఁడు.

## 8. పదార్థశోధనము.

జడచైతన్యవిభాగము పదార్థశోధనమగును. అనఁగా దృశ్యమగు జడప్రపంచంబునకును దానికి నధిష్ఠానమైన చైత న్యంబునకుఁగల సంబంధమేమి యన పరిశోధించుట యని తా త్పర్యము.

ఈసంబంధము (1) కారణకార్యసంబంధమనియు, (2) అధిష్ఠానాధ్యస్తసంబంధమనియు, (3) ద్రష్టృదృశ్యసంబంధమని యు, (4) సాక్షిసాక్ష్యసంబంధమనియు శాస్త్రము చెప్పుచు న్నది.

చైతన్యము ఉపాధితోఁ గూడకమున్న శుద్ధచైతన్య మనియు, అది ఉపాధితోఁ గూడినప్పుడు ఉపాధిస్థచైతన్యమనియు విభజించిరి. శుద్ధచైతన్యమందు అధిష్ఠానాధ్యస్తసంబంధము తప్ప వేఱొకటి గలుగదు. ఉపాధిస్థచైతన్యమందు అధిష్ఠానా ధ్యస్త సంబాధమేగాక, ద్రష్టృదృశ్య సాక్షిసాక్ష్య సంబంధములు,

గూడఁ గలుగును. కారణకార్యసంబంధమునకు నెందు నవ
కాశము గాన్పింపదు.

## జ్ఞానభూమికలు.

శాస్త్రజ్ఞానము అనుభవసిద్ధమగుకొలఁది మనఃపరిణామ
ము గలుగుచుండును. అట్టిపరిమాణము ఎంతవఱకుఁగలిగిన
దో సూచించుహద్దులను భూమికలందురు. అట్టిభూమికలు—
శుభేచ్ఛ, సువిచారము, తనుమానసిత్వము, సత్వాపత్తి, అసం
సక్తి, పదార్థభావనము, తురీయము, అని యేడుగా నిర్ణయించిరి.

వైరాగ్యము వడసి మోక్షమందు నిచ్ఛఁగలవాఁడై
యాత్మజ్ఞానసంపాదనార్థము శాస్త్రపఠన సాధుసాంగత్యములు
చేయుట శుభేచ్ఛయగును. గురువును సేవించి 'తత్త్వమసి'
మహావాక్యముయొక్క తాత్పర్యమును గ్రహించి దానిని మ
ననము చేయుట సువిచారమగును. ఈరెండు భూమికలు
స్వానుభవసిద్ధంబులైన తర్వాత మనస్సును పట్టుప్రోగువలె
సూక్ష్మముగాఁజేసి బ్రహ్మాకారవృత్తితోనుండుట తనుమానసిక
త్వమగును. తత్ఫలముగాఁ గోరికలు నశించి తత్వజ్ఞానియై
సత్త్వగుణపూర్ణుఁడగుట సత్వాపత్తియగును. అంతఃకరణము
బ్రహ్మమందు లయించి సంకల్పసంస్కారరహితుఁడై యుండు
ట అసంసక్తియగును. బహిరంతర్వస్తుజ్ఞానము లేకుండుట,
అనఁగా అభావప్రతీతిలోనుండుట పదార్థభావనమగును. కే
వలము ఆత్మానందవశుఁడై యుండుట తురీయమగును. ఈ
జ్ఞానభూమికలనే నిర్వికల్పసమాధి భూమికలనియు వచింతురు.

## జ్ఞానుల తరగతులు.

జ్ఞానులలో (1) బ్రహ్మవేత్త, (2) బ్రహ్మవిద్వర్యుఁడు

(3) బ్రహ్మవిద్వరేణ్యుఁడు, (4) బ్రహ్మవిద్వరిష్ఠుఁడు అని నాల్గుతరగతులు గలవు. వారువారు అధిష్ఠించిన జ్ఞానభూమికలనుబట్టి యీతరగతులు గలుగుచున్నవి.

శుభేచ్ఛ మున్నగు మొదటిమూఁడు భూమికలనుదాఁటి నాల్గవభూమికకు వచ్చిన వానిని బ్రహ్మవేత్తయనియు, ఐదవ భూమికయైన అసంసక్తియనుస్థితికి వచ్చిన వానిని బ్రహ్మవిద్వర్యుఁడనియు, ఆఱవభూమికనున్నవానిని బ్రహ్మవిద్వరేణ్యుఁడనియు, ఏడవభూమికనున్నవానిని బ్రహ్మవిద్వరిష్ఠుఁడనియుఁ బేర్కొనిరి.

బ్రహ్మవేత్తకు ద్వైతభావము బాధితమైనను తత్ప్రతిభాస స్వప్నమునందువలె నుండును. బ్రహ్మవిద్వర్యునకు ద్వైతభావము నిద్రయందువలె భాసమాత్రము గూడ నుండదు. అయినను ఇతనికి నప్పుడప్పుడు వికల్పము గల్గుచుండును. తత్ఫలముగా నితఁడు బాహ్యాముఖుఁడగుచుండును. బ్రహ్మవిద్వరేణ్యునకు బహిర్ముఖత్వము పరప్రేరితంబున నగునేగాని స్వయముగాఁ గాదు. బ్రహ్మవిద్వరిష్ఠునకు స్వయముగాఁగాని పరప్రేరణమునఁగాని జగత్ప్రతిభాసయే గలుగదు. జడభరతుఁ డీవర్గములోనివాఁడు.

### జ్ఞాన-విజ్ఞాన-స్మృతిజ్ఞానంబులు.

ఇంద్రియములచేత విషయంబులను గ్రహించుటయు, లక్షణసామ్యమువలనఁ బదార్థములనూహించుటయు, పరోపదేశమూలకంబుగా విషయనిర్ణయము చేయుటయు మున్నగునవి జ్ఞానమగును. దీనినే లోకజ్ఞానమందురు అట్టి జ్ఞానంబు కేవ

లము శ్రుతమాత్రమేగాక స్వానుభవసిద్ధమైనప్పుడు అది విజ్ఞానమగును. అనుభవసిద్ధమైన విజ్ఞానము దృఢసంస్కారరూపముదాల్చి చిత్తమందు నిల్చియుండి కాలాంతరమున సంకల్పరూపంబునఁ బ్రకటమగును. దానిని స్మృతిజ్ఞానమందురు.

జ్ఞానముగూడ నొకమనోవృత్తియే యగును. పదార్థజ్ఞానమందు వృత్తివ్యాప్తియు ఫలవ్యాప్తియు రెండునుండును. బ్రహ్మజ్ఞానమందు వృత్తివ్యాప్తిమాత్రమే యుండును.

పదార్థజ్ఞానమందు మనోవృత్తి ఫలాకారతను జెందును. పదార్థంబునకు రూపంబుగలుగుటవలన దానినాశ్రయించిన మనోవృత్తిగూడఁ దద్రూపంబును జెందును. బ్రహ్మజ్ఞానమందన్ననో బ్రహ్మమునకు ఆకారమే లేదు గావున బ్రహ్మమునాశ్రయించిన మనోవృత్తిః ఫలాకారత గలుగనేరదు.

జ్ఞానివ్యవహారము—తత్ఫలము.

జ్ఞానివ్యవహారమెల్లఁ బరమేశ్వరేచ్ఛాప్రవర్తితమై స్వాభావికమైయుండును. అనఁగా 'నేను చేయుచున్నాను' అను అహంకారభావమే యుండదు. భగవంతుఁడెప్పుడెట్లు వాని హృదయమందు స్ఫురింపఁజేయునో యప్పుడట్లతని యింద్రియంబులు వ్యవహరించుచుండును. అనఁగా నేనిదికోరి యిట్లు చేయుచున్నాను అనెడి భావమే వానికిఁ గలుగదు. అట్లు పరమేశ్వరప్రేరితమైనను వానివ్యవహారమునకు ఫలము తప్పదు. అది కర్మను నైజము. ఆఫలమేమగునందురా? అది లోకకళ్యాణార్థమగును. ఆకారణంబుననే జ్ఞానులను లోకకళ్యాణప్రదమూర్తులందురు.

### అజ్ఞానివ్యవహారము-తత్ఫలము.

అజ్ఞానివ్యవహారమెల్ల వానిప్రారబ్ధవాసనలచేతఁ బ్రేరితమగుచునుండును. వాసనలు శుభాశుభమిశ్రమంబులు గావున వానికార్యఫలంబులు నట్టివిగానే యుండును. అజ్ఞానియెప్పుడును ఫలార్థియై వ్యవహరించును. కావునఁ దత్ఫలంబులు వానికే చెందుచున్నవి. తత్ఫలభోగార్థము వానికి తత్తదుచితజన్మంబులు తప్పవు. అనఁగా వానికి జననమరణ రూప సంసారము తప్పదు.

గీతాతత్త్వభాగం బింతతోఁ బూర్తియగు నని వచ్చును.

### 2. సాధనభాగము.

నట్టి తత్త్వజ్ఞానమువలన ఫలములేదు. అది స్వానుభవసిద్ధము కావలయును. అట్లగుటకు నుపాయంబు తెలియవలెను. అట్టియుపాయంబును శ్రీభగవానుఁడు గీతలో నేదైనను బోధించెనా ? లేదా ? యను ప్రశ్నవచ్చును. భగవానుఁడు పరమకృపాళుఁడును జగన్మంగళప్రదుఁడును గావున నట్టితత్త్వమును మాత్రమే బోధించి యిన్నకుండలేదు. తత్త్వసాధనమునకు నుపాయంబునుగూడ బోధించెను. దానినే యోగమందురు.

### యోగము.

యోగశబ్దంబునకు నానార్థంబులు గలవు. సంకల్పవికల్పరూపమైన మనోవృత్తి నశించి జీవబ్రహ్మైకసిద్ధిని సాధించుటయే యిచట యోగశబ్దభావము.

ఈ యోగము అనుష్ఠానభేదమునుబట్టి (1) కర్మము

(2) భక్తి, (3) జ్ఞానము అని మూఁడువిధములు. రాజ, ఉపాసన, మంత్రయోగంబులు గూడఁ గలవని కొందఱందురు. ఉపాసనమే భక్తియోగమనియు, మంత్రయోగము భగవన్నామస్మరణరూపమే గావున భక్తియందే యంతర్భావమగు ననియు, రాజయోగము కర్మాదులమూఁటిలోనే యంతర్భూతమగుననియు మొత్తముమీఁద యోగములు మూఁడే యనియు సిద్ధాంతమొనర్చిరి. భక్తియనునది కర్మజ్ఞానంబులకు రెంటికిఁ బ్రధానాంగమే గావున భక్తియోగమనునది ప్రత్యేకము గల్గదనియుఁ గర్మ జ్ఞానములు రెండే యోగంబులనియుఁ గొందఱందురు.

### యోగాంతరములు.

ఇవిగాక లయయోగము, హఠయోగము, త్రాటకయోగము మున్నగు యోగంబులు కొందఱమతానుసారంబుగాఁ గలవు గుండియలు నిరంతరము కొట్టుచుండును. అది వానిస్వభావము. ఆశబ్దమును అనాహతమని యోగపరిభాషలోఁ జెప్పిరి. ఆశబ్దమును అనుసంధానముచేయుట నాదానుసంధానలయయోగమగును. లయయోగమునకే కుండలినీ యోగంబను నామాంతరముగూడఁ గలదు. ప్రాణవాయువును నిరోధించుట, ఏకాసనంబునఁ జిరకాలంబట్లే నిశ్చలనంబుగానుండుట, అవయవబంధనంబొనర్చుట మున్నగునవి హఠయోగమగును. హఠపూర్వకంబుగా నట్లుచేయుదురుగావున దానికి నట్టిపేరు వచ్చెను. ఏదేనొక దానియందు దృష్టినట్లే తెప్పవ్రాల్పక నిలుపుట త్రాటకయోగమగును.

యోగఫలము.

ఎల్ల యోగంబులను విమర్శింపగా వానిఫలము మనో లయమో మనోవిస్తృతియో రెంటనొకటిగాఁ దేలుచున్నది. మనోలయమనఁగాఁ జక్కెరబిళ్ళ నీటియందువలె మనస్సు బ్రహ్మమందు లయించుటయగును. మనోవిస్తృతి యనఁగా మనస్సు దాని సహజసంకుచితభావంబును మాని సర్వమిదం ఖలు బ్రహ్మ అనెడి బ్రాహ్మీభావంబునొందుట యగును. మనోలయయోగమందు మనోవృత్తి సవాసనాపూర్వకంబుగా నశించుచున్నది. బ్రాహ్మీయోగమందు మనోవృత్తి నిర్వికల్పకముగా నుండుచున్నది. గీతయన్ననో బ్రాహ్మీయోగంబునే బోధించుచున్నది. దీనింబట్టి చూడఁగా శ్రీభగవానుని మతంబున బ్రాహ్మీయోగమే మేలని యూహింపనగును.

బ్రాహ్మీయోగసాధనము.

'నేను, నాది' అను భావంబెల్లరకు సామాన్యముగా నుండును. సంకుచితమైనఆభావము క్రమక్రమముగా మాఱి విస్తరిల్లి విశ్వాకారమునొంది తుదకు బ్రాహ్మీభూతమగుటయే బ్రాహ్మీయోగము. విశ్వము బ్రహ్మస్వరూపజ్ఞానంబునకు అపరిచ్ఛిన్నప్రత్యక్షలింగమగును. అందువలన బ్రాహ్మీయోగసాధకులు విశ్వాకారంబును బ్రహ్మప్రతీకంబుగా గ్రహించి తమభావంబు తదాకారవృత్తిని బడయునట్లుగా సాధనము చేయవలయును. ఇది సగుణసాకారబ్రహ్మారాధనంబునకు నుత్తమోత్తమ మార్గంబగును. ఆభావంబునుగూడఁ గ్రమక్రమంబుగా విస్తరింపఁజేసి సగుణనిరాకారబ్రహ్మారాధనంబునకుఁ గడంగవలయును. ఆభావంబును గూడఁ గ్రమక్రమం

బుగా నిరాకార బ్రహ్మాకారవృత్తికిఁ గొనిపోవలయును. ఇది యే బ్రాహ్మీయోగము.

బ్రాహ్మీయోగఫలము.

ఈబ్రాహ్మీస్థితియందు 'నేను, నాది' అనుభావము పోయి సర్వము బ్రహ్మమే యగును. ఆస్థితిలోని వ్యవహారమెల్ల నానందరూపమై యుండును. ప్రతివ్యక్తియు నిట్టిస్థితినిబడసి జీవితవ్యవహారంబును బ్రారబ్ధమైనదానిని నిర్వహింపవలసినదని గీతాశాస్త్రము ఘంటాపథంబుగా మహోపదేశమును గావించుచున్నది. ఈయోగమందెంతభావము గర్భితమైయున్నదో చక్కఁగా విమర్శించి గ్రహింపవలయును.

ఈబ్రాహ్మీయోగమందు ఫలాభిసంధి వాసనామాత్రముగూడ నుండదు గావున దీనిని 'అసంగయోగమనియు' 'నిష్కామకర్మయోగమనియు'ఁ జెప్పఁబడిరి. గీతయందలి యీ విశేషంబునుబట్టియే అది సర్వలోక శరణ్యమగుచున్నది.

నైష్కర్మ్యంబనఁగా లోకమునువదలి అరణ్యగర్భములు దూఱి యవయవంబులను బిగించి భీష్మించి యెట్టిపనియుఁ జేయక మ్రాడువలెనుండుట గాదు. అట్లుండుటయు సాధ్యము గాదు. (3-5) ప్రారబ్ధకర్మంబును స్వధర్మంబనుభావంబుతో ఫలాశారహితముగా నాచరించుట నైష్కర్మ్యంబగును. ఈ రహస్యంబును శ్రీభగవానుఁడు (3-7) లోఁ దెలిపి, అట్టి యోగానుష్ఠానంబునకుఁ దానే మార్గదర్శనని (4-14) లోఁ బ్రకటించెను. భగవంతుఁడు స్వయముగా నాచరించి చూపిన మార్గమునకన్న మేలుమార్గము గలదా ?

### కర్మసన్న్యాసము.

కర్మములనుజేయుచు వానిఫలంబులను గోరకుండుట సాధ్యముగాదనియు, కర్మమునే బొత్తుగావదలుట మేలుగదా యనియుఁ గొందఱు శంకింతురు. కర్మము స్వభావసిద్ధము. శరీరము తోడ స్వభావము పుట్టుచున్నది. శరీరంబున్నంత కాలము దానిస్వభావంబుండక తప్పదు. అట్లు స్వభావసిద్ధమైనకర్మము తనంతట తానే జరుగుచుండును. దానిని నిలుపఁ దరముగాదు. అట్టి ప్రయత్నంబులన్నియు వెఱ్ఱిసేతలేయగును. ఈసంగతిని శ్రీభగవానుఁడు (18-11 లో) స్పష్టీకరించెను. కావునఁ గర్మస్వరూపసన్న్యాసవాదంబునకు నెంతమాత్రబలము గలదో, అట్టిది ధర్మమగునో కాదో గ్రహింపనగును.

### కర్మము—దోషము.

'ఎంతమంచికర్మమైనను దానిని దోషంబంతో యింతో యంటియుండును. ఈసంగతిని శ్రీభగవానుఁడే(18-48)లో నంగీకరించెను. బురదద్రొక్కనేల ? కాలుగడుగనేల ? అన్నట్లు కర్మమును జేయనేల ? పాపంబాడికట్టనేల ? తత్పరిహారార్థము ప్రాయశ్చిత్తాదులొనర్పనేల ?' అను వాదమొకటిగలదు.

దీర్ఘముగా విచారించినచో గుణదోషంబులు కర్మసంబంధములుగావు. అవి కర్తయొక్క బుద్ధిని బట్టియుండును. ఫలాభిసంధియే దోషము ; అదిలేకపోవుటయే గుణము. కోరినను గోరకున్నను గర్మమునకు ఫలము స్వతస్సిద్ధముగదాయని యందురా ? ఆమాట సత్యము. ఫలము స్వతస్సిద్ధమైనను గోరినప్పుడే యది కర్తకుఁ జెందును. కోరఁడేనిఁ గర్మఫలం బేమగునందురా ? అది పరార్థమగును. ఇదే నైష్కర్మ్య

సిద్ధాంతరహస్యము. జ్ఞానులెల్లరు నిట్టినిస్సంగబుద్ధితో వ్యవహరింతురు. ఈమార్గమే యెల్లరకు సేవ్యమగును. ఈతత్త్వంబును శ్రీభగవానుఁడు (18-49 లో) దెలిపి, కర్మసన్న్యాసమనఁగా ఫలసన్న్యాసమగునేగాని స్వరూపసన్న్యాసముగాదని సూచించి, అట్టిసన్న్యాసులెట్లు వర్తించునది (5-8, 9 లలో) వివరించి, స్వభావవిరుద్ధకర్మను బాహ్యదృష్టికి నెంతమంచిదిగాఁ గాన్పించినను, అది శ్రేయోదాయకముగాని సేవ్యముగాని కానేరదనుచు (18-47లో) హెచ్చరించి, సహజకర్మము దోషదూషితంబుగాఁ దోఁచినను దానిని వదలరాదని (18-48 లో) స్పష్టీకరించెను.

లోకకళ్యాణమును గోరుభగవానుఁడు దుష్టకర్మంబుల నంగీకరించునాయని శంకింపవలదు. కర్మముల గుణదోషంబులు బుద్ధినంటియుండును గావున బుద్ధిని జక్కఁజేసికొన్నచో గుణదోషంబులు రెండును గర్తనంటవు. బుద్ధినిఁ జక్కఁజేసికొనుట యనఁగా ఫలమునుగోరకుండుటయే యని భావము. బుద్ధిసంస్కారము ప్రధానమను భావంబుతో శ్రీభగవానుఁడట్లు చెప్పెను.

### కర్మసన్న్యాసము—సముచ్చయవాదము—గీత.

సర్వకర్మంబులనువదలి కేవలాత్మజ్ఞానంబు నాశ్రయించినప్పుడే కైవల్యప్రాప్తియగునని అద్వైతము చెప్పుచున్నదనియు, ఆమాట సరిగాదనియు, శ్రౌతస్మార్తకర్మములను వదలరాదనియు, అట్టికర్మములతోఁ గూడినజ్ఞానంబువలనఁ దక్క మఱియొకటఁ గైవల్యంబు గలుగదనియు, ఇదేభావంబును

గీతాచార్యుఁడు (2-32, 47 ; 4-15) లలో బోధించెననియు, వైదికకర్మంబులు ఒక్కొకవేళ హింసాత్మకంబులు గానున్నను వానిని వదలరాదనియు. దీర్ఘముగా నాలోచించినచో హింసాత్మకముకానట్టి కర్మమే గలుగదనియు, కర్మము హింసాత్మకంబుగాఁ దోచినను అదిస్వధర్మముగునేని దానినిఁ దప్పకచేయవలసినదేయనియు, స్వధర్మాచరణంబెన్నడును దోషముగాదనియు, ఏకారణముచేతనైనను స్వధర్మంబును బరిత్యజించుట పాపంబగుననియు సముచ్చయవాదము.

ఈవాదమందలి ఒక్కొక్కవిషయమును జక్కగాఁ బరిశీలింపవలయును. కర్మములను బొత్తిగావదలవలయునని అద్వైతమెచ్చటను జెప్పదు. మీఁదుమిక్కిలి కర్మానుష్ఠానమునే యద్వైతము బోధించుచున్నది. అట్లు కర్మములను జేయునప్పుడు ఫలాభిసంధిమాత్రము వదలుమని యది గట్టిగాఁ జెప్పుచున్నది.

సముచ్చయవాదులకర్మయోగమునకన్న గీతాకర్మయోగము ఎంతో విరివియైయున్నది. గీతామతప్రకారము యజ్ఞాదులేగాక లోకవ్యవహారమెల్లఁ గర్మమేయగును. సముచ్చయవాదులు చెప్పునట్టి కర్మయోగము ఫలాభిసంధిపూర్వకమా? ఫలాభిసంధి రహితమా? రెండవపక్షమగునేని అద్వైతమునకును సముచ్చయమతమునకును భేదమే గలుగదు. అట్లుగాక మొదటిపక్షమగునేని, అందుజ్ఞానమునకు అవకాశమేమిగలదు? జ్ఞానయోగంబున అభిమానఫలాభిసంధులకే తావులేదు. అవిరెండునున్నచో అది జ్ఞానమే గాదు.

జ్ఞానయోగంబున అభిమానఫలాభిసంధులకు అవకాశం బేల లేదందురా? జ్ఞానయోగంబున బుద్ధి ఏకాగ్రమైయుండును. ఒకవంక ఫలాభిసంధియు ఒకవంక ఫలాభిసంధిరహితము నొక్కనికే ఏకకాలమందే యెట్లుకలుగనేర్చును? ఒకవేళఁ గలుగవచ్చునన్నను, అప్పుడు బుద్ధి రెండుగాఁ జీలి వర్తింపవలసి యున్నది. అట్లు వర్తించుట రెండుపడవలలో రెండుగాళ్ళుంచి యోడయాత్రసేయుటగునుగదా. అంతియగాదు. అట్లుద్వివిధమైనబుద్ధికి ఏకాగ్రతయెట్లు గలుగును? జ్ఞానమునకుఁ బ్రధానాంగమైన ఏకాగ్రత లేనిచో నది జ్ఞానమెట్లగును. అది జ్ఞానముకానిచోఁ గర్మపూర్వక జ్ఞానంబెట్లు కలుగును? అద్దానఁగైవల్యంబెట్లు సిద్ధించును.

### సన్న్యాసము.

ఇది నిరగ్నిసన్న్యాసమనియు, వివిదిషా సన్న్యాసమనియు, విద్వత్సన్న్యాసమనియు మూఁడువిధములు. మొదటిది అంతఃకరణశుద్ధికిని, రెండవది జ్ఞానప్రాప్తికిని, మూఁడవది జీవన్ముక్తికిని సాధనంబులగును.

### హంస పరమహంసలు.

సన్న్యాసులలో హంసులనియుఁ పరమహంసులనియుఁ రెండుతెగలుగలవు. హంసులు మరలఁ గుటీచకులనియు బహూదకులనియు రెండురకములు. తీర్థయాత్రలు చేసి చేసి డస్సిగాని, అవిచేయుటకు శక్తిలేకగాని ఒకచోట మఠమును నిర్మించుకొని యందుండువారు కుటీచకులగుదురు. తీర్థయాత్రాపరులు బహూదకు లనఁబడుదురు.

పరమహంసులలోఁగూడ వివిదిషులనియు విద్వాంసులనియు రెండుతెగలు గలవు. వైరాగ్యాదిసాధనసంపత్తిగలిగి జ్ఞానాపేక్షచేత సన్న్యసించినవారు వివిదిషులగుదురు. వీరి వైరాగ్యము దోషదృష్టిరూపకము. ఈరూపవైరాగ్యమేగాక అపరోక్షమిథ్యాదృష్టిరూపవైరాగ్యముగూడఁ గలిగి జ్ఞానియై జీవన్ముక్తి సుఖార్థము సన్న్యసించువారు విద్వత్సన్న్యాసులగుదురు.

### యోగి—జ్ఞాని.

యోగికి మనోలయమేగాని మనోనాశనము గలుగదు. యోగిసమాధి యట్టిదగుటంజేసి, లయించిన మనస్సునకుఁ బునరావృత్తిగలదు. అందువలన నతఁడు బహిర్ముఖుఁడగును. అనఁగా వానికి ద్వంద్వజ్ఞానము కొంతకుఁగొంత శేషించి యుండును. మఱియు యోగికి ఫలసంకల్పము లేదుగాని కర్మసంకల్పముండును.

జ్ఞానికి మనోనాశనమైయుండునుగావున వానికి విక్షేపము లేదు. అదియే వానిసమాధి; అందుండియే యతఁడు వ్యవహరించు చుండును. మఱియు జ్ఞానికి ఫలసంకల్పము లేదు; కర్మసంకల్పమును లేదు.

### గీతాజ్ఞాని—శంకర—తిలకులు.

గీతాజ్ఞాని ఎట్టివాఁడనువిషయమున శంకరులవారికిని బాలగంగాధరతిలకు గారికిని భావభేదము గాన్పించుచున్నది. శంకరులమతప్రకారము గీతాజ్ఞానికిఁ గర్మము విధ్యుక్తము గాదు; కేవలము ఐచ్ఛికమై యుండును. తిలకుగారిమతప్రకారము గీతాజ్ఞానికిఁ గర్మము లోకసంగ్రహార్థమై విధ్యుక్త

మగును. మఱియు శంకరమత ప్రకారము గీతాజ్ఞానికి సంక ల్పమే గలుగదు ; తిలకుమత ప్రకారము గీతాజ్ఞానికి ఫలాభి సంధి గలుగదుగాని సంకల్పముమాత్రముండును.

### కర్మయోగానుష్ఠానవిధానము.

ఈ నిష్కామకర్మయోగం బొక్కనాఁటితోఁ దీఱదు. దానిని యావజ్జీవపర్యంతముఁ బాటింపనగును. ఈయనుష్ఠా నంబునకు అభ్యాసము, వైరాగ్యము అనునవి ముఖ్యాంగకం బులు. (6-35) అనుకూలంబుల నభ్యసించుట అభ్యాసయోగ ము ప్రతికూలంబులఁ ద్యజించుట వైరాగ్యయోగము. మ త్కర్మకృత్ (11-55 ;) మన్మనాభవ (18-65); సర్వధర్మాన్ (18-66) అనుచోట్ల అభ్యాసయోగవిధానంబును, యత్కరోషి (9-27) చేతసా సర్వకర్మాణి (18-56) అనుచోట్ల వైరాగ్య యోగవిధానంబును బ్రతిపాదింపఁబడినవి.

### యోగాంగములు—వానిఫలములు.

ఈయోగంబునకు 'యమ, నియమ, ఆసన, ప్రాణా యామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు' అని ఎనిమిది యంగములు గలవు. యమము అనఁగా ఋజువర్తనము; నియమమనఁగాఁ బద్ధతి. ఈరెంటివలన అవయవ వ్యవహారశుద్ధి గలుగును. ప్రాణాయామము. ఇది వాయువును బీల్చుట, పూరించుట విడుచుటగా నుండును. వీనినే యోగపరిభాష యందు రేచక పూరక కుంభకంబులందురు. ప్రాణాయామ ము వలన నాడీశుద్ధియుఁ బ్రాణాయామకోశశుద్ధియుఁ గలుగు ను. ప్రత్యాహారమనఁగా ఇంద్రియములను బాహ్యవ్యా

పారంబులనుండి మరలించుట యగును. దీనివలన నింద్రియ వ్యాపారము అంతర్ముఖమగును. ధారణఅనఁగా మనుస్సు నొక్క-దానియందే నిలుపుట; దీనివలన బుద్ధిఏకాగ్రమగును. ధ్యానమనఁగా ఏకాగ్రమైనబుద్ధిని ధ్యేయము వంకఁ దైల ధారవలె నవిచ్ఛిన్నముగా పఱచుటయగును. దీనివలనఁ దదాకారవృత్తి కలుగును. సమాధియనఁగా ధ్యానగతమైనబుద్ధిని అందే నిలుపుట; దీనివలన శాంతి గలుగును. ఈయమాదులను సక్రముగా ననుష్ఠింపనివారికి యోగసిద్ధియే గలుగదు. కావునయోగసిద్ధిని గోరువారు వీని నెల్ల బహుశ్రద్ధాభక్తులతో నాచరింపవలయును.

### ధారణ — ఆలంబనములు.

ధారణయనఁగా మనుస్సును ఏదేనొకదానియందు నిలుపుట అని చెప్పబడెను. అట్లు నిల్పుటకు నేదేనొకటి యుండవలయును. దానినే ఆలంబనమని యోగపరిభాషలోఁ జెప్పిరి. అవి వారివారి రుచులంబట్టియు యోగ్యతలనుబట్టియునుండును.

ఈ యాలంబనంబులు అంతరంగములనియు బహిరంగములనియు రెండు విధములు. శరీరమందు మూలప్రదేశము మొదలు శిరోభాగములోపల ఏడుస్థానములు గలవు. వానిని యోగపరిభాషలోఁ జక్రంబులనియుఁ గమలంబులనియు వచింతురు. మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ, సహస్రారము అని వానికిఁ బేళ్లుపెట్టిరి. ఆత్మశక్తి యాస్థానంబుల నుండును. ఆచోట్లను ఆలంబనముగాఁ గొని ధారణచేయుట అంతరంగ సాధనమగును.

శరీరబహిర్భాగంబున నుండునట్టి హరిహరదేవీమూర్తు లను ఆధారముగా గ్రహించి ధారణచేయుట బహిరంగసాధ నమగును. జ్యోతిరాదులను, త్రికూటిని, అనాహతధ్వనిని, ఓంకారంబును వీనినిగూడ నాలంబనంబులుగాఁ గొని ధారణచే యుట గలదు.

హఠయోగులు కొందఱు షట్చక్రంబులను ధారణచే యునప్పుడు ఆయాచక్రంబులను అధిష్ఠానదేవతలను ఆలంబన ముగాఁగొని ధారణ చేయుట గలదు. మూలాధారంబునకు గణేశుఁడును, స్వాధిష్ఠానంబునకు బ్రహ్మయు, మణిపూరంబున కు విష్ణువును, అనాహతంబునకు రుద్రుఁడును, విశుద్ధంబునకు నీశ్వరుండును, ఆజ్ఞకు సదాశివుండును, సహస్రారంబునకుఁ బర బ్రహ్మము అధిదేవతలందురు. ధారణాయోగంబునకు నెల్ల రును సమర్థులుగారనియు ఎవఁడు ప్రాణవాయు సంచారంబు ను కుంభకముచేత నిరోధింపఁగలఁడో యతఁడు మాత్రమే సమర్థుఁడనియు హఠయోగభావము. ధారణాశక్తిని మిక్కు టంబుగా సంపాదించుటకై కొందఱు ఖేచరీముద్రా యోగంబు నభ్యసింతురు. చిఱునాల్కనుజీల్చి జిహ్వాగ్రముచేత జిహ్వా మూలరంధ్రంబును బిగించి వాయుప్రచారంబును నిరోధించు ట ఖేచరీముద్రయగును.

ఎవని పూర్వసంస్కారంబులు మాలిన్యంబులో వానికి ధారణాశక్తి కష్టసాధ్యమగును. అవి శుద్ధములైనవానికి ధా రణాశక్తి సులభసాధ్యమగును ; అవి దుష్టంబులైనచో వానికి ధారణాశక్తి సిద్ధింపనే సిద్ధింపదు.

వ్యవహారంబులను దగ్గించుటయు, మౌనంబాచరించుటయు ధారణాశక్తికి వృద్ధికరములగును. ధారణాయోగమందు మనస్సునకు ఏకాగ్రవృత్తి మాత్రముండును ; తక్కినవృత్తు లుండవు.

#### సమాధాన — నిదిధ్యాసన — ధారణలు.

ఈమూఁడింటికిగలభేదము మిక్కిలి సూక్ష్మముగా నున్నది. మూఁటియందు మనోవృత్తిగలుగును. అది ఏకాగ్రముగా నుండును.

#### ధ్యానము.

వైరాగ్యాదులఫలంబుగా మనస్సు అంతర్ముఖమై ఏకాగ్రముగా 'అహంబ్రహ్మాస్మి' అనెడి వృత్తితో నుండును. ఆవృత్తిని బ్రహ్మమందే నిలుపుట ధ్యానమగును.

#### సమాధి.

అట్లు మనస్సు ధ్యానగతమై బ్రహ్మమందే నిల్చినను, అప్పుడప్పుడు అది బహిర్ముఖమగుట గలదు. అట్లగుటను యోగపరిభాషలో వ్యుత్థానమనిరి. అట్టి విక్షేపంబును నిరోధించి ధ్యేయమందే నిరంతరముండుట సమాధి యగును.

#### ధారణ — ధ్యాన — సమాధులు.

ఈమూఁటియందును మనోవృత్తి గలదు. ధారణయందది ప్రవాహరూపంబునను, ధ్యానమందు వ్యుత్థాన నిరోధరూపంబునను, సమాధియందు ఏకాగ్రముగా స్థిరముగా నుండును. ఈఏకాగ్రతయనునది ధారణాధ్యానంబులందుఁ బ్రయత్నపూర్వకంబుగా నుండును ; సమాధియందది అప్రయత్న సిద్ధమగును.

### సమాధి భేదములు.

సమాధియనునది అంతస్సమాధియనియు, బహిస్సమాధి అనియు రెండు విధములు. అందొక్కటొక్కటియు సాలంబనము నిరాలంబనము అని ద్వివిధము. ఈ సాలంబన నిరాలంబనంబు లొక్కొక్కటి మరల సవికల్పము నిర్వికల్పము అని రెండు రకములు. వీని యర్థము స్పష్టము.

### సవికల్ప—నిర్వికల్పములు.

ఈ రెంటియందు ఆనందము గలుగును. అయినను సవికల్పమందలి యానందము జ్ఞాతృజ్ఞానజ్ఞేయంబులనెడి త్రిపుటి యొక్క భావముతోఁ గూడియుండును. త్రిపుటి అనెడి ఉపాధి యందుఁ గలదు గావున దీనిని సోపాధికంబనిరి. నిర్వికల్పమందు త్రిపుటీభావమే గలుగదు. ఇందుఁ త్రిపుటి అను ఉపాధి లేదు గావున దీనిని నిరుపాధికంబనిరి.

సవికల్పంబునకు సంప్రజ్ఞాతంబనియు, నిర్వికల్పంబునకు అసంప్రజ్ఞాతమనియు నామాంతరములు గలవు. త్రిపుటీజ్ఞానము ఉండుటంబట్టి సంప్రజ్ఞాతమనియు, అది లేమింజేసి అసంప్రజ్ఞాతమనియు వానినామంబులు సార్థకంబులు.

సవికల్పసమాధికి త్రిపుటీజ్ఞానము ఆలంబనమగును; మఱియు నందు వాసనలును వానివికల్పంబులు నంతోయింతో శేషించియుండును. దానంజేసి దానిని సబీజసమాధియనియు నందురు. నిర్వికల్పకము నిరాలంబము; అందు వాసనలు దగ్ధబీజప్రాయములై యుండును గావున మరల నంకురింపఁజాలవు. దానంజేసి వికల్పాదులకు నందు అవకాశమే లేదు. వాసనలు

దగ్ధబీజప్రాయంబులు గావున దానిని నిర్బీజసమాధి యనిరి. ఈసమాధియందు జన్మరాహిత్యమనుటకు నిదియే, అనఁగా వాసనలు మరల నంకురింపలేమియే కారణము.

అంతర్భేదములు.

సవికల్పము మరల సవితర్కము, నిర్వితర్కము సవిచారము, నిర్విచారము, సానందము, అస్మిత అని యాఱు తెఱంగులు.

నిర్వికల్పము ఆంతరము బాహ్యము అని ద్వివిధము. అందు ఆంతరము మరల అంతర్నిర్వికల్పకంబనియు, అంతర్దృశ్యానువిత్సవికల్పకంబనియు, అంతశ్శబ్దానువిత్సవికల్పకంబనియు మూఁడువిధములు. బాహ్యముగూడ అట్లే బాహ్యనిర్వికల్పకంబనియు, బాహ్యదృశ్యానువిత్సవికల్పకంబనియు, బాహ్యశబ్దానువిత్సవికల్పకంబనియు మూఁడు విధములు.

అంతర్నిర్వికల్పసమాధి మరల అసాక్షాత్కారమనియు సాక్షాత్కారమనియు రెండువిధములు. అసాక్షాత్కారసమాధికి అద్వైతభావనారూపసమాధి యనియు, సాక్షాత్కారసమాధికి అద్వైతావస్థారూపసమాధియనియు నామాంతరములు గలవు.

విచారపూర్వకంబుగా అద్వైతచింతనము గలిగినప్పుడు తత్ఫలముగా బ్రహ్మము ఏకము అద్వితీయము అనునిశ్చయము గలుగును. అయిన నయ్యది పరోక్షభావముగానే యుండును. దానంజేసి అది అసాక్షాత్కారమనిరి. మహావాక్యంబును గురుముఖంబునవిని, యావిన్నది శ్రవణమననాది పూర్వకంబు

గా స్వానుభవసిద్ధమై బ్రహ్మాత్మైక్యరూపమైన అపరోక్షజ్ఞానము గలిగినప్పుడు దానిని సాక్షాత్కారమనిరి. మొదటిదానియందు బ్రహ్మభావనయుండును; రెండవదానియందట్టి భావనయే యుండదు. అనఁగా మొదటిదానియందు అంతఃకరణవృత్తి భావనామాత్రముగానైన నుండును. రెండవదానియందు వృత్తియేయుండదు. ఈరెండవదే జ్ఞానభూమికలో నేడవదని కొందఱందురు.

ఆఱువిధములైన యీసమాధుల ననుష్ఠించి నిర్వికల్ప సమాధినిష్ఠుడైన యోగిని గుణాతీతుఁడనియు, భగవద్భక్తుఁడనియు, అతివర్ణాశ్రమియనియు బ్రాహ్మణుఁడనియు వచింతురు. అంతటివాఁడుమాత్రమే వర్ణాశ్రమంబులను ద్యజింపనర్హుఁడగును గాని యన్యులుగారు.

* గీతయందచ్చటచ్చట సమాధి గుణాతీతశబ్దంబులు గలవుగావున వానినిందుఁ గొంతకుఁ గొంత వివరించుటయ్యెను.

### యోగసమాధి—వేదాంతసమాధి.

సమాధివిషయంబున యోగమతంబునకును వేదాంతమతంబునకును గొంతభేదము గాన్పించుచున్నది. మనస్సు-ఆత్మ ఇవిరెండును బ్రత్యేకంబులనియు, మనోనిరోధముచేత సమాధి సిద్ధించుననియు, ఆనందానుభవమే సమాధిఫలంబనియు, యోగమతము చెప్పుచున్నది. సర్వము బ్రహ్మమే యనియు, ఆత్మయన్నను బ్రహ్మమన్నను ఒకటే యనియు సర్వము ఆత్మయేయన్నప్పుడు ఆత్మతప్ప మఱొక్కటియుండుటకే అవకాశము లేదనియు, ఆత్మవేఱు మనస్సువేఱు అన్నప్పుడు ఆత్మకన్నభిన్న

మైనది వేఱొకటి గలదనుట సిద్ధాంతమగుననియు, ఆసిద్ధాంతము మూలసూత్రంబునకు అనగా 'సర్వమిదంఖల్విబ్రహ్మ' అను దానికి విరుద్ధమగుననియు, ఈవిరుద్ధాంశము యుక్తికిగాని అనుభవంబునకుఁగాని నిలువదనియు, సర్వము బ్రహ్మమే యన్నప్పుడు మనస్సుగూడ బ్రహ్మమే యగుననియు, మనస్సు అను ప్రత్యేకపదార్థము కలదనిగాని దానికిఁ బత్యేకావస్థయున్నదనిగాని భావించి, అట్టిమనః ప్రచారంబులందు దృగ్దృశ్యభేదంబులను జూచుట అజ్ఞానకార్యమేగాని వేఱుగాదనియు, యోగసమాధియందు మనోలయము గాఢనిద్రారూపంబగుననియు, అది సమాధిఫలము కానేరదనియు, అభిమానము వశించి అపరోక్షానుభూతి గలిగి శాంతినొంది దృశ్యమెల్ల బ్రహ్మమేగాని తద్భిన్నముగాదను భావంబుతో నుండుటయే సమాధిఫలంబనియు వేదాంతమతము చాటుచున్నది. అనఁగా బ్రహ్మతత్త్వజ్ఞానపూర్వకంబుగా వ్యవహరించుట సమాధిఫలంబగును గాని గాఢసుషుప్తి యందువలె మనోవృత్తిలయరూపసుఖంబు లనుభవించుట సమాధిఫలము గాదనియుఁ దాత్పర్యము. ఈభావంబునే శ్రీకృష్ణభగవానులు 'బ్రహ్మార్పణం' అను (4-24) లో బోధించెను.

### సమాధి—వృత్తివిస్మరణము.

వేదాంతవిచారమువలనఁ గలిగిన 'అహంబ్రహ్మాస్మి' అనెడి అంతఃకరణవృత్తి ఎల్లసాకారపదార్థంబులను వదలి యంతర్ముఖమై బ్రహ్మప్రకాశమందు లయించునేని అదిసమాధి యగును. బ్రహ్మానందానుభవార్థము అంతఃకరణవృత్తి మహోత్కటమై సమస్తసాకారనిరాకార పదార్థంబులను వదలి

యంతర్ముఖమైనను తర్వాత ఏమిసేయనగునో దోఁపక మూర్ఛిల్లినట్లు తటస్థస్థితినుండుట వృత్తివిస్మరణంబగును.

### సమాధి—సుషుప్తి.

ఈ రెంటియందును బాహ్యావృత్తులుండవు. అంతర్వృత్తి గూడ సషుప్తి యందుండదు. సమాధియందు అది ధ్యేయపరమై యుండును.

### నిర్వికల్పసమాధి—నిదిధ్యాసనము.

మొదటిదానియందు మనోవృత్తి ఎప్పుడును బ్రహ్మాకారమై యుండును. రెండవదానియందు అది బ్రహ్మాభావనారూపంబున నుండును. అనగాఁ ద్రిపుటీసహిత సవికల్పసమాధిని నిదిధ్యాసనమనియు, త్రిపుటీరహితమైనదానిని నిర్వికల్పసమాధి అనియుఁ జెప్పుదురు. పైకారణంబున నిదిధ్యాసనవంతుఁడు బద్ధుఁడేయగును. బద్ధుఁడగుటంజేసి వానికిఁ బునర్జన్మముగలదు. రెండవవాఁడు ముక్తుఁడుగావునవానికి జన్మాదులు లేవు. నిదిధ్యాసనమందు బ్రహ్మసాక్షాత్కారము లేదు. నిర్వికల్పసమాధినే సాక్షాత్కారమనిరి.

### సాక్షాత్కారవంతుని లక్షణంబులు.

ఇతని లక్షణంబులను గూర్చి శ్రీభగవానుఁడు గీతలో నిట్లు తెలిపెను.

'యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥
సుఖమాత్యంతికం యత్తత్ బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్,
వేత్తి యత్ర నచైవాయం స్థిత శ్చలతి తత్త్వతః ॥

యం లబ్ధ్వా నాపరంలాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥
తం విద్యాద్దుఃఖ సంయోగవియోగం యోగసంజ్ఞితమ్,
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణ చేతసా ॥
(6-20 to 23)

### సుఖానుభవము—వేదాంతము.

సుఖమనఁగా నేమి ? అది యెట్లువచ్చును ? అని యడుగుట గలదు. అట్లడుగువారిదృష్టి యెట్టిదని విచారించినచో, భోగించువాఁడు భోగ్యవస్తువు ఇవిరెండునుగలవనియు వానికిఁ బరస్పరసంబంధమున్నదనియు వారివిశ్వాసమైనట్లు స్పష్టపడును. భోక్తృభోగ్యవస్తుసంబంధమునే అద్వైతంబంగీకరింపదు. అట్టివానికెల్ల ద్వైతమం దాశ్రయము గలదు. సారాంశమేమందురా ? విషయివిషయసంయోగసుఖంబు సుఖంబేగాదనియు, అది ప్రథమంబున సుఖాభాసంబుగాఁ దోఁచిననుఁ దుదకు దుఃఖమేయని యనియు, వీనినెల్లవదలి ఆత్మానందంబనుభవించు టొక్కటే సుఖమనియు అద్వైతతాత్పర్యము. దానినిఁబడయు మార్గమునే గీతబోధించుచున్నది. గీతచెప్పినమార్గమునఁ దక్క మఱియొక్కట నది సిద్ధింపదు.

### సమాధి—అంతరాయములు.

సమాధికై ప్రయత్నించునప్పుడు కొన్ని యంతరాయములు గలుగును. అవి (1) లయము. (2) విక్షేపము. (3) కషాయము. (4) రసాస్వాదనము అని నాల్గుగానున్నవనిరి. శ్రీభగవత్పాదులవారి మతప్రకారము 1. అనుసంధానభంగము. 2. ఆలస్యము. 3. భోగేచ్ఛ. 4. భయము. 5. నిద్ర.

6. కల్పన. 7. చిత్తచాంచల్యము. 8. శూన్యత అని ఎనిమిది అంతరాయములు గలవు.

అంతరాయ కారణంబులు—తన్నివృత్తిమార్గములు.

1. నిద్రవచ్చుట లయము. అజీర్ణము, భుక్తాయాసము, దీర్ఘప్రయాణము, జాగరణము - ఇవి నిద్రాకారణంబును వీనిని నివారించుకొనుటవలన లయరూపమైన యంతరాయము తొలఁగును.

2. వాసనల యొత్తిడిచేతఁ జిత్తము బాహ్యాగతమగుట విక్షేపము. విచారశక్తివలన నిది తొలంగును. ఈవిచారము బాధదృష్టి, దోషదృష్టి, మిథ్యాదృష్టి అని మూఁడువిధములు. బాహ్యప్రపంచమే లేదనుట బాధదృష్టిరూప విచారమగును. పరాన్వర్థఁబులకు నింద్రియపర్వతమే మూలమనుట దోషదృష్టివిచారమగును. బాహ్యప్రపంచము గానవచ్చుచున్నను అది యసత్యమని భావించుట మిథ్యాదృష్టి విచారమగును.

3. లయవిక్షేపంబులను దాఁటిననుఁ జిత్తము గాఢధ్యానపరమగుటకుఁ దిరస్కరించుచుండును. దీనినిఁ గషాయ మందురు. ఇంద్రియార్థములమీఁది రాగమే యిందులకుఁ గారణము. ఈరాగము అంతస్థమై యుండువాసనల ఫలముగాఁ గలుగుచున్నది. ఈస్థితిలోఁ జిత్తము ఏకాగ్రముగా నుండవచ్చును గాని దానిదృష్టియెల్ల రాగరూపమై యింద్రియార్థపరంబుగా నుండును. చిత్తము ఏకాగ్రమైనంతనే సమాధిగాదు సుమా.

ఈరాగము 1. మనోరాజ్యరూపంబనియు, 2. బాహ్య

రూపంబనియు, 3. అంతరమనియు, మూఁడు విధములు. గొంతెమ్మకోరికలతో సంతసించుచుండుట మనోరాజ్యరాగమగును. భార్యాపుత్త్రాదిబాహ్యవస్తువులను భావించునేని అది బాహ్యరాగమగును. అది గడచినవానిఁగూర్చియో రాఁబోవువానింగూర్చియో తలంపసాగునేని అంతరరాగమగును.

ఈయంతరాయమును దొలఁగించుకొనుటకై విక్షేపంబునకుఁ జెప్పిన యుపాయంబులే సాధనములగును.

4. ఈమూఁటిని దాఁటినప్పుడు సవికల్పసమాధి అగును. అందు ఆనందము గలిగినను, దానిని దాననుభవించుచున్నాననెడి జ్ఞానముండును. దీనినే రసాస్వాదనమందురు. ఈయంతరాయము తొలఁగుటకు నిర్వికల్పసమాధియే పరమసాధనము. నిర్వికల్పసమాధియందు రసాస్వాదనజ్ఞానమే యుండదు.

నిర్వికల్పసమాధి నొందుటకు ఏడుమెట్లు గలవు. వానిని భూమికలందురు. జ్ఞానభూమికలే యాభూమికలు. వానింగూర్చి యింతకుమున్నే వివరము గలదు.

## బ్రాహ్మీస్థితి.

సవికల్పసమాధియందు గోరంతైనను సాత్త్వికాహంకారము శేషించి యుండును. జ్ఞానభూమికలలో నొక్కొక్కదానిని దాఁటుకొలఁది క్రమక్రమముగా నయ్యహంకారము సన్నగిలిపోవును. ఏడవభూమికకు వచ్చినప్పుడు తుష్టిగలుగును. తుష్టినే ఆప్తకామత్వంబనియు, ప్రాప్తప్రాప్యంబనియు వచించిరి. ఆస్థితియందుఁ బరమశాంతి చేకూఱును. దానినే అనఁగా

నట్టి శాంతితోనుండుటయే బ్రాహ్మీస్థితి యనిరి. ఈభావంబునే
'విహాయకామాన్ యః సర్వాన్ పుమాన్ చరతి నిః స్పృహః,
నిర్మమో నిరహంకారః స శాంతిమధిగచ్ఛతి ॥
'ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి' అని
శ్రీభగవానుఁడు (2-71,72)లో వివరించెను.

ఈస్థితిలో వాసనాక్షయము మనోనాశనమునై ఆత్మ
జ్ఞానము ప్రకాశించుచుండును. ఈమూఁడు నొండొంటి నా
శ్రయించి యున్నవి గావున నవి ఏకకాలమందే సిద్ధించునుగాని
ఒకదానివెంట మఱియొకటి గలుగుటలేదు.

### వాసనలు—వానిక్షయము.

వాసనలు శుభములనియు అశుభములనియు రెండువిధ
ములు. అవి వారివారిపూర్వకర్మములంబట్టి వచ్చును. అశుభవా
సనలను దద్వ్యతిరేకవాసనలను వృద్ధిచేయుటవలన నశించును.
శుభవాసనలు మేలుగూర్చునవే యైనను బ్రాహ్మీస్థితికి నట్టి
వాసనలుండరాదు గావున వానినిగూడఁ దొలఁగింపవలయును.
వానిని దొలగించుటకు జ్ఞానమొక్కటే సాధనము.

### మనస్సు.

మనస్సు అనఁగానేమి ? అనుప్రశ్నగలదు. జీవులు
గర్మములను గావించుచుందురు. ఆకర్మములకు ఫలంబును
ఫలానురూపమైనవాసనలును బుట్టుచుండును. ఇది కర్మము
లకు నైజము. ఫలము భుక్తమైగాని నశింపదు. ఫలభోగార్థ
ము శరీరము తప్పదు. శరీరముతోడ నయ్యది భోగింపవలసిన

ఫలవాసనలుగూడఁ జేరుచుండును. ఆవాసనల సముచ్ఛయం బునే అంతఃకరణంబనిరి. ఆయంతఃకరణము దానివ్యవహారం బునుబట్టి బుద్ధియనియు, మనస్సు అనియుఁ జిత్తమనియు వ్యవ హరింపఁబడుచున్నది.

మనోనాశనము.

మనోనాశనమనఁగా మనస్సు దానివ్యవహారంబును మానుట యని భావము. అది స్వరూపనాశనమనియు, అ రూపనాశనమనియు రెండువిధములు. స్వరూపనాశనమందు రజస్తమస్సులు నశించి సత్త్వముమాత్రము శేషించియుండును. అందువలన సత్త్వగుణములైన మైత్రి, కరుణ మున్నగునవి దానికి నుండును. ఆసత్త్వముగూడ నశించునేని అరూపనాశ మగును.

ఎవనియందు రాగద్వేషములును అహంకారమమకారం బులును క్రోధమోహంబులును గలుగునో, ఎవని యింద్రియం బులు ఇంద్రియార్థవశములుగావో వానికి మనోనాశనమైనట్లు గ్రహింపవలయును. ఈమనోనాశనమునుగూర్చి గీత (2-55 to 58) లలో వివరించుచున్నది.

మనోనాశనమైనందులకు ముఖ్యమైనగుర్తు ఏమనఁగా బాహ్యపదార్థములు సామాన్యులకువలె మనోనాశనమైన వానికిని గోచరించుచున్నను వానిఅంతఃకరణము తత్పదార్థాకా రంబును దాల్పదు. అనఁగా వానియంతఃకరణము వృత్తి రహితమైయుండును. సామాన్యులసంగతి యట్లుగాదు. పదార్థ స్పర్శ తగిలినంతనే వారిమనోవృత్తి తత్పదార్థముయొక్క ఆకా

రమును దాల్చును. అట్లు మనస్సు పదార్థాకారంబును దాల్చినప్పుడే యావస్తువు గోచరించుచున్నది.

### మనోనాశనము—ముక్తి.

ముక్తి అనఁగానేమో వివరింపఁబడెను. ఈముక్తి విదేహముక్తియనియు, జీవన్ముక్తియనియు రెండువిధములు. మనస్సు అరూపనాశనమొందినప్పుడు విదేహముక్తియగునని కొందఱందురు. ఈవిషయమై మతాంతరములు గలవు. వాసనాక్షయమనోనాశనంబులు జీవన్ముక్తికి నవసరంబులుగావనియు, జీవన్ముక్తి సుఖంబును గోరువానికిమాత్రమే యవి యవసరంబులనియుఁ గొందఱు వచింతురు.

### జపము.

జపమనఁగా నొకదానిని నిరంతరము స్మరించుటయని భావము. నిరంతరమనుట ఏలయందురా ? విస్మృతి గలుగకుండుటకే యని గ్రహింపవలయును. జపమునకు ఆలంబన వస్తువుండవలయును. అది వారివారి రుచులంబట్టియుండును.

ముక్తినిగోరువారు అందులకుఁదగినలక్ష్యమును గ్రహింపవలయును. ముక్తియనఁగా బ్రాహ్మీభావమేయగుటంజేసి, అట్టిభావంబును పెంపొందించుటకు సామాన్య లక్ష్యములు చాలవు. ఆలక్ష్యము బ్రహ్మప్రతీకముగా నుండవలయును. అట్టిదానిని లక్ష్యముగాఁగొని జపించుచుండినగాని, అంతఃకరణము తదాకారంబు నొందదు. అట్లగుటకు ప్రణవము ఉత్తమోత్తమ లక్ష్యమగుననియు, అదియే బ్రహ్మప్రతీకమనియు వచింతురు.

### ప్రణవతత్త్వము.

ప్రణవమనఁగా ఓంకారము. అది సర్వశబ్దంబులకును సర్వ భాషలకును దల్లిగానున్నది. పంచాక్షరాదిసమస్తమంత్రజాలము ప్రణవగర్భితంబులగును.

### ప్రణవవైశిష్ట్యము.

పరబ్రహ్మమునకు రూపముగాని నామముగాని గలుగవు. ఏలయందురా? అది యిట్టిదని చెప్పఁ దరముగాదు. ఏలయందురా? ఏది యింద్రియంబులకు గోచరమగునో దానిని జూచుటగాని దానికిఁ బేరుబెట్టుటగాని సాధ్యమగును. బ్రహ్మము ఇంద్రియగోచరముగాదు గావున వానికి రూపనామంబులు గలిగింప సాధ్యముగాదు. రూపనామంబులు లేనిది లక్ష్యముగానేరదు. ముక్తిసిగోరువారు ఎట్లయినను బ్రహ్మభావమును బడయక తప్పదయ్యెను.

ఇవియెల్లఁ బరికించి బ్రహ్మభావసిద్ధికిఁ బ్రణవంబొక్కటే సమర్థమని నిశ్చయించి దానినే బ్రహ్మప్రతీకముగా గ్రహించిరి.

'ఓమ్' అనునట్టి యీప్రణవాక్షరమందు, అకార, ఉకార, మకారంబులును అర్థమాత్రయుఁ గలవు. అకారంబు స్థూలప్రపంచంబును, ఉకారము సూక్ష్మప్రపంచంబును, మకారము కారణప్రపంచంబును దెలుపును. ఈమూఁడు ప్రపంచంబుల సమిష్టిరూపము సాకారబ్రహ్మమగును. దానికి అర్థమాత్రను చేర్చినచోఁ దురీయమగును. అదే నిరాకార నిర్గుణబ్రహ్మము. ఈభావంబుతోఁ బ్రణవజపంబును జేయవలయును.

ఓంకారము పరబ్రహ్మనామంబగుట శ్రీభగవానుఁడు సయితము 'ఓంతత్సత్' అను (17-23) చోట సూచించి యున్నాఁడు. మఱియు శివమహిమ్నములో

'త్రయీం తిస్రో వృత్తీ స్త్రిభువనమథో త్రీనపి సురా౯,
అకారాద్యైః వర్ణైః త్రిభిరభిదధత్ తీర్ణవికృతి,
తురీయం తే ధామ ధ్వనిభి రవరుంధానమణుభిః,
సమస్తం వ్యస్తం త్వాం శరణద గృణాత్యోమితి పదమ్' అను

శ్లోకమందుఁ బ్రణవమాహాత్మ్యంబు వివరింపఁబడియున్నది.

## జపవిధానము.

జపమనఁగా మంత్రంబును జిలుకపలుకులవలె నుచ్చరించుటగాదు. ఆమంత్రమునకు లక్ష్యమైన వస్తువునందు బుద్ధిని నిలిపి తద్వస్తుగుణంబులను భావించుచు, ఆగుణంబులు తమయందు నిలుచునట్లు సంకల్పించుచు జపింపవలయును. బ్రహ్మమునకుఁ బ్రణవము ప్రతీకముగా గ్రహించినప్పుడు బ్రహ్మస్వరూపంబును అనఁగా అనంతత్వము, శుద్ధత్వము, పరిపూర్ణత్వము సచ్చిదానందత్వములు - వీనిని భావగతంబులొనర్చికొనుచు జపింపవలయును. అట్లు చేయుచు రాఁగా, జాపకుఁడు భ్రమరకీటన్యాయంబున లక్ష్యవస్తుస్వరూపంబును దాల్చును. ఇదే జపవిధానమందలి రహస్యము. అట్లు చేసినప్పుడే జపము ఫలకారియగును. ఇది చక్కఁగా గ్రహింపవలయును.

## ప్రణవోచ్చారణభేదములు.

ఈ యుచ్చారణము ఏకమాత్రకాలము, ద్విమాత్రకాలము, త్రిమాత్రకాలము అని మూఁడువిధములు. మొద

టిదానిని హ్రస్వప్రణవంబనియు, రెండవదానిని దీర్ఘప్రణవంబనియు, మూఁడవదానిని ప్లుతప్రణవంబనియుఁ జెప్పిరి. ఆ యుచ్చారణము పదునాఱుమాత్రలకాలమైనదగుచో అది విరాట్ప్రణవంబగును.

### ప్రణవశక్తులు.

హ్రస్వప్రణవము కల్మషంబులనెల్ల హరించును; దీర్ఘము ముక్తినిచ్చును; ప్లుతము సిద్ధుల నొసంగును.

### ప్రణవ జపవిభాగములు.

ప్రణవజపంబు - సోహం జపమనియు, శివోహం జపమనియు తత్త్వమసి జపంబనియు మూఁడు విధములు. మొత్తముమీఁద ఇవియెల్ల నొక్కటే యగును. ప్రణవజపంబు ముక్తికి సాక్షాత్సాధనంబనియు, ఉపాసనానిష్కామకర్మాదులు పరంపరాసాధనంబులనియుఁ జెప్పిరి.

### జపకాలము.

ప్రాతఃకాలంబున 4-6 గంటలమధ్యను, రాత్రి 8-10 గంటలమధ్యను గల కాలము జపంబునకు నుత్తమంబనిరి. జపమునకు గాలనియతిలేదనియు, ఎప్పుడు చిత్తసమాధానము గలుగునో అప్పుడెల్ల జపింపవచ్చుననియు మతాంతరము. మొత్తముమీఁద జపంబునకుఁ జిత్తసమాధానము ప్రధానము. విక్షేపాదులు గలుగకుండుటయే చిత్తసమాధానమగును. పైనిఁ జెప్పినకాలంబులు రెండు సామాన్యంబుగా శబ్దరహితములై యాకారణంబున శబ్దరూపవిక్షేపంబును జిత్తమునకుఁ గలిగింపవు గావున, ఆరెండుకాలంబుల నుత్తమమనిరి. ఈకాలనియతి యన్ననో సామాన్యులకేయని గ్రహింపవలయును.

## చిత్తశుద్ధి.

చిత్తశుద్ధి గలుగకున్నచో జపము ఫలకారిగాదు. 'చిత్త శుద్ధిలేని శివపూజ' లను సామెత గలదుగదా. చిత్తశుద్ధి అనఁగానేమి ? చిత్తమును అజ్ఞానావరణము తమశ్శక్తిఫలమైనది చుట్టియుండును. అది తొలఁగుటయే చిత్తశుద్ధి యగును. అజ్ఞానావరణంబు తొలంగుచే తడవుగా జ్ఞానదీపిక యథాగతి ప్రకాశించును. తత్ఫలముగా వస్తువు స్పష్టమగును. చిత్తము ఆవస్తువునందు ఏకాగ్రవృత్తి నిల్చును. ఇచ్చట వస్తువనఁగా భగవంతుఁడే యని గ్రహింపవలయును. భగవంతుఁడప్పుడు తనవంక నేకాగ్రమతితోనున్న చిత్తమునకుఁ బ్రతిబంధకంబు లెవ్వియేని యున్నయెడల వానినెల్లఁ దొలగించును. (18-58) తత్ఫలముగా జీవుఁడు భగవచ్చింతా సంపూర్ణుఁడును నిరంతర ప్రసన్నాంతరంగుఁడును ఆశారహితుఁడునై, సుఖదుఃఖాది ద్వంద్వంబులెల్లఁ బ్రారబ్ధదేహధర్మంబులగుటయు వానిని సహించి తీఱవలసినది విధియగుటయు గ్రహించి, వానివంక బుద్ధిని మరలింపక ఉపేక్షాపరుఁడై, భగవంతుఁడు సర్వభూతాంతర్వర్తియగుట స్వానుభవపూర్వకంబుగా గ్రహించును. (18-54). దీనినే పరాభక్తి యందురు. పరాభక్తికి బ్రహ్మభూతస్థితి అవధియగును. అది వానికి సిద్ధించును. తత్ఫలముగా, భగవంతుఁడన నెట్టివాఁడో, భగవత్స్వరూపజ్ఞాన ఫలమేమో వానికి స్పష్టమగును. (18-55). తత్ఫలముగా వానికి భగవదైక్యము అనఁగా బ్రాహ్మీస్థితి గలుగును. దీనినే అద్వైతసిద్ధి యనిరి. (18-55). ఇదే సర్వవేదాంతసారము. ఇదే గీతామృతము.

ధ్యేయము.

పరాభక్తియననేమో పైనిఁ జెప్పఁబడెను. పరాభక్తి గుదురుటకుఁ బూర్వము సామాన్య భక్తి గలుగవలయును. భక్తియనఁగాఁ భగవంతునియెడఁ బరమప్రేమయని యొకరును, ఈశ్వరునియందుఁ బరానురక్తియని యొకరును, ఆత్మతత్త్వానుసంధానమని యొకరును, స్వస్వరూపానుసంధానమని యొకరును నిర్వచించిరి.

మొత్తముమీఁద భక్తిసేయుటకు ఆలంబనంబొకటి యుండవలయుననుట సిద్ధము. అట్టియాలంబనంబునే ధ్యేయమందురు. ధ్యేయమనఁగా ధ్యానింపఁదగినదని భావము. ధ్యేయంబులు వ్యక్తంబులనియు, అవ్యక్తంబులనియు రెండువిధములు. అవ్యక్తంబునకు రూపనామంబులు గలుగవు. అందువలన నయ్యది యింద్రియగోచరముగాదు. ఇంద్రియగోచరముగాని వస్తువునందు సామాన్యులకు మనస్సు నిలువదు. కావున వ్యక్తమునే అనఁగా రూపనామంబులు గలదానినే సామాన్యముగా ధ్యేయమునకు గ్రహింతురు. అవ్యక్తనిష్ఠ కష్టసాధ్యమనియు. వ్యక్తనిష్ఠ సులభమనియు, సామాన్యులకు వ్యక్తనిష్ఠయే శ్రేయస్కరమనియు శ్రీ భగవానులుగూడ (12-5)లో నుడివిరి.

ఏనిష్ఠకైనను భావము ప్రధానము. ఏభావముతో అవ్యక్తనిర్గుణనిష్ఠ జేయుదురో, అదేభావంబుతో వ్యక్తసగుణనిష్ఠనుగూడఁ జేయుదురేని పర్యవసానంబున ఫలంబొక్కటే యగును. నిర్గుణనిష్ఠను జేయునప్పుడు భగవంతుఁడు అపరిచ్ఛిన్నుఁడును సర్వవ్యాపియు నిత్యుఁడు అనుభావంబుండును. అదే

భావంబును సగుణనిష్ఠయందుఁగూడ నుంచవలయుననియు, సంకోచభావంబులుండఁగాదనియు సారాంశము. ఏలయందురా ? ధ్యానఫలమేమి ? ధ్యేయతత్త్వంబును బొందుటయేగదా. ధ్యేయము పూర్ణమైనదిగానిచో, తన్నిష్ఠవలనఁ గలుగు ఫలంబును అట్టిదేయగును. (7-23) మతియెంతో గతియంతేయన వినమా? పూర్ణంబును అపూర్ణంబుగా భావించినంతనే పూర్ణమునకు నెట్టిలోటు గలుగదుగాని ధ్యాతకుమాత్రము లోటు తప్పదు.

## ద్వివిధబ్రహ్మము.

మోక్షార్థులకు నుత్తమోత్తమధ్యేయము పరబ్రహ్మమేయని చెప్పఁబడెను. ఆబ్రహ్మము జ్ఞేయబ్రహ్మమనియు, ధ్యేయబ్రహ్మమనియు రెండువిధములు. జ్ఞేయబ్రహ్మము నిర్గుణబ్రహ్మమగును ; ధ్యేయబ్రహ్మము సగుణబ్రహ్మమగును. ఈసంగతి మున్నే సూచింపఁబడెను. నిర్గుణబ్రహ్మము గుణములు లేమింజేసి జ్ఞానయోగ్యమగునేగాని ధ్యానయోగ్యముగాదు. అందువలన నిర్గుణబ్రహ్మధ్యానం బెవ్వనికిగాని ఎవ్విధిచేతనైనను ఘటిల్లదు.

## సగుణబ్రహ్మద్వైవిధ్యము.

సగుణబ్రహ్మము కారణబ్రహ్మమనియుఁ గార్యబ్రహ్మమనియు రెండువిధములు. కేవల మాయావిశిష్టబ్రహ్మము కారణబ్రహ్మమనఁబడును. బ్రహ్మము వానిశక్తియైనమాయ నధిష్ఠించి సృష్టికిఁ గారణం బగుచున్నాఁడను భావంబుతోఁ జూచినప్పుడు కారణబ్రహ్మమగును. కారణబ్రహ్మమునే ఈశ్వరుఁడనిరి. ఈకారణబ్రహ్మధ్యానము సామాన్యముగాఁ గుదురదు. అనేకజన్మపుణ్యవిశేషంబునను భగవత్కృపవలన

నది గలుగఁబోలు. కావుననే కారణబ్రహ్మ ధ్యానాధికారి మిక్కిలి దుర్లభమనిరి.

ఎల్లరకును గార్యబ్రహ్మమే ధ్యేయముగానున్నది. ఈ కార్యబ్రహ్మమన్ననో కారణబ్రహ్మమైన యీశ్వరుని అవతారమేగాని యొండుగాదు. అందుచేతనే అవతారమూర్తులను వారివారి రుచిప్రకారము ఆలంబనముచేసి ధ్యానింతురు.

సుగుణబ్రహ్మధ్యానంబునకు విశ్వరూపము (లింగాకారము) ఉత్తమోత్తమధ్యేయాకారంబగును. ఏలయందురా? దానికి మొదలు తుదలు లేవు; కావున అఖండమును బూర్ణమునై యున్నది. అట్లుండియు దానికి రూపనామంబులు గలవు గావున నింద్రియగోచరమగుచున్నది. ఈ కారణంబులను బట్టి అది నిర్గుణబ్రహ్మమునకుఁ గేవలసామీప్యస్థితిలోనున్నది. అందువలన దానినుత్తమోత్తమ ధ్యేయమనిరి.

అందులకుఁ జాలనివారు భగవదవతారరూపంబులను గ్రహింపవచ్చును. అవతారరూపంబులుగూడ నెన్నడో యంతరించుటంజేసి యిప్పుడు కంటియెదుట నుండుట లేదనియుఁ, గన్నార చూడనిరూపంబును భావించుటయు దానియందు మనస్సును నిలుపుటయు నెట్లు పొసగునని శంకింపవచ్చును. అట్లగునేని ఆయ్యవతారముల ప్రతిమలను గ్రహింపవచ్చును. అది విగ్రహారాధనము గాదాయని యందురా ? ధ్యానమునకు భావము మాత్రమే ప్రధానముగాని రూపము ప్రధానము గాదు. ఇదేధ్యానమందలి పరమరహస్యము. ఇట్లుచేయవచ్చునని శ్రీభగవానుడు (12-9) లో సూచించియున్నాఁడు.

ఆలంబనమున్నంతకాలము మనోనాశనము గలుగదు. అది బీజమాత్రముగానైన నుండును. ఆమనోవృత్తి స్థూలమైనచో దానిగమ్యస్థానము స్వర్గలోకమే యగుననియు, దానిని మించిపోవుటకు దానికి శక్తిలేదనియు, స్వర్గలోకంబులకుఁ జన్న వారికిఁ బునరావృత్తి గలదనియు శ్రీ బాదరాయణమహర్షి భావము.

## ప్రతిమారాధనము.

ప్రతిమారాధనము భగవదపచారకార్యంబుగాఁ గొందఱు భావించుచున్నారు. ఆకారణంబునఁ బ్రతిమారాధకు లెందఱో ఖండఖండాంతరంబులందు శిరచ్ఛేదనాదులకు నయితము పాలైరి. ప్రతిమారాధనతత్త్వమేమో, అది యెవరికిఁ జెప్పఁబడెనో యెఱుంగనేరక హ్రస్వబుద్ధులు పలుపోకలు పోవుట యెంతయుఁ జింతాకరమగును.

## ఈశ్వరతత్వము.

ప్రకృతియన్నను మాయయన్నను ఒకటేయగును. మాయ యనగా నీశ్వరశక్తియని చెప్పబడెను. ఈమాయయనునది సత్వరజస్తమోగుణంబుల ముప్పిరి త్రాడుగానున్నది. మాయాకార్యమన్నప్పుడు ఈగుణముల వ్యవహారమేయగును. ఈగుణములవ్యవహారమే కర్మమగును. ఆకర్మఫలమే సృష్టియనఁబడును. ఈప్రణాళికను గీతబోధించుచున్నది. దీనింబట్టిచూడఁగా సృష్టియెల్ల మాయకట్టుబాటునకుఁ జిక్కి, అదిగీఁచు గీఁటును దాఁటనలవిగాక యున్నదని స్పష్టమగును. అనఁగా సృష్టికి మాయయే రాజగును. ఆపక్షంబున నీశ్వరుఁడుండియు ఫలమేమి? అధికారహీనుడైన యీశ్వరు నారాధించి ఫలమేమి?

అశక్తుడేమి మోక్షమీయగలడు? ప్రకృతినే యారాధింపవల దా? అని శంకింపవచ్చును.

ఈమాయ అనునది ఈశ్వరసంబంధమై తద్వశవర్తియై నడిగా నున్నదేగాని తద్భిన్నమై ప్రత్యేకవ్యక్తిగా లేదు. ఈశ్వరుడు మాయాత్మికమైన యీప్రకృతికి బహిరంతరంబుల రెంటనున్నాడు. (13-10). ఈశ్వరసాన్నిధ్యంబునఁ బ్రకృతి వ్యవహరించుచున్నది. దానికి స్వతంత్రశక్తి లేదు. (18-61).

ఈశ్వరుఁడనెడి విశ్వకర్మ ప్రకృతియనెడి యంత్రమును నడుపుచుండును. ప్రకృతి యథాగతి నడుచునంతకాలము దానిగమనమును ఈశ్వరుఁడు సాక్షిమాత్రుఁడై చూచుచుండును. ఆయంత్రము వక్రగతిఁద్రొక్కినప్పుడు దానిని మరలించును; చెడినప్పుడు చక్కఁజేయును; అది చక్కఁబాటునకుఁ గూడ సాధ్యముగానప్పుడు దానిని వదలివైచి మఱియొకయంత్రము నధిష్ఠించి దానిని నడుపును. ఈభావము (16-19) లో స్పష్టము. కావున నీశ్వరుఁడు సర్వస్వతంత్రుఁడు. వానినే ఆరాధింపవలయును.

### అవతారము.

ఈదిద్దుబాటునే ధర్మసంస్థాపనమనిరి. అట్లు ధర్మసంస్థాపనార్థమై భగవంతుఁడు రూపముదాల్చి వచ్చినప్పుడు ఆరాకను అవతారమనియు, అట్లు వచ్చినవ్యక్తిని అవతారమూర్తి యనియు వచించిరి. అవతారమనఁగాఁ బైనుండి క్రిందికివచ్చుట యని యర్థము. అనఁగా అవ్యక్తము వ్యక్తమగుట యని తాత్పర్యము. ఈయవతారంబులును దేశకాలపాత్రాదులం

బట్టి అంశావతారమనియు అంశాంశావతారమనియు అవతార మనియు పేర్కొందురు. (4-7, 8).

యంత్రమెట్లో ప్రకృతియునట్లే యప్పుడప్పుడు పాటవము తప్పుచుండును. ప్రకృతియున్నంతకాలం బిది తప్పదు. దానిని జక్కసేయుపనియు నీశ్వరునకుం దప్పదు. అందువలన నవతారంబులకు నంతముగాని వానికర్మమునకు విరతిగాని గలుగదు. (4-9).

## సృష్టి గ్లానికిఁ గారణము.

భగవచ్ఛక్తియొక్క కార్యమైనసృష్టికి గ్లాని యెట్లుగా నోపునని శంకింపవచ్చును. జగత్తుయొక్క స్థితికిఁ బ్రవృత్తినివృత్తి ధర్మంబులు రెండును గారణంబులగుననియు, ఈధర్మంబుల రెంటిని వారివారి యోగ్యతలప్రకారం బనుష్ఠించునంతకాలము జగత్తు చక్కగా వర్తించుచుండుననియు, అట్లుగాక వానినుపేక్షించినచో జగత్స్థితికి హానివచ్చుననియు, అట్టి యుపేక్షకు అవివేకము అజ్ఞానంబును గారణంబులగుచున్నవనియు, ఎంతపదను గలకత్తియైనను గొంతకాలంబునకుఁ ద్రుప్పుపట్టినట్లుగా, వివేకవిజ్ఞానంబులుగూడ దీర్ఘకాలంబునకు సన్నగిలుచుండుననియు, సృష్టికిఁ జ్యూతిగలుగుటకు నిదేకారణంబనియు శ్రీశంకరభగవత్పాదులవారు వారిగీతాభాష్యముయొక్క ఉపోద్ఘాతమందు వివరించిరి.

## అవతారము—శుద్ధబ్రహ్మము.

అవతారమనఁగాఁ గ్రొత్తగాఁ బుట్టివచ్చుటగాదు. చంద్రుఁడు తూర్పుదెస నుదయించుటవలె నవతారతత్త్వమని భాగ

వతారంబు ఈభావంబు నెంతో గంభీరముగా రమ్యముగా వచిం
చెను. అవతారంబులకును శుద్ధబ్రహ్మమునకును ముఖ్యభేద
ములు గలవు. శుద్ధబ్రహ్మము నిరపేక్షవ్యాపకము ; అవ
తారము సాపేక్షవ్యాపకము. శుద్ధబ్రహ్మమునకు లక్షణంబు
లైన సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, స్వాతంత్ర్యాదులు వానియందు
నిత్యసిద్ధములు. అవి అవతారములందు శిక్షణరక్షణాద్యవస
రంబులందు మాత్రమే వ్యక్తమగుచుండును.

### అవతారపూరుషులు—సామాన్యపూరుషులు.

సామాన్యపూరుషులు వారివారి ప్రకృతి అనఁగా కర్మ
విశేషంబునకు లోఁబడి పుట్టుచుఁ జచ్చుచు నుందురు. (18-40)
అవతారపూరుషులు ప్రకృతినధిష్ఠించి, అనఁగాఁ గర్మబద్ధులు
గాక స్వేచ్ఛానుసారులై వచ్చుచుఁ బోవుచు నుందురు. (4-6)
సామాన్యుల శరీరంబులు వారిపుణ్యపాపంబులకు నధీనంబులును
పంచభూతకార్యంబులునై యున్నవి. అవతారపూరుషుల
శరీరంబులు సాధుజనపుణ్యఫలంబుగా రచితంబులగుచున్నది.
సామాన్యపూరుషులకు అవిద్యగలదు ; తత్ఫలంబుగా వారికి
దేహాదులైన యనాత్మపదార్థంబులందు నేను, నాది అనునట్టి
యధ్యాసము గలుగుచున్నది. అవతారపూరుషులకు అవిద్యగాని
యట్టియధ్యాసముగాని లేవు. సామాన్యపూరుషులకు వారిపుణ్య
పాపకర్మఫలంబుగా నుత్తరజన్మంబులు గలుగుచున్నవి. అవతార
పూరుషులకు నట్టికర్మములును లేవు ; ఉత్తరజన్మంబులును
లేవు. సామాన్యపూరుషులశరీరంబులు పూర్వపుణ్యపాపఫలం
బులు గావున వానికి సుఖదుఃఖంబులు తప్పవు. అవతార
పూరుషుల శరీరంబు లట్టివిగావు గావున వానికి సుఖదుఃఖాదులు

గలుగవు. సామాన్యపూరుషుల జీవులకు అవిద్య ఉపాధిగా నున్నది ; అది మలినసత్త్వము గలదగును. అవతారపూరుషుల జీవులకు మాయ ఉపాధిగానున్నది ; అది శుద్ధసత్వము గలది. సామాన్యపూరుషుల జీవులకు అవిద్యాకృత భ్రాంతి గలదు ; అవతారపూరుషుల జీవులకు మాయాకృత సర్వజ్ఞత గలదు. సామాన్యపూరుషులయొక్క జీవులకుఁగల భ్రాంతి ఉపదేశజన్యజ్ఞానంబున నశించును. రెండవవారియెడ భ్రాంతియే లేదు గావున వారికి జ్ఞానాపేక్షయే గలుగదు.

### భగవంతుఁడు—లోకజ్ఞానము.

భగవంతుఁడు లోకానుగ్రహార్థమై యవతరించి దుష్టశిక్షణ శిష్టరక్షణంబులు గావించుచు లోకములో వర్తించుచున్నను లోకము అజ్ఞానకారణంబున వానిని గ్రహింపలేకున్నది. అహాహా ! లోకమాఢ్యం బెంతయనవలయునో గదా ! (9-11).

### అజ్ఞానభూమికలు.

అజ్ఞానమనఁగా విపరీతజ్ఞానమని మున్నే చెప్పఁబడెను. ఈయజ్ఞానంబునకు ఏడు భూమికలు గలవు. వానిని బిందు జాగ్రత, జాగ్రత, మహాజాగ్రత, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రత, సుషుప్తి అని పేర్కొనిరి. బిందుజాగ్రతను బీజజాగ్రతమనియు నందురు.

ఈయేడు భూమికలు నొండొంటితోఁ గలసియుండును. సగుణబ్రహ్మమునుండి చిదాభాసచేతనము, అనఁగా జీవుఁడు కలుగుచున్నాఁడు. ఆజీవుఁడు మొదట బిందురూపంబున, అనగా

బీజరూపంబున నుండును. అట్లు బీజమైనజీవునియొక్క ప్రథమావస్థను బిందుజాగ్రతయనిరి. ఆజీవునకు నేను, నాది అను భావంబులు వెనువెంటనే సూక్ష్మంబుగా నంకురించుచున్నవి. ఆ స్థితిని జాగ్రతయనిరి. నేను అనుభావంబును అహంకారమనియు, నాది అనుభావంబును మమకారమనియుఁ బేర్కొనిరి. ఆయహంకార మమకారంబులు జన్మంబులెత్తుకొలఁది దృఢమగుచుండును. ఆస్థితిని మహాజాగ్రతయనిరి. అజీవుఁడు వానికిఁదెలిసిన విషయంబులను గూర్చిగాని, దెలియని విషయంబుల గూర్చిగాని గొంతెమకోరికలుగోరుచు మింటనిల్లుకట్టఁ జూచును. ఆస్థితిని జాగ్రత్స్వప్నమనిరి. జీవుఁడు వాని నిద్రాకాలంబున లక్షోపలక్షలవిషయంబులఁ గూర్చి కలువరించి మేల్కాంచినంతనే యాకలలను జ్ఞప్తికిఁ దెచ్చుకొని దలంచును. ఆస్థితిని స్వప్నమనిరి. ఎన్నడోగడచినవానిని జ్ఞప్తికిఁదెచ్చికొనుట స్వప్నజాగ్రత యనిరి. స్వప్నవిషయంబులను జ్ఞప్తికిఁ దెచ్చికొనుచున్నపుడు అవియెల్ల నిద్రావస్థలో జరిగినవనెడిభావము జీవునకు నుండును. ఎన్నడో జరిగినదానిని జ్ఞప్తికిఁదెచ్చికొనునప్పుడిట్టి భావంబుండదు. స్వప్నమునకును జాగ్రత్స్వప్నంబునకు నిట్టితారతమ్యము గలదు. గాఢనిద్రావస్థను సుషుప్తి యనిరి.

### అజ్ఞానముఁ బోఁగొట్టుకొనుటకు శుశ్రూష ముఖ్యము.

అజ్ఞానము తొలంగుటకుఁ బెక్కు మార్గంబులు గలవు. ఆమార్గములలో నెవరికేదియుక్తమో సులభముగా నిశ్చయింపరాదు. కాదని మూర్ఖించి తోఁచినదారి ద్రొక్కుదురేని ఆదారిలోనున్న మిట్టపల్లంబులు తెలియక పడి చెడుదురు.

కావున సేవనికి నేమార్గంబు యుక్తమో గ్రహించి యాచరించుట ముఖ్యము. అట్లు యుక్తాయుక్తంబులఁ దెలిసి తగుమార్గంబును జూపువానిని గురువందురు. అతను చెప్పినమార్గంబున నడచుటయే శుశ్రూషయగును. ఈభావంబును శ్రీ భగవానుఁడు (4-34) లో నుపదేశించెను.

### గురువులు.

గురుపదవికి నెల్లరుఁ దగరు. కావునఁ గన్నవిన్నవారినెల్ల నాశ్రయింపరాదు. గురువు సాక్షాత్పరబ్రహ్మమంతటివాఁడుగా నుండవలయు. ఈభావంబును 'గురుర్బ్రహ్మ' అనునది సూచించును. ఎవఁడు శిష్యుని యజ్ఞానకారణంబును గ్రహించి దానినిఁ బోకార్చి వానికి జ్ఞానోత్పత్తియగుపర్యంతము శ్రమించునో, శిష్యునిమేలే తనమేలుగా నెవఁడు భావించునో, అట్టి సర్వజ్ఞుఁడును బరమకారుణికుఁడునైనవాఁడే గురుపదవికి నర్హుఁడని శ్రీభగవానులు (18-72) లో గట్టిగాఁ దెలిపిరి. గురువువిషయమై శ్రీశంకరభగవత్పాదులవారుగూడ 'శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిత్తమః॥ బ్రహ్మణ్యుపరతః శాంతో నిరంధన ఇవానలః, అహేతుకదయాసింధు ర్బంధురానమతాం సతామ్'అని తెలిపిరి. ఇన్నిగుణంబులుగలవాఁడే నిక్కమైన గురువగును. అట్టివాని శుశ్రూషయే ఫలకారి యగును.

ఈగురువులు బ్రహ్మశ్రోత్రులనియు, బ్రహ్మనిష్ఠులనియు ద్వివిధము. వినికిడివలనఁగాని శాస్త్రపఠనమువలనఁగాని బ్రహ్మతత్త్వంబును గ్రహించినవాఁడు బ్రహ్మశ్రోత్రియగును.

వానిజ్ఞానము పరోక్షజ్ఞానమగును. అతఁడు బ్రహ్మమును గూర్చి శాస్త్రార్థమునుమాత్రమే తెలుపనేర్చును. బ్రహ్మతత్త్వంబును స్వానుభవసిద్ధముచేసికొనినవాఁడు అనఁగా అపరోక్షజ్ఞాని బ్రహ్మనిష్ఠుఁడగును. అతఁడు బ్రహ్మమునుగూర్చి స్వానుభవంబును బోధించును.

## శాస్త్రము.

అట్టి గురువు కోరినప్పుడెల్ల లభించుట దుస్తరము గావున నంతటివాఁడు దొరకువఱకు మిన్నకుండవలయునా ? అను శంక గలుగవచ్చును. అట్టి గురువు దొరకనిన్నాఁడు వారు లోకోపకారార్థము స్వానుభవంబును వ్రాసి వెల్లడించియుందురు. దానినే శాస్త్రమందురు. అట్టి శాస్త్రంబును బఠించి తత్త్వమును గ్రహింపవచ్చును. ఆశాస్త్రము గురువుయొక్క పరోక్షమైన యుపదేశమేగదా. గురుజనప్రాప్తి గలుగువఱకు శాస్త్రమును బ్రమాణముగాఁ గొని యందుచెప్పినట్లు వర్తిపవలయునని శ్రీభగవానుఁడు గూడ (6-24) బోధించుచున్నాఁడు.

## ప్రమాణము.

ప్రమాణములు. 1. ప్రత్యక్షము. 2. అర్థాపత్తి 3, ఉపమానము. 4. శబ్దము, 5. అనుమానము, అని పంచవిధములు. ప్రతిశరీరమందు నొక్కొక్కయాత్మకలదనియు, ఆ కారణంబుననే నీవు, నేను అనుభేదము ప్రసిద్ధమనియుఁ బల్కుదురు. దీనినే ప్రత్యక్షప్రమాణమందురు. నీవు, నేను అను భేదవచనంబులు శరీరభేదంబును సూచించునేగాని శరీరాంతరమైన యాత్మ భేదమును సూచింపవు. అట్లుగాక యావచనం

బులు ఆత్మభేదంబును సూచించునందు రేని, నేను బాలుడను, నేనుతరుణుఁడను, నేను వృద్ధుఁడను అని యొక్క వ్యక్తినిగూర్చి చెప్పినప్పుడు, ఆవ్యక్తికి బాల్యమందొక యాత్మయుఁ దారుణ్యమందొక యాత్మయు, వార్ధక్యంబున నొకయాత్మయు నుండి నట్లంగీకరింపవలయునుగదా ? ఇది యెవరికి నంగీకారముగాదు. నేను బాలుఁడను మున్నగునవి యవస్థారూపమైన విశేషణభేదంబులను దెల్పుచు, సకలావస్థలందు నున్నది ఒక్కయాత్మయే గాని భిన్నభిన్నంబులైన యాత్మలుగావని తెల్పునట్లుగా, నీవు నేను అన్నప్పుడుగూడ అవి శరీరభేదంబును దెల్పునేగాని యాత్మభేదంబును దెల్పుటగాదు. భిన్నభిన్నావస్థలందు ఆత్మగూడ వేఱువేఱగునేని ఒకయవస్థయందలి వ్యవహారముయొక్క స్మృతి మఱియొక యవస్థయందు గలుగనేరదు. అనుభవంబట్లుగాదు. కాఁబట్టి ఆత్మ యనేకమనుటకుఁ బ్రత్యక్షప్రమాణమే లేదు.

ఆత్మ వేఱుగానిచో నీవు నేనను వ్యవహారమే సిద్ధింపదనియు నీవు నేనను భేదవ్యవహారముండుటవలన ఆత్మభేదము నంగీకరింపవలయుననియుఁ జెప్పుదురు. దీనిని అర్థాపత్తిప్రమాణమందురు. ఒక్కశరీరమందే తల, మొలమున్నగునట్టి యవయవభేదవ్యవహారము గలదు. అంతమాత్రాననే శరీరంబులు పెక్కులగునా ? కావున నీవు నేననెడి వ్యవహారసిద్ధిని నమ్మి యాత్మకు ననేకత్వంబును సాధింపఁ దరముగాదు. కాఁబట్టి యాత్మభేదవిషయంబున అర్థాపత్తి ప్రమాణము సాగదు.

శరీరంబులు వేర్వేఱుగాఁ గానవచ్చుచున్నవనియు, ప్రతిశరీరమందును నేను, నేను అను ప్రతీతిగలదనియు, దీనిఁ

బట్టి యాత్మ యనేకమని యూహింపవచ్చుననియుఁ బల్కుదురు. దీనివి ఉపమాన ప్రమాణమందురు. రూపభేదమును బట్టి శరీరంబులకు నానాత్వము గలుగుచున్నది. అంతమాత్రాననే శరీరాంతరమైన యాత్మకుఁ గూడ నానాత్వము గలుగదు. శరీరనానాత్వంబునుబట్టి యాత్మనానాత్వంబును సాధింతురేని, ఒక్కశరీరమందే స్థూలసూక్ష్మకారణ శరీరంబులు గలవు. అప్పుడు స్థూలశరీరమందలి యాత్మవేఱనియు సూక్ష్మశరీరమందలి యాత్మ వేఱనియుఁ జెప్పవలసివచ్చును. ఇది యంగీకరింపరు. కాఁబట్టి ఆత్మనానాత్వసాధనంబునకు ఉపమాన ప్రమాణము పొసఁగదు.

ఆత్మ ఒక్కటేయైనచో ఎల్లయుపాధులలోనుండునది అయ్యాత్మయేయైనచో ఒక్కనికి సుఖమోదుఃఖమో గల్గినప్పుడు ఎల్లరకు నొక్కసారిగా సుఖమో దుఃఖమో గలుగవలదా యనియు, ఒక్కఁడు జ్ఞానియైనచో ఎల్లరును జ్ఞానులే కావలదా యనియు, ఇది యనుభవవిపరీతమనియు, దీనింజేసి యాత్మ నానాత్వము సిద్ధించుచున్నదనియు వచింతురు. దీనిని అనుమాన ప్రమాణమందురు.

సుఖదుఃఖాదులు శరీరసంబంధములేగాని యాత్మసంబంధములు గావు. ప్రారబ్ధవశంబున నవి యాయాశరీరంబునకు నాయాకాలంబులందు దత్తద్విధంబునఁ గలుగుచుండును. శరీరంబులు భిన్నంబులనియే యంగీకరించితిమి. శరీరంబులు భిన్నంబులైనప్పుడు ఒకశరీరంబునకుఁ గలుగు సుఖదుఃఖాదులు వేఱొకశరీరంబునకుఁ గలుగనేరవు.

జ్ఞానము బుద్ధికార్యము, బుద్ధియన్ననో యుపాధిని బట్టి యుండును ; ఉపాధియో ప్రారబ్ధకర్మఫలంబగును. ఉపాధిని బట్టి బుద్ధియు, బుద్ధినిబట్టి దానివృత్తియు నుండుటంజేసి, ఉపాధి భేదంబున బుద్ధిభేదంబును, దానిభేదంబునఁ దద్వృత్తిభేదంబును దప్పవు. ఈకారణంబున జ్ఞానంబొక్కరూపమైనదైనను ఎల్ల బుద్ధులందు నేకవిధంబునఁ బ్రకాశింపనేరదు. కాఁబట్టి అనుమానప్రమాణబలంబున ఆత్మనానాత్వమును సాధింపఁదరము గాదు.

దేవగంధర్వ మనుష్యాదిభేదంబులను శ్రుతిపురాణాదులు దెల్పుచున్నవనియు, శ్రుతులంబట్టి ఆత్మయనేకమని సిద్ధించుచున్నదనియు వచింతురు. దీనిని శబ్దప్రమాణమందురు. దేవగంధర్వాదిభేదములు ఉపాధిభేదములేగాని అందున్నయాత్మభేదములు గావు. కావున శబ్దప్రమాణంబున ఆత్మనానాత్వము సిద్ధింపదు.

### ఆచారము.

'శాస్త్రపఠనంబునకుఁ దగిన విద్యాబుద్ధులుండవలయును. అవి యెల్లరకును గలుగవు. ఒకవేళ విద్యాబుద్ధులున్నను శాస్త్రంబులు ఒకరీతిగాఁ బలుకుటలేదు. శాస్త్రంబులందలి పరస్పరభేదంబులు పాఠకులకు సందేహంబులనేగాక విపరీతజ్ఞానంబునుగూడఁ గలిగించుటగలదు. అట్టిస్థితిలో నేమిచేయవలయును ?' అను శంక గలుగవచ్చును అట్టి శంకకు నవకాశంబుండరాదనియు, ఎల్లరకు సులభమైనత్రోవఁ జూపవలయుననియు భావించి, పెద్దలత్రోవను ద్రొక్కినడువుమని (3-31) బోధించెను. అట్లునడుచుటే ఆచారమగును.

ఆత్మార్పణము.

ఎవరు పెద్దలో, ఎవరు కారో తెలిసికొనుట కష్టమనియు, వారివీరినడవడిని నమ్మి యదే యాచారముగా నాచరించుట యందుఁ బ్రమాదమున్నదనియు, మందబుద్ధులకు నిట్టిచిక్కు త్రోవలు దగవనియు, ఏదేనొక మార్గంబును బరమసౌకర్యమైన దానినొకటి భగవంతుఁ డుపదేశింపరాదా అనియు శంకించువారు గలరు. అట్టిశంకగూడ దీఱుటకై మహాసౌకర్యమును సారభూతమునైన మార్గంబును గీతాసారంబునెల్ల నొడిచి శ్రీభగవానుఁడు (18-65) లో నుపదేశించెను. ఆత్మార్పణమే ఆయుపదేశము. ఎన్నియోగంబులభ్యసించినను, ఎన్ని జపంబులుచేసినను దుదకు ఆత్మార్పణము చేయకున్నచో మోక్షము సిద్ధింపదు. ఆశ్లోకంబు జ్ఞాపకార్థమిచట నుదహరింపఁబడుచున్నది. దాని నెన్నడును మఱవరాదు.

'మన్మనాభవ, మద్భక్తో, మద్యాజీ, మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసిమే॥ (18-65)

ఈభావంబును శ్రీభగవానుఁడు బాసచేసి చెప్పుచున్నాఁడు. దీనిమహిమ యెంతో యూహింపనగును.

అట్లు సర్వాత్మార్పణముచేసినఁ జాలునా? స్వధర్మాదుల నాచరింపవలదాయను శంక గలుగవచ్చును. అట్టిశంకను నివారించుటకై

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ॥

(18-66) అని భగవానుఁడు సర్వలోకంబులకు ఘంటాపథంబుగాఁ జాటెను. ఇఁక సందేహంబులేల?

ధర్మంబులను వదలుమన్నప్పుడు విపరీతాభిప్రాయము చేయరాదు. ధర్మాధర్మంబులెల్ల మనఃకల్పితంబులనియు, వానియునికి మనోవ్యాపారమున్నంతవఱకే యనియు, ఎప్పుడు మనస్సు భగవదర్పితంబగునో అప్పుడు దానివ్యాపారంబులెల్ల భగవత్ప్రీతంబులై యుండునే గాని స్వేచ్ఛాధీనంబులు గానేరవనియు, ఆస్థితిలో మనస్సునిల్పి యుండుటయే బ్రాహ్మీస్థితి యనియు, అట్టిస్థితిలోనివారి వ్యాపారంబులెల్ల ధర్మనిబద్ధములై లోకకళ్యాణార్థముగా నుండుననియు భగవంతుని భావము.

దుష్కృతులు.

'అంతో యింతో సుకృతమున్నంగాని భగవంతునియెడ నాసక్తియు, దానితోడ భగవంతునివంక బుద్ధిమరలి వాని తత్త్వంబును గ్రహించుతలంపును, దానితోడం బెద్దలసేవ మున్నగునవి గలుగవు. లోకములో దుష్కృతులెందఱో గలరు. వారిగతియేమి ? అనుశంక గలుగవచ్చును. ఎంతపాపాత్ములైనను వారియందు గోరంతయేని సుకృతము తెలిసియో తెలియకయో చేసినది గలుగకమానదు. అట్లుగాదేని వారికి నరజన్మమేగలుగదు. అట్టి సుకృతము దానిఫలకాలమందు వారి చిత్తంబును భగవంతునివంకకు నించుకసేపు త్రిప్పకమానదు. అది యవకాశముగా భగవంతుఁడు వారి నాకర్షించి వారికి మంచిమార్గము చూపుచున్నాఁడు. నమస్కరించినవారియెడ కన్న తిరస్కరించినవారియెడ భగవంతునకుఁ బ్రేమ యెక్కువగా నుండును. భగవద్వాత్సల్యం బట్టిదిగానున్నది. ఈ భావంబును భగవానుఁడు (9-30)లో తెలిపి లోకంబునకెల్ల నభయమిచ్చియున్నాఁడు.

మఱియు భగవంతుని సేవించుటకుఁ గులగోత్రాది వివక్షగాని, స్త్రీపురుషభేదముగాని గలుగదు. ఎవరైనను ఎప్పుడైనను యథామతి భగవంతుని సేవింపవచ్చును. ఎంతపాపాత్ముఁడైనను నయముననొండె భయముననొండె ఒక్కపరి స్వామీ! అన్నంతమాత్రానే వాఁడు ఆమాటతోడనే కొంతపునీతుఁడై భగవదనుగ్రహంబునకుఁ బాత్రుఁడగుచున్నాఁడు. అంతమాత్రము భక్తిసేసినను వానిని తప్పక గ్రహించి వానియందు ధర్మబుద్ధిని బెంపొందించి వానికిఁ దుదకుఁ బరమశాంతిని గూర్చుచున్నాననియు, నాభక్తునకు నెన్నటికిని నాశనము లేదనియు భగవంతుఁడే ప్రతిజ్ఞాపూర్వకంబుగాఁ బల్కుచున్నాఁడు. (9-31). ఇదేభావంబును రుక్మిణీదేవిగూడ 'నమ్మినవారికెన్నటికి నాశములేదుగదమ్మ యీశ్వరి' అనుచోటఁ దెలిపెను.

మఱియు అనన్యాత్మార్పణమందు మఱియొక విశేషము గలదు. ఎవఁడట్లు ఆత్మార్పణము చేయునో వానికి మఱియొక చింతయే యక్కఱలేదు. అతఁడు కన్నులుమూసికొని వర్తింపవచ్చును. ఇదిమిట్ట ఇదిపల్లము అనెడి భయముగాని, ఇది ధర్మము ఇది అధర్మము అనెడి వివక్షగాని వానికెంతమాత్రము నవసరము లేదు. ఆభారంబునెల్ల భగవంతుఁడే మోయుచున్నాఁడు. అర్థులనెందఱినైన వహింపవచ్చుననియు, ఆత్మార్పణముచేసిన వానిని ఒక్కనైనను భరించుట మహాకష్టకార్యమనియు భగవంతుఁడే చెప్పియున్నాఁడు.

### భజనము.

భజనమనఁగా భగవంతుని గుణంబులను గీర్తించుటయు వానినామంబులను స్మరించుటయు నని యర్థము. కీర్తించుటకు

గుణజ్ఞానంబును, స్మరించుటకు నామంబు నుండవలయును. అవి రెండును లేనినాఁడు భజనమునకే అవకాశము గలుగదు. భగవంతుఁడు నిర్గుణుఁడు గావున వానికి గుణములు లేవు. ఆ కారణంబున వానిగుణజ్ఞానంబునకు నెడము గలుగదు. వానికి రూపమే లేదుగావున నామముగలుగదు. నామము లేనినాఁడు స్మరించుటయెట్లు ? ఇట్టిశంక గలుగవచ్చును.

భగవంతునకు గుణరూపంబులు లేవనుట సత్యమే యైనను ఆయన లోకోపకారార్థము లీలావిభూతులను గ్రహించుచున్నాఁడు. ఆవిభూతుల గుణకీర్తనంబును, దన్నామస్మరణంబును భజనమగును. కావున భగవద్భజనంబునకు నెంతో యవకాశముగలదు.

భగవద్విభూతులు సాత్త్విక రాజస తామసికంబులని మూఁడువిధములు. అందు రాజసతామసవిభూతులభజనంబున భోగైశ్వర్య బలపరాక్రమాదులు మాత్రమే గలుగును. ముక్తికి సాత్త్వికమే యోగ్యమగును. ఈయర్థంబును 'యే యథా మాం ప్రపద్యంతే' అనుచోట భగవంతుఁడే సూచించెను. అట్లగుటయేల యందురా ? అన్నిఁటికిని భావము ప్రధానము. రజస్తమస్సులుగలవారికి అట్టియర్థంబులందే రుచియుండును. వారిరుచిప్రకారము ధ్యేయంబులను వారు గ్రహింతురు. భజనఫలంబుగా వారిధ్యేయతత్త్వంబు వారియందు నిల్చును. అందువలననే 'ఎవరేది కోరుదురో వారికి దానినిచ్చుచున్నాననియు, గుణాగుణంబులకుఁ గోరువారే కర్తలనియు' భగవంతుఁడు స్పష్టముగాఁ దెలిపెను.

### ఆత్మస్వాతంత్ర్యము.

భగవంతుఁడు ప్రతివ్యక్తియొక్క హృదయమందుఁజేరి నడిపించుచుండునని చెప్పబడెను. భగవంతుఁడు సర్వస్వతంత్రమూర్తియని యుగ్గడింపఁబడెను. భగవంతుఁడు శరీరగతుఁడైనప్పుడు వానిని జీవాత్మయందురనిరి. అనఁగా భగవంతుఁడే జీవాత్మయగుచున్నాఁడు. జీవాత్మకూడ సర్వస్వతంత్రుఁడే కావలయును. అట్టిసర్వస్వతంత్రమూర్తి లోపలనుండియు వ్యక్తులిట్లు పరిపరిరుచులతోఁ బరిపరివిధంబులుగా వర్తించుటఁ జూడఁగా, ఆత్మకు స్వాతంత్ర్యము లేదనియు అది కర్మబద్ధమై వర్తించుననియు నూహింపవలసియున్నది.

దీర్ఘముగా నాలోచించినచో 'ఆత్మస్వాతంత్ర్య' మను పదముయొక్క భావమును జక్కఁగా గ్రహింపనికారణంబున నిట్టియూహాలు గలుగుచున్నవని స్పష్టమగును. ఆత్మ ఎల్లప్పుడు స్వతంత్రమేగాని పరతంత్రముగాదు. దాని స్వాతంత్ర్యమెట్టిదందురా ? అది సర్వకాలసర్వావస్థలందు ఏకరాశిగా స్వయంప్రకాశమానముగా నుండుటయే దాని స్వాతంత్ర్యము. అనఁగా అది మఱియొకదానివలనఁ బ్రకాశితమై ప్రకాశించునది గాదని భావము. ఆత్మస్వాతంత్ర్యమునకు మర్త్యుల రుచ్యాదులకును సంబంధము లేదు. ఇవి వారివారి పురాకృతకర్మఫలంబులై యుండును. ఈకర్మములుగాని వానిఫలంబులుగాని ఆత్మప్రకాశంబును దగ్గింపఁజాలవు. ఆత్మ యట్లుయథాగతిఁ బ్రకాశించుచున్నను ఈకర్మముల శుభాశుభకారణంబునఁ దత్ప్రకాశముయొక్క వ్యాప్తి స్వచ్ఛముగానో మందముగానో బహిర్గతమగుచుండును. లాందరులోని దీపము యథా

గతి ప్రకాశించుచున్నను దానినిగప్పియున్న చిమ్నీయొక్క శుభ్రతాశుభ్రతలనుబట్టి లోని దీపకాంతియెట్లు బహిర్భాగంబును వెలిగించునో యట్లే యాత్మయునని గ్రహింపవలయును. ఆత్మస్వాతంత్ర్యతత్త్వమును సమగ్రముగాఁ దెలియకోరువారు శ్రీతిలకుగారి గీతారహస్యమందలి 'ఆత్మస్వాతంత్ర్యప్రకరణ మును జూడనగును.

## స్వభావము.

ఆత్మకును స్వభావమునకును ముడిపెట్టరాదు. పూర్వకర్మవాసనల సముచ్చయము ప్రారబ్ధజన్మంబున లోపలఁజేరి ఆవ్యక్తిని వర్తింపఁజేయుచుండును. ఆవాసనాసముచ్చయము స్వభావమనిరి. ఆత్మవేఱనుటకు నిదర్శనమేమందురా ? ఈ స్వభావము చేయించుపనులన్నిట ఆత్మ కేవలము సాక్షిభూతమై చూచుచుండుట కొంచెము నిదానముగా నంతర్ముఖమై పరిశీలించినచో స్పష్టమగుచుండును.

## స్వధర్మము.

ఈస్వభావముయొక్క వ్యాపారము స్వధర్మమగును. స్వభావము మాఱినఁగాని ధర్మముగూడ మాఱదు. స్వభావమును మార్చుట అంత సులభముఁగాదు. అయిన నది యసాధ్యము మాత్రము గానేరదు. చిత్తశుద్ధియే స్వభావశుద్ధియగును. చిత్తశుద్ధికిఁ జెప్పిన సాధనములే స్వభావశుద్ధి పరికరంబులగును.

స్వభావకార్యము స్వధర్మమని చెప్పఁబడెను. స్వభావం బెల్లరకును మంచిదిగానే యుండునను నియతిలేదు. అది దుష్టమైనదిగానున్నప్పుడు దానికార్యముగూడ విగుణమే

యగును. విగుణమైనను స్వధర్మంబును వదలరాదని శ్రీభగవానుఁడు (18-60)లో చెప్పెను. ఇది సరియగునా ? అను శంక గలుగక మానదు.

విగుణమును జేయవలసినదని భగవంతుని భావముగాదు. ధర్మమూర్తియు ధర్మస్థాపనార్థంబవతరించినవాఁడు నట్లు చెప్పునా ? స్వభావము మాఱునందాక స్వధర్మంబు మాఱదనియు, అధర్మంబెట్టిదైనను దానినడ్డగింపఁదరముగాదనియు, ప్రాప్తధర్మంబు నాచరించుచుఁ గ్రమక్రమముగా స్వభావము మాఱుటకై యత్నింపవలసినదనియు, ఎప్పుడు స్వభావముమాఱునో అప్పుడే స్వధర్మముగూడ మాఱుననియు భగవంతుని భావము. అంతియగాని దుష్టస్వభావంబునట్లే మన్నించి పోషింపుమని భగవంతుఁడెచ్చటను జెప్పలేదు. భగవంతుని భావంబదే యగునేని చిత్తశుద్ధికరమైన కర్మకాండంబు నింతగా వివరించియుండఁడు.

## ప్రారబ్ధము—జ్ఞాని.

ప్రారబ్ధము భుక్తమైగాని నశింపదనియు, దానిననుభవించి తీఱవలసినదేయనియు శ్రుతులు చెప్పుచున్నవి. భగవానుఁడుగూడ నదేభావంబును దెలిపెను. దీనింబట్టి జ్ఞానులకుగూడఁ బ్రారబ్ధము తప్పదని తేలుచున్నది. సంగతి యట్లుండగా జ్ఞానికిఁ బ్రారబ్ధము నశించినదేయగు'నని శ్రీశంకర భగవత్పాదులు వచించిరి. వారిమతము ఋషిజనభగవన్మతంబులకు విరుద్ధముగానున్నదని కొందఱు శంకింతురు.

శంకరులవారి తాత్పర్యము శ్రుతిమతమునకు విరుద్ధము

గాదు. దేహాభావంబున్నంతకాలమే ప్రారబ్ధఫలభోగజ్ఞానంబుం డుననియు, అట్టిజ్ఞానము భేదజ్ఞానమగుననియు, జ్ఞానికి భేదజ్ఞానంబుగాని దానికి సంబంధించిన దేహాభావంబుగాని యుండనేరదనియు, దేహభావం బెప్పుడు లేదో యాదేహంబనుభవించు సుఖదుఃఖాది భావంబుగూడ వానికిఁగలుగవనియు, అట్టిభావం బెప్పుడు లేదో తత్కారణమైన ప్రారబ్ధము వానికి నష్టప్రాయమేయగుననియు, 'ఉపాధి తాదాత్మ్యరూపజ్ఞానము లేక కేవల బ్రహ్మాత్మబుద్ధితోనున్న వానికిఁ బ్రారబ్ధము కలదనుట స్వప్నార్థము జాగ్రదవస్థయందువలె నగు' ననియు శంకరుల తాత్పర్యము. ఇది శ్రుతిమతంబునకు విపరీతం బెట్లగును ? మఱియు జ్ఞానిదృష్టికి సర్వము బ్రహ్మమేయగును. సర్వమన్నప్పుడు బ్రహ్మరూపమైన శరీరముగూడ నందులోనే చేరును. బ్రహ్మమునకుఁ బ్రారబ్ధం బెక్కడిది ? బ్రహ్మమునకు లేనినాఁడు శరీరంబునకుమాత్రమెక్కడిది ?

### జ్ఞాని—అనువృత్తి జ్ఞానము.

స్వప్నావస్థలోఁజూచిన పదార్థముల జ్ఞానము మేల్కొన్నప్పుడు కొంతకుఁగొంతయుండును. అట్టిజ్ఞానమును అనువృత్తి జ్ఞానమందురు. అనువృత్తి జ్ఞానమున్నంతకాలము అది సంపూర్ణజాగ్రదవస్థ కానేరదు. అట్లే దేహాభావంబు అనువృత్తిమాత్రమున్నను అదిసంపూర్ణజ్ఞానము కానేరదు. కావున జ్ఞానికి భాసమాత్రముగూడ దేహాభావంబుండరాదని తాత్పర్యము.

దేహంబు నొకవంక మోయుచు దానిజ్ఞానముండకుండుట యెట్లు ? అని శంకింపవచ్చును. దేహజ్ఞానమనఁగానేమి?

దేహమనునది ఒకబొంతయున్నదా ? లేదా ? అనుజ్ఞానము గాదు. దేహము బ్రహ్మాభిన్నమనెడి భేదజ్ఞానంబిచట తాత్పర్యము. అట్టిభేదజ్ఞానంబు జ్ఞానికినుండదని యర్థము. ఏల యుండదందురా ? సర్వమును బ్రహ్మయను భావంబు సర్వకాలసర్వావస్థలందెవనికిఁ గలదో యతఁడే జ్ఞానియగును. అట్టివానిదృష్టికి శరీరముగూడ బ్రహ్మాత్మకంబగునేగాని వేఱుగాదు. కావున జ్ఞానికి దేహభావంబు బ్రహ్మాభిన్నంబుగా నుండదని గ్రహింపవలయుచు.

పురుషకారము.

జ్ఞానులు పయితము వారిస్వభావానుగుణంబుగా వర్తింతురనియు, స్వభావంబును నిగ్రహింపఁ దరముగాదనియు శ్రీభగవానుఁడు (3-33) లో వచించెను జ్ఞానులకుఁగూడఁ దరముగానిదానిని సామాన్యులు సాధింపలేరనుట నిర్వివాదాంశము. స్వభావము మాఱినఁగాని తదనుగుణములైన కర్మములు మాఱవు. లోకమందు దుష్టస్వభావము మిక్కుటముగాఁ గాన్పించుచున్నది. దుష్టస్వభావము మారదు గావున దానికై ప్రయత్నమే జరుగదు. ఒకవేళ ప్రయత్నము జరిగినను అది ఫలకారికాఁజాలదు. కావునఁ బురుషకారంబునకే యవకాశము లేదనియు, ఆకారణంబున దుష్టుఁడు శిష్టుఁడగుటకే వలనులేదనియు, వానిగతి యంతేయనియుఁ దేలుచున్నది. భగవానుని మతంబిదేనా ? అనుశంక గలుగవచ్చును

భగవానుఁడు చెప్పినవాక్యంబునకు నిది తాత్పర్యము గాదు. స్వభావమునకు లోఁబడియున్నంతకాలము తద్వ్యతిరిక్తముగా వర్తింప నెవ్వానికిని సాధ్యముగాదను భావంబును

మాత్రమే భగవంతుఁడచ్చోట వెల్లడించెను గాని, స్వభావం బును మార్చుటకే సాధ్యముగాదని భగవంతుఁడెచ్చోటనుఁ జెప్పలేదు. స్వభావంబును మార్చుటకే వీలులేనియెడల, 'అది చేయుము, ఇదిచేయుము; నన్ను శరణొందుము, నీకుమేలుగలుగు' నని భగవంతుఁడు సారెసారెకు బోధించునా; అట్టిబోధ యొక్క భావమేమి? కాఁబట్టి పురుషకారంబునకు నవకాశ మున్నదనియు, పురుషకారఫలంబుగా స్వభావంబు మార్పుఁ జెందుననియు, పురుషకారంబును సర్వవిధముల నాశ్రయింప వలసినదే యనియు భగవంతుని భావము.

పురుషకారవిషయమైనసంశయము నేఁడు క్రొత్తఁగాఁ బుట్టినదిగాదు. 'భగవన్! పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ! ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో!' (స్వామీ! ప్రారబ్ధఫలంబుగా స్వభావంబుండును; స్వభావాను సారంబుగా బుద్ధియుఁ దత్కార్యంబులు నుండును. శుభస్వ భావవంతుని సంగతి యట్లుండనిమ్ము. అశుభస్వభావవంతుని స్వభావంబు మాఱుటయు, వానికి బుద్ధికుదురుటయు, నీకు భక్తిసేయుటయు నెట్లు పొసఁగును?) అని పార్వతీదేవి పర మేశ్వరుని నాఁడే ప్రశ్నించెను. ప్రారబ్ధంబనుభవించుచున్నను గీతాభ్యాసరతుఁడైనచోఁ బ్రారబ్ధము చక్కబడుననియు వా నికి ముక్తిగలుగుననియుఁ బరమేశ్వరుఁడు బదులు చెప్పెను. దీనింబట్టి స్వభావఁబును మార్చుకొనుటకు, అనఁగాఁ బురుష కారంబునకు నవకాశంబు గలదని యేర్పడుచున్నది. 'ఉద్ధరే దాత్మనాత్మాన' మనుచోటఁ బురుషకారఁబునకు నవకాశము గలదని భగవానుఁడుగూడ సూచించెను. 'రోగాదులవిముక్తికి

వలె భవబంధవిముక్తికిఁగూడ స్వయముగాఁ బ్రయత్నింప వలయు' నని శ్రీశంకరభగవత్పాదులవారుగూడ వివేకచూడామణి (66)లోఁ దెలిపిరి. ఫలము ప్రయత్నాధీనమనియు ఉత్తమోత్తమము అనన్యసాధ్యమునైన ముక్తిగూడఁ బ్రయత్నఫలమేయనియు యోగవాసిష్ఠము స్పష్టముగాఁ జెప్పుచున్నది. ముక్తి యంతటిది ప్రయత్నసాధ్యమైనప్పుడు తక్కినవానిని లెక్కింపవలయునా ? అట్లుకానినాఁడు లోకమునకెల్ల అనిరోక్షత్వము సంభవించునుగదా.

పురుషకారంబునకు అవకాశంబెప్పుడుగలుగునందురా? స్వభావమనఁగా ప్రారబ్ధకర్మఫలములవాసనా సముచ్చయమని చెప్పఁబడెను. ఈవాసనలన్నియు మలినంబులుగానే యుండవు. అంతోయింతో శుభవాసన గూడనుండును. అశుభవాసన పరిమళించుతఱి బుద్ధికొంచెము వికాసముఁజెందును అత్తఱి తద్వాసనాకార్యము అంతోయింతో జరుగును. దానికిఁదగిన శుభఫలంబును దద్ద్రాప శుభవాసనయు జనించును. అట్లు శుభవాసనలు హెచ్చుకొలఁది మలినవాసనలు క్షయించుచుండును. శుభవాసనలు పరిమళించుతఱి ఆత్మదీప్తి మఱికొంత హెచ్చుగా బుద్ధియందుఁబ్రసరించును. ఏలయందురా ? బుద్ధి మఱికొంత శుద్ధమై దీప్తికి నవరోధంబును గలిగింపలేకుండుటయే కారణము. ఆత్మదీప్తితోడ అజ్ఞానంబు కొంత శమించును; దానితోడ జ్ఞానంబు నుంత యంకురించును. జ్ఞానప్రకాశమందుఁ దత్త్వము సుంతగోచరించును. అట్లు గోచరించినదానినిఁ బడయుటకై ప్రయత్నము సాగును. ఇది లోకసహజము. ఈవిధముగాఁ బురుషప్రయత్నంబునకు నవకాశము గలుగుచున్నది.

## ముక్తి.

లోకవాసనలు నశించుటయే ముక్తియనిరి. ఈముక్తి యనునది నిర్గుణసగుణములైన ఉపాసనల భేదమును బట్టి నిర్గుణనిష్ఠాముక్తియనియు సగుణనిష్ఠాముక్తియనియు రెండువిధములు. నిర్గుణనిష్ఠాముక్తిని సద్యోముక్తియనియు, సగుణనిష్ఠాముక్తిని క్రమముక్తియనియుఁ జెప్పిరి. ఫలప్రాప్తియొక్క కాలభేదమునుబట్టి యీభేదము గలుగుచున్నది. సద్యోముక్తియనునది జీవితకాలమధ్యనో జీవితకాలాంతమునో గలుగును. క్రమముక్తి యనునది జీవుఁడు వానిశరీరమును వదలి బ్రహ్మలోకమునకుఁ బోయి అచ్చట కొంతకాలంబుండి బ్రహ్మతోఁ గూడి ముక్తుఁడగును. ఈకాలభేదంబును బట్టి వానికి నట్టి సార్థకనామంబులు గలిగెను. బ్రహ్మలోకమందలి జీవునకు బ్రహ్మకుఁగల జగన్నిర్మాణశక్తియు ఈశ్వరత్వంబును గలుగవుగాని, ఇచ్ఛారూపశక్తియు ఇచ్ఛామాత్రశక్తియుఁ గలుగును.

సద్యోముక్తి మరల జీవన్ముక్తి యనియు విదేహాముక్తి యనియు రెండువిధములు. పూర్వకర్మసుకృతవిశేషంబున జీవితకాలము మధ్యలోనే ఎప్పుడో యొకప్పుడు అహంకారమమకారరాహిత్యంబును బ్రాహ్మీభావంబును గలుగవచ్చును. అట్టిభావము కలిగినవెంటనే వానిని సద్యోముక్తుఁడందురు. వానికి శరీరపతనకాలమింకను శేషించియుండును. ఏలయందురా ? వానిశరీరము ఇంకఁ గొంతకాలము ద్వంద్వముల ననుభవింపవలసియుండుటయే కారణము. శరీరంబట్లనుభవించుచున్నను ఆసంగతి వానికిఁ దెలియనే తెలియకుండును. భేదభావము

లేకుండుటయే యిందులకుఁ గారణము. శరీర పతనసమయంబునఁ గొందఱకుఁ బైనఁజెప్పినక్రమము గలుగును. దానిని విదేహముక్తి యనిరి. గీతలో రెండవ అధ్యాయము 55 to 68 వఱకు స్థితప్రజ్ఞునిగూర్చి చెప్పఁబడినదే నిర్గుణనిష్ఠాముక్తికిఁగూడ నన్వయించును. జీవన్ముక్తునిగూర్చి శంకరులవారు వివేకచూడామణిలో 425 వ శ్లోకము మొదలుకొని ప్రశంసించియున్నారు.

## జీవునియాత్ర.

నిర్గుణనిష్ఠాముక్తునిజీవుఁడు జీవితకాలములోనే వాని జీవత్వభావంబును వదలి పరత్వభావంబును వహించెను గావున వానికిఁ బరలోకాదులకుఁ జనవలసిన కారణములేదు. సగుణనిష్ఠాముక్తునిసంగతి యట్లుగాదు. వానికి భేదభావము భాసమాత్రమైననుండును. అదియు నశింపవలయును. అది పోవుటకుఁ గొంతకాలము వలయును. అతఁడు మరల శరీరధారణ చేయుటకు జన్మకారణఫలవాసనలు వానియందు సంపూర్ణముగా నశించెను. కావున వానికి నిహలోకయోగ్యమైన యుపాధి గలుగదు. పరలోకమే వానికి నివాసయోగ్యము. అచ్చటకుఁ బోవలయును. ఈపోవుటనే జీవునియాత్రయనిరి.

శరీరమందు స్థూలము సూక్ష్మము కారణము అనుభాగములు మూఁడుగలవు. పంచభూతంబుల కలయికయందలి స్థూల్యాదులను బట్టి యీవిభాగము గలుగుచున్నది. ప్రారబ్ధకర్మము భుక్తమైనంతనే స్థూలశరీరము పడిపోవుచున్నది. జీవునకు నప్పుడు సూక్ష్మకారణ శరీరంబులుండును. సూక్ష్మశరీరముఁగూడ కొంతదూరము పోఁగలుగునేగాని తర్వాత చన

నేరదు. అచ్చటి వాతావరణము నతి సహింపలేమియే కారణము. తర్వాత జీవుఁడు కారణశరీరుఁడై లోకాంతరములకుఁ బోయి అటనుండి వానివాని యోగ్యతలప్రకారము మీఁదికో క్రిందికో వచ్చుచున్నాఁడు. పంచభూతములయొక్క తన్మాత్రలచేతమాత్రమే కూడి జన్మాంతరశరీరబీజంబులను గలిగి యుండుటంజేసి దీనికి కారణశరీరమనిరి.

మరణానంతరము స్థూలశరీరమునుండి సూక్ష్మశరీరము లేచుట మున్నగువిషయంబులను ఇటీవల అమెరికాశాస్త్రజ్ఞులు పరిశీలించి ప్రతిబింబములను గూడఁ దీసి యీవిధానంబును సనాత్న్యముగా ఋజువుచేసి మనశాస్త్రంబు నుద్ధరించిరి. కావునఁ బైవిషయంబులు కల్పితంబులని భావింపవలదు. ఉపాధికిని వాతావరణంబునకును గల సంబంధము, అనఁగా ఏయుపాధికి ఎంతదూరము మింటఁబోవుశక్తి కలదో యనువిషయము ఛాయామాత్రముగా రామాయణములో గూడఁగలదు.

సగుణనిష్ఠాజీవుఁడు—సామాన్యజీవుఁడు.

మొదటివాని జీవము అవసానకాలంబున సుషుమ్నానాళముగుండ వెడలుచున్నది. రెండవవాని జీవము నేత్రాదినాళములగుండ వెడలుచున్నది. మొదటివాని జీవము దేవయానమునుబట్టి సూర్యకిరణములద్వారా బ్రహ్మలోకమునకుఁ బోవుచున్నది. రెండవవాని జీవము పితృయానమునుబట్టి పితృలోకమునకుఁ జేరుచున్నది. మొదటివాని జీవంబట్లు బ్రహ్మలోకముఁజేరి, అట జ్ఞానపరిసమాప్తిని గాంచి బ్రహ్మతోడ ముక్తిఁ గాంచును. వానికిఁ బునరావృత్తి లేదు. రెండవ

వాని జీవము పితృలోకమందు భోగ్యకర్మఫలంబుల ననుభవించి మరల జన్మించుచున్నది.

### అకాలమరణము.

'గహనా కర్మణోగతిః' అని గీతాచార్యుఁడు చెప్పెను. కర్మగతి యిట్లని నిశ్చయింపరాదు. కొందఱు మహాఘోర కర్మంబు లొనర్తురు. ఆకర్మముల ఫలంబును వారు వివిధదేహంబులతో ననుభవింపవలసినదిగా నుండును. అట్టివారికి స్థూలదేహము ముందుగాఁ బతనమగును. సూక్ష్మదేహంబుతో ననుభవింపవలసిన కర్మము శేషించియుండును. అట్టి కర్మంబుల నట్టిదేహముతో ననుభవించి పిదప కారణదేహముతోఁ బితృలోకమునకుఁ జనవలసియున్నది. ఈసూక్ష్మదేహము భూలోకంబునకుగాని పితృలోకంబునకుఁగాని రెంటికి యోగ్యముగాదు. దానంజేసి వారీరెంటిమధ్య నురియాడుచుఁ బిశాచాదిరూపంబున నుందురు. అట్టివారి స్థూలదేహమునకు అకాలమరణంబనిరి. సూక్ష్మదేహముగూడఁ బతనమైనప్పుడు వారికి గాలమరణము గలుగుచున్నది. ఈరహస్యంబును మన జ్యోతిశ్శాస్త్రంబు గొంతకుఁగొంత సూచించుచున్నది.

### ముక్తి—మతాంతరములు.

ముక్తియనఁగా అంతఃకరణస్థితియేగాని వేఱొండుగాదనియు, శరీరంబున్నప్పుడు జీవన్ముక్తియనియు, అదిచన్నతర్వాత విదేహముక్తియు ననుట యుక్తియుక్తము గాదనియు, ముక్తికి మనోనాశనము ప్రధానమనియు, అది స్వరూపనాశనము వృత్తినాశనము అని ద్వివిధమనియు, స్వరూపనాశనము విదేహముక్తునకును, వృత్తినాశనము జీవన్ముక్తునకును లక్షణంబు

లనియు, విదేహముక్తుఁడు తురీయాతీతుఁడనియు, జీవన్ముక్తుఁడు తురీయస్థుఁడనియు, పైకారణంబునంజేసి విదేహముక్తునకుఁ గాలజ్ఞానమే యుండదనియు, జీవన్ముక్తునకుఁ ద్రికాలజ్ఞానం బుండుననియు మతాంతరము గలదు.

### ఆగర్భముక్తులు.

ఆగర్భముక్తులనఁగా బుట్టువుతోడనే బ్రాహ్మీభావము గలవారని భావము. వారిజననాదులు కర్మాధీనములుగావు. వారు లోకోపకారార్థంబవతరించి తదర్థము కర్మములు చేయుదురు. వారికర్మంబులు ప్రతిఫలాపేక్షారహితంబులుగావున అవి కర్మములేగావు. వారిని అధికారపూరుషులనియు అంశావతారంబులనియు వచింతురు.

### ముక్తి—అభేదదర్శనము.

భేదభావము నశించుటే ముక్తిగాదు. అట్లగునేని సుషుప్తియందును మూర్ఛాకాలమందు నెట్టిభేదభావమేయుండదు గావున వారెల్లరు ముక్తులే కావలయును. బ్రహ్మజ్ఞానము వలననే ముక్తిగాని వేఱుగాదు. అభేదదర్శనము దానికిఁ బూర్వాంగమగును.

### విశ్వరూపదర్శనము.

శ్రీకృష్ణభగవానుఁడు తత్త్వసారంబెల్ల బోధించినను అర్జునునకు నిశ్చయాత్మకబుద్ధి జనింపదయ్యెను. భగవానుఁ డది గ్రహించి అట్టెయోచించి తన విశ్వరూపంబును వానికిఁ జూపెను. అది చూచినంతనే యర్జునుని నెంజలి పటాపంచలయ్యెను. వానికి బుద్ధినిశ్చయము గలిగెను. అతఁడు దాసో

హామ్మనుచు వానికర్తవ్యంబునకుఁ దోడఁగెను. శిష్యుని యజ్ఞానంబును మాన్పుటకు గురు వెంతటివాఁడుగానుండవలయు నో దీనింబట్టి యూహింపనగును.

శ్రీకృష్ణభగవానుఁడు విశ్వరూపంబును యశోదా దుర్యోధనులకు ముగ్గురకుఁ జూపెను. యశోదాదుర్యోధనాదులకుఁ జూపిన విశ్వరూపంబునకన్న అర్జునునకుఁజూపిన విశ్వరూపము విశిష్టమైయున్నది. యశోద పుత్త్రలాలసతోఁ బెనఁగులాడుచుండెను. దానినిబాపుటకై యామెకు నాఁడు తావన్మాత్రము విశ్వరూపంబును జూపెను. దుర్యోధనుఁడు గర్వాంధకారుఁడై వర్తింపసాగెను. వానిగర్వంబడంచుటకుగాఁ దావన్మాత్రము విశ్వరూపంబును జూపెను. అర్జునునివిష యంబట్టిదిగాదు. అతఁడు ధర్మాధర్మవిషయిక విపరీతజ్ఞానాంధుఁడై యుండెను. వానియజ్ఞానాంధకారంబును బాపుట కృష్ణభగవానులకు విధియయ్యెను. అట్లుచేయనిచో ధర్మమే లోపించునట్లుగాఁ దోఁచెను. అందునిమిత్తము పార్థుని ముందుగా హెచ్చరించి వానిని సంసిద్ధునిగాఁజేసి, సామాన్యదృష్టి చాలమింజేసి దివ్యదృష్టినిచ్చి సాకల్యంబుగాఁ జూడుమని పలికి విశ్వరూపంబును జూపి, చక్కఁగాఁ జూచితివా ? అని మఱి మఱి యడిగి, ఇఁకఁజాలునని వానినోటనే పలికించి తర్వాత దాని నుప సంహరించెను. యశోదాదులకుఁ జూపిన విశ్వరూపము కేవలాకస్మిక సంకల్పఫలము. ఇది బుద్ధిపూర్వకము. ఈవిశ్వరూపదర్శనము విశిష్టమగుట శ్రీభగవానుఁడే (11-52) లోఁ దెలిపెను.

### గీతోపదేశము—అనుభూతి.

గీతోపదేశము అనుభవసిద్ధమా? యను ప్రశ్నగలదు. గీతోపదేశము ఉపనిషద్భావమేగాని కల్పితముగాదు. ఉపనిషత్తులన్ననో మహర్షుల యనుభూతి వివరంబులేగాని వేఱుగావు. కావున గీతోపదేశము అనుభవసిద్ధమగుట స్పష్టము.

అంతమాత్రాన లోకము తృప్తిచెందదు. అది ప్రత్యక్షప్రమాణంబును గోరును. ప్రకృతము సజీవులై యున్న శ్రీరమణమహర్షిగారిని లోకమునకుఁ జూపవచ్చును. వారి యనుభూతి యెట్టిదందురా? వారియనుభూతిసారంబు 'రమణగీత' అనుపేరఁ బ్రకటితమైయున్నది. దానింగాంచి తృప్తి చెందనగును.

### రమణ గీతాసారము.

జీవితావధియేమి? అనుప్రశ్న యెప్పుడో యొకప్పుడేదోవిధమునఁ బ్రతిమానవునకునుఁ దోఁపకమానదు. ఈ జీవితావధింగూర్చి పెక్కురు పెక్కువిధంబులఁ బల్కిరి. అయినను సారాంశంబొక్కటే యగును. సారాంశమేమందురా? ఆనందమే సారాంశము. ఆనందమునే సుఖంబనియుఁ దృప్తియనియు బహువిధంబులఁ బేర్కొందురు.

ఈయానందము గ్రంథపఠనాది శ్రమము శతకోటివర్షంబులు గావించినను సిద్ధింపదు. అది కేవలము స్వానుభవసిద్ధమాత్రమగును. అది యెట్టిదందురా? అది యిట్టిదనిచెప్పుటకు సాధ్యముగాదు. ఏలయందురా? చూచుట చెప్పుట ఇవి యింద్రియ కార్యములు. ఆనందము అతీంద్రియ పదార్థము.

ఆనందము శాశ్వతికమా ? క్షణికమా ? అని కొందఱడుగుదురు. వారడుగునట్టియానందము ఆత్మసంబంధమా ? ఇంద్రియసంబంధమా ? అని వారినే మరల నడుగవలయును. ఇంద్రియసంబంధమందురా? ఇంద్రియములకు స్వాతంత్ర్యము లేదు. వానికి స్వాతంత్ర్యముగలదేని గాఢసుషుప్తియందుఁ గూడ నవి వ్యవహరింపవలయునుగదా. అనఁగా నింద్రియంబులే అశాశ్వతంబులు. అవియిచ్చునట్టి యానందము శాశ్వతం బెట్లగును ?

ఆత్మ శాశ్వతము. అదియిచ్చునట్టి యానందముగూడ శాశ్వతమైనదేయగును. వేయేల ? ఆనందమన్నను, బ్రహ్మమన్నను, ఆత్మయన్న నొక్కటేయగును.

ఆత్మకు నానందము నైజము గావునను, ఆత్మలేని ప్రాణిగలుగదుగావుననుఁ బ్రాణికోటికెల్ల నానందము సహజసిద్ధమేయగునుగాని దానినిఁ గ్రొత్తగాసాధింప నవసరములేదు. ఆనందంబట్టిదైనను జ్ఞానవశంబునఁ దద్రహస్యంబునెఱుంగక దానినెందుండియో సంపాదింప యత్నించుచు దుఃఖభాగులగుచున్నారు.

ఆనందము ఆంతరంగికస్థితియగునేగాని బాహ్యపదార్థంబులవలనఁ బడయనైనదిగాదు. ఆనందంబట్లు సహజమై అంతస్థితమైయున్నను దానిననుభవించుటకు కామము, భయము అనెడిశత్రువులిద్దఱడ్డుపడుచుఁ జేతిలోనిదానినిగూడ నపహరించుచు నుందురు. ఆశత్రువులదాడి తొలఁగవలయును. డబ్బ్వచనినను వారువదలరు. వారిని జయించియే తీఱవలయును.

ఈవైరులను జయించుటకై అసంగబుద్ధి, సర్వాత్మబుద్ధి, ప్రపంచమిథ్యాబుద్ధి, సమదర్శనబుద్ధి అనునట్టి సాధనంబులు నాల్గుగలవు. ఆత్మ యెల్లప్పుడు అసంగుఁడనియు, అట్టివానికి బాహ్యప్రపంచంబుతో సంబంధము గలిగించుట యుక్తికిగాని అనుభవంబునకుఁగాని సరిపడదనియు భావించుట అసంగబుద్ధి యగును. దీనివలన ఆత్మస్వరూపము బోధపడును. సర్వము ఆత్మయే యనియు అట్టియాత్మలోపలఁ బ్రపంచంబు సముద్రమందు బుడుకవలె, గాన్పించుచు నంతరించుచుండుననియు, భావించుట సర్వాత్మబుద్ధియగును. దీనివలన విశ్వము ఆత్మాభిన్నమని బోధపడును. ప్రపంచము బాహ్యదృష్టికిఁ బ్రత్యేకముగాఁ దోఁచుచున్నను దానికి వాస్తవముగాఁ బ్రత్యేకమైనస్థితిలేదనియు, రజ్జువునందు సర్పభ్రాంతివలె నాత్మయందుఁ బ్రపంచభ్రాంతి గలుగుచున్నదనియు భావించుట మూఁడవది యగును. దీనివలనఁ బ్రపంచము నామరూపాత్మకబ్రహ్మమేగాని వేఱుగాదని బోధపడును. సమస్తద్వంద్వములు కేవల భావరూపంబులనియు, జీవుడు వానిస్వరూపంబును గ్రహింపనంతకాలంబవి వానికి నుండుననియు, జీవుఁడు తానే బ్రహ్మమగుట గ్రహించినంతనే ద్వంద్వకోలాహలము చల్లారుననియు సమదర్శనబుద్ధి బోధించుచున్నది. ఈనాల్గును ద్వైతభావంబులను లయింపఁజేయును గావున వీనిని లయమార్గము లనిరి.

ఆత్మయనెడి మహాకాశములో విశ్వమనెడి ఘటంబున్నదని భావించుట అన్వయమార్గమగును. దీనింబట్టి, ప్రపంచము ఆత్మభిన్నముగాదనియు, అది యాత్మలోనే పుట్టిపెరిగి

లయించుచున్నదనియు, అది దానికి స్వాభావికంబనియు స్పష్ట మగును.

అష్టావక్రమతము.

ఆత్మకు బంధముక్తులు రెండును లేవనియు, అట్టియాత్మకు జీవన్ముక్తియనియు విదేహముక్తియనియుఁ జెప్పుట సరిగాదనియు, అట్లు చెప్పినచో ఆత్మకుఁ దత్పూర్వము బంధమున్నట్లు తేలుననియు,

'క్వ ప్రారబ్ధాని కర్మాణి ? జీవన్ముక్తిరపి క్వవా ?
క్వ తద్విదేహకైవల్యం ? నిత్యశేషస్య సర్వదా ॥' అని

అష్టావక్రగీతలోఁ జెప్పిరి. మఱియు,

'క్వచాస్తి క్వచ నాస్తి క్వాస్తి చైకం క్వచద్వయమ్ ?
బహునాత్ర కిముక్తేన కించిన్నోత్తిష్ఠతే మమ ॥' అను

శ్లోకములో అద్వైతసిద్ధాంతసారంబులెల్ల నిమిడ్చిరి. ఉన్నదనుట, లేదనుట ఇవిరెండును మనఃకార్యములు. ఆత్మయన్నచో మనస్సునకు నందునది కాదు. తనకు నందనిదియు ఆకారణంబునఁ దెలియరానిదియునైన యాత్మనుగూర్చి కలదు లేదు అనిచెప్పుటకు మనస్సునకు నేమి యధికారము గలదు ? దానిమాటలెట్లు విశ్వసనీయములగును ? కావున మనఃకల్పనములను నమ్మి వర్తింపవలదని పైశ్లోకతాత్పర్యము.

అష్టావక్రులవారుగూడ మాండూక్యమహర్షివలె అజాతవాదమునే స్థిరపఱచుచున్నారు. సర్వకాలసర్వావస్థలందు ఏకరాశిగానుండుదానికి ఉత్పత్తిస్థితిలయంబు లెట్లుగలుగును ? అట్లు భావించుట అజ్ఞానమంటిమా ? అజ్ఞానమును అజాత

వాదమే యంగీకరింపదు. ఏలయందురా ? అజ్ఞానమున్నదన్నచో ఆత్మకన్న వేఱైన మఱియొకటి కలదని యంగీకరించుటగును. అట్లగునేని యిట్టిభావం బెట్లు గలుగుచున్నదని యడుగవచ్చును. దానికి శ్రీ శంకరభగవత్పాదులవారు చెప్పిన సమాధానమే సమాధానము.

గీతాఖండము సంపూర్ణము.

---



# శ్రీకృష్ణచరితము.

## ధర్మస్థాపనఖండము.

### యుద్ధమర్యాదలు.

శ్రీకృష్ణభగవానుఁడు సూచించినట్లుగా నేడవనాఁ డిరు సైన్యంబులు యుద్ధసన్నద్ధమై రణరంగంబునఁ దీరెను. నాటి కాలంబున యుద్ధనిబంధనంబులు కొన్నిగలవు. అసమాన యుద్ధము తగదు. ఒక్కఁడొక్కనితోనే పోరవలయును. ఇరువురొక్కనిపయిఁ గవియరాదు. ముఖాముఖి నిల్చి పోరవల యునేగాని దాగిపోరరాదు. రణరంగంబును విడిచినవానిని దాగినవానిని, భయగ్రస్తుని, ఖడ్గము తునిగినవానిని, విల్లు విఱిగినవానిని, కవచము ప్రీలినవానిని జెనకరాదు. రథికుఁడు రథికునితో హస్తికుఁడు హస్తికునితోఁ బదాతిపదాతితోఁ బోరవలయును. సంకులయుద్ధము కూడదు. యుద్ధసామగ్రిని శస్త్రాస్త్రములను గొనివచ్చుశకటాదులను దాకరాదు. భేరీ భాంకారక శంఖారావకులను జకిత్సకులను ముట్టరాదు. ఈ నియమంబులను సేనానాయకులు వారివారి సైన్యంబులకుఁ బ్రకటించిరి. (నాటియుద్ధమర్యాదలకును నేటియుద్ధమర్యాదలకును గలభేదంబు నూహింపవచ్చును. అట్టిమర్యాదానిబద్ధంబులగుటవలననె నాటియుద్ధంబులను ధర్మయుద్ధంబులనిరి.)

అట్లు యుద్ధమర్యాదలను బ్రకటించి కౌరవసేనాముఖం బున భీష్మునిను బాండవసేనాముఖంబున ధృష్టద్యుమ్నభీము లును నిల్చిరి. సింహగర్జనంబులతో భేరీనినదంబులతో శంఖారావంబులతో యుద్ధంబు ప్రారంభించెను. భీష్ముని విజృంభంబునకు మేరగాన్పింపదయ్యెను వానిదాడికిఁ బాండవ సైన్యం బోర్వదయ్యెను. అతఁడు జీవించియున్నంత కాలము పాండవవిజయంబు కల్లయని దోఁచెను. పాండవసేన దినదినం బునకు సన్నగిలి దైన్యగ్రస్తము కాసాగెను. కౌరవసైన్యము ధైర్యోత్సాహపూరితమై చెలగెగెను. ఏమిచేయుదమాయని పాండవసేనానాయకులు మినుకరింపసాగిరి.

పాండవసైన్యమందలి హతశేషులు భీష్మపరాక్రమంబు నకు వెఱచి పఱవనైరి. సాత్యకి ధైర్యోత్సాహవచనంబులు వారిని నిలుపలేవయ్యెను. అధర్మవిజయంబు భీష్ముని కారణం బున నిశ్చయంబని తోఁచెను. అర్జునుఁడు భీష్మునియందలి భక్తిగౌరవంబులఁజేసి వానితోడి యుద్ధంబును దప్పించుచునో తనసామర్థ్యంబును దాచుచునో కాలము పుచ్చసాగెను.

## శ్రీకృష్ణపరాక్రమము.

కృష్ణుఁడదిగాంచి 'సాత్యకీ! పిఱికిపందలకై యఱచు టేల? వారివెంటఁ దక్కుంగలవారినిగూడఁ జననిమ్ము. ఇదిగో నేనే భీష్మద్రోణుల మట్టుపెట్టుదు' నని పలికి చేతినున్న వాగెలు వదలివైచి చక్రాయుధంబుఁబట్టి రథంబునుండి దుమికి

మ॥ ధరణీచక్రము గ్రక్కునంగదల దిగ్దంతావళి శ్రేణికిన్
భరముల్ ప్రొగ్గబడన్ దిశావలయ ముత్కంపంబుగా నీటిలం
బురులంబాఱఁగ భీష్ముపైఁగవిసె రౌద్రోద్రేకముంజూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చంచద్బాహు ఘోరాకృతిన్ ॥

కృష్ణుఁడట్లు చక్రంబుఁబూనివచ్చుట భీష్ముఁడు చూచి తన రథంబునుండి లేచి నిలిచి 'రారమ్ము! దేవదేవా! జగన్నివాసా! గదాచక్రధరా! ఇదే నమస్కారము నీచేతి చావుకన్న మేలుగలదా?' యనెను.

అంతలో నర్జునుఁడు రథంబునుండి దుమికి కృష్ణునిపాదంబులను గవుంగిటఁ గట్టిగాఁగూర్చి 'కృష్ణా! నీయురవడిమానుము నీవిట్లుచేయుట నాకుఁ దలవంపగును. నీభావంబును గ్రహించితిని. నాయుపేక్షాభావంబునకు శిక్షగా నిట్లువిక్రమించితివి. నామొఱ యాలకింపుము. కౌరవులయంతంబుఁ జూచునందాఁక గాండీవంబును దింపను.' అని ప్రతిజ్ఞాపూర్వకంబుగాఁ బ్రార్థించెను. కృష్ణుఁడు కొంతశాంతము దాల్చి సారథ్యము వహించి పాంచజన్యంబును బూరించెను. ఆధ్వనితోడ జయలక్ష్మి కౌరవపక్షంబునుండి పాండవపక్షంబునకు మరలెను.

### భీష్మపతనము.

అర్జునుఁడంతట భీష్ముని దలపడెను. ఇరువురకు ఘోరఘోరయుద్ధమొదవెను. భీష్మునిశరీరంబు పార్థబాణతూణీరమోయన నయ్యెను. కురుపితామహుఁడట్లు నిశితశరవిద్ధుఁడై జల్లెడనుబోని శరీరంబుతో నాటిసాయంకాలంబునకు సొమ్మసిలి వ్రాలెను. కౌరవులు మహాదుఃఖభయగ్రస్తులైరి.

అప్పుడు దక్షిణాయనము ప్రవర్తిల్లుటంజేసి లోకమర్యాదనుబట్టి యది ప్రాణోత్క్రమంబునకు శుభకరముగాదని తలంచి స్వచ్ఛందమరణశీలి గావున భీష్ముఁడు శరతల్పగతుఁడై యుత్తరాయణపుణ్యకాలంబును బ్రతీక్షించుచు జీవంబుల నిలిపియుంచెను.

కృష్ణవిక్రమవిమర్శము.

ఆయుధంబునుం జేఁబట్టనని కృష్ణుఁడు నాఁడు దుర్యోధనార్జునులమ్రోల ఘంటాపథంబుగాఁ బల్కెను. అట్టివాఁడు చక్రంబును బూనుట భీష్మునిపయి నురుకుట తగునా? ఇది మాటతప్పుట కాదా?' యనియుఁ గృష్ణుఁడు భగవంతుఁడో భగవదవతారమో యగునేని మాట తప్పునా? యనియు, అట్టి యధర్మవర్తియేడ? ధర్మసంస్థాపనం బేడ? యనియు శంకింప వచ్చును.

ఈశంకకు సమాధానంబును భీష్ముఁడే చెప్పెను. ఎట్లందురా? 'కృష్ణా! ఈయుద్ధంబునఁ గైదువు పట్టనని శపథంబొనర్చితివి. నీచేతనాయుధంబును బట్టింతునని నేను ప్రతిజ్ఞ చేసితిని. నా ప్రతిజ్ఞకై నీశపథంబును దిగవైచితివి; ఆయుధంబుఁబట్టితివి; నాపయినురవణించితివి. సంకల్పమాత్రంబున ముల్లోకంబుల నీఱుగావింపనేర్తువు. ఈవరాటునకై చక్రంబును బూనఁబనిలేదు. నీకు భక్తులెంతయుఁ బ్రియులు గావునను, వారికై యెంతయేసియుఁ ద్యజింతువుగావునను నీవట్లొనర్చి నీభక్తవాత్సల్యంబును బ్రకటించితివే గాని వేఱు గాదు. భక్తులయెడ నీయనురాగం బెంతో యీనీచేతయే లోకప్రచారము చేయు' నని భీష్ముఁడు చెప్పెను.

'నాభక్తులలోఁ బరాభక్తుఁడు త్తమోత్తముఁడు. అతఁడు నన్నేమియుఁ గోరఁడు. వానికి నేనిచ్చునదేమియు లేదు. వానికి భృత్యుఁడనై యుండు' నని భగవానుఁడు గీతలోఁ జెప్పిన వాక్యంబునకు నిదే నిదర్శనము. భగవత్ప్రేమాబ్ధియందు నప్పుడప్పుడు నిట్టియుత్తుంగంతరంగంబులు లేచి లోకదృష్టి నాక

క్షించి భక్తకోటికి నపారవిశ్వాసంబును నిభృతానందంబును గూర్చి వారిభక్తి నినుమడించుచుండును. ఇట్టి యత్యద్భుత నిదర్శనంబు లప్పుడప్పుడు గానవచ్చుటవలననే మర్త్యభక్తి యతిచంచలంబైనది కొంతకుఁగొంత నిలువనోర్చెను.

## ద్రోణప్రతిజ్ఞ.

భీష్ముఁడు వ్రాలినంతట ద్రోణాచార్యునకుఁ గౌరవ సేనాధిపత్యంబును గట్టిరి. అతఁడు మఱుసటి సాయంత్రము లోపల ధర్మనందనునిఁ బట్టి తెచ్చియిత్తునని దుర్యోధనునకు బాస చేసెను. ఆసంగతి రెండుశిబిరంబులందుఁ బఱచెను. కౌరవసేనయందు హర్షనాదంబు లుప్పతిల్లెను. పాండవబలంబును దైన్యమాక్రమించెను.

ద్రోణునెదిరించు ధీరుఁడు పార్థుఁడుతక్క నన్యులు పాండవపక్షంబునఁ గలుగరు. అర్జునుఁడు ద్రోణునెదుర్కొన్నచో యుధిష్ఠిరునిఁ బట్టుట యెవ్వరికిని సాధ్యముగాదని కౌరవులకు స్పష్టము. ద్రోణుని ప్రతిజ్ఞ చెల్లదేని యతఁడు ప్రాణంబులను త్యజించును. యుధిష్ఠిరుని జిక్కించుకొనుటకన్న ద్రోణుని దక్కించుకొనుట కౌరవులకుఁ బ్రధానమయ్యెను. కురువీరులుపాయంబు వెదకిరి. అర్జునునితో నాఁడెల్లఁ బోరు వారుండినఁగాని ద్రోణుఁడు ధర్మనందనునితోఁ బోరుట వానిని జిక్కించుకొనుట సాధ్యముగాదని వారు నిశ్చయించిరి. అంతటి వాఁడు వారిబలగంబున నెవ్వరును గానరారైరి. అట్లువారు పెద్దయుండడవు తలపోసి యెట్టకేలకు సంశప్తకగోపబలంబు నర్జునునితో మోటింప నిశ్చయించిరి. సంశప్తకులు కృష్ణశిష్టి

తులై రణశౌండీరులనియు నజేయులనియు లోకవిఖ్యాతిఁ గాంచిరి. ఆబలంబు నర్జునునితోఁ డీకొల్పిరి.

దుర్యోధనుఁడు పన్నిన యీకపటోపాయంబునఁ జేసి యర్జునుఁడు నాఁడు ధర్మజునకు దవ్వయి యన్యులతోఁ బోరుటయ్యెను. సంశప్తకులన్ననో యొక్కరొక్కరుఁడే గాండీవికి సాటియన నుండిరి. అంతటి వీరాతివీరులను జయించి యర్జునుఁడు యుధిష్ఠిరునిఁ జేరుట సులభకార్యముగాదని పాండవులకు స్పష్టము. ఎదిరించి నిల్చిన సంశప్తకులను గాదని మరలుట వీరధర్మముగాదు. ఇన్నిధర్మసంకటంబులకుఁ జిక్కి మార్గాంతరంబుగానక యర్జునుఁడు సారథిద్వితీయుఁడై సంశప్తకులను దాఁకెను.

సంశప్తకులు కృష్ణార్జునులను వారిప్రేమదేవతలనుగాఁ బూజింతురు. అట్టివారిని బూలతోమాఱుగా వాడితూపులతో నారాధించుట సంశప్తకులకు విధియయ్యెను. అంతటి ప్రియజనంబును దయాదాక్షిణ్యరహితంబుగాఁ జంపవలసినట్లు పార్థునకు సంప్రాప్తమయ్యెను.

కృష్ణునిసంగతియందుమా ? ఎవరు తనకై స్వప్రాణంబుల నాబాల్యంబుగా నర్పించియుంచిరో, ఎవరిని దాను స్వయముగా శిక్షించి రణకౌశల్యంబునఁ దనకు సాటివారినిగాఁ జేసెనో, ఎవరు తనకు మూలబలంబగుటవలన రణరంగంబులందు జయశ్రీ తన్ను వరించుటయ్యెనో, వారినే తనకన్నుల మ్రోలనే తనమిత్రుఁడే చీల్చిచెండాడుట చూచుచు నుండవలసినకాలము కృష్ణునకుఁ దటస్థించెను. అహహా ! విధివిలాసము దురూ

ష్యమనుటకు వేఱు నిదర్శనంబు వలయునా ? పండితుఁడు చచ్చినవారికైగాని చావనున్నవారికైగాని శోకింపఁడని కృష్ణ భగవానుఁడు బోధించిన సూత్రార్థంబును స్వానుష్ఠానపూర్వకంబుగా నిల్లు ప్రకటించెఁ గాఁబోలు.

అట ద్రోణుఁ డభేద్యమైన సేనావ్యూహంబును రచించెను. ఆవ్యూహంబునఁ బాండవసేన చిక్కెను. దానినిఁ గురుముఖ్యులు బొరిగొనసాగిరి. ధర్మజుని బలంబు వేలకొలంది చచ్చి నేలఁబఱచెను. మిగిలినవారికి బ్రదుకులు కల్లగా నయ్యెను. వారు నోరప్పళించి మినుకరింపసాగిరి.

ఆవ్యూహరచనావిధానంబును దత్ప్రవేశనిర్గమనరహస్యంబులను ద్రోణుఁడు పార్థునకొక్కని కిమాత్రమే గఱపెను. అర్జునునివలన వానిపుత్త్రుఁడు అభిమన్యుఁడు వ్యూహప్రవేశ రహస్యంబులనుమాత్రమే యప్పటికి నేర్చియుండెను. అర్జునుఁడు సంశప్తకులపోరులోఁ జిక్కియుండెను. పాండవసైన్యంబును రక్షించువారెవ్వరుఁ గలుగరైరి.

### అభిమన్యుఁడు.

అభిమన్యుఁ డప్పటికిఁ బదునాఱువర్షంబుల వాఁడుగా నుండెను. నాటి పాండవసేనారక్షణార్థం బంతకన్న దిక్కులేరైరి. పసిబాలుని బడబాగ్ని నుఱుకుమనుటెట్లు ? మిన్నకుండుటెట్లు ? కాదని యెవరైనను జెప్పినను ధర్మనందనుఁ డా బాలునిఁబంప సమ్మతించునా ? అర్జునుఁడియ్యకొనునా ? ఏమి సేయనగు ?

పాండవసైన్యార్తిధ్వనులు క్షణక్షణంబునకుఁ హెచ్చు

పెఱిగి వివరాకుండెను. నిమిషంబు నిదానించిన సేనాస్థితి విషమించుటగానయ్యెను. పాండవముఖ్యులు గత్యంతరము గానక ధర్మజునొద్దకుఁ బోయి చేతులు చాచి కన్నులు తెల్ల వైచి నిలిచిరి. యుధిష్ఠిరుని ధైర్యము తూలెను; వానియూహ యురలెను. పాండవాగ్రజుఁ డితికర్తవ్యతామూఢుఁడై సంగతి నభిమన్యునకుఁ దెలుపుమని సూచించెను.

వారల్లే యొనర్చిరి. ఆశూరాగ్రణి మాటతోడ లేచి యేకాకిగాఁ దరలి త్రికోణాకారంబుననున్న యూహవ్యూహంబు నొక్కకోణమందు భేదించి లోనికిఁ జొచ్చెను. వానిననుగమింప భీమాదులుద్యమించిరి. వారికి జయద్రథాదు లడ్డుపడిరి. అభిమన్యుఁ డొక్కరుఁడే కురువ్యాఘ్రంబులమధ్యఁ జిక్కెను. వానినిఁ గౌరవులు చుట్టుకొనిరి.

అభిమన్యుఁడు తనయొంటరితనంబును దలంపక పరాక్రమించెను. వానియుద్ధతి దుస్సహమయ్యెను. కౌరవసైన్యంబు తుత్తునియలై కూలసాగెను. ఒక్కరుగా వానినెవ్వరు నెదిరింప లేరైరి. ముప్పదప్పుడెఱవు దోఁపదయ్యెను. కౌరవవీరులు భయాక్రాంతులై నీతినియమంబులను దయాదాక్షిణ్యంబులను మఱచి యుద్ధమర్యాదలఁ దప్పఁ ద్రోచి, బాలుండనియు నొంటరియనియుఁ దలంపక పెక్కురొక్కుమ్మడి నలుప్రక్కల వానిని గవసి యుక్కుమీఱి శరవర్షంబును గురిపించిరి. అభిమన్యుని శౌర్యపరాక్రమంబులు చెలరేఁగెను. వానియెదుట కౌరవులట్లు గుమిగూడియు నిలువఁజాలరైరి.

కురుముఖ్యులంతట మంతనంబులు గావించి ధర్మాధర్మం

బులకు సెలవిచ్చిరి. ద్రోణుఁడు కర్ణుఁడు మున్నగువారు వీరాతివీరు లేడ్గురొక్కసారిగా వానిఁ గవసిరి. ఒకఁడు వాని రథాశ్వంబులను ద్రుంచెను; ఒక్కఁడు వానిసారథిని వైచెను; ఒక్కఁడు వానివింటివిఱిచెను; ఒక్కఁడు వానికవచంబును జీల్చెను. అట్లయ్యు నభిమన్యుఁడు వారికెల్ల యుద్ధంబొసంగెను. వాని ధైర్యసాహసంబులును వానిశస్త్రాస్త్రకౌశలంబును నెల్లరు శ్లాఘించిరి. నాటి యుద్ధంబునకు సాటియైనయుద్ధంబు భారతసంగ్రామమందే లేదనిరి.

అభిమన్యుని నిలువెల్ల జల్లెడక్రంతలాయెను. రథంబు విఱిగినను గవచంబు వ్రీలినను ఖడ్గచాపంబులు దునిగినను వైరిశరాగ్నులు జడిగొని కురిసికాల్చుచున్నను, ఆపాండుసింహకిశోరంబు ఆవీరశిఖామణి తండ్రిరాకను నిరీక్షించుచు మోము మరలింపఁడయ్యెను. వాని తెంపునకుఁ గర్ణుఁడు నోరప్పళించెను; వానిబాణప్రయోగకౌశల్యంబునకు ద్రోణుఁడు తలవ్రాల్చెను; వానివిక్రమంబునకుఁ దక్కినవారు వక్రముఖులైరి.

అభిమన్యుఁడట్టి దురవస్థనుండఁగా దురాత్ముఁడు సైంధవుఁడు దయాదాక్షిణ్యంబులు వదలి పాపభీతికి వెఱవక నిలువున వానితలఁ ద్రుంచెను.

"సీ॥ జగములన్నియును దేజంబున వెలిగించి
యపరాద్రి సేరిన తపనుమాడ్కిఁ
దఱచైనకానలు దరికొనినివుఱుగాఁ
జేసియాఱిన దవశిఖవిధమున
గగనంబుతోరాయు కరదులుగలజలం
ధివుఁగఁబాఱినమహార్ణవముకరణి
నున్నతగతిఁ జెడి యుర్విపైఁ గడు
విన్నఁనైపడియున్న సుధాంశుభంగి.

తే॥ వీరమునఁ దమవారికిఁ జెంపొనర్చి
యరుల సమయించివసమతి యనువు దప్పి
తెగియుఁ జూడ్కికిఁజాల వ్రేఁగగుచుఁ బొలిచె
మహితమూర్తి శోభితుఁ డభిమన్యుఁడప్పుడు.

ఆకఠోరవార్తకుఁ బాండవసాగరంబు ప్రలయకాలసంక్షోభంబు నందెను. హా! ఉత్తరా! హా! సుభద్రా! అను రోదనంబులు పెల్లురేఁగెను. ఆయన్యాయంబునకుఁ బాండవ బలంబు క్రోధమూర్ఛితయయ్యెను. అర్జునుఁడేడీ? అని పాండవసేనాదృష్టి పార్థుదెసఁ జూడసాగెను.

### అర్జునప్రతిజ్ఞ.

అర్జునుఁడు సంశప్తకసైన్యంబును దెగటార్చి శిబిరంబునకు మరలెను. అంతలోన సూర్యుఁడు పశ్చిమాంబోధిఁ గ్రుంకెను. ఇరువాగులు యుద్ధంబు విరమించెను. కౌరవ శిబిరంబునుండి ప్రమోదధ్వనులు వానికి వినవచ్చెను.

అర్జునుఁ డాహర్షధ్వనులకు వింతపడుచుఁ దనశిబిరంబునకు. వచ్చి యది మాటుమణఁగినట్లుండుటకు దైన్యమంది 'కృష్ణా! సంతోషపటహంబులు మనశిబిరాన మ్రోయవు. నన్నుఁ జూచినంతనే పైఁబడివచ్చి నాటి తమ సాహసవిక్రమంబులను దెలుపుచుండు మనవీరులెవ్వరును నేఁడు గానరారు. ఏలనో మనవారు నన్నుఁగాంచి దవ్వుదవ్వునఁ దొలఁగి తొలంగి పోవుచున్నారు. కృష్ణా! నాచిత్తము సంవిత్తముగానున్నది. నాసోదరులు సుఖముందురుగదా. పాంచాలవిరాటులు సేమమేగదా. నాసుతుఁడభిమన్యుఁడు సహోదరులతోడ నన్నెదుర్కొనరాఁడేల?' అనుచుఁ దహతహపడసాగెను.

సంగతియెల్ల నిట్లో పార్థునకుఁ దెలిపిరి. అతఁడు పిడుగడఁచి గుండియలు వ్రీలినట్లుగాఁ గూలెను. ఎవ్వరును వానిని డాయ నోడిరి ; సేదతేర్చువారైనను గలుగరైరి. కృష్ణుఁడు మహాగాంభీర్యము వహించి తనహస్తంబులతో వానికి సకలోపచారంబులు గావించి యతనిని దేర్చి 'అర్జునా ! నీధైర్యమే మాయెను ? ఇంతబేలవని యెన్నడును దలంపనైతిని. 'విపది ధైర్య' మనిరి. విపత్తునకు రాని ధైర్యము నోక ధైర్యమా ? శూరులకు వీరస్వర్గము స్వతస్సిద్ధము. అభిమన్యుఁడు వీరస్వర్గంబు నారోహించెను. ఇంతకన్న మేలు మగఁటిమిగలవారికిఁ గలదా ? తనువులు శాశ్వతంబులుగావు. ఈసంగతి నీకుఁ జెవినిల్లుగట్టి చెప్పితిని. నాయుపదేశంబెల్ల వ్యర్థమేనా ? అయ్యో ! నీకై పగతురు నవ్వుచున్నారు. ఇఁకఁ జాలులెమ్ము. నీసోదరులను దుఃఖసాగరంబున మునిగినవారి నుద్ధరింపు' మని యోదార్పులు పలికెను.

అర్జునుఁడు కొంతవడికిఁ దేఱి క్రోధపరీతాత్ముఁడై 'ఆ! దురాత్మా ! సైంధవా ! ఇంకను జీవించియున్నావా ?

"చ॥ అనిమిషదైత్య కింపురుషులాదిగ నెవ్వరువచ్చి కాచినం
దనుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్రుఁడు గ్రుంకకుండు మ,
న్న నరవరేణ్య ! యిత్తెఱంగు నాకొనరింపఁగ కాకయున్న నే
ననలము సొచ్చువాఁడ నృపులందఱుఁజూడఁగ గాండివంబుతోక॥"

ఆ॥ వె॥ ఇట్టుసేయనైతినేని గురుద్రోహి
గతికి బ్రహ్మఘాతిగతికి మద్య
పానరతునిగతికి మాసార్వ జనపది
వాదిగతికిఁ బోవువాఁడ నధిప !"

అని కఠోర ప్రతిజ్ఞ చేసెను. ఆశపథంబునకుఁ బాండవ సైన్యంబు సింహనాదంబులు గావించెను.

కృష్ణుని మనస్తాపము.

అర్జునుని తీవ్రశపథంబునకుఁ గృష్ణుఁడు వెలవెలనై 'కటా! ఇతఁడు ఘోరశపథంబుఁ గావించెను. ఇది కౌరవులు వినకమానరు జయద్రథునిరక్షణార్థము వారు రేపు సర్వ ప్రయత్నంబులొనర్తురు. పార్థుఁడు నిజప్రతిజ్ఞానుసారంబుగా పటిసూర్యాస్తమయంబులోన జయద్రథునిఁ బరిమార్చుట సులభకార్యము గాదు. ప్రతిజ్ఞ విఫలమైన నితఁడన్నంత చేయును. వీనిని నిమిత్తముచేసి ధర్మస్థాపనకార్యమున్నది. ఇతఁడు నన్ను నమ్మి యుద్ధంబునకుఁ గడంగెను' అని తలపోసి 'దారుకా! అర్జునుఁడు పుత్త్రశోకార్తుఁడై తనయార్తినిఁ గఠోరప్రతిజ్ఞాపూర్వకంబుగా వెల్లడించెను. ఇతని ప్రతిజ్ఞా ప్రతిహతార్థము దుర్యోధనుఁడు సర్వశక్తుల వినియోగించును. అర్జునుని ప్రాణంబులకు మహాసందిగ్ధావస్థ సంభవించెను. వా నిని రక్షింపకతీఱదు. నారథంబును సమస్తాయుధంబులతోడ సిద్ధపఱచి వేచియుండుము. నాశంఖారావము చెవిఁబడినంత నే దానిని గొనిరమ్ము' అని సారథికి దిట్టపఱచెను.

కృష్ణనిశ్చయవిమర్శము.

పై వాక్యంబులఁబట్టి కృష్ణుఁడు యుద్ధసన్నద్ధుఁడనక తీఱదు. భీష్మార్జునులయుద్ధమప్పు డేశంకగలిగెనో యాశంక లే యిప్పుడును గలుగును. భీష్మునివలె నర్జునుఁడును భక్తుఁడే గావున భీష్మోదితమైన సమాధానమే యిచ్చుటఁగూడ నన్వయించును.

పాపార్థంబును గోరినను భగవంతుఁ డిచ్చునా ? అట్లిచ్చుట వానికి విధియగునా ? యని శంకింపవచ్చును. ఎవరే యర్థంబును గోరినను భగవంతుఁడిచ్చును. అట్లు కానినాఁడు లోకోపకారబుద్ధితో దుష్టులు చేయు తపంబులకు ఫలంబులు చేకూఱరాదు. రావణాదులే యిందులకు నిదర్శనము. భగవంతునకు రాగద్వేషంబులు గలుగవు. కనుక యాయనకోరినవానికిఁ గోరినదిచ్చుట తప్పుగాదు. శుభాశుభంబులకుఁ గోరినవారే పాత్రులు. అట్లుగాక భగవంతునిపయి భరన్యాసంబు చేసినచో భగవంతుఁడప్పు డేది మేలో యదే యిచ్చును. ఫలార్థసోవ్రతాదులకును భరన్యాసంబునకు నెంతో తారతమ్యము గలదు.

కోరికలెల్ల గుణకార్యంబులు. కావున గుణంబును బట్టి సంకల్పంబులుదయించుచుండును. సంకల్పము రూపుతాల్పక మానదు. సిద్ధికాలము సంకల్పవేగంబును బట్టి యుండును. సత్వగుణసంకల్పంబులు శుభకరంబులు. తక్కిన రెంటిసంకల్పంబులు కర్తకుఁ దాత్కాలిక తుష్టిని గలిగించునే గాని పరిణామంబున నెగ్గులకే యగును.

కాఁబట్టి కోరికలను భగవంతుఁడు కూర్చుననుట గౌణార్థమేగాని సత్యముగాదు. గుణంబులును వానిసంకల్పంబులును దత్ఫలంబులును స్వతస్సిద్ధంబులై వర్తించుచుండును. ఓగుబాగులకు నెవనికివాఁడే కర్తయగును. ఇదేభావంబును గీత 'ఆత్మైవహ్యాత్మనోబంధు' అనుచోట స్పష్టపఱచెను. శాస్త్రము గురూపదేశము సజ్జనసాంగత్యము సహకారులగును. సిద్ధి యత్నాధీనము.

యుద్ధము రాజ్యార్థమై కురుపాండవులకుఁ బొసఁగెను. జయద్రథునితోఁ గృష్ణుఁడు పోరఁదగినది భక్తుని ప్రతిజ్ఞా రక్షణార్థమేగాని కౌరవరాజ్యార్థము గాదు. కావున కృష్ణుఁడు జయద్రథునితో యుద్ధమొనర్చినను శాసనతప్పుటకాసేరదు. ఈధర్మసూక్ష్మంబును మఱవరాదు.

కృష్ణుఁడట్లు సారథికి నాజ్ఞాపించి పుత్త్రశోకార్తయై యున్న సుభద్రకడకుఁజని 'సోదరీ! లోకంబెల్లఁ గాలవశమై యున్నది. కాలమైననాఁడు నిలువనెవ్వరికిఁ దరముగాదు. ఈసంగతి యెఱింగియు నీవు మూఢులవలెఁ శోకానలంబునఁ గూలనేల ? సోదరీ ! బ్రహ్మచర్యతపోదానాదులవలనఁ బడ యనైన యుత్తమగతికన్న సౌఖ్యకారిణియైన గతిని నీసుతుఁడు వడసెను. ఇఁకఁ గుందనేల ? అమ్మా ! వీరపుత్త్రివై జనించితివి ; మహావీరపత్నివై వెలసితివి ; వీరమాతవై రాజిల్లితివి. అట్టి నీవు వీరస్వర్గముఁ జూఱఁగొన్న పుత్త్రునకుఁగా వగవనగునా ? శోకముమాని కోడలి నోదార్పు' మని యామెకు దుఃఖప్రశమనోక్తులు పలికెను.

## సైంధవవధ.

సూర్యోదయంబుతోడ యుద్ధమారంభమయ్యెను. కౌరవులు పార్థప్రతిజ్ఞావచనంబులను విని తమలో నాఱితేఱిన వారిఁ గూర్చి 'ద్వాదశగవ్యూతిదీర్ఘంబును బంచగవ్యూతి విస్తృతంబునుగా శకటవ్యూహంబు నమర్చి, దానికిఁ బశ్చిమార్ధంబున గర్భవ్యూహంబుగాఁ బద్మవ్యూహంబును బన్నించి, తన్మధ్యంబు మొదలుకొని యోపినసేనాముఖంబు దెసకుంజాలి నిగుడునట్లుగా సూచీవ్యూహంబును గావించి, దానిముఖంబునఁ

కృతవర్మయు నటఁ బిఱుదం గాంభోజరాజును మఱియు బిఱుసన జయద్రథుండును నిలుచునట్లుగా నొనర్చిరి. ద్రోణాచార్యుం డభేద్యమైన యాశకటవ్యూహంబు ముఖంబున యుద్దండకోదండుఁడై నిలిచెను.

వ్యూహంబట్లు రచించుటం జేసి కౌరవసేన నెల్లఁ దదీయ ముఖ్యులతోడఁ జంపిగాని జయద్రథుని జెనకుటకు సాధ్యము గాదయ్యెను. అది యమానుషిక కార్యంబుగా నెల్లరును భావించిరి. జయద్రథగి.ణంబునకన్నఁ బార్థప్రతిజ్ఞాభంగము కౌరవులకు ముఖ్యముగాఁదోఁచి కృష్ణుఁడుతలంచినట్లు వారు సర్వశక్తుల సమకూర్చిరి.

అర్జునుఁడు రణరంగము సొచ్చెను. యుద్ధంబు మహాఘోరంబును భయంకరంబునై పాటిల్లెను. దుర్ధర్షణుఁడు దొర్లెను; దుశ్శాసనుండు పార్థునిఁడీకొని కొంతవడి పోరి భయగ్రస్తుఁడై పాఱసాగెను. వానిని గిరీటివెంబడించెను. అతఁడు పఱచి ద్రోణుని చాటున దాగెను. ద్రోణుఁడర్జునుని నెదుర్కొనెను. గాండీవి గురువునకు నమస్కరించి యనుజ్ఞాతుఁడై వానితో నసికిఁ దొడఁగెను.

అర్జునుఁడట్లు కొంతవడి ద్రోణునితోఁబోరి వానినతిక్రమించి శ్రుతాయుధప్రముఖకౌరవమహారథికులను జంపి విందానువిందులను బరిమార్చి దుర్యోధనుని దలపడి కర్ణుని ఢీకొని యతనిని దర్పహీనునిగాఁ జేసి సైంధవుని గదిసెను. అంతలోనఁ గృపాచార్యుఁడు నశ్వత్థామయు శల్యుఁడు వృషసేనుఁడు నొక్కటిగాఁ గిరీటికి నడ్డుపడిరి. ప్రాగ్దుష్క్రంకనుండెను. అర్జునుఁ

డదిగాంచి తనప్రతిజ్ఞను స్మరించి రెట్టించినపట్టుదలతో వారి నెల్ల నతిక్రమించి జయద్రథునివంక మరలెను.

సూర్యుఁడస్తమింపకుండుట కృష్ణుఁడుగాంచి యర్జునుని ప్రతిజ్ఞాభంగంబును శంకించి చక్రంబును వదలెను. మాయా తిమిరంబులు మింటఁ గ్రమ్మి రవిమండలంబును మఱుగుపఱచెను. సూర్యుఁడస్తమించెనని కౌరవసైన్యంబుప్పొంగి జయధ్వనులు గావించెను. సైంధవుఁడు చావుతప్పెనని తలంచి తల యెత్తిచూచెను. పార్థుఁడు వానిమస్తకంబును దునిమెను. అంతలోనఁ దిమిరంబులు విచ్చిసి సూర్యుఁడు కంటికిఁ గాన్పించి పశ్చిమాంబోధి వ్రాలెను. నాఁటికి యుద్ధము ముగిసెను.

సైంధవవధయందు గృష్ణుఁడుగావించిన కపటోపాయంబును గూర్చి నానావిమర్శనంబులుగలవు. సంకల్పమాత్రంబునఁ జరాచరసమస్తసృష్టిని బుట్టించి పెంచి హరింపసమర్థుఁడైన భగవంతుఁడు మర్త్యమాత్ర సంహారార్థము కపటోపాయంబును బన్ననేలనో యూహింపరాదనియు, అట్లు పన్నెననుట నమ్మరాదనియుఁ, బ్రాణులను వారికర్మమే హరించునని యు, కర్మగతి దురూహ్యంబనియు, సైంధవుని కర్మగతి యట్లు పరిణమించి మింటమబ్బులు వ్రేల్చి వానిని నమ్మించి హరించెననియుఁ గొందఱు భావింతురు.

అట్లగునేని వ్యాసమహర్షి యట్లురచించునాయనియు, గృష్ణునిచర్యలెల్ల నిట్టి సందిగ్ధాంశంబులై యుక్తికమించి లోకంబును భ్రాంతి పఱచుచున్నవనియు, మహర్షివచనంబులును ద్రోసిపుచ్చి విపరీతవ్యాఖ్యలు చేయుటకన్న యథారీతి

గ్రహించి భగవద్గీతల రహస్యంబులు దుర్గ్రాహ్యంబులని మిన్నకుండుట మేలనియు మఱికొందఱు తలంతురు.

### ద్రోణపతనము.

మఱునాఁడు యుద్ధమారంభమయ్యెను. ఆఱునాళ్ళుగా ద్రోణుఁడు వానినాయకత్వముక్రిందఁ గౌరవయుద్ధము జరిపెను. ఆయాఱుదినంబులు కౌరవులు జయశ్రీని బడయకున్నను నోటమినొందరైరి. ద్రోణునిశక్తి సన్నగిల్లెను. అతఁడంతట శరచాపంబులను సన్యసించి ముకుందపాదారవిందంబులందు మది నిల్పి ధ్యానస్థితుఁడయ్యెను. అత్తఱి ధృష్టద్యుమ్నుఁడు వానిశిరంబుఁ గుసిమెను. కౌరవులు భయవిహ్వలులై దుఃఖారావంబులతోడ వారిశిబిరంబుఁ జొచ్చిరి. ఒంటరిగాఁ జిక్కినబాలుని నభిమన్యుని మందలయుండి చేసేతలఁ జంపించిన పాపంబు ద్రోణునకు నట్టిగతినే కూర్చెనని పాండవసైన్యంబు సంతసించెను.

ద్రోణునిఁజంపుట పాండవులకు సాధ్యముగాదనియు, అతఁడున్నంతకాలము పాండవులకు జయము చేకూఱదనియు, ద్రోణుని ముఖాముఖి యెదిరించి చంపఁజాలరనియుఁ గృష్ణుఁడు తలపోసి యుపాయాంతరంబున వానినిఁ దెగటార్ప నిశ్చయించి, తత్పూర్వము భీముఁడు చంపియున్న యశ్వత్థామయను కుంజరంబును నిమిత్తముగాఁగొని, యేతన్మాత్రులమాట ద్రోణుఁడు నమ్మఁడుగావున ధర్మనందనుని నోట 'అశ్వత్థామహతః కుంజర' అని బలవంతముగాఁ బల్కించె ననియుఁ, బుత్రశోకంబున ద్రోణుఁడు శస్త్రసన్యాసంబు గావించెననియు భారతము.

ఏసంగతియైనను సందర్భోచితంబుగాఁ జెప్పఁబడుననియు, అనుక్రమణికాదులందు ద్రోణశస్త్రసన్యాసకథనంబునకు నవకాశములేదనియు. రణాగ్రంబున వీరులపరస్పరదూషణంబులును ప్రగల్భంబులును సహజంబులే యనియు, భీమునికన్న వేయంతలుగా ద్రోణుఁ డంతటో దూషించియుండగా వానినెల్ల సహించినవాఁడు భీముని పిల్లిశాపంబులకు వెఱచి శస్త్రసన్యాసంబొనర్చెననుట యసంభావితంబనియు, ఋషిశాపంబన్ననో వారుశపించిన తర్వాతఁగూడ ద్రోణుఁడు యుద్ధమొనర్చి యెందఱనో చంపెననియు యుద్ధశ్రాంతివలన భారతవీరుఁ డెవ్వఁడును శస్త్రసన్యాసంబుగావించినట్లుగా నచ్చటను గానరాదనియు, పుత్త్రశోకంబుననే యతఁడు శస్త్రసన్యాసమొనర్చెననియు, తపోబలాదు లెఱింగియున్నను సత్యసంధుఁడని పేరుగాంచిన ధర్మనందనుఁడంతటివాఁడు చెప్పినమాట ద్రోణుఁడు విశ్వసించుట వింతగాదనియు, మిన్నులుమీఁదవ్రాలినను గురువునకు ధర్మజుఁడు బొంకఁడను విశ్వాసము ద్రోణునకు నుండుటఁజేసి యతఁడు వానిని నమ్మెననియు, పై కారణంబులఁబట్టి కుంజరకథ కల్పితంబుగాదనియు ప్రతివాదము చేయుదురు.

కృష్ణుఁడట్లు బోధింపనగునా ? ధర్మజుడట్లు పల్కఁదగునా ? యనువిషయంబులు వేఱు. కృష్ణుఁడట్లు చెప్పించెనా ? లేదా ? అనునది ప్రస్తావనవిషయము. ధర్మనందనునిరథము భూమిమీఁద జానెడెత్తునఁ జరించుచుండినది అసత్యవచనఫలంబుగా నేలదాఁకి చరించుటయ్యెననియు, వానికి నరకసందర్శనంబుగూడఁ గల్గెననియు భారతమే చెప్పుచున్నది. ఎవఁడు నాఁడు జరాసంధుని భీమునిచేత నట్లు చంపించెనో, అభిమన్యుని

దుర్మరణంబెఱింగియు నెవఁడు ప్రతీకారము తలంపఁడో యట్టి కృష్ణుఁడు ధర్మజునోట నట్లు చెప్పించుట వింతగాదు. కారణ మందురా ? అదికృష్ణునకే గోచరము. ఇది ధర్మమా యని యందు చేసి ధర్మాధర్మంబులతత్త్వము లౌకికదృష్టికి సమగ్రంబుగా బోధపడవు. భగవంతునిచర్యలెల్లఁ బారలౌకికధర్మ నిబద్ధంబులై యుండును. తత్త్వము గోచరింపనంతమాత్రాన నే యీశ్వరేచ్ఛను నిందింపరాదు.

## హింస—అసత్యము.

హింసయు నసత్యంబు నెవ్వారికి నేవేళను గూడదని శాస్త్రంబులు ఘోషించుచున్నవి. అనుభవంబుగూడ నదేభావంబును దూఢిచేయుచున్నది. అట్లగునేని శ్రీకృష్ణభగవానుఁడే మందలనుండి పదునెనిమిదియక్షౌహిణులనెట్లు చంపించెననియు, ధర్మరాజునోట నెట్లు బొంకించెననియు శంకింపనగును.

అశాస్త్రీయ ప్రాణివధ హింసయగుననియు, అట్టిదానిని స్వయముగాఁ జేసినను, ఒకరుచేసినదాని ననుమోదించినను రెండునొకటేయనియు శాస్త్రము. పరప్రాణి మనోవాక్కాయ కరణంబులలో నెద్దానికైనను నొప్పిఁగలిగించుట హింసయగుననియు, విన్నదానినిగాని కన్నదానినిగాని యథారూపంబుగా వచింపక గోరంతపొల్లుగావించినను అదియసత్యమనియు సామాన్యభావము. ఈభావంబునకు నపవాదము కలదా? లేదా?

ఆత్మార్థముగా నన్యులకు నొప్పికలిగించినప్పుడే యది హింసయగుననియు, ఆత్మార్థముగానినాఁడది యెంతమాత్రమును హింసకానేరదనియు, సత్యాసత్యనిర్ణయంబునకుఁగూడ

నదే పరమసూత్రమనియు శ్రీకృష్ణభగవానుఁడే హింసా సత్యంబుల పరమతత్త్వంబును గీతలోనే నిశ్చయించి, వీనివిషయమైన సామాన్యభావంబునకు నపవాదమును దెలిపెను. బుద్ధులుగూడ నీసిద్ధాంతంబునే యంగీకరించి 'సూక్ష్మా గతిర్హి ధర్మస్య' యనిరి. కావుననే అవధ్యహింసానుబంధి యుద్ధ భావంబునుగూడ నన్నృతమందే గ్రహించిరి.

కర్మఫలంబు సంకల్పంబునుబట్టి యుండును. సంకల్ప ప్రమాణంబును దత్కర్మఫలంబునుబట్టి నిశ్చయింపవలయును. ఏదిలోకహితకరమో యదే సత్యంబనియు నదే యహింసయనియు సనత్కుమారులవారు నుడివిరి. ఆభావంబునే శుకనారదాది మహాత్ములు హర్షించిరి. ఈసూత్రంబును నిదానంబుగా గ్రహించి శ్రీకృష్ణభగవానుని చేయిదంబుల తత్త్వమును నిశ్చయింపవలయును. కేవలబాహ్యదృష్టితో సూత్రార్థంబులను నిశ్చయించుట యెంతయుఁ బ్రమాదకరంబగును. ఈయర్థంబును బోధించుటకే 'బ్రాహ్మణవ్యాధసంవాదంబు' భారతమందు రచింపఁబడెను.

ఇట్టిగ్రంథులనువిచ్చి తత్త్వబోధచేయుటయందు భారతంబునకు సాటిగలుగదు. ఇట్టిముడులకు భారతంబుచెప్పిన సమాధానంబుకంటె నుపపన్నంబులైనవి యీదేశమందుఁగాని దేశాంతరఖండాంతరంబులందుఁగాని నాటికినేటికిఁ గానరావు.

ఇట్టివానిని యుక్తిమూలకంబుగా నిశ్చయింపరాదు. ఇవి యింద్రియాతీతములు. యుక్తియన్నచో యింద్రియ కారణమగును. మఱియెటందురా ? మహాత్ములకు మోహా

రహితంబును సమాధిస్థితంబునైన దశలో నేమిస్ఫురించునో యదే గ్రాహ్యము. అది యింద్రియకార్యముగాదు; ఆత్మ స్ఫురణంబు. అదే యథార్థము. దానికి సేఁగియే లేదు.

కృష్ణ.

భీష్మద్రోణులపతనముతోడఁ గౌరవబలంబునకుఁ బ్రాపు తొలంగెను. దుర్యోధనుఁడు దుఃఖము పైకొనెను. అయినను జయకాంక్ష వానిని నిలువనీయదు. అర్జునుని నోడింపఁగలవాఁడు కర్ణుఁడుదక్క నన్యులు లేరని వానికి స్పష్టము. వాని యాసలెల్ల రాధేయునందు మూర్తీభవించి నిలిచెను. అట్టి తలంపుతో దుర్యోధనుఁడు కర్ణుని సర్వసేనాధిపతినిగాఁ జేసెను.

అర్జునునకుఁ గర్ణుఁడాగర్భశత్రువు. కర్ణసంహారము వానికిఁ జిరదీక్షయై యుండెను. కర్ణుఁడుగూడ నర్జునుని నాగర్భశత్రువుగాఁ దలంచి తత్సంహారదీక్షతో నుండెను 'కర్ణుఁడో యర్జునుఁడో యొక్కఁడు నీకు శేషించు'నని కర్ణుఁడు కుంతితోఁ బల్కినపల్కులచేతనే కర్ణార్జునులవైరం బెట్టిదో విదితమగుచున్నది. వారిమత్సరంబు నూహింపనగునేగాని వచింపఁదరముగాదు. మత్స్యయంత్రమునాటినుండి వారియెదలలో రగులుచుండిన క్రోధాగ్ని యప్లేయుండెను. వారిరువురలో మేటియెవఁడో లోకము గ్రహించుతఱి యాయెను.

ఇరుమొనలు దలపడెను. పిడుగులంబోని బాణంబులు కర్ణకార్ముకనిర్ముక్తంబులై వర్షించెను. పాంచాలురు కూలిరి; పాండవసేన చెల్లాచెదరయ్యెను. సేనాపతులు వెలవెలనై

నిల్చెను. యుధిష్ఠిరుండు రణరంగంబునుండి మొసరిల్లెను ; భీముఁడు గర్జించుచు 'అర్జునా ! పాండవేంద్రుని రక్షించు కొనుము' అని హెచ్చరించెను.

అర్జునుఁడంతటఁ గర్ణునిఁదలపడెను. కర్ణుఁడు యుద్ధశ్రాంతుఁడై యున్నను గవ్వడి గానవచ్చినంతనే లేడిపయి పులివలె నతనిపయి నుఱికెను. ఇరువీరులు హోరాహోరీఁ బోరాడసాగిరి. కర్ణునిరథచక్రంబు రుధిరసిక్తమైన భూమిలోఁ గ్రుంగెను. అతఁడు రథంబునుండి దుమికి 'అర్జునా ! క్షణకాలము సహింపుము ; ఇదే రథంబును లేవనెత్తెద; యుద్ధనియమములు నీకుఁ దెలియనివి కావు ; వానినతిక్రమించి నన్ బాధింపకు' మనెను.

శ్రీకృష్ణుఁడామాటవిని 'కర్ణా ! ధర్మము నేఁడు నీకు జ్ఞప్తికి వచ్చెనా ? దుర్యోధనునకు దుర్బుద్ధిఁగఱపి లాక్షాగృహంబును నిర్మించి యందుఁ బాండవులను బ్రవేశపెట్టి వారుసుప్తులై యుండఁగా నయ్యింటికి నిప్పుపెట్టించిననాఁడు నీధర్మబుద్ధి యేమాయెను ? శకుని మాయాదురోదరంబున ధర్మరాజునోడించి పాండవరాజ్యంబును హరించి వారిని గుట్టలకుఁ దోలిన నాఁడు నీధర్మబుద్ధి యేమాయెను ? ఏకవస్త్రయు మహాపతివ్రతయునైన పాంచాలిని సిగఁబట్టియీడ్చి నిండుసభలోఁ దత్పతులకెదుట నామెవలువ నొలుచుటకు దుర్యోధనదుశ్శాసనులఁ బ్రేరేపించిననాఁడు నీధర్మబుద్ధి యేమాయెను ? పదునాలుగేండ్లబాలుని వీరాతివీరుని నభిమన్యుని నొంటరిగానున్న వానిని మీరేడ్గురును బెబ్బులులవలె నొక్కుమ్మడి గ్రమ్మి చంపినప్పుడు నీధర్మబుద్ధి యేమాయెను ? తెలిసి తెలిసి యాద్యూం

తంబు నధర్మంబునాచరించి యిప్పుడు ధర్మంబును బలుక సిగ్గు గాదా ? కర్ణా ! ఎవరు ధర్మంబును బోషింతురో వారినే ధర్మము రక్షించును. దుష్టులు కౌరవులు ధర్మంబును నిరసించిరి. తత్ఫలముగా వారెల్లరును ధర్మపరిత్యక్తులై పాండవులచేత సపుత్రమిత్రబాంధవంబుగాఁ జావక తప్పదనెను.

కటుకుటమ్ములవోని యానిందావచనంబులకుఁ గర్ణుఁడు మాఱాడనేరక చక్రంబునెత్తి రథంబారోహించి శరసంధాన మొనర్చెను. ఇరువీరులు మరలఁ బోరఁదొడంగిరి. శస్త్రాస్త్రవిద్యలకు నాఁటివిడుపోయనఁ దోఁచెను. నభోభాగంబు బాణౌఘనిబిడీకృతమై రవికిరణప్రసారంబునకు సందుగానరాకుండెను ; అకాలపుంజీకట్లు గప్పెను ? ఎట్టకేలకుఁ గర్ణుఁడు రథంబుపయి నొరిగెను. వానికిఁ గౌరవసైన్యంబు వెఱచి పఱచెను.

దుర్యోధనుఁడు.

కర్ణునితోడ దుర్యోధనుని యడియాసలుడిగెను. అతఁడెంతయు నంతస్తాపపరిదగ్ధుఁడు కాసాగెను. అత్తఱిఁ గృపాచార్యుఁడు వచ్చి 'దుర్యోధనా ! ఇంతటనైనను బాండవులతో సఖ్యమొనర్చి సుఖముండు'మని యెంతో బతిమాలెను వాని యహంభావంబునకుఁ గృపుని హితంబు రుచింపదయ్యెను. దుర్యోధనుఁడు వెక్కసము గ్రక్కుచు 'గెలపోచావో రెంటనొకటి తప్పదు ; ఒండుమాటలే'దనెను.

శల్యునకు సేనాధిపత్యముఁ గట్టిరి. అతఁడు నాటి మధ్యాహ్నము లోపలనే యుధిష్ఠిరునిచేత మడిసెను. ఏకాదశాక్షోహిణీసైన్యము వేలసంఖ్యకు వచ్చెను. హతశేషులు

చెసలుపట్టిరి. వారిని నిలుపువారును లేరైరి. నాటికిఁ బాండవుల యేడక్షౌహిణీ సైన్యమందు రెండువేలు రథికులు నేడు వందలు హస్తికులును నైదువేలు సాదులును బదివేలు పదాతులుఁను మిగిలియుండిరి.

దుర్యోధనుడు నిజసైన్యస్థితికి వెలవెలనై పిఱికిగొని రణరంగంబు వదలి గుఱ్ఱమెక్కి యేకాకిగాఁ బఱచెను. పాంచాలురు వానిని వెన్నంటి తఱిమి కౌరవశిబిరంబును జయధ్వనులతోడ వశపఱచికొనిరి.

దుర్యోధనుడట్లు పఱచి యేకానేకవనము సొచ్చి గుఱ్ఱమును విడిచి కాల్నడతోఁజని జలస్తంభనయోగంబు నాశ్రయించి ద్వైపాయనంబను తటాకంబు నుదకంబులలో దాగి లోకంబునకు మోముచూపనని నిశ్చయించుకొనెను.

జలస్తంభనయోగప్రభావంబున సంవత్సరంబులపర్యంతము జలాంతరమందుండవచ్చును. అట్లే భూస్తంభనయోగప్రభావంబున నేండ్లు పూండ్లు నుండవచ్చును. అట్లే వాయుస్తంభనాదియోగంబులు గలవు. ఈయోగంబుల నిటీవలవఱకు నవ్వుచుండిరి. కొందఱు యోగులిట్టియోగంబులప్రభావంబును బాశ్చాత్యదేశంబులందుఁ గొమ్ములుతిరిగిన శాస్త్రజ్ఞులమ్రోలఁ బ్రదర్శించి వారివలనఁ బరపరిక్షితులై సన్మానంబులంది యోగవిద్యయెడఁగల యవిశ్వాసంబును దొలఁగించిరి.

దుర్యోధనజలాంతరయోగంబును గూర్చి యాధునిక గ్రంథకర్తయొకఁడు పరిహసించెను. అతీంద్రియరహస్యంబులను యుక్తినాశ్రయించి నిరసించుట యిప్పటివారికి సాచార

ముగానున్నది. యోగమహిమలకు నంతముగలుగదు. వానిలోఁ గొన్ని నిన్ననేఁడు మనకు సాక్షాత్కరించుచున్నవి. రామాయణమునాటి పుష్పకవిమానంబును భారతమునాటి సౌభక విమానంబును గల్పితంబులని గేలిచేసిన మనమే యిప్పుడు లక్షోపలక్షలవిమానంబులఁ గన్నారఁ జూచుటలేదా ? వాని దుర్వినియోగంబున లోకంబునకు నాపాదించిన కీడునకుగావెఱచి ప్రాణంబుల నఱచేతనుంచి మినుకరించుచుండుటలేదా ?

కనని వినని రహస్యంబులెన్నో సృష్టిలోఁగలవు. అందుఁగొన్నింటిని మాత్రమే యోగులు సాధింపఁగల్గిరి. వానిని బ్రచురింపరేలా ? యనవచ్చును. ఏవిద్యయైనను మేలునకును గీడునకును రెంటికిఁ గొఱయగును. అది పాత్రనుబట్టి యుండును. అపాత్రగతనవిద్య యెగ్గుసేయకమానదు. అందువలన మహర్షులట్టి విద్యలను రహస్యంబుగానుంచి పాత్రులకే యొసంగుచుండిరి. ఆ కారణంబునఁ బరమవిద్యలు బజారు మందులుగావయ్యెను. విద్యాదానవిధానంబును గూర్చి 'ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన, నచాశుశ్రూషవే వాచ్యం నచమాం యోఽభ్యసూయతే" అని శ్రీకృష్ణ భగవానుఁడు గూడ మర్యాదగావించెను. భగవద్భక్తిగల వానికే విద్యనుపదేశింపవలయును. ఎప్పుడు భగవద్భక్తిగలదో యప్పుడే వానియందు భూతదయాపశ్చాత్తాపంబులుండును. అట్టివాఁడు విద్యను సామాన్యముగా దుర్వినియోగము చేయఁడు ; వాని విద్య లోకంబు నపకరింపదు.

పాండవులు దుర్యోధనుని వెన్నాడి చని వనమెల్ల వెదక సాగిరి. వారికి వేటరియొకఁడెదురై దుర్యోధనుఁడు చన్న

మార్గంబును సూచించెను. అంతట వారు పొదలెల్ల దాఁటి వృక్షంబులెల్ల వెదకి వేసారిరి. ధర్మజుఁడొక యున్నతప్రదేశంబున నిల్చి 'దుర్యోధనా! కౌరవవంశంబునకు మచ్చ తెచ్చితివా; వీరాతివీరలవంశంబున జనించియు యుద్ధభీరుండవై పఱచి దాగితివా? ఇదితగునా? మానమేదినఁ బ్రాణమేల? లేచిరమ్ము; యుద్ధమిమ్ము; చావునకు భయమువలదు. అది సర్వప్రాణిసహజము. కీర్తియో యపకీర్తియో నిలుచును. అపకీర్తిపాలయి చిరకాలంబుండుటకన్నఁ గీర్తివంతుఁడై ముహూర్తముండుట మేలు. మాకువెఱచి పఱచితివా? అట్లయిన మాలో నీయిచ్చవచ్చిన యొక్కనితోఁ బోరనగును. వానిని జయింతువేని రాజ్యమెల్ల నీకేయిచ్చి మేము వనాంతరము నాశ్రయింతుము. జయించి రాజ్యశ్రీనో మరణించి వీరస్వర్గశ్రీనో వరింపు'మని యెలుగెత్తి యఱచెను.

దుర్యోధనుఁడంతటఁ దటాకాంతరంబునుండి వెడలివచ్చి 'యుధిష్ఠిరా! రాజ్యార్థమైన పోరువదలితిని. భీష్మద్రోణకర్ణాదులను మీరుచంపినపగ నన్నేర్చుచున్నది. ఆపగతీఱుటకై పోరుదును. రాజ్యంబును నీకుఁబ్రదానమిచ్చితిని గ్రహింపుము. పాడుపడ్డరాజ్యంబును నీయట్టివాఁడాసించునేగాని దుర్యోధనుఁడాసింపఁడ'నెను. నావుడు 'దుర్యోధనా! నీవలన ధర్మజుఁడు రాజ్యప్రదానంబు గ్రహింపఁడు. మాలోనొక్కని జయించి నీ రాజ్యంబును బొందుము. తక్కినవారము గహనాంతరంబు నాశ్రయింతుమని పాండవాగ్రజుఁడు బదులాడెను. ఆమాటను దుర్యోధనుఁడు విని 'రాజ్యార్థముగాదు; యుద్ధార్థమే యుద్ధమొనర్తును. గదాయుద్ధపటిమను గొంతఁ జవి

చూపుదును. అసమానయుద్ధము తగదుగావున నీవు సర్జునుఁడు నాకు దీటుగారు. కొంతకుఁగొంత భీముఁడు చాలు' ననెను.

భీమదుర్యోధనులు గదలంబూని మత్తగజంబులట్లు తలపడిరి. యుద్ధం బెంతకును ముగియకుండెను. కృష్ణుఁడర్జునుని బిలిచి 'పార్థా ! దుర్యోధనుని సక్రమమార్గంబున జయింపరాదు. అతని ప్రాణంబులు వానియూరువులనున్నవి. ఆసంగతి సంజ్ఞారూపంబున భీమునకుఁ దెలుపు'మనెను. అర్జునుఁడు తనతొడఁదట్టి భీమునకు సన్నచేసెను. ఆభావంబును భీముఁడు గ్రహించి దుర్యోధనునితొడలపై గదతో మోదెను. అతఁడు తొడలు తెగి కూలెను. భీముఁడు వానియంతః క్రోధంబు తీఱునట్లుగా దుర్యోధనుని తలఁదన్నుచు నాటిపాంచాలీపరిభవంబును దెప్పసాగెను.

యుధిష్ఠిరుఁడడ్డుపడి 'భీమా ! దుర్యోధనుఁడు రాజుగాని సామాన్యుఁడుగాఁడు. రాజుతలఁదన్నరాదు. మఱియు వివశుని జెనకరా'దని యతనిని వారించెను. పాంచాలురు నోఁటి తీటవోవ నప్పుడినవానిని దిట్టిరి.

నాభిప్రదేశంబునకుఁ గ్రిందభాగంబున వైరిని గొట్టరాదని యుద్ధశాస్త్రమర్యాదయైనను, ద్రౌపదీవస్త్రాపహరణకాలంబున నేయూరువును దుర్యోధనుఁడామెకుఁ జూపి యందుఁ గూర్చుండుమనెనో యాయూరువునే విఱుతునని నాఁడే భీముఁడు ప్రతిజ్ఞచేసెననియు, ఆమాటను భీముఁడు చెల్లించెననియు, కృష్ణుఁడప్పుడు సూచించుటకు భీముఁడట్లుచేయుటకు నవకాశమే లేదనియు, అధర్మంబువలదనిపాటపాడుచున్న కృష్ణుఁడట్లు బోధించునా యనియు, కృష్ణుఁడు బోధించినను పార్థుఁడు యుద్ధ

ధర్మంబుల నతిరాక్షసంబులఁ బాటించినవాఁడట్లుచేయునా? యనియు, దుశ్శాసనుని వేఁడిరక్తంబులఁ గ్రోలుదునని ప్రతిన చేసి యట్లేగావించిన భీముఁడు ద్రౌపదీవస్త్రాపహారణంబునాటి తనశపథంబును మఱచునా? యనియు, ఇన్నిసందర్భములఁబట్టి భారతమందీభాగము ప్రక్షిప్తమగుననియుఁ గొందఱందురు.

## అశ్వత్థామ.

దుర్యోధనుఁ డంతట నశ్వత్థామను కౌరవసైన్యశేషంబునకు నాయకునిగా నియమించి ప్రాణంబులు విడిచెను. కౌరవసైన్యంబెల్ల నుత్క్రమించియో క్రమించియోయున్నందున వానిని వెంబడించువారే లేరైరి. అశ్వత్థామ సేనానాయకత్వము గంధర్వనగరపట్టాభిషేకమయ్యెను.

రాత్రియయ్యెను. పాండవశిబిరంబెల్ల యుద్ధశ్రాంతిం జేసి మైమఱచి నిద్రించెను. అర్ధరాత్రంబున నశ్వత్థామ రహస్యంబుగాఁ బాండవశిబిరంబుఁజొచ్చి యుపపాండవులను ధృష్టద్యుమ్నుని శిఖండిని మఱికొందఱను జంపెను. పాండవు లది యెఱింగి క్రోధమూర్ఛితులై వానిని వెన్నాడిరి. అతఁడు ప్రాణభయమంది తప్పించుకొనుటకు నుపాయంబును గానక అపాండవంబగునట్లుగా బ్రహ్మశిరోనామకాస్త్రంబు నభిమంత్రించి విడిచి పఱచెను. ఆయస్త్రము పాండవులజోలికిఁ బోఁజాలక చూలుతోనున్న యుత్తరాగర్భముచొచ్చి తద్గర్భస్థశిశువును జెనకరామి తత్ప్రసవకాలంబును వేచియుండెను.

భారతయుద్ధంబట్లు పరిసమాప్తమయ్యెను. పాండవులు వ్యాసమహర్షివలన నిర్దిష్టులై బంధుశవంబులకు నగ్నిసంస్కా-

రంబు గావించువారయి కౌరవకాంతలను గాంధారీధృతరాష్ట్ర పురస్సరంబుగాఁ దత్ప్రదేశంబునకుఁ దరలించిరి. కృష్ణుఁడును వారివెంటఁ జనెను.

కౌరవకాంతలట్లు రణభూమికిఁవచ్చి గుణపంబులై యందుఁ బడియున్న పతులను సోదరులను బుత్త్ర పౌత్త్రులను బంధుమిత్ర లను జూచి దుఃఖోపహతులై కొందఱు నేలవ్రాలిరి; కొందఱు వావిడిచి యేడువఁజొచ్చిరి ; కొందఱు పిచ్చియెత్తియోాయన జడలువిరియం దిరుగసాగిరి ; కొందఱు పేర్కొని యగ్గించిరి ; కొందఱు తలలును మోములును మోాదుకొనిరి.

గాంధారీశాపవచనము.

గాంధారి వారిదుఃఖంబుఁ జూడనోపక కృష్ణుని జెంతకుఁ బిలిచి 'కృష్ణా ! ధృతరాష్ట్రుని కోడండ్రగతిఁ జూచితివా ? కటా ! వీరిగతి వైరులకుఁ గనుపడుదువయ్యోఁగాఁబోలు. అయ్యో ! పతులదేహంబులపయిఁ గాకులు వ్రాలిపొడుచుచున్నను వానిని దఱుముటకుఁగూడ వీరిచేతులాడకున్నవి' అని యొక్కొక్కనిఁ జూపుచుఁ బెల్లువిలపించుచు 'కటా ! వీరిదురవస్థను జూచుటకుగా మొండికట్టియున్నై జీవించితిని. నాగుండియలు వ్రీలకున్న' వనుచు వ్యసనవ్యగ్రాంతచిత్తయై 'కృష్ణా ! ఉత్తమ జ్ఞాతులెల్లరు నంతఃకలహంబునఁ జేపి తమలోన నశింపఁజేసితివి. తత్ఫలముగా నీవారును నీవును నదేవిధంబున నేఁటికి ముప్ప దాఱవయేఁడు వచ్చినంతనే దిక్కులేనిచావు చత్తురుగాక. కౌరవకాంతలట్లు మాావధూజనంబును బతిసుతబంధుమిత్త్రాదులకై వనలివనలి యేడ్చుదురుగాక. నేను పతివ్రతనగుదునేని నామాట తప్ప'దని శపించెను.

కృష్ణుఁడు గాంధారికి నవ్వి 'యాదవులకు మునిశాపంబు గలదు. నీశాపంబు చర్వితచర్వణంబయ్యెను. ఇఁకఁబోదము రమ్మా. అగ్నికార్యంబునకు జాగువలదు. అమ్మా! ఇదంతయు నీతనయుని దుర్నయఫలంబనుట యెఱింగియు సుతస్నేహంబున నిట్లందువు. నేనును నీవును భీష్మకృపాచార్యాదులును వానిమనముఁ ద్రిప్పలేమగుట మఱచితివా? తండ్రిఁగూడ నతఁడు వెగడించుట తలంపవా? మీయపరాధంబున వచ్చిన కీడునకుఁగా నన్ను నొవ్వఁబల్కనేల? యని వచించి కౌరవులకు సంస్కారంబులు యథోచితగతి గావింపఁజేసెను.

### ధర్మరాజపట్టాభిషేకము.

భారతయుద్ధపరిసమాప్తిఫలంబుగా రాజ్యము పాండవవశమయ్యెను. రాజులేకున్నచో దేశంబెల్ల నరాజకదోషదుష్టంబగునుగావున ధర్మజునకుఁ బట్టముఁగట్ట నిశ్చయించిరి. పదునెనిమిది దినంబులలో హస్తినాపురరాజ్యంబు నిర్మానుష్యమై యెడారిగామాఱుట ధర్మజుఁడు తలంచి దుఃఖాశ్రువులు నించుచు 'కటా! నిత్యకళ్యాణము పచ్చతోరణంబుగానున్న నాపైతృకరాజ్యంబునకు నాబుద్ధిజాడ్యం బెంత చేటొనరించె'నని దురపిల్లి తమ్ములను జీరి దుఃఖారావమయమైన యీరాజ్యమందు నివసించుటకన్న వనవాసినై జీవితశేషంబును గడుపుదుఁగాక. పాడుపడ్డదీనినేలుటకన్న భిక్షాటవృత్తితో జీవించుట మే'లని రోదనంబు జేయసాగెను.

వానిని భీమార్జునులును ద్రౌపదియు వేఱువేఱ యొంతో యోదార్చిరి. ఎందును వానియంతస్తాపము చల్లారదయ్యెను. అంతటఁ గృష్ణునివంకఁ జూచిరి. కృష్ణుఁడప్పటికేఁ

దగినట్లుగాఁబలికి పట్టాభిషేకంబునకు ధర్మజునొడఁబఱచెను. ఆ కార్యము యథాక్రమము జరిగెను.

### భీష్మధ్యానము.

అట భీష్ముఁడు శరతల్పగతుఁడై తనుత్యాగంబునకు నుత్తరాయణపుణ్యకాలంబును బ్రతీక్షించుచు జిత్తంబును బరమాత్మయందు లయింపఁజేసి ధ్యానగతుఁడయ్యెను. ఆధ్యానవేగము నానాటికిఁ దీవ్రమై కృష్ణుని దాఁకెను. యోగీశ్వరేశ్వరుఁడు సమాధియోగస్థితుఁడై భీష్మునకు ననుసంధానభాగ్యంబుఁ జేకూర్పసాగెను.

అత్తఱి ధర్మజుఁడటకు వచ్చి కృష్ణునిస్థితిగాంచి వింతపడి యాయన బహిర్ముఖుఁడగునంతదాఁక వేచియుండి 'కృష్ణా ! భగవదవతారంబగు నీకును సమాధియోగమా ? ఏదేనిగాథఁబుగాఁ దలంతువా ?' యని యడిగెను. కృష్ణుఁడు వానిని విని యుధిష్ఠిరా ! భీష్ముఁడు శరతల్పగతుఁడై నన్ను ధ్యానించెను. వానియొద్దకుంజని యుంటిని. అతని యవసానకాలము సమీపించుచున్నది. ఆమహాత్మునికిక నఱువదిదినములుమాత్రమే యుండును. భూదేవి తనపుత్త్రరత్నంబును గోల్పోవుచున్నది. భీష్మునితోడ శౌర్యంబు నపారవిద్యాధనంబును మనోవాక్కాయశుద్ధియు నుత్తమోత్తమజ్ఞానంబును బృధ్వీతలంబునుండి తరలనున్నవి. ఆయోగిచంద్రుఁ డుత్తరాయణపుణ్యకాలంబును బ్రతీక్షించుచున్నాఁడు. ధర్మజా ! కురుపాండవయుద్ధ ధర్మాధర్మంబు లింకను నిన్నుఁ గలంచునేయున్నది. భీష్ముని వలనఁగాని నీసంశయంబులు తీఱవు. సమస్తధర్మంబులు వానివలనవిని నీవు మనశ్శాంతిని బడయుటొప్పును. ధరా

ధర్మనిశ్చయార్థంబున నంతటివాఁడు గలుగఁడు. వానియొద్దకుఁ జనుద' మనెను. అనవుడు 'కృష్ణా! సర్వజ్ఞుండవును బరమ శాంతిదాయకుండవునైన నీవుండ నన్యులఁ గోరనేల? అయినను నీయిచ్ఛచేయుఁదు' నని ధర్మజుఁడు పలికి ప్రయాణోన్ముఖుఁ డయ్యెను.

ధ్యానగ్రహణరహస్యము.

ఆకాశము సర్వవ్యాపిగావున నది జీవుల బహిరంతరంబుల వ్యాపించియుండును. అంతరాకాశంబును దహరాకాశంబనియు బహిరాకాశంబును మహాకాశమనియు నందురు.

సంకల్పంబుజనించినంతనే యది దహరాకాశంబును జొచ్చును. దహరాకాశంబునకు మహాకాశంబునకు నవిచ్ఛిన్నంబుగావున నది మహాకాశమును బ్రవేశించును. మహాకాశముతోడ సంకల్పము గూడ సర్వవ్యాప్తిగాంచును.

సంకల్పముగూడ నొకవిధమైన శబ్దమేయగును. శబ్దవ్యాపకగ్రహణంబులకు నుపాధియు నుపకరణంబును వలయుట మనకిపుడు రేడియోమూలకంబున స్వానుభవసిద్ధము. అట్లే సంకల్పవ్యాపకంబునకు మహాకాశంబుపాధిగా, తద్గ్రహణంబునకు నంతఃకరణమే యుపకరణంబుగా నగును.

ఎల్లయుపకరణంబులు శబ్దగ్రహణయోగ్యంబులుకానట్లే యెల్లరయంతఃకరణంబులు నట్టిశబ్దంబును గ్రహింపఁజాలవు. ఎవనియంతఃకరణంబు యోగశక్తితోఁ గూడికొనియుండునో యదిమాత్రమే యాకాశగతసంకల్పంబును గ్రహింపఁ గలుగును.

### సంకల్పశక్తి స్వభావము.

సంకల్పంబును భావనయనియు నందురు. అది రూపముగల పదార్థమే యగును. సూక్ష్మప్రాణతరంగంబులు మనః పదార్థంబునకు దాకుటవలన భావనాపదార్థమేర్పడుచున్నది. అది యొకవిధమైన శక్తి. దానికి గమనాగమనములు గలవు. దాని గమనవేగం బింతనరాదు.

భావనాశక్తి యన్యులను స్వభావంబు పూర్వజాలును. అందువలననే దృఢభావనాశక్తిగలవానికి పేరుకొలఁది జనులే గాక మృగంబులునయితము లోఁబడి వర్తించుచుండును.

భావనాశక్తి సాత్త్వికమో రాజసమో తామసికమో కావచ్చును. అది వాని గుణంబులఁబట్టి యుండును. అందు సాత్త్వికశక్తి స్థిరముగానుండును. ఆశక్తి పెంపు నాహారంబును బట్టియుండును. సాత్త్వికశక్తి వృద్ధిపఱుపఁగోరువారు సాత్త్వికాహారంబునే భుజింపవలయును.

భావనచేయు సాధనంబును అంతఃకరణమందురు.

సంకల్పంబులెల్ల యోగులకుఁ దెలిసియుండునా? యని శంకింపవచ్చును. ఇంటియందు రేడియోయంత్రమున్నను శబ్దగ్రహణోత్సాహముగలిగి మరను త్రిప్పినప్పుడే శబ్దము శ్రుతిపథమగుచున్నది. అట్లే యోగులకు నాకాశగతశబ్దగ్రహణశక్తి స్వతస్సిద్ధమైనను వారికట్టిభావము గలిగి వారు అంతర్ముఖులైనప్పుడే యది వారికిఁ దెలియవచ్చుచుండును.

సంకల్పంబునకు ధ్యానము వేగంబునుగూర్చును. ఒక చోటనుండి యొకచోటికి వార్తనంపుటను ముందుగా

హెచ్చరికగాఁ దంత్రీవార్తానిలయంబులం దెట్లు గంటకొట్టుదురో, అట్లే ధ్యానవేగము ధ్యేయుఁబునుదట్టి సుముఖునిగాఁ జేయును.

దూరశ్రవణంబువలె దూరదర్శనంబుగూడ యోగసిద్ధి నొసఁగును. ఇదియు నేఁడు నేఁడు యంత్రరూపంబున మన యనుభవంబునకు వచ్చుచున్నది.

స్తవరాజము.

కృష్ణుఁడును పాండవులును భీష్మునొద్దకుఁ దరలిరి. ఆ సంగతివిని దేవర్షులును బ్రహ్మర్షులును వచ్చిరి. ధర్మజుఁడు తమ్ములతోను బంధుమిత్రులతోను భీష్మునిచరణంబులకు మ్రొక్కెను. కురుపితామహుఁడు వారినొక్కొక్కనిగాఁ దనహస్తతలంబున నివిరి దీవించెను. ఎల్లరు వానిని జుట్టి కూర్చుండిరి.

కృష్ణుఁడంతట భీష్ముని సమీపించి 'కురుచంద్రమా! నీవెఱుఁగని శాస్త్రంబులు గలుగవు. నీబుద్ధి యనుభవపరిణద్ధమై సందేహశూన్యమై యెంతయు విరాజిల్లును. మనోవాక్కాయకర్మంబుల నీవు నిత్యపూతుఁడవు ఆజన్మంబుగా నిన్నెట్టిదోషంబును జెనకదు. యుధిష్ఠిరుఁడు కురుపాండవసంగ్రామధర్మాధర్మవిలోలుఁడై యున్నాఁడు. ఎవరెంత చెప్పినను వానికి సందేహంబులు తీఱవు. సమస్తధర్మంబులు వానికి బోధింపుము. నీబోధ లోకానుగ్రహంబగు' ననెను.

భీష్ముఁడామాటవిని 'స్వామీ! నిత్యసర్వజ్ఞుండవును సమస్తధర్మకర్మంబులకు మూలపురుషుండవును నైన నీవే యుధిష్ఠిరునకు నెఱుంగనైన ధర్మంబుల నుపదేశింపవేమదును.

కంఠగత ప్రాణుండనైతిని. భవద్దర్శనమహాభాగ్యార్థము జీవం బుల నిలిపితిని. నాయీాప్సితంబు ననుగ్రహించితివి. నాజన్మము సాఫల్యమయ్యె' నని పలికి భగవంతుని స్తుతించెను.

ఆస్తోత్రమును స్తవరాజమనిరి. అది నిక్కముగా నట్టిదే యగును. అందు ధ్యానమూర్తి విశ్వరూపుఁడు. సగుణధ్యానంబునకు నుత్తమోత్తమధ్యేయాకారము విశ్వరూపంబేయని గీతాద్వాదశాధ్యాయంబులో సూచించిన దానికి నిది వ్యాఖ్యయగును.

ఈ స్తవమందు మఱియొక విశేషముగలదు. చిత్తము వాసనాప్రచలితంబై యొకచోట నిలువక లోకలోకాంతరంబులకుఁ బఱచుచుండును. ఎందుఁజన్నను భగవంతుని విభూతులే యని యీ స్తవము ప్రతిపాదించుటఁజేసి చిత్తమెందున్నను భగవంతునే గాంచుచు అది దానిపర్యటనంబును మాని కుదుట పడుటకు నిదియెంతయుఁ దోడ్పడును.

సర్వతత్త్వవేత్తయు ఆజన్మబ్రహ్మచర్యావ్రతియు భక్తాగ్రేసరుఁడునైన భీష్ముఁడు వానిచరమదశయందు వివిధానుభవపరిణతంబును వికల్పరహితంబునునై యేకాగ్రవృత్తినున్న యంతఃకరణంబుతోఁ గావించిన స్తవము గావున నిందలి ప్రతిభావంబును నమృతప్రాయమై యుజ్జీవకరమై హృదయంబునల్లే కొనిపోయి భగవద్సాక్షాత్కారంబునకుఁ బరమావధియైన తత్త్వమందు లీనమొనర్చి యవ్యక్తసంస్పర్శఁగలిగించి యద్భుతానందంబును గూర్చి ప్రశాంతినొదవించును.

వాంఛాత్మికప్రార్థనంబులెల్ల వ్యర్థంబులనియు హితమును గూర్చుభారంబును భగవంతునిమీాఁదనేవైచి భక్తిచేయుట

మాత్రమే భక్తసిధర్మంబనియు, భీష్ముఁడు భక్తిసిద్ధాంతంబు నిందుఁ బ్రతిపాదించెను. దీనినే భరన్యాసమందురు. భీష్ముఁడు కర్మభక్తిజ్ఞానంబుల సారంబును బిండి స్వానుభవంబను మేలి వస్త్రంబున నొడియఁగట్టి నిగ్గుతీసి యేకాగ్రభావమందు మూస బోసి తీర్చిన దివ్యరూపమో యన నీస్తవరాజము పౌరాణికస్తవ తారామండలంబునకుఁ బూర్ణచంద్రబింబమై విరాజిల్లుచున్నది.

### శరణాగతి.

భక్తికి శరణాగతి పరమావధియగును. శరణాగతినిఁ బ్రపత్తియనియు నందురు. ఈభక్తి సప్తవిధంబులని కొందఱును దశవిధంబులని కొందఱును వివరించిరి. అందు మధుర భక్తి, గురుభక్తి, వాత్సల్యభక్తి యను మూఁడు ముఖ్యములు. నీవునావాఁడవనుట మధురభక్తి. గోపికాభక్తి యిందులకు నిదర్శనము. నేనునీవాఁడననుట గురుభక్తి. భీష్మాదులభక్తి యిందులకుఁ బ్రమాణము. నేను నీవేయనుట వాత్సల్య భక్తి. నారదభక్తి యిందులకు దృష్టాంతము.

శరణాగతియందు సవ్యాజకము నిర్వ్యాజకము నని రెండు తరగతులు గలవు. విభీషణుఁడును భీష్ముఁడు నిద్దఱుఁ బరమభక్తులుగాని యేతన్మాత్రులుగారు. అయినను విభీష ణుఁడు గృహస్థు గావున నతఁడు ఈషణత్రయబద్ధుఁడనక తప్పదు. భీష్ముఁడాజన్మబ్రహ్మచారియు నస్ఖలితహృదయుఁడు గావున నమ్మూఁటికి నతఁడతీతుఁడనక తీఱదు. విభీషణుఁడు సామాన్యధర్మజ్ఞుఁడు; భీష్ముఁడు సర్వధర్మమర్మజ్ఞుఁడు. విభీ షణుఁడు రావణాత్యక్తుఁడై యార్తుఁడై రామునాశ్రయించెను

గావున వానిశరణాగతి సవ్యాజకమగును ; భీష్ముఁడు స్వజ్ఞాన ఫలంబుగా భగవంతునకు నర్పించుకొనెను గావున వానిశరణాగతి నిర్వ్యాజకమగును. విభీషణునకు భోగకాంక్ష గలదు. అతఁడు లంకారాజ్యంబు నంగీకరించుటచే నిదర్శనము. కాఁబట్టి వానిభక్తి ప్రత్యాశాపూర్వకయగును. భీష్ముఁడు భోగములనే గాక కోరికలను గూడఁ ద్యజించెను. కాఁబట్టి వానిభక్తి ప్రేమైకపూర్వకయగును. ఆర్తపూర్వకము ఫలాభిసంధిసహితమునైన విభీషణుని శరణాగతికన్న జ్ఞానపూర్వకము ప్రేమైకమాత్రమునైన భీష్ముని శరణాగతి యుత్తమమగును. అట్టి పరమభక్తులవిషయమై,

'తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమప్రియః'
(7-17)

అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.
(9-22)

అని భగవంతుఁడే తెలిపెను. అట్టిభక్తునకు భగవంతుఁడను చరుఁడై వానిభారమెల్ల మోయుచుండునని పయిశ్లోకముల తాత్పర్యము.

భీష్ముఁడట్లు కృష్ణుని స్తుతించి వానియాదేశప్రకారము ధర్మజునకు వైదికధర్మంబులను రాజధర్మంబులను గార్హ్యాపత్య ధర్మంబులను దదితరంబులను సూక్ష్మార్థంబులఁగూడ విపులంబుగా బోధించెను. ఆధర్మంబులె శాంతి అనుశాసనిక పర్వం

బులై పర్వుచున్నవి. అట్లు నను స్వధర్మంబులు గలుగుటంజేసి భారతము పంచమ వేదమయ్యెను.

అంతలోన నుత్తరాయణపుణ్యకాలంబు ప్రవేశించెను. భీష్ముఁడు శ్రీకృష్ణపరమాత్మయందు నంతఃకరణంబు నిల్పి సమాధియోగస్థితుఁడై ప్రాణంబులను వదలెను.

### కామగీత.

భీష్ముని నిర్యాణంబునకు ధర్మజుని దుఃఖంబు మితిమీఱెను. అతఁడు భీష్ముని పాదంబుల వ్రాలి విలపింపసాగెను. బ్రహ్మర్షులును దేవర్షులును నానావిధంబుల వానికి నుపశమనోక్తులు పల్కిరి. ఏమియును వానికి నోదార్పు కలుగదయ్యెను. యుధిష్ఠిరుండాత్మప్రాయశ్చిత్తార్థము రాజ్యాదులను త్యజించి గహనాంతరంబుల జీవితశేషంబునుం బుచ్చ నుద్యుక్తుఁడయ్యెను.

శ్రీకృష్ణభగవానుఁడు వానిమనస్తత్వంబును గ్రహించి 'పాండవాగ్రణీ! అజాతశత్రుఁడవని నిన్నెల్లరుఁ బల్కుదురు. ఇది నిజమేని నీకు శత్రువే యుండరాదు. నీస్థితినిఁ జూడఁగా నీవట్టివాఁడవని తోఁపదు. ఎట్లందువా? అహంకారమనెడి మహాశత్రువు నీలోనే దాఁగి నిరంతరము నీతో బోరాడుచున్నది. ఆకారణంబున నీమనస్తాపంబునకు విరతి గాన్పింపదు. ఆశత్రువున్నంతకాలము నీవజాతశత్రుండ వెట్లగుదువు? శాంతి నీకెట్లుగలుగును? ఇఁకనైన నీయంతశ్శత్రువును జయింపఁ గడంగుము. ఉపాయమేమందువా? నీయట్టివాఁడట్టి శత్రువును విరోధంబున జయింపఁజాలఁడు. అనఁగా నిట్టిప్రయత్నంబునకు

దండోపాయము కూడదు. మైత్రి సిట్టిశత్రువులు సులభము గాఁ గైవసమగుదురు. వారితో మైత్రి యెట్లందువా? ఈ శత్రువులు కోర్కెలతోఁ గొల్లపోవుచుందురు. ప్రతిఫలనిర పేక్షముగా వారికోర్కెలఁ గూర్పుము. అంతతో వారు తృప్తులై నీకు దాసానుదాసులగుదురు.'

'నీయంతశ్శత్రువు రజోవర్తియై యున్నాఁడు. రజస్సు కర్మసంగియగును. కావున నతఁడు నిన్ను కర్మాచరణంబునకుఁ బ్రేరేచుచున్నాఁడు. కర్మంబులఁగాని వానికిఁ దృప్తి జనింపదు. నీవు కర్మసన్యాసంబును సంకల్పించితివి. అది యతఁడు సహింపఁడు. కావున నీవు హయమేధాది కర్మంబులాచరించి వానికిఁ దృప్తిచేయుము. నిష్కామబుద్ధితోఁ దత్కర్మంబుల నొనర్పుము. నీకుఁ జిత్తశుద్ధియగును. శుద్ధచిత్తంబు సత్వప్రధానంబు గావున నందు రజశ్శత్రువు నిలువఁడు. అతఁడు తనంత తానే వలసపోవును. నీయాశత్రుజయంబునకు నిదే యుపాయము.' అని బోధించెను. ఈబోధనే కామగీతయనిరి.

ఈబోధయందెంతో భావము గర్భితమై యున్నది. ఎల్ల యనర్థంబులకు నహంకారము బీజమైయుండును. దానివ్యవహారము మమకారరూపంబున నుండును. మమకారంబునకుఁ గ్రోధమోహామాత్సర్యంబులు పరివారమై యుండును. ఈ పటాలంబు పరద్రవ్యసంగ్రహంబుతక్క రెండవది యెఱుంగదు. అవితెచ్చిన పరద్రవ్యంబును మమకారము భోగ యోగ్యముగా నహంకారంబునకు నందిచ్చును. అది దానిని భోగించుచు నదే యచ్యుతసామ్రాజ్యంబుగా నుండును. ఆ

ద్రవ్యము భుక్తమైనంతనే భోగ్యవస్తువునకై యహంకారము దురపిల్లును. ఇదే దుఃఖము.

తెచ్చియిచ్చు పటాలంబుండఁగా భోగ్యవస్తువులకుఁ గొదువయుండునా యని తలంపవలదు. అవి తెచ్చియిచ్చున వెల్ల నశాశ్వతంబులును భుక్తములై నశించునవేగాని యొండు గాదు. అందువలన భోగ్యవస్తుకాంక్షయుఁ దన్మూలక దుఃఖంబును దప్పవు.

అహంకారమునకు భోగ్యవస్తువు కొదువపడనట్టిది వలయును గావునఁ గొదువపడని పదార్థంబును గూర్తురేని యది తద్భోగములోఁబడి యన్యాభిలాషమాని సుఖముండును. అట్టి వస్తువేదందువా ? ఆనందమే యాపదార్థము. దానిని గూర్తురేని అహంకారము తద్భోగపరాయణమై యుండును. ఇదే సుఖము.

'నేనునేను' అనుభావమే యహంకారము. సుఖము చేకూఱవలయునన్న దానిని హరించుటో తృప్తిపఱచుటో రెంటనొకటి తప్పదు. జ్ఞానంబువలన నది నశించునుగాని యది యెల్లరకు సాధ్యముగాదు. రెండవమార్గము సులభసాధ్యము. దీనినే నిష్కామకర్మయోగమందురు.

అనుగీత.

ధర్మజుఁడు కొంతయూఱట చెందిన తర్వాత కృష్ణార్జునులు పుణ్యక్షేత్రదర్శనార్థము దరలి నదీనదక్షేత్రంబులను సేవించి ఖాండవప్రస్తంబునకు వచ్చి మయనిర్మితసౌధంబుననుండిరి. అర్జునుఁడు కొండొకనాఁడు 'కృష్ణా ! నాఁడు రణ

రంగంబున నీవుచేసిన యుపదేశంబును గొంతమఱచితిని. మఱల వచింపు' మనెను. కృష్ణుఁడు వానికి నెంతయు ఖిన్నుఁడై 'అర్జునా! ఆత్మసమాధిస్థుఁడనై తత్త్వసారంబును నాఁడుపదేశించితిని. ఆస్థితియన్నప్పుడెల్లఁ గలుగదు. అది దేశకాలపరిస్థితులఁ బట్టి గలుగుచుండును. నాటి నీమనోగతిని బట్టియుఁ దేశకాలస్థితినిబట్టియు నీకు రణమధ్యంబున విపరీతభావంబుదయించుటం బట్టియు, తద్భావంబు మరలుటకు నన్యంబులు గోఱగామింబట్టియు, నాకు సమాధియోగంబ ప్రయత్నముగాఁ గలిగెను. అట్టి సందర్భంబులు నేఁడు గలుగవుగావున నట్టియోగంబుగాని యాభావంబులుగాని యాభాషగాని యాయుచ్చారణవైఖరిగాని యిప్పుడు ప్రయత్నించినను సిద్ధింపవు. ఇట్టిది నీకును స్వానుభవసిద్ధమే యని యూహింతును. ఎట్లందువా? భీష్మద్రోణులతో యుద్ధముచేసిననాటి మనస్స్థితియిప్పుడు రమ్మన్నను నీకుఁగలుఁగునా? కాబట్టి నీకోరినది యదేవిధంబున నిప్పుడు చెప్పుటకు నాకును దరముగాదు. దానిసారంబును దెలుపుదు'నని గీతాసారంబును జెప్పెను.

ఆదిగీతకు ననుసారి గావున దానిని అనుగీతయనిరి. ఆత్మశాంతికి మనోజయము ప్రధానంబనియు అందులకు బహిస్సాధనంబులెవ్వియు నుపయోగింపవనియు, దానికి యోగంబొక్కటియే సాధనంబనియు 'అనుగీత' బోధించును.

### బ్రహ్మగీతాదులు.

శ్రీకృష్ణభగవానుఁడు సందర్భానుసారంబుగా సనత్సుగీత బ్రహ్మగీతలను బోధించెను. అవియెల్లఁ బ్రక్షిప్తము

లని కొందఱిమతము. ఎట్టిదైనను గీతకు నవియెల్ల నొకవిధ మైన వివరణంబులేయగునుగాన జిజ్ఞాసువులు వానిని గూడఁ బరిశీలింపనగును.

కృష్ణుఁడట్లు ధర్మజునకు మనశ్శాంతిమార్గముఁదెలిపి యర్జునుతోడఁ దీర్థయాత్ర వెడలివచ్చి పుత్త్రశోకార్తయైయున్న చెలియలిని సుభద్రను దోడ్కొని ద్వారకకుఁ జనియెను.

### హయమేధయాగము.

ధర్మనందనుఁడు కృష్ణుని యుపదేశము ప్రకారము హయమేధయాగంబును సంకల్పించి బంధుమిత్త్రాదులకు సందేశంబులఁ బంపెను. అప్పటికి జీవించియున్నవారెల్లరు వచ్చిరి. కృష్ణుఁడును బంధుమిత్త్రయుతుఁడై సుభద్రను వెంటఁగొని యరుదెంచెను.

### పరిక్షిత్ప్రాణదానము.

అంతలోన నుత్తరకు నొప్పులు గానిపించెను. ఏశిశువుపుట్టునో యని యెల్లరు మహాతురముతో నుండిరి. మగశిశువుదయించెను. పూరువంశాంకురంబు గలిగెనని సంతసించిరి. అంతలోనఁ బ్రసూతిగృహంబున రోదనధ్వనులుప్పతిల్లెను. ఎల్లరు వెలవెలనైరి. పాండవులకుఁ బ్రాణంబులెగసెను. కుంతీద్రౌపదీసుభద్రలు విషాదవేదనాయత్తచిత్తంబులతో హుటాహుటి వచ్చి కృష్ణా! కృష్ణా! ఇంకేమున్నది! ఉత్తరాగర్భము మృతజాతుని గాంచెను. అశ్వత్థామ కోర్కె కొనసాగెను. పాండవవంశంబును నిలుపవా? అట్లుచేయవేనిఁ బాండవులను మఱచిపొమ్మనుచు దీనాతిదీనస్వరంబునఁ బ్రార్థించిరి.

కృష్ణుఁడు వారినోదార్చి ప్రసూతిగృహంబునకుఁ బోయెను. కృష్ణుఁడు వచ్చుట ద్రౌపదివలన నుత్తరవిని లేచి బాలశవంబును దోయిటనిడికొనివచ్చి 'నీమేనల్లునియెడ నీకుఁ బ్రీతికలదేని వానిపుత్త్రునకు నిట్టిగతిగల్గువా? వాని భార్య పతిహీనయుఁ బుత్త్రహీనయు నగునా?

'ఉ॥ నందనుచావు నిక్కమయినం జనుటప్పుడకల్గు దేవకీ
నందన! యెల్లభంగి నరనందనుపాలికి నాజికేచి పో
వం దనతోడితెంపునను వారకయిచ్చిన బాసతప్పె నిం
కం దనుఁగన్నఁ దెప్పునోడి కాఁడని కొంకవఁగాని, యచ్యుతా!॥

యని యంతస్తాపంబును వెలపుచ్చి శిశువుచు జూచుచు,

'ఆ॥ తాతలోకగురుఁడు దామోదరుఁడు వచ్చి,
యుండ లేచి మ్రొక్కవుజ్జ్వలాంగ!
ధర్మవేదియైన తండ్రికిఁ బుట్టి యు
ధర్మపరుఁడ వగుట తగునె నీకు?'

నాయనా! ఇదిగో నీయవ్వకుంతీదేవి, కనువిచ్చిచూడు; తండ్రీ! అదిగో ద్రుపదరాజతనయ, చూడుము; పట్టీ! ఇదిగో నీజనకునితల్లి సుభద్ర, ఈమెను జూడుము. తనయా! నిన్నుఁగన్నతల్లిని దీనురాలిని జూడు'మనుచు వలవలనేడ్చి మూర్ఛాగతయయ్యెను.

కౌరవాంగనలు సబాష్పనయనలును బాదఱుమోములునై వగవసాగిరి. ఆవగపు పగవారికిఁ గూడ మిగులయ్యెను.

కృష్ణుఁడెంతయు జాలిగొని 'పాదప్రక్షాళనోపస్పర్శనంబు లొనరించి యశ్వత్థామ ప్రయుక్త బ్రహ్మశిరోనామకాస్త్రంబు నుపసంహరించి యబ్బాలశవంబును శయ్యాతలం

బునఁ బెట్టంబనిచి యెల్లవారలఁ గలయం గనుంగొని,

సీ॥ జతలకల్ల వెలిసై చనుచునుండుదు నేని
పగఱకైనను గల్లఁ బలుక నేని,
నిత్యధర్మప్రతినిష్ఠుఁడ నగుదేని
బ్రహ్మచర్యము నన్నుఁ బాయదేని,
పృథ్వీసురులయెడఁ బ్రియమునాకగు నేని
కంసాదులవధ యహింసయేని,
నరుసాడ నాకు నెన్నఁడుఁబగ లేదేని
గణమున వెన్ను మరల్ప నేని.
ఉపనిషత్తులు నాదగు నూర్పులేని
ధర్మశాస్త్రగమై గీత దర్వు నేని
నాకు సంకల్పసంసిద్ధి నైజమేని
పండితుఁడగు నీబిడ్డ జీవించుఁగాక !

అని యేకభావంబుతో నేకస్వరంబుతోఁ బలికి యేక దృష్టితో నబ్బుడుతను జూచెను. బాలశవము కదలి కనులిచ్చి కుయ్యిడెను. కుంతిమున్నగు వారు నిర్భరానందబాష్పంబులను వర్షించిరి. ఎల్లరును సంతోషపరవశులైరి. ఉత్తర యాశిశువు నెత్తికొని కృష్ణునియడుగులనుంచి నేల నెన్నుదురుసోక వానికి మ్రొక్కెను. కృష్ణభగవానుఁ డామెను దీవించి పుచ్చెను. భగవంతునిచేతఁ బరిక్షితుఁడగుటంజేసి యాబాలునిఁ బరిక్షిత్తనిరి.

అంతట హయమేధయాగంబు యథావిధి సాగెను. కృష్ణుఁడట్లు పాండవసంతానంబును నిల్పి యాగాంతమువఱకు నుండి యుధిష్ఠిరాదులను వీడ్కొని ద్వారకకుఁ జనియెను.

ధర్మస్థాపనఖండము సంపూర్ణము.

---



# శ్రీకృష్ణచరితము.

## ఉపదేశఖండము.

### శ్రీకృష్ణనారద సమావేశము.

శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మాదుల ప్రార్థనంబు నంగీకరించి యాదవవంశంబునఁ గృష్ణుఁడను పేర నవతరించి, భూదేవీదుఃఖకారకులైన రాక్షసులను గంసాదిప్రకటాకారులను గొందఱను దానుహరించియుఁ గొందఱను బలరామునిచేతఁ జంపించియు యాదవకులమందే బాంధవరూపంబుననున్న ప్రచ్ఛన్నాసురులను యాదవులవలననే యేదేనొకనిమిత్తంబున రూపుమాపించి, దుర్యోధనుని దుర్బుద్ధిఫలంబుగాఁ గలిగినవిషప్రయోగ లాక్షాగృహదహన కపటద్యూతహేళన ద్రౌపదీకచగ్రహణ వస్త్రాపహరణాదులకారణంబున జనించి ప్రజ్వరిల్లిన క్రోధాగ్ని కారణంబుగాఁ బదునెనిమిదియక్షౌహిణులను బూదిచేసి భూభారంబు నుడిపి ద్వారకకుఁ జేరెను.

అప్పటికి శ్రీకృష్ణభగవానునకుఁ దొంబదిరెండుసంవత్సరంబులు గడచెను. కృష్ణుఁడు ద్వారకకు వచ్చి లోకసంగ్రహార్థము హయమేధపుత్త్రోపలాలన ద్వాదశాబ్దప్రాయశ్చిత్తరూపంబులైన ముఖ్యపుణ్యకర్మంబులను బరపాపహారంబులైనట్టియు నిజకీర్తిప్రచారకంబులైనట్టియు మంగళంబుల నాచరిం

చుచు ముప్పదియైదు వర్షంబులు గడపెను.

ముప్పదియాఱవయేఁడు వచ్చినంతనే వడిగండ్లవానలు కురియుట, సుడిగాలులు వీచుట, ఉదయకాలంబున సూర్యబింబంబు బలసితోఁచుట, మింటమబ్బులు ప్రేలకయే పిడుగులు రాలుట, పరివేషంబులు రవిచంద్రబింబంబులఁ జుట్టుట, నీల పింగళదేహంబుతో యముఁడు సంచరించుట, చిలుకలు రాత్రులందు గూబవలెనుంగునఁ గూయుట మున్నగు నుత్పాతంబులు ద్వారకానగరమందుఁ గానవచ్చెను. కృష్ణుఁడాయుత్పాతంబులఁ జూచి, ఋషులును గాంధారియునొసంగిన శాపంబులఁ దలంచి, యాదవవినాశంబునకుఁ దఱియయ్యెనని భావించెను.

శ్రీకృష్ణబ్రహ్మల సమావేశము.

అంతలోన నొకనాఁడు బ్రహ్మదేవుఁడు సురమునివర పురస్సరంబుగా ద్వారకకు వచ్చి కృష్ణుని సందర్శించి వానిని ప్రస్తుతించి 'లోకేశ్వరా ! మా ప్రార్థనంబు నంగీకరించి యవతరించి భూభారంబును దీర్చితివి. నీవవతరించి నేటికి నూటయిరువదియేఁడేండ్లయ్యెను. వైకుంఠంబు భవద్దర్శనార్థము నువ్విళ్ళూరుచున్నది. మఱియు యదుకులంబు శాపవినష్టంబగు కాలంబును సమీపించెను. స్వధామంబునకు దయచేయవేఁడు' మనిరి. కృష్ణుఁడు వారినాలకించి 'పితామహా ! ఈయర్థంబునే చింతించుచున్నాను. లోకసంగ్రహార్థము సురలు తమ యంశంబుల యాదవకులంబున జనించిరి. వారుమరల స్వస్థానంబునకుఁ బోవ ఋష్యాదులశాపంబులునిమిత్తంబులయ్యెను. ఆశాపంబులను నివారింపనోచియు యాదవులు స్వస్థానగతులగుటకు నవితోడ్పడుచున్న కారణంబున మిన్నకుంటిని. వారిని

వారితావులకుఁ దరలించి నీయిచ్చచేయుదు' నని చెప్పి బ్ర హ్మాదులను బుచ్చెను.

పితామహాదులట్లు చన్నంతటఁ గృష్ణుఁడు యాదవముఖ్యులను జేర్చి 'మహోత్పాతంబులను జూతురుగదా. ఇఁక నిచ్చటనుంట మేలుగాదు. ప్రభాసక్షేత్రంబునకుఁ జని యందునీరాడి దేవపితృతర్పణంబులను గావించి యుత్తమదానంబులిచ్చి బ్రాహ్మణసంతర్పణంబులు జరిపి పాపంబులనుండి తరించుట యుక్త' మనెను. ఎల్లరును వల్లెయని ప్రయాణసన్నాహంబులకుఁ దొడంగిరి.

ఉద్ధవుఁడు.

కృష్ణుఁడు పరమేష్ఠితోఁ జెప్పినసంగతి యుద్ధవుఁడు విని యేకాంతంబునఁ గృష్ణుని డాయఁబోయి ప్రాంజలియై 'దేవా! ఈలోకంబును వదల సంకల్పించితివని విందు. నీపాదపద్మంబులను వదలి క్షణంబైనను నిలువనోపని యీావరాటుని నేమి చేయఁ దలంచితివి ? ఈదీనునిగూడ నీవెంటఁగొని పొమ్మ'ని వేడెను.

కృష్ణుఁడు వానినెంతయుఁ గనికరించి 'ఉద్ధవా! నీవిన్నది నిజము. నావచ్చినకార్యము సమాప్తమయ్యెను. ఇఁక నాకిటఁబనిలేదు. యాదవకులంబు శాపగ్రస్తమగుట నీకు తెలిసియేయున్నది. శాపఫలంబుగా వారు పరస్పరము కలహించి కొట్లాడి నశింతురు. మఱియు నేటికి నేఁడవనాఁడు సముద్రము పొంగి ద్వారకాపురంబును ముంచివేయును. నేను చన్నంతనే కలి యీలోకంబునఁ గాలూనును. వాని ప్రేరణా

బున నధర్మంబు వర్ధిల్లును. కావున నీవు నయిత మిందుండ వలదు.'

ఉద్ధవా! స్వజనబంధుస్నేహంబును ద్యజించి సమస్తమును విడనాడి నీమనస్సును నాయందు నిలిపి సమదర్శనుండవై భూసంచారంబుఁ గావింపుము.' అని చెప్పెను.

ఉద్ధవుఁడు — స్వామీ! లోకమెల్ల గుణదోషంబులతో నిండి యున్నది. ఒకప్రక్క గుణదోషంబులఁ జూచుచు సమబుద్ధితో నుండుటెట్లు?

కృష్ణుఁడు — ఉద్ధవా! మనోవిక్షేపమువలన నానాత్వము గాన్పించుచుండును. ఏదేది మనస్సుచేతఁ దలంపఁబడునో, ఏదేది కంటికిఁ గాన్పించునో, ఏదేది చెవికి వినవచ్చునో, వేయేల? ఏదేది యింద్రియగోచరమో యదియెల్ల నశించునదేగాని స్థిరముగా నుండునదిగాదు. అట్టివి సత్యంబులట్లు అనఁగా నాశనంబులు లేనివిగాఁ గాన్పించుచుండును. ఏలయందువా? అవియెల్ల మనఃకల్పితంబులై మనస్సుచేతనే గ్రహింపఁబడుచునుండుటయే కారణము. ఉద్ధవా? దృశ్యమెల్ల మనోమయమై యున్నది. మనస్సుండునంతకాలము తత్కల్పితంబులుండును. ఎప్పుడు మనస్సు నశించునో దానితోడఁ దత్కల్పితంబులును నశించును. దీనినే మాయయందురు.

ఉద్ధవా! ఈమాయవలన నానాత్వము తోఁచుచున్నవి. నానాత్వమనఁగా ఇది వేఱు అది వేఱు అనెడిభావము. అట్టిభావంబునంటి మంచిచెడుగులనెడి గుణదోషబుద్ధియు, ...

చేయఁదగును, ఇదిచేయరాదనెడి హితాహితవివేకంబునుఁ బుణ్యపాపంబుల విచికిత్సయు గలుగుచుండును.

ఈతలంపులెల్ల నజ్ఞానజనితభ్రమలుగాని యెుండుగావు. ఈభ్రమలోనున్నంతకాలము శాంతిగలుగదు. శాంతిగలుగవలయునన్న నిట్టిభ్రమనుండి తొలంగవలయును. అదియెట్లందువా ? ఇంద్రియంబులెల్ల మనోవశములై వర్తించుచుండును. నీమనస్సును మొట్టమొదట బంధించి యింద్రియపరాఙ్ముఖమొనర్చి దానిని నీయాత్మపరము చేయుము. శాసించువాఁడు లేమింజేసి యింద్రియంబులెల్లఁ బరప్రేరితవ్యాపారంబు నుడుగును. మఱియు మనస్సు వైముఖ్యమగుటవలన బాహ్యప్రపంచమే నీకుఁ దెలియకుండును. అదినీకు శూన్యమట్లగును. అప్పుడు సృష్టియెల్ల మనఃకల్పితంబగుట నీకే స్పష్టమగును. దీనినే సత్యస్ఫురణంబందురు. అనఁగా సర్వము ఆత్మయే యనియు వేఱొండులేదనియు నీకే యనుభవసిద్ధమగును. ఇట్టిజ్ఞానం బెప్పుడు స్థిరంబగునో యప్పుడు ఆత్మభూతుఁడవగుదువు. ఆత్మభూతుఁడైనవానికి నేను నీవు అను భేదభావం బుండదు. ఎప్పుడు భేదభావములేదో యప్పుడే సర్వము నొక్కటే యగును. అట్టివానికి ఇతఁడుహితుఁడు ఇతఁడు శత్రువు ననెడి వ్యవస్థయే లేదుగావున నతఁడొకరిని నొప్పించుటగాని యొకరివలన నొప్పింపఁబడుటగాని యుండవు.

* ఇవి విజ్ఞానిలక్షణంబులు. ఇట్టిస్థితికి వచ్చునందాఁక విహితధర్మంబులను జేయుచునే యుండవలయుననియు, అట్టిధర్మంబుల నాచరించుటవలననే క్రమక్రమంబుగా నిట్టిస్థితి గలుగుననియు గ్రహింపవలయును.

ఎవఁడట్టిస్థితికివచ్చునో యతఁడు గుణదోషాతీతుఁడగు ను. వానిచర్యలెల్ల నర్భకునిచర్యలవలె సంకల్పరహితములై లీలామాత్రంబులుగా నుండును. సామాన్యుల వ్యవహారం బులెల్ల సంకల్పఫలాభిసంధులతోఁ గూడియుండును. స్థితప్ర జ్ఞునివ్యవహారంబులు తద్రహితంబులై యుండును.

మనుష్యులు వారివారి ప్రారబ్ధవాసనలప్రేరణంబు ప్రకారము వర్తింతురు. ఈవాసనలనే సంస్కారంబులందురు. సంస్కారంబులు శుభాశుభమిశ్రమంబులు. ఇవి సంకల్పవిక ల్పరూపంబులఁబుట్టుచు నిచ్ఛారూపంబునఁ బరిణమించుచు వ్య వహారరూపంబునఁ బర్యవసించుచు నుండును. ఈసంస్కార సముదాయమునే మనస్సు అందురు.

మనస్సు వాసనాత్మకంబుగావున వాసనలునశించెనేని మనస్సు నశించుటయగును. వాసనలు నశించుటెట్లందువా? ప్రతికూలవాసనల వృద్ధివలన మొదటివాసనలు బలమఱి దగ్ధ పటన్యాయంబుననుండును. అట్లు మొదటివాసనలు నశించి న తర్వాతఁ దన్నాశనార్థము పెంచిన ప్రతికూలవాసనలఁగూడఁ ద్యజింపవలయు'ననెను.

* ముల్లు గ్రుచ్చినప్పుడు వేఱొకముల్లు తెచ్చి గ్రుచ్చిన ముల్లును తీసివేసి తర్వాత రెండవదానినిగూడఁ బాఱవేయు నట్లే యశుభవాసనలను బ్రతికూలవాసనలచే రూపుమాపి త ర్వాత వానినిగూడఁ ద్యజింపనగునని శ్రీరామకృష్ణపరమహం సగారుపదేశించిరి.

ఉద్ధవుఁడామాటలు సాంతంబుగా విని 'స్వామీ ! మీ

యుపదేశమెల్ల సర్వసంకల్పపరిత్యాగరూపమైన సన్యాసంబగును. విషయవాసనలకు వశమై కోరికలతోనిండి భక్తినేనియు నిండారుగా నీకుఁజేయఁదీఱకుండునట్టివారికి నీవచించుమార్గం బెంతమాత్రంబును సాధ్యముగాదని తలంతును. నేనుగూడ నట్టివాడనేగాని వేఱుగాదు. ఏలయందువా ? దేహాభిమానం బింకను నన్ను వదలదు. అందువలన భేదబుద్ధి యంటియే యున్నది. ఇట్టిమూఢుఁడెక్కడ ? నీయుపదేశంబెక్కడ ? నీచెప్పినదారిత్రొక్కుట మాంబోట్లకు నందనిమ్రానిపండ్లకై యఱ్ఱుసాచుటగును. ఈజడమునకు సాధ్యమైన త్రోవఁ జూపుము. సర్వజ్ఞుఁడవు గావున నెవరి కేదిమేలో నిశ్చయించి తెలుప నీవే తగుదువు బ్రహ్మాదులు గలుగరాయని యం దువా ? వారు సర్వజ్ఞులుగారు. అందువలన శిష్యతత్త్వం బెఱింగి బోధించుశక్తి వారికిఁ గలుగదు. మఱియు బ్రహ్మా దులుగూడ మావలెనే నీమాయకుఁజిక్కి దృశ్యమును సత్య ముగా విశ్వసించియున్నారు. తమ్ముద్ధరించుకొననేరనివారు మమ్ముద్ధరింపనేర్తురా ? స్వామీ ! అనవద్యుండవును అనంతుం డవును సర్వజ్ఞుండవును బ్రహ్మాదులకుఁగూడ మూలంబవునైన నారాయణుని సర్వేశ్వరునినిన్ను పాపసంత్రప్తుఁడైన యీయు ద్ధవుఁడు గత్యంతరంబుగానక శరణొల్లెను. ఇతఃపరంబు నాకు శరణంబుగలుగదు. అనుగ్రహింపు'మని ప్రార్థించెను.

కృష్ణుఁడు చిఱునవ్వు దాల్చి 'ఉద్ధవా ! ఇంతకన్న వెఱ్ఱి గలదా ? ఎవనిని వాఁడే యుద్ధరించుకొననగుఁగానిఁ యొకని నొకఁడుద్ధరించుట యెన్నఁడును గిలఁగదు. (గీ: 6-6) దారిచూప వలదాయని యందువా ? దారిచూపుటకు లోకమేయున్నది.

అంతకు మించినగురువే గలుగఁడు. లోకమందలి చరాచరం బుల తత్త్వంబును బరిశీలించి యుక్తాయుక్తంబులను గాంచి యుక్తంబుల ననుసరించుచు నయుక్తంబులఁ బరిహరించుచుఁ గ్రమక్రమంబుగా సిద్ధినొందనగును.

ఉద్ధవా ! విషయము మనస్సునకు స్ఫుటము కావల యును. అప్పుడు దానియందు నమ్మిక జనించును. అందాఁక దానిని గ్రహింపరు. విషయము మదికి స్ఫుటమగుటయెట్లం దువా ? ప్రత్యక్షంబుగాఁ జూచుటవలన నయ్యది మదికెక్కు ను. కొన్నింటి ననుమానప్రమాణంబునఁగూడ గ్రహించు టగలదు. అనుమానప్రమాణంబన నెట్టిదందువా ? దూర మునఁ బొగగానవచ్చును. నిప్పులేకున్నఁ బొగజనింపదు. పొ గను జూచి యచ్చట నగ్నియున్నదని నిశ్చయించుట యను మానప్రమాణంబగును. ఇవిరెంటినెవనికి వాఁడేచేయవల యును. అన్యులు చూచినను ఊహించినను ఫలములేదు. ఈరెండును మనఃకార్యంబులగును. కావున నెవనినతఁడే యుద్ధరించుకోవలయునని చెప్పితిని. గురువు సంగతిఅన్ననో అతఁడు ఇదియని బోధింపఁగలఁడేగాని వేఱుగాదు. ఎంతబో ధించినను స్వానుభవంబునకు సాటిగాదు గదా.'

ఉద్ధవుఁడు—స్వామీ ! మనస్సు జడమందురు. జడంబునకు గ్రహణబోధనశక్తు లెట్లుగలుగును ?

కృష్ణుఁడు—ఉద్ధవా ! ప్రారబ్ధకర్మవాసనల సముచ్చయంబు మనస్సు అని మున్నే చెప్పితిని. మనస్సు జడమనుట నిజ ము. అది జడమైనను శుద్ధమగునేని, శుద్ధదర్పణంబున

సూర్యరశ్మిం జేసి వస్తువు ప్రతిబింబించునట్లు, దానియందు సత్యము ఆత్మసాన్నిధ్యంబునం జేసి స్వాతముగా స్ఫురించును. కావున మనశ్శుద్ధిగలవారికి సత్యము గోచరించును.

ఉద్ధవుఁడు — స్వామీ! లోకమునకన్నమించిన గురువు లేడంటి వి. లోకమనఁగానేమి ?

కృష్ణుఁడు — ఉద్ధవా ! చరాచరాత్మకమైన సమస్తసృష్టిని లోకమందురు. సృష్టినెల్లఁ బరమాత్మనైననేను తేనెయందుఁ దీపివలె నవినాభావంబుగా వ్యాపించియుందును. సృష్టి యెట్లేర్పడుచున్నదందువా? పంచభూతముల కలయికవలన నేర్పడుచున్నది. పంచభూతంబు లెక్కడివందువా ? నేనే పంచభూతాత్మకుండ నగుదును.

ఉద్ధవుఁడు — పరమాత్మ యేకము, అద్వితీయము నందురు. ఏకమునుండివచ్చిన సృష్టియందు నానాత్వ మెట్లుగలిగెను?

కృష్ణుఁడు — జీవుల ప్రారబ్ధకర్మము నానాత్వంబుగా నుండును. నానాత్వమైన యాకర్మముల ఫలంబు ననుభవించుటకు నానావిధములైన యుపాధులు గలుగుచున్నవి. నానావిధ కర్మఫలానుభవంబునకు నేకరూపమైన యుపాధి తగదు. ఉపాధుల వివిధత్వంబునఁ జేసి సృష్టియందు నానాత్వము గలుగుచున్నది. ఉపాధులు పంచభూతసమ్మేళనంబునఁ గలుగుచున్నది. ఉపాధితారతమ్యంబునుబట్టి పంచభూత సమ్మేళనంబగుచుండును.

ఎల్లయుపాధులలో మనుష్యునియుపాధి యుత్తమోత్త మము. ఏలయందువా ? మనుష్యోపాధియందు మాత్రమే

యాత్మదీప్తి సులభముగాఁ బ్రకాశించును. ప్రారబ్ధకర్మ ఫలంబుగా నయ్యుపాధి యట్టిదగుచున్నది. కుండమొదలు దర్పణమువఱకు మంటితోనే చేయుదురు. అయినను దర్పణంబు నందువలెఁ గుండపెంకునందు బింబము ప్రతిఫలింపదు. ఏల? దర్పణనిర్మాణంబునకునైన కర్మఫలంబట్టిదిగానుండుటయే కారణము. మనుష్యోపాధియందు నాత్మదీప్తియట్లు ప్రతిఫలించుటం జేసి వారు తక్కిన జంతువులవలె క్షుత్పిపాసలతోనే తృప్తిచెందక, యుక్తాయుక్తవివేకము ఆత్మకళ్యాణజ్ఞానముఁ దన్మార్గాన్వేషణంబు మున్నగునవి గలిగి మోక్షంబును సాధింపఁజాలియున్నారు.'

ఉద్ధవా! ఉపాధులు ఏకపాదులు ద్విపాదులు త్రిపాదులు చతుష్పాదులు బహుపాదులుగని నానావిధంబుల నుండును. వానిలో మనుష్యసియుపాధి నాకుఁ బ్రీతినిలయమై యుండును.

ఉద్ధవుఁడు:-స్వామీ! పరమాత్మవైన నీవు చరాచరసృష్టినెల్ల వ్యాపించి యుందునంటివి. నీరూపంబును దెలిసికొనుటెట్లు?

కృష్ణుఁడు:-ఉద్ధవా! నారూపంబు స్థూలదృష్టికి నందదు. దానిని జ్ఞాననేత్రంబుచేత చూడనగును. ఏలయందువా? స్థూలదృష్టికి నేత్రము సాధనంబగును. నన్ను చూచు శక్తి దానికిఁ జాలదు; అంతకన్న శక్తివంతమైన సాధనంబు వలయును. అంతటిశక్తి బుద్ధీంద్రియంబునకుఁ గలదు. దానిని సాధనంబుగా గ్రహించి నన్నుఁ జూడనగును. బుద్ధీంద్రియంబు జడంబయియు దానికి గ్రహణశక్తియుండ

డదనియు శంకింపవలదు. సాధనంబులెల్ల జడంబులే య గును. వానికి స్వతంత్రశక్తిలేదు. అయినను సాధ కుఁడు వానిసహాయ్యంబుననే కార్యసిద్ధిఁ బడయుచున్నాఁ డు. అదే న్యాయమిందును వర్తించును. ఇచ్చట సా ధకుఁడెవఁడందువా ? నీలోనున్న యాత్మయే సాధకుఁడు. ఆత్మ మూలమందునిలిచి బుద్ధీంద్రియసాధన మూలకం బునఁ దనస్థితి నెఱుంగుచుండును. సాధనంబెంతపరిశుద్ధము గానుండునో వస్తుస్థితియంత విస్పష్టంబగుచుండును.

### అవధూత యదు సంవాదము.

ఉద్ధవా ! లోకంబెట్లుత్తమోత్తమగురువో బోధించు నితిహాసముగలదు. దాని నవధూత యదుసంవాదంబందురు. అది చెప్పెద వినుము నా పూర్వులైన యదువంశరాజులలో నహుషుఁడనురాజు మహాపరాక్రమశాలి యుండెను. వానికి యయాతియు వానికి యదువును జనించెను. యదువు రాజయి పరిపాలించుచుండఁగా నొక యవధూత యటకు వచ్చెను. వానిస్థితిగతులు యదురాజునకుఁ బరమాశ్చర్యంబును గలిగిం చెను. ఆ ఱేఁడు వానిని సందర్శించి ' మహాత్మా! నీవర్తనంబు నాకెంతయు వింతగానున్నది. మానవులు ప్రాయికంబుగా ధర్మార్థకామంబులను గోరి తదర్థము వ్యవహరింతురు. కొం దఱు దీర్ఘాయువును గోరియుఁ గొందఱైశ్వర్యంబును గోరియుఁ గొందఱు కీర్తిని గోరియు నొకానొకరు జ్ఞానంబును గోరియుఁ బరిశ్రమించుట గలదు. ఎవరెన్నివిధంబులఁ బరిశ్రమించినను వారియంతరమందునే దేనొక కోర్కె కదలియాడుచుండును.

ఆకోర్కెకు ననుసారంబుగా వారిబాహ్యవ్యవహారముండును. వారు నిమిషంబుగూడ రిత్తపుచ్చక నిరంతరంబు నేదేనొకటి తలంచుచునో చేయుచునో యుందురు. నీసంగతి విపరీతంబుగా నున్నది. నీవు పసిబాలుఁడువలె సంచరింతువే గాని యేదేనర్థంబును బడయఁగోరి వ్యవహరించు లక్షణమే నీయందుఁ గానరాదు. వెఱ్ఱివో యనుటకు నట్టిచిహ్నమే నీయెడ లేదు; బలహీనుఁడవో యనుటకు నీవు మహాబలశాలివగుట నీదేహమే తెలుపుచున్నది. ప్రజ్ఞ లేదా యనుటకు నీముఖకళయే జ్ఞానవిభవంబును జాటుచున్నది. జడుఁడవో యున్మత్తుఁడవో పిశాచగ్రస్తుఁడవో యనుటకు నట్టిలక్షణంబులే నీయెడఁగానరావు. లోకంబు నెల్లదహించుచుండు కామలోభదవాగ్ని నీచెంతకుఁగూడ వచ్చినట్లు తోఁపదు. గంగాజలంబుల మునిఁగి తత్సుకంబుననుభవించుచు హాయిగా నుండు గజరాజంబువలె నీవు నిరంతరసంతోషముగ్నుండవని నీ ముఖలక్షణంబులు తెలుపుచున్నవి. నీయీమహానందంబునకుఁ గారణంబేమో, దానినెట్లు పడసితివో, విషయస్పర్శ నుండి యెట్లు తప్పించుకొనఁ గల్గితివో యూహింపరాదు. ఈ రహస్యంబును దెలుపవేఁడు' ననెను. వారికిట్లు సంవాదము జరిగెను.'

అవధూత:— రాజా! ఎట్లుజీవితంబును గడుపనగునో యెరుంగుటకై యెంతో శ్రమించితిని. తుట్టతుదకు లోకమే యుత్తమ గురువని గ్రహించి దానిని శుశ్రూషించితిని. నా శుశ్రూషాఫలంబుగా నిట్టిస్థితి నాకు లభించెను. నాగురువు లెవ్వరో, ఎవరివలన నేమి నేర్చితినో చెప్పెద వినుము.

### 1. భూమి—క్షమాపరార్థజీవికలు.

మొట్టమొదట భూతత్వంబును బరిశీలించితిని. భూమిని బలువిధంబుల వ్రక్కలించుచుందురు. ఆబాధయెల్ల భూమి యోర్చుచున్నది. అంతియగాదు. తన్ను బాధించినవారికి యది ప్రతిక్రియ నెన్నఁడుఁ దలంపదు; మీఁదుమిక్కిలి తనహృదయమందే నానావృక్షసస్యాదులను బెంచి తనయుపకారులనే యది యుపకరించుచున్నది. ఈభూమి పర్వతరూపంబునను వృక్షరూపంబున నుండును. అందు వృక్షంబులను నిలువున గొడ్డట నఱకుదురు. జనులట్లుచేయుచున్నను వృక్షంబులు కిమ్మనక మఱలఁ గొమ్మలను బెంచి వర్షాతపములబాధ నవియే భరించుచు వానినాశ్రయించినవారికిఁ జల్లనినీడలను దివ్యఫలంబుల నొసంగుచున్నవి ప్రతిఫలంబినుమంతైన నవి యపేక్షించుట లేదు. పర్వతంబులు వృక్షగుల్మలతాతృణంబులను బెంచుచు నదీనదంబులఁ బాఱించుచు సర్వము లోకంబునకిచ్చుచున్నవి. వీనింజూచి బుద్ధిమంతుఁడు సర్వసహాన శీలియుఁ బరార్థజీవియునై యుండవలయునని నేర్చితిని.

### 2. వాయువు—జీవితనిర్వాహకత్వము-ఆత్మనిస్సంగత్వము.

వాయువు ప్రాణవాయువనియు బాహ్యవాయువనియు రెండువిధంబులు. అందుఁ బ్రాణవాయువు ఆహారాదిమాత్రంబుననుండును; లోకమెల్ల నిండియున్నను జీవనార్థమెంతవలయునో యంతే దానిని గ్రహింతురు. అట్లే బుద్ధిమంతుఁడు ప్రాణరక్షణార్థమెంతవలయునో యంతతోనే తృప్తిపడవలయు ననియు జిహ్వాచాపల్యంబునఁ గన్నదెల్లఁ దినరాదనియుఁ దిన్నను

ఫలము లేదనియుఁ బ్రాణవాయువువలన గ్రహించితిని. మఱి యు వాయువు శీతోష్ణాది నానావిషయధర్మంబులతోఁ గూడి వీచుచున్నను వాయువునకు వానితో గూడిక గలుగదు. ఇదిచూచి నిస్సంగత్వవిధానము నేర్చితిని.

గాలి యెల్లెడల వీచుచున్నను దానికి సువాసనలుగాని దుర్వాసలుగాని యంటుట లేదు. అట్లే యాత్మ సర్వాంతర్యామియై వివిధపార్థివదేహంబులతో సంసర్గంబును బొందుచున్నను దద్దేహ శుద్ధాశుద్ధతలు నాత్మకు సోఁకవని వాయువువలన గ్రహించితిని.

### 3. ఆకాశము—ఆత్మాపరిచ్ఛేద్యము.

ఆకాశము లేనిచోటు లేదు. అది ఘటంబునను మఠంబునను రెంటనున్నది. అట్లు వేర్వేఱులైన యుపాధులాదున్నను దానియేకత్వంబునకు భంగంబు గలుగదు. అట్లే యాత్మ భిన్నభిన్నోపాధిగతమైనను అది యపరిచ్ఛేద్యము ఏకము అని యాకాశమువలన గ్రహించితిని.

### 4 జలము—సహజస్నిగ్ధ నిర్మల స్వభావము.

జలము స్వాభావికంబుగా స్వచ్ఛంబును స్నిగ్ధంబును మధురంబునై తన్ను సేవించినవారినెల్లఁ బునీతులఁ జేయుచున్నది. అట్లే మర్త్యుఁడు సహజస్నిగ్ధనిర్మలస్వభావము గలిగి యెల్లరకుఁ బ్రియుఁడై నిజసందర్శనసంభాషణ సంస్పర్శాదులచేత నన్యులను బవిత్రీకృతులఁ జేయుచు నుండవలయునని జలంబులవలన నేర్చితిని.

### 5. అగ్ని—నిసర్గ ప్రకాశాదులు.

అగ్నినిసర్గప్రకాశవంతమై చెనకరాక యొకపటి సివుబు

గప్పియు నొకపఱి ప్రజ్వరిల్లుచు నాశ్రయించినవారికి సుఖం బుఁ గూర్చుచు నెవరేమి వ్రేల్చినను గ్రహించుచు నాహూతులపూర్వపరపాపంబులను హరించుచున్నది. అట్లే మర్త్యుఁడు తపస్తేజోవంతుఁడును దుర్ధర్షుఁడునై నిజమహిమను బ్రకటించు కొనక యెవరేమి యిచ్చినను గ్రహించుచుఁ దన్నుఁ జేరినవారికి మేలుఁగూర్చుచు సేవించినవారి పాపంబులను హరించుచు వారికి నుత్తమగతిని జూపుచుండవలయునని యగ్నివలన నేర్చితిని.

మఱియు నగ్ని దానిమంటయందువైచు పుడకలనుబట్టి వృద్ధిక్షయంబు లందుచున్నను వహ్నిమాత్రము యథారీతి నేకరాశిగానుండును. మంట యగ్నిగాదు; పుడకలకాంతి మం టయగును పుడకలు కొంతకాలంబునకు బూదియగును. అట్లే భూతంబులకుఁ గాలవశంబున జననలయంబులు గలుగు చుండుననియు, అవి యుపాధిసంబంధములేగాని దానియంతర్వర్తియైన యాత్మకు సంబంధించినవి గావనియు, ఆత్మకుఁ జావు పుట్టువులు లేవనియు, ఉపాధులకు జననమరణంబులు సహజం బులనియు, జననమరణవశమైన యుపాధి యెన్నడును శాశ్వతము గాదనియు నగ్నివలన గ్రహించితిని.

అగ్నికి రూపమేలేదు. ఏయేపదార్థంబు నది దహించునో యాయాపదార్థాకారంబును దాల్చుచున్నది. మఱియు నగ్ని పరేచ్ఛవలననే హవిస్సును గ్రహించుచున్నదిగాని తాను కోరి గ్రహించుటలేదు. అట్లే మునిగూడ పరేచ్ఛాప్రేరితుఁడై యన్నాదులను గ్రహింపవలయునేగాని తాను స్వయముగాఁ దత్కాంక్షతోనుండరాదు.

## ౬. చంద్రుడు — ఆత్మ నిర్వికారత్వము.

కాలగతింబట్టి చంద్రునందు వృద్ధిక్షయరూపంబులైన వికారంబులు గలుగుచుండునట్లుగా మనకుఁ గానవచ్చును. ఎక్కము విచారించితిమేని యీ వృద్ధిక్షయంబులు చంద్రకళలకేగాని చంద్రమండలంబునకుఁ గావు. అట్లే కాలవశంబున షడ్భావవికారంబులు పుట్టుట పెరుగుట తఱుగుట నశించుట మున్నగునవి యుపాధులకు గలుగుచున్న వేగాని యుపాధిగతమైన యాత్మకుఁ గావని చంద్రునివలన గ్రహించితిని.

* ఆపోమండలస్థుఁడైన చంద్రుఁడును తేజోమండలస్థుఁడైన సూర్యుఁడును ఏకనక్షత్రమునకు వచ్చినప్పుడు సమదేశస్థితమైన సూర్యమండలంబువలన మనచూపు కప్పఁబడుచున్నది. ఆకారణంబునఁ జంద్రుఁడు మనకుఁ గానరాకుండును. ఆ సమయంబును అమావాస్యయందురు. ఒకనక్షత్రంబునుండి మఱియొక నక్షత్రంబునకుఁ బోవుటకుఁ జంద్రునకు అరువది గడియలకాలంబును సూర్యునకుఁ బదమూఁడహోరాత్రంబుల కాలంబును బట్టును. విషమస్థితమైయున్న సూర్యమండలంబుయొక్క పదునేనవభాగము ప్రథమము మొదలు దినంబునకు నొక్కొక్కభాగము వంతున ఆపోమండలమందుఁ బ్రతిబింబించుచు వచ్చును. అట్లు ప్రతిబింబించిన భాగములను కళలందురు. పదునేనవనాటికి, బదుమూఁడు నక్షత్రంబుల యంతరము చంద్రసూర్యులకుఁ గలుగుచున్నది. రాశిచక్రమందు ఇరువది యేడు నక్షత్రంబులుగలవు. వాని నడుమ చంద్రాదిత్యులున్నప్పుడు భూచ్ఛాయాలాంఛితమైన సంపూర్ణ ప్రతిబింబంబు గానవచ్చుచున్నది. ఆసమయంబును

పౌర్ణమాస్యయందురు. మరల ప్రథమము మొదలు రెండు మండలంబులకు విషమభావము గలుగుచున్నది. ఆకారణంబునఁ గళలు తగ్గుచుండును. ఇది జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయము.

### 7 సూర్యుఁడు—ఆత్మ ఏకము శుద్ధము.

సూర్యుఁడొక్కరుఁడే యేకరాశిగాఁ బ్రకాశించుచున్నను వానిబింబము పెక్కుజలాశయములందుఁ బ్రతిబింబించినప్పుడు ఒక్కొక్కదానియందు నొక్కొక్కసూర్యబింబము గావచ్చును మఱియు జలతత్త్వంబునుబట్టి యాప్రతిబింబము స్వచ్ఛముగానో మార్పుచెందినదిగానో తోఁచును. దీనింబట్టి యాత్మ ఏకము అద్వితీయంబు స్వచ్ఛంబునైయున్నను ఉపాధులనుబట్టియు వానిగుణంబులనుబట్టియు భిన్నంబులుగాను శుద్ధాశుద్ధమిశ్రంబుగాను దోఁచుచున్నదని గ్రహించితిని.

### 8. పావురములు—మమకారము పతనద్వారము.

ఒకయడవిలో నొకచెట్టుమీఁదఁ బావురములజంట గూఁడుకట్టికొని నివసించుచుఁ బరస్పరముఁ బ్రేమానుబంధబంధితంబులై యొండొంటితోడిదే లోకంబుగా భావించుచు నాహారవిహార శయనాసనసమయంబులందు నెన్నడు నెడఁబాయకయుండెను. పెంటిపక్షి యేదికోరినను మగపక్షి తన ప్రాణంబులనైనఁ గుదువపెట్టి తెచ్చియిచ్చి దానిని దనుపుచుండెను. ఆడుపక్షి కొన్నాళ్ళకు గ్రుడ్లుపెట్టి పొదివి పిల్లలుచేసెను. పెద్దపక్షులు పిల్లలముద్దుకూఁతలకు నానందించుచు వానిని గారాబంబుతోఁ బెంచుచుండెను.

ఒకనాడు పెద్దపక్షులు పిల్లలయాహారార్థంబు జంటగా వనాంతరంబునకుఁ బోయియుండగా బోయయొకఁడా చెట్టునొద్దకు వచ్చి గూటిలో నెగురుచున్న పిల్లలను జూచి వలపన్ని వానిని బట్టుకొనెను. అంతలోనఁ బెద్దపక్షు లాహారంబును సేకరించికొని వచ్చెను. ఆడుపక్షి మున్నాఁడి గూటిలో దూఁడ్ పిల్లలను గానక చెట్టుక్రిందనున్న బోయను వానివలలోఁ జిక్కియున్న తనపిల్లలను జూచి కడుంగడు దుఃఖించుచుఁ గ్రోశించుచు వ్యసనవివశయై పనవుచుఁ బోయి యావలలోఁ జిక్కెను. మగపక్షి పెంటికై వగచుచు 'కటా! ఎంతయల్పపుణ్యంబొనర్చితినో గదా! గృహమేధులకు ధర్మార్థకామంబులు మూడును గరస్థంబులందురు. ఆమూటిని దనివారఁబడయకమున్నే నా గృహము (భార్య) చనెను. ఎవతె తనమురిపెంబులకు నన్నే యిల్లుగాఁ జేసెనో, ఎవతె నన్నుఁ బరదైవతంబుగా మన్నించునో, యా నాప్రియురాలు ప్రాణంపుఁ బ్రాణంబు నన్ను విడనాడి బిడ్డలతో దివికేగుటఁ గన్నారఁ జూచుచు జీవచ్ఛవంబునై యీ మొండికట్టియ యుండనేల? ఈశూన్యగృహము నాకేల? భార్యాపుత్త్రులఁ గోల్పోయి దుఃఖదీన జీవినైన నా బ్రదుకేల?' అని పెల్లుదుఃఖించి యావలలోనే పడెను. బోయ నాఁడు తనపంట పండినందులకు సంతసించుచు వానినిగొని యింటికిఁ బోయెను.

రాజా! కుటుంబలోలుఁ డాపక్షులయట్లు వివిధమమకారంబులకుఁ జిక్కి కలిమిలేములు మున్నగుద్వంద్వంబులతోఁ బెనఁగులాడుచుఁ దుదను సానుబంధముగా నశించుచున్నాఁడని యు, ముక్తిద్వారమైన నరజన్మంబెత్తియు నింద్రియాసక్తుఁ

నేకరూపంబున నారాయణపరచిత్తుఁడై యర్థంబు జంటగానే యునినియు సముద్రమువలన గ్రహించియొకడా చెట్టునొద్దకు చి వలపన్ని వాసిని

### 11. శలభము—సంసారకూ

మిడుత వెలుతురుఁగాంచి హారంబును సేకరిం యందుఁబడి నశించుచున్నది. అట్లు గూఁటిలో యిప్రి దూఁటి దేవమాయానిర్మితమైన స్త్రీయనెడి మంటనుగాంచి శి— వభావంబులకులోనై యది సుఖదాయి యని భ్రం యఘాతమైన సంసారకూపంబునఁబడి నశించుచున్నాఁడని భంబువలన నేర్చితిని.

### 12. మధుకరము—గుణగ్రహణము;

తుమ్మెద యొకపువ్వందే తగిలియుండక యుఁ గొద్దిగ ప్పలసి చూడకయుఁ ప్రతిపుష్పంబునుండి దానికి నొగి కాక డునట్లు కొంచెకొంచెముగా మకరందంబును సేకరించునట్లు యోగి యొక్కసినే యాశ్రయించి మధుకరవృత్తి బూని భాగ్యవంతుఁడొండె బీదయొండె నొక్కొక్కయిం నొక్కొక్కకబళంబును మాత్రము గ్రహించుచు జీవితంబును గడుపవలయుననియు శాస్త్రము గొప్పదనిగాని చిన్నదనిగా యనక యెందెందు గుణముగలదో దానిని గ్రహింపవలయు బ ననియుఁ దుమ్మెదవలన నేర్చితిని.

### 13. గజము.

మగయేనుఁగును బట్టుటకై [illegible] వ్వ చెలుతో బెనఁగొనుచుఁ దుదకు సానుబంధముగా నశించుచున్నాఁడని యు, ముక్తిద్వారమైన నరజన్మ బెత్తియు నింద్రియాసక్తుఁ

దానికిఁగాఁ ద్రవ్వికప్పియుంచినగోఁతిలోఁ దటాలునఁబడి బంధితమై స్వాతంత్ర్యంబును గోల్పోయి చిక్కుచున్నది. కావుననే ఆఁడుబొమ్మనైనను గాలితోఁగూడ భిక్షువు తాకరాదనిరి. గజము పాటుంగాంచి స్త్రీలు ప్రాజ్ఞులకు నాత్మమృత్యువులగుదురనియు స్త్రీలనుపసర్పించినవానికి గజముగతి తప్పదనియు గ్రహించితిని.

### 14. మధుహారి.

తుమ్మెద పడరానిపాట్లుపడుచు నెందెందో సంచరించి కుడువక యియ్యక సేకరించిన మకరందంబును హఠాత్తుగా నెవఁడో వచ్చి హరించుచున్నాఁడు. అట్లేతినక పెట్టక దాచిన ధనమెల్లఁ దుదకుఁ బరులపాలేయగునియు భ్రమరంబువలన గ్రహించితిని.

### 15. మృగము—ఇంద్రియవశత్వము.

జింకలకు గానమందు మహాప్రీతియగుటఁజేసి యారహస్యంబెఱిఁగి వానినిఁ బట్టువారు శ్రవణసుఖంబుగాఁ గ్రోవిఁ బాడుదురు. ఆలాపగతికి జింకలు మైమఱచియుండును. అప్పుడు వానిని బట్టుదురు. ఇంద్రియవశులు కురంగమత్స్యంబులవలె నశించునని గ్రహించితిని.

* గానము కామోద్రేకపరమైనప్పుడే యనర్థకారియగును గాని భగవద్భక్తిపరమైనప్పుడు కీడుసేయదు. మీఁదు మిక్కిలి మేలునే చేయును. ఇంద్రియంబులలోనెల్ల జిహ్వేంద్రియంబు బలవత్తరమై సులభంబుగా జయింపరానిదై ముదిమియగుకొలఁది పెరుగువదిగానున్నది. తక్కిన యింద్రియం

ములకు ముదిమివలనఁ బటిమ నశించుచున్నది. రసనేంద్రియంబును గెలిచినవానికిఁ దక్కిన యింద్రియంబులు లెక్కగావు. నిరసనవ్రతాదులవలన రసనేంద్రియంబును గెలువ రాదా యనవచ్చును. ఆమాటకల్ల.

భోజనము జీవనార్థమనియు జిహ్వాతోషార్థమనియు రెండువిధంబులు. జీవనార్థభోజి యాఁకలితీఱుటనే చూచును. అంతోయింతో తిన్నంతనే యాఁకలి తీఱుచున్నది. అంతతో నతఁడు తృప్తుఁడగుచున్నాఁడు. జిహ్వాచాపల్యం బెన్నఁడును తీఱదు; భుజించు కొలఁది చాపల్యంబు పెఱుగుచునే యుండును. అట్లు తినుటవలనఁ బెక్కువ్యాధులు గలుగుటయేగాక యెంతసంపాదించినను జాలకుండును. చాలని నాఁడు అక్రమంబులు చేయుటయుఁ దత్కారణంబునఁ గ్లేశంబులపాలగుటయు లోకవిదితము. ఈసంగతి నెల్లరు జ్ఞప్తియందుంచుకొనవలయును.

కలిమి భోగార్థమనియు నందులకుఁగానికలిమి కలిమియే గాదనియుఁ గలిమినట్లు వినియోగింపనివారు పిసినారులై యిహపరంబులకు రెంటికిఁ జెడుదురనియు నుపదేశించు మతం బొకటి కలదు. ఈ మతము నానాటికి వ్యాప్తిఁగాంచుట చేతనే సకలపదార్థభూయిష్ఠమైన మనదేశము ప్రాణిపోషణంబునకుఁ జాలక తనబిడ్డలను దేశాంతరముపాలుచేసి యెన్నికష్టములఁ గుడుచుచున్నదో యీనాటిస్థితులే బోధించుచున్నవి. జిహ్వాచాపల్యఫలమైన భోగతృష్ణ యధ్యాత్మికాధిభౌతికంబులకు రెంటికి దూరముచేయుచున్నది. కావున రసాసక్తిని

వదలి ప్రాణధారణ నిమిత్తమై యథావిధవిధంబున భుజింప వలయును.

16. మత్స్యము - ఆశాపరత్వము.

జిహ్వాక్షోభము నింతనరాదు దానికి వశుఁడగునేని యెట్టిలకై మీనురీతి చావుతప్పదు. ఇది మత్స్యగతింజూచి గ్రహించితిని.

17. పింగళ — నైరాశ్యము.

రాజా! విదర్భనగరంబునఁ బింగళయను పేరి వేశ్యయుం డెను. అది దాని కులాచార ప్రకారము ధనమునకు నమ్ము డువోవుచు ద్రవ్యార్జనమే జీవితావధిగాఁ జేసి యుండెను. ఒక నాటి సాయంకాల మావడుపుగత్తె సింగారించుకొని యింటి వాకిట నిలిచి యామార్గంబున వచ్చుచుఁ బోవుచున్న ధనవం తులను క్రీఁగంటిచూపులఁ బిలచుచుఁ దెచ్చికోలుమరులు చూపుచు హావభావయలు చదురులెల్ల బ్రకటించుచున్నుండెను. అర్ధరాత్రమయ్యెను. ఎవ్వఁడును నాఁడు దానివలలోఁబడ డయ్యెను. దాని కన్నులు చూచిచూచి గాసిచెందెను; నిదు రలేమి దానిమోము వాడెను; ఆసకొనసాగమి దానికి విసువు నేవగింపు జనించెను.

పింగళ యట్లు భగ్నమనోరథయయి 'కటా! ఇంటి కూటికి దాటికూటికి రెంటికి దూరమైతిని. నిద్రాసుఖము పోయెను; ధనలాభసంతోషము కల్లయయ్యెను. కటా, అర్థంబువలన సుఖంబగునని పేరాసతో శరీరంబును వి[illegible] యించికొంటిని ; పడరానిపాట్లు పడితిని ; కుడువరానికుడుపులు కుడిచితిని. ఇంతకన్న వెఱ్ఱియుండునా ?'

ధనకాంక్షయేల ? సుఖముకొఱకుగదా ? సుఖమనఁగా నేమి ? తినుట కట్టుట ఇదిసుఖమగునా ? ఇవియే సుఖమని తలంచితిని. అవి ధనసాధ్యంబులని భావించితిని ; ధనసంపాదనమే జీవితావధిగా నెంచితిని. ధనసాధ్యంబులెల్ల భోగ్యంబులగును. భోగించునది యేది ? తనువుభోగించుచున్నది. ధనార్థము తనువునే విక్రయించితిని. విక్రీతమైన తనువునకు స్వాతంత్ర్యములేదు. అదిలేనినాఁడు దాసభోగము భోగమగునా ?

భోగమే సౌఖ్యమని తలంతుమా? అట్లయినను శరీరము శాశ్వతముగాదు. శాశ్వతముగానిదానికై యిన్నికష్టము లేల ? ఒకవేళ శరీరము శాశ్వతమైనను దాసభోగమే సుఖమన్నను, అది మాకాళ్ళబందాలై యున్న యీనీచమానవుల వలనఁ జేకూఱునా ? కటా! ఎవరు తమసుఖంబునకై మమ్మాశ్రయింతురో వారివలన నేను సుఖముఁగోరితిని. ఎంతవెఱ్ఱి! ఎంతవెఱ్ఱి!

సుఖంబు ననుభవించునది యేది? దేహమంచుమా ? దేహము జడప్రాయము; దానికి జ్ఞానములేదు; జ్ఞానములేని నాఁడు సుఖదుఃఖవివేకము గలుగదు. శవంబునకు సుఖదుఃఖంబులు గలవా? మఱియు దేహము రక్తమాంసాస్థిమయమై హేయరూప మూత్రపురీషాదులతో నిండియున్నది. ఎంత శుద్ధిపఱచినను, పైపూఁతలెన్ని పూసినను దానినైజమాలిన్యము తొలగదు. ఒక్కనాఁడు నీరాడకున్న నెననిదేహంబు వానికే దుస్సహమగుచున్నది. ఇట్టిదేహము సుఖమనుభవించుచున్నదను భ్రాంతితో దానికై జీవితమెల్ల వెతచేసితిని. అహహా! ఎంత యవివేకము!

ఈ భ్రాంతికిఁ గారణమేమి? ఇది మానసికకార్యముగాని వేఱుగాదు. మనస్సునకు నిట్టితలంపు లెట్లు గలుగుచున్నవి? ఆశాప్రేరణంబున గలుగుచున్నవి. కావున నాశయే వీనికెల్ల మూలముగానున్నది. దీనికి నంతము గలదా? అంతమున్నచో లోకమెల్ల నావలెనే మరుమరీచికల వెంటనంటి పరుగెత్తుచు నొకనాటికిని దరిగానక పరితపించు టేల? కాఁబట్టి యాసకు మేర లేదు; వేనవేల యేండ్లకైనను గోరికలు తీఱుట యుఁ దృప్తి గలుగుటయుఁ గానరాదు.

ఇఁక గత్యంతర మేమి? దారిచూపువారెరు? ఒకరినడుగనేల? నాయంతరాత్మనే యడుగుదుఁగాక. కటా! నాయంతరాత్మ నాదురాశలకు నగుచు నాపోకలకు వగచుచు నా పాట్లకు జాలిపడుచు నాకు బుద్ధిగఱపుచున్నది. నాయాత్మకన్న నాకుహితుఁడు గలుగఁడు. ఇంతకాలము మదమోహాగద్వితనై నాయంతరాత్మోపదేశంబును వినక యెండమావుల వెంటఁబఱచి వేసారితిని. ఇఁకనైనఁ దెలివితో వర్తింతును గాక.

ఇందాఁక నాకోరిన సుఖంబులెల్ల నింద్రియపరంబులనియు, నింద్రియసుఖంబులు క్షణికంబులే గాక దుఃఖాంతంబు లనియు, నాయంతరాత్మ చెప్పుచున్నది. నాయనుభవంబుఁ గూడ నట్టిదే యయ్యెను.

మఱియు సుఖంబును గోరుదువేని శాశ్వత సుఖంబు నకై యత్నింపుమని నాయంతరాత్మ బోధించుచున్నది. దానిని బడయుటెట్లు? మర్త్యులవలనఁ బడయరాదని నాకు

స్వానుభవసిద్ధమయ్యెను. దేవతల నాశ్రయింతునా ? వారును మర్త్యులవలెనే యాద్యంతంబులు గలిగి కాలంబునకుఁ గట్టువడి యున్నారు. అట్టి యశాశ్వతులు శాశ్వతసుఖంబు నీయఁ గలరా ? ఇఁక నెవని నాశ్రయింపవలయును ? శాశ్వతునే యాశ్రయింపవలయును.

శాశ్వతుఁడెవఁడు ? ఎవఁడు కాలాతీతుడో, ఎవఁడు చరాచర సమస్తంబునకుఁ గర్తయుఁ బాలకుఁడు నగునో, ఎవఁడు నిరవధికాఖండసుఖసారమో యతఁడే శాశ్వతుఁడగును. అట్టివాఁడు భగవంతుఁడు దక్క నన్యులుగారు. భగవంతుఁడు శాశ్వతుఁడేగాక నిరవధికాఖండసుఖస్వరూపుఁడు గావున వాని నర్థించిన నాకోరిన శాశ్వతసుఖంబు గలుగును. కావున భగవంతునే యాశ్రయింతుఁగాక.

అహాహా ! నేనెంత భాగ్యవతిని పూర్వమెన్నఁడో పరమేశ్వరుని నేదేనొక పుణ్యకర్మ రూపంబున నారాధించితిని. తత్ఫలంబుగఁ నాకిప్పుడిట్టి బుద్ధి జనించెను. నిర్వేద హేతుప్రదైన యీయనుబంధంబులకుఁ జిక్కి పరితపించుచు నాకు నింత మాత్ర పుదారి నేఁడు గలుగుటకుఁ గారణాంతరము గానరాదు.

నాయంతరాత్మ బోధనము యీశ్వరాజ్ఞగాఁ దలఁదాల్చి గ్రామ్యసుఖంబులఁ ద్యజించి దురాశాపిశాచంబును తరిమివైచి యీశ్వరుని శరణిల్లుదుఁగాక. భక్తియనెడి పుష్పంబుతో భగవంతు నారాధించుచుఁ బ్రాప్తంబుననునదే పదివేలని తృప్తి చెందుచు నాత్మారాముని తో రమించుచునుందుఁగాక. ఇదే శాశ్వతసుఖము.

ఇంద్రియంబులు దారిదోఁపుడు పగటిదొం వానిచేతిలోఁ జిక్కి జ్ఞానధనంబును గోల్పోయి కాలసర్పస్పృష్టుఁడ మగుచు సంసారకూపంబునఁ బడి తల్లడిల్లుచున్న యీజీవుని నప్పరమాత్మ తప్ప నన్యులుద్ధరించు సమర్థులు గలుగరు. ఏవంకఁ జూచినను జగమెల్లఁ గాలాహివక్త్రగతమై యల్లాడు చున్నది. అట్టిలోకం బన్యుల నుద్ధరింపఁగలదా ? ఇది కేవల భ్రాంతియగును. ఎవరిని వారే యుద్ధరించుకొనవలయు' నని పెద్దయుం దడవు విచారించి కృతనిశ్చయయై దురాశను విడిచి శాంతినొంది పాన్పుఁజేరి హాయిగా నిద్రించెను.

రాజా! దుఃఖంబులలోనెల్ల నాశాదుఃఖంబు కాలసర్ప మువంటిదనియు, ఆశాజయమే సమస్తసుఖ బీజమనియుఁ బింగళవలన గ్రహించితిని.

## 18. కురరము—మమకారము దుఃఖబీజము.

రాజా! కురరమొకటి (లకుముకిపిట్ట) మాంసఖండంబు నెట్లో సంపాదించుకొనెను. అదిగాంచి లకుముకిపిట్టలు సహింపలేక దానిని వెంబడించి తరుమసాగెను. ఆపిట్ట తనమాంసఖండంబును దక్కించుకొనుటకై కన్నతావునకెల్లఁ బరుచెత్తుచు ఏమేమోయుపాయంబులు పన్నెను. కురరంబులు దానిని వదలవయ్యెను. ఎట్టకేలకు నయ్యది గత్యంతరము గానక యామాంసఖండంబును జారవిడిచెను. కురరంబులు ఆఖండంబును గొనిపోయెను. ఆపిట్ట ప్రాణము దక్కెను.

రాజా! జనులు ప్రియంబులని తమకుఁదోఁచు పదా

ర్థంబులను సర్వప్రయత్నంబులొనర్చి కూర్తురు; అనఁగా మమ
కారవశులై వర్తింతురు. మమకారము తుదకు దుఃఖంబునకే
యగుచున్నదనియు దానిని వదలినఁగాని యనంతసుఖము
లభింపదనియుఁ గురరంబువలన నేర్చితిని.

## 19. పసిబాలుఁడు—పరమానందము.

రాజా! లోకములో నిక్కముగా సుఖంబనుభవించు
వారెవరో యనివిచారించితిమేని పసిబాలుఁడును గుణాతీతుఁడై
నయోగియు వీరిద్దఱే కానవచ్చుచున్నారు. కారణమేమో
యూహించితిని. బాలునకు లోకజ్ఞానమేగలుగదు. అందు
వలన వానిని లోకంబాక్రమింపఁజాలదు. లోకమే శూన్యమ
గుటంజేసి బాలుఁడు చింతయెట్టిదో యెఱుఁగకుండును.
చింతయెప్పుడు లేదో యదే పరమ సుఖము.

వయోవంతులందు గుణత్రయము వ్యవహరించుచుం
డును. గుణంబులు వివిధభావంబులఁబుట్టించుచుఁ బెంచుచు
బాహ్యార్థంబులవెంటఁ దఱుముచు బహువిధమనఃకల్లోలంబును
గావించుచుండును. మర్త్యుఁడాసుడిలోఁబడి దరిగానక పరితపిం
చుచున్నాఁడేగాని యతఁడు వాంఛించిన సుఖంబును బడయనే
రఁడు. ఆసుఖము నానాటికి వానికి దూరమగుచునేయున్నది.
బాలునియందు గుణవ్యవహారము కామప్రేరితంబుగాదు
గావున వానికట్టిపరితాపమేగలుగదు. ఇదువురకుఁగల తార
తమ్యమిదేయని గ్రహింపనగును.

గుణాతీతుఁడైనయోగిపొంత గుణంబుల చదురులు
సాగవు. బాలకునికివలెనె వానికిని లోకము శూన్యప్రాయ

మగును. ఎప్పుడు లోకము శూన్యప్రాయమగునో యప్పుడు పరమాత్మమాత్రమే శేషించును. పరమాత్మ యన్ననో ని రవధికానందసుఖముకావునఁ దల్లీనుఁడైన యోగి తత్సుఖాం బుధియందు మునిఁగియుండును.

రాజా! పరమానంద సుఖంబును గోరువాఁడు గుణాతీ తుఁడు కావలయునని పసిబాలునివలన గ్రహించితిని.

## 20. కన్య—వివిక్తసేవత్వము.

రాజా! ఒకయూరిలో స్త్రీపురుషులిద్దఱు పేదవారుం డిరి. వారికొక పుత్త్రికయుండెను. ఆబాలికనువివాహార్థ ముకోరి యెందఱోవచ్చుచుఁ బోవుచునుండిరి. ఒకనాఁడు తలిదండ్రులిద్దఱుఁ గార్యాంతరమునంజేసి యెటకోపోయి యుం డగా నెవరో కొందఱాబాలికకై యాయింటికివచ్చిరి. ఆబిడ్డ యప్పుడు వడ్లు దంచుచుండెను. ఆమె చేతిగాజులు గల్లుగల్లు మని చప్పుడుచేయుచుండెను. గాజుల చప్పుడు తమదారి ద్ర్యంబును వచ్చినవారికిఁ దెలుపునని యాబాలికశంకించి యొక్కొక్కచేతికి రెండురెండు గాజులనుంచి తక్కినవి పగులఁ గొట్టివైచి వడ్లు దంపసాగెను. ఆరెండు గాజులును గొంత చ ప్పుడుగావించెను. ఆబాలికయొక్కొక్కగాజునే చేతికినుంచి తక్కినదానిని బగులఁగొట్టి యథాప్రకారము వడ్లుదంచెను. గాజుల చప్పుడు చల్లారి యామె యేమిచేయుచున్నది అన్యు లకుఁ దెలియరాదయ్యెను.

రాజా! పదుగురున్నచోటఁ గలహంబు తప్పదనియు, నిద్దఱున్న వాదోపవాదంబులుండుననియు, ఏకాగ్రభావంబు

నభ్యసింప నెంచువాఁడు ఏకాకిగానుండవలయు ననియు నబ్బాలి కవలన నేర్చితిని.

21. విలువిద్యాభ్యాసకుఁడు - యోగాభ్యాసక్రమము

రాజా! ఒకానొకఁడు బాణవిద్యాభ్యాసంబునకు సమ కట్టి యొకచోట స్థిరముగా నిలిచి శ్వాసనిరోధించి గుఱియం దేచూపునిలిపి మనస్సును బంధించి బాణమును వదలెను. అ ది తప్పక గుఱిఁదాకెను.

ఏకాగ్రబుద్ధికై యత్నించుయోగి యట్లు చేయవలయు నని యా బాణవిద్యాభ్యాసకునివలన నేర్చితిని.

* ఇదేభావంబు గీతలో 6-10-15 జెప్పఁబడియున్నది. మనశ్చాంచల్యంబు విషయమైగూడ గీత 6-34-35 లలో మార్గంబు నిట్లే తెలుపుచున్నది.

మనస్సు నిలుకడచెందుట యనఁగా మనస్సునందుఁ బుట్టునట్టి యసంభావనావిపరీతభావంబు లుడుగుటయే యని గ్రహింపవలయును. రజోగుణ వృద్ధివలన నిట్టివి గలుగుచు న్నవి. రజస్సు నడచినచో నవి పోవుచున్నవి. రజోగు ణంబు నడచుటతోడ సత్త్వగుణము వృద్ధియగును. అదిక్ర మక్రమముగా శుద్ధసత్వమగును. అప్పుడు బాహ్యప్రపం చజ్ఞానముగాని అంతః ప్రపంచ జ్ఞానముగాని, అనఁగా సుఖ దుఃఖాది ద్వంద్వజ్ఞానభావంబుండదు. ద్వంద్వజ్ఞానంబు నశిం చుట తోడనే మనస్సు ఆత్మనిష్ఠయందు నిలుచును.

ఈవిధానంబునే యోగపరిభాషయందు ఆసనజయము, శ్వాసజయము, మనోజయంబు నందురు. మనోవిక్షేపలయంబులు విషయవాసనలవలనఁ గలుగుచున్నదనియు, వాసనలున్నంతకాలము తత్ఫలంబులైన విక్షేపలయంబులు తప్పవనియు శంకింపవచ్చును. మనస్సు పరానందరూపమైన భగవంతునందు నిల్చినంతనే వాసనలు నశించుచున్నవి. సుషుప్తియందుగూడఁ గర్మవాసనలు నశించుచున్నవనియు అప్పుడు మనస్సు లయమగుచున్నదేగాని భగవంతునందు నిల్చుటలేదనియు అట్లే వాసనానాశనంబున మనోలయంబేలకలుగరాదనియు శంకింపవచ్చును. రజస్సు విక్షేపంబునకును దమస్సు లయంబునకును హేతువులగును. రజస్తమస్సులతోడ వానికార్యంబులుగూడ నశించును. అట్లు వృత్తిశూన్యమగుటంజేసి మనస్సు బ్రహ్మాకారత నొందుచున్నది. దీనినే సంప్రజ్ఞాతసమాధియందురు.

(ఈవిషయమై పూర్వము చెప్పఁబడియే యున్నది. అయినను మూలగ్రంథాంతరభాగంబును మరల వివరింపుట య్యెను.

22 సర్పము – అనికేతాప్రమత్తదాదులు.

రాజా! సర్పంబెప్పుడు రెండవదానితోఁ గలయక యొంటిగా మహాజాగరూకతతో సంచరించుచుండును. మెలకువయందు సర్పజాగ్రతయను నానుడియుఁ గలదు. మఱియు దానికి నిల్లేలేదు; ఎచ్చట బొఱియ గానవచ్చిన నందుదూఱును. దాని సంచారంబతిరహస్యమును నిశ్శబ్దవంతమునై యుండును.

అట్లే మునియైన వాఁడేకచారియు అనికేతనుండును అప్రమత్తుఁడును నిజమహిమంబులఁ బ్రకటింపని వాఁడు అల్పభాషియు నిరాడంబరమూర్తియునై వాని యాచారంబుల నుబట్టి కూడ నతఁడు మునియో కాదో యూహింపరాని వాఁడుగా నుండవలయుననియు క్షణభంగురమైన దేహంబునకుఁగా వ్యయప్రయాసంబోర్చి నగళ్ళు నిర్మింపనవసరము లేదనియు, నీడగలచోటఁ దలఁదూర్చి కాలము గడుపవచ్చుననియు సర్పంబువలన నేర్చితిని.

## 23. ఊర్ణనాభము - సృష్టి స్థితిలయంబులు.

రాజా! నా చెప్పఁబోవు విషయంబు మిక్కిలి సూక్ష్మమైనదిగా నున్నది. దీనివలన సృష్టిసంహారంబులు తెలియును. కావున సావధానుఁడవై వినుము.

సాలెపురుగు నెఱుంగుదువుగదా! అది దానికి నిచ్చవచ్చినప్పుడు తంతువు నోటిగుండా విడుచుచు నుండుచు మరల లోనికిఁ దీసికొనుచు నున్నది. అది తంతువును విడుచునప్పుడు తఱుగుటగాని దానిని మరల లోనికి గ్రహించినప్పుడు పెరుగుటగాని లేదు. తంతువు సాలెపురుగునకు తద్భిన్నము గాదు. తంతువును విడచి సాలెపురుగుండును, దానిని విడిచి తంతువు నుండదు.

అట్లే సృష్టియెల్ల భగవంతునివలనఁ బుట్టుచు మరల వానియందే లయించుచున్నదనియు, సృష్టి భగవంతుఁడుగాని తద్భిన్నముగాని కాదనియు, సృష్టిలయంబులెల్ల నీశ్వరేచ్ఛా

నుసారంబులై యున్నవనియు, ఇచ్ఛాకారణం బనిర్వచనీయం బనియు, భగవంతుఁడే సమస్తసృష్టికి నాధారంబు నాధేయంబు రెండునై యున్నాఁడనియు. సృష్టియెల్ల భగవచ్ఛక్తికార్యంబనియు, శక్తికి శక్తిమంతునకు నగ్నికిఁ దద్దహనగుణంబునకువలె నవినాభావంబనియు, దానంజేసి భగవంతుని విడనాడి సృష్టియు సృష్టిని విడనాడి భగవంతుఁడును పృథగ్భూతంబుగా నుండుటలేదనియు, సృష్టిలయంబులవలన భగవంతునకు క్షయవృద్ధులు గలుగవనియు సాలెపురుగువలన గ్రహించితిని.

( * ఇదే భావము గీతలో 9 10; 6-7-; 9-4 లలోఁ జెప్పఁబడియున్నది.)

" సద్బ్రహ్మకార్యం సకలం సదేవం
తన్మాత్రమేతన్న తతోఽన్యదస్తి
అస్తీతి యో వక్తి న తస్య మోహో
వినిర్గతో నిద్రితవత్ప్రజల్పః.' వి. చూ.

మఱియు సాలెపురుగుండుటవలన దానినుండి తంతువు వెలువడుచున్నట్లే భగవంతుఁడనెడి యాధారంబునుండి సృష్టి వ్యుత్పన్నంబగుచున్నదనియు, నిరాధారంబునుండి సృష్టి కలుగుచున్నదను మాటయు నిరాధారమే యనియు, సాలెపురుగునుండి ఏల, ఎప్పుడు, ఎట్లు తంతువు పుట్టునది చెప్పుట యెట్లు సాధ్యముగాదో యట్లే భగవంతునినుండి యేల? ఎప్పుడు? ఎట్లు? సృష్టికలుగునది చెప్పసాధ్యంబుగాదనియు, తంతువు సాలెపురుగుయొక్క వికారంబుగాని పరిణామంబుగాని యెట్లుకాదో, యట్లే సృష్టిగూడ భగవంతుని వికారంబుగాని పరిణామంబు

గాని కాదనియు, సాలెపురుగునుండి తంతువు వెడలుటయు, కొంత కాలంబుండుట, మరల దానిలోనికే పోవుట యది యెట్లుచూచుచుందుమో భగవంతుఁడుఁగూడఁ దననుండి కలుగుచున్న సృష్టిస్థితిలయంబులకు సాక్షిమాత్రుఁడై యున్నాఁడనియు ఊర్ణనాభము వలన నే గ్రహించితిని.

సాలెపురువునుండి తంతువు వెలువడి పురువును దానితంతువును రెండు మనకంటికి గోచరించుచున్నంత కాలము రెండును సత్యంబులేయనియు, తంతువు మరల లోనికిఁబోయి పురువు మాత్రమే శేషించుచున్నందున తంతువు తాత్కాలికసత్యంబనియుఁ బురువు పరమసత్యంబనియు మనము గ్రహించునట్లే భగవంతుఁడును సృష్టియు వేర్వేరుగాఁ జూచినప్పుడు రెండును సత్యంబులేయనియు, సృష్టిలయమై భగవంతుఁడుమాత్రమే శేషించుచున్నాఁడు గావున భగవంతుఁడు పరమసత్యంబనియు సృష్టి తాత్కాలికసత్యంబనియుఁగూడ గ్రహించితిని.

భగవంతుఁడు సృష్టించుటనగా నేమి? వానియందున్న శక్తిని విస్తరింపచేయుటయే సృష్టియనఁబడును. 'ప్రపంచ' శబ్దమును, 'సృష్టి' శబ్దంబును ఈ భావంబును వెల్లడించుచున్నవి. అట్లు సృష్టించుట యేల? అని యడుగవచ్చును. 'నైకోరమతే' యను బృహదారణ్యకోపనిషత్తులోని వాక్యంబును సాకల్యంబుగా విమర్శించినచో సృష్టికారణము బోధపడును.

* సృష్టియెల్లఁ దాత్కాలికమాత్రసత్యంబుగావున దానిని నమ్మి వ్యవహరించువారికిఁ దాత్కాలికమాత్రసుఖమే

యగుననియు, సుఖంబట్లు తాత్కాలికమైనప్పుడు, అనం భంగము స్వతస్సిద్ధమనియు, సుఖవిశ్లేషముతోడ దుఃఖం క్షరూ దనియు, సుఖసంపాదనంబు సర్వమతసారంబుగావున ద్వే త్కాలికవస్తువును నమ్మి తాత్కాలికసుఖంబును బడయుటక న్న సార్వకాలికవస్తువునే నమ్మి సార్వకాలిక సుఖంబును బడ యుట మేలుగదా యనియు అద్వైతము బోధించును.

* ఇద్దఱకోలు వెవ్వరికిం దగదందురు. కాదని పూనిన ను రెంటం జెడిన రేవండుగతి యగును. అట్లే భగవంతుని సృష్టిని వేఱుపఱచి రెంటినొక్కండే యేకపర్యాయమే సేవింపం బూనినచో ఇహాపరంబులకు రెంటికిం జెడును. కావున రెంట నొక్కటే సేవింపనగును. అట్లు సేవింపందలంచినప్పుడు ఏది గుణవత్తరమో దానినే సేవించుటమేలు. రెండింటిలో భగ వంతుండే గుణవత్తరుండని పైనంజూపంబడెను. కావున భగ వత్సేవయే యుత్తమంబని గ్రహింపనగును.

' అంతవంతం ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్ ' (7-23) అనుటవలన, సృష్టిని సంపూర్ణంబుగా నిరసింపవలయు నా ? అని ప్రశ్నింపవచ్చును. సృష్టిని నిరసించుటనంగానే మి ? సృష్టిని వదలి యావలికిం బోవుటో సృష్టిలోనేయుండి దానితో జోక్యము కలిగించుకొనకుండుటో రెంట నొకటి యగును. సృష్టినివదలి యావలికిం బోవుదమన్నచో సృష్టి లేనిచోటే లేదు. కావున నది సాధ్యముగాదు. సృష్టితో జోక్యము వదలుదుమాయనినచో దానివ్యవహారము చరా చరభూతకోటి నావరించి నిరంతరము జరుగుచున్నది. కావున

గాని కాదని ... సాధ్యముగాదు. సృష్టివ్యవహారము ప్రవాహ కాలంబ ...న్నది. ఆ ప్రవాహంబులోఁబడి లోకంబెల్ల మును చు... మఁ దేలుచునున్నది. దానిని దప్పించుకొను మార్గ ... లేదు. గత్యంతరమేమందురా? తామరాకుమీఁది నీటిబి దువువలె సృష్టియందు మర్త్యుఁడు వర్తింపవలయును. అట్ల వర్తించువారే జ్ఞానులు. ఆవర్తనరహస్యంబు నెఱుంగుటరే జ్ఞానము.

జ్ఞానులవర్తనంబు బాహ్యదృష్టికి లోకంబు నాశ్రయిం చి యున్నట్లే కాన్పించినను వారిచిత్తంబు భగవంతునం ... యుండును గావున వారి వ్యాపారంబు లీలామాత్రంబుగ నుండును. ( గీత. 4-19 to 21 ).

రాజా! భగవంతుని రూపంబెట్టిదందువా? భగవంత నకు రూపమేగలుగదు. రూపంబు గలుగుటకు నుపాధియుం డవలయును. ఎల్లయుపాధులకు భగవంతుఁడే యుపాధియై యుండును. వానికి నుపాధియేలేదు. కావున భగవంతుని రూపంబిట్టిదని చెప్పసాధ్యముగాదు. (గీత 2-25; 3-13).

అట్లగునేని భగవంతునెఱుంగుట యెట్లనియు, భగవంతుఁ డిట్టివాఁడని యెఱుంగనిదే భజించుట యెట్లనియు నడుగుదు వా? అగ్నికి రూపంబు లేదనియు, ఏవస్తువునది యాశ్రయించి ప్రకాశించునో తద్వస్తురూపంబు నగ్నియందారోపించి చూ చుచున్నామనియు మున్నే తెలిపితిని. భగవంతుఁడు స్వయము గా నిరాకారుఁడైనను వాని యవ్యక్తమూర్తిచేత సృష్టినెల్ల వ్యాపించి యున్నాఁడుగావున విశ్వమే భగవదాకారంబని సా

ధనావస్థయందు బుద్ధిగ్రాహ్యార్థము గ్రహింపనగును. అనఁగా విశ్వమే భగవద్వ్యక్తరూపంబగును. వానియవ్యక్తరూపంబన్ననో యది కేవలాఖండానందాత్మకమై యనుభవైకవేద్యమాత్రమై యున్నది. దానిననుభవించినవారుగాని యనుభవించుచున్నవారుగాని యది యిట్టిదని చెప్పరా? యనిన నది వాక్కునకు బుద్ధికిఁగూడ నందుటలేదు. అట్టిదానిని నిర్వచించుట యెట్లు? నిర్వచించినను గ్రహించుటెట్లు? ఏలయందువా? గ్రహించుట చెప్పుట ఇవి యింద్రియకార్యంబులు. అతీంద్రియవిషయంబును ఇంద్రియంబులు గ్రహించుట చెప్పుట యెట్లు సాధ్యమగును? అందువలననే భగవద్రూపంబు అవాఙ్మానసగోచరంబనిరి. ఇదేభావముగీతలో (2-29) లోఁ జెప్పఁబడియున్నది.

## 24. కీటము—తత్సారూప్యము.

రాజా! భ్రమరము పురుగునుదెచ్చి తనగూటిలోనుంచి దానిచుట్టుఁ దిరుగుచుండును. ఆపురుగు భయంబునఁ జేసి యాభ్రమరమందే దానిదృష్టిని నిరంతరము నిలిపియుండును. అట్లుకొన్నాళ్ళుచనఁగా దదేకధారణంజేసి యాకీటముగూడ భ్రమరమై యెగిసిపోవుచున్నది.

కావున మనస్సు దేనియందు నిర్వికల్పసమాధినొందునో దానిరూపంబును బొందుచున్నది. (8-6). అందువలన నుత్తమమైనదానిని గూర్చి ధారణచేయువారు ఉత్తమస్థితిని నీచమైనదానినిగూర్చి ధారణచేయువారు నీచస్థితిని జెందుచున్నారు. కాఁబట్టి యుత్తమగతిని గోరువారుత్తమవస్తువునందే మనస్సును నిలుపవలయునని కీటకము వలన నేర్చితిని.

ఈస్మరణాభ్యాసం అంతకాలమందుఁ గూడ నుండవలయును. అదిముఖ్యమ్ము. ఏలయందువా? అంత కాలంబున బుద్ధి దేని యందు నిల్చునో యాస్థితి మరుజన్మంబున గలుగును. అంత కాలమందుఁగూడఁ తత్స్మరణంబుండవలయునన్నచో యావజ్జీవము నభ్యాసము చేయవలయును. (8-7)

ఈధారణ స్నేహంబుననొండె భయంబుననొండె ద్వేషంబుననొండెఁ గలుగవచ్చును. ఋష్యశృంగుఁడు గజేంద్రుఁడు శిశుపాలుఁడు పైమూటికిఁ గ్రమంబుగా నిదర్శనంబు. ధారణయే ప్రధానముగాని తత్కారణంబు ప్రధానముగాదు.

రాజా! పైనఁజెప్పినగురువుల నాశ్రయించి యొక్కొక్కరివలన నొక్కొక్కసంగతి గ్రహించితిని

స్వదేహము — ప్రబోధితజ్ఞానము.

రాజా! దేహంబులెల్ల జననమరణవశంబులగుటవలన శాశ్వతంబులు గావు. దధిక్షీరఘృతంబులచేతఁ బోషించినను దుదకు నవి మృగపక్షులపాలగుచున్నవి ఇది యెఱిఁగి యెఱింగి దేహప్రీతికై ధనమును భార్యాపుత్రబంధుమిత్రాదులను గృహపశుసేవకాదులను గూర్చుటకై పడరాని పాట్లు పడుచున్నారు. ఎంతధనంబున్నను బంధుమిత్రాదు లెందఱున్నను దేహపతనంబును దప్పింపలేరు. అంతియగాదు. ప్రాణము చన్నంతనే కళేబరంబు నొక్కనిమిషముగూడ నింటనిలుపరు.

దేహము క్షణికమే యగుఁగాక. అదియున్నంతవఱకు జీవితం బేకరాశిగాఁ గడచునాయనిన నదియుఁ గానరాదు; స్వస్థతగానేని యుండునా యనిన నదియు లేదు. జిహ్వాగ్రమొక

వంకకుఁ దృష్టియొక ప్రక్కకుఁ దక్కినయింద్రియంబు లొక్కొక్కటి యొక్కొక్కవలనునకు దానినీడ్చుచున్నవి. కర్మశక్తియన్ననో దానిని గొనిపోయి యొందోమిన్నులుపడ్డచోటఁ ద్రోయుచున్నది. దేహంబట్లు దశేంద్రియంబులకుఁ జిక్కి పదుగురు భార్యలచేతఁ బడినవానిగతి ననుభవించుచున్నది.

అట్లని దానిని విసర్జించుదమాయనినఁ దత్త్వవిచారంబునకుఁ దత్ఫలమైన బ్రహ్మానందంబునొందుటకు దేహము తప్పనన్యసాధనంబు గానరాదు. తన్నిమిత్తము దేహంబత్యవసరంబుగావున దానినిఁ గాపాడవలసియున్నది.

రాజా! దేహానులలోనెల్ల మనుష్యదేహంబుత్తమోత్తమము. ఏలయందువా? భగవత్తత్త్వంబెఱిఁగి భక్తిచేయుటకు మనుష్యునకుఁ దక్క నన్యులకుఁదరముగాదు. భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడనియు వానియెడఁ దనకృతజ్ఞతారూప ప్రతిప్రేమ యిట్టిదనియు గ్రహించు వివేకంబును, దద్విధ జ్ఞానపూర్వకప్రతిప్రేమను భగవంతునెడ నెఱపుశక్తియు మనుష్యునకునొక్కనికే గలదు. దానంజేసి మనుష్యుఁడు సృష్టికి మకుటప్రాయుఁడగుచున్నాఁడు.

భగవంతుఁడు భక్తికివశమైనట్లుగా మఱియొకదానికి వశ్యుఁడు గాఁడు. మనుష్యులు భగవంతునకుఁ బ్రతిప్రేమ రూపమైన భక్తినిఁ జూపుటకై వారికి సనర్ఘమైన వివేకంబు నొసంగెను. వారట్లుచేయనినాఁడు మహాకృతఘ్నులగుదురు. భక్తియే పూజగాని పుష్పాదిసమర్పణంబు పూజగాదు (6-67; 9-26).

ఈస్మరణ మంత కాలమందుఁ గూడ నుండవలయును. అది ముఖ్యము. ఏలయందువా ? అంత కాలంబున బుద్ధి దేని యందు నిల్చునో యాస్థితి మరుజన్మంబున గలుగును. అంత కాలమందుఁగూడఁ దత్స్మరణంబుండవలయునన్నచో యావజ్జీవము నభ్యాసము చేయవలయును. (8-7)

ఈధారణ స్నేహంబుననొండె భయంబుననొండె ద్వేషంబుననొండెఁ గలుగవచ్చును. ఋష్యశృంగుఁడు గజేంద్రుఁడు శిశుపాలుఁడు పైమూటికిఁ గ్రమంబుగా నిదర్శనంబు. ధారణయే ప్రధానముగాని తద్ధారణంబు ప్రధానముగాదు.

రాజా! పైనఁజెప్పినగురువుల నాశ్రయించి యొక్కొక్కరివలన నొక్కొక్కసంగతి గ్రహించితిని.

స్వదేహము — ప్రబోధితజ్ఞానము.

రాజా! దేహంబులెల్ల జననమరణవశంబులగుటవలన శాశ్వతంబులుగావు. దధిక్షీరఘృతంబులచేతఁ బోషించినను దుదకు నవి మృగపక్షులపాలగుచున్నవి ఇది యెఱుఁగి యెఱింగి దేహప్రీతికై ధనమును భార్యాపుత్త్రబంధుమిత్త్రాదులను గృహపశుసేవకాదులను గూర్చుటకై పడరాని పాట్లు పడుచున్నారు. ఎంతధనంబున్నను బంధుమిత్త్రాదు లెందఱున్నను దేహపతనంబును దప్పింపలేరు. అంతియగాదు. ప్రాణము చన్నంతనే కళేబరంబు నొక్కనిమిషముగూడ నింటనిలుపరు.

దేహము క్షణికమే యగుఁగాక. అదియున్నంతవఱకు జీవితం బేకరాశిగాఁ గడచునాయనిన నదియుఁ గానరాదు; సుస్థితగానైన యుండునా యనిన నదియు లేదు. జిహ్వయొక

వంకకుఁ దృష్టియొక ప్రక్కకుఁ దక్కినయింద్రియంబు లొక్కొక్కటి యొక్కొక్కవలనునకు దానినీడ్చుచున్నవి. కర్మశక్తియన్ననో దానిని గొనిపోయి యొందో మిన్నులుపడ్డచోటఁ ద్రోయుచున్నది. దేహంబట్లు దశేంద్రియంబులకుఁ జిక్కి పదుగురుభార్యలచేతఁ బడినవానిగతి ననుభవించుచున్నది.

అట్లని దానిని విసర్జించుటమా యనినఁ దత్త్వవిచారంబునకుఁ దత్ఫలమైన బ్రహ్మానందంబునొందుటకు దేహము తప్పనన్యసాధనంబు గానరాదు. తన్నిమిత్తము దేహంబత్యవసరంబుగావున దానినిఁ గాపాడవలసియున్నది.

రాజా! దేహములలో నెల్ల మనుష్యదేహంబుత్తమోత్తమము. ఏలయందువా? భగవత్తత్త్వంబెఱిఁగి భక్తిచేయుటను మనుష్యునకుఁ దక్క నన్యులకుఁదరముగాదు. భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడనియు వానియెడఁ దనకృతజ్ఞతారూప ప్రతిప్రేమ పుట్టెననియు గ్రహించు వివేకంబును, దద్విధజ్ఞానపూర్వకప్రతిప్రేమను భగవంతునెడ నెఱపుశక్తియు మనుష్యునకునొక్కనికే గలదు. దానంజేసి మనుష్యుఁడు సృష్టికి మకుటప్రాయుఁడగుచున్నాఁడు.

భగవంతుఁడు భక్తివశుఁడైనట్లుగా మఱియొకదానికి వశ్యుఁడు గాఁడు. మనుష్యులు భగవంతునకుఁ బ్రతిప్రేమరూపమైన భక్తినిఁ జూపుటకై వారికి సమగ్రమైన వివేకంబు నొసంగెను. వారట్లుచేయనినాఁడు మహాకృతఘ్నులగుదురు. భక్తియే పూజగాని పుష్పాదిసమర్పణంబు పూజగాదు (6-67; 9-26).

రాజా! దేహము శాశ్వతంబుగాదు గావునను, అది యెప్పుడు రాలిపోవునో ముందుగాఁదెలియదుగావునను, దీపమున్నప్పుడే వెదుకవలయునన్నట్లుగా దేహమున్నప్పుడే మోక్షమును సాధింపవలయును. ఇంద్రియసుఖంబులు ప్రాణికోటికెల్లసహజంబులు. తదర్థమై యమూల్యమైన నరదేహంబే యవసరములేదు. మనుష్యదేహంబు బహుజన్మపుణ్యపరిపాకంబుగాఁగలుగుచున్నది మనుష్యునకు మాత్రమే మోక్షాసక్తిగలదు. ఈవిషయంబును బట్టిగూడ నరజన్మంబు నెట్లుపయోగింపవలసినది స్పష్టమగును.

రాజా! నావచించిన విధంబున వైరాగ్యవిజ్ఞానంబులను సంపాదించి యహంకారమును వదలి ముక్తసంగుఁడనై యాత్మసంస్థిని బొంది జగమెల్లఁ గ్రుమ్మరుదును. ముక్తసంగుఁడను గావున నాకు దేనియందును బ్రీతిగలుగదు. అహంకారరహితుఁడనుగావున నెందును నాకు ద్వేషములేదు. ఆత్మసంస్థితుఁడనుగావున నభేదబుద్ధితోనుందును (5-18).

రాజా! ఇందఱు గురువులను సేవింపనేల యనియెంచెదవా? మర్త్యమాత్రునకుఁ బరిపూర్ణజ్ఞాన మెవ్వనికిఁ గలుగదు. జ్ఞానంబును మధుకరవృత్తి లోకంబునుండి సంపాదింపనగును. దానివలనఁ జిత్తశుద్ధియు దానివలన నేకాగ్రబుద్ధియు జనించును. అట్టిబుద్ధితో భగవంతుని సేవించువారికి నమ్మహానీయుఁడే పూర్ణజ్ఞానస్థ ననుగ్రహించుచున్నాఁడు. (10–10,11).

ఉద్ధవా! ఆయవధూత యదురాజునకు నిట్లు బోధించి

వానిని పేర్కొనిచనిరెను. యదురాజును అవధూత యుపదేశానుసారంబుగా వైరాగ్యాభ్యాసంబులచేత సమచిత్తుఁడై శాంతిసుఖంబునుఁ బడసెను. ఇందుఁ జెప్పఁబడిన 24 లక్షణంబులు అవధూతముఖ్యలక్షణంబులగును.

* ఇంద్రోత్సవంబునాఁడు గోపకులకు నిప్పుడుద్ధవునకుఁ బ్రకృతిసమారాధనంబును శ్రీకృష్ణభగవానుఁడు బోధించెను. ప్రకృతిరంజనమే పవితావధిగా శ్రీరాముఁడు గావించెను. దీనింబట్టి ప్రకృతియనఁగానేమో, దానికిని భగవంతునకును గల సంబంధమేమో, ఆరాధ్యములలోనెల్లఁ బ్రకృతి యేలయుత్తమోత్తమమో, యీయుపదేశమందెంతభావము గర్భితమై యున్నదో యూహింపఁదగునేగాని వచింపఁదరముగాదు.

## భగవత్ప్రపత్తి.

ఉద్ధవా భగవంతునాశ్రయించుటనఁగాఁ దత్ప్రతిపాదితధర్మంబులను వర్ణాశ్రమప్రకారము ఫలాభిసంధిరహితంబుగా నాచరించుటగును. (18-65) స్వధర్మాచరణంబు మొట్టమొదటి ధర్మమగును. (3-35; 18-47). ఈధర్మంబును బరిశుద్ధబుద్ధితో బ్రతిఫలనిరపేక్షముగాఁ జేయవలయును. అట్లుగాక యింద్రియతృప్తికై చేయువాఁడు తుదకు మోసపోవుచున్నాఁడు. (3-16).

ఉద్ధవా! మర్త్యులేమేమో కోరికలు కోరుచు వానికై యావజ్జీవంబుఁ బ్రాకులాడుదురు. అంతమాత్రాననే వారికి నిష్టసిద్ధి కలుగుచున్నదా యనిన నొక్కఁడికిని గలుగుట లేదు. ఏలయనఁగా వారికి లాభాలాభంబులును సిద్ధ్యసిద్ధులును

యిప్పటి ప్రయత్నాధీనంబులు గావు. అవి వారివారి ప్రారబ్ధకర్మఫలంబులై యడిసవచ్చినప్పుడు గలుగుచుండును. అనఁగా నీజన్మమందలి సుఖదుఃఖాదిద్వంద్వంబు లీజన్మకర్మఫలంబులు గావనియు నవియెల్లఁ బూర్వజన్మకర్మఫలంబు లీజన్మంబున ననుభవార్థము కలుగుచున్నవనియు వానిని దప్పింప సాధ్యము గాదనియు, వానిని దాఁటుమార్చుచేయు ప్రయత్నంబులెల్ల వ్యర్థంబులనియు గ్రహించి యట్టితలంపులను యత్నంబులను మాని యెప్పటికేదివచ్చినను సహించుచు మనస్సును భగవంతునియందు నిలిపి తదాజ్ఞానుసారంబుగా స్వధర్మంబుల నాచరింపనగును. స్వధర్మంబు చక్కఁగా జరుగుచున్నదో లేదో యనుతలంపు తప్ప వేఱొండు తలంపే యుండఁగూడదు.

## సత్యాసత్య వివేకము.

ఉద్ధవా! నిద్రలో స్వప్నచిత్రంబులను చూచుచు నప్పుడవియెల్ల సత్యంబులేయని భావింతురు. ఆస్థితిలో నొకప్పుడు సంతోషింతురు; ఒకప్పుడు దుఃఖింతురు; మేల్కాంచినప్పుడవియెల్లఁ గల్లలనియెఱింగి తామప్పుడు పడినసుఖదుఃఖాదులకై సిగ్గుపడి నవ్వుటయుఁ గలదు. స్వప్నావస్థలోఁ జూచిన దృశ్యంబులెట్లు సత్యంబులుగావో యట్లే యింద్రియగోచరంబులగు పదార్థంబులెల్ల సత్యంబులుగావనియు, మర్త్యులజీవితంబెల్ల దివాస్వప్నమనియు గ్రహింపుము.

అట్లయినచో సత్యమేదందువా? ఏది ముక్కాలంబుల నబాధితమై యథాస్థితినుండునో యది యొక్కటే సత్యంబగును. సత్యంబులు కావనుటవలన వానికి నునికియే లేదని భావంబు

గాదు. దృశ్యపదార్థంబులెల్ల క్షణక్షణంబునకు మార్పుచెం దుచుండుననియు, అట్టిమార్పులకులోనై యున్న పదార్థంబుల వలనఁ గలుగు ఫలముగూడ నిల్కడలేక మారుచునేయుండు ననియు భావము. తాత్కాలికంబును సార్వకాలికంబుగా భావించి దానికై జీవితంబును వృథసేయుచున్నారు. అది తటాలున మార్పుచెందినప్పుడు ఆశాభంగమగుచున్నది. అదే దుఃఖము. కావున సార్వకాలికమైనదేదో తెలిసికొని దాని కై యత్నింపుము. ఆశాభంగము గాని తత్ఫలమైన దుఃఖం బుగాని గలుగవు.

కర్మము.

ఉద్ధవా! సృష్టించువ్యాపారమును గర్మమందుము. (8-3). ఈకర్మము బ్రహ్మమునుండియే మొట్టమొదట ప్రారంభమయ్యెను. (3-15). ఎప్పుడుప్రారంభమయ్యెనందువా? సంకల్పంబుతోడఁ గర్మము ప్రారంభమయ్యెను. సంకల్పం బె ప్పుడు కలిగెనో చెప్పసాధ్యముగాదు.

ఈవ్యాపారము ప్రవృత్తిపరమైనప్పుడు జననమరణ రూపసంసారము ఫలమగుచున్నది; నివృత్తిపరమైనపుడు మో క్షము ఫలమగుచున్నది. ఈవ్యాపారంబును ప్రవృత్తిపరము నుండి నివృత్తిపరముచేయుటకు జ్ఞానమేసాధనము. సకామ వ్యాపారము ప్రవృత్తిపరమును నిష్కామవ్యాపారంబు నివృ త్తిపరంబునగును. ఈమార్పును క్రమక్రమముగాఁ జేయవల యును. కర్మమును బూర్ణముగామానుటకు ఎవనికిని సాధ్య ముగాదు. (18-11) జగచ్చక్రంబెల్లఁ గర్మమువలననే నడుచు చున్నది. (3-16).

కర్మము ప్రాణికోటికెల్ల నైజసిద్ధము. కావునఁ బ్రాణు లెల్ల నైజకర్మనిబద్ధములై యున్నవి. (18-60) నైజంబునకు విరుద్ధంబుగా వర్తింపఁదరముగాదు. కాదనియత్నించినను స్వభావము కదలనీయదు. (18-59) స్వభావజమైన కర్మమే స్వధర్మమగును. కర్మమెట్టిదైననుదోషయుక్తమేనై యుండును (18-48). అట్లని దానిని త్యజింపవలదు (18-47). దోషము కర్మమందులేదు; బుద్ధియందున్నది. ఎప్పుడు కర్మము ఫలాభిసంధితోఁ గూడునో యప్పుడది దోషయుక్తమగుచున్నది. ఫలాభిసంధిని వదలి సహజమైన కర్మమును బాహ్యదృష్టికిఁ గ్రూరముగానుండె దోషముగానుండెఁ గాన్పించినను దానిని జేయవలయును. అట్లుచేసినప్పుడు దోషమే గలుగదు. దీనినే నైష్కర్మ్యసిద్ధియందురు (18.49). అసక్తబుద్ధితోఁ జేయుటయే కర్మాచరణమందలి పరమరహస్యము.

నైష్కర్మ్యసిద్ధికి సాధనక్రమముగలదు. ఈవిషయము గీతలో(18-51 to 53) వఱకు బోధింపబడియున్నది. ఏకర్మమొనర్చినను భగవదర్పణంబుగాఁ జేయుము (18-56).

స్వభావము.

స్వభావము ప్రారబ్ధకర్మఫలానుసారముగా శుద్ధాశుద్ధమిశ్రమంబుగా నుండుననియు స్వభావప్రకారము ప్రాణివర్తించుననియు జెప్పఁబడెను. అట్లగునేని ప్రాణికి స్వాతంత్ర్యమే లేనిదగునుగదాయని శంకింపవచ్చును. శుద్ధస్వభావము స్వయముగానే నైష్కర్మ్యసిద్ధికిఁ బ్రేరేపించును. మిశ్రస్వభావము సంగతియున్ననో యామిశ్రమములో శుద్ధతత్వ

ము విశేషించియున్న యెడల బుద్ధియు తద్విధమై నైష్కర్మ్యసిద్ధి సాధనంబులైన కర్మంబులకుఁ బ్రేరేపించును. అప్పుడు శాస్త్ర జ్ఞానము గురూపదేశము సజ్జనసాంగత్యము దానికిఁదోడ్పడి బలమొసంగును. కావున మిశ్రస్వభావంబునకు నొకప్పుడైనను సత్కర్మాచరణంబునకు నవకాశము గలదు.

అశుద్ధస్వభావముసంగతి యేమందువా ? అశుద్ధస్వభావమన్నప్పుడు అదిసంపూర్ణముగా నశుద్ధమేయని భావింపవలదు. అట్టిదెప్పుడు మనుష్యప్రకృతియందే గలుగదు. అశుద్ధస్వభావంబనఁగా శుద్ధమునకన్న అశుద్ధము పెక్కురెట్లు విశేషించియుండునదని గ్రహింపుము. అట్టిస్వభావమందు శుద్ధభావము అశుద్ధభావమువలె నెప్పుడో యొకప్పుడు దానిత గుణము వచ్చినప్పుడు పరిణమించును. అదితప్పదు. అట్టి తఱి బుద్ధి యంతో యింతో భగవంతుని వంకమరలును. అదికారణంబుగా భగవంతుఁడు వానినిఁ గ్రమక్రమంబుగా నుద్ధరించుచున్నాఁడు (9-30, 31, 32).

### భక్తిలక్షణంబులు.

ఉద్ధవా! నాకు భక్తి చేయువారికి గర్వముగాని మాత్సర్యంబుగాని యుండరాదు; అతడు కార్యదక్షుఁడుగా నుండవలయును; ఫలాభిసంధి యెంతమాత్రము నుండరాదు; వాని హృదయమందుఁ బ్రేమరసంబు నిరంతరము పొంగిపొరలుచుండ వలయును; వేగిరపాటు తగదు; తత్త్వార్థజ్ఞాన సంపాదనమందు మహాతురత యుండవలయును; అసూయకు నతఁడెడమీయకూడదు; వ్యర్థాలాపంబులతోఁ గాలము పుచ్చరాదు.

ఏయాత్మ తనయందున్నదో యదే యాత్మ భార్యపుత్రాదులం దును జరాచరసమస్తప్రపంచమందు నున్నదనియు, ఉపాధి భేదంబునఁజేసి యాత్మభేదంబును భావింపరాదనియు గ్రహిం చి యెల్లెడ సమదర్శియై యుదాసీనబుద్ధితో వర్తింపవల యును (2-55, 56, 57).

మాయ.

ఉద్ధవా! మాయయిట్టిదని యింతవఱకు నెవ్వరు నెఱుం గరు. మాయయనఁగా నాశక్తియేగాని వేఱుగాదు. 'సర్వ జ్ఞేశ్వరస్య ఆత్మభూతే ఇవా విద్యాకల్పితే నామరూపే తత్త్వా న్యత్వాభ్యామనిర్వచనీయే సంసారప్రపంచబీజభూతే సర్వజ్ఞే శ్వరస్య 'మాయా' 'శక్తిః' అని శ్రీ శంకరభగవత్పాదులు. 'అవ్యక్తనామ్నీ పరమేశశక్తి రనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా కార్యానుమేయా సుధియైవ మాయా, యయా జగత్స ర్వమిదం ప్రసూయతే' ॥వి॥చూ॥ భగవంతుఁడనైన నేను నా మాయాశక్తి నధిష్ఠించి కాలరూపుఁడనై, జీవాత్ముఁడనై, లోకస్వరూపుఁడనై, స్వభావుఁడనై, ధర్మాత్ముఁడనై నానావి ధంబులఁ గాన్పించుచుందును. కాలరూపుఁడనై సుఖదుఃఖాదుల పరిమితిని నిర్ణయించుచున్నాను; జీవరూపుఁడనై సుఖదుఃఖభో క్తనుగాఁ దోఁచుచున్నాను; స్వభావరూపుఁడనై దేవత్వాదులను గలిగించుచున్నాను; ధర్మరూపుఁడనై పూర్వరచిత పుణ్య కర్మంబులకు ఫలంబుగా స్వర్గాదినివాసంబు నిచ్చుచున్నాను.

నామాయనుదాటుట యంతసులభకార్యము గాదు. ఎవరు నాకుఁ బ్రపత్తిచేయుదురో వారుమాత్రమే నాకూ

యను దాటనేర్తురు. నామాయను దాటుటకు నిదే సులభో పాయము (7-14). అదియెట్లందువా! అట్టివారిహృదయమందు జ్ఞానదీపికను వెలిగింతును. దీపమును వెలిగించుటతోన వారిలోనున్న తమోరూపమైన యజ్ఞానము పటాపంచలగును (10-11). జ్ఞానోదయంబుతోడ మాయాలీలలును దత్ఫలమైనలోకంబును స్వస్వరూపంబునఁ గానఁబడును. అనఁగా మాయయుఁ దత్ఫలమైనలోకంబును రెండును మిథ్యలేయని స్పష్టమగును. మిథ్యలనఁగాఁ గుందేటికొమ్మువంటివని గ్రహింపవలదు; మఱియేమనిన నాకన్న భిన్నంబులైనవిగావని యెఱుంగుము. మాయ అనునది యనాదియనిరి. ఏలయందువా? దానికిఁ గారణంబునూహింపలేరైరి. దేనికిఁ గారణంబునూహింపరాదో యది యనాది యనక తప్పదు. మాయయనునది యొకటిగలదనియు అది యనాది యనియుఁ జెప్పుట యెల్ల వ్యావహారికమేగాని పారమార్థికముగాదు. పారమార్థికదృష్టికి మాయయనునదేలేదు. మాయయనునది మద్వ్యతిరిక్తమైనది గల్గునేని పరమాత్మ ఏకము అద్వితీయము, అఖండము, పూర్ణముగానేరదు.

జ్ఞానకార్యంబంతమాత్రమే యగును. ఆవల జ్ఞానము గూడ 'జలం కతకరేణువత్' అను న్యాయంబు ననుసరించును. కతకరేణువును జలంబులోవైచినప్పుడు జలమందలి మురికిని నశింపఁజేసి తానుగూడ నశించుచున్నది. అట్లే జ్ఞానముగూడ నజ్ఞానంబును బాపి తానుగూడ నశించుచున్నది.

### మాయ - అవిద్య.

మాయ యనునది శుద్ధసత్త్వము; అవిద్యయనునది రజ స్తమస్సులతోఁ గూడినందున మలినసత్త్వమగును. అవిద్య జీవునకు నుపాధియగుచున్నది. మాయ యన్ననో బ్రహ్మ ముచేత నధిష్ఠితమై యున్నది. అందువలన జీవుఁడు సోపాధి కుఁడనియు, బ్రహ్మము నిరుపాధికమనియు వచింతురు.

అవిద్య- మూలావిద్యయనియు, తూలావిద్యయనియు రెండువిధములు. శుద్ధచైతన్యంబును గప్పియుండునది మూలా విద్యయనఁబడును. ఉపాధిగతచైతన్యంబును గప్పియుండునది తూలావిద్య యనఁబడును.

మూలావిద్య మరలఁగారణరూపమనియుఁ గార్యరూప మనియు ద్వివిధము. ఆవరణవిక్షేపశక్తులు గలిగి యనాది భావరూపమైనది కారణరూపావిద్యయనియు, ఒకవస్తువు నందు అన్యరూపబుద్ధిగలది కార్యరూపావిద్యయనియుఁ జెప్పిరి.

కార్యరూపమూలావిద్య మరల ఆత్మబుద్ధి, నిత్యబుద్ధి, సుఖబుద్ధి, శుచిబుద్ధి అని నాల్గు విధములు. అనాత్మయందు ఆత్మబుద్ధి, అనిత్యమైన యాకాశాదులందు నిత్యబుద్ధి, దుఃఖ రూపమైన ద్రవ్యమందు సుఖబుద్ధి, అశుచియైన స్త్రీముఖ చుంబనాదులందు శుచిబుద్ధి ఇవి క్రమముగాఁ బైనాల్గింటికి నుదాహరణంబులు.

### చార్వాక మతము.

ఉద్ధవా! బ్రహ్మమొక్కఁడే సత్యంబనియు, నానాత్వాం

బెల్ల మిథ్యయనియు, మాయవలన నట్లు తోఁచుచున్నదనియుఁ జెప్పితిని.

జీవులు వేర్వేఱుగా నున్నారనియు, వారికర్మంబులును వేర్వేఱగుననియు, జీవులు వారికర్మఫలంబులైన సుఖదుఃఖంబులను వేర్వేఱుగా ననుభవించుచున్నారనియు, దానంజేసి కొందఱు సుఖవంతులుగాఁ గొందఱుదుఃఖజీవులుగా నున్నారనియు బ్రహ్మము (ఆత్మ) ఏకము అద్వితీయంబునైనచో నెల్లకోశంబులందుండునది యొక్కయాత్మయే యైనచో నిట్టిభేదంబులుండ నేల యనియు, భగవంతుఁడొక్కఁడే యిన్నివిధంబుల నాడుచున్నాఁడనుమాట తర్కంబునకేగాక యనుభవంబునకుఁ గూడ విరుద్ధముగా నున్నదనియు, భగవంతుఁడే లేడనియు, సర్వము స్వాభావికమనియు వాదించుమతము గలదు. (16-8)

ఈమతప్రకారము సుఖమే పరమతాత్పర్యమగుచున్నది. సుఖానుభవంబునకు స్వాతంత్ర్యము మూలాధారమగుట సిద్ధాంతము. దేహంబులకు నుత్పత్తి స్థితిలయంబులు తప్పవనుట వారుగూడ నంగీకరింతురు. అట్టిదేహంబునకు స్వాతంత్ర్యమే లేదని స్పష్టము. స్వాతంత్ర్యమే లేనినాఁడు స్వాతంత్ర్యఫలమైన సుఖంబెట్లు గలుగును ?

సుఖవిచారము.

సుఖమనఁగా నేమి ? ఇచ్చవచ్చినట్లు తినుట విహరించుట పరమసుఖంబని మీమాంసకులభావము. అట్టిదెల్ల నింద్రియసుఖమగును. అదియు నవిచ్ఛిన్నంబుగా గలుగదు. ఏలయందువా ? దేహమున్నంతకాలమే యింద్రియంబులును

వానివ్యాపారంబులు నుండును దేహమునకుఁ జావుగలదు, చావుతోడ వారువచించు సుఖముగూడ నశించుచున్నది.

ఆసుఖముః సార్వకాలికము శాకపోయినను ఉన్నంతకాలము ఏకరాశిగా నుండునాయనిన నదియు లేదు. మృత్యువు నోరుతెఱచి యెట్టెదుట నిల్చి, కసాయివాఁడు గొఱ్ఱెను గంజిభానుకువలె నీడ్చుచుండఁగా భయకంపంబులకుఁ జిక్కి తల్లడించువానిస్థితి దుఃఖమగునేగాని సుఖంబుగానేర్చునా ?

ఏది త్రికాలాబాధితమై యుండునో యదే వాస్తవసుఖము. అట్టిది మృత్యువును జయించినఁగాని సిద్ధింపదు. మృత్యుజయంబెట్లందువా ? మృత్యువు దేనికిఁ గలుగుచున్నది ? దేహంబునకుఁ గలుగుచున్నది. అంతియగాని దేహస్థుఁడైన యాత్మకుఁ గలుగుటలేదు. ఆరహస్యంబు నెఱుంగుటయే మృత్యుజయము. జీవునకు మృత్యు వేల కలుగదందువా ? జీవుఁడు పరమాత్మాంశమేగాని వేఱుగాదు. (2-20) పరమాత్మకుఁ జావుపుట్టువులు లేవు గావునఁ దదంశమైన జీవునకుఁగూడఁ జావుపుట్టువులు లేవు.

ఉద్ధవా ? ఇహలోకసుఖంబట్లైనను స్వర్గలోకసుఖంబు శాశ్వతముగదాయని యుందువుగాఁబోలు. అదియుఁ గర్మఫలంబేయగును. కర్మఫలంబెందైనను అశాశ్వతమేగాని శాశ్వతము గానేరదు.

ఉద్ధవా ! ఇంద్రియంబులు జడంబులంటిని. జడంబులు వ్యవహరించుట ఫలంబుపుట్టుట యెట్లందువా ? సూదంటురాయిసాన్నిధ్యంబున అయఃఖండంబువలె జీవాత్మసాన్నిధ్యంబున

జడంబులైన యింద్రియంబులు వ్యవహరించుచున్నవి. వ్యవహారముతోడ ఫలంబుదయించుచున్నది.

బంధముక్తితత్త్వవిచారము.

శ్రీకృష్ణభగవానుని యుపదేశంబు నెల్ల నుద్ధవుఁడు విని 'స్వామీ ! దేహంబున్నంతకాలము తద్గతంబులైన గుణంబులుండును. గుణంబులున్నంతకాలము దేహస్థుఁడైన జీవుఁడు గుణబద్ధుఁడు గాక దప్పదు గదా! జీవుఁడట్లు గుణబద్ధుఁడైనప్పుడు గుణకార్యముల నుండియుఁ దత్ఫలంబులైన సుఖదుఃఖంబులనుండియుఁ దప్పించికొని మనుటెట్లు ? స్వామీ ! మీవచనంబులను వినఁగా జీవులెల్లరును బద్ధులుగానే తోఁచుచున్నారు. ముక్తులును గలరందువేని ముక్తులకు బద్ధులకు భేదమేమి ? ముక్తులెట్లు లోకవ్యవహారంబున వర్తింతురు ? వారేమి భుజింతురు ? ఎట్లు భుజింతురు ? దేహకృత్యంబుల నెట్లు నిర్వర్తింతురు ? వారు కూర్చుండుటయుఁ బరుండుటయు నడచుటయు నెట్లుండును ? ఈవిషయంబులందు బద్ధులెట్లు వర్తింతురు ? స్వామీ ? బద్ధులయొక్కయు ముక్తులయొక్కయు బాహ్యవర్తనంబునందు సామాన్యదృష్టికి భేదము గాన్పింపనందున నిట్టి శంక గలుగుచున్నది.'

స్వామీ ! ఆత్మయేకము నద్వితీయంబు నని తెలిపితివి. అట్టియాత్మ యొకయుపాధియందు నిత్యబద్ధమగుటయు మఱొక్కయుపాధియందు నిత్యముక్తమగుటయు నెట్లు సంభవించును? ఈరహస్యంబులను గ్రహింపఁజాలక నాబుద్ధియెంతయు భ్రమఁజెందుచున్నది. నాయీతలంపుచిక్కును భవదన్యులు తీర్పఁజాల'రని ప్రార్థించెను.

శ్రీకృష్ణభగవానుఁ డుద్ధవునివిని 'మిత్రమా ! జీవునకు గుణంబులనుబట్టి బంధముక్తులు చెప్పుదురేగాని వాస్తవము గా వానికి బంధముగాని ముక్తిగాని రెండును లేవు. గుణంబులు మాయామూలకంబులని దెల్పితిని. మాయయన్ననో మిథ్యగాని వేఱుగాదు. మిథ్యయైనమాయవలన నేర్పడిన గుణంబులుగూడ మిథ్యలేయగును. గుణంబులు మిథ్యలై నప్పుడు తత్కార్యంబులని చెప్పఁబడు బంధముక్తులుగూడ మిథ్యలేయగును.'

'కావున జీవునిబంధముక్తులు కేవల వ్యవహారికంబులని యు, వ్యవహారంబంతయు నజ్ఞానజనితంబనియు, అట్టియజ్ఞాన మున్నంతకాలము జీవుఁడు బద్ధుడుగానే తానుభావించుననియు, అజ్ఞానంబు జ్ఞానోదయంబున నశించినంతనే యజ్ఞానజనితభ్రమ పోయి జీవుఁడు వానినిజస్వరూపంబును అనఁగాఁ దాను నిరం తరముక్తుఁడగుట గ్రహించుననియు నెఱుంగుము.'

ఈజ్ఞానాజ్ఞానంబులుగూడ మాయాకార్యంబులైన స్థితు లేగాని వేఱుగాదు. మాయయనఁగాఁ బరమేశ్వరుని యని ర్వచనీయశక్తి యని తెలిపితిని. పరమేశ్వరునకు నాద్యంతం బులు లేవు. మాయకుమాత్రం బంతము గలదు.

పరమేశ్వరునకు నంతములేనప్పుడు వానిశక్తియైన మా యకు మాత్రంబంతం బెట్లుండునందువా ? పరమేశ్వరుఁడు షడ్భావవికారరహితుఁడు. వానిశక్తి బహిర్గతమై ప్రాపంచిక రూపంబును వహించినప్పుడు సర్వవికారసహితమగుచున్నది. వికారంబులు నశ్వరంబులు కావున మాయకు నంతముగలదం

టిని. మాయకు నంతముగలదనఁగాఁ దద్వికారంబులకు నంతముగలదని యెఱుంగుము. (13-20, 21, 22.)

ఉద్ధవా! పరమాత్మకును జీవాత్మకును స్వగతభేదము లేదు. సూర్యుఁడొక్కఁడయ్యు బెక్కుజలాశయంబులందుఁ బ్రతిఫలించుచందానఁ బరమాత్మ యొక్కఁటయ్యు వివిధోపాధులందుఁ బ్రతిఫలించుచున్నది. (13-34.) జలాశయమందలి నీరు కదలినప్పుడు నందుఁ బ్రతిబింబించిన సూర్యబింబంబుగూడఁ గదలియాడుచున్నట్లు దోఁచును. వాస్తవముగా సూర్యుఁడు చలించుటయే లేదు. మఱియు జలమాలిన్యంబు తద్గతరవిబింబ స్వప్రకాశంబును గొంత గప్పిపుచ్చుచున్నది. అట్లే యాత్మ యుపాధిగతమైనప్పు డాయుపాధికార్యంబులను దానుచేయుచున్నట్లుగా భావించును. ఉపాధిమాలిన్యంబు తదంతర్గతమైన యాత్మయొక్క ప్రకాశంబునకు నడ్డుపడుచున్నది. అంతియేగాని యాత్మకంటుటలేదు. (13-32 ; 33.)

ఉద్ధవా! నూఱునీటిపాత్రల నొకచోటనుంచినచో నూఱుపాత్రలలోను సూర్యబింబంబు ప్రతిఫలించుచున్నది. అందొకపాత్ర భిన్నమైనచో తత్పాత్రయందే సూర్య ప్రతిబింబంబు అదృశ్యంబగునుగాని తక్కినపాత్రలందు నదృశ్యము గాదు. అట్లే యాత్మ వివిధోపాధులలోనుండినను ఏయుపాధి నశించునో యాయుపాధియందు మాత్రమే యాత్మప్రకాశం బదృశ్యమగుచున్నది. అంతియేగాని యెల్లయుపాధులందు నదృశ్యమగుటలేదు. అనఁగా ఆత్మకు స్వపరభేదములేదు.

సూర్యుని వాని ప్రతిబింబంబులనుఁ బరమాత్మకు జీవాత్ములకు సామ్యముచేయుట అద్వైతసాంప్రదాయము. సూర్యునిఁ దత్కిరణంబులనుఁ బరమాత్మకు జీవాత్ములకు సామ్యము చేయుట ద్వైతసాంప్రదాయము. సూర్యుఁడొక్కఁడేయైనను వాని కిరణంబులెల్ల నొక్కచోటునుండియే బొడముచున్నను పెక్కుగాఁ జీలి పరస్పరసంబంధంబులు లేనివై ప్రకాశించుచు నిరోధాదులు దేనికిఁ గలుగునో యదిమాత్రమే వానిని పొందుచున్నదనియు, అట్లే పరమాత్మయొక్కఁడే యైనను వాని యంశయంబులైన జీవాత్ములు పెక్కులుగా జీలి పరస్పరసంబంధంబులు లేక దేహసుఖదుఃఖంబు లదేయనుభవించుచున్నదనియు ద్వైతమతభావము. ఈవిధంబుగా ద్వైతులు జీవాత్మలబహుత్వంబును గర్మానుభవవైచిత్రిని సాధింతురు.

ఉద్ధవా! బద్ధముక్తుల జీవితవిధానంబు నడిగితివి. పరస్పరస్నేహముగల పక్షులు రెండొకవృక్షమందే నివసించుచుండెను. అందొక పక్షి యావృక్షఫలంబులఁ దినుచు మంచిపండ్లు దొరకినప్పుడు సంతోషించుచుఁ బండ్లు దొరకనినాఁడు దుఃఖించుచు నుండెను. రెండవది యేఫలంబునుముట్టక సాక్షిమాత్రమై యుండెను. ఫలకాంక్ష దానికి లేమింజేసి ఫలగుణాగుణంబులఁగూర్చిగాని భావాభావంబులఁగూర్చిగాని దానికెట్టిచింతయుఁ గలుగదు. చింతలేమింజేసి యది యథాసుఖముండెను. మొదటిది బద్ధాత్మునకును రెండవది ముక్తాత్మునకును సామ్యమగును.

ఉద్ధవా! విశ్వమే మహావృక్షము. జీవులే పక్షులు. ఫలాభిసంధిగలజీవుఁడు బద్ధుఁడై సుఖదుఃఖంబుల ననుభవించు

చున్నాఁడు. ఫలాభిలాషలేని జీవుఁడు ముక్తుఁడై చిరసుఖంబు నొందుచున్నాఁడు.

ఉపాధులు కర్మఫలభోగాయతనంబులు గావున భోగ్యకర్మభేదమును బట్టి యుపాధిభేదము గలుగుచున్నది. ఉపాధులటు భిన్నభిన్నంబులైనను దదంతర్గతుఁడైన జీవుఁడొక్కరుఁడే గాని భిన్నభిన్నమూర్తులుగాడు. అనఁగా బద్ధునియుపాధిలోని జీవునకును ముక్తునియుపాధిలోని జీవునకును స్వగతభేదములేదు.

బంధముక్తుల భావభేదము.

బంధము ముక్తి యనునవి భావములగునేగాని వేఱుగావు. అనఁగా నవి మానసికస్థితులుగా నున్నవి. ఎవ్వఁడు సర్వము తానే చేయుచున్నాననియు ఫలంబు ననుభవించుచున్నాననియుఁ దలఁచునో యతఁడే బద్ధుఁడనఁబడును. ఎవఁడట్లు తలంపక యింద్రియంబులు వానివానివ్యాపారంబులు చేయుచున్నవనియు దాను సాక్షిమాత్రుఁడై చూచుచున్నాననియుఁ దలంచునో యతఁడే ముక్తుఁడనఁబడును. (3-27,28.)

బద్ధముక్తుల బాహ్యలక్షణంబులు.

ముక్తునకు శరీరాభిమానంబుండదు గావున నతఁడు వానిశరీరంబునకుఁ గలుగునట్టి పూజగాని తిరస్కారముగాని యెఱుంగనే యెఱుంగఁడు. బద్ధునకు శరీరాభిమానంబు గలదు గావున శరీరంబునకుఁ గలుగుచుండు సుఖదుఃఖంబులకు నతఁడు సంతోష శోకంబులఁ బొందుచుండును.

ముక్త్యవస్థాద్వయము.

ముక్తులకు సమాధ్యవస్థయనియు వ్యుత్థానావస్థయనియు

రెండవస్థలు గలవు. సమాధ్యవస్థయందుఁ బ్రపంచజ్ఞానమే యుండదు. వారు నిరంతరము నాత్మారాములై యుందురు. (2-55) వ్యుత్థానావస్థయందుఁ బ్రపంచజ్ఞానము ఛాయా మాత్రంబుగా నుండును. వారికి రాగభయక్రోధాదు లుండవు గావున దేనినిఁగోరరు. అందువలన సుఖసంతోషంబులు గాని దుఃఖద్వేషంబులుగాని వారికిఁ గలుగనేరవు. (2-56, 57.)

ముక్తుల లోకవర్తనంబు తామరాకుమీఁది నీటిబిందువువలె నుండును అనఁగా మనస్సు ఇంద్రియముఖమైనప్పుడే యింద్రియకార్యఫలంబులైన సుఖదుఃఖములు దెలియవచ్చుచుండును; ముక్తుల మనస్సు ఇంద్రియ విముఖముగావున వారికి నింద్రియ వ్యాపారఫలంబులే తెలియరావని భావము. ఎప్పుడేది యప్రార్థితంబుగా లభించునో దానితోడనే ముక్తుఁడు తృప్తిచెందును. ఏదియు దొరకనినాఁడు దానికై చింతపడఁడు (4-22). ముక్తునకు గోరికయే లేదు గావున దేనినిచ్చినను గ్రహింపఁడు. వానిచర్యలు బాహ్య దృష్టికిఁ బిచ్చివానిచర్యలుగాఁ దోఁచును. ముక్తునకు ఫలకాంక్షయే లేదు గావున నతఁడు చేయవలసినపనిగాని పొందవలసిన ఫలంబుగాని గలుగదు. అతఁడెప్పుడైనను ఏదేనిఁ జేసినట్లు గాన్పించునేని యాపని యీశ్వరప్రేరితమైనదై లోకసంగ్రహార్థముగా నుండునేగాని వాంఛాప్రేరితమై యాత్మార్థముగా నుండదు.

అనుష్ఠాన ప్రాధాన్యము.

ఉద్ధవా ! ఈవిషయంబులెల్ల లోకోపకారార్థము వేదములందు విశదీకరింపఁబడెను; అట్లని వేదములవల్లించినంతనే

ఫలము లేదు. వేదప్రతిపాదితంబుల తత్త్వమును గ్రహించి యెవని కేది యన్వయించునో యెఱింగి దాని ననుష్ఠించి స్వాను భవసిద్ధము చేసికొనవలయును. ఈక్రమమునే యనుష్ఠాన మందురు. పాలుపిదుకనిగోవును, అసతియైనభార్యయు, పరా ధీనమైన శరీరంబును, దుర్మార్గుఁడైన పుత్త్రుఁడును, పాత్రుల కీయని ధనంబు నెట్లు దుఃఖకరములో యట్లే యనుష్ఠాతగాని వాని వేదాధ్యయనంబు దుఃఖప్రదమగును.

## శ్రవణము.

అనుష్ఠానంబునకు శ్రవణము ప్రథమాంగము. మన నము ద్వితీయాంగము. దేనినిఁ దెలిసికొనదలంతుమో దాని తా త్పర్యంబును బెద్దలవలన వినుటవలనో, శాస్త్రపరిచయంబున నో నిశ్చయించుట శ్రవణంబగును.

## మననము.

ఇది ద్వితీయాంగము. విన్నదాని సత్యాసత్యంబులను సాధక బాధక యుక్తులచేత విమర్శించుట మననమగును. ము ముక్షువునకు జీవాత్మపరమాత్మల నెఱుంగుట ముఖ్యాంశము. జీవాత్మయనఁగానేమి ? అది యెందుండును ? అను విచారమే యిందువిషయము.

జీవాత్మయనఁగా నేదందువా ? ఏది మనశరీరాంతరం బుననుండి బాహ్యాంతరవిషయంబుల నెల్లఁ జూచుచున్నదో యదే జీవాత్మయని గ్రహింపుము. చూచునది కన్నుగదా యని శంకింపవచ్చును. నీమనస్సు వేఱొకమార్గమున నున్న ప్పుడు నీకంటియెదుటనున్న వస్తువుగూడ నీకుఁ గానరాకున్నది.

గదా. చూచునది కన్నే యైనప్పుడు ఆవస్తువు కానరానికారణ మేమి ? కావునఁ గన్ను సాధనమాత్రమేగాని చూచునది వేఱని నీకు స్పష్టమగుచున్నది. చూచునది కన్నుగానిచో నేదందువా ? మనస్సు ఎందుండునో యందలివస్తువు నీకుఁ గాన్పించుచున్నందునఁ జూచునది మనస్సు అని తాత్కాలికము నకు నీకే విదితమగుచున్నది.

చూచునది మనస్సగునేని, నిద్రావస్థలో మనస్సు దాని వ్యాపారంబును జాలించియుండుట నిర్వివాదాంశము గావున అప్పుడు మనస్సు చూచుటలేమింజేసి యేదియు మనకుఁ దెలియ రాకుండవలయును. అట్లగుటలేదు. నిద్రింపకపూర్వము, నిద్రా సమయంబున, మేల్కాంచినప్పుడు ఈమూఁడుకాలములందును మనస్సుయొక్క యవస్థ మనకుఁ దెలియవచ్చుచునేయున్నది. అందువలననే 'నేను ఇన్నిగంటలకుఁ బరుంటిని ; ఇంత కాలముగాఢముగా నిద్రించితిని ఇన్నిగంటలకు మేల్కాంచితిని. గాఢనిద్రలో నాకేమియుఁ దెలియలేదు.' అను సంగతులు, అనఁగా ఈమూఁడుకాలంబులందు మనస్సునకుఁ గలిగిన యవస్థాభేదములు తెలియుచున్నవి. కాఁబట్టి చూచు నది మనస్సుకాదనియు వేఱొకటి కలదనియు యూహాగలుగు చున్నది.

అదియేది యని విచారించుచుఁ బోఁగా నన్నిటికి నవ్వల నేదోయొకటియుండి సమస్తమును జూచుచున్నదని స్పష్టమగు ను. దానినే జీవాత్మయందుము.

ఈజీవాత్మ కేవలము ద్రష్టగాక పైనఁజెప్పినవిధంబునఁ

త్రికాలజ్ఞానము గలిగియున్నది. దేనికిఁ ద్రికాలజ్ఞానము గలదో దానికి జననమరణంబులు గలుగనేరవు. అందువలన జీవాత్మ కేవలము ద్రష్టయేగాక యవినాశియు నగును. ఈ జీవాత్మను జిదాత్మయనియుఁ జిత్తనియు ఆత్మయనియుఁగూడఁ జెప్పుదురు. ఉపాధిగతమగుటంజేసి వ్యవహారార్థము పరమాత్మకును దానికిని భేదముఁజూపు నిమిత్తంబట్లనిరి. ఈయాత్మ స్వయంప్రకాశమానమై స్వప్రకాశంబునననన్యంబుల సూర్యుఁడట్లు ప్రకాశింపఁజేయుచున్నది.

ఈజీవాత్మ నావరించి యంతఃకరణంబొకటిగలదు. అది యాయాసందర్భములలోఁ జేయు పనులనుబట్టి బుద్ధియనియు మనస్సు అనియుఁ జిత్తంబనియుఁ జెప్పఁబడుచున్నది. ఈయంతఃకరణము జడముగానున్నది. జడమనఁగా నేమందువా ? చైతన్యశక్తిలేనిదనిభావము. చైతన్యశక్తికి లక్షణంబేమందువా? స్వయంప్రకాశమానత్వమే లక్షణము. ఏది స్వయంప్రకాశమానముగాదో, యేది యన్యంబువలనఁ దెలియఁబడుచున్నదో యది జడమని తాత్పర్యము.

ఈయంతఃకరణము మంచిచెడుగులను విమర్శించి నిశ్చయించునప్పుడు దానిని బుద్ధియనిరి. అది కర్తృత్వము వహించినప్పుడు అనగా నేను చేయుచున్నాను అని యతి భావించునప్పుడు దానిని అహంకారమనిరి. అది పూర్వవిషయంబులను జ్ఞప్తిచేయునప్పుడు దానిని స్మృతియనిరి. అది సంకల్పవికల్పాత్మకమైనప్పుడు దానినే మనస్సుఅనిరి. అది కార్యమునకుఁ బ్రేరేచునప్పుడు దానినిఁ జిత్తమనిరి.

అంతఃకరణంబునకు నిట్టిగుణంబులెల్ల స్వతస్సిద్ధంబులు గావు. అవి చిదాత్మయొక్క భాసవలనఁ గలుగుచున్నవి. ఈచిదాభాస సోకనియెడల నయ్యది యాపనులు చేయఁజాలదు. ఈచిదాభాసయు నంతఃకరణంబును వహ్నితప్తమైన యయఃపిండంబును దత్ప్రకాశంబునట్లు అవినాభావంబుననుండును.

చిత్తును అహంకారంబును గలసియున్నప్పుడు అనఁగాఁ జిదాభాసయహంకారమందుఁ బ్రకాశితమై రెండును గలసియున్నప్పుడు దానిని జీవమందురు. జీవమనఁగా జడరూపమైన యహంకారమనెడి యుపాధితోఁ గూడి వేఱుచేయరాక యున్న చిత్తే యనిభావము. ఈచిత్సంబంధము కలిగినప్పుడే జడరూపమైన దేహంబు అంతఃకరణంబు మొదలు ఆద్యంతము చైతన్యశక్తిని బడసి వ్యవహరించుచున్నది. అనఁగాఁ జైతన్యసాన్నిధ్యంబుననే యీజడదేహంబునకు సూదంటురాయిసాన్నిధ్యంబున అయఃఖండంబునకు వలెఁ శక్తిగలుగుచున్నది. ఈ రహస్యంబు నెఱుంగక దేహవ్యవహారంబును జూచి దేహమే జైతన్యమని భావించుచున్నారు. ఈభావమే యజ్ఞానం బనఁబడును. ఏదినిజముకాదో దానినే నిజమని నమ్మట యజ్ఞానశబ్దతాత్పర్యము. ఈయజ్ఞానంబునకు నధ్యాసయే కారణము. అది తర్వాత వివరించెదను.

ఈ యహంకారంబునకుఁ బైనచెప్పినవిధంబునఁ జిదాభాసయతోను దన్మూలకంబుగా సాక్షిచైతన్యంబుతోను దేహంబుతోను తాదాత్మ్యంబు గలుగుచున్నది. తాదాత్మ్యమనఁగా ఏకీభావము. ఈ తాదాత్మ్యంబు సహజంబనియుఁ గర్మజా
[illegible] ంబులు.

ఎప్పుడు చిచ్ఛాయయు నహంకారంబును దాదాత్మ్యంబు నొంది యాచిచ్ఛాయాశక్తివలన నయ్యహంకారంబువర్తించునో యప్పుడు దానిని సహజతాదాత్మ్యంబనిరి. అట్టి తాదాత్మ్యఫలంబుగా 'నేను ఎఱుంగుదును.' అనుభావం బనుభవసిద్ధమగుచున్నది. ఇదే దానికి లక్షణంబు. 'నేనుఎఱుంగుదును' అన్నప్పుడు 'ఎఱుంగుటకు నేను' అనునది కర్తయగుచున్నది. అనఁగా అహంకారము కర్తృత్వభావంబును వహించుచున్నది. కర్తృత్వభావంబును వహించిన యహంకారంబునకును దద్భావకారణమైన జిచ్ఛాయకును గలుగునట్టి తాదాత్మ్యంబు సహజంబని తాత్పర్యము.

అహంకారము పూర్వకర్మసిద్ధంబును శుభాశుభరూపంబు నగునుపాధితోఁ గూడి వర్తించునప్పుడు దానినిఁ గర్మజమందురు. అప్పుడది 'నేనుమనుష్యుండను' అనఁగా మనుష్యోపాధి తానుగానే భావించును. ఇదేదానికి లక్షణంబు. ఇదిగాక ఒకదానినిజూచి మఱియొకటిగాభావించునట్టి యహంకారంబును భ్రాంతిజన్యమందురు.

భక్తుల విభజనము.

ఉద్ధవా ! పైనఁజెప్పిన విషయంబనుభవసిద్ధమగుటకుఁగాఁ గృషిచేయుదురు. ఆకృషినే భక్తియందురు. అట్లుచేయువారు పరాభక్తులనియు అపరాభక్తులనియు రెండు తరగతులుందురు. పరాభక్తునే జ్ఞానియనియునందురు. అపరాభక్తులు జ్ఞానమిశ్రభక్తులనియు శుద్ధభక్తులనియు మరల రెండువిధంబులు.

అద్వైతమతప్రకారము భక్తియనఁగా స్వస్వరూపాను

సంధానంబగును. భక్తియనఁగా నొకదానియందలి పర ప్రేమ యని నారదుఁడును, ఈశ్వరునియందుఁ బరానురక్తి యని శాండిల్యుఁడును వచించిరి. ఈయిరువురభక్తియందు ద్వైతభావము గలదు.

'మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ।
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే ॥
స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరేజగుః ॥ వి-చూ.

ఈద్వైతభావంబు (1) అంశాంశిభావరూపంబనియు (2) వికారివికారభావరూపంబనియు (3) కారణకార్యభావ రూపంబనియు, (4) ఉపాస్యోపాసకభావరూపంబనియు నాల్గు విధములు.

పరాభక్తుఁడు

పరాభక్తుఁడుత్తమోత్తముఁడు (7-17) పరాభక్తుఁడే జ్ఞానియునగును. వానికిని నాకును భేదమే లేదు. ఏలయందు వా ? భక్తియనఁగా ప్రేమఫలంబగును. ప్రేమించుటకుఁ బ్రేమించువాఁడును బ్రేమింపఁబడువాఁడు నిద్దఱుండవలయును. అనఁగా ద్వైతవాసనయుండవలయును. పరాభక్తునిభక్తి కేవలము జ్ఞానరూపమైయుండును. ఎప్పుడు జ్ఞానియగునో యప్పుడే 'సర్వమేక' మనుభావంబు తప్ప రెండవది యుండనేర దు. అనఁగా వానికి ద్వైతభావము వాసనామాత్రముగా నేని యుండదు. దానం జేసియతఁడు నాతోనైక్యానుసంధా నుఁడై యుండును. ఐక్యమైనప్పుడు భక్తికేయవకాశంబు లే దనియుఁ అట్టివానినిఁ బరాభక్తుఁడననేలయనియు శంకింతువా ?

పరాభక్తియెచ్చటఅంతమగునో యచ్చట జ్ఞానంబుదయించుచు న్నది. ఆరెండింటికి నవస్థాభేదము కల్పింపసాధ్యముగాదు. భక్తితత్త్వంబును బోధించుటకై దానినిఁ బరాభక్తియంటిమే గాని వేఱుగాదు. పరాభక్తుఁడే జ్ఞానియనియు, జ్ఞానియే పరాభక్తుఁడనియు గ్రహింపుము.

జ్ఞానమిశ్రభక్తుఁడు.

ఎవఁడు నాతత్త్వజ్ఞానంబును గొంతకుఁ గొంతకలిగి నాకు భక్తిచేయునో వానిని జ్ఞానమిశ్రభక్తుఁడందురు. జ్ఞానమిశ్ర భక్తులను సాధువులనియుఁ బేర్కొందురు. వారిలక్షణంబు లేవందువా ? వారు పరమకృపాళువులుగా నుందురు. చలి చీమకుఁ గూడ ద్రోహమొనర్పఁజాలరు. మఱియు వారు సహనమూర్తులై సత్యమే ప్రాణంబుగా భావించి యనవద్య చిత్తులును సర్వసములును సర్వోపకారకులునై కామస్పర్శలేని బుద్ధియు దాంతంబును మార్దవంబును శుచిత్వంబును అకించన త్వంబును గలిగి మితాహారవ్యవహారులై నన్నే శరణుగొని నాతోడిదే మననంబుగా నుందురు. ఆఁకలిదప్పులు వారిని గలంపనేరవు. వారు గుణదోషజ్ఞులై మొట్టమొదటవర్తించి నను గ్రమక్రమంబుగా నంతఃకరణపరిపక్వానుసారంబుగా శాస్త్రనిబద్ధధర్మంబులనుగూడ వర్జించుచుఁ దుదకుఁ బరాభక్తి నధిష్ఠింతురు.

పరాభక్తిని రాగానుగభక్తియనియుఁ బేర్కొందురు. ఆస్థితిలోని యానందంబు వారికిఁ బ్రియతరమైయుండును. వారికి ద్వైతవాసన రహితయుండును. అందువలన వారికి

ద్వంద్వజ్ఞానం బంతో యింతో శేషించి యుండును. అయినను జ్ఞానముగలదు గావున వారట్టి ద్వైతవాసనకు లోనుగాకయుందురు. (16-1 to 3). గీతలోఁ బదురెండవయధ్యాయములో 13 to 19 వఱకుఁ జెప్పఁబడిన దైవసంపల్లక్షణంబులెల్ల జ్ఞానమిశ్రభక్తునకు నన్వయించును.

శుద్ధభక్తుఁడు.

ఉద్ధవా! శుద్ధభక్తుఁడు నాతత్త్వవిచారమే చేయఁడు. అతఁడనన్యభావంబుతో మనోవాక్కాయకర్మంబుల నన్నారాధించుచు నావిభూతులను నాభక్తులను సందర్శించుచు బూజించుచు సేవించుచు స్తుతించుచు నాచేయొనర్చిన కార్యంబులను శ్లాఘించుచు నాకథలను శ్రద్ధతో వినుచు నన్ను ధ్యానించుచు సర్వము నాకే సమర్పించుచు నాకుదాస్యమొనర్చుచు మదర్పితచిత్తుఁడై నాయవతారచరిత్రలనుఁ జెప్పుచు నాపర్వదినంబులందు నియమవ్రతుఁడై యుండుచు నాదేవాలంబులందు నాకు నుత్సవాదులు జరుపుచు దివ్యతీర్థక్షేత్రయాత్రలు సలుపుచు నాపేరదానాదులిచ్చుచు వైదికతాంత్రికదీక్షల సలుపుచు నావిగ్రహంబులను బ్రతిష్ఠించుచు నాకై స్వయముగానో పరసాహాయ్యంబుననో యుద్యానోపవనంబులనుఁ గ్రీడాస్థానంబులను దేవాలయంబులను నిర్మించుచు వానియందలి కార్యక్రమంబు ద్రోహబుద్ధిలేక విచారించుచు నైచ్యభావంబు నభిమానంబును వదలి నాయాలయంబులందు నాకు నూడిగంబులు చేయుచు శిథిలంబులైన వానిని బునర్నిర్మాణంబొనర్చుచు నిరంతరము నాకార్యంబులందే నిమగ్నుఁడై యుండును.

శుద్ధభక్తునకు నభిమానంబుగాని గర్వంబుగాని యా

డంబరంబుగాని యాత్మప్రకటనంబుగాని యుండవు. నాకు నర్పించినదానిని తృణమాత్రంబైనను స్వార్థంబతఁడు గ్రహింపఁడు. ఏదేది లోకులకు నిష్టతమమో ఏదేది తనకుఁ బ్రియతమమో దానినెల్ల నాకే యతఁడు సమర్పించుచుండును.

ధ్యేయాకారస్థానము.

ఉద్ధవా ! ధ్యేయాకారంబునకు బహిస్స్థానంబనియు అంతస్స్థానంబనియు రెండు స్థానంబులుఁగలవు. సాధన ప్రథమావస్థయందు ధ్యేయాకారంబును గన్నులయెదుటనుంచి ధ్యానింతురు. దీనినే బహిస్స్థానమందురు. సాధనసిద్ధులు ధ్యేయాకారంబును వారిహృదయస్థానంబుననుంచి ధ్యానింతురు. దీనినే యంతస్స్థానమందురు. సూక్ష్మముగాఁ బరిశీలించినచో హృదయస్థానమే యుత్తమంబగును. ఏలయందువా ? పరమాత్మ సర్వభూతహృదయంబుల నధిష్ఠించియుండును గావున నచ్చట ధ్యేయంబును నిల్పి ధ్యానించుట భగవత్సాన్నిధ్యంబున ధ్యానించుటగును. (18-61, 62).

ఉద్ధవా ! శరీరమందు సుషుమ్నయనునాడిగలదు. దాని మెడమభాగంబు నంటికొని నాభిప్రదేశంబునకుఁ బదురెండంగుళంబులకుఁ బైభాగంబున హృదయంబు తామరమొగ్గను బోలి యుండును. తామరమొగ్గను బోలుటంజేసి హృదయంబును హృదయకమలమనిరి. ఆహృదయకమలంబు నాళము మీఁదికిని ముఖము క్రిందికిని నుండును.

దానికి నెనిమిదిదళంబులును గర్ణికయుఁ (మద్దు) గలవు. [illegible] కమలంబు నూర్ధ్వముఖంబుగా నథో

నాళంబుగాను దానికర్ణికమీఁద సూర్యుఁడును వానిలోపలఁ జంద్రుఁడును వానిలోపల నగ్నియు నున్నట్లును, ఆయగ్నిలోపల ధ్యేయమూర్తి యున్నట్లును భావించి ధ్యానింపవలయును.

## ధ్యానపూర్వాంగము.

ఉద్ధవా ! ధ్యానము స్థూలము సూక్ష్మము అని రెండువిధములు. సాకారంబునుగూర్చి ధ్యానించుట స్థూలము. దయాదిగుణంబులగూర్చి ధ్యానించుట సూక్ష్మము. ధ్యానంబునకు మనోనిశ్చలత్వము ముఖ్యము. అది ప్రాణాయామంబునసిద్ధించుచున్నది. దానికి నాసనంబు ప్రధానంబు. ఆసనంబులు పెక్కువిధంబులు. ఎవనికేది సుఖాసనంబగునో దానిని గ్రహింపనగును.

ధ్యానించునప్పుడు శరీరంబు భూమికిఁ దగిలినయెడల శరీరతేజస్సు భూగతమై ధ్యానసిద్ధికి నంతరాయంబు గలుగును గావున ధ్యాత సమోన్నతమైన పీఠమందుఁ గూర్చుండి ధ్యానింపవలయును. భూసమాకర్షణంబు నింకను నిరోధించుటకై యాపీఠముమీఁద దర్భలును వానిమీఁదఁ గృష్ణాజనంబును దానిపయి వస్త్రంబును బఱతురు. ఇందొక్కటొక్కటియు భూసమాకర్షణంబును నిరోధించునవిగా నున్నవి.

అట్లు కూర్చుండి శరీరము శిరస్సు కంఠనాళము ఇవి మూఁడు వంకరలేనట్లుగా సమమైయుండునట్లుగాఁ జేసి, తొడలపయి హస్తతలంబులుంచి, దృష్టిని నాసికాగ్రమందుంచి ధ్యానింపవలయును. అట్లుచేయుటవలన నేకాగ్రత సులభసిద్ధమగును.

అట్లు దృష్టిని నిలిపి పూరకకుంభకరేచక పూర్వకంబు గా అనులోమవిలోమక్రమంబుగా నాడీశోధనంబును క్రమ క్రమంబుగా మెల్లమెల్లఁగాఁ జేయవలయును. దీనినే ప్రాణాయామమందురు. (6-10 to 14).

మనుష్యాదులు లోనికిఁ బీల్చుచు విడుచుచు నుండు వాయువునే ప్రాణమని కొందఱందురు. అది నిజముకాదు. శరీరమందొకవిధమైన యంతశ్శక్తిగలదు. అది శరీరావయ వంబులను వానివానివ్యాపారంబులందుఁ బ్రవర్తింపఁజేయుచుం డును. ఆశక్తియే ప్రాణమనఁబడును. అది ప్రవాహాసరణిఁ బఱచుచుండును. దాని గమనంబునకు వాయువు తోడ్పడు చున్నది. ప్రాణంబునకుఁ దోడ్పడుచున్నందున దానిని ప్రాణ వాయువనిరి.

ప్రాణరూపమైన యాశక్తి హెచ్చుతగ్గులు లేక సక్రమ గతిఁ బ్రవర్తిల్లునట్లు చేయుటయే ప్రాణాయామఫలము. ప్రా ణాయామంబు చేయునప్పుడా ప్రాణంబు నఖశిఖపర్యంతము సక్రమగతిని వర్తింపఁజేయుచున్నాననని సాధకుఁడు భావించుచుఁ దద్గతివెంట వానిమనస్సును బంపుచుండవలయును. అట్లు చేయుటవలన శరీరం బాద్యంతము జాడ్యరహితమై వశవర్తియై యుండును. అభ్యాసంబున నిందలిరహస్యంబులు సాధకునకు స్పష్టమగుచుండును.

## ప్రత్యాహారము.

ప్రాణాయామసాధనకాలమందు మనస్సు చలింపకుం డునట్లు చేయుటయే ప్రత్యాహారమగును. మనశ్చాంచల్య

నిరోధము హఠాత్తుగా నుండరాదు. మెలమెల్లగా దానిని సాధింపవలయును. (6-25, 26)

వాయువును విడుచుట రేచకమనఁబడును. అట్లు చేయునప్పుడు 'ఓం' అని మొదలుపెట్టి యా ప్రణవంబుతోడ వాయువును మూలాధారంబునుండి హృదయస్థానంబునకుఁ గొనిరావలయును ఓంకారస్వరము సన్నఘంటానాదంబువలె నుండును. ఆనాదంబు మూలాధారంబునుండి సుషుమ్నానాళంబుగుండా సన్నని పట్టుపోగువలెఁ బయికిఁ బ్రాకివచ్చును. ఈ నాదంబును అనాహతమందురు. యోగంబునభ్యసించుకొలఁది యీనాదము వినవచ్చుచుండును.

ప్రణవయుక్తంబుగాఁ బ్రతిదినము మూఁడుసంధ్యలందుఁ బ్రాణాయామంబుఁ జేయువలయును. ఒక్కొక్కసంధ్యయందుఁ బది ప్రాణాయామంబులు చేసినఁజాలును. అట్లొక్కమాసము నిర్విఘ్నంబుగాఁ బ్రాణాయామంబొనర్చినచోఁ దత్సిద్ధిగలుగును.

* దీనిని గురుమూలకంబుగా నభ్యసింపవలయును. స్వతంత్రించి చేసినయెడల విపరీతంబులు గలుగవచ్చును.

ధ్యానావస్థలు.

ఉద్ధవా! సాధకుఁడు వానిదృష్టిని ధ్యానప్రారంభదశయందు బాహ్యపదార్థంబులనుండి మరలించి నాసర్వాంగస్వరూపమందు నిలుపవలయును. అట్లుచేయుటకు వానిమనోబుద్ధులే సాధకంబులుగాని వేఱుగలుగవు. ఇదియే ధ్యానప్రథమావస్థయగును. తర్వాత దృష్టి నందుండి మరలించి

సుస్మితాయతమైన నాముఖారవిందమందు నిలుపవలయును. ఇది ద్వితీయావస్థ యగును. తర్వాత దానిని నావిశ్వరూపమందుఁ జేర్పవలయును. ఇది తృతీయావస్థయగును. ఇంతవఱకు సగుణధ్యానంబగును. తర్వాత దానిని నానిర్గుణబ్రహ్మతత్త్వమందు లయింపఁజేయవలయును. ఇది తురీయావస్థ యగును. దీనినే సమాధియనియు వచింతురు. ఈయవస్థయందు జీవాత్మ పరమాత్మనైన నాయందును నేను జీవాత్మయందును జ్యోతి జ్యోతిలోవలె లయింతుము. ఇదే యద్వైతసిద్ధి. ఈస్థితికి వచ్చినప్పుడు ద్రవ్యజ్ఞానక్రియా భ్రమలెల్ల నశించును. అదే నిర్యాణము. (15-4.)

సత్సాంగత్యము.

ఉద్ధవా! సంసారసాగరంబును దరించుటకు భక్తిమార్గంబునకు మించిన సాధనంబుగలుగదు. ఆమార్గంబెల్లరకు సులభసాధ్యమైనదగుటంజేసి దానికి నంత ప్రాశస్త్యంబు గలిగెను. భక్తికి సత్సాంగత్యంబు పుట్టువనకుఁ నెత్తావివలెనగును. ఉద్ధవా! నీవు నాకుఁ బరమభృత్యుండవేగాక సఖుండవును సుహృత్తువును గావున నీకు గోప్యాతిగోప్యమైన రహస్యంబునుగూడ విప్పి చెప్పితిని. (18-64).

ఉద్ధవా! యోగంబుగాని సాంఖ్యంబుగాని ధర్మంబుగాని స్వాధ్యాయంబుగాని తపంబుగాని త్యాగంబుగాని యిష్టాపూర్తంబుగాని దానవ్రత యజ్ఞంబులుగాని మంత్రంబుగాని తీర్థయాత్రగాని యమనియమంబులుగాని తదన్యంబులుగాని వ్యష్టిగానొండె సమష్టిగానొండె సాధుసాంగత్యంబునకు సాటి రావు. ఏలయందువా? నన్నుఁ జేరుటకు సర్వసంగపరిత్యా

గము ముఖ్యాతిముఖ్యము. అది యోగాదులవలనఁ గాల క్రమంబుగా బహుకాలంబునకు సిద్ధించును. సాధుసాంగత్యంబన్ననో వెనువెంటనే లోలోపలనే యగ్ని లోహంబును వలెఁ దత్త్వంబును శుద్ధిపఱచి సర్వసంగపరిత్యాగబుద్ధిని గలిగించును. సత్సాంగత్యంబున రాజసకతామసిక తత్త్వంబులునయి తము మాఱి నన్నుఁబొందినందులకు నిదర్శనంబు లెన్నో గలవు.

నిదర్శనంబులు.

వృత్రాసురుఁడు తొలిజన్మంబున నారదాంగిరసుల సాంగత్యంబును బడసిన కారణంబున మఱుజన్మంబున సులభముగాఁ గడతేరనోచెను. ప్రహ్లాదుఁడు రాక్షసునకు జనించియు గర్భస్థుఁడై యుండగా నారదోపదేశంబును విన్నకారణంబునఁ బరమభక్తుఁడై సిద్ధిఁగాంచెను. వృషపర్వుఁడు సాధుజనపోషణంబుఁ గన్నకారణంబునఁ దరించెను. బలిచక్రవర్తి రాక్షసుఁడయ్యు వానితాతయైన ప్రహ్లాదుని సాంగత్యంబునఁజేసి కళ్యాణంబుఁ బడసెను. బలిచక్రవర్తి జ్యేష్ఠపుత్త్రుఁడైన బాణుఁడు పరమశివుని సాంగత్యంబు కల్మివలన శుభంబందెను. మయుఁ డింద్రప్రస్థపురంబును నిర్మించునప్పుడు వానికిఁ బాండవులతోడి సాంగత్యంబు చేకూడిన కారణంబున మేలుగాంచెను. విభీషణసుగ్రీవులు హనుమత్సాంగత్యంబున శ్రేయోభాగ్యంబు నందిరి. హనుమజ్జాంబవంతులు శ్రీరాముని సాంగత్యంబునను నాసాంగత్యంబునను గృతకృత్యులైరి.

ఉద్ధవా! శాపవశంబున గజేంద్రుఁడు గజంబుగాను వాని వైరి నక్రంబుగాఁబుట్టి హోరాహోరిఁబోరిరి. గజేం

ప్రేఁడు లావుదక్కఁ జిక్కెను. వానికి గత్యంతరము దోపఁ దయ్యెను. అట్టితఱి వానిపూర్వజన్మ సాధుసాంగత్యఫలంబు పరిమళించెను వానిబుద్ధి నావంకకుఁ బఱచెను. నేను వానికి బంధముక్తిఁగావించితిని.

జటాయువు గరుడునియొక్కయు, దశరథునియొక్కయు సాంగత్యఫలంబుగా ముక్తికి నర్హుఁడయ్యెను. తులాధారుఁడు శూద్రుఁడైనను నారదసాంగత్యఫలంబుగాఁ బరంబు నొందెను. ధర్మవ్యాధుఁడు నీచవృత్తితో జీవించుచున్నను దదీయ పూర్వజన్మంబున వానికిని వైష్ణవుండైన కొండొక రాజునకును గలిగిన సాంగత్యఫలంబుగా సిద్ధినొందెను. గోపికలును మునిపత్నులును నాసాంగత్యంబునఁ గృతార్థులైరి.

ఉద్ధవా! గోపిక లెట్టిచదువులును జదువరు. ఆశ్రమవాసుల సేవ లెట్టివో యెఱుంగరు. ఎట్టితపస్సులును జేయరైరి. వారెల్లరు సత్సంగఫలంబుగా నన్ను జేరనోచుట నీవు కన్నారఁ జూచితివి. స్త్రీలును సహజమూఢులు నైన గోపికలే సత్సాంగత్యంబున నట్టివారుగాఁగా జ్ఞానుల సంగతి చెప్పవలయునా? మనుష్యులే యననేల? గోవులును మృగంబులును సర్పంబులును దుదకు వృక్షంబులు సయితము వేనవేలుగా సత్సాంగత్య ఫలంబుగా నాయెడఁ బ్రేమరూపగాఢభక్తిని నెఱపి సిద్ధిఁగాంచెను.

ఉద్ధవా! నన్నుఁ జేరుటకై కొందఱు సాంఖ్యయోగంబునాశ్రయింతురు; కొందఱు తపోవ్రతంబులాచరింతురు; కొందఱు దాననిష్ఠనుగ్రహింతురు; కొందఱు స్వాధ్యాయం

బును గొందఱు సంన్యాసంబు నవలంబింతురు. వీరికెల్లరకు నేండ్లకుఁబాండ్లకుఁగూడ నేది సాధ్యముకాదో యదిభక్తికి సులభసాధ్యమగుచున్నది. (11-53, 54.)

భక్తిరహస్యము.

ఉద్ధవా ! భక్తివిషయంబునఁ బరమరహస్యంబుగలదు. దానిని సోదాహరణంబుగా భవదర్థము వివరింతు వినుము. కంసుఁడు నన్నును బలరామునిని జంపనిశ్చయించి వ్యూహము పన్ని మాయిరువురను బృందావనంబునుండి శ్వఫల్కునిపుత్త్రుఁడైన యక్రూరుని మూలంబున మథురకు రప్పించుట నీకుఁ దెలిసిన సంగతియేగదా. మేము తరలునప్పుడు గోపికలు మద్వియోగంబునకై పడినతల్లడంబు మఱచినను మఱపునకురాదు. వారు నావలన నేయర్థంబునుగోరరు. నాప్రీతికై వారు ప్రాణంబులిమ్మన్నను సంసిద్ధలుగానుందురు. కొందఱు పుత్త్రభావంబునను, గొందఱు సోదరభావంబునను, గొందఱు సఖభావంబునను వారు నిజేచ్ఛానుసారంబుగా నాయెడఁ బ్రేమరసంబును బ్రసరింతురు. వారు మఱేదియైనను సహింతురుగాని నావియోగంబునుమాత్రము సహింపరు. సర్వకాలసర్వావస్థలందు నాతోడనుండుటయే వారికిఁ బరమానందంబగును. తల్లులు వలదన్నను తండ్రులు కూడదన్నను. సోదరులడ్డగించినను, ఎవరేమిచేసినను నన్నుఁజూడని దినంబు వారికి దుర్దినంబగును. నన్ను సందర్శించుట నాతోడ సల్లాపించుట నాకుఁ బ్రియంబుఁగూర్చుట యివితప్ప అన్యకార్యంబులు వారికిఁ గలుగవు. వారిచిత్తంబులట్లు ప్రేమాయత్తంబులై నాయందే లీనమగుటంజేసి వారు స్వకీయులనేగాక స్వశరీరంబు

లనుగూడ మఱచిరి. యోగులు సమాధ్యవస్థయందెట్లు నామ రూపజ్ఞానహీనులై యుందురో, నదులు సముద్రంబును జొచ్చినప్పుడెట్లు నామరూపరహితంబులగునో యట్లే గోపికలు మత్పరచిత్తలై బాహ్యజ్ఞానశూన్యలై యుందురు.

ఉద్ధవా ! గోపికలకు విద్యాజ్ఞానంబులేదు ; వారెట్టిశుశ్రూషలు నెఱుంగరు ; ఉపదేశభాగ్యంబును వారికిఁగలుగదు. అట్లుండియు వారు నాయెడ నట్లువర్తింతురు. ఇదంతయు సాధుసాంగత్యప్రభావంబుగాని వేఱుగాదు.

ఉద్ధవా ! నీకు విద్యాసంపదగలదు ; గురువులను నీవు సేవించితివి ; పెద్దలను వింటివి ; సాధువులతో నుంటివి. ఇంతటిభాగ్యంబుండియు నిఱుపేదవలె దిగులువడనేల ? ఉద్ధవా ! వేయుమాటలేల ? ధర్మాధర్మంబులను వర్జించి ప్రవృత్తినివృత్తిమార్గభేదంబులను మఱచి, జ్ఞానాజ్ఞానవిచారము మాని, నాకు సర్వాత్మసమర్పణపూర్వకమైన భక్తిచేయుము. ఎల్లభయంబులుడిగి సుఖముందువు. (18-66.)

జీవప్రవేశము.

శ్రీకృష్ణభగవానుని ఉద్ధవుఁడు సాకల్యంబుగా విని "స్వామీ ! నాకింకను గొన్నిసంశయంబులుగలవు. పరమాత్మ సర్వవ్యాపియైయుండి శరీరంబునందెట్లు ప్రవేశించి జీవాత్మయగునో వివరింప వేఁడుదు"ననెను. నావుడు భగవానుఁ డిట్లనియెను.

ఉద్ధవా ! పరమాత్మ తనప్రకృతి నధిష్ఠించి విశ్వరూపంబును దాల్చెను. పరమాత్మయొక్క ప్రకృతి పరాప్ర

కృతియనియు అపరాప్రకృతి యనియు రెండువిధంబులు. జీవభూతసృష్టియెల్లఁ బరాప్రకృతియు జడసృష్టియెల్ల అపరాప్రకృతియు నగును. పరాప్రకృతిని అక్షరంబనియు అపరాప్రకృతిని క్షరంబనియు నందురు. పరాప్రకృతివలన సమస్తజగంబు ధరింపఁబడుచున్నది. పరమాత్మ తన రెండు ప్రకృతుల నధిష్ఠించియు వానికన్ననుత్తముఁడై పురుషోత్తమాఖ్యం బరగుచుండును. జగద్ధారణకారణంబునఁ బరమాత్మ నీశ్వరుం డనియు వచింతురు. (7-4, 5, 7 ; 15-16, 17.)

పరమాత్మ సృష్టిని అట్లు కల్పించి యందుఁ బ్రవేశించెను. ఏరూపంబునఁ బ్రవేశించెనందువా? ప్రాణరూపంబునఁ బ్రవేశించెను. ఆప్రాణంబునే జీవుఁడందురు. ప్రాణంబు ప్రవేశకాలంబున సూక్ష్మాతిసూక్ష్మనాదరూపంబున నుండును.

వెన్నెముకనంటి సుషుమ్నమనెడి నాళము గలదు. దానిపొడవున నందందు నాఱుకమలంబులు గలవు. కమలం బనఁగా నిలయస్థానంబని గ్రహింపనగును. ప్రథమకమలంబు మూలాధారంబున నుండును. గుదస్థానంబునకుఁ బైభాగంబును మూలాధారంబందురు. పరమాత్మ తొలుదొల్తఁ నమ్మూలాధారకమలంబునందుఁ బ్రాణరూపంబునఁ బ్రవేశించును.

ప్రాణంబు సూక్ష్మాతిసూక్ష్మనాదరూపంబని తెలిపితిని. ఆనాదంబు మూలాధారంబునుండి సుషుమ్నానాళద్వారంబునఁ గ్రమక్రమంబుగా నెగఁబ్రాఁకి నాభిప్రదేశమందున్న మణిపూరకమలంబును జేరును. అప్పుడు ప్రాణరూపనాదంబు సుంతదిటవై పశ్యంతి యనఁబడును. అది మఱికొంతదిటవు

చెంది యందుండి తరలి యానాళద్వారంబుననే హృదయస్థాన మందలి యనాహతకమలంబునుఁ జేరును. అప్పుడాపశ్యంతియే మధ్యమమందురు. మధ్యమంబు మఱికొంతదిటవుగాంచి వై ఖరియనఁ బడుచున్నది.

వైఖరీనాదంబు మొట్టమొదట మాత్రారూపంబుగా నుండి స్వరరూపంబునొంది తుదకు వర్ణరూపంబును దాల్చును. మాత్రారూపనాదంబు హ్రస్వదీర్ఘంబులైన యచ్చులుగాను, స్వరరూపనాదంబు ఉదాత్తానుదాత్తస్వరితంబులుగాను, వర్ణ రూపనాదంబు కఖమున్నగు నక్షరంబులుగాను శ్రుతమగును. ఈవర్ణసముదాయోచ్చారణమే వాక్కనఁబడును దీనింబట్టి ప్రాణంబునకు వాక్కు ప్రధానలక్షణంబగుచున్నది.

ఉద్ధవా ! అట్లు నేను పరారూపంబున శరీరంబును బ్ర వేశించి నాగ్రూపంబున వ్యక్తమగుదును. ఈ త్రివిధనాదం బులలోఁ బశ్యంతీనాదంబు ప్రాణసంబంధమై మధ్యమనాదంబు మనస్సంబంధమై వైఖరీనాదంబు బుద్ధిసంబంధమై యుండును. దారువునందు స్వతస్సిద్ధంబుగా నడఁగియుండునగ్నికిఁ బ్రాణ నాదంబును, దారువును దఱచఁగా బుట్టిన నిప్పురవకుఁ బశ్యం తీనాదంబును, దృశ్యమగుమంటకు వైఖరీనాదంబును సరిపోల్ప వచ్చును.

### జీవలక్షణంబులు.

ఉద్ధవా ! నేను శరీరగతుఁడనై యుండుట యెట్లు తెలియ నగునందువా ? నేను శరీరస్థుఁడనై యుండుటచేతనే కర్మేంద్రి యంబులు వాక్కర్మగతి విసర్జనరూపంబులైన వానివ్యాపా

రంబులను, జ్ఞానేంద్రియంబులు దర్శనస్పర్శన శ్రవణరసన ఘ్రాణరూపంబులైన వానికార్యంబులను, మనస్సు సంకల్ప రూపమైన తనవ్యాపారంబును బుద్ధిచిత్తంబులు విజ్ఞానరూపమైన వ్యాపారంబును, అహంకారంబు అభిమానరూపమైన తనవ్యాపారంబును సూత్రాత్మ గుణత్రయవ్యాపారంబును సాగించు చున్నవి. నేను శరీరగతుఁడనని యెఱుంగుటకుఁ బైనజెప్పినవి లక్షణంబులగును. ఇందేలక్షణంబు గానవచ్చినను నేను తదుపాధియందున్నానని గ్రహింపనగును.

### సూత్రాత్మ.

సూత్రాత్మ నాప్రకృతివలనఁ గలుగుచున్నది. నా ప్రకృతిని బ్రధానమనియు వచింతురు. సూత్రాత్మకు బ్రాణంబనియు హిరణ్యగర్భుండనియు మహత్తనియు వాయువని యు నామాంతరంబులుగలవు సూత్రాత్మను బౌరాణిక భాషలో బ్రహ్మయందురు. ఈబ్రహ్మయే సృష్టికర్తయగు చున్నాఁడు. సూత్రాత్మనుండి మనస్సు (matter) కలుగు చున్నది.

జీవుఁడనఁగా సమస్తంబును జీవింపఁజేయువాఁడని యర్థము. పైనఁజెప్పినవిధంబునఁ బరమాత్మయైన జీవుఁడు మొట్ట మొదట నవ్యక్తుఁడు నేకుఁడునై యుండి తనవిశిష్టశక్తియైన ప్రకృతి నధిష్ఠించి కాలక్రమంబున బహురూపంబులఁదాల్చెను. ఈరూపబహుత్వంబునే సమిష్టిన విశ్వమందురు.

### విశ్వవృక్షము.

విశ్వంబును మహావృక్షంబునకుఁ బోల్పవచ్చును. ఈ

విశ్వవృక్షము నిరంతరకర్మాత్మకమైయుండును. దానికి ధర్మాధర్మంబులను రెండుబీజంబులు గలవు. ఈవృక్షంబు కోరికలనెడి వేరులయాధారంబున నిలిచి గుణత్రయంబనెడి మూలంబుఁగలిగి పంచభూతంబులనెడి శాఖలతోను గర్మేంద్రియంబులనెడి ఉపశాఖలతోఁ బంచేంద్రియంబులనెడి నాళంబులతో నొప్పుచు సుఖదుఃఖంబులనెడి ఫలంబులఁ గాయుచుండును. పరమాత్మ జీవాత్మలనెడి పక్షులురెండును దానియందుఁ గాపురముండును.

ఈవిశ్వవృక్షంబు సూర్యమండలంబువఱకు వ్యాపించియుండును ఆవల దానికి వ్యాప్తి గలుగదు. జీవుఁడు భూమండలగతుఁడై సకామకర్మంబు లాచరించుచుండునంతకాలముఁ దత్కర్మఫలంబుల భోగించుచు నందే పర్యటనమొనర్చుచుండుననియు, అతఁడు సత్కర్మాచరణాదులవలన మహాపుణ్యంబును సంపాదించెనేని భూమండలంబును వదలి సూర్యమండలంబునకుఁ బోవుననియుఁ అటకుఁ బోయిన జీవునకుఁ బునరావృత్తిలేదనియు భావము. (15-1, 2.)

ఉద్ధవా ! జీవుని బంధముక్తితత్త్వంబును విచారించుటనఁగా నావచించిన పక్షులరెంటియొక్క అనఁగా జీవాత్మపరమాత్మలయొక్క విచారమేయగును. జీవుఁడు గుణబద్ధుఁడైనచోఁ దత్ఫలంబుగా వానికిఁ గాంక్షయుఁ దత్ఫలంబుగా నింద్రియవశత్వమును దప్పవు. ఇంద్రియవశుఁడు తనకర్మలఫలంబులైన సుఖదుఃఖంబుల ననుభవించుచు జననమరణరూపసంసారి యగుచున్నాఁడు. పరమాత్మయన్ననో యావృక్ష

మందే యున్నను దానిఫలంబులూరించుచున్నను నిష్కాముఁడును జితేంద్రియుండును గావున ఫలాశ లేక సుఖమున్నాఁడు.

### కాంక్షాబీజము.

ఉద్ధవా! నిఖిలాపదలకుఁ గాంక్షయే బీజంబని యెఱింగియు మర్త్యులు కాంక్షావశవర్తులై విషయంబుల వెంటఁ గుక్కలువలెఁ బరుగిడుట చూచుచుంటివిగదా. కారణంబేమందువా? అజ్ఞానమే కారణము. అజ్ఞానమనఁగా నేమందువా? ఏది పర్యవసానంబునఁ దనకు మేలుగాదో యదే తప్పక మేలని భ్రమించుట యజ్ఞానంబగును. అట్టి విపరీతజ్ఞానంబునకుఁ గారణంబేమందువా? మమకారమే కారణము. దానికిఁ గారణమేమందువా? మనస్సే కారణము. మనస్సనఁగాఁ బ్రారబ్ధకర్మవాసనా సముచ్చయంబనియు, వాసనలు శుద్ధాశుద్ధమిశ్రమంబులై త్రిగుణవ్యాపారఫలంబులై యుండుననియు, మనస్సు దానివ్యవహారవిశేషంబులనుబట్టి బుద్ధ్యాదినామంబులఁ బరఁగుననియు, బుద్ధ్యాదుల వ్యవహారంబులెట్టివైనదియు మున్నే వివరించితిని.

బుద్ధికి హితాహితనిశ్చయశక్తి సహజము. బుద్ధియట్లు నిశ్చయించుచున్నను మలినవాసనలు మిక్కుటంబుగానున్నప్పుడు వానిమ్రోఁల బుద్ధిబోధ వినరాకుండును. మర్త్యుఁడాకారణంబున మలినవాసనాప్రేరణంబునే యనుసరించి చెడుచున్నాఁడు. బుద్ధిబోధ ఘంటాపథంబుగా వినరావలయునన్న దానికినుపబలంబును జేకూర్పవలయును. అట్టిది శాస్త్రజ్ఞానసజ్జనసాంగత్యాభ్యాసబలంబులఁ సిద్ధించును. శాస్త్రజ్ఞానాదులు రజ

స్సుయొక్క యుద్ధతినిఁ దగ్గించుచు సత్వంబును వృద్ధిపఱచును. తత్ఫలంబుగా బుద్ధిశక్తిలలవడును. అప్పుడదిగట్టిగాఁ జెవినిల్లు గట్టి బోధించును. ఆబోధను సులభంబుగా నవ్వలఁ ద్రోయఁ జాలరు. (14-7 ; 2-61,63.)

ఉద్ధవా ! ఎల్లరకు మనస్సుగలదంటిని ; అది త్రిగుణాత్మికయంటిని ; గుణంబులు వానికార్యంబులను జేయుచునే యుండునంటిని. దానింబట్టి లోకంబెల్ల గుణబద్ధమై వర్తించునేగాని వేఱుమార్గంబుఁ ద్రొక్క సాధ్యంబుగాదనియు, లోకమెల్ల నట్టిదైయైనప్పుడు కొందఱు గుణబద్ధులును గొందఱు గుణాతీతులు నగుట యెట్లు పొసఁగునని యు శంకింతువా ? ఈగుణంబులు వివేకినిగూడ నాకర్షించుచునే యుండును. (3-37,39.) అయినను వివేకిశక్తి శాస్త్రజ్ఞానసజ్జనసాంగత్యాదులవలన వృద్ధిగాంచియుండును గావున నది యంత సులభంబుగా రజస్తమఃకార్యంబులకు లోఁబడి వర్తింపదు. ఒకవేళ ప్రమాదవశంబునఁ జిక్కినను వెనువెంటనే మేల్కాని సవరించుకొనును. రజస్తమస్సుల యుద్ధతినిఁ దగ్గించుటకుఁ బ్రాణాయామంబెంతయు నుపకరించును. ప్రతిదినము త్రిసంధ్యలందుఁ బ్రాణాయామంబుఁ జేయుచుఁ గ్రమక్రమంబుగా నేకాగ్రత నలవరచుకొని మనస్సును నావశంబు గావించినయెడల రజోగుణంబు సన్నగిలి సత్వగుణంబు వృద్ధియగును. ([illegible]-40 to 43).

ఉద్ధవా! ఈ యోగంబును నేను మొట్టమొదట సనకాదులకు బోధించితిని. వారు దాని నాశ్రయించి శుభమందిరి. (4-1) ఎప్పుడెట్లు బోధించితివందువా ? (4-4). అది చెప్పెద వినుము.

హంసోపదేశము.

ఉద్ధవా! సనకాదులు బ్రహ్మమానసపుత్త్రులు. వారు బ్రహ్మయొద్దకు వచ్చి 'తండ్రి! ఇంద్రియంబు లింద్రియార్థంబులవంకఁ బఱచుచుండును. ఇంద్రియార్థంబు లింద్రియంబుల నాకర్షించుచుండును. అవియిట్లు పరస్పరసమాకర్షణపరంబులై నిరంతరము వర్తించుటవలన మర్త్యునకు స్వాతంత్ర్యమే గానరాకున్నది. ఈమల్లయుద్ధము మానుటయెట్లు? మర్త్యుఁడు వానినుండి ముక్తుఁడగుట యెట్లు?' అనిఅడిగిరి. సర్వసృష్టికర్తయైన బ్రహ్మకుఁగూడ జవాబుతోఁపదయ్యెను. ఎంతయోచించినను బ్రశ్న బీజమే వానికి గోచరంపకుండెను. ఏలయందువా? వానిమనస్సుగూడ ప్రవృత్తిపరమైయుండుటే కారణము. తత్త్వరహస్యంబెద్దైనను బోధపడవలయునన్నచో మనస్సు ప్రవృత్తిపరాఙ్ముఖమై యేకాంతస్థితిని దాల్పవలయును.

అంతట బ్రహ్మ నన్నుస్మరించెను. నేను హంసరూపంబుఁదాల్చి ప్రత్యక్షమైతిని. సనకాదులు బ్రహ్మపురస్సరంబుగా నాకు నమస్కరించి 'నీవెవర'ని యడిగిరి. వారికిట్లు చెప్పితిని.

'మునులారా! 'నీవు' అన్నమాటకు నర్థమేమి? 'నీవు' అని నాయాత్మనుగూర్చి పల్కితిరో నాదేహంబును గూర్చి పల్కితిరో యూహింపరాదు. ఆత్మనుగూర్చి పల్కితిమందురేని, ఆత్మ ఏకము అద్వితీయము అపరిచ్ఛేద్యంబు గావున 'నీవు, నేను' అని దానిని వేర్వేఱుచేసి పల్కుటకే వలనుపడదు.

దేహంబును గూర్చి పల్కితిమందురేని, యది పంచభూతాత్మి కంబగును. పంచభూతంబులనుగూడ నాత్మవలెనే వేఱుచేయ రానివని మీకేస్పష్టము. ఎట్లందువా ? మీదేహంబులోని పంచభూతంబులు నాదేహంబులోని పంచభూతంబులు వేఱు గాలేవుగదా ? కావున మీప్రశ్నకు నాత్మదేహంబులకు రెంట నవకాశమే లేదు.

మునులారా ! సృష్టియెల్ల బ్రహ్మము ప్రకృతి యీ రెండింటి సమ్మేళనఫలంబుగానున్నది. ప్రకృతిని మనస్సని యునందురు. మనస్సు (ప్రకృతి) చక్షురాదులైన యింద్రి యంబుల ద్వారకంబున వ్యవహరించుచున్నది. ఇంద్రియం బులు దేనినిజూచినను దేనినివిన్నను మాట్లాడినను నన్నేయనఁ గా బ్రహ్మమునే చూచుట వినుట మాట్లాడుట యగును. ఏలయందువా ? నాకన్న నితఃపరంబు గలుగదు. సర్వము నేనే యైనప్పుడు రెండవది యేముండును ? అజ్ఞానవశంబున నీ రహస్యంబును తెలియక వేఱొండుకలదని మనస్సు భావించి నంతనే నాపరతత్త్వంబునకు భంగము గలుగదు.

మునులారా ! మనస్సునకు నింద్రియార్థంబులకు నెడ బాటుగలుగదు. మనస్సే జీవుఁడగునేని జీవునకు నింద్రియా ర్థంబులకు నెడబాటు లేదని చెప్పకతప్పదు. అనఁగా నింద్రి యార్థంబులతోనైన దేహంబు జీవునకు దేహంబగును. అప్పుడు జీవునకును దేహంబునకును వియోగంబు లేనిదగును. తత్ఫల ముగా దేహమే జీవుఁడు, జీవుఁడే దేహంబునగును. అనఁగా జీవదేహంబులకు నవినాభావము సిద్ధించును. జీవుఁడనఁగాఁ బరమాత్మనైన నేనేయని తెల్పితిని. కావున దేహమే పర

మాత్మయగుచున్నది. దీనినే దేహాత్మబుద్ధియందురు. ఇది యెంత ప్రమాదజనితమో యూహింపుఁడు.

ఈభావం బెట్లు గలుగుచున్నదందురా? అధ్యాసము వలనఁ గలుగుచున్నది. అధ్యాసమనఁగా నేమందురా? ఒక దానియందు మఱొకదానితత్త్వంబు నారోపించుట యధ్యాస మనఁబడును. అధ్యాసమునకుఁ గారణమేమందురా? మనస్సే కారణము. ఎట్లందురా? మనస్సు నిరంతరము గుణపరమై యుండుటం జేసి గుణకార్యంబులైన యింద్రియార్థంబులందు నది తగిలియుండును. అట్లు తగులుకొని తదేకస్థితిలో నుండుట వలన గుణకార్యంబులెల్లఁ దనకార్యంబులనుభావము మనస్సునకు నైజమగుచున్నది. ఈస్వభావంబు వృద్ధియగుకొలఁది మనోభాగంబులలో నొకటియైన యహంకారము తలయెత్తి కర్తృత్వ భోక్తృత్వంబులకెల్లఁ దానే యధికారినని నిశ్చయించుచున్నది.

ఈ యహంకారంబు ఘూమంబు జ్యోతినివలె జీవు నావరించి యుండును. ఆకారణంబున జీవాత్మప్రకాశంబు మందగించుచున్నది. దీపప్రకాశంబు సోకనిచోటఁ జీఁకటియెట్లుండునో యట్లే యాత్మప్రకాశంబు అహంకారరూపావరణకారణంబునఁ జక్కఁగా సోకనందున మనస్సు అజ్ఞానరూపతమస్సులోఁబడి యాత్మముఖముగాక యింద్రియముఖమై వర్తించుచున్నది.

రాజు మంత్రి సేవకుఁడు వీరిని ముగ్గురను ఆత్మకు నహంకారంబునకు మనస్సునకు సామ్యము చేయవచ్చును.

రాజాజ్ఞలను మంత్రి పడసి సేవకునకుఁ దెలుపును. ఇది లోకసహజము. రాజుగట్టివాఁడైనచో వానియాజ్ఞలను మంత్రి యథారూపంబున సేవకునకుఁ దెలుపును. వాఁడు తన దృష్టిని రాజునందే నిలిపి యెప్పుడేమి ప్రమాదంబుగల్గునో యనుభయంబుతో రాజాజ్ఞల నిర్వర్తించుచుండును. అట్లుగాక రాజునకన్న మంత్రిగట్టివాఁడైనచో సేవకుఁడు వాని దృష్టిని మంత్రియందే నిలిపి వర్తించునుగాని రాజునంతగా లెక్కచేయఁడు. అట్లే యహంకారావరణంబు స్వల్పంబగునేని యాత్మదీప్తి నిరాతంకంబుగా మనస్సువఱకు వ్యాపించును; మనస్సు ఆత్మముఖమగును. అట్లుగాక యహంకారావరణంబు దట్టమగునేని యాత్మదీప్తి మనస్సువఱకు వ్యాపింపకుండును. మనస్సు తనపై వెనువెంటనే యుండునట్టి యధికారియైన యహంకారము చెప్పినట్లు వర్తించును.

మునులారా! మనస్సు జడంబనియు, మనస్సుయొక్కయంతర్భాగంబని చెప్పఁదగిన యహంకారంబుగూడ జడంబే యగుననియు, జడంబులకు స్వశక్తిలేదు గావున నవి స్వతంత్రించి వర్తించుటయు నారోపణామలొనర్చుటయు నెట్లు సాధ్యంబనియు శంకింతురా? అయఃఖండంబునకు స్వశక్తిలేదు. ఎచ్చటవైచిన నచ్చటనే యది పడియుండును. సూదంటురాయి సాన్నిధ్యంబు దానికిఁ గలిగినప్పుడది స్వతంత్రశక్తి గల దానివలెనే వర్తించుచున్నది. ఇది మీకు స్వానుభవసిద్ధమే గదా. అట్లే మనస్సును దత్సంబంధములైన యహంకారాదులును నిసర్గజడంబులైనను ఆత్మసాన్నిధ్యంబునఁ జేసి శక్తిమంతంబులట్లు వర్తించుచున్నవి. సూదంటురాతికిని నయఃఖండంబు

నకు మధ్య నేదేనియునున్నచో దానిసాన్నిధ్యబలంబు చక్క-గా నయఃఖండంబునకు సోఁకదు. మధ్యనున్న యావస్తువు దట్టమైనదగుచో నయఃఖండంబు కదలనే కదలదు. అది సన్న పాటిదైనచో సూదంటురాయిశక్తి యొకపాటిగానేని సోఁకి యాయయఃఖండంబు కొంచెమైనను జలింపనేర్చును. అనఁగా అయఃఖండంబుయొక్క- చలనాచలనంబులు మధ్యనున్న వస్తువు నుబట్టి యున్నవి. అట్లే మనఃకార్యంబుగూడ దానికి నాత్మకు నడుమ నడ్డముగానున్న యహంకారంబుయొక్క- బలాబలంబు లనుబట్టి యుండును.

మునులారా! సృష్టియెల్ల మనఃకల్పితమై కేవలవిభ్రమ మాత్రమై నిమిషనిమిషంబునకు మాఱుచు నిలుకడలేకున్నది. అట్లుండియు గొరవిని జక్రాకారంబుగా మహావేగంబుతోఁ ద్రిప్పినప్పుడు దానిమంట యవిచ్ఛిన్నంబుగాఁ గాన్పించునట్లే సృష్టిగూడ దానివిభ్రమవేగంబునఁజేసి యవిచ్ఛిన్నంబుగాఁ గాన్పించును. ఈరహస్యంబు నెఱుంగక సృష్టి శాశ్వతమని భావింతురు.

మునులారా! జగత్తు మిథ్యయైనప్పుడు అందలివ్యవహారముగూడ మిథ్యయేయగును గదాయనియు, జగన్మిథ్యాభావము నిరంతరము హృదయస్థమై యుండునా, జగత్తునందలి వ్యక్తికొఱకుగాని సంఘముకొఱకుగాని పడునట్టిపాటు మిథ్యామాత్రమేయగుననియు, మిథ్యామూర్తి మిథ్యాజగత్తునందు మిథ్యావ్యవహారము సలుపుటగాదాయనియు శంకింపవలదు. మునులారా! మిథ్యయనఁగా అభావమనిగాని శూన్యమని గాని తలంపవలదు. అద్దానియొక్క- భావాభావప్రపంచం

బులందు శూన్యాభావములే గలుగవు. బ్రహ్మము వేఱనియు బ్రపంచము తద్భిన్నమనియు ద్వైతి వ్యవహరించును. బ్రహ్మమే ప్రపంచమని యద్వైతి వ్యవహరించును. అనఁగా రూపనామంబులు సత్యమని ద్వైతిభావించును. రూపనామంబులకు మార్పుగలదు గావున నవితాత్కాలికసత్యములగు నేగాని పారమార్థికసత్యములు గావనియు, రూపనామంబులకు నధిష్ఠానమేదో యది యొక్కటే సత్యమనియు నద్వైతి భావించును. అద్వైతము భేదభావంబునుమాత్రమే నిషేధించును గాని లోకవ్యవహారంబును నిషేధింపదు.

ద్వైతికివలె నద్వైతికిఁగూడ క్షుత్పిపాసలు జాగ్రన్నిద్రలు దయాదాక్షిణ్యంబులు గలవు. అయినను ద్వైతివ్యవహారము వానియాత్మసంగ్రహార్థమగును. అద్వైతివ్యవహారము లోకకళ్యాణార్థమగును.

మునులారా! సంగతియెల్ల వింటిరిగదా. అధ్రువంబును మాయామయంబునైన సృష్టివంకనుండి మర్త్యులు వారి దృష్టిని మరలించి యాత్మపరంబొనర్చి, యాసలనెడి యెండమావుల వెనువెంటఁదగిలి ప్రక్కక చిరసుఖానుభవంబునకై యత్నింపవలయును. దృష్టినట్లాత్మపరంబొనర్చినను బూర్వవాసన లంతర్గతమై మనోరూపంబుననున్నవి. దానినప్పుడప్పుడు బాహ్యముఖంబునకు లాగుచుండును. అయినను స్థితప్రజ్ఞుఁడు వానిప్రయత్నంబుల నప్పుడప్పుడే త్రోసిపుచ్చుచుండును.

మునులారా! ప్రపంచస్ఫురణంబు స్థితప్రజ్ఞులకుఁ

గొందఱకు జీవితమధ్యకాలంబుననే పూర్తిగా నంతరించును; కొందఱకు జీవితాంతంబువఱకు స్మృతిమాత్రంబుగా నుండును. మొదటివారిని జీవన్ముక్తులనియు రెండవవారిని విదేహముక్తులనియు వచింతురు. ప్రపంచస్ఫురణంబనఁగా నేమందువా? దేహాభిమానమే యని గ్రహింపుము. అది స్మృతిరూపంబున నుండును. జీవన్ముక్తులకు నట్టిస్మృతిగూడ లేనందున మదిరామదోన్మత్తులకుఁ గట్టుగుడ్డయుండునది లేనిది యెట్లు తెలియకుండునో యట్లే జీవన్ముక్తులకు వారిదేహంబుండునది పోయినది తెలియకుండును. విదేహముక్తులకు దేహస్మృతి దేహపాతమువఱకు నుండును. దేహపాతంబుతోడ నట్టిస్మృతిపోవుచున్నది. వారును సంపూర్ణముక్తులగుచున్నారు.

మునులారా! దేహపాతంబు వారికెప్పుడగునందురా? ప్రారబ్ధకర్మఫలభోగార్థము దేహంబులెల్ల ప్రాణులకుఁగలుగుచున్నవి. తత్కర్మఫలంబుసంపూర్ణంబుగా భుక్తమగువఱకు నెల్లప్రాణులకు దేహంబులుండును. ఫలభోగంబు సంపూర్తియైన నిమిషంబుననే దేహము పతనమగుచున్నది. ఈమర్యాద ముక్తులకుఁగూడ నన్వయించును. దేహపతనమువఱకు సుఖదుఃఖాది ద్వంద్వంబులు సమస్తదేహంబులకుఁ గలుగుచునే యుండును. అవితప్పవు. దేహాభిమానము గలవారా ద్వంద్వంబులను దామనుభవించుచున్నామని తలంతురు. కారణమేమందురా? దేహమే యాత్మ యని వారు భావించుటచేత దేహసంబంధంబు లెల్ల నాత్మసంబంధంబులుగా వారికిఁ దోఁచుచుండును. ముక్తులన్ననో దేహధర్మంబు లెల్ల జరుగుచుండగనను నొంపునో దేహముఁవంకనే వారు మనస్సు మరలింపరు

గావున దేహంబునకుఁ గలుగుపాట్లు వారికిఁ దెలియకయే వర్తిం చుచుండును.

మునులారా ! సాంఖ్యరహస్యంబును గర్మయోగరహస్యంబును రెంటినిఁ దెలిపితిని. ఆత్మానాత్మవివేకంబును గూర్చి తెలుపునది సాంఖ్యమగును. అట్టివివేకంబును సాధనంబుగాఁ బడసి ముక్తినిసాధించు మార్గము యోగమగును. ముక్తి వట్టిమాటలతో సిద్ధింపదు. జీవితంబునెల్ల సాంఖ్యప్రకారంబను ష్ఠానసిద్ధ మొనర్చినప్పుడే ముక్తికలుగును. ముక్తియనఁగా నేమోయని భావింపవలదు. అదియొకవిధమైన యంతఃకరణ స్థితియని యెఱుంగుము. మునులారా ! ఈపరమార్థంబును మీకుబోధించుటకై విష్ణువునైన నేను హంసరూపంబున వచ్చితిని' అని పలికి వారిసంశయంబులు దీర్చి నేను స్వధామంబునకుఁ బోయితిని. ఉద్ధవా ! సనకాదులకెప్పుడే రూపంబునఁ దత్త్వబోధచేసితినో గ్రహించితివా ?

ఉద్ధవుఁడాయుపదేశంబును సవిస్తరంబుగా విని 'స్వామీ! బ్రహ్మముమాత్రమే సత్యంబనియుఁ దదన్యంబెల్ల నసత్యంబనియు, అసత్యంబధ్యాసమువలన సత్యంబుగాఁ దోచుచున్నదనియు హంసోపదేశమందు సూచించితివి. అధ్యాసమనఁగా నేమో ? అదియెట్లు కలుగుచున్నదో? దానికిఁ గారణమేమో యెఱుంగఁగోరుదు' ననెను. నావుఁడు భగవానుఁడు విని ఉద్ధవా ; ఈవిషయమై గురుశిష్యసంవాదంబుగా జెప్పెద వినుమని యిట్లనియెను.

అధ్యాసము.

గురువుః-శిష్యా ! ఆవస్తువునందు ఒకదానిధర్మంబును

మఱియొకదానియందారోపించుట యధ్యాసమనఁబడును. ఉదాహరణము వినుము. రాత్రిపూటఁ ద్రాటిని జూచి యది సర్పంబని భావించుట గలదు. త్రాఁడెన్నఁడును సర్పము గానేరదు. అయినను ద్రాటియందు సర్పధర్మంబు నారోపించి త్రాటిని సర్పంబుగా భావింతురు. ఈభావమే యధ్యాసమనఁబడును.

అధ్యాసము. అర్థాధ్యాసమనియు జ్ఞానాధ్యాసమనియు రెండువిధంబులు. అందు అర్థాధ్యాసము మరల స్వరూపాధ్యాసమనియు, సంసర్గాధ్యాసమనియు రెండువిధంబులు. ఆ రెంటిలో స్వరూపాధ్యాసము కేవల ధర్మాధ్యాసమనియు, ధర్మసహిత ధర్మ్యధ్యాసమనియు, అన్యపరాధ్యాసమనియు, సంబంధసహిత సంబంధ్యధ్యాసమనియు నాల్గువిధములు. సంసర్గాధ్యాసము కేవల సంబంధాధ్యాసమనియు, అన్యోన్యాధ్యాసమనియు మరల రెండు విధంబులు.

అధ్యాసమునకు మిథ్యావస్తువును భ్రాంతిజ్ఞానంబును రెండు నుండవలయును. ఆరెండును లేనప్పుడు అధ్యాసము గలుగనేరదు. రజ్జువును సర్పముగా భావించుట మిథ్యాజ్ఞానంబగును. సర్పముగాఁ బట్టి రజ్జువు అట్టిమిథ్యాజ్ఞానమువలన సర్పమగుట మిథ్యావస్తువగును.

అందు మిథ్యావస్తువు అర్థాధ్యాసమనియు, భ్రాంతిజ్ఞానంబు జ్ఞానాధ్యాసమనియు వచించిరి. అర్థము అనఁగాఁ బదార్థము. దానికి సంబంధమైనది అర్థాధ్యాసమనిరి. జ్ఞానంబునకు సంబంధించినదగుట దానిని జ్ఞానాధ్యాసమనిరి.

రజ్జువును జూచి సర్పమని భావించినప్పుడు రజ్జువునం దనిర్వాచనీయమైన స్వరూపము పుట్టుచున్నది. అందువలన దానిని స్వరూపాధ్యాసమనిరి. ఎట్టిసంబంధంబును లేనట్టి రెండు పదార్థంబులకు సంసర్గము గలుగుటవలన అనిర్వాచనీయమైన మూఁడవపదార్థము పుట్టుచున్నది. దర్పణము-ముఖము వీనికెట్టిసంబంధమును లేదు. వానికి సంబంధమును గలిగించినప్పుడు అందు ముఖము ప్రతిబింబించుచున్నది. సంబంధమనఁగా సంసర్గము. అట్టి సంసర్గకారణంబున అనిర్వాచనీయమైనట్టి ప్రతిబింబము గలుగుచున్నది. అట్లు సంసర్గంబునఁ గలుగుటం జేసి దానిని సంసర్గాధ్యాసమనిరి.

ఒకవస్తువుయొక్క ధర్మంబునుమాత్రమే మఱియొక వస్తువునం దారోపించుట కేవలధర్మాధ్యాసమగును. చూచుట వినుట మొదలగునవి యింద్రియ ధర్మంబులు. అట్టి యింద్రియధర్మంబులను ఆత్మధర్మంబులుగా భావించుటగలదు. ఇచ్చట యింద్రియధర్మంబులను మాత్రమే యాత్మయం దారోపించుచున్నారు గాని యింద్రియములను స్వరూపముతోడ నారోపించుటలేదు. ధర్మమును మాత్రమే యారోపించుటంజేసి యిది కేవలధర్మాధ్యాసమగును. అట్లుగాక ధర్మంబును దద్ధర్మంబునకు నాశ్రయమైన వస్తువును రెంటి నారోపించుట ధర్మసహిత ధర్మ్యధ్యాసమగును. ఎట్లందురా? అంతఃకరణంబునకుఁ గర్తృత్వాది ధర్మంబులుగలవు. ఆధర్మంబులతోడ నంతఃకరణంబును గ్రహించి యాత్మయం దారోపించి యాత్మనే కర్తయని తలంచునప్పుడు ధర్మసహిత ధర్మ్యధ్యాసమగును.

ఆయఃపిండము అగ్ని ఇవిరెండును వేర్వేరైనపదార్థంబులు. అగ్నియందాపిండంబును గాల్చినప్పుడు అగ్నిపిండంబుగాఁ గాన్పించుచున్నది. వానికిఁ బ్రత్యేకావస్థ గలుగదు. అనఁగా నవి యొకదానియందొకటి యధ్యస్తములగుచున్నది. దీనిని అన్యోన్యాధ్యాసమందురు.

రెండు పదార్థంబులలో నొకటి యధ్యస్తమునకు సాధ్యమేగానుండుటయు రెండవది సాధ్యమైనదిగానుండుటయుఁ గలదు. అధ్యస్థమునకు సాధ్యముగానిదానియందు అధ్యాససాధ్యమైనదాని నారోపించుట అన్యతరాధ్యాసమగును. ఎట్లందురా ? ఆత్మ-అహంకారము ఈరెంటిలో ఆత్మకు రూపమే లేదు. గావునను రూపములేనిదాని నారోపింప సాధ్యముగాదు గావునను దానిని అహంకారమం దారోపింప సాధ్యముగాదు. అహంకారమన్ననో యది యారోపణ సాధ్యముగానున్నది. చానంజేసి అహంకారంబు నాత్మయందారోపించి యహంకారంబునే యాత్మగా భావింతురు. ఇది అన్యతరాధ్యాసమగును.

ఆత్మయందు అనాత్మవస్తువుయొక్క సంబంధస్వరూపంబుల రెంటిని ఆరోపించుట సంబంధసహాసంబంధ్యధ్యాసమగును. ధర్మసహితధర్మ్యధ్యాసమందు ధర్మంబు నారోపింతురు ; ఇందు సంబంధి సంబంధంబునారోపింతురు. వీని రెంటికి నిట్టే భేదము గలదు.

కేవల సంబంధంబునుమాత్రమే యారోపించుట కేవల సంబంధాధ్యాసమగును. కేవలధర్మాధ్యాసంబునకు దీనికిఁ గల భేదంబును గ్రహింపవలయును,

పంబంధసహాసంబంధ్యధ్యాసము సంసర్గాధ్యాససహిత స్వరూపాధ్యాసంబునకును అన్యోన్యాధ్యాసము సంసర్గస్వరూపాధ్యాసంబునకును అంతర్భూతములుగా నున్నవి.

అధ్యాససామగ్రి.

అధ్యాసమునకు (1) సత్యవస్తుజ్ఞానజన్యసంస్కారము (2) ప్రమాతృదోషము. (3) ప్రమాణదోషము. (4) ప్రమేయదోషము. (5) అధిష్ఠానసామాన్యరూపజ్ఞానము. (6) అధిష్ఠానవిశేషరూపాజ్ఞానము. ఈయాఱును గారణంబులగును.

(1) రజ్జువునందు సర్పభ్రాంతిగలుగుటకు సర్పజ్ఞానము తత్పూర్వమే యుండవలయును. ఎన్నడుగాని సర్పంబును జూచిగాని వినిగాని యుండనిచో రజ్జువును జూచినప్పుడు సర్పభ్రాంతికలుగుటకే యవకాశము లేదు. సత్యసర్పజ్ఞానమున్నందున అట్టిజ్ఞానజన్యసంస్కారము రజ్జుదర్శనకాలంబున స్మృతిరూపంబునఁ బ్రతీతమై అధ్యాసము గలిగించుచున్నది. అట్టి యధ్యాసకాలమందు సర్పము అధ్యస్తమగుట లేదనియు సర్పజ్ఞానజన్య సంస్కారము మాత్రమే అధ్యస్తమగుచున్నదనియు గ్రహింపవలయును.

(2) ప్రమాతయనఁగాఁ జూచువాఁడు. వానియందు భయాదులు గలుగుట ప్రమాతృదోషమగును.

(3) చూచుట మొదలగువానికి సాధనంబులైన నేత్రాదీంద్రియంబులందు పిత్తకామలాదులు గలుగుట ప్రమాణదోషమగును.

(4) ప్రమాజ్ఞానంబునకు విషయమైనది ప్రమేయ మగును. ఎట్లందురా ? సర్పభ్రాంతికి రజ్జువు అధిష్ఠానమగు చున్నది. రజ్జువే లేకున్నచో సర్పభ్రాంతికే యవకాశము లేదు. కాఁబట్టి భ్రాంతికి రజ్జువు విషయమగును. విషయ మైన అనఁగా అధిష్ఠానమైన రజ్జువునకును అధ్యస్తమైన సర్పంబు నకును సాదృశ్యముండవలయును. సాదృశ్యమే లేనిచో అ ధ్యాసమేగలుగదు. అట్టిసాదృశ్యము ప్రమేయదోషమగును.

(5) ఏది భ్రాంతికాలమందు తోఁచునో, ఏది తోఁప కున్న భ్రాంతియే గలుగదో యది అధిష్ఠానసామాన్యరూప జ్ఞానమగును.

(6) ఏది భ్రాంతికాలమందుఁ గలుగదో, ఏదికలుగుట వలన భ్రాంతితొలఁగుచున్నదో అది అధిష్ఠానవిశేషరూపాజ్ఞాన మగును.

సామాన్య రూపజ్ఞానమును విశేషరూపాజ్ఞానంబును ఇవిరెండును గలుగనిచో అధ్యాసమేగలుగదు.

అధ్యాసమునకు సత్యవస్తు జ్ఞానజన్యసంస్కారము హే తువన్నప్పుడు, జ్ఞానముగాక జ్ఞానజన్యసంస్కారము ప్రధాన మగుచున్నది. వస్తువు సత్యమైనదిగానే యుండవలయునను నియతి లేదు. అది మిథ్యావస్తువుగా నుండిన నుండవచ్చును. అది సజాతీయవస్తువుగా నుండవలయును ; అది విజాతీయమైన చో అధ్యాసము గలుగనేరదు. సర్పభ్రాంతి కలిగినప్పుడు తత్పూర్వము సత్యమైన సర్పమునే చూచియుండ నవసరము లేదు. సర్పమును బోలినవానిని జూచి సర్పమని భ్రమింపవచ్చును

జ్ఞానసంస్కారముండినఁజాలును. ఆసంస్కారము అవ్యవహితము గానే యుండవలయును. వ్యవహితమై విస్మృతి ప్రాయమైనచో అధ్యాసము గలుగదు.

శిష్యుఁడు:-స్వామీ ! ఈభావంబునకుఁ గారణమేమి ?

గు:-అవిద్యయే కారణము. అది యెప్పుడు గల్గెనందువా ? అది యనాదినుండి యున్నదిగావున దానిపుట్టుక యప్పుడిప్పు డనరాదు. అది యెందుండి వచ్చెనందువా ? దానికి ఉనికి చోటే గానరాదు. కావున నది యందుండి యిందుండి వచ్చె నని చెప్పసాధ్యముగాదు.

శి:-స్వామీ ! అవిద్యాకార్యమేమి ?

గు:-ఏకమైన బ్రహ్మమందు నానాత్వంబు నారోపించి యట్లు భావింపఁజేయుటయే యవిద్యాకార్యము. ఈయవి ద్యాకారణంబుననే జీవుఁడేకము నద్వితీయుఁడు నయ్యుఁ దన యందధ్యస్తమైన యుపాధితో నైక్యభావంబును బొందుచు న్నాఁడు. తద్భావఫలంబుగా నుపాధికార్యమైన కర్తృత్వ భోక్తృత్వాదులు దనవిగాఁ దలంచుచున్నాఁడు. దానిఫలం బుగా జీవునకు సంసారిత్వంబును సుఖదుఃఖాది భోక్తృత్వంబు ను గలుగుచున్నవి. జీవుఁడు బద్ధుఁడనఁగా నిదే తాత్పర్యము

శి:-స్వామీ ! అవిద్యకు మాయకు భేదమేమి ?

గు:-వత్సా ! అవిద్యనే మాయయనిరి. మాయ యొకవస్తువుగాదు. కావున మాయయనునదిట్టిదని నిరూపింప సాధ్యముగాదు. అట్లని మాయ బొత్తుగా లేదని యందుమా ?

యనిన మాయాకార్యమైన భ్రాంతి కలుగుచునే యున్నది. మాయ సత్యమేని యది త్రికాలంబులందు నుండవలయును. ఎప్పుడు సత్యజ్ఞానంబుదయించునో యాక్షణమే మాయ మాయమగుచున్నది. కావున మాయకు సార్వకాలికస్థితి లేదని స్పష్టము. మాయ యట్లున్నదనిగాని లేదనిగాని చెప్పఁదరము గాకున్నది గావున దాని ననిర్వచనీయమనిరి. అట్టి యనిర్వచనీయస్థితినే మిథ్యయందురు. మిథ్యయనఁగా భావాభావనిరూపణ సాధ్యముగానిదని యర్థమేగాని శూన్యమని గాదు.

శి :-స్వామీ! ఏది త్రికాలాబాధితమో యదిమాత్రమే సత్యమంటిరి. అట్టిది బ్రహ్మంబుదక్క మతొక్కటి లేదంటిరి. మాయగూడ కాలబాధితమై నశించును గావున మిథ్యయంటిరి. మిథ్యాత్మకమైన యీమాయ బ్రహ్మమందారోపితమై నానాత్వభావంబును గలిగించుచున్నదంటిరి. మిథ్యాసత్యంబులకుఁ జీకటికి వెలుతురునకువలె బొత్తుగాఁ బొత్తు కుదురదుగదా. అట్టివానికి సంబంధంబెట్లు గలుగనేర్చును? అట్లు సంబంధంబుగలిగెనేని సత్యత్వంబునకు భంగంబువాటిల్లదా?

గు :-వత్సా! నీవన్న సంబంధంబు వ్యావహారికమేగాని పారమార్థికముగాదు. రజ్జువునందు సర్పత్వంబు నారోపించినప్పుడు రజ్జుధర్మంబునకు భంగంబెల్లుకలుగదో యట్లే బ్రహ్మమందు మాయాత్వంబు నారోపించినప్పుడు బ్రహ్మత్వంబునకు భంగంబు గలుగనేరదు.

శి :-స్వామీ! అధ్యాసము నశించుటెట్లు?

గు :-వత్సా ! రజ్జువును జూచి సర్పమని భావించితివి. దీపంబును దెచ్చిరి. దాని ప్రకాశములోనది సర్పంబుగాదని యు రజ్జువనియు నేర్పడెను. ఆవెంటనే నీకు మొదటఁగల్గిన సర్పభ్రాంతి నశించెను. అట్లే సత్యజ్ఞానోదయంబున మిథ్యా భ్రాంతియైన యధ్యాసము నశించుచున్నది.

శి :-సత్యజ్ఞానంబు గలుగుటెట్లు ? తీర్థయాత్రాదులవల నఁ గలుగునా ?

గు :-తీర్థయాత్రాదులు జిత్తశుద్ధిజనకంబులై జ్ఞానోద యంబునకు సహాకారులగును. అంతియగాని యవి జ్ఞానజన కంబులు గానేరవు. జ్ఞానము స్వతస్సిద్ధము. అది పూర్వము లేకుండి క్రొత్తగాఁబుట్టివచ్చునది గాదు. జ్ఞానోత్పత్తియనఁ గా జ్ఞానంబునావరించి దాని ప్రకాశంబును మందగించియున్న యహంకారమమకారరూపమాలిన్యంబులను రాగద్వేషజని తంబులైన వానిని దొలగించుటయే యని గ్రహింపుము. ఆమాలిన్యంబులు తొలఁగినంతనే జ్ఞానంబు యథాగతి ప్రకా శించును ; సత్యము స్పష్టమగును. జ్ఞానంబును జుట్టియున్న మాలిన్యావరణంబు దొలంగుటను వేదాంతపరిభాషయందు ముక్తియనిరి. ముక్తియన్నను మోక్షమన్న నొక్కటే యగును.

శి :-స్వామీ ! ఒకవస్తుగుణంబును మఱియొక వస్తువు నందారోపించుట యధ్యాసమంటిరి. అధ్యాసమునకు రెండు వస్తువు లుండవలయునని పైవాక్యమువలన స్పష్టము. రజ్జు సర్పవిషయంబున రెండువస్తువులుగలవు గావున మీరన్నట్లధ్యా

సమునకు నవకాశము గలిగెను ; సర్పధర్మంబును రజ్జువునం దారోపించిరి. బ్రహ్మము జగత్తు-ఈరెండింటియందు జగత్తు బ్రహ్మమందారోపింపఁబడుచున్నదా ? బ్రహ్మము జగమం దారోపింపఁ బడుచున్నదా ?

గు :శిష్యా ! రజ్జుసర్పనిదర్శనమందు సర్పధర్మంబును రజ్జువునందారోపించిరి. తర్వాత సర్పము మిథ్యయని యేర్ప డెను. అట్లే బ్రహ్మంబును జగత్తునందారోపించిరందుమేని, తర్వాత బ్రహ్మము సర్పమువలె మిథ్యయగును. బ్రహ్మము సత్యమనిరి. కావున బ్రహ్మత్వంబును జగత్వంబున నారోపిం చుట కానేరదు. జగత్వంబును బ్రహ్మత్వమందారోపించిరందు మేని, బ్రహ్మము ఇంద్రియాతీతము. ఇంద్రియాతీతమందు నింద్రియగోచరకార్యంబు పొసఁగదు. కావున రెండవ యూ హాయు నిలువదు.

శి :-రజ్జుసర్పనిదర్శనంబును బట్టి యధ్యాసమునకు రెండు వస్తువులు వేఱువేఱుగా నుండవలయునని తెలుచున్నది. (1) బ్రహ్మము జగత్తు ఈరెండును వేఱువేఱుపదార్థములా ? మఱి యు రెండుపదార్థంబులును సత్యంబులైనప్పుడే యధ్యాసమున కు నవకాశముగలదు. (2) కావున బ్రహ్మము జగత్తు రెం డును సత్యములేనా ? (3) జగత్తు మిథ్యయనిరి. మిథ్యకుఁ బ్ర త్యేకావస్థయే గలుగనేరదు. జగత్తు మిథ్యయైనచో నధ్యాస మునకు రెండవవస్తువే లేనిదగునుగదా ? (4) మఱియు నారో పణంబునకు నిది దీనియందారోపితమగుచున్నదని తెలిసికొను వాఁడుండవలయును. ఆవ్యక్తి యెవఁడు ? (5) జీవుఁడే యం దు లేని, బ్రహ్మమే జీవుఁడనుటవలన బ్రహ్మమే తెలిసికొను

వాఁడగుచున్నాఁడు. బ్రహ్మము కేవల జ్ఞానస్వరూపమనిరి. బ్రహ్మమే జీవుఁడు గావున జీవుఁడును కేవల జ్ఞానస్వరూపి యగును. జ్ఞానమనఁగా సమస్తమును దెలిసికొను శక్తియనిరి. అట్టిశక్తి తనయందుఁ దానే యధ్యాసముజేసి భ్రమాదమం దునా? (6) పూర్వదృష్టమైన వస్తువుయొక్క సామ్యము జ్ఞప్తికివచ్చుటవలన నధ్యాసము గలుగుచున్నదనిరి. రజ్జుసర్ప విషయంబున సర్పజ్ఞానము పూర్వమే యుండుటవలన రజ్జువును జూచినప్పుడు సర్పధర్మము స్ఫురించి యాకారణంబున నధ్యాసము గలుగుచున్నది. బ్రహ్మము జగత్తు దీనివిషయంబున దేనిజ్ఞానము పూర్వము? దేనిజ్ఞానము పరము? జగత్తుయొక్క జ్ఞానము పూర్వమందుమేని జగత్తు బ్రహ్మమునకన్నఁ బూర్వమైనదిగా నేర్పడును. బ్రహ్మమే యాది యనిరి. కావున జగత్సంబంధజ్ఞానము పూర్వము గానేరదు. జగత్సంబంధజ్ఞానంబు పరంబందుమేని పరజ్ఞానంబు అధ్యాసమునకు నవకాశ మీయదు. అధ్యాసమునకుఁ బూర్వజ్ఞానమే కావలయును.

గు:-వత్సా! జగత్తు మిథ్యయన్నప్పుడు మిథ్యాశబ్దంబునకు శూన్యమను నర్థమును భావింపవలదు. ఏది భూతవర్తమానభవిష్యత్కాలంబుల మూఁడింట షడ్భావవికారంబులఁ జెందునో దానిని మిథ్యయనిరి. అట్లగుటవలన మిథ్యాశబ్దసూచితవస్తువునకు తాత్కాలిక సత్యత్వంబుగలదు. దానినే వ్యావహారిక సత్యమందురు. ఎప్పుడు అధ్యాసము జరుగుచున్నదో యప్పుడావస్తువు సత్యమనెడి భావంబుతోనే యధ్యాసవ్యవహారము జరుగుచున్నది. ఈమర్మంబును మదినిడికొని నీప్రశ్నలకుఁగా నావచించు సమాధానంబులను గ్రహింపుము.

(1) బ్రహ్మము-జగత్తు వేఱుపదార్థములా? యనునది నీ మొదటి ప్రశ్న. అధ్యాసకాలమందు రెండును వేఱుపదార్థములుగానే భావింపఁబడుచున్నది.

(2) బ్రహ్మము-జగత్తు రెండును సత్యములేనాయనునది నీ రెండవ ప్రశ్న. బ్రహ్మమునకుఁ బారమార్థికసత్యత్వంబును జగత్తునకు తాత్కాలిక సత్యత్వంబును జెప్పఁబడెను. కావున నధ్యాసకాలమందు రెండును సత్యములే యనుభావము తప్పదు.

(3) జగన్మిథ్యాత్వంబు చివరకునేర్పడుచున్నది. అధ్యాసకాలమందట్టి భావమే లేదు. కావున జగత్తునకు అధ్యాససమయంబునఁ బ్రహ్మైకావస్థయు ద్వితీయత్వము రెండును గలుగుచున్నది.

(4) వేఱువేఱుపదార్థంబుల నొక్కొక్కప్పు డజ్ఞానవశంబున నొక్కటిగానే భావించుచుందుము. ఇదియెల్లరకు ననుభవసిద్ధమైన విషయమేగాని వేఱుగాదు. ఉదాహరణము వినుము. 'నాదేహము' అన్నప్పుడు 'నేను' అనెడి ఆత్మయు దేహమును రెండు వేర్వేఱైనవి జ్ఞానికి స్పష్టము. అజ్ఞానియట్లు తలంపక తానే దేహము, దేహమే తాను అని విశ్వసించి వర్తించుచున్నాఁడు. ఆత్మ యొకవస్తువుకాదు; దానికి నవయవంబులు లేవు. అయినను 'నాదేహము' అన్నప్పుడు దేహలక్షణంబుల నాత్మయందారోపించుచున్నారు. కారణమేమందువా? అజ్ఞానమే కారణము. అది యనాదిసిద్ధమై యనిర్వాచనీయమైనదిగానున్నది. అట్లు దేహాదులాత్మయందారోపితంబు

లైనప్పుడు ఆయాత్మ తానుగర్తగా భోక్తగా నవయవంబులు గలదిగాభావించి వస్తువగుచున్నది. అధ్యాసకాలమందు ఆత్మ యట్టిదిగా భావించుటవలన దానియందు దేహారోపణంబునకు నవకాశము గలుగుచున్నది.

వత్సా ! నిక్కముువిచారించినచో ఆత్మయెన్నడును జ్ఞేయపదార్థము కానేరదు. ఆత్మజ్ఞానమన్నప్పుడు ఉపాధిలోఁ గూడిన యాత్మయొక్క జ్ఞానమని తాత్పర్యము. అట్టిస్థితిలోనే యదిసాధ్యమగును. ఆత్మ వస్తువుగాదంటిమి. వస్తువైనఁగాని ఆరోపణంబునకు నవకాశంబు లేదంటిమి. ఆత్మయందు దేహం బారోపితమగుచున్నదంటిమి. ఈవాక్యంబులు పరస్పరబాధకంబులై బుద్ధినిఁదప్పక దాటుమాటు చేయుచు విత్తుముందా చెట్టుముందా అను నానుడిని జ్ఞప్తికిఁ దెచ్చుచుండును. విత్తువలనఁ జెట్టుగలుగును. ఆచెట్టువలన మరల విత్తుగలుగును. ఆవిత్తు మరల చెట్టునకుఁ గారణమగును. ఇందు మొదటిది విత్తా లేకచెట్టా ? యన్నఁ జెప్పసాధ్యముగాదు. ఒక్కటి మాత్రము స్పష్టము. ఉపాధికారణంబున నాత్మకుఁ గర్తృత్వంబును గర్మమునకువస్తుత్వంబును రెండునొక్కసారిగాఁ గలుగుచున్నది.

అజ్ఞానంబున నధ్యాసముగలుగుచున్నదని చెప్పితిని. కాఁబట్టి యారోపింపఁ దలంచినపదార్థముయొక్క జ్ఞానము సత్యజ్ఞానంబుగా నుండవలసిన యవసరము లేదు. ఆపదార్థ సంబంధమైన జ్ఞానమేదో యేకవిధమైనదుండినఁ జాలును. అది మిథ్యాజ్ఞానమే యగుఁగాక. ఆత్మ కలదని మనయనుభవ

జ్ఞానమే తెలుపుచున్నది. అట్టిజ్ఞానమే లేనిచో అనఁగా ఆత్మ యున్నదనుజ్ఞానమే లేనిచో నీకుఁ దెలిసికొనుట యనునదే ప్రపంచంబునఁ గలుగదు. దేనిని మనముదెలిసికొనుచున్నను ఆత్మమూలకంబుననే తెలిసికొనుచున్నాము. ఆత్మలేకున్న ననుభవజ్ఞానమేయుండదు. ఆత్మయున్నదనుటకుఁ దార్కాణ మేమందువా? నన్నిప్రశ్నలడుగుచున్న నీవు ఉన్నావా? లేవా? ఉన్నానందువేని, యున్నదేదో యదే యాత్మయగును.

వత్సా! దేనియందారోపింపఁ దలంచితివో యది మన కంటియెదుట నుండవలదా? యంటివి. అట్టి యవసరము లేదు. ఏలయందువా? ఆకాశము కంటికిఁ గాన్పించుచున్నదా? అది కంటికిఁ గాన్పించునది గాకున్నను, దానియందు నీలత్వంబును వర్తులతనంబును ఆరోపించి యాకాశము నల్లగా వలయాకారంబుగానున్నదనుట లేదా?

వత్సా! ప్రపంచనానాత్వంబు ప్రత్యక్షసిద్ధమనియు, ప్రత్యక్షసిద్ధజ్ఞానంబును గాదని జెప్ప వలనుపడదనియుఁ జెప్పితివి. ప్రత్యక్షజ్ఞానమనఁగా నేమి? ఇంద్రియజ్ఞానమేగదా? ఇంద్రియజ్ఞానమే పరమజ్ఞానముగాదు. ఇంద్రియంబుల సామర్థ్యమెంతో యంతవఱకే వానినిఁ బ్రమాణంబుగా నంగీకరింపఁదగును గాని యంతకుమించిన విలువ వానికి నీయరాదు. పగటిపూట నక్షత్రంబులు గంటికిఁ గోచరింపవు. భూతదర్పణంబునఁ జూచినచోఁ బగటిపూటఁగూడ నక్షత్రంబులు గానవచ్చుచున్నవి. కాఁబట్టి నయనేంద్రియంబునే నమ్మి పగటిపూట నక్షత్రంబులు లేవనవచ్చునా?

అధ్యాసమునకుఁ బూర్వవస్తుజ్ఞానముండవలయుననుట నిజము. అయిన నొక్కటి మరవవలదు. అధ్యాస్యమానమగు నది యాపూర్వవస్తువుగాదు. తాదృశత్వం బారోపితమగు చున్నది. కాఁబట్టి యధ్యాసమునకు వాస్తవపదార్థం బక్క ఱలేదనియు దానిజ్ఞానము చాలుననియు గ్రహింపుము. ఆ యనుభవంబు భూతకాలికమైనదిగా నుండవలయును. దీనిం బట్టి యేమియేర్పడుచున్నది? ఆరోపింపఁబడుచున్నది మిథ్యయే గాని సత్యముగాదని యేర్పడుచున్నది. ఒక్కటిమాత్రము నిజము. అది దేనియందారోపితమగుచున్నదో యాయాధా రముమాత్రము సత్యమైనదిగా నుండవలయును. అధ్యాస్య మానవస్తుజ్ఞానము స్మృతిమాత్రముండినఁ జాలును. అ ధ్యాసకాలంబునఁ బూర్వదృష్టవస్తువు స్వస్వరూపంబున మన మ్రోల నిలుచుటలేదు. అవస్తువుయొక్క జ్ఞాపకముమాత్ర మే అనఁగా సంస్కారము మాత్రమే వ్యవహరించుచున్నది.

### మీమాంసకమతము.

స్వామీ ! మిథ్యమైనవస్తువు అనుభవయోగ్యపదార్థ ము గాదనియు, వివిధజ్ఞానమైనను సత్యజ్ఞానమేయగునుగాని మిథ్యాజ్ఞానము కానేరదనియు, మిథ్యాజ్ఞానమని సత్యజ్ఞానమని రెండుజ్ఞానంబులుండవనియు, ఎట్టిజ్ఞానమైనను మనలో నిశ్చయా త్మకబుద్ధిని గలిగించుచున్నదనియు, అట్టిదానిని గూర్చి శంకిం చుటయే గలుగదనియు, అట్లుగానిచో మనము నిరంతరశంకా వశులమై నిశ్చయంబునకు రాలేకయుందుమనియు, జ్ఞానమన్న ది తాత్కాలికమగుఁగాక సార్వకాలికమగుఁగాక తర్వాత

యసత్యమైననగుఁగాక యది యప్పుడు సత్యమే యగునని మీమాంసకులు వచింతురు. దీనింగూర్చి మీమతమేమి ?

గు :-అనుభవమాత్రంబుననే పదార్థము సత్యము గాఁజాలదనియు, అసత్యమైన పదార్థంబునుగూర్చిగూడ యనుభవజ్ఞానంబుగలుగుచున్నదనియుఁ బైన వివరించితిని. కావున మీమాంసకవాదము యుక్తికి నిలువదు.

ప్రభాకరమతము.

శి :-స్వామీ! అసత్యమనుదానికి నునికియే లేదనియు, సత్యముతోఁ బోల్చి సత్యముకానిదాని నసత్యమందురేగాని వేఱుగాదనియు, అసత్యపదార్థమెన్నఁడుగాని యనుభవజ్ఞానంబును గలిగించునట్టిది కానేరదనియు, కాఁబట్టి జగత్తు మిథ్యయైనచోఁ దత్సంబంధజ్ఞానంబెట్లు కలుగనేర్చుననియుఁ బ్రభాకరమతము వాదించుచున్నది. దీనిసంగతియేమి ?

గు :-ఎండమావును నిదర్శనంబుగా గ్రహించి ప్రభాకరసిద్ధాంతంబును విమర్శించుదము. సూర్యకిరణంబులు వాయుమండలంబులందు విలోమప్రతిబింబితంబులగుటంజేసి మరీచికగాన్పించుచున్నది. మరీచిక యన్నప్పుడు జలవ్యతిరిక్తవిషయమని వారి మతప్రకారమే సిద్ధించుచున్నది. కాఁబట్టి మనము మరీచికను జూచినప్పుడు అది జలముగాదని స్పష్టముగా ననుభవమగుచున్నది. అట్లున్నను మరీచికను గాంచినప్పుడు జలభావంబుదయించుచున్నదిగదా. మరీచికాజలంబు సత్యమనుటకుఁగాని యసత్యంబనుటకుగాని యవకాశములేదు. సత్యమనుటకు నది జలముగాదు ; అసత్యమనుటకు నందు జల

భావంబుదయించుచున్నది. అట్టిస్ఫురణమునకుఁ గారణమే మందురా ? అది యనిర్వచనీయము. అనఁగా మనబుద్ధికి గోచరించువిషయము గాదు.

పదార్థస్వభావము సత్యంబనియు అసత్యంబనియు రెండువిధంబులు. సత్యమైన పదార్థము స్వభావముచేతనే సత్యంబగును ; దాని సత్యత్వంబు నన్యంబులసాహాయ్యంబున సాధింపఁబనిలేదు. రెండవదాని సంగతి యట్టిదిగాదు. దాని నిరూపణంబునకు అన్యపదార్థసాహాయ్యం బత్యవసరంబగుచున్నది.

నిదర్శనము చెప్పెదవినుము. మరీచికావిషయంబున సూర్యకిరణంబులు సత్యంబు ; ఏలయందువా ? సూర్యకిరణంబులవలననే మరీచిక యేర్పడుచున్నది. అవి లేనిచో మరీచిక యే కలుగదు. ఆకిరణంబులు జలంబువలెఁ గానవచ్చుట మాత్రంబసత్యము. అట్లుకానవచ్చుట మఱియొక దానినిఁ బట్టి అనఁగా నంతకుమున్నే యెచ్చటనో జలంబును జూచుటవలనఁ గలిగిన సంస్కారంబును బట్టి యేర్పడుచున్నది. జలంబులను జూచియే యుండనిచో మరీచికనుజూచినప్పుడు జలభావమే యంకురింపనేరదు. మరీచిక యందట్లు జలభావంబు గలిగినను దగ్గఱకుఁ బోయి పరిశీలింపఁగా నందుజలమే లేదనియు, మనకు జలభావంబు గలుగుట సంస్కారజనితభ్రాంతియే యనియు నేర్పడుచున్నది. దీనింబట్టి సత్యములైన సూర్యకిరణంబు లెప్పుడును సత్యములుగానే యున్నవనియు, సత్యంబులైనవానిని నసత్యంబుగా అనఁగా జలంబుగా భావించినప్పుడట్లు భావితంబైన యసత్యరూపజలంబు తుదివఱకు నిలువక మార్పుచెందుచున్నదనియు నేర్పడుచున్నది.

అట్లే సత్యమైన బ్రహ్మమెప్పుడును సత్యముగానే యున్నది. దానికి నిట్టి మార్పులును గలుగవు. మాయయు మాయాకార్యఫలంబు నివిరెండును బ్రహ్మమందారోపితమై సత్యంబులుగా తలంపఁబడుచున్నను అవి సత్యంబులుగావు. ఏల యందువా ? వానికి నిమిషనిమిషంబునకు మార్పుగలుగుచున్నది. అట్లు మాఱుచుండునవి సత్యంబులు కానేరవు. అట్లున్నను అవి మనకు ననుభావితంబులేయగుచున్నవి. కాఁబట్టి జగత్తు సత్యంబునుగాదు ; అసత్యంబునుగాదు ; సత్యాసత్యంబునుగాదు. దాని నిట్టిదని చెప్ప సాధ్యముగాదు. కావున ననిర్వచనీయమనిరి.

### బౌద్ధమతము.

శి :-స్వామీ ! ఆత్మయనునదే లేదనియు, రజ్జువునుగాంచి సర్పమని తలంచునప్పుడు చూచువాని విజ్ఞానంబు సర్పరూపముదాల్చి యట్లు కాన్పించుచున్నదనియు బౌద్ధులు వచింతురు. ఇది యుక్తియుక్తమా ?

గు :-వత్సా ! విజ్ఞానంబే సర్పరూపంబునుదాల్చునేని, రజ్జువునుజూచి సర్పభ్రాంతి గలుఁగుచున్నప్పుడు 'ఇదిపాము' అనుభావమే కలుగనేరదనియు, విజ్ఞానమెప్పుడు సర్పరూపంబునుదాల్చెనో యప్పుడే 'నేను పామును' అనిగాని 'నాపాము' అనిగాని యేర్పడుననియు, దేనిపై నారోపింతురో దానికిని దేని నారోపింతురో దానికినిఁగల సహజభేదంబును గ్రహింపలేకపోవుటచేత నిట్టిప్రమాదంబు గలుగుచున్నదనియు ప్రభాకరమతము బౌద్ధమతంబు నిప్విషయంబున నిరసించుచున్నది.

నైయ్యాయికమతము.

శి :-స్వామీ ! నైయ్యాయికమతతత్త్వమేమి ?

గు :-వస్తుద్వయ తారతమ్య జ్ఞానాభావంబు కార్యంబునకుఁ బ్రేరేపింపఁ జాలదనియు, ముత్యపుచిప్పను జూచి వెండి అని భావించునప్పుడు, ఆవెండిని గ్రహించుదమను తలంపు వెనువెంటనే జనించుటయు, దానిని గ్రహింప యత్నించుటయు లోకసమాజంబులనియు, సుషుప్తిలో జ్ఞానంబుండదు గావుననే యెట్టి వ్యాపారంబును జరుగుట లేదనియు, సుషుప్తిలో జ్ఞానము లేకున్నను జ్ఞప్తియుండును గావున నదిచాలదాయన్న జ్ఞప్తి యెన్నడును వ్యాపారప్రేరకంబు గాదనియు, ముత్త్యపుచిప్పనుజూచి వెండిగాఁదలంచినప్పుడు వెండివిషయమైన జ్ఞప్తిమాత్రమే గాక వెండియనెడి సత్యజ్ఞానంబుగూడఁ గల్గుచున్నదనియు, గావున నొకదానియందు లేని లక్షణంబుల నున్నట్లు నమ్ముటయే యధ్యాసమనియు, అనఁగాఁ గంటికి గోచరించుపదార్థంబునకును ఎచ్చటనో యెన్నడో చూడఁబడిన సత్యమైన పదార్థంబునకును సంయోగంబుగలుగుటయే యధ్యాసమనియు, అధ్యాసకాలమందు రజితజ్ఞానంబుమాత్రమే వ్యవహరించుటగాదనియు, అది సత్యముఁగా రజితమేయనెడి నిశ్చయజ్ఞానంబు వ్యవహరించుచున్నదనియు, బూర్వదృష్టమై పరోక్షంబుననున్న వెండికినిఁ బ్రత్యక్షముగానున్న ముత్యపుచిప్పకును గలుగుచున్న యీసంయోగంబునే మాయయందురనియు, ఇట్టియనుభవంబంతయు సత్యమేగాని మిథ్యగాదనియు, ఇంద్రియంబులకును నింద్రియార్థంబులకును సంయోగమైనప్పుడే పదార్థజ్ఞానంబు గలుగుననియు, ముత్యపుచిప్పనుజూచి వెండిగాభావించు

నప్పుడు వెండి యప్పుడు సమీపంబున లేనికారణంబున నేత్రరజతసంయోగంబు లేదుగావున రజతజ్ఞానంబునకు నవకాశమే లేదనియు, అలౌకికజ్ఞానలక్షణసన్నికర్షణంబున నింద్రియంబులకు నింద్రియార్థంబులకు సంయోగంబు కలిగి జ్ఞానోత్పత్తి యగునందురేని ధూమంబును గాంచి యగ్ని నూహించునప్పుడు పైలక్షణంబేల యన్వయింపదనియు, అది యన్వయించునేని యనుమానముగూడఁ బ్రమాణమేయగుఁగదా యనియు, అనుమానప్రమాణంబును నిరసించుటేలయనియు, ముత్యపుచిప్పను జూచి వెండిగా భావించునప్పుడు అనిర్వచనీయమైనట్టియుఁ దాత్కాలికసత్యమైనట్టియుఁ రజితంబు సద్యఃకల్పితమైయింద్రియగోచరంబై రజితజ్ఞానంబును గలిగించుచున్నదనియు, ఆరజితంబెచ్చటనో యుండి యప్పుడట్లు కాన్పించుట గాదనియు, తత్కాలమందే యది మన యెదుటనే తోఁచుచున్నదనియు, అట్లు కాన్పించురజితంబు అభావము కాఁజాలదనియు, అభావమైనచో నింద్రియగోచరమే కాఁజాలదనియు, ముత్యపుచిప్పయందే రజతలక్షణంబు స్వతస్సిద్ధమై యున్నదందువేని రజితనిశ్చయజ్ఞానంబు గలిగిన తర్వాత స్వతస్సిద్ధలక్షణంబు నాశనమగుటకు వీలు లేదనియు, ప్రకృతవిషయంబున నది ముత్యపుచిప్పయని తెలిసిన తర్వాత వెండియను భావమునశించుచున్నది గావున ముత్యపుచిప్పయందు రజతలక్షణం బారోపితమేగాని స్వతస్సిద్ధంబు కానేరదనియు, ముత్యపుచిప్పయందలి రజతత్వంబునకు త్రికాలాబాధితమైన వాస్తవస్థితిలేకున్నను తాత్కాలికమాత్రసత్యత్వంబు గలదనియు, అట్టుకలుగుటకుఁ గారణంబనిర్వచనీయమనియు నైయ్యాయికులు తమమతమును స్థాపించుచుఁ ప్రభాకరమతంబును నిరసించుచున్నారు.

వేదాంతము—అన్యమతములు

శి :-స్వామీ ! ప్రపంచమందెన్నో మతములుగలవు. ప్రతిమతము తనమాటయే పరమ సత్యమనుచున్నది. ఈ మతముల ప్రతిపాదనంబు లొకదానికి నొకటి కేవల విరుద్ధము గానున్నది. దీనివలన బుద్ధి కలవరము చెందునేగాని సత్య మిదియని గ్రహింపఁజాలకున్నది. గత్యంతరమేమి ?

గు :-వత్సా ! సత్యమొక్కటే యగునుగాని పెక్కులు గావు. సత్యమునకు జాతిమతలింగభక్తివిశ్వాసాది భేదంబులు లేవు. ఏది సమస్తలోకంబునకు హితమో యదే సత్యమత ము. తక్కిన వెల్ల దానికి ఛాయామాత్రంబులో యంశ మాత్రంబులో యగును. మతకర్తలకు వారివారి యంతః కరణపరిణతింబట్టి సత్యము స్ఫురించును. వారికి స్ఫురించినంత వఱకు నవి సత్యమేయగును గాని పూర్ణసత్యముగానేరదు.

శి :-స్వామీ ! ఇది సత్యమని నిశ్చయించుటెట్లు ?

గు :-వత్సా ! ఏది పూర్ణమో యదే సత్యము. తన్ని ర్ణయంబునకు యుక్తియే పరమసాధనము. ఏది సర్వసత్వంబు లకు నిండే సుఖంబును హితంబును గూర్చునో యదే సత్యము. అదే పరమార్థము. ఈసత్యస్వరూపంబు సర్వపరిత్యాగంబునఁ గాని కలుగదు. ఐహికాముష్మికసుఖత్యాగముగూడఁ జాల దు. అభిమానత్యాగంబుచేత సర్వత్యాగమగును. అందులకు ధీరుఁడొక్కఁడే చాలునుగాని యెల్లరుఁజాలరు. దానంజేసి సత్యము ధీరునకు నొక్కనికే సమగ్రదర్శనమిచ్చుచున్నది. అతఁడే కృతకృత్యుఁడు. వానిమతమే సత్యమతము. అదే వేదాంతము.

శి :-స్వామీ; వేదాంతము కేవలాదర్శప్రాయమేగాని యనుష్ఠానయోగ్యముగాదనియు, అది మిథ్యామతమనియుఁ గొందఱభావము. భావములు మాత్రమే సత్యమనియు, బాహ్యపదార్థంబులెల్ల ద్వైతబుద్ధి ప్రతిపాదితంబులేగాని సత్యములు గావనియు మఱికొందఱందురు. భావములు సత్యములైనను వానికిఁగూడ జనన లయంబులు గలవనియు, ఆకారణంబున దుఃఖలక్షణంబులు భావంబులనంటియే యున్నవనియు నీకఁగొందఱందురు. సార్వలౌకికమైన యఖండమనంబే భగవంతుఁడని వేఱొకఱు అందురు. ఇందేది గ్రాహ్యము ?

గు :-వత్సా ! బ్రహ్మమొక్కటే సత్యము. సర్వము బ్రహ్మమే యగును. బ్రహ్మవ్యతిరిక్తమే గలుగదు.

శి :-జీవుని సంగతి యేమి ?

గు :-వత్సా ! బ్రహ్మవ్యతిరిక్తమైన యుపాధి నొకటి యూహించిరి. ఆయుపాధియందు బ్రహ్మాంశంబును జొన్పిరి. ఆజీవునకు జననమరణంబులు కల్పించిరి. జీవుఁడు తన స్వస్థానమైన బ్రహ్మమును జేరుటకు నుపాయములు చూపిరి. ఇవి యెల్లఁ బామరజనులు యజ్ఞానంబునుఁ దొలఁగించుటకైన యుపాయంబులేగాని వేఱుగాదు. సత్పదార్థస్వభావాజ్ఞానకారణంబున విపరీతజ్ఞానమొదవుచున్నది. తన్నివారణార్థము శాఖాచంద్రన్యాయము నాశ్రయించిరి.

శి :-స్వామీ ! వేదాంతసిద్ధాంతంబునకు మూలసూత్రంబులేవి ?

గు :-వత్సా ! 'అయమాత్మాబ్రహ్మ' 'సర్వంఖల్విదం బ్రహ్మ' అనునవే మూలసూత్రములు. మొదటిసూత్రము 'ఆత్మయే బ్రహ్మ'మనెను. రెండవసూత్రము 'ఇదం' అనఁగా దృశ్యము బ్రహ్మమనెను. మొదటిసూత్రములోని 'ఆత్మ' ను రెండవదానిలోని దృశ్యమును లుప్తముచేసినప్పుడు 'బ్రహ్మమాత్రమే శేషించును. అట్లుశేషించినది ఏకము. అద్వితీయము అని స్పష్టము. ఆత్మ బ్రహ్మము, దృశ్యమును బ్రహ్మమే యన్నప్పుడు బ్రహ్మభిన్నమైనది వేఱొండు లేదనుట యే గాక, ఆత్మయు దృశ్యమును బ్రహ్మమునకుఁ బర్యాయ పరములే యగుచున్నది. అనఁగా నొక్కపదార్థమే బ్రహ్మమనియు నాత్మయనియుఁ బ్రపంచమనియు మూఁడుపేర్లఁ బరఁగుచున్నది. ఇదే వేదాంతసిద్ధాంతము.

## అధ్యాసము—అవిద్య.

గు :-వత్సా ! అధ్యాసము కారణంబు అవిద్య కార్యమునగును అవిద్యయనఁగా విపరీతజ్ఞానంబనియు జ్ఞానాభావంబు గాదనియు గ్రహింపవలయును. ఈవిపరీతజ్ఞానంబు యథార్థజ్ఞానోదయంబుతో నశించుచున్నది. యథార్థజ్ఞానంబు యమనియమాదులచేతను శ్రవణమనన నిదిధ్యాసాదులచేతను గలుగుచున్నది.

అధ్యాసకారణంబున అధ్యస్తవస్తువుయొక్కగాని అధిష్ఠానవస్తువుయొక్కగాని సదసద్గుణంబులు బాధితంబులు గానేరవు. అవి యథాస్థితినే యుండును. అందువలన సత్యజ్ఞానంబున నశించినయవిద్యకు అనఁగా విపరీతజ్ఞానంబునకుఁ బున

రావృత్తి లేదు. అనఁగా నేవిషయమై మొదట విపరీతజ్ఞానంబు గలిగెనో యది సత్యజ్ఞానంబున నశించిన తర్వాత మరల నట్టి విపరీతజ్ఞానంబు గలుగదని తాత్పర్యము. ముత్యపుచిప్పనుజూచి నప్పుడు మొట్టమొదట వెండియనెడి విపరీతజ్ఞానంబు గలిగెను. నిజము తెలిసిన తర్వాత నది వెండిగాదని యేర్పడెను. వెండి గాదను నిశ్చయజ్ఞానంబొకసారి గలిగిన తర్వాత మరల నది వెండియే యను విపరీతజ్ఞానం బుండదని భావము. ఆరోపితం బులైన యనాత్మలక్షణంబులచేతఁ (వెండిలక్షణంబుచేత) అధిష్ఠా నమైన ఆత్మలక్షణంబుఁ (ముత్యపుచిప్పలక్షణంబు) బాధితమై యున్నచో నాత్మయందు అనాత్మలక్షణంబులలో గొన్నియైనను వ్యాపించును. అనాత్మలక్షణవ్యాప్తి కారణఁబున నవిద్య (విపరీతజ్ఞానము) తెఁసూచకమానదు. అవిద్య యొకసారి న శించిన తర్వాత మరలఁగాన్పించుటలేదు. అనగా నశించిన యవిద్యకుఁ బునరావృత్తిలేదు.

అవిద్యాకార్యమైన యీయధ్యాసమువలన జ్ఞానజ్ఞేయ జ్ఞాతృభేదంబులును వానింబట్టి కర్మజ్ఞానశాస్త్రభేదంబులును గ లుగుచున్నవి. అనుభవంబెల్లెడల దేహాత్మబుద్ధితో నారంభ మగుచున్నది. అట్టి బుద్ధి ప్రమాదఫలంబగుటచేతనేఁ దత్ప్ర మాదాపనోదనంబునకును (పోవుటకును) తదర్థప్రయత్నంబు నకును నవకాశముగలుగుచున్నది. అట్టి బుద్ధిప్రమాదమే లేనిచో శుద్ధాత్మ యెల్లప్పుడు జ్ఞానస్వరూపమై యుండును. జ్ఞాతయే గలుగఁడు. అనఁగాఁ దప్పున్నప్పుడే యదితప్పని యెఱుంగుటయు నెఱుంగువాఁడు నుండును. తప్పే లేనప్పు డట్టి వానికి నవకాశమే లేదు. జ్ఞాత (తప్పునెఱిసికొనువాఁడు)

లేనప్పుడు యథార్థజ్ఞానసాధనంబులగు శాస్త్రాదులకే యవకాశము లేదు.

సారాంశ మేమందువా ? శాస్త్రసాధనాదులెల్ల నవిద్యా నిరసనార్థంబులగును. అనఁగా శాస్త్రాదులు అజ్ఞానికేగాని జ్ఞానికొఱకుఁగావు. పరమసత్యంబెంచాక స్వానుభవసిద్ధము గాదో యందాక శాస్త్రములుపయోగించును.

కావున శాస్త్రజన్యజ్ఞానంబు నిక్కముగా జ్ఞానమే గాదు ; అవిద్యయే యగును. అట్లని శాస్త్రజన్యజ్ఞానంబు నిరుపయోగంబని తలంపవలదు. శాస్త్రాదులవలన నొకవిధమైన వివేకసంచలనంబు గలుగుచున్నది. తత్ఫలంబుగా మంచి చెడుగులు తెలియుచున్నవి. తత్ఫలముగా మంచిని గ్రహించుట చెడుగును నిరసించుట యగును.

ఈవివేకము మర్త్యులకే గాక చతుష్పాది సర్వప్రాణులకు సహజమేయనియు, అట్టివివేకసంపద కలుగుటంజేసియే గోవు దండధరునిజూచి పాఱిపోవుటయు గడ్డివేయువానిని జూచి డగ్గఱుటయున్నగునవి గలుగుచున్నవనియు నందువా ? ఆమాటనిజము. లౌకికవిషయంబులందు మర్త్యులకుఁ బశ్వాదులకు వివేకవ్యత్యాసముగానరాకున్నను అధ్యాత్మవిషయంబున వ్యత్యాసముగలదు. ఎట్లందువా ? పశ్వాదులకు దేహాత్మబుద్ధి తప్ప వేఱులేదు. శాస్త్రజ్ఞానజనితవివేకచలనంబున దేహము వేఱనియు నాత్మవేఱనియు మర్త్యులందొకభావంబుదయించుచున్నది. అట్టిభావంబుగలుగుటంజేసి దేహమిందేపడిపోయినను లోకాంతరంబులకుఁ దానుపోయి సుఖమనుభవించుభాగ్యంబు గలదను విశ్వాసంబుతో యజ్ఞాదులొనర్చుచున్నాఁడు.

ఇట్టివారిజ్ఞానంబు తావన్మాత్రమేయగును ; వేదాంత ప్రతిపాదితమైన యాత్మజ్ఞానము కానేరదు. యజ్ఞాదులొనర్చువారికి వేదాంతజ్ఞానంబు విషమించును. ఎట్లందువా? ఆత్మ కర్తగాని భోక్తగాని కాదని వేదాంతజ్ఞానము చెప్పుచున్నది. యజ్ఞముచేయువాఁడు ఆత్మయే కర్తయని భోక్తయని భావించి యాబుద్ధితో వానినొనర్చును. వేదాంతజ్ఞానంబట్టి బుద్ధికి భంగకరమగును.

కర్మకాండంబువలె జ్ఞానకాండంబుగూడ నజ్ఞానికేగాని జ్ఞానికిఁగాదు. ఏలయందువా? వేదాంతంబెల్ల ద్వంద్వభావనాశనార్థమై యున్నది. ద్వంద్వవాసనలు అజ్ఞానికేగాని జ్ఞానికిఁగావు. దానంజేసి జ్ఞానకాండం బజ్ఞానికే యనిచెప్పితిని.

కర్మఫలంబెల్ల స్వర్గాదిభోగసంబంధమై యాకారణంబున నవిద్యాప్రాపంచిక సంబంధమైనదిగా నున్నది. జ్ఞానఫలమన్ననో స్వరూపమును గ్రమక్రమంబుగా గ్రహింపఁజేసి తుదకు నజ్ఞానంబును నశింపఁజేయునదిగా నున్నది.

అజ్ఞానంబున జ్ఞానోత్పత్తియగుననుట వింతగాఁ దోఁప వచ్చును. చేతిలో ముల్లు గ్రుచ్చినప్పుడు వేఱొకముల్లుతో దానిని తీసివైచి పిదప రెంటిని బాఱవైతురు. అట్లే వ్యావహారికశాస్త్రజ్ఞానం బజ్ఞానమే యైనను సహజాజ్ఞానంబును బోగొట్టి దానితోడఁ దానుగూడఁ బోవుచున్నది. అనఁగాఁ బరమార్థజ్ఞానంబు గల్గిన తర్వాత జ్ఞానాజ్ఞానంబులు రెండును నశించును. అందాక శాస్త్రజ్ఞానంబు ప్రమాణమే యగును. (16 : 24.)

వత్సా ! అధ్యాసరహస్యంబును సవిమర్శనంబుగా వివరించితిని. దానిభావంబును సమాధానచిత్తంబుతో గ్రహించి తత్త్వార్థంబు నెఱింగి వర్తింపుము.

ఉద్ధవా ! నీయడిగినయర్థంబును గురుశిష్యసంవాదరూపంబునఁ దెలిపితిని. ఇంకను సందేహంబున్నయెడల నడుగు' మనెను.

ఉద్ధవుఁడు వానినివిని 'స్వామీ ! ముక్తిసంపాదనంబునకుఁ బెక్కుమార్గంబులను బ్రహ్మవేత్తలుపపాదించిరి. అన్ని మార్గంబులు ముఖ్యంబులా ? అందేదైన నొక్కటిచాలునా ? నీవు భక్తినే ప్రశంసించితివి. కావున నన్యంబులెల్ల ననపేక్షితంబులా ? ఏదియు నిశ్చయింపఁ జాలకున్నాను. ఏమార్గంబున మనస్సు ఇంద్రియవిముఖమై నీరసంబగునో దానిని నిశ్చయించి చెప్పు'మనెను. (3 : 2.)

నావుడు శ్రీకృష్ణభగవానుఁడు పర్యాలోచించి 'ఉద్ధవా ! ముక్తికి అనఁగా నపరోక్షానుభూతికి అనఁగా భగవత్సాక్షాత్కారంబునకు భక్తిమార్గమే యుత్తమోత్తమసాధనంబు; తక్కినవెల్ల నానుషంగికంబులగును. ఈసంగతిని నేనే తెలిపితిని. నాతెలిపిన విషయమే వేదము. అది ప్రళయకాలంబున నష్టమయ్యెను. మఱుకల్పారంభమందు దానిని బ్రహ్మకు మరల నుపదేశించితిని. బ్రహ్మవలన వానిపుత్త్రుఁడు మనువును, వానివలన మరీచ్యాదులును, వారివలనఁ దత్సంతానమైన దేవాసురసిద్ధచారణగంధర్వ గుహ్యక విద్యాధర కిన్నర కింపురుష యక్ష నాగ మర్త్యాదులును గ్రహించిరి.

ఇన్ని తెగలెట్లేర్పడెనందువా ? స్వభావభేదంబునుబట్టి చరాచరకోటియందుఁ దెగలేర్పడుచున్నవి. స్వభావమనఁగాఁ బ్రకృతియనియుఁ బ్రకృతి గుణత్రయరూపంబున వ్యవహరించుచున్నదనియు, గుణసమ్మేళనంబు అంశాంశ తారతమ్యంబుతోఁ జిత్రచిత్రంబుగా నగుచుండుననియు మున్నె తెలిపితిని. అట్టిసమ్మేళన తారతమ్యంబును బట్టి యుపాధులేర్పడుచున్నవి. ఉపాధినిబట్టి మనోవృత్తియు బుద్ధిశక్తియు నుండును.

ఉద్ధవా ! నావచించిన వేదంబునకు భిన్నార్థంబులు చెప్పఁదురనియు నట్లుచెప్పుటకుఁ గారణమేమనియు నందువా ? బుద్ధినిబట్టి యూహాలుండును. బుద్ధిభేదంబునకుఁ గారణంబులఁ జెప్పితిని. అందువలన వేదంబును వారివారిబుద్ధికిఁ దగినట్లూహింతురు. వారిభావంబులు శిష్యప్రశిష్యప్రచారంబున మఱికొంత కల్పనంబునకులోనై మార్పుఁజెందుచున్నవి.

ఉద్ధవా ! బుద్ధినిబట్టి రుచియుండును. ఏది యెవనికి రుచికరమో యదేపరమార్థముగా వానికిఁ దోఁచుచుండును. రుచిభేదంబునఁజేసి మార్గభేదంబులు తోఁచుచుండును. ఉదాహరణంబు వినుము. జీవికి ధర్మమే యుత్తమమార్గంబని మీమాంసకులు వచించిరి ; యశఃకామంబులే ప్రధానంబులని నైయ్యాయికులును వాత్స్యాయనాదులును బల్కిరి ; శమదమసత్యంబులు శ్రేష్ఠంబులని యోగులు చెప్పిరి ; యథాసంతుష్టసుఖమే పరమప్రాప్యంబని చార్వాకులు నుడివిరి ; యజ్ఞతపోదానంబులు ముఖ్యంబులని కర్మకులు బోధించిరి.

ఉద్ధవా ! వీరిట్లు పలువిధంబుల బోధించినను వారి బోధయందు సూక్ష్మార్థంబొకటిగలదు. అది యేదందువా ?

వారిమార్గంబులన్నియుఁ గర్మసాధ్యంబులగును. కర్మసాధ్య ఫలం బెంత యనర్ఘమైనదైనను అది యాద్యంతవంతమై నశ్వరమే యగును. నశ్వరసుఖంబు తాత్కాలికమగునేగాని శాశ్వతముగాదు. సుఖమును గోరునప్పుడు శాశ్వతసుఖమునే కోరరాదా ? అది విషయబుద్ధికి లభింపదు. ఏలయందువా? విషయబుద్ధి కర్మపరమగును. కావునఁ గర్మఫలంబున శాశ్వతసుఖంబు గలుగనేరదని తెలిపితిని.

ఉద్ధవా ! శాశ్వతసుఖంబును గోరువాఁడు విషయార్థంబుల ఉపేక్షించి మద్గతచిత్తుఁడు కావలయును. నాయందుఁ జిత్తంబును నిల్పినవానికి సార్వభౌమపదవియైనను దేవేంద్రపదవియైనను దుదకు బ్రహ్మపదవియైనను రుచింపదు. అతఁడు పునరావృత్తిరాహిత్యంబునుగూడఁ బెద్దచేయఁడు.

ఉద్ధవా ! మర్త్యు లేదో యొకయర్థంబును గోరి దానిని బడయుటకై నాకు భక్తిసేయుదురు. మద్గతచిత్తుఁడన్ననో యేదియును గోరఁడు ; అతఁడు కేవల ప్రేమార్థంబు నన్నుఁ బ్రేమించునుగాని ప్రతిఫలార్థంబుగాదు. ఇట్టిప్రేమనే పరాభక్తియందురు. అట్టిభక్తుఁడు బ్రహ్మకన్నను శివునికన్ననుఁ దుదకు లక్ష్మికన్నను నాకుఁ బ్రియతముండగును. నేను వానిని బ్రేమించునంతగా నన్నుఁగూడఁ బ్రేమించుకోనను. వాని పాదధూళి నాపయి సోకిన నెంతో పవిత్రుఁడనగుదునను తలంపుతో నెప్పుడు వానియడుగులవెంట నుందును. నిఖిల జీవవత్సలుండును, నిష్కాముఁడును మదనురక్తచిత్తుఁడునైన

యట్టిభక్తుఁడు అనుభవించునట్టి యానందంబిట్టిదని చెప్పుటకు మాటలు చాలవు. ఇంద్రియపరులైనను నాకుభక్తిచేసి యెంతో సుఖమందుదురనఁగా బరాభక్తుని సంగతి చెప్పనేల ?

ఉద్ధవా ! అగ్ని యింధనంబులనువలె నాభక్తి సర్వ పాపంబులను భస్మీకరించును. నేను స్థిరభక్తికి సాధ్యుండ నైనంత సులభంబుగా సాంఖ్యయోగధర్మాదులకు సాధ్యుండ గాను. నన్నుఁ జేరుటకు శ్రద్ధాపూర్వకభక్తికన్న సులభ మార్గంబు లేదు. నాయెడ నిష్ఠాభక్తి గలిగెనేని యుపాధి తననైసర్గిక మాలిన్యంబును బాసి యగ్నితప్తలోహంబువలె విశుద్ధమగును. అందువలననే మలినోపాధులుగల శ్వపాకులు గూడ నాకు భక్తిచేసి పరిశుద్ధులై కడతేరుచున్నారు.

ఉద్ధవా ! శుద్ధియనఁగాఁ జిత్తశుద్ధియని గ్రహింపుము. చిత్తశుద్ధి దయాసత్యధర్మానుష్ఠానంబులవలనఁ గలుగునని కొందఱును, విద్యాతపస్సులవలన సిద్ధించునని కొందఱును వచింతురు. చిత్తంబు నాభక్తివలన నెంతశీఘ్రముగా సులువుగాఁ బూర్ణముగా శుద్ధమగునో యంతశీఘ్రముగా సులువుగాఁ బూర్ణంబుగా నన్యంబులవలన శుద్ధంబు గానేరదు. నాభక్తిచేత శుద్ధమైన చిత్తంబునకును బరసాధనంబులచేత శుద్ధమైనచిత్తంబునకు నెంతో తారతమ్యంబు గలదు. నాభక్తిచేత శుద్ధమైన చిత్తంబు శిరీషకుసుమంబునకన్న మృదువై శరచ్చంద్రికకన్నఁ జల్లనై ప్రేమామృతంబును గురియుచుండును. అట్టి నా భక్తుని సిలువెల్ల నామాటచెప్పినంతనే హర్షపులకాంకితంబగును ; వానినయనంబులు నిర్భరానందాస్రువులను వర్షించును.

అన్యసాధనంబులచేత శుద్ధమైనచిత్తంబన్ననో యింకినకొలనువలె రసహీనమై యెండినమ్రానువలెఁ బల్లవపుష్పరహితమై యుండును.

ఉద్ధవా! వేదజ్ఞులకుమాత్రమే ముక్తి సాధ్యంబను భ్రాంతివలదు. విద్యావంతుఁడొండె విద్యాహీనుఁడొండె, భాగ్యవంతుఁడొండె బీదయొండె, పురుషుఁడొండె స్త్రీయొండె నెవరైనఁగాని నన్నాశ్రయించినవారికే ముక్తి సాధ్యమగును గాని వట్టితర్కంబులకు నాడంబరంబులకు వేషధారణంబులకు నదిసాధ్యముగాదు. నన్నుఁ గన్నుమొఱంగి గిల్లింతపనిగూడఁ జేయఁజాలరు. ఎవరేపని యేభావంబుతోఁ జేయుదురో యది యప్పుడే వారిహృదయస్థుఁడనైన నాకు స్పష్టమగుచుండును.

ఉద్ధవా! అర్జునునకుఁ గర్మయోగంబునే ప్రధానము చేసి యుపదేశించితిని. నీకు భక్తియోగంబును బ్రధానము చేసి యుపదేశించితిని. కారణమేమందువా? గురువు శిష్యుని మనస్తత్వంబునుబట్టి యుపదేశింపవలయును. వారికి బుద్ధిభేదంబును గలిగింపరాదు. (3-2.) అర్జునునియందు సత్త్వగుణంబునకన్న రజోగుణంబు ప్రధానంబుగానుండెను. ఆ కారణంబునఁ బార్థుఁడప్పుడప్పుడు స్వాతంత్ర్యంబును వహించి నాతో వాదప్రతివాదంబులు గావించుటయేగాక నాయుక్తుల నెల్ల లౌకికదృష్టితో నిరసించి 'నీవేమైనను జెప్పుదువుగాక; నేనెంతమాత్రము యుద్ధము చేయ'నని తిరుగబాటుచూపి శరచాపంబులను దిగవైచెను. ఈలక్షణంబులెల్ల రజోగుణ

ప్రవృద్ధిని జూపును. రజస్సు శమించి సత్త్వము వృద్ధిమైనఁగాని తత్త్వరహస్యంబు బుద్ధిస్థమై యనుష్ఠానంబునకు రాదు. నిష్కామకర్మంబువలనఁగాని రజస్సు నశింపదు. అందువలన వానికి జ్ఞానంబును బరమావధిగాఁజూపి, జ్ఞానసిద్ధికి భక్తిసాధనంబగునని తెలిపి, భక్తికుదురుటకుఁ జిత్తశుద్ధి గలుగవలయునని బోధించి, చిత్తశుద్ధికి నిష్కామకర్మ యోగమే పరమోపాయంబని వివరించి కర్మయోగంబును సరహస్యంబుగా నుపదేశించితిని.

ఉదవా ! నీతత్త్వము సత్త్వప్రధానంబుగా నున్నది. అందువలననే నాకు మొట్టమొదటనే దాసోహమ్మంటివి ; నా యుపదేశవాక్యంబులను గిమ్మనక తలఁదాల్చితివి. ఆకారణంబున నీతత్త్వంబునకు సరియైన భక్తిమార్గంబును నీకు బోధించితిని. భక్తి ముక్తికిఁ బరమసాధనంబగును.

ఉద్ధవుఁడు బదరికాశ్రమంబునకుఁ బోవుట.

ఉద్ధవుఁడట్లు శ్రీకృష్ణభగవానుని యుపదేశంబునెల్ల సమగ్రంబుగా నాలకించి యానందాశ్రువులు నించుచు వానికిఁ బునఃపునస్సాష్టాంగంబులొనర్చి కృతాంజలియై 'స్వామీ ! మీయనుగ్రహంబునఁ జేసి నామోహాంధకారంబు తొలంగెను. మీపాదారవిందంబులందు నాభక్తి యవిచ్ఛిన్నంబుగా నుండుమాడ్కి నాకుఁ గృపసేయు' మని ప్రార్థించెను. భగవానుఁడు చిఱునవ్వుదాల్చి 'ఉద్ధవా ! ఎవఁడు నన్ను నమ్మి నాకుఁ దనయాత్మ నర్పించునో వానికెన్నఁడును సేగలేదు. నీ

వీఁక బదరికాశ్రమంబునకుఁ జని యందు సమాహితచిత్తుండ వై నాయుపదిష్టార్థంబును స్వానుభవసిద్ధంబుగాఁ జేసికొను ము. మేలగు' ననెను. ఉద్ధవుఁడట్లే బదరికాశ్రమంబునకుఁ దరలెను.

ఉద్ధవుఁడు పోవుటఁ జూచి బలరాముఁడు నట్టిభావంబు నే సూచించెను. కృష్ణుఁడు వానినిఁ గూడ సాగనంపెను.

ఉపదేశఖండము సమాప్తము.





# శ్రీకృష్ణచరితము.

## నిర్యాణఖండము.

---

### ప్రభాసక్షేత్రము.

తెల్లవాఱినంతట యాదవులు పయనమై పడవలమీఁద సముద్రము దాఁటి ప్రభాసక్షేత్రము చేరి గంధపుష్పాక్షతల యాదోనాథునిఁ బూజించి వివిధహవ్యాద్య పదార్థంబులు నివేదించి సర్వశ్రేయఃప్రదంబులైన కార్యాంతరంబులనెల్ల భక్తితో నాచరించిరి. అంతలోన వారికిఁ గాలవశంబున నొయ్యన మద్యపానాపేక్ష యొదవెను. వారు హరిసన్నిధానంబును గూడ లెక్కసేయక యాసవంబులు గ్రోలి కైపెక్కి మైమఱచి యొండొరుఁ బరిహాసించుచు నున్మార్గవర్తనులైరి. కృతవర్మ సాత్యకితోఁ 'గిరీటిచంపిన సోమదత్తునిఁ దలనఱికిన నీదియు నొక మగతనమా ?' యని యెత్తిపొడిచెను. వారికిట్లు వాగ్వాదంబు ప్రారంభమై యదిమితిమీఱి కలహరూపంబుగా మాఱెను. సాత్యకి కృతవర్మను దలనఱికెను. ఆయకార్యంబునకు భోజాంధకవీరులు క్రోధమూర్ఛితులై సాగరతీరంబున నున్న ముయ్యంచుల తుంగము బెఱికి తలపడిరి. వృష్ణివీరులు వారిని ఢీకొనిరి. తండ్రియనక పుత్త్రుండను నన్నయనక

తమ్ముండు నొండొరులం దాకి గాలికిం దెగిన మ్రాకులవలెం గూలి నిరవశేషంబుగా మడసిరి.

కృష్ణుండదియెల్లం గన్నారం జూచుచు శాపప్రభావంబునకు నాశ్చర్యపడసాగెను. అంతలోన దారుకుండును బభ్రుండును వచ్చి వానికి వివరంబుం దెలిపి బలరాముండున్నయెడకుం బోవుదమనిరి. కృష్ణుండు వల్లెయని వారివెంటం జని యొకానొక వృక్షమూలంబుననున్న బలరామునిం జేరి 'దారుకా! నీవు చని పాండవులకు సంగతిం దెలిపి యర్జునుని దోడ్కొని రమ్మ'నెను. అతండు రథమెక్కి హుటాహుటిం బోయెను.

అంతం గృష్ణుండు బభ్రువుని జేరి యాదవస్త్రీబృందంబును బురికిం జేర్పుమనెను. అతండట్లేయని పోవుచుండంగా బోయయొకండు వానినేసెను. కృష్ణుండది గాంచి 'అన్నా! బలరామా! నేను పోయి యాదవస్త్రీలను బురిం జేర్చి వచ్చెద నీవిందేయుండు'మని చెప్పి వారిని దోడ్కొని ద్వారకకుం బోయి వసుదేవునకు సంగతియెల్లం దెలిపి 'నాండు కౌరవకులక్షయంబును నేండు సకల యాదవనాశంబును గంటిని. నిఖిలబాంధవహీనమైన యిందుండనొల్ల. నాయన్న తపోవ్రతియై కాననంబున నున్నవాండు. నేను గూడం దపంబుసేయం జనెద. ఎల్లవిషయంబులు మీరలయారసికొండు. మీపంపు సేయుటకై యర్జునుండు నేండో రేపో వచ్చు'నని పలికి వాని పాదంబులకు మ్రొక్కి తరలనుండెను. వసుదేవుండును యాదవస్త్రీలును గృష్ణుని జుట్టి యేడవసాగిరి. కృష్ణుండు వారి నూరార్చి బలరామునొద్దకుం బోయెను. కృష్ణుండు వచ్చులే

తడవుగా బలరాముఁడు యోగబలంబున నసువులు తొఱంగెను.

## శ్రీకృష్ణనిర్యాణము.

శ్రీ కృష్ణభగవానుఁడు తనయవతారకార్యంబు పరిసమాప్తంబగుటంచేసి తమత్యాగంబును సంకల్పించి యొకవటవృక్షంబునీడఁ గూర్చుండి కుడితొడపై నెడమపాదంబునుంచి యోగనిష్ఠఁబూనెను. అత్తఱి జరుఁడను బోయ వేటకై వచ్చియుండి యావటవృక్షచ్ఛాయనున్నది మృగంబని తలంచి యేసెను. ఆ బాణంబు కృష్ణుని యెడమకాలి వ్రేలు తగిలెను.

జరుఁడంతట సమీపించి తన ప్రమాదఃబును గ్రహించి కృష్ణుని పాదంబుల వ్రాలి రక్షింపుమని ప్రార్థించెను. కృష్ణుఁడు వానియెడఁ బ్రసాదవీక్షణంబును సారించి 'జరుఁడా! వెఱవవలదు. ఇందు నీదోసంబేమియు లేదు. కర్మఫలంబెంతటివారికిని దప్పదు. తొల్లి శ్రీరామావతారమందు నేను చెట్టుచాటుననుండి వాలినేసితిని. ఆవాలి నీవయిపుట్టితివి. నాటి నాకర్మఫలంబుగా నేఁడు నీవలన నిట్లు వ్రేటుపడితిని. మఱియు యాదవులకు బ్రాహ్మణశాపంబు గలదు. తత్ఫలంబుగా ముసలంబు యాదవకులహారణఃబుగాఁ బుట్టెను. దానిని బొడిచేసి నీటఁగలపిరి. ఆపొడి జొల్లయి మొలచెను. దానితో నొండొరు పోరి యాదవులు నశించిరి. ఆముసలంబునందు నొకతునుక శేషించెను. దానిని బాణమై చిరి. అది యిట్టికేలకు నీబాణాగ్రమయ్యెను. నేనుగూడ యాదవుఁడనేగావునను నాకుఁగూడ బ్రాహ్మణశాపంబు దప్పదు గావునను నీ బాణాగ్రము' నాకుఁ దగులుటయ్యెను. జరుఁడా! నీమనో

వ్యధ తీఱుటకై యీరహస్యంబు దెలిపితిని. స్వస్థచిత్తుండవై చనుము. శుభమగునని వానినిఁ బంపివైచెను.

* శ్రీరామావతారమందు రాముఁడేసిన వాలి యీ కృష్ణావతారమందు జరుఁడై జనించి యట్లుగావించె ననియుఁ గర్మఫలం బెంతటి వానికైనను దప్పదనుటకు నిదే నిదర్శనంబని యు వచింతురు.

అంతలోన సుమవృష్టి కురిసెను ; దేవదుందుభులు మొరసెను. శ్రీకృష్ణుఁడు సమాధియోగస్థితుఁడై నిర్వాణ మొందెను.

శ్రీకృష్ణుఁడిప్పటికి 5047 సంవత్సరంబుల క్రిందట బహుధాన్య సంవత్సర ఫాల్గుణ బహుళమందు 'అమావాస్య' గురువారంబున నిర్వాణమొందెను. ఆదినమున సూర్యగ్రహణంబు సంభవించెను. నాటికిఁ గృష్ణునకు 126 సంవత్సరంబుల యేడునెలల యెనిమిదిదినంబులు నిండెను. కృష్ణనిర్వాణంబుతోడ ద్వాపరం బంతమయ్యెను.

శ్రీకృష్ణభగవానుఁడు లీలామానుషవిగ్రహముతో 126 సంవత్సరములు 7 నెలలు 8½ దినములుండి కలియుగ ప్రారంభసంవత్సరమైన ప్రమాదిసంవత్సరంబునఁ జైత్రశుద్ధ ప్రతిపత్తునాఁడు మానుషవిగ్రహంబును బరిత్యజించెనని మఱియొక మతము. ఈపక్షమున శ్రీకృష్ణనిర్వాణదినంబున సూర్యోపరాగంబునకు నవకాశము లేదు.

ఈరెండుపక్షంబులకు నొక్కదినము మాత్రము భేదము గలదు.

శ్రీకృష్ణుఁడట్లు మర్త్యశరీరంబును బాసి వైకుంఠంబు చేరినంతనే బ్రహ్మాదులు వచ్చి యోగమోక్తుల వానిని బ్రస్తుతించిరి. ఆపురుషోత్తముఁడు వారియెడఁ గరుణార్ద్రవీక్షణంబు నెఱపి పితామహా ! దేవతులారా ! మీకోరికనుదీర్చి యానందబోధానిరంజనామేయంబైన నాపదంబును బరమమంగళానుభూతి నంగీకరించితిని. మీరెల్లరు సుకృతులరైతిరి. సుఖముండుమనెను. అజాదులెల్లరు వానికి మ్రొక్కి సెలవొంది తమతావులకుఁ జనిరి.

నిర్యాణఖండము సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.

నమస్తుభ్యం భగవతే నిర్గుణాయ గుణాత్మనే,
కేవలాయాద్వితీయాయ గురవే బ్రహ్మరూపిణే.

నమస్త్రిమూర్తయే తుభ్యం ప్రాక్సృష్టేః కేవలాత్మనే.
గుణత్రయ విభాగాయ పశ్చాద్భేదముపేయుషే.

అసతో మా సద్గమయ,
తమసో మా జ్యోతిర్గమయ,
మృత్యోర్మా అమృతం గమయ.
ఓం తత్సత్.

